

# కాలమానమ్

ఆంధ్రభూమి జీ వి యస్ కాలమ్

ఉదయం సాహితీ స్పర్శ

మరికొన్ని వ్యాసాలు

డాక్టర్ జి.వి.సుబ్రహ్మణ్యం

# కొలమానమ్

## ఆంధ్రభూమి జీవియస్‌కాలమ్
## ఉదయం సాహితీస్పర్శ
## మరికొన్ని వ్యాసాలు

**ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం**
తెలుగు సాహితి, హైదరాబాదు విశ్వవిద్యాలయం

ఎడిటర్
**ఆచార్య ఎన్. గోపి**
అధ్యక్షులు, తెలుగు శాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయం




జీవియస్ షష్టిపూర్తి ప్రచురణ
**యువభారతి**
సాహితీ సాంస్కృతిక సంస్థ,
తిలక్‌రోడ్, హైదరాబాదు–500 001.

KOLAMANAM- An anthology of literary essays Published in 'GVS Column' of Andhra Bhoomi, 'Sahiti Sparsa' of Udayam and other essays, written by Prof. G.V. Subrahmanyam; Edited by Prof. N Gopi; Published by YUVABHARATHI, Hyderabad - 1 Under Self Financed Scheme.



First Edition : August 1995

Copies : 1000.

**Price : Rs. 100**

Cover Design : Sri Seela Verraju

Copies available at :

1. Yuva Bharathi, Literary & Cultural Organisation,
   Andhra Saraswatha Parishath Buildings, Tilk Road,
   Hyderabad - 500 001.
2. Convener, Prof. G.V. Subrahmanyam Shashtipurthi
   Publications, Srivani - 1.8.702/105, Nallakunta,
   Hyderabad - 500 044.
   Phone : 633275.
3. Visalandhra Publishing House,
   4.1.435, Vigyana Bhavan, Bank Street,
   Hyderabad - 500 001. and other Branches.
4. Navodaya Book Sellers,
   In front of Arya Samaj, Kothi, Hyderabad.

Printed at :

**Padmavathi Art Printers,**
1.1.517/B/1, New Bakaram, Gandhinagar,
Hyderabad - 500 380. Phone : 7611413.

Cover Page Printed at :

**Vipla Printers Private Ltd.,**
Near Shankar Math, Nallakunta,
Hyderabad - 500 044. Phones : 636242; 667476.

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత

పద్మభూషణ్

ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి

స్నేహచిహ్నంగా

అంకితం

# చంద్రునికో నూలుపోగు

దినకర కిరణాలు నీటిబిందువులమీద వాలి
దినమంతా సప్తవర్ణాల పింఛాలు విప్పి
దివ్యనాట్యం చేస్తున్న సౌందర్యం దర్శించినప్పుడు—

ఎత్తిపోతలుగా జలధారలు నేలకు దూకుతూవుంటే
మత్తుగా వినపడే నీటితుంపరల మువ్వలచప్పుడుకు
కొత్త నురుగుల చిత్తరి చూపుల ఒయ్యారాలు కాంచినప్పుడు—

పదివేల రకాల గులాబీలు ప్రదర్శనశాలలో కూడి
ఎదమెచ్చే రసికుల కోసం దరహాసాలు మెరిపిస్తూంటే
పదనైన పరిమళాలతో పారవశ్యం చెందే తరుణీలోకాన్ని
తనివిదీర చూచినప్పుడూ -

అలలనే అంత్యప్రాసలతో జీవనగీతిని పాడుతున్న పాథోధి
సలసల కాగే అంతరాత్మకు చల్లదనం కూర్చే ప్రయోగాలతో
చెలియలికట్టను మీటే ఆటుపోటుల ప్రతీక శ్రుతులను
చెవులారా విన్నప్పుడూ—

మానవ మూల్యాల మహనీయ వికాసంలో
మానవత పాడే ప్రహ్లాదగీతాన్ని విశ్వంభర ఆలపిస్తూంటే
వీణపై దానిని వాయించే వాణీ వైదగ్ధ్యాన్ని భావించినప్పుడూ -

నినారె కవిత్వం చిత్రంగా మనసులో మెదలుతుంది
మినార్ల మీదినుంచి పావురాలు ఎగురుతున్న చప్పుడు వినపడుతుంది
ఏనాటిదో మధురస్మృతి గుండె గొంతుక గానం చేస్తున్నట్లనిపిస్తుంది—

*　　*　　*

సాలార్‌జంగ్ హాలులో విన్నాను మొదటిసారి ఓ సామగానం
'సాగుమా ఓ నీల మేఘమా' అనే యువకవి కావ్యగానం
మేఘసందేశం చదువుతున్న నాకది అభినవ దూతకావ్యం.

ఆనాడు నా హృదయాంబరంలో తొలకరించిన నీలమేఘం
ఈనాటికీ మెఱుపులు మెరుస్తూ మంద్రగర్జనలు సాగిస్తోంది.
విశిష్టాద్వైతికి నీలమేఘం శ్రీకృష్ణతత్త్వం
అద్వైతిని, నాకది నారాయణ మంత్రం.

ఆంధ్రాభ్యుదయోత్సవాల అభ్యుదయవాణిని
ప్రయోగంగా పలికించి, సంప్రదాయంగా నాకందించి
'జీవీ!' అని ఆప్యాయంగా సోదరునిలా మన్నించిన
ఆనాటి మమకారాలు నా సాహిత్య జీవితానికి మధురమైన శ్రీకారాలు!

* * *

తెలంగాణా కవికోకిలగా నీ కంఠం గేయాలు వినిపించినప్పుడు
మహాంధ్ర నిర్మాణంలో నీ కలం గళం జనావళిని కదిలించినప్పుడు
నాగార్జునసాగరం నీవొక్కడవే నిర్మించినట్లు మాకనిపించినప్పుడు
కృష్ణశాస్త్రి నిగలో పూవులా నీ ఉంగరాలజుట్టు
మరోకవిని ముగ్ధంగా రూపొందించినప్పుడు
దాశరథి తమ్మునిలా నీ కంఠం మరో నయాగరాగా గర్జించినప్పుడు
రాస్తే గేయకావ్యం సినారె రాయాలి
పలికితే వచనకవిత సినారె పలకాలి
అని జనమంతా నిన్ను ఎగబడి పిలిచినప్పుడు—
నీ కవితలో ఈతలుకొట్టాం మేమంతా కొన్నాళ్ళు
నీ అంత్యప్రాసలు మా మాటలకు అన్నప్రాశనగా వాడుకున్నాం
కొన్నాళ్లు

పాటగా, మాటగా సినారె నలుదిక్కులా ముసురుకున్నరోజుల్లో
నీటుగా ఆ వానలో తడుస్తూ చేసిన యాత్రలు తలచుకుంటే
నేటికీ ఆ చల్లదనం గుండెమీద చెమరుస్తుంది
కోటివీణలు మీటిన కోలాహలం నాలో రవళిస్తుంది.

* * *

సినారేను మొదట చిచ్చంద్రీ అనుకున్నాం
సినారేను ఆపైన జలపాతం అనుకున్నాం
సినారేను ఆ తరువాత మధురగీతం అనుకున్నాం

సినారేను ఆ పిమ్మట పరిశోధకు డనుకున్నాం
సినారేను అటుపిదప ప్రయోగశాలి అనుకున్నాం
సినారేను ఎప్పుడూ ఒక మహావక్తగా వింటున్నాం.

ఎక్కడైనా క్రీడోత్సవాలు జరుగుతూ ఉంటే
మొక్కవోకుండా వెలిగే శిఖరజ్యోతిలా
ఒక్కడూ ఈ అర్ధ శతాబ్ది కవితారంగంలో
పెక్కు ప్రయోగాల జ్వాలాతోరణంగా మండుతున్నాడ
ఒక్కయేడు కూడా బిక్కవోయిన జాడలు లేవు
ఎక్కిన ఆ జ్ఞానపీఠం సినారె చైతన్యరథం.

*　　　*　　　*

ఆకాశవాణి రాత్రింబవళ్లు సినారె పాటలు వినిపిస్తుంది
సాహిత్యజగత్తు ప్రతిరోజూ సినారె ఆశీస్సులు అర్థిస్తుంది
కళారంగం ప్రతి పండుగా సినారెతో కలిసి చేసుకుంటుంది
మట్టిని సైతం మాటలతో మాణిక్యం చేసే మనిషి
వచనాన్ని సైతం పాటగా పలికించే మనస్వి
ఆబాలగోపాలం ఆయనంటే అదో అహ్లాదం.

ఏ శాఖవారైనా సినారె వసంత రాగాన్ని కోరతారు
ఏ పక్షంవారైనా సినారె వెన్నెలపదాన్ని పాడించుకుంటారు
ఏ ఇజంవారైనా సినారె ప్రపంచపదిని పలికించుకుంటారు
ఏ తరంవారైనా సినారె గజళ్ళను వినిపించుకుంటారు
ఈనాటి సాహితీ జగత్తులో సినారె పూసల్లో దారం
ఈరోజు కవితాసదస్సులో సినారె కలం వారంవారం.

సినారె వ్యక్తిత్వం ఒక పరిపూర్ణ వర్తులం
లలితకళ లన్నింటిలో కళాప్రపూర్ణం
వచనకవితా ప్రయోగంలో నవ్యపారిజాతం
రూపక మర్యాదలో మరో మధుర ప్రస్థానం
ఇప్పుడు తెలుగులో నడుస్తున్న జ్ఞానపీఠం
ఈ తరానికి సినారె ఒక గురుపీఠం!

*　　　*　　　*

నా బాటలో నేను వేరుగా సాగిపోయినా
నా బ్రతుకులో నిగారె ఒక స్నేహచిహ్నం.
ఆయన షష్టిపూర్తికే ఇద్దామనుకున్నాను ఒక కృతి
అచ్చమైన మా నెయ్యానికి అక్షరాకృతి.
నాడిస్తే నలుగురిలో ఒకణ్ణైపోయేవాణ్ణి
నేడిస్తున్నాను నన్ను ప్రత్యేకంగా గుర్తుంచుకోవాలని.
నా షష్టిపూర్తికి సమర్పిస్తున్న ఈ 'కాలమానం'
మా స్నేహప్రవృత్తికి తీపిగుర్తుగా బహుమానం!

* * *

'కాలమానం' ఆధునిక పత్రికారచనలో ఒక ప్రయోగం
'కాలమ్' రాసే ఒక కలం సాగించిన జీవనయానం
సమకాలీన సాహిత్య జీవితాన్ని మథించిన వ్యాసఖాండం
దాదాపు అరవై మంది రచయితలను సన్మానించిన కళాక్షేత్రం!

జీవియస్ రచనల్లో జీవిస్తున్న సాహితీ స్పృహ ఉంటుంది
జీవియస్ మాటల్లో మంచిని అందించే మనస్విత ఉంటుంది
కొత్తది చెప్పకుండా రాయటం జీవియస్‌కు చేతకాదు
అలవోకగా రాసినా ఆలోచింపచేయటం జీవియస్ నైజం.
దర్శించటం, విమర్శించటం, వివేచించటం, పరిశీలించటం
తాదాత్మ్యంతో ప్రపంచించటం జీవియస్ వ్యాసజీవితం!

* * *

ఈ కాలమానానికి మా స్నేహమే ప్రమాణం
ఈ కృతిసమర్పణకు సౌహార్దమే కారణం
'అన్నా' అని ఆదరంగా పిలుచుకొనే సినారెకు
చిన్ని కానుకగా ఇచ్చుకొనే వ్యాస ప్రసూన మంజరి—

—జీ. వి. సుబ్రహ్మణ్యం

జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ్ కార్యాలయం : 242082
డా॥ సి. నారాయణరెడ్డి గృహం : 248451
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్. కళాభవన్, హైదరాబాద్-500 004.
రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక,
భాషా వ్యవహారాల సలహాదారు

18.8.95

# అభివాదమ్

పత్రికల్లో "కాలమ్" శీర్షికతో రాసే సగటు రచనలు తాత్కాలిక సేవనంతోనే ముగిసిపోతాయి. ప్రగాఢ ప్రతిభులు రాస్తే మాత్రం అవి "కాలమ్" చట్రంలో ఉంటూనే సార్వకాలిక సముద్దీప్తితో సాగిపోతాయి. కాలాన్ని జయించి నిలిచే అలాంటి రచనలు చేసిన లిటరరీ జీనియస్ డా॥ జీ.వి.యస్.

"వ్యాసం రాస్తే వేగుచుక్కలా నిలవాలనీ
విమర్శచేస్తే నవ్యాలోకం నిండాలనీ"

విశ్వసించి, ఆత్మప్రత్యయాలను విమర్శన వ్యాసకోశాలద్వారా ఉచ్ఛ్వసించిన వివేచనశీలి డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం.

"జీవియస్ కాలమ్" శీర్షికన ధారావాహికంగా "ఆంధ్రభూమి"లో వెలువడిన వ్యాసాలతోపాటు మరికొన్ని ఇతర వ్యాసాలను సంపుటీకరించి ఈ "కాలమానమ్" రూపంలో ప్రచురిస్తున్నారు సుబ్రహ్మణ్యంగారు. అది నాకు అంకితమన్నారు. ఈ గ్రంథంలోని మొదటివ్యాసం "మూడుతరాలు"లో "స్వాతిముత్యం" చిత్రంలోని "వటపత్రశాయికి వరహాలలాలి" అనే గీతాన్ని ప్రస్తావించడంలో నా నామాంకనముంది. నాకు అంతకంటే వేరే అంకిత మేముంది? అయినా సుబ్రహ్మణ్యం గారి సుహృత్ ప్రేరణను ఎలా కాదనగలను? అభిముదిత చిత్తంతో అందుకుంటున్నాను. ఉభయుల నిరంతర సాహితీ కాలయానానికి, సమకాలీన భావ ప్రమాణాభిజ్ఞానానికి కాలమానంగా; కృతజ్ఞతాసంధానంగా.

— సి.నా.రె.




# ముప్పైరెండేళ్ళ యువభారతి

"చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చొనటంకంటే ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది'' అనే లక్ష్యంతో యువభారతి రాజకీయాల స్వార్థకాలుష్యాలకు అతీతంగా ఉండగలిగే విశ్వజనీనమైన సాహితీస్పృహను సమాజంలో జాగృతంచేసి, తెలుగు సాహిత్యాభిమానాన్ని ఇంటింటా జ్యోతిలా వెలిగించాలనే ప్రయత్నంలో ముప్పైరెండేళ్ళుగా (అంటే 1963 విజయదశమి నుండి) ఉద్యమాన్ని సాగిస్తోంది. ఆలోచనలకు అక్షరాకృతులు యువభారతి ప్రచురణలు!

ప్రాచీన సాహిత్యానికి సంబంధించిన మహాకవుల రచనలనేకాక, ఆధునిక సాహిత్య నిర్మాతలైన రచయితలను, కవులను, వారి రచనలను గురించి సామాన్య ప్రజానీకానికి అందుబాటులో ఉండేటట్లు సమీక్షాత్మక విమర్శ ప్రచురణలను వెలువరించడంలో యువభారతి గణనీయమైన సేవ చేసింది; చేస్తున్నది.

యువభారతి సాహితీ ప్రస్థానంతో ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారికి పాతికేళ్ళకుపైగా పరిచయముంది. దానికోసం అహోరాత్రాలు కృషి చేసిన డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారు, చేస్తున్న ఆచార్య వంగపల్లి విశ్వనాథంగారితో కలిసి పనిచేసిన ప్రముఖులలో ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యంగారొకరు. 1972 నుండి యువభారతి ప్రచురణలకు ప్రధాన సంపాదకులుగా, 1988 నుండి యువభారతి అధ్యక్షులుగా ఈ సంస్థకు వారు సేవలందిస్తున్నారు. యువభారతి వారి గ్రంథాలను ఇప్పటికి ఆరింటిని ప్రచురించింది. వాటిల్లో 'ఆంధ్ర సాహిత్య విమర్శ: ఆంగ్ల ప్రభావం'అనే గ్రంథానికి 1986 లో కేంద్ర సాహిత్య అకాదమి పురస్కారం కూడా లభించింది. 'అభినవలోచనం', 'అక్షరాల ఆలోచనలు', 'శ్రీనాథుని కవితావైభవం', 'తిరుపతి వేంకటకవుల కవితావైభవం', 'కలంతో కాలయ్' తెలుగువారి మన్ననల నందుకున్నాయి.

విమర్శ వ్యాసాలతోపాటు పత్రికలలో 'కాలమ్' రచనలను కూడా ఆచార్య సుబ్రహ్మణ్యంగారు సమర్థవంతంగా నిర్వహించి, సాహితీలోకం నుండి ప్రశంసల నందుకున్నారు. ఆంధ్రప్రభలో 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు', 'తెలుగులో వెలుగు', ఉదయంలో 'సాహితీస్పర్శ', ఆంధ్రభూమిలో 'జీవియస్‌కాలమ్' ధారావాహిక 'కాలమ్' రచనలుగా బాగా ప్రజాదరణ పొందాయి. జీవియస్ కాలమ్‌ను, సాహితీస్పర్శను, మరికొన్ని సాహిత్యవ్యాసాలను కలిపి 'కాలమానం'గా ప్రచురించటం, యువభారతి శ్రేయోభిలాషులు, గౌరవ సభ్యులు ఆచార్య సి. నారాయణరెడ్డిగారికి అంకితమివ్వటం, ఈ గ్రంథాన్ని కూడా యువభారతి ప్రచురించే అవకాశం అందించటం ఆనందదాయకమైన అంశం. త్వరలో షష్టిపూర్తి జరుపుకోబోతున్న జీవియస్‌కు యువభారతి శుభాకాంక్షలు!

జీవియస్‌గారిని చూడంగానే వారు యువభారతిని గురించి చెప్పిన పద్యం మా అందరికీ జ్ఞాపకం వస్తుంది.

''చిమ్మచీకట్లను చీదరించుటకంటె
        చిరుదివ్వె వెలిగించు శిల్పమెఱిగి;
సామాన్య జనులలో సాహిత్య చైతన్య
        సందీప్తి పోషించు సభలు తీర్చి
కమనీయ కావ్యాల కవితా కళాశిల్ప
        వైభవాల్ వివరించు ప్రభలు చిమ్మి
మానవ మూల్యాల మహనీయ సంస్కృతి
        నిర్మాణ శిక్షణ నీతి నెఱపి
భారతీపాదమంజీర భవ్యరవము
తెలుగువారల గుండెలో వెలుగునట్లు
వెలుగు యువభారతీ సంస్థ జీవితమ్ము
ఆంధ్రజనతకు నవతకు అంకితమ్ము
ఆంధ్రజనతకు యువతకు అంకితమ్ము" - జీవియస్.

డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్యులు
ఉపాధ్యక్షులు, యువభారతి.

# సజీవ సాహిత్య విజ్ఞాన సర్వస్వం జీ. వి. యస్.

—ఆచార్య చేకూరి రామారావు

ఆచార్య గూడ వేంకట సుబ్రహ్మణ్యం గారిని యూనివర్సిటీల క్లుప్తీకరణ పద్ధతిలో జి. వి. ఎస్. అంటుంటారు. ఆయన తాను ఆంధ్రభూమిలో రాసిన కాలమ్‌ని జీ. వి. యస్. కాలమ్ అని పిల్చుకున్నారు. పండితుడిలా లోకాన్ని అప్పుడప్పుడు భయపెడుతుంటారు గాని, ఆత్మీయతను పంచి ఇయ్యగల ఆర్ద్ర హృదయుడిగా మావంటి మిత్రబృందానికి తెలుసు.

మా మైత్రి ఈనాటిది కాదు. నలభయ్యేళ్ళ పైగా సుదీర్ఘకాల విస్తృతి ఉంది. మేమిద్దరమూ ఇప్పటికీ గుర్తుంచుకునేది నూనూగు మీసాల నూత్న యౌవనపు రోజుల్లో మా ముగ్ధ విద్యార్థి రూపాల్నే. పదేపదే తలచుకునేది ఆనాటి ఆర్ద్ర హృదయాల్నే. ఆలనాటి నిజాం కాలేజి చెట్లకింద ఆధునిక కవుల, మరీ ముఖ్యంగా నాయని సుబ్బారావుగారి పద్యాలను నోటికి చెప్తూ (తరచుగా క్లాసులు ఎగగొడుతూ) మిత్రులతో గోష్ఠి జరిపే చే.రా. రూపమే జీ.వి యస్. గారి మనసులో ముద్రితమైంది. అప్పటికే జీ వి.యస్. గారు పండితుడనుకుంటా. కనీసం అట్లా కనిపించేవారు. అసలెప్పుడూ అట్లాగే కనిపిస్తారు. అప్పుడాయన కాలేజి ఆంధ్ర సంఘానికి సాంస్కృతిక కార్యదర్శిగా పోటీ చేశారు. తానే అభ్యర్థి, తానే కార్యకర్త. తన అభ్యర్థిత్వాన్ని బలపరచమని కోరుతూ ఒక గీత పద్యం రాసిన పోస్టర్లు తానే చెట్లకు, గోడలకు అంటిస్తూ కనిపించేవారు. అప్పట్నుంచీ ఆయన శ్రమ జీవి. శ్రామిక జనాభ్యుదయ సిద్ధాంతాలు వల్లిస్తూ, ప్రచారం చేస్తూ మేం కొందరం సుఖలాలసతతో ఉండేవాళ్ళం.

ఆయన కష్టపడి చదివారు- క్లాసు పుస్తకాలు, కొత్తవీ, పాతవీ, అన్నీ. ఆ కాలేజీ రోజుల్లోనే ఆయనకు మంచి వక్తగా పేరుండేది ఆ స్ఫుటమైన ఉచ్చా

రణ, భావానికి తగిన అంగిక వాచిక సమన్వయంతో ఆయన ఉపన్యాసాలు ఆనాటి విద్యార్థులను ఆకట్టుకొనేవి. అప్పటి ఆంధ్రాభ్యుదయోత్సవాలలో సి. నా. రె.గారి తర్వాత వీరి ప్రకటనలకే గిలాకీ ఉండేది. స్పష్ట ఉచ్చారణతో, ఝటితి స్ఫూర్తితో ఆయన చేసే గచ్ఛద్వ్యాఖ్యలు శ్రోతలను అలరించేవి.

జీ.వి.యస్. ఉస్మానియాలోనే ఎం.ఏ; పిఎచ్ డి క్రమబద్ధంగా చేశారు. నేను కొద్దికాలానికే ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. తెలుగు చేసి భాషా శాస్త్రం చదవటానికి విదేశాలకు ఎగిరిపోయాను. అప్పటినుంచీ మా దారులు వేరయ్యాయి. ఆయన కొన్నాళ్ళు రస సిద్ధాంతంలో మునకలు వేశారు. నేను కొన్నాళ్ళు భాషాశాస్త్ర ప్రవాహంలో పరుగులు తీశాను. ఇప్పటికీ ఆ పనులు ఇద్దరమూ చేస్తుంటాం కాని, అంతటితో ఆగక మా విజ్ఞాన పరిధులను, విద్యా శోధన రంగాలను విస్తరించుకొంటూనే ఉన్నాం.

జీ.వి యస్. అంటే నిరాడంబరతకు, క్రమశిక్షణకు మారు పేరు. చదివినా, రాసినా, తిరిగినా అన్నీ క్రమబద్ధంగా చేస్తారు. ఆయన్ను ఏ సభకైనా పిల్చిన వారు తన్ను తీసుకుపోవటానికి వాహనంతో రావటం ఆలస్యమైతే, వారికంటే ముందు తాను సభకు హాజరవుతారు. తనవికాని, యువభారతి వారివికాని పుస్తకాలు అచ్చు అవుతుంటే సైకిలు మీద వెళ్ళి అయినా ప్రూఫులు చూసిరావటానికి సంకోచించరు.

సాహిత్యంలోనూ, జీవితంలోనూ ఆయన సాధించిందంతా స్వయంకృషితోనూ, క్రమశిక్షణతోనూ సాధించారు. ఆయన సాధించింది చాలా ఉంది. అంచనాలు కట్టటంకూడ కష్టం. చిన్నప్పుడు వక్తృత్వపు పోటీల్లో బహుమతులు, పెద్దయ్యాక గ్రంథ రచన పోటీల్లో బహుమతులు, సాహిత్య పురస్కారాలు చాలానే వచ్చాయి. 'పురస్కారాలు నా జాతకాన్ని మార్చాయి' అని కూడా ఆయనే చెప్పుకున్నారు. అందుకే పురస్కారాలంటే ఆయనకు ఎంతో గౌరవం. కాని, వాటితో ప్రమేయం లేకుండానే ఆయన కృషి గుర్తింపు పొందింది. సాహిత్య విమర్శ ఎంత విస్తారంగా చేశారో అంత లోతైన పరిశ్రమ చేశారు. ఆయన ప్రచురించిన పుస్తకాలను మించిన శక్తి ఆయనకుంది. ఆ శక్తిని సద్వినియోగం చేసుకునే క్రమశిక్షణ ఉంది. ఆయన విద్యాబోధ ద్వారానే కాదు, సాహిత్య పరిశ్రమ ద్వారా కూడా ఆయన తన విద్యార్థులకు ఆదర్శగురువు.

జీ. వి. యస్. బాల్యం గురించి నాకంత తెలీదుగాని, ఆయన పుట్టుక నుంచే విశ్లేషకుడని నా ఊహ. A born analyst.

ఈ ప్రపంచం అవిచ్ఛిన్న దేశ కాలశ్లిష్టం. అవిభక్తం. కానీ ఈ ప్రపం దాన్ని అర్థంచేసుకోవాలంటే దీన్ని ముక్కలుచేసి చూడకతప్పదు. దాన్ని విభాజకత అందాం. జ్ఞానగ్రహణకు ఇది ఆవశ్యకం. విశ్లేషణలో పరిశోధకులు, శాస్త్రవేత్తలు చేసేది అదే. దాన్ని segmentation అంటారు. ఆ తరువాత వివిధ భాగాల సమన్వయం (synthesis)తో వస్తుస్వరూపతత్వ సమగ్రదర్శనం అవుతుంది.

ఈ ప్రపంచం అంతా - పోనీ, సాహిత్య ప్రపంచానికే పరిమితం చేద్దాం- ఈయనకు అప్రయత్నంగానే విశ్లేషణపూర్వకంగా దర్శనం ఇస్తుందనుకుంటాను. ఈయన వ్యాసాలను ఈ దృష్టితో ఒకసారి చూడండి. మొదటిది, రెండవది, మూడవది అన్నా 1, 2, 3.... అని సంఖ్యలు రాసినా- ప్రపంచం అంశికరూపంగానే, పరిగణనీయంగానే ఈయనకు దర్శనీయం. చూడండి:

పద్యకవిత్వాన్నిగురించి ఆలోచించాల్సిన మౌలికాంశాలు ఐదు (పే. 7-8), పద్యకవుల రకాలు పది (పే. 13), పదకవితలు ప్రధానంగా మూడు రకాలు (పే. 26), డాక్టరు వెంపటి చిన్నసత్యం గారి కృషిని ఆరు రకాలుగా విశ్లేషించవచ్చు (పే. 39-40), మౌలికతకు పంచప్రాణాల్లా పంచలక్షణాలున్నాయి (పే. 51-52), గుర్రం జాషువాగారి మార్గం గుర్తించటానికి పది లక్షణాలున్నాయి (పే. 108), తిట్టు విమర్శ ఆరు రకాలు (పే. 346), నన్నయనుండి వీరేశలింగం పంతులుగారి వరకూ సాగిన సాహిత్య చరిత్రలో మూడు రకాల శక్తుల ముక్కోణపు పోటీ కనపడుతుంది (పే. 353). నాటి సాహిత్యవిమర్శ ఆరు రకాల విమర్శకుల ఆసక్తి దాయకమైన ప్రయోగాలతో ప్రయోజనాత్మకమైన పాత్ర నిర్వహించింది. నేటి సాహిత్యవిమర్శ నాల్గు రకాల నడకలతో నలుగురినీ ఆకట్టుకోవాలని తాపత్రయపడుతున్నది. ఈ పది రకాల ప్రవృత్తులను పరిచయం చేయటమే ఈ పరిశీలన పరమార్థం (పే. 355).

నా మట్టుకు నాకు ఇంత త్వరగా విభాగాలు తేలవు. విభాగాల మధ్య విభాజక రేఖలు సరిగ్గా కనపడవు, మసకబారిపోతాయి. అంచుల దగ్గిర ఒక

దానిలో ఒకటి కలిసిపోతాయి . ఇది మా ఆలోచనల్లోనే ఉన్న దృష్టి భేదమేమో తెలీదు. తెలుగులో ఈ భేదాలను ఏమనాలో? ఇంగ్లీషులో అయితే డిస్క్రీట్‌నెస్ (discreteness) అనీ, కన్వర్జెన్స్ (convergence) అనీ క్రమంగా అనొచ్చు.

జీ.వి.యస్ గారు నాకెందుకో చాలా సీరియస్ మనిషిలా కనిపిస్తారు. ఆయన నవ్వరని కాదు. హాయిగా నవ్వుతారు. గుండెల నిండుగా నవ్వుతారు. కళ్ళు చెమర్చేలా నవ్వుతారు.

అయినా, పాండిత్యం, క్రమశిక్షణ (క్రమవర్తన అనాలేమో!) ముందు కొచ్చి ఇట్లాంటి అభిప్రాయాన్ని కలిగిస్తాయనుకుంటాను. ఆయన వచనమూ అదే అభిప్రాయం కలిగిస్తుంది. ఈ కొలమానమ్‌లో వ్యాసాలు చాలావరకు ఆయన రాసిన కాలమ్స్‌లో వచ్చినవే. ఆయన వ్యాసాల్లో, రచనల్లో ఉన్న సీరియస్‌నెస్ ఈ వ్యాసాల్లోనూ కనిపిస్తుంది. వస్తువు నతిక్రమించిన విషయ ప్రస్తావన లేదనికాదు. ఆ మాటకొస్తే ఈ పుస్తకంలో మొదటి వ్యాసంలోనే ఆ పద్ధతి గమనించవచ్చు. అదేమిటోగాని, ఈ ప్రస్తావనలు కూడా అసలు విషయం ఉన్నంత సీరియస్‌గా ఉంటాయి ఇది జీ. వి. యస్. వచన శైలీ లక్షణం అనుకుంటాను. ఆయన ఉపయోగించే డిక్షన్ కూడా ఈ సీరియస్‌నెస్‌కు కారణమేమో! భాసించు, వెలార్చు, జాలువారు వంటి క్రియలు; ఎడనెడ, కడు వంటి అవ్యయాల ప్రయోగం శైలీ గాంభీర్యాన్ని తెచ్చిపెడతాయనుకుంటాను. ఆయన రచనా శైలి ఆయన వ్యక్తిత్వ సూచకం. ఆయనే వేరే సందర్భంలో చెప్పినదాన్ని (పే. 57) ఇక్కడ అన్వయించుకోవచ్చు. అది ఆరాధించటానికి బాగుంటుంది. అనుసరించటానికి సాధ్యంకాదు.

జీ.వి.యస్. గారికీ నాకూ వస్తుతః కొన్ని వైరుధ్యాలున్నాయి, తత్వతః కొన్ని సామ్యాలున్నాయి. ఆయనకు సంప్రదాయమన్నా భారతీయత అన్నా భక్తి గౌరవాలు మెండు. సంప్రదాయం అంటే నాకు గౌరవమే కాని, కొన్ని సంప్రదాయాలు నా ఒంటికి సరిపడవు. స్వస్థాన వేషభాషలంటే నాకూ ప్రేమే కాని అంతర్జాతీయత మీద ఉన్న ఆసక్తి దేశభక్తి మీద లేదు. నిజానికివి వైరుధ్యాలు కూడా కావు. ప్రాధాన్య భేదాలు, differences in priorities

జీ.వి. యస్ గారిలో ఔదార్యంపాలు ఎక్కువ. విశ్వనాథ సత్యనారాయణ, గుర్రం జాషువా, గుంటూరు శేషేంద్రశర్మ, ఎస్వీ జోగారావు, బోయి భీమన్న, దాశరథి, సినారె, గోపీ, బాపురెడ్డి, భరద్వాజ, భవానీదేవి - ఇట్లా అనేక మందిని తమ వ్యాసాల్లో సంభావించారు. ఆయన శిష్యులపై చూపిన ఔదార్యానికి పరిమితి లేదు. సాహిత్యరసం - గానరసం (పే. 25 - 32) అనే వ్యాసంలో నాగరంజని, ఉషాలక్ష్మిగార్ల పరిశోధనపై ఆయన కురిపించినవాత్సల్యరసం అతిమధురమైనది.

ఆయన ఔదార్యానికి పరాకాష్ఠ అనదగిన అనుభవం నాకొకటి ఉంది. ఆయన ఒకప్పటి వచనశైలితో నాకు కొన్ని పేచీలుండేవి. వాటిని నేను దాచుకో లేదుకూడా. బాహాటంగానే విమర్శించాను. ఆయన వాటికి తప్పకుండా నొచ్చుకొనే ఉండాలి. అయినా, ఆయన నన్ను పల్లెత్తిమాట అనలేదు. అనకపోగా, నాగురించి మంచి మాటలనటం మానలేదు. ఆ తరవాతనే విజయనగరం వారు వేసిన ఒక ముత్యాలసరం సంకలనానికి పీఠిక రాస్తూ "శ్రీశ్రీ నుంచి చేరా వరకు" ముత్యాల సరాల మీద రాశారని పేర్కొన్నారు. చేరాతలు విరమించినప్పుడు, చేరాతల వల్ల లబ్ధిపొందిన రచయితలందరూ ఏమీ పట్టనట్టు ఊరుకోగా ఒక్క జీ. వి. యస్సే పత్రికాముఖంగా ఆవేదనను వ్యక్తం చేశారు. (చూ. పే. 305 - 308). సాధారణంగా రచనలో సంయమనం పాటించే జీ వి. యస్. ఆ వ్యాసంలో ఇమోషనల్ అయ్యారు. శైలి కూడా కవితాత్మకం అయింది. నా పట్ల ఆయన కున్న ఆర్ద్ర మనస్కతకు అది గుర్తు. ఉండేల సాహితీపురస్కార సందర్భం లోనూ నన్ను గుర్తు చేసుకున్నారు.

ఆయన కాలేజి జీవితజ్ఞాపకాలలో నాకో స్థిరస్థానం ఉన్నట్టు కన్పిస్తున్నది. అవును. ఒప్పుకోక తప్పదు! ఆయనకున్నంత ఔదార్యం నాకు లేదు. ఆ సంయ మనం ఆయన కలవాటయిన భాషలో చెపితే పురాజన్మ పుణ్యఫలం. నిజానికది ఆయన ఆయుధం కూడా చేరాతల్లో నేనూ ఆయన్ను ప్రస్తావించకపోలేదు. అయితే, ఆయనతో ఉన్న అభిప్రాయ భేదాల సందర్భంగానే ఆయన్ను గురించి ప్రస్తావించాను. ఆ సంగతి ఆయనా గుర్తించారు. అయినా, ఆ విషయాల్ని ఎంత సున్నితంగా, ఎంత సంయమితంగా సూచించారని! అందుకే అంటున్నాను ఆ సంయమనం ఆయన ఆయుధమని. ఇప్పటికీ మాయమ్యూయనికాదు. అవి అట్లానే ఉన్నాయి. ఆయన నవ్యసంప్రదాయ నిర్వచనాలు నాకు ఒంటబట్టలేదు.

బాపురెడ్డి కవిత్వంలో ఆయన ఉందంటున్న భావ భౌతికవాదం నాకింకా బ్రహ్మ పదార్థంలాగే ఉంది. ఆ వాక్యలయ సిద్ధాంతం నాకింకా చేతికి చిక్కటంలేదు. ఆయన రచనల్లో వ్యక్తమయ్యే కొన్ని నమ్మకాలు నాకింకా ఆశ్చర్యం కలిగించటం మానటంలేదు. అయితే, ఇవన్నీ మా స్నేహం ముందు చాలా అల్పంగా కనిపిస్తున్నాయి ఇప్పుడు అభిప్రాయాలు కలిసినా అసూయలు పెంచుకునే కన్నా, అభిప్రాయాల్లో భేదిస్తూనే ఆత్మీయతలు పంచుకోటం ఆనందంగా ఉంటుంది.

నిజానికి మాకు సామ్యాలు కూడా ఉన్నాయి. కవితారూపంతో కాని, ధోరణితో కాని సంబంధం లేకుండా మంచి కవిత్వాన్ని ఇద్దరమూ ఇష్టపడతాం. కాకపోతే, ఆయన సంప్రదాయం వైపు మొగ్గు చూపుతారు. నేను ఆధునికతపై మోజుపడతాను. సాహిత్యంలో వివిధ శాఖలను ఇద్దరమూ సమంగానే గౌరవిస్తాం. ఆయన కలం ప్రాచీన పద్ధతిలో నింపాదిగా పదును దేరింది. నా ఆలోచన ప్రాచీనతలో నిలకడగా నిలవలేక ఆధునికంవైపు పరుగుపెట్టింది. మధ్యలో భాషా శాస్త్రం ఒకటి వచ్చి మరెక్కడికో లాక్కుపోయింది. ఛందో వ్యాకరణాలంటే మాకు వల్లమాలిన ఇష్టం. ఆయన విద్యార్థులకు వాటిని బోధించారు కూడా. నాకా అవకాశం కలగలేదు. మా ఇద్దరికీ పాత అంటే గౌరవమూ, కొత్త అంటే ఆసక్తీ, పరమత (మతం అంటే ideological or intellectual position అనే అర్థంలో) సహనమూ ఉన్నాయి. మధ్యలో వచ్చే గాలివానలకు చెదరకుండా తట్టుకొని నలభయ్యేళ్ళ సుదీర్ఘకాలం నిలకడగా నిలచింది మా స్నేహవృక్షం.

ఇంతకీ జీ వి. యస్. గారు సాహిత్యంలో ఏం సాధించారు అనే విషయం సరిగ్గా చెప్పలేకపోయాను. చెప్పటం కష్టం కూడా. ఆయన సాధించినవాటి సారాంశం ఉండేల సాహితీ పురస్కారాన్ని అందుకునే సందర్భంలో చెప్పిన వచన కవితలో ఉంది. ఆయన సాధించినవాటి విరాడ్రూపం తెలుసుకోటానికి అచ్చవుతున్న ఆయన గ్రంథాలు చదవాల్సిందే. ఆయన సాధించినవన్నీ సాధించటానికి సాధారణులకు ఒక జన్మ చాలదు. ఆయన తొలిసారి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కారం అందుకున్నపుడు వీరరస సుబ్రహ్మణ్యం అనేవాళ్ళం. ఇప్పటి ఆయన సాహిత్య విరాడ్రూపానికి కా పేరు సరిపోదు.

ఆయన ఒక సాహిత్య విజ్ఞాన సర్వస్వం.

మాతరంలోని వేళ్ళమీద లెక్కించదగిన పరిశోధకుల్లో సంయమనం, సమతౌల్యం ఉన్న స్కాలర్ ఆయన.

అలంకారికులలోని ఆంధ్రులలో ఇప్పటికి చివరి కుర్చీ నాదేనేమో అంటా రాయన! ఒక్క అలంకారికుల్లోనే కాదు, చాలా విషయాల్లో ఆయన్ను గురించి ఆ మాట చెప్పుకోవచ్చు, సాహిత్య విద్యాపరిశ్రమ సన్నగిల్లుతున్న ఈ కాలపు ధోరణి చూస్తూంటే కొత్త కుర్చీకి చోటు కల్పించాల్సిన అవసరం సమీప భవిష్యత్తులో కలక్కపోవచ్చుకూడా.

జీ. వి. యస్. గారు అడిగింది కొలమానానికి పీఠిక రాయమని. కాని, ఇది పుస్తకం దాటి వ్యక్తిత్వానికి విస్తరించింది. మా సంబంధం అట్లాంటిది. ఈ సందర్భం కూడా అట్లాంటిది. నాలుగు దశాబ్దుల మైత్రీ బంధం పుస్తక పరిమితికి కట్టుబడలేకపోయింది- క్షంతవ్యుణ్ణి.

1995 ఆగస్టు 17 —చేరా

కృష్ణాష్టమి.

# కొండ అద్దమందు....

—ఆచార్య ఎన్. గోపి

బరువైన పండితులు, విమర్శకులు కాలమిస్టులుగా అవతరించడం కష్టం. పాండిత్యం, విమర్శ కాలమిస్టుగా నెగ్గటానికి ప్రతిబంధకాలని నా వుద్దేశం కాదు. కాని రోజువారీ జీవితంలోని సంఘటనల పట్ల మార్పుల పట్ల ప్రవాహ సదృశమైన చూపు వున్నవాడికి ఇది నల్లేరుమీద బండినడక అవుతుంది. మరీ వారం వారం రాయడమంటే ''చెప్పులోని రాయి'' కాదు గాని, కొంత కాలపరిమితి పోరు పెడుతూనే వుంటుంది. కాలమిస్టుకి వుండవలసిన లక్షణాలు మూడు: (ఇట్లా సంఖ్యాపరిగణన చేయడం జీ. వి. యస్. స్టైలే) 1. జ్ఞానసంపద, 2. వ్యక్తీకరణ నైపుణ్యం (ముఖ్యంగా నలుగురికీ పట్టేట్టు చెప్పటం). 3. అనుభవాలు. విలక్షణమైన వ్యక్తులు రాసే ఇటువంటి ''కాలమ్''ను ''పర్సనల్ కాలమ్'' అని కూడ అంటారు. పర్సనల్ అంటే వ్యక్తిగత అని అర్థం కాదు. మరీ నిబద్ధంగా కాకుండా కొంత స్వేచ్ఛ, వెసులుబాటూ వుండటం అన్నమాట. అయితే, ఈ స్వేచ్ఛ 'నా యిచ్చయేగాక నాకేటి వెరపు' అనే స్థాయికి వెళ్ళినప్పుడు 'బాధ్యత, బాధ్యత' అని నాలాంటివాళ్ళు గోల పెడుతుంటారు. (పాపం చేరా.)

కాలమానంలో 93 జూన్ నుండి 94 డిశంబరు దాకా ఏడాదిన్నరపాటు ''జీ. వి. యస్. కాలమ్'' పేరిట వారం వారం రాసిన వ్యాస ఖండాలున్నాయి. వేరే పత్రికల్లో వచ్చిన మరికొన్ని వ్యాసాలు వెరసి 81 శీర్షికలతో ఈ గ్రంథం మనముందుకు వస్తున్నది.

ఈ పుస్తకంలోని అంశాలను ఐదారు భాగాలుగా వర్గీకరించవచ్చు. (ఇది నా రిసెర్చి బలహీనత). 1 మౌలికంగా ఆలోచించిన సిద్ధాంతాలు, సిద్ధాంత సంబంధులు. 2. కవితా పరిశీలనం, కావ్య పరిశీలనం. 3. నవల, కథల పరిశీలనం. 4. విమర్శల పరిశీలనం. 5. నాట్యం మీద, నాటక ప్రదర్శనల మీద పరిశీలనం 6. ఇతరాలు.

సిద్ధాంతాలు అన్నప్పుడు ముఖ్యంగా నవ్య సంప్రదాయం జీ. వి. యస్. చేతిలో ఇవ్వాళటి టార్చ్‌లైట్ అయ్యింది. దీని గురించి ఆయన కొంతకాలంగా వెళ్ళిన చోటల్లా బల్లగుద్ది మరీ ప్రతిపాదించడం వల్ల దానికో ఉనికి ఏర్పడు తున్నట్టుంది. ఇంతకుముందు ఇతరత్రా చెప్పిన దానికంటే ఇక్కడ మరింత స్పష్టంగా, విశదంగా, బలంగా చెప్పారు. 'విశ్వనాథ నవ్య సంప్రదాయం, నవ్య సంప్రదాయోద్యమంలో తీవ్రవాదులు - సాహిత్య రసికత' అనే వ్యాసాల్లో దీన్ని చూడవచ్చు. ఇదే కాకుండా భక్తిరసం మీద జరిగిన చర్చ విలువైంది. ధర్మవీరం స్పెషలిస్టుగా, ఆయన చేసిన సూత్రీకరణలు అందరికీ పరిచయమైనవే.

నలభయ్యేళ్ళ సుదీర్ఘ విమర్శక జీవితంలో జీ. వి. యస్. ఈ 'కాలమ్' రచనలో జీనియస్‌గా కనిపిస్తున్నారు. పరిణతి, అలవోకగా చెప్పే సాధికారిక శక్తి చేతికందాయి. భాషా ఛందస్సాహిత్య సాంస్కృతిక విషయాల మీద సంవత్సరాలపాటు అవిచ్ఛిన్నంగా ఒక 'కాలమ్' నడపడం మాటలు కాదు. వొట్టి రాతలూ కాదు. ఆ పనిని ఇటీవల ఇద్దరే చేశారు. ఒకరు చేరా, రెండు జీ.వి.యస్. చేరా "చేరాతల్ని" ఏకబిగిని ఎనిమిదేళ్ళు నడిపి ఆపేశారు. (చేరాతలు ఆగిపోయి నప్పుడు జీ. వి. యస్. బాధపడుతూ రాశారు.) జీ. వి. యస్. కాలమ్ ప్రస్తుతం విశ్రాంతిలో వుంది. కష్టకాలాల్లో చేరాకి భాషాశాస్త్రం ఒక ఆయుధమైతే (ఇది దబాయింపులకి కూడ పనికొచ్చిందనుకోండి). జీ.వి.యస్. చేతిలో రస సిద్ధాంతం ఒక దీపం.

సాధారణంగా కాలమ్స్‌లో వారి వారి అనుబంధాలు (ఇష్టాలు, అభిరుచులు, పక్షపాతాలు,) ప్రతిబంధాలు (Prejudises) బయటపడతాయి. కాని జీ. వి. యస్. కాలమ్‌లో ఆయనలో స్వతహాగా వున్న ఋషితత్వంవల్ల కాబోలు ప్రతిబంధాలను బయటపెట్టరు. సంయమనం ఆయనకు బాగా సాధ్యపడిన విద్య. (రాళ్ళపల్లివారిలాగ అప్పుడప్పుడు పోలీసు దెబ్బలు తప్పవనుకోండి.) చేరాకైతే ప్రతిబంధాలను బయటపెట్టడంలో మహా ఆరాటం. గిల్లికజ్జాలు తెచ్చుకోవటంలో ఈ దశాబ్దంలోనే చేరాను మించిన ఘనుడు లేడు. పైగా వాటిని ఎంజాయ్ చేస్తున్నానంటారు తమ తమ వైఖరుల్లో చేరా ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికలాంటి వారైతే, జీ.వి.యస్. హిందూ పత్రిక. మొదటిది అర్జెన్సీకి, సద్యః ప్రతిస్పందనకీ తార్కాణమైతే రెండోది పెద్దమనిషి తరహాకి, హుందాతనానికి చిహ్నం.

జీ.వి.యస్. కాలమ్‌లో జీ.వి.యస్. కొత్తగా, అప్‌డేటుగా కనిపిస్తున్నారు. ఇంతకుముందు ఆయన రాసిన అపారమైన విమర్శక సాహిత్యం ప్రాచీన సాహిత్య సిద్ధాంతాలకి విస్తృత వ్యాఖ్యలైతే, ఆ సిద్ధాంతాలకీ, తన సిద్ధాంతాలకీ కూడా సరళ వ్యాఖ్యానాలుగా రూపొందాయి ఈ శీర్షికలు. ఈయనకు సిద్ధాంతాల ప్రతిపాదనలపట్ల ఎంతటి మోజంటే వాటిని ఆయన సాహిత్యానికే కాక నాట్యం దాకా తీసుకెళ్ళారు. (కూచిపూడి నాట్యకళలో నవ్యసంప్రదాయోద్యమం.) దీనివల్ల ఒక సాహిత్య సిద్ధాంతాన్ని కళా సిద్ధాంతంగా విస్తృతపరిచారు. ఆధునిక వర్తమాన కవులను కూడా ఆయన అంతే అభినివేశంతో పట్టించుకున్నారు. గోపి, ఎండ్లూరి సుధాకర్, శిఖామణి ప్రభృతుల కవిత్వాన్ని గురించిన వారి వివేచన నిజంగా అద్భుతం జీ.వి.యస్ కి కొన్ని ఆత్మీయతలున్నాయి. వాటిని గురించి రాసేటప్పుడు విశ్లేషణకంటే భావావేశానిదే పైచేయిగా వుంటుంది. 'యుగకర్త విశ్వనాథ', 'చేరాతాలకు సెలవులు' వంటి వాటిలో ఈ ధోరణిని గమనించవచ్చు. ఋషి తత్త్వం అన్నాను కదా! ఆయనకు ఆధ్యాత్మిక విషయాలపై ఎంత అభిమానం అంటే- ఆధ్యాత్మికనాటకాలకు మంచి భవిషత్తు వుండాలనేటంత. తెలుగు నాటకాలకు ఆదరణ అంతంత మాత్రమేకదా! అయితే పౌరాణిక నాటకాలు కొంత మెరుగు. ఆస్తిక నాటకాలు కాని, త్రిపురనేని వంటివారు రచించిన నాస్తిక నాటకాలు కాని మేధావులను స్పృశిస్తాయేమో కాని, సామాన్య జనానికి అవి అందటం అనుమానమే. కవులను ఒక్కముక్కలో అంచనా కట్టడం అంత సులభమేమీకాదు. నిరంతర మథనం వున్నవారే మీగడలాంటి మాటలనగలుగుతారు. ఉత్పల సత్యనారాయణాచార్యుల గురించి రాస్తూ "అభినవ వల్లభరాయుడు ఉత్పల" అని అభివర్ణించడం ఈ కోవలోకే వస్తుంది.

జీ.వి.యస్. అన్ని అభిప్రాయాలకు చిన్న సైజు సర్వస్వంగా రూపొందిన గ్రంథం కొలమానమ్ సూక్ష్మరూపంలో జీ.వి.యస్.ను అర్థం చేసుకోవాలంటే కొలమానమ్ చదివితే చాలు. దీనివల్ల ఆయన సిద్ధాంతాలు మరింత విశదంగా అర్థం అవుతున్నాయి. ఆయన వచనం గంభీరోన్నత శిఖరాలు దూకి, బయటికొచ్చి సరళరూపం తీసుకొని సెలయేరులా ప్రవహించింది. ఆయన వచన రచనా పరిణామంలో వ్యక్తీకరణ సామర్థ్యాన్ని కొలిచే కొలమానం ఈ 'కొలమానమ్.'

జీ. వి. యస్. ఎం.ఏ లో నాకు సాహిత్య విమర్శ పాఠాలు చెప్పిన గురువు. నిజాం కాలేజి నుంచి ఆర్ట్స్ కాలేజిదాక సైకిల్ తొక్కుకుంటూ వచ్చే ఆ దృశ్యం నా కళ్ళల్లోంచి చెరిగిపోదు. జీవితంలోనూ, సాహిత్యంలోనూ ఆయన నిరంతర శ్రామికుడు. "కష్ట'జీవి'యస్" ఎన్నో పుస్తకాలను క్లాసురూంలోకి మోసుకొచ్చి మౌలికమైన ఉటంకింపులను అందించేవారు. ఆయన క్లాసు అప్పట్లో మా కదో ఆకర్షణ

ఈ పండిన పుస్తకాన్ని గురువర్యులు నారాయణరెడ్డిగారికి అంకితం చేయడం మరో విశేషం. గురువుల పుస్తకానికి పీఠిక రాయడంలో నాకిది రెండో అనుభవం. సి.నా.రె. ప్రపంచపదులకు రాయమని ఆదేశించినప్పుడే బిత్తర పోయాను. శిష్యుల్లోని జ్యోతిః కణాలను వెలికితీసి వెలుగుగా మార్చే గొప్ప సంప్రదాయానికి చెందిన గురువులు సి.నా.రె గానీ, జీ.వి.యస్. గానీ. ఆ స్ఫూర్తితోనే ఈ రెండు మాటలు రాయటం.

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారికి షష్ట్యబ్దాలు నిండుతున్నాయి. అప్పుడే అరవయ్యేళ్ళా అనిపిస్తుంది. ఆయన శక్తియుక్తు లింకా పదనుదేరుతున్న తరుణ మిది. ఆయన వెలుగు కలకాలం, నిరంతరం నలుగురికి అందాలని కోరుకుంటూ సెలవు తీసుకుంటున్నాను.

హైదరాబాదు,
22.8.1995.

—గోపి

# నా మాట

పత్రికలో పర్సనల్ కాలమ్ రాయటం ఒక కళ, ఒక సాధనకూడా. 'చేరా' ఆ రచనకొక చెరగని బాటవేసి చూపించారు. 'చేరా' భావాలతో ఏకీభవించనివారు కూడా ఆ కాలమ్‌ను ఆసక్తితో చదివేవారు. ఆంధ్రజ్యోతికి చేరాతలు కొన్నేళ్లు వెలుగు తెచ్చిన స్నేహధారలు.

ఆంధ్రభూమి దినపత్రిక కూడా ఒక పర్సనల్ కాలమ్ వారం వారం ప్రచురించాలని అప్పటి దినపత్రిక సంపాదకులు శ్రీ సి. కనకాంబరరాజుగారు సంకల్పించి, ఆ బాధ్యత నాకు ఒప్పగించారు. నిజానికి వారితో నాకు అట్టే పరిచయం కూడా లేదు ఆంధ్రప్రభలో నా 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు', 'తెలుగులో వెలుగు', ఉదయంలో నా 'సాహితీ స్పర్శ', ఇంకా మరికొన్ని పత్రికలలో వెలువడిన వ్యాసాలూ వారు గమనించి ఉండవచ్చు, కొందరు మిత్రుల సలహాలను తీసికొని ఉండవచ్చు. ఏమైనా, నా రచనను అభిమానించి 'జీవియస్ కాలమ్'ను ప్రచురించారు. వారు ఆంధ్రభూమి దినపత్రికకు సంపాదకులుగా వ్యవహరించినంతకాలం ఆ కాలమ్‌ను ఆగకుండా ప్రచురించారు. ఎంతో స్నేహాన్ని నాపట్ల చూపించారు. చిత్రమేమంటే - 'కాలమ్' నడిచినంతకాలం ఆ సంపాదకుణ్ణి నేను కలుసుకోనేలేదు. అయినా, నా సాహిత్య కృషిపట్ల వారికున్న ఆదరాభిమానాలే ఈ అక్షర స్నేహాన్ని అందించాయి. 'ఆంధ్రభూమి'కి నా కృతజ్ఞతలు!

'పర్సనల్ కాలమ్' నిర్వహణలో 'చేరాతల' కంటె 'జీవియస్ కాలమ్' తన ప్రత్యేకతను ప్రదర్శించింది. దీనిని సమకాలీన సాహిత్య విమర్శకులు కూడా గుర్తించారు. 'చేరాతలు'-'జీవియస్ కాలమ్' ఒకదానికొకటి పోలికలేనివి, పోటీపడనివి; సమాంతర స్వతంత్ర రేఖలు; అయితే సాహితీ స్పందనలో మాత్రం సజీవ సహృదయకోశాలు!

నా పత్రికావ్యాసాలు సంపుటులుగా వెలువటంలో ఈ గ్రంథం మూడవది. ఇదివరలో 'ఆంధ్రప్రభ' దినపత్రికలో వెలువడిన 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాల'ను తెలుగు అకాడమి 1991 లో ప్రచురించింది; ఆంధ్రప్రభలోనే

వచ్చిన 'తెలుగులో వెలుగు' 'కాలమ్' వ్యాసాలను యువభారతి 'కలంతో కాలమ్' పేరుతో రజతోత్సవాల ప్రచురణగా 1990 లో వెలువరించింది. ఈ 'కాలమానమ్' (ఆంధ్రభూమి జీవియస్ కాలమ్, ఉదయం 'సాహితీస్పర్శ' (1991-92), మరికొన్ని వ్యాసాలు)ను కూడా యువభారతి ఇప్పుడు ప్రచురిస్తోంది. పత్రికా వ్యాసాల రచనలో ఒకే అంశం మీద దాదాపు 138 వ్యాసాలు పరిశోధనాత్మక ప్రవృత్తిలో రచించే మొదటి అవకాశం ఆంధ్రప్రభ అప్పటి సంపాదకులు శ్రీ పొత్తూరి వెంకటేశ్వర్లుగారు కల్పించారు. ఆ తరువాత 'పర్సనల్ కాలమ్'ను నిర్వహించే అవకాశాన్ని ఆంధ్రప్రభ, ఉదయం, ఆంధ్రభూమి, శ్రీవాణి, కల్పించాయి. కృష్ణాపత్రిక మొదలైన పత్రికలు నా వ్యాసాలను ప్రచురించాయి.

ఇక్కడ ఒక విషయం మనవిచేయాలి. 'కాలమ్స్'లో వెలువడిన వ్యాసాలనన్నింటినీ ఈ సంపుటిలోకి తీసికొని రావటం లేదు. కొన్నింటిని ఎన్నుకోలేదు. ఈ గ్రంథంలోని వ్యాసాలను వస్తువును బట్టి స్వభావాన్నిబట్టి ఆరు విభాగాల క్రింద విభజించి, కాలక్రమంలో కాకుండా పఠితల అవగాహనకు అనుకూలమైన పద్ధతిలో అమర్చటం జరిగింది. ఆ ఆరు విభాగాలూ ఇవి - 1. పాట - పద్యం - నాట్యం-చిత్రం; 2. శతజయంతి సాహితీమూర్తుల ప్రతిభాప్రస్థానాలు. 3. పద్య విద్యా పరిమళాలు. 4. వచన కవితా విన్యాసాలూ - వ్యక్తిత్వాలు. 5. కథ - నవల. 6. స్పందనలు - సమీక్షలు. ఈ విశ్లేషణలో ఒదగని 'కాలమ్' వ్యాసాలను ఈ సంపుటిలో చేర్చలేదు.

నా పరిశోధన వ్యాసం సిద్ధాంత ప్రతిపాదన ప్రవృత్తిని ప్రదర్శిస్తుంది; నా విమర్శన వ్యాసం వివేచనను, విశ్లేషణను, సమన్వయాన్ని సాధిస్తుంది; నా పత్రికావ్యాసం అటు పరిశోధన ప్రవృత్తినీ, ఇటు విమర్శవ్యాస వివేకాన్ని సంతరించుకుంటున్నా ఆలోచనలో, అభివ్యక్తిలో, శైలిలో పఠితలో జాలువారుతున్నట్లు ప్రసరిస్తుంది. సరళంగా ఉన్నా సారవత్స్వభావాన్ని వీడదు; అలవోకగా సాగుతున్నా ఆలోచింప చేయకుండా ఉండదు - జర్నలిజంలో జీవిస్తూనే సాహిత్య గౌరవంతో తలయెత్తుకొని తిరుగుతుంది. సహృదయులు నా వ్యాసాలలో ఉండే ఈ సహజ లక్షణాలను సానుభూతితో గమనించి, సమీక్షించాలని సవినయంగా మనవి చేసుకుంటున్నాను.

—జి. వి. సుబ్రహ్మణ్యం

# కృతజ్ఞతలు

అధ్యాపకులుగా, ప్రజాసేవకులుగా, నాయకులుగా, అమాత్యులుగా, మానవీయ మూల్యాలను మన్నించే మానవతా మూర్తులుగా, సాహితీకళాభిమానులుగా మన్ననల నందుకుంటున్న రాష్ట్ర ఉన్నత విద్యాశాఖామాత్యులు మాన్యశ్రీ గాలి ముద్దుకృష్ణమనాయుడుగారు దయతో ఈ గ్రంథాన్ని ఆవిష్కరించినందుకూ—

పండితులుగా, పరిశోధకులుగా, వక్తగా, సమర్థుడైన పరిపాలకుడుగా ప్రశంసల నందుకుంటున్న మనీషి, ప్రస్తుతం అధికారభాషా సంఘ అధ్యక్షులు ఆచార్య తూమాటి దొణప్పగారు ఈ గ్రంథ ఆవిష్కరణ - అంకిత సభకు అధ్యక్ష్యం వహించి ఆశీర్వదించినందుకూ—

జ్ఞానపీఠ పురస్కార గ్రహీతలు, పద్మభూషణులు, మహాకవులు, వక్తలు, పరిపాలనదక్షులూ, సాహితీ చైతన్యమూర్తులూ, పైపెచ్చు నేను ఆప్యాయంగా 'అన్నగారూ' అని పిలుచుకొనే అనురాగమూర్తులూ, రాష్ట్ర భాషా సాంస్కృతిక వ్యవహారాల సలహాదారులూ అయిన ఆచార్య సి. నారాయణరెడ్డి గారు నా షష్టిపూర్తి సందర్భంలో ఈ రచనను స్నేహ చిహ్నంగా అంకితం తీసుకున్నందుకూ—

అభిమానంతో 'ఆంధ్రభూమి' దిన పత్రికలో 'జీవియస్‌కాలమ్'ను 1993 జూన్ నుండి 1994 డిసెంబరు నెలాఖరు వరకూ ప్రచురించిన ప్రసిద్ధ పత్రికా సంపాదకులు, సాహితీ కళాప్రియులు, స్నేహమూర్తులు శ్రీ సి. కనకాంబరరాజు (ఆంధ్రభూమి సచిత్రవారపత్రిక సంపాదకులు) గారికీ, అలాగే నా పత్రికా వ్యాసాలను సీరియల్‌గా వెలువరించిన ఉదయం సంపాదకులు శ్రీ కె. రామచంద్రమూర్తిగారికీ, శ్రీవాణి సంపాదకులు శ్రీ కొమరగిరి కృష్ణమోహన్ గారికీ, కృష్ణాపత్రిక సంపాదకులు శ్రీ పిరాట్లవెంకటేశ్వర్లు గారికీ—

నన్నభిమానించి, తమ ఉండేల సాహితీ పురస్కారాన్ని ప్రప్రథమంగా నాకందించిన కవితామూర్తులు, చైతన్యసారథులు, సమాజసేవాధురంధరులు డా॥ ఉండేల మాలకొండారెడ్డి గారికీ; ఆప్యాయంగా 'జీవియస్' అని పిలుస్తూ,

కృతిని అంకితమిచ్చి, నాలుగు దశాబ్దాలుగా నా శ్రేయస్సును ఆకాంక్షిస్తున్న మహాకవులూ, స్నేహార్ద్రమూర్తులూ సౌజన్యశిఖామణులూ డాక్టర్ జె. బాపురెడ్డి గారికి; బాటలు వేరైనా, అభిప్రాయాలలో కొన్ని కలవకపోయినా అచ్చమైన స్నేహంతో మనసులు కలుపుకొని సాహితీ జీవితాన్ని సాగించవచ్చు నన్న మానవీయధర్మానికి ప్రతినిధిగా నిలిచి నన్నభిమానించి, ఈ గ్రంథానికి పీఠిక వ్రాసిన ప్రసిద్ధ భాషాశాస్త్రాచార్యులు, సంతత సాహితీ వ్యాసంగ ప్రియులూ, స్నేహమూర్తులూ అయిన ఆచార్య చేకూరి రామారావు (చేరా) గారికి; ఆధునిక కవితా ప్రస్థానంలో వాస్తవవాద కవితాశిల్ప చైతన్యానికి నాయకుడుగా సాగుతూ, పరిశోధకుడుగా, కవిగా, పరిపాలనాదక్షుడుగా, స్నేహమూర్తిగా పేరొంది, నా యందున్న ఆత్మీయతతో ఈ గ్రంథానికి ఎడిటర్‌గా వ్యవహరించి, ముందు మాట వ్రాసిన ఆచార్య ఎన్. గోపీగారికి; ఈ గ్రంథావిష్కరణ సభలో వక్తలకు సన్మానం చేసిన ప్రముఖ పారిశ్రామికవేత్తలు, సాహితీబంధువులు, సౌజన్య సింధువులు LAMCO Group ఛైర్మన్ శ్రీ ఎస్. కొండలరావుగారికి—

యువభారతికి, పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్‌కూ, విప్ల ప్రింటర్స్‌కూ, నన్ను ప్రోత్సహిస్తున్న నా మిత్రబృందానికి, సహృదయలోకానికి, నా కుటుంబ సభ్యులకూ—

నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు.

నేడు పత్రికా రచనలో కనపడే 'కాలమ్స్'లో రెండురకాలు గణింప దగినవి. ఒకే విషయం మీద సీరియల్‌గా వ్రాసే 'కాలమ్', వివిధాంశాలపైన వారం వారం నిర్వహించే 'పర్సనల్ కాలమ్' - ఈ రెండింటినీ నేను 1985 నుండి నిర్వహించి సాహిత్య సేవ చేశాను. అభిమానించిన ఆంధ్రావళికి కృతజ్ఞతాభి వందనాలు.

'కాలమానమ్' నా షష్టిపూర్తి ప్రచురణలలో ఒకటిగా వెలువడటం, దానిని ఆచార్య సి. నారాయణరెడ్డిగారు అంకితం తీసుకోవటం, యువభారతి ప్రచురించటం నాకు ముప్పేటగా ఆనందాన్నీ, సంతృప్తినీ కలిగిస్తున్నాయి. అందరి అభిమానాన్ని చూరగొన్న అక్షర ప్రసూనం ఈ 'కాలమానమ్' కావాలని నా ఆకాంక్ష!

—రచయిత

# ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం షష్టిపూర్తి ప్రచురణలు
# ప్రచురణ పూర్వ విరాళం – ఒక మనవి

ఆంధ్ర సాహిత్యరంగంలో మూడున్నర దశాబ్దాలుగా విమర్శకులుగా, అధ్యాపకులుగా, వక్తగా, పరిశోధకులుగా, సాహితీ సంస్థా నిర్వాహకులుగా, రచయితగా, మానవతామూర్తిగా ప్రసిద్ధిగాంచిన ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారికి 1995 సెప్టెంబరు 10 తేదీ నాటికి షష్ట్యబ్ది పూర్తి అవుతున్నది. ఆ తేదీ మొదలుకొని 1996 సెప్టెంబరు 10 తేదీ వరకు వారి షష్ట్యబ్ది పూర్తి సంవత్సరం సాహితీ కార్యక్రమాలతో నిర్వహించాలని సంకల్పించాం. ఒక సాహితీమూర్తికి సాహితీపరమైన సన్మానమే సార్థకంగా ఉంటుంది. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారి షష్టిపూర్తి సంవత్సరోత్సవాలలో ఈ క్రింది కార్యక్రమాలను చేపట్టి నిర్వహింపదలచాం.

1. వారి అముద్రిత రచనలను ప్రచురించటం.
2. వారి సాహితీ వ్యక్తిత్వాన్ని గురించి సవిమర్శకంగా సమాలోచించే ఒక సదస్సును నిర్వహించి, ప్రముఖుల చేత ప్రామాణిక వ్యాసాలు వ్రాయించి, వాటినొక గ్రంథరూపంగా వెలువరించటం.
3. షష్టిపూర్తి సంచికను ప్రచురించటం.
4. షష్టిపూర్తి సంవత్సరోత్సవాలలో వెలువరించే ప్రచురణల ద్వారా వచ్చే ఆదాయంలో నుండి ఒక లక్షరూపాయలను ఫిక్సెడ్ డిపాజిట్ చేసి, దాని మీద వచ్చే వడ్డీతో ప్రతి సంవత్సరం ఒక సాహితీమూర్తికి 'జీవియస్ సాహితీ పురస్కారాన్ని' అందజేయటం.
5. షష్టిపూర్తి సంవత్సరోత్సవాలలో 12 గ్రంథాలకు తక్కువలేకుండా వెలువరించటం - వాటి మొత్తం విలువ రూ. 750 లు కాగా, ప్రచురణ పూర్వ విరాళంగా రూ. 500 లు ఇచ్చిన వారికి వాటిని అందించటం, షష్టిపూర్తి సంచికలో వారి పేర్లను సాహితీ పోషకులుగా ప్రకటించి కృతజ్ఞతలు తెలుపటం.

షష్టిపూర్తి సందర్భంగా రూ. 500 లు ప్రచురణ పూర్వ విరాళం ఇచ్చి ప్రచురణల ప్రకటనకు తోడ్పడే సాహితీ పోషకులకు ఈ క్రింది గ్రంథాలను తప్పక అందజేస్తాం :

1 రామకథ : సాయిసుధ, 2. రసోల్లాసము. 3. కలంతో కాలమ్, 4. జీవియస్ వ్యాసాలు, 5. కాలమానమ్ (జీవియస్ కాలమ్, సాహితీ స్పర్శ, తదితర వ్యాసాల సంపుటి), 6. జీవియస్ రూపకాలు, 7. జీవియస్ పీఠికలు, 8. విశ్వనాథ నవ్యసంప్రదాయం, 9. ఆంధ్ర మహాభారతం : అమృతత్వసాధనం, 10. జీవియస్ సాహితీ మూర్తిమత్వం (సాహితీ సదస్సులో సమర్పింపబడే వ్యాసాల సంపుటి), 11. కిన్నెరసాని పాటలు : వాక్యప్రయోగ వైచిత్రి (జి.యస్. లక్ష్మి రచన), 12 షష్టిపూర్తి సంచిక.

ఆచార్య జి.వి సుబ్రహ్మణ్యంగారి షష్టిపూర్తి ప్రచురణలకు మీరు ప్రచురణ పూర్వ విరాళమిచ్చి ప్రోత్సహింప వేడుతున్నాం. ఒక సాహితీమూర్తి సాహిత్యాన్ని వెలువరించటానికి ఆర్థికంగా, హార్దికంగా మీ చేయూతను మనసారా కోరుతున్నాం. ప్రచురణ పూర్వ విరాళం రూ. 500 లు ఎం ఓ. ద్వారా గాని, డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా గాని, సరాసరి పైకం చెల్లించడం ద్వారా గాని మాకు అందచేసి రసీదు పొందవచ్చు.

విరాళం పంపవలసిన చిరునామా :
కన్వీనరు,
**ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం షష్టిపూర్తి ప్రచురణలు,**
శ్రీవాణి 1-8-702/105, నల్లకుంట, హైదరాబాదు - 5000 44.
ఫోను : 633275

మీ సహాయ సహకారాలను అర్థిస్తూ
సాహితీమూర్తియైన మా తండ్రికి షష్టిపూర్తిని సాహిత్యోత్సవంగా
జరపాలని కృషిచేస్తున్న

**జి. రాధాకృష్ణ**, ఎం.ఎస్‌సి;
**జి. విద్యానాథ్**, ఎం. కామ్. పిహెచ్.డి;
కన్వీనర్లు,
14-7-1995 ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం షష్టిపూర్తి ప్రచురణలు.

# విషయసూచిక

## III. పద్యవిద్యా పరిమళాలు :



## IV. వచనకవితావిన్యాసాలూ - వ్యక్తిత్వాలూ :

## V. కథ - నవల :



## VI. స్పందనలు : సమీక్షలు :

## అట్టమీది ఛాయాచిత్రాలు :

1. ముఖచిత్రంలోని జీ.వి.యస్. ఛాయాచిత్రం ఆంధ్రభూమి వారం వారం 'కాలమ్'లో ప్రచురించిన రెండురకాల ఫోటోలలో ఒకటి. ఫోటో తీసింది శ్రీ వై. వాసుదేవ్‌గారు.

అట్టవెనుక పై ఫోటో :

2. ప్రప్రథమ ఉందేల సాహితీ పురస్కారాన్ని అందుకుంటున్న జీ.వి.యస్. (23.8.1994.) ఛాయాచిత్రంలో - ఎడమనుంచి కుడికి - శ్రీ టి. సుబ్బిరామిరెడ్డి, మాన్యశ్రీ పి.వి. రంగారావు, శ్రీ ఎం.ఎస్.రెడ్డి, శ్రీ బి.ఎన్. రెడ్డి, డా॥ ఉందేల మాలకొండారెడ్డి, మాన్యశ్రీ ఎస్.కృష్ణకాంత్ (గవర్నర్, ముఖ్య అతిథి); డాక్టర్ సి. నారాయణరెడ్డిగారలు.

అట్టవెనుక క్రింది ఫోటో :

3. డాక్టర్ జె. బాపురెడ్డిగారి 'రంగురంగుల చీకట్లు' కావ్యాన్ని అంకితం తీసుకుంటున్న జీ.వి.యస్. (27.6.1990.)

ఛాయాచిత్రంలో ఎడమనుంచి కుడికి - శ్రీ వై. కె. నాగేశ్వరరావు, డాక్టర్ సి. నారాయణరెడ్డి, శ్రీ జి. వెంకటరెడ్డి, శ్రీ వి.వి.యల్. నరసింహారావు, డా॥ జె. బాపురెడ్డి, మాన్యశ్రీ కె. రోశయ్య (రాష్ట్ర ఆర్థికశాఖామాత్యులు, ముఖ్యఅతిథి) గారలు.

# మూడు తరాలు

యూనివర్సిటీ నుంచి వచ్చేసరికి ఆలస్యమయింది. " 'ఆంధ్రభూమి' ఆఫీసు నుంచి ఫోను వచ్చింది. మీ 'కాలమ్' రేపు పంపాలని జ్ఞాపకం చేశారు" అన్నది అదోరకం జాలిగా ముఖంపెట్టి శ్రీమతి. కాఫీ తాగింతరువాత కలంపట్టుకుంటే కొద్దో గొప్పో రాస్తానని ఆమెకు నలభైయేళ్ళనుంచి తెలుసు. నే నెప్పుడైనా సకాలంలో ఒక కార్యక్రమాన్ని ముగించానంటే దానికి కారణం ఆమె-గుండెలో గూడుకట్టుకొని చేసే మెత్తని ప్రోత్సాహమే. కాఫీరుచి అంగిట్లో రంగవల్లి వేస్తోంది. పిల్లలు ముంగిట్లో ఆడుకుంటున్నారు. 'కాలమ్'లో పండాల్సిన వస్తువుకోసం చురుకుగా వెదుకుతున్నాయ్ కళ్ళు.

ఇంతలో మా మనవరాలు మాధురి నిద్ర లేచింది. నాలుగో నెల పసికందు. మా యింట్లో ఉన్న ప్రతి వ్యక్తికి ఒక ప్రత్యేకత ఉన్నట్లే దానికీ ఒక స్పెషాలిటీ ఉంది అది నిద్రలేచి గుక్కపట్టి ఏడవదు. ఏడుస్తానని ఎన్నో ధ్వనిసంకేతాలను వినిపిస్తుంది. వాటిని విని వెంటనే మా మనవళ్ళూ, మనవరాళ్ళూ దాని ఉయ్యాల చుట్టూ మూగి ప్లేబాక్ సింగర్స్‌లాగా పాటలు పాడటం మొదలుపెడతారు. వాళ్ళ పాటలకు ఒక్కొక్కసారి పరవశించి నిద్రపోతుంది మాధురి. వాళ్ళ ప్రయత్నం విఫలమయితే దాని అమ్మో, బామ్మో రంగంలోకి దిగుతారు అవతార మూర్తుల్లాగా. అవసరాన్నిబట్టి పాటనో, ఆటనో ప్రయోగించి మాధురిని మళ్ళా మొలకనవ్వుల పొత్తిళ్ళలో పడుకోపెడతారు. ఇది రోజూ నడిచే నాటకమే. అయితే, ఆనాడు నేను వస్తువుకోసం వెదుకుతున్న సమయంలోనే మా పిల్లలు మాధురికి లాలిపాట పాడటం మొదలుపెట్టారు :

"లాలీ లాలీ లాలీ లాలీ
వటపత్రశాయికి వరహాల లాలీ
రాజీవ నేత్రునికి రతనాల లాలీ
మురిపాల కృష్ణునికి ముత్యాల లాలీ
జగమేలు స్వామికి పగడాల లాలీ!"

ఇది ఈనాడు తెలుగునేల నలుమూలలా వినపడుతున్న లాలిపాట! స్వాతిముత్యం సినిమాలోని జాతిముత్యం. ఆ పాట పాడుతుంటే మాధురి మాగన్ను కూరుకులో కూరుకుపోయింది. నేనూ పడకకుర్చీలో కదలకుండా ఉండిపోయాను.

తానిచ్చిన కాఫీ ప్రభావం ఎంతవరకు పనిచేసిందో చూద్దామని వచ్చింది శ్రీమతి - రొటీన్ పరీక్షకు వార్డులోకి వచ్చిన డాక్టర్‌లాగా. ''ఇంకా కలానికి 'నడిచేకాలమ్' రాలేదు కాబోలు'' అన్నది చిరునవ్వు ముఖంమీద చిలకరిస్తూ!

''సుశీ! ఈ పిల్లలకు ఈ పాట ఎవరు నేర్పారు? బాగా పాడారు!"

ఆమె నా అమాయకత్వానికి పగలబడి నవ్వకుండా నిగ్రహించుకున్నట్లనిపించింది.

"మీరే చెపుతారుగా - విద్యకు నలుగురు గురువులని."

'ఆచార్యాత్ పాద మాధత్తే....' శ్లోకమా నీవంటోంది? అయితే, ఈ సినిమా పాటకు పాతికవంతు గురువు ఆచార్య సి నారాయణరెడ్డిగారంటావా?"

"కవి, సినిమా, రేడియో, టీవి - ఈ నలుగురూ ఆధునిక గురువులు."

"ఆ గురువులకు వీళ్ళు ప్రత్యక్ష శిష్యులా? పరోక్ష శిష్యులా?"

"వాళ్ళమ్మలు కూడా ఈ మధ్య ఈ పాటే పాడుతున్నారు."

"అమ్మమ్మలు, నాయనమ్మలు పాడటం లేదా?"

"తరం మారింది. మా పాటలు పడుచువాళ్లకంటె పరిశోధకులకే ఎక్కువ పనికొచ్చేలాగున్నాయి" అంటూ చిరుకోపంతో చర్రున లోపలికి పోయింది.

ఆమె ఒక తరంలా నడిచిపోతోంది. నాకొక వరంలా వస్తు విచ్చిపోతోంది. అవును. ఆమె, నేనూ మూడు తరాలను చూచాం, వాటి ప్రభావంలో జీవిస్తున్నాం. అదొక తియ్యని అనుభవం. తరాలున్నాయి. తరాల సందులున్నాయి, మార్పులున్నాయి, పరిణామాలున్నాయి. భిన్నత్వం ఉంది; అందులో ఏకత్వం కూడా ఉంది. 'లాలి పాట' ఈ అనేక భిన్నత్వాల్లో నా అనుభూతి కందుతున్న ఒకానొక ఏకతా సూత్రం.

మా అమ్మ సరస్వతమ్మ. శనగలవారి ఆడబడుచు పెద్దగా బడి చదువు చదువుకోలేదు. కాని, ఆమె- పాటల భాండాగారం. చిన్నన్న శనగల శ్రీరామ శర్మ రామభక్తుడు, స్వయంగా పదకర్త. ఆమె పుట్టిల్లు కొప్పర్రు. ఆ ప్రక్కనే పాలపర్రు. అందులో మరో యిద్దరు అన్నలు శనగల హనుమయ్య, గోపాల

కృష్ణయ్యగారలు. వాళ్ళు పాటలు రాయటంలో సిద్ధహస్తులు. మా అమ్మ గొంతులో ఏదో గుప్త గంధర్వగాన శక్తి ఉండేది. ఒకటి రెండుసార్లు వింటే పాటలు, ఫణితితో సహా ధారణ పట్టేది. దానిని జీవితాంతంవరకు జ్ఞాపకం ఉంచుకునేది. వాళ్ళన్నయ్యల కందరికీ మా అమ్మ పాటల కంప్యూటర్‌గా పనికి వచ్చింది. ఆమెకు అన్నలంటే అపారమైన భక్తి. పాట పాడమంటే అన్నగార్ల పేర్లు ముద్రలుగా ఉండే పాటలే సందర్భశుద్ధినిబట్టి పాడుతూ ఉండేది. జీవితంలో జరిగే శుభకార్యా లన్నింటికీ యేయే సమయాల్లో ఎటువంటి పాటలు పాడితే బాగుంటుందో అటువంటి వాటిని, పాడినది పాడకుండా, బంధువులకు వినిపించి పుట్టింటి గౌరవాన్ని ఎవరెస్టుశిఖరమ్మీద కెక్కించేది. ఆమె మెట్టినింటికి తెచ్చినవి శనగల వంశంలో పుట్టిన పదకర్తల పాటల భాండాగారం. చెల్లెళ్ళను, శిష్యరాండ్రను నమ్ముకున్న ఆ పదకర్తలు వారి రచనలను మౌఖిక సంప్రదాయానికే వదిలారు గాని, ముద్రించి ప్రచురించాలని ఎన్నడూ ప్రయత్నించలేదు. దానికి వారి వైరాగ్య దృక్పథం కూడా బాగా తోడ్పడింది. మా అమ్మ ఆ పాటలను ఆదిపూడిలోని మా యింట్లో పాడుతూ ఉండేది. మా నాన్న ఆవేశపరుడు. ఆయనకు శాంతిమంత్రం ఆమె పాట.

మా బామ్మ జాలమ్మ పాటల్లో మాటల్లో మా వంశంలో చిటారుకొమ్మ. ఆమెకు సంప్రదాయ గేయసాహిత్యమంతా నాల్కమీద నాట్యం చేస్తుండేది. పదకర్తల రచనలు ఆమె ధారణలో చాలా నిలిచాయి. రామాయణ భారత భాగవత విశేషాలు పౌరాణికులు చెప్పినవన్నీ ఆమె పుక్కిట పట్టింది. నాకు లాలిపాటలు పాడింది మా బామ్మే. కథలు చెప్పింది బామ్మే. అయిదవ యేటి కంతా రామాయణ భారత భాగవతాలను పక్కలో పడుకోపెట్టుకొని బోధించిందీ ఆమే. ఆమె నా పాలిటి బాలవిజ్ఞానసర్వస్వం.

మా అమ్మకు మా బామ్మ కన్నతల్లేమో అని అనుకుండేవాళ్ళం. సరస్వతమ్మ సామర్థ్యం చూచే కోడలిగా చేసుకున్నదట. మా అమ్మకు పుట్టింటివారిచ్చిన పాటల మూటను మా బామ్మ గౌరవంగా మన్నించింది; తనకు వచ్చిన సంప్రదాయ కీర్తనల నన్నింటినీ కోడలికి నూరిపోసింది. అప్పుడు మా అమ్మ రెండు సంప్రదాయాల అంటుమామిడి.

మా బామ్మ నాకు లాలిపాటలు పాడింది. మొదటిది పదకవితాపితామహుడైన తాళ్ళపాక అన్నమాచార్యుడు రచించింది. "జో అచ్యుతానంద! జోజో ముకుందా!

రావె వరమానంద రామగోవింద" అనే పాటను నామీద వాఙ్మయసమ్మోహ నాస్త్రంగా ప్రయోగించేది. ఇటువంటి పాటలు మరికొన్ని పాడేది. మా అమ్మ అత్తగారి పాటలు రెండు పాడితే, ఆమె అన్నగార్ల పాటలూ రెండు పాడేది. పుట్టింటి, మెట్టినింటి మర్యాదలను మమకారంతో పోషిస్తున్నందుకు మా బామ్మ మా అమ్మను అరోప్రాణంగా చూచుకొనేది.

మా అమ్మ తన కోడలును శనగల వారి వంశంనుంచే తెచ్చుకున్నది. స్వయంగా చిన్నన్న శ్రీరామదాసు కూతురే మా అమ్మ చిన్న కోడలు. ముందే చెప్పింది అన్నగారికి కోడలి కుండాలిసిన గుణాలను గురించి. 'పదకర్తల సాహిత్యం, సంప్రదాయపు పాటలు, శనగల వంశపు పదకర్తల పాటలు ముప్పేటగా నేర్చుకోవటమే కాకుండా, కర్ణాటక శాస్త్రీయ సంగీతంలో వాటిని జనరంజకంగా పాడగలిగితేనే మీ పిల్ల మా యింటికి వస్తుంది; మా సంప్రదాయం నిలుపుతుంది' అని శ్రీరామ శర్మగారు మా యింటికి పిల్లను పంపటమే కాదు, దాదాపు రెండు దశాబ్దాల సంగీత తపస్సును బదిలీ చేశారు. ఆమె మా యింటికి వచ్చింతరువాత మరొక సంప్రదాయం కలిసింది.

మా పెద్దన్న బిదురు వెంకటశేషయ్యగారు దత్తాత్రేయ సంప్రదాయానికి చెందినవారు. ఆయన ఎన్నో పాటలు రాశారు. అవన్నీ మా అక్కయ్య అన్నపూర్ణమ్మ పాడుతుంది. ఆమెకు చిన్నమరదలంటే అదో అభిమానం. నేనూ సుశీ కలిసి శేషయ్యగారి వద్ద ఉన్నప్పుడు ఆయన రాసిన పాటలన్నీ నా శ్రీమతి కంఠంలో మారుమ్రోగేవి. మా పిల్లలకు పాడిన లాలిపాటల్లో ఎప్పుడూ ఒకటి దత్తాత్రేయాంకితంగా ఉంటటం. మా ఆవిడ సాధించిన నవ్యసంప్రదాయం.

ఈనాడు మా కోడళ్లు వాళ్ళ పిల్లలు; మా అమ్మాయిలు, వాళ్ళ పిల్లలు సి.నా.రె.గారి సినిమా లాలిపాట పాడుతున్నారు. అందులో కూడా ఆధ్యాత్మిక స్పర్శ ఉంది కాబట్టే సంప్రదాయంలో అతికింది. మూడు తరాలు మారినా "లాలనుచు పాడరమ్మా ఈ బిడ్డ లక్ష్మీవిలాసుడమ్మా''అనే ఆధ్యాత్మిక అనుభవ మాధురి లాలి పాటల్లో అంతస్స్రూతంగా అజరామరంగా అమృతంగా ప్రవహిస్తోంది! *

(ఆంధ్రభూమి, 20-8-1993)

# పద్యకవితోద్యమ వీరులారా!
# మీ ప్రస్థానం ఏ వైపు?

పద్యానికి మరలా మంచిరోజులు వచ్చేలాగున్నాయి. దాన్ని గురించి పది మందీ బజార్లలోనే కాదు - పత్రికల్లోకూడా చర్చించుకొంటున్నారు. రెండేళ్ళ క్రితం విశాఖ జిల్లా యలమంచిలిలో పద్యకవితా ప్రచారోద్యమం ప్రారంభ మయింది. అందుకుగాను జిల్లా, రాష్ట్రస్థాయి సంఘాలు ఏర్పడ్డాయి. పద్య కవిత్వ మహత్వాన్ని చాటిచెప్పే సభలూ, సమావేశాలు, చర్చలూ, గోష్ఠులూ జోరుగా సాగుతున్నాయి. పద్యకవిసమ్మేళనాలు ప్రత్యేకంగా నిర్వహింపబడు తున్నాయి. పద్య కవితలూ, పద్య నాటకాలూ, పద్య సాహిత్యరూపకాలూ, సమస్యలూ, అష్టావధానాలూ, శతావధానాలూ, ఆశుకవితా ప్రదర్శనలూ, ప్రజలను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. పద్య కవితకు ప్రత్యేక పురస్కారాలు అందించే సంస్థలు చెప్పుకోతగినన్ని ముందుకు వస్తున్నాయి. పద్యం మట్టి కరు స్తుందనీ, మరణిస్తుందనీ చెప్పిన జోస్యాలు నవ్వులపాలవుతున్నాయి. పద్యం భవిష్యత్తును గురించి భయపడే రోజులు పోయాయి. అంతేకాదు, ఎవరైనా పద్యంమీద పల్లెత్తి మాటంటే సహించి ఊరుకుండే రోజులు కూడా దాటిపోయిన ట్లున్నాయి. ప్రజలకూ పద్యానికీ ఏదో అవినాభావసంబంధం ఉన్నట్టుంది. తెలుగులో ప్రజలు ఎన్నడూ పద్యాన్ని తిరస్కరించలేదు.

పద్య కవితోద్యమం సాగిస్తున్నవారు ముఖ్యంగా మూడంశాలు చెప్పుతు న్నారు: 1. పద్యానికి గొప్ప భవిష్యత్తు ఉంది. దానికి చావు లేదు. అది నేటికీ బ్రతికి ఉంది. 2. అయితే, దానికి ఇదివరకున్నంత వ్యాప్తిలేదు. దానిని వెంటనే కల్పించాలి. అందుకు ఉద్యమించాలి. 3. ప్రచారం రెండు లక్ష్యాలతో సాగాలి: ఒకటి - పద్యకవిత్వపు గొప్పదనాన్ని చాటి చెప్పాలి. రెండు - పద్యకవిత్వం రాయడం, చదవడం, విని సంతోషించటం మొదలైనవాటికి సమాజంలో వ్యాప్తిని కలిగించాలి. ముఖ్యంగా ప్రచారం యువతరాన్ని ఉత్తేజపరచాలి. వారు పద్యకవిత రాయాలి.

వ్యాప్తి తగ్గిన పద్యానికి ప్రచారం చేసిపెట్టాలని పద్యకవితోద్యమవాదుల ప్రయత్నంలాగుంది. అందులోనూ రెండు పద్ధతులున్నాయి. పాత పద్యాలే వినిపించి, వాటిమీద ప్రజలలో కొత్త అభిరుచులను మొలకెత్తించటం ఒక పద్ధతి. కొత్త ప్రయోగాలు చేసి, పద్యం బ్రతకడానికి కొత్త బాటలు చూపించటం మరో పద్ధతి. పద్యానికి పునరుజ్జీవనం జనంలో దాని పలుకుబడిని పెంచటంవల్ల మాత్రమే యేర్పడదు. పద్య ప్రాణ చైతన్యాన్ని పెంచే వస్తునవ్యతను, అభివ్యక్తి శక్తిని అభినవంగా సాధించినప్పుడే కలుగుతుంది. కాబట్టి, నేడు పద్యాన్ని గురించి మాట్లాడేవారికి రెండు ప్రశ్నలు ఎదురౌతున్నాయి: పద్యం నేటికీ బ్రతికి ఉందని సంతోషించాలా? లేక - ఆధునిక భావాభివ్యక్తికి అనువుగా జీవించగలుగుతున్నదని సంబరపడాలా? అన్న మీమాంస ముందుకు వస్తున్నది.

బ్రతికి ఉండటం వేరు; సృజనాత్మకంగా జీవితం సాగించటం వేరు; భవిష్యత్తుకు కావలసిన మార్గాన్ని చూపించటం వేరు. మొదటిరకం దశలో ఒకప్పుడు బాగా బ్రతికి ఇప్పుడు గత వైభవంతో కాలక్షేపం చేస్తున్న పద్యం కనవడుతుంది. రెండవ రకంలో ఆధునికంగా, అభినవంగా ప్రయోగాలలో జీవిస్తూ నవ్యయుగ చైతన్యంలో బలమైన పాత్ర నిర్వహిస్తున్న పద్యం ప్రత్యక్షమవుతుంది. మూడవ దశలో భవిష్యత్ ప్రయోగాలకు కావలసిన దార్శనిక శక్తిని సంతరించుకొంటున్న నవ్య పద్యరచనావ్యూహం రూపు కడుతుంది. వద్య కవిత్వంకోసం ఉద్యమించేవారికీ, పద్యకవితోద్యమ భవిష్యత్తును గురించి వివేచించేవారికీ నేటి పద్యం ఏ దశలో ఉందో దాని తెలివిడి మొదట కావాలి. ఆపైన ఉద్యమం యేయే లక్ష్యాలను యేయే వ్యూహాలతో సాధించాలో నిర్ణయించుకోవాలి. ఈమధ్య పత్రికలలో వస్తున్న పద్యకవితోద్యమ చర్చలను విశ్లేషించుకోవటానికి ఈ ప్రాతిపదిక పనికివస్తుంది.

ఈనాటి జీవితానికీ, కాలానికీ పద్యం పనికిరాదనీ, ఆధునిక భావ ప్రకటనను పద్య చట్రంలో బంధించటం అసాధ్యమనీ, పద్యం మనకిప్పు డొక మధురస్మృతి లాంటిదనీ, వద్యయుగాన్ని మళ్ళీ సృష్టించటం సాధ్యం కాదనీ, చరిత్ర వెనక్కు నడవదనీ కల్లూరి భాస్కర్ గారి వాదం, (ఆంధ్రప్రభ - సమాంతరమ్ - 8-3-1993). 'పద్యాన్ని ఆధునిక కవులు ఆధునిక భావాలకు కూడా సమర్థమైన వాహకంగా వాడుకొన్నారు. కొత్త పరిస్థితుల కనుగుణంగా మారగలిగిన కవితారూపం సాహిత్యంలోనుంచి శాశ్వతంగా నిష్క్రమిస్తుందని

జోస్యం చెప్పటం ఇప్పుడు అవసరమా'? అని 'చేరా" కల్లూరిని ప్రశ్నించారు. (చేరాతలు - ఆంధ్రజ్యోతి - 21-3-1993). వీరిద్దరితో మొదలైన ఇటీవలి చర్చ వారం వారం ఏదో విధంగా సాగుతూనే ఉంది. అయితే, సమాజంలోని పద్య రూపం - పైన పేర్కొన్న మూడు దశల్లో ఏరకమైన అస్తిత్వాన్ని సాగిస్తున్నదో వాస్తవంగా అంచనా వేయటంలో కలుగుతున్న దృక్పథ భేదాలే వారి వారి వాదాల్లో ప్రతిఫలిస్తూ ఉన్నాయి.

పద్యం వైయక్తికంగా చదువుకుండే రూపం అనీ, పాట సమూహికంగా వినే రూపమనీ శ్రీ ఎ.కె. ప్రభాకర్ గారి విశ్లేషణ శాస్త్రీయమని చెప్పలేం. పాట ఒకప్పుడు సామూహిక సృష్టిగా ఉండేది. అప్పుడది మౌఖిక సంప్రదాయానికి చెంది ఉండేది. గేయాన్ని శ్రవ్యరూపంగా పరిగణిస్తే పద్యానికి కూడా అటువంటి అస్తిత్వం ఉన్న సంగతి గుర్తించాలి. పద్యం పాడితే కార్మికులు సైతం సామూహికంగా వినే నేటి వాస్తవ స్థితిని మనం విస్మరించకూడదు. కల్లూరి వారన్నట్లు "ఏ కవితా రూపానికైనా ఆదరణ, నిరాదరణ అనేవి మన ఇష్టా యిష్టాలపై ఆధారపడి ఉండవు. విస్తృత పాఠకుల్ని దృష్టిలో పెట్టుకొని చూడాలి. సాహిత్య పరిణామ చరిత్రను గమనించాలి." ప్రభాకర్‌గారి దృష్టిలో శ్రోత లెక్కువగా కనపడుతున్నది పాటకు; కల్లూరివారి దృష్టిలో వచన కవితకు. అయితే, వారి శ్రోతలు వేరు, వీరి శ్రోతలు వేరు. ఇక చేరాగారు ఈ పేచీల జోలికి పోకుండా పద్యానికి నేటి సమాజంలో ఎంత మంది శ్రోతలున్నారు అన్న ప్రశ్నకు ఇప్పుడే సమాధానం చెప్పటం కష్టమనీ, అయితే, పద్యం భవిష్యత్తులో ప్రాచుర్యం పొందజాలదని- దాని శక్తిని గమనించినవారు - అనజాలరనీ అంటు న్నారు. అంతవరకు బాధ్యతగల విమర్శకునిలా చేరా మాట్లాడుతున్నారు.

పద్య భవితవ్యాన్ని గురించి చర్చలు జరుగుతున్న ఈ తరుణంలో పద్య కవితా ప్రచారోద్యమానికి పూనుకొన్న సాహితీవేత్తలు ఉద్యమ భవిషత్తు పద్యం భవిష్యత్తు మీద ఆధారపడి ఉందన్న సంగతి మరచిపోరాదు. పద్యం చనిపో లేదని సంతృప్తిపడితే చాలదు. మరికొన్ని మౌలికాంశాలను కూడా ఆలోచించి నిర్ణయించుకోవాలి. మచ్చుకు—

1. పద్య ప్రచారం కోసం పద్య ప్రక్రియలతోనే ఉద్యమించటమా? పద్యేతర ప్రక్రియలతో కూడా ఉపక్రమించటమా?

2. ఏదైనా ఒక క్రొత్త ఉద్యమాన్ని ప్రారంభించి, దాని భావజాలాన్నీ, వస్తుజాలాన్నీ పద్యరూపంలో ప్రచారం చేయటమా?

3. అసలు ఏదైనా ఉద్యమం కోసమే పద్యంతో ఉద్యమించటమా?

4. ఆధునిక పద్యమనే ఒక రూపాన్నిగాని, వేలాది ఛందస్సులలో అనువైన వాటినిగాని ఆధునిక జీవిత సమస్యల అభివ్యక్తికి అనుకూలంగా ఎన్ను కొని వచన కవితకు రూపాంతరాన్ని కల్పించుకొనే ఉద్యమాన్ని సాగించటమా?

5. పద్యరచనలో క్రొత్త క్రొత్త శైలులను, బాణీలను కల్పించటంద్వారా నిత్య నూతనత్వాన్నీ, ప్రజాభిరుచినీ సృష్టించుకొంటూ ప్రచారాన్ని సాగించటమా?

పద్య కవితోద్యమకారులు పద్యానికి గొప్ప భవిష్యత్తు ఉందని జోస్యం చెపుతున్నారు కాని, దాని చిత్రాన్ని స్పష్టంగా రూపు కట్టించలేకపోతున్నారు. ప్రాణంతో ఉన్న పద్యాన్ని భవిష్యత్ దర్శనంతో సృజనాత్మక శక్తిని ప్రదర్శింప గల్గిన ప్రయోగంగా మార్చగలిగిన వ్యూహాన్ని అమలు చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. అది జరిగినప్పుడే ఉద్యమానికి ఉజ్జ్వల ప్రస్థానం! *

(ఆంధ్రభూమి 11-6-1993)

# 'మరల నిదేల రామాయణంబు?' అన్నంత ప్రశ్న

పద్యాన్ని గురించి ఎక్కడ ప్రస్తావన వచ్చినా దాన్ని క్రొత్త చూపుతో చూచి విశ్లేషించటం ఈమధ్య బాగా ఎక్కువైంది. ఎవరిని కదిలించినా ఏదో తమ నిర్ణయం పద్యంమీద బాహాటంగా చెప్పేస్తున్నారు. పద్యానికీ సమాజజీవి తానికీ ఉన్న బలమైన సంబంధాన్ని తెలుగువారు మరోసారి నెమరువేసుకుంటున్నట్లున్నారు. ఈ చైతన్యాన్ని గుర్తించి సంపత్కుమార షష్టిపూర్తి మహోత్సవం (2-8-1993) సందర్భంగా తెలుగుపద్యం మీద గోష్ఠి నేర్పాటు చేశారు. ఉత్స వానికి ఔచిత్యం తెచ్చిన సాహిత్యాంశం!

గోష్ఠికి శ్రీ జువ్వాడి గౌతమరావు గారు అధ్యక్షత వహించారు. అయిదుగురు ఆచార్యులు మాట్లాడారు. ఒకరు ఎన్నుకొన్న అంశాలను మరొకరు స్పృశించకుండా (కొన్నిచోట్ల భేదిస్తున్నప్పుడు తప్ప) ఒక్కొక్కరు ఒక్కొక్క దృక్కోణంతో సమస్యను సమీక్షించారు. పదిహేనొందలేళ్ళ పద్యవికాస దశలను నిరూపిస్తూ వాటి సమస్యలను పేర్కొన్నారు ఆచార్య సుప్రసన్న. పద్యంలో ప్రాసలు తీసివేసినా ఫరవాలేదని డాక్టర్ నరసయ్యగారు భావించారు. తెలుగువారికి వట్టి పద్యాల కావ్యం కంటె చంపూ రచనయే యిష్టమనీ, తీపికారాల మిశ్రమ రుచినే మనవారు కోరుకుంటారనటానికి అది తార్కాణమనీ ఆచార్య కోటీశ్వరరావుగారు అభిప్రాయపడ్డారు. పెట్టుబడి సమాజం టెక్నాలజీనుంచి వచన కవిత్వం పుడుతుందనీ, ప్రెస్‌లేని దేశంలో వచనకవిత్వం ఉండదనీ, మన జాతిలో పద్యం చావదనీ మంచి విశ్లేషణాత్మక వివేచనం చేశారు ఆచార్య చేకూరి రామారావు గారు. అధ్యక్షుడు గోష్ఠిని రక్తి కట్టించటానికి కొన్ని మెరుపుల్లాంటి స్టేట్‌మెంట్స్ చేసేవారు...."ప్రపంచ మహాద్భుత సృష్టులలో ఒకటి తెలుగు పద్యం" అని ఆవేశంతో ఇంగ్లీషులో ప్రకటించారు. పద్యానికి యతి తీసివేసినా నష్టం లేదని భావించారు. అన్నిటికీ మించి "ఈ పద్యగోష్ఠి అవసరం ఏమిటి?" అని ప్రశ్నించారు. గౌతమరావుగారి ప్రశ్న వ్యంగ్య మార్గంలో వెలువడ్డా, సభికులు నానా విధాలుగా సమాధానాలు చెప్పుకున్నారు.

పద్యగోష్ఠి ఎందుకు? అన్న ప్రశ్న 'మరల నిదేల రామాయణంబు' అన్నంత ప్రశ్నగా అనిపించింది నాకు పద్యం కవులకు, సాహితీపరులకు మాత్రమే సంబంధించిన సమస్యా? లేదా, ఈ తరానికి ప్రత్యేకంగా వర్తించే సమస్యా? నా దృష్టిలో సాహితీపరుల కంటె సామాజికులే ఈనాడు పద్యాన్ని అంతరాంతరాలల్లో కావాలని కోరుకుంటున్నారు. ఎలాగంటే - సంఘంలో ఒక తరం, మరొక తరం వికసించటానికి కావలసిన మార్గాలను అన్వేషించి ఆచరిస్తుంది. మానవబుద్ధి వికాసానికి తోడ్పడే మూలధాతువుల్లాంటివి బాలబాలికల లేత మెదళ్ళలో స్థిరంగా నాటబడే మానవ మూల్యాలు. అవి పాటల్లో నాటాలా? పద్యాల్లో నాటాలా? వచన కవితలలో నాటాలా? అనే సమస్య ప్రతి తెలుగు కుటుంబంలోనూ తల యెత్తుతుంది. పాడి వినిపించే ప్రక్రియ పాట. పఠించి పఠింపజేసే ప్రక్రియ పద్యం. ఈ రెండింటికీ వాటికి దగ్గ నియమాలు వాటి కున్నాయి. పిల్లల మనసులకు పాట హత్తుకుంటుంది. కొన్నాళ్ళు దాని ప్రభావం ఉంటుంది. ఆ తరువాత క్రమంగా కరిగిపోవచ్చు కూడా. పద్యం పిల్లల బుద్ధిలో బీజంగా నాటుకుంటుంది. అది క్రమంగా వారి జీవితాలతోపాటు మహావృక్షంగా పెరుగుతుంది. జీవితమూల్యాలు చెప్పే సూక్తులు పిల్లలపాలిటి కల్పవృక్షాలు. వచన కవిత్వం పిల్లల ధారణకు అంతగా పనికిరాదు.

తెలుగు కుటుంబాల్లోంచి తెలుగే కనుమరుగైపోతున్న ఈ రోజుల్లో - ఈతరం ఎదుర్కొంటున్న ముఖ్యమైన సమస్య - తమ పిల్లలలో మానవ మూల్యాలు జీవితాంతం వికసించేటట్లు జాగ్రత్తలు తీసికోవాలంటే వారి ధారణా శక్తికి పనికివచ్చే రూపం పాటా? పద్యమా? వచనకవిత్వమా? అని. ఇది ప్రశ్నే కాదు- ఒక తరం జీవిత సమస్య. నూరు పద్యాలు నోటికి చెప్పించే పద్ధతిపోయి విద్యార్థులలో వ్యక్తి వికాసం, సంఘనీతి కొరవడి, ఆటవిక నాగరకత విలయ తాండవం చేస్తున్న ఈ రోజుల్లో పిల్లలకు కావలసింది పద్యాలే అనే నిశ్చయానికి తల్లిదండ్రులు రాకతప్పటంలేదు. ఆదునిక జీవితానికి కావలసిన మానవ మూల్యాలను సైతం అందించే పద్యంకోసం ఆంధ్రావళి ఎదురుచూస్తోంది.

ఏ కవితా సమస్యనైనా రాజకీయంగానూ, సామాజికంగానూ, సాహిత్యపరంగానూ వ్యాఖ్యానించటం ఈనాటి ధోరణి. వామపక్షీయులు వచన పద్యాన్ని సమర్థించటం మొదలుపెట్టినప్పటినుండి పద్యం ఫ్యూడల్ వ్యవస్థకు చిహ్నంగా మారింది. ఆ వచనపద్యం మేధావి వర్గానికీ, మధ్యతరగతికీ మాత్రమే పనికివచ్చే

వాహికగా రుజువయిం తరువాత రాజకీయం సామాన్యప్రజల్లోకి పాకాలంటే జానపద బాణీలలో ఉద్యమగేయాలు పనికివస్తాయని తేలింది. ఇప్పుడు వచన కవిత్వం పెట్టుబడిదారీ వ్యవస్థ కన్నబిడ్డ అయింది. అసలీ కవితారూపాలకూ వ్యవస్థలకూ ఉన్న సంబంధం మీద చదువుతున్నవారిలోనే తర్జనభర్జన లున్నాయి. సమాజ పరిస్థితులు ఆయా కాలాల్లో అవసరాన్నిబట్టి ఒక శక్తిమంతమైన కవితా రూపాన్ని సృష్టించుకొంటాయి అని కొందరు భావిస్తే, రాజకీయ వ్యవస్థలు తమ ప్రాపకం కోసం అవసరమైతే క్రొత్తరూపాలను కల్పించుకొంటాయి అని కొందరు వ్యాఖ్యానం చేస్తారు. ఏ సాహిత్యాంశాన్నైనా వామపక్ష రాజకీయ దృష్టితో విశ్లేషించే పద్ధతికి దీటైన మరో పద్ధతి పటిష్ఠంగా తెలుగులో రూఢికెక్కలేదు. అందువల్ల పద్యగోష్ఠులలో కూడా పద్య రాజకీయాలకు ఒక సరితూకం లేకుండా పోయింది. ఈనాడు ప్రతిపార్టీ తన రాజకీయాన్ని పాటగా వినిపిస్తోంది. కాని, పద్యాన్ని పట్టించుకోవటం లేదు.

అయినా రాజకీయం పద్యాన్ని చంపలేకపోతోంది. పద్యానికి సామాజిక స్పందన సహజశక్తిగా ఉండటం దానికి కారణం. తెలుగువారికి - గానానికి గేయం; పఠనానికి పద్యం - ఈ రెండూ రెండు ప్రయోజనాలకోసం కావాలి. రాజకీయం ప్రజలనుంచి సద్యఃఫలాన్ని కోరుతుంది కాబట్టి, గేయాన్ని ఆశ్రయిస్తుంది. రాజకీయాలకు అతీతమైన మానవ జీవిత మూల్యాలను తెలుగువారు పద్యంలోనే పొందగలుగుతారు.

ఇక సాహిత్యపరంగా ఆలోచిస్తే అదొక పెద్ద కథ. మన రాష్ట్రంలో మూడు దశాబ్దాల పద్యవ్యతిరేకోద్యమాల దాడులకు గురియై కూడా ఇంకా పద్యం బ్రతికే ఉంది. ఆధునిక వచనకవితారచనాశిల్పాలను చవి చూచిన తర్వాత 'పద్యం అర్థంకాదు' అన్నవాదం అర్థంలేనిదని అర్థమయింది.జాతి జీవచైతన్యానికి పద్యానికి ఉన్న అవినాభావ సంబంధాన్ని తెలుగువారు మరలా తెలుసుకుంటున్నారు.

ఒక కాలంలో కవిత ఒక మహాకావ్యాన్ని నిర్మించుకొన్నప్పుడు తన అస్తిత్వం సార్థకమైనట్లు భావిస్తుంది. మన దేశంలో భిన్న రాజకీయ సిద్ధాంతాలున్నాయి. భిన్న సంప్రదాయాలున్నాయి. వాటిమధ్య సంఘర్షణలు వస్తున్నాయి. రక్తపాతాలు సాగుతున్నాయి. అయినా, శాంతికోసం అన్వేషణ సాగు

తూనే ఉంది. ఈ భారతదేశపు అంతర్వేదనను చిత్రించే ఒక మహాకావ్యం రావాలని సాహితీలోకం ఆకాంక్షిస్తోంది. అయితే, అది ఏదో ఒక మార్క్సు కవిత కావటం వారికి ఆమోద యోగ్యం కాదు!

గేయంలో వచ్చిన రచన ఎంత పెద్దదైనా తెలుగులో దానికి మహాకావ్య గౌరవం రావటం కష్టం; అసాధ్యమని అనటం లేదు. వచన కవిత్వంలో ఆధునిక మహాకావ్యాలు కొన్ని వచ్చాయి. అవి చాలావరకు ప్రజల చెవులదాకా పూర్తిగా పోలేదు. ఒక కాలంలోని జాతి జీవిత మధనాన్ని అన్ని తరగతుల వారికీ అందించే శక్తిమంతమైన వాహిక పద్యమనే భావం రానురానూ బాగా బలపడుతోంది. ఆ వైపు సాహితీలోకం ఆశగా చూస్తోంది.

మిత్రులు శ్రీ గరికిపాటి వెంకట బసవ నరసింహారావు 1988 లో 'మన భారతం' అనే పద్యకావ్యం రాశారు. మహాభారతంలో లాగా అందులోనూ 18 పర్వాలున్నాయి. ఒక్కొక్క పర్వంలో 18 పద్యాలున్నాయి. ఆయన 'రాజకీయ పర్వం'లో ఇలా అన్నారు—

"జీవితరాజకీయముల జీర్ణము చేసుకొనంగ చాలదీ
జీవితమెల్ల, దేశమును చీల్చి భుజించెడి క్షుద్రశక్తులన్
చావగజేసి, యెల్లరకు శాంతి నొసంగుట మాట లౌనొకో!
భావన, సాధనా పటిమ, బాయని దీక్షయు తోడు కావలెన్."

పద్యానికికూడా నేడు ఈ మూడూ తోడు కావాలి!

(ఆంధ్రభూమి 3-9-1993)

# పదిరకాల పద్యకవులు

డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డిగారు ఆగస్టు 24 వ తేదీ పుట్టిన రోజు పండుగ వేడుకలు జరుపుకుంటూ పద్యకవి సమ్మేళనాన్ని ఏర్పాటు చేసి తమ పద్య కవితాభిమానాన్ని చాటుకున్నారు. ఆ సభలో నేను నిశ్శబ్ద శ్రోతగా పాల్గొన్నాను. నే నెంత ఒంటరిగా కూర్చుందామనుకున్నా తెలిసిన మిత్రులు చుట్టూ మూగి పలకరించటం, ఒక్కోసారి చర్చలు సాగించటం సాధారణమే. అలాగే ఆనాడు ఒక పత్రికా ప్రతినిధి నా పక్కనే చేరాడు. విశేషాలు అడిగి తెలుసుకుందామనే ఆసక్తితో నన్ను ఒక ప్రశ్న అడిగాడు - ''సుబ్రహ్మణ్యం గారూ! ఇప్పుడు పద్యాలు రాస్తున్న కవులు ఎన్ని రకాలుగా ఉన్నారో ఏమైనా అంచనా వేసి చెప్పగలరా?" అని. వార్తకు తగిన ప్రశ్న వేసినందుకు ఆ మిత్రుణ్ణి అభినందిస్తూనే నాకు తెలిసినంత మేరకు మాత్రమే నేను చెప్పగలనని, నా పరిమితిని నేను బయటపెట్టుకుంటూనే సమాధానం చెప్పాను.

పద్య కవులు నేడు పది రకాలుగా కనబడుతున్నారు. వారు పద్యాలు రాసే పద్ధతులనుబట్టి ఈ పరిగణనం చేస్తున్నాను. ఆ పదిరకాల వారిని లెక్కిస్తే యిలా ఉంటారు స్థూలంగా—

1. పద్యాల్లో మాట్లాడేవారు.
2. పద్యాల్లో పోట్లాడేవారు.
3. పద్యాల్లో ఆశువు చెప్పేవారు.
4. పద్యాల్లో చాటువులు పలికేవారు.
5. పద్యాల్లో జాతివార్తాచమత్కారాలు చేసేవారు.
6. పద్యాల్లో సూక్తులు చెప్పేవారు.
7. పద్యాల్లో ప్రబోధం చేసేవారు.
8. పద్యాల్లో ప్రయోగాలు చేసేవారు.
9. పద్యాల్లో శిల్పాలు చెక్కేవారు.
10. పద్యాల్లో పారడీలు కట్టేవారు.

వీటిల్లో కొన్ని రకాలు పునరుక్తులుగా అనిపించినా, ప్రతి రకానికి ఒక ప్రత్యేక రచనా పద్ధతి సూక్ష్మంగా పరిశీలిస్తే కనపడుతుంది. కాబట్టి, పది రకాల పద్య కవుల విభాగం సమంజసమే. మాటవరసకు- పద్యాల్లో మాట్లాడేవారూ, ఆశు కవిత్వం చెప్పేవారూ ఒకే రకం కవులుగా పైకి కనపడతారు. స్వయం ప్రేరణతో గాని, పర ప్రేరణతో గాని ఆశువుగా పద్యాలు చెప్పే కవికి వేగంగా ధారతో చెప్పటమే ముఖ్యం. పద్యాల్లో మాట్లాడే కవి ఏ అంశం ఎన్నుకున్నా దానిమీద ఒక చిన్న ఉపన్యాసం దంచుతున్నట్లు పద్యాలను నడుపుతాడు. ఆశువులు సాధారణంగా ముక్తకాలుగా ఉంటాయి. మాట్లాడుతున్నట్లుండే పద్యాలు కనీసం ఖండ కావ్యాలుగా ఉంటాయి. ఈ మధ్య అవధానాదుల్లో ఆశువు లెక్కువగా వినపడుతున్నాయి.

ఈ రోజుల్లో మాట్లాడే పద్యాలకన్న పోట్లాడే పద్యాలకే ఎక్కువ జనాదరణం కలుగుతోంది. ఉదాహరణకు కళాప్రపూర్ణ యస్.టి. జ్ఞానానంద కవిగారి ఈ రెండు రకాల పద్యాలు గమనించండి—

1. మాట్లాడుతున్నట్లుండే పద్యం—

''ఈ గూండాయిజ మడ్డువా డొకడు లేడే? యున్నచో వాడు వా
దే గూండా యగు చోట దేశమున కేదీ రక్ష? యీ తీరులో
భాగస్వాములు కాకపోదురె వచింపన్ నాయకోత్తంసు లీ
లాగీ దేశము సాగుచో శుభము లెట్లబ్బున్ సమీక్షింపగన్?''

2. పోట్లాడుతున్నట్లుండే పద్యం—

''ఇదిరా? నీదటరా? యదే నుదువురా యీ సొమ్ము నీ యబ్బగా
రిదిరా? కాదు ప్రజాధనమ్మగునురా! యీనాటికిన్ గూడ న
భ్యుదయార్థంబను పేరుతో జరుపు నీ మోసమ్మికెన్నాళ్ళు సా
గదురా! నిద్దురనుండి లేచినది లోకం బెల్ల గుర్తింపరా!''

ఆలోచిస్తున్నట్లు మాట్లాడిందానికంటె ఆధునికులకు ఉద్యమిస్తున్నట్లు పోట్లాడటం మీద మక్కువ ఎక్కువ. ఇది కాలానికి సంబంధించిన అభిరుచి. చాటువులలో కూడా తిట్టు పద్యాల మీద ఎక్కువ మోజు చూపిస్తున్నారీనాటి సాహితీప్రియులు.

ఆధునిక సాహిత్యంలో వచన కవిత్వం రాసేవారూ, గేయ కవిత్వం రాసేవారూ, పద్య కవిత్వం రాసేవారూ సూక్తులుగా చెప్పుకోటానికి వీలైన కవిత

లను అధిక సంఖ్యలో వెలువరిస్తున్నారు. ప్రపంచ పదులు, రుబాయీలు, గజళ్లు, గేయాలు, వేమన పద్యాల్లాంటి పద్యాలు ఈ రోజుల్లో బహుళ ప్రచారం పొందు తున్నాయి. సామాజిక స్పృహతో కవిచేసే సమీక్షలన్నీ సూక్తులుగా జాలువారు తున్నాయి. పద్యాల్లో- విశేషించి శతకాల్లో, సూక్తులు చెప్పటం సుకవి లక్షణంగా ఈనాడు చెలామణి అవుతూ ఉంది.

జాతివార్తాచమత్కారాలు చేయితిరిగిన కవులు చేయగలరు. ఉత్పల సత్యనారాయణాచార్యుల వారి కలం ఈ శాఖకు పారిజాతాలను పూయిస్తోంది. అధిక్షేప, వ్యంగ్య చమత్కార రచనలు కూడా ఈ పద్ధతికే వర్తిస్తాయి. అయితే,పారడీ పద్యాలను మాత్రం ప్రత్యేకంగా గణించకతప్పదు. అప్పుడప్పుడు నేటికి పేరడీ పద్యం అపూర్వంగా వినపడుతూనే ఉంది.

రాయప్రోలు వారి ప్రబోధ కవిత్వ శాఖ నాటికి నేటికి పద్యకవితలో అవిచ్ఛిన్నంగా సాగుతూనే ఉంది. ప్రబోధానికి సీసం ఒక రూఢి కెక్కిన పద్య వాహిక. మచ్చుకు డాక్టర్ జ్ఞానానంద కవిగారి ఈ ఆధునిక ప్రబోధ సీసపద్యం గమనించండి—

"బలవంతమున నాడ పడచులన్ మ్రింగు క
　　న్యాశుల్క దావాగ్ను లారుదాక
మెతుకులే గతిలేక సతమతమౌ వారు
　　దారిద్ర్య రేఖను దాటుదాక
కులములు లేని క్రొంగొత్త చందమ్ములో
　　సంఘ నిర్మాణమ్ము సాగుదాక
వెట్టితలలు దాల్చు బీభత్సకారుల
　　యుగ్రవాదపు చర్య లుడుగుదాక
కూడుగుడ్డ గూడుకొఱకు తిప్పలువడ్డ
యార్తజనుల యెదల హర్షకాంతి
పరిఢవిల్లుదాక బాష్ప సందేశమ్ము
భువనతలము మారుమ్రోగుగాక!"

ప్రబోధం సామాజిక చైతన్యపు టంచులను తాకుతూ క్రొత్త దారులలో పయనం చేస్తున్న తీరు జ్ఞానాందకవిగారి సీసం జ్ఞాపకం చేస్తున్నది.

ఆధునిక పద్య ప్రయోగాల్లో ఆరుద్ర, దేవిప్రియ, ముళ్ళపూడి రచనలు పేర్కొనవచ్చు. అయితే, ఆరుద్ర ప్రయోగాన్ని చమత్కారంవైపు నడిపిస్తే, ముళ్ళపూడి సచ్చిదానందమూర్తి ప్రయోగాన్ని శిల్ప సుందరంగా తీర్చిదిద్దే పద్ధతిలో పయనింపజేశాడు. విశ్వనాథ సత్యనారాయణగారు మధ్యాక్కరల్లో పది శతకాలు రాసి ఆ ఛందస్సుకు ఒక అభినవ ప్రయోగ శక్తిని చేకూర్చిపెట్టారు. ముళ్ళపూడివారు ఆ బాటలో సాగి, మధ్యాక్కరను మధురంగా ఆవిష్కరిస్తూ మూడు శతకాలను రాశారు. తాత్త్విక చింతకు ఒక మచ్చుతునక:

"ఏల బంపించితివయ్యా? ఈ అద్దె కొంపకు నన్ను
ఖాళీ చేయు మని వెగటుగ కసరుదు రటు నిటుగాక
వ్రేలాడు చుంటి స్వస్థలము విడిచి వచ్చి మతిలేకిపుడు
నిలుగుచుంటి యాదగిరి నిలయ శ్రీ లక్ష్మీనృసింహా!"

పరాకుగా లెక్కవేస్తేనే పది రకాల పద్యకవులు కనపడుతున్నారు. పట్టుమని లెక్కపెట్టి విశ్లేషిస్తే మరింకో పది రకాలు బయటపడవచ్చు. ఏమైనా, అన్నిరకాల పద్యకవులూ కవిసమ్మేళనంలో ఒక్క వేదికమీద తారసిల్లితే అభినవ పద్య హరివిల్లు కళాప్రపూర్ణంగా అవతరించినట్లే అనిపిస్తుంది! సెప్టెంబరు 11, 12 వ తేదీలలో విజయవాడలో జరుగనున్న పద్యసభల్లో ఆ దృశ్యాన్ని దర్శించవచ్చునేమో! *

(ఆంధ్రభూమి 10-9-1993)

# ప్రపంచం వింటున్న పద్యం

పద్య కవితోద్యమ ద్వితీయ వార్షిక సభలు విజయవాడలో సెప్టెంబరు 11, 12 తేదీలలో విజయవంతంగా జరిగాయి. డా॥ నండూరి రామకృష్ణమాచార్య, శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి, డా॥ కోవెల సంపత్కుమారాచార్య, డా॥ నాగళ్ళ గురుప్రసాదరావు, డా॥ వి.వి.యల్. నరసింహారావు, ఆచార్య ఎస్. వి. రామారావు, శ్రీ పేరాల భరతశర్మ, డా॥ జె. బాపురెడ్డి, శ్రీ సి. రాఘవాచార్య, కళాప్రపూర్ణ పోతుకూచి సాంబశివరావు, డా॥ జె. మృత్యుంజయరావు, ఆచార్య కె. మలయవాసిని, శ్రీ రసరాజు, శ్రీ బులుసు వెంకటేశ్వర్లు మొదలైన కవి పండితు లెందరో సభల్లో పాల్గొన్నారు. నేను కూడా సమాపన సదస్సులో 'తెలుగు పద్యం - ఉద్యమ స్వరూపం' అనే అంశంమీద మాట్లాడాను. ఆ సందర్భంగా 11 వ తేదీ సాయంకాలం జరిగిన కవి సమ్మేళనంలో 47 మంది పద్య కవులు పాల్గొన్నారు. పద్నాలుగేళ్ళ బాలుడు అష్టావధానం చేయటం, అతనిని అభినందిస్తూ ఎందరో ఆశువుగా పద్యాలు చెప్పటం విశేషం. డా॥ బాపురెడ్డిగారు సద్యఃస్ఫూర్తితో ఆశువుగా పద్యం చెప్పి ధారనూ, ధారణనూ ప్రదర్శించటం మరొక విశేషం. పద్య పఠనంలో పెద్దలకూ, పిల్లలకూ రెండు వర్గాలుగా పోటీలు పెట్టి ఒక్కొక్క వర్గంలో ఉత్తమంగా చదివినవారికి విరివిగా బహుమతు లివ్వటం అభినందనీయమైన అంశం. విజేత లందరూ బహుమతు లందుకొనేటప్పుడు భావస్ఫోరకంగా రాగయుక్తంగా పద్యాలు చదివి సభికులకు శ్రవణానందాన్ని కలిగించారు. శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు 'ప్రసన్న భారతి' అనే సాహిత్య సాంస్కృతిక పత్రికను పద్య కవితోద్యమానికి పోషకంగా 1993 విజయదశమి నుండి త్రైమాసిక పత్రికగా తమ సంపాదకత్వంలో వెలువరిస్తున్నారు. క్రమంగా మాసపత్రికగా మార్చాలని యోచిస్తున్నారు. కార్యదర్శి శ్రీ ఎస్. వెంకట్రావుగారు ఉద్యమవ్యాప్తి విశేషాలను వివరించారు. రాష్ట్రం నలుమూలల నుండి నూరుకంటె మించిన సంఖ్యలో వచ్చిన పద్య కవితోద్యమ ప్రతినిధులతో సభలు చైతన్యవంతంగా సాగాయి. ఉద్యమం నిలువదొక్కుకున్న జాడలు స్పష్టంగా గోచరించాయి.

ఇక్కడ ఒక విషయం గమనించాలి. విజయవాడ సభలకు వచ్చినవారే పద్య కవితాభిమానులని భావిస్తే అది మొదటి పొరపాటు. లక్షలాది ప్రజల ఆదరాభిమానాలు ఆ సభల వెనుక - అంటే తెలుగు పద్యం వెనుక-ఉన్నాయని మనం గమనించాలి. కవులు, గాయకులు, కళాకారులు, రసికులు, తాత్త్వికులు, ప్రవక్తలు, వక్తలు, సామాన్య ప్రజలు, ఆచార్యులు, అవతార పురుషులు కూడా పద్యాన్ని ప్రేమించి, అభిమానించి, రచించి, గానం చేసి ప్రజల హృదయాలలో దానికి ప్రాణప్రతిష్ఠ చేస్తున్నారు. పద్య కవితోద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొంటున్నవారికంటె పరోక్షంగా చేయూతనిస్తున్నవారి సంఖ్యయే ఎన్నో రెట్లు అధికం. అయితే, వారిని లెక్కించకుండా ఉండటం కూడా అసహజమే.

సొంత బాణీలలో పద్యాలు పాడగలిగిన కవులకు ఆంధ్రులు ఇప్పటికీ బ్రహ్మరథం పడతారు. కవులు పద్యానికి ఒక శైలీ, పాడటానికి ఒక బాణీ తప్పక ఏర్పరుచుకుంటే రసికుల నాల్కల మీదకు పద్యం ప్రవహిస్తుందని ఉద్యమ చరిత్ర చెపుతున్నది. ఘంటసాల, మాధవపెద్దివంటి నేపథ్య గాయకుల స్వరాలతో పద్యాలు వెలువడ్డా, రంగంమీద నటులుగాని, సాహిత్యరూపకాలు ప్రదర్శించే పండితులుగానీ, హరిదాసులుగానీ, పద్యాలను పాడినా సామాన్యులు సైతం పద్యాలను సంభాషణకు అలంకారాలుగా ఆవిష్కరించగలుగుతారు. మహావక్తలుగా ప్రసిద్ధిగాంచినవారూ, అధ్యాపకులూ, రాజకీయ నాయకులూ, ప్రజాసేవకులూ వారివారి ఉపన్యాసాల్లో పద్యాలను హృద్యంగా లయబద్ధంగా ఉదాహరిస్తే పద్యాలు జీవితవిధానంలో, సాంస్కృతిక ప్రవాహంలో తరంగాలుగా జాలువారుతాయి. విశ్వనాథ, జాషువా, పుట్టపర్తివంటి కవులూ, దివాకర్ల వేంకటావధానిగారిలాంటి మహావక్తలూ, అధ్యాపకులూ, సంజీవయ్యగారివంటి రాజకీయ నాయకులూ, పద్యాలు లేకుండా మాట్లాడేవారు కాదు. ఇప్పుడూ ఆ పద్ధతులను పాటిస్తున్నవారు ఎందరో ఉన్నారు. పల్లెపట్టులలో భారత భాగవత రామాయణ ప్రబంధాదులలో బలమైన ప్రవేశమున్న రైతుపెద్దలున్నారు. స్త్రీలున్నారు. వారందరు పద్యానికి నేటికీ పునాదిరాళ్ళ వంటివారు.

వీరందరూ ఒక యెత్తు. తాత్త్వికులు, పౌరాణికులు, ప్రవక్తలు, ఆచార్యులు, పీఠాధిపతులు, అవతార పురుషులు వారి వేదాంత ప్రసంగాలలో పద్యాలను సమయోచితంగా ఒక మధురమైన బాణీలో పాడటం తెలుగువారి సంస్కృతిలో సజీవ మర్యాద. కీ.శే. లక్ష్మణయతీంద్రులు, కుర్తాళపీఠాధిపతులు

పద్యాలు చదువుతుంటే నిన్న మొన్నటిదాక ప్రజలు ఎంతో మక్కువతో వినే వారు. ఇప్పుడు పూజ్యులు సుందర చైతన్యానంద స్వామి, చిన జియ్యరుస్వామి మొదలైనవారు చదివే ప్రసిద్ధ పద్యాలను ఆకర్షణతో ఆంధ్రులు వింటున్నారు. వీరందరి కంటె విలక్షణమైన పద్ధతి భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారిది. వారి దివ్య ప్రవచనాలన్నీ తెలుగు పద్యంతో లేదా పద్యాలతో మొదలౌతాయి. నడుమ నడుమ పద్యాలు తరంగాల్లాగా దొర్లుతుంటాయి. చివరకు భజనతో ప్రవచనం ముగుస్తుంది. ఈ బాణీ శ్రీ సత్యసాయి బాటగా, పద్యానికి ఊతగా సాగుతున్నది. బాబా పద్యాలలో చాలావరకు ఆశువులు కావటం విశేషం. కొన్ని మాత్రం ప్రాచీన కవులవీ, సమకాలీన కవులవీ వారుదాహరించి ఒక లౌకిక మర్యాదను కూడా పాటిస్తారు. 'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని కావ్యాని ప్రథంతే' అనే కావ్యనియమాన్ని పద్యంతో ప్రవచనానికి ప్రసాదించిన గౌరవం భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారికే దక్కుతోంది.

బాబావారు బాల్యంలోనే ఆశువుగా పాటలు, పద్యాలు చెప్పేవారు. ఆ తరువాత భజనలు తామే స్వయంగా కూర్చి చెప్పేవారు. 1949 అక్టోబరు 20 వ తేదీనాడు తాను 'సాయిబాబా'నని ప్రకటించుకొని, తొలి భజన 'మానస భజరే గురుచరణం' చెప్పారు. వచనాన్ని లయబద్ధంగా, శబ్దాలంకార సుందరంగా, అలవోకగా చెప్పగలిగే పోతనగారి వాక్శక్తివంటిది బాబాగారికి సహజం.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు 1953 విజయదశమినాడు మొదటి దివ్యోపన్యాసాన్ని ఇచ్చారు. అప్పుడే ప్రవచనాన్ని పద్యంతో మొదలుపెట్టే సంప్రదాయాన్ని ప్రారంభించారు. అంటే తెలుగుపద్యానికి ప్రవచన ప్రక్రియలో ప్రథమ తాంబూల మిచ్చి గౌరవించే తెలుగుదనానికి వారు ప్రాణం పోశారన్న మాట! ఆ మర్యాద ఇప్పటికి నాలుగు దశాబ్దాల గణనీయమైన అవిచ్ఛిన్న జీవితాన్ని సాగించింది. అది ఇకముందూ కొనసాగుతుంది.

బాబావారి భక్తులు ప్రపంచమంతా వ్యాపించి ఉన్నారు. ఇప్పటికి 112 దేశాలలో శ్రీ సత్యసాయి సేవా సంస్థలు పనిచేస్తున్నాయి. మరికొన్ని దేశాల్లో భక్తులున్నారు కాని, సంస్థలు సమగ్రంగా రూపొందలేదు. పాశ్చాత్యభక్తులు అధికసంఖ్యలలో స్వామిని దర్శించుకోటానికీ, తమ ఆధ్యాత్మిక సాధనలకు మార్గ దర్శకత్వాన్ని పొందటానికీ ప్రశాంతినిలయానికీ, త్రయీబృందావనానికీ (వైట్ ఫీల్డ్, బెంగుళూరు) బాబా ఎక్కడ ఉంటే అక్కడికి యేడాదిపొడుగునా వస్తూ

ఉంటారు. బాబావారు తెలుగులోనే ప్రవచనాలిస్తారు; తెలుగురాని వారు తెలుగును దేవభాషగా భావించి వింటారు, ఆంగ్లానువాదం వారికి ఆలంబనంగా మాత్రమే ఉంటుంది. బాబా మాట్లాడే భాషను నేర్చుకోవటం, సూటిగా బాబా మాటలను అర్థం చేసుకొనే యత్నం చేయటం ఆంధ్రభాషేతరులందరికీ ఆధ్యాత్మికసాధనలో ఒక భాగంగా మారిపోయింది ఏ భాషవారైనా, ఏ దేశంవారైనా, మంగళహారతి తెలుగులోనే పాడతారు; పద్యాలను ధారణలో నిలపటానికి యత్నిస్తారు. వారందరూ తెలుగు భాష తియ్యందనాలను స్వయంగా ఆస్వాదిస్తున్నారు.

ప్రశాంతి నిలయం దర్శిస్తే, అక్కడి వివిధ దేశాల ప్రజల సహజీవనం గమనిస్తే, ప్రపంచం ఒక ఆశ్రమంలో ప్రతిఫలించినట్లు అనిపిస్తుంది. శతాధిక దేశాలనుండి వచ్చిన భక్తులు సమాహితంతో బాబా ప్రవచనం వినటానికి మొదలు పెట్టినప్పుడు మొట్టమొదట వారికి శ్రవణానందం కలిగించేది తెలుగు పద్యం. అంటే, బాబావారి ప్రవచనంలోని పద్యం ప్రపంచం వింటున్న పద్యం అన్నమాట! పద్యానికి ప్రపంచవ్యాప్తిని కలిగిస్తోంది భగవాన్ బాబావారే!

పద్య కవితోద్యమం నడిపేవారు పద్యానికి ఎన్ని శక్తులున్నవో, ఉద్యమానికి ఎన్ని స్రోవలున్నవో మొదట లెక్కించాలి. వాటన్నిటినీ సమీకరించి సమన్వయించి సమగ్రఫలాన్ని సాధించాలి. పద్యం ఆంధ్రప్రదేశానికే పరిమితం కాదు; అఖిల ప్రపంచాన్నీ ఆకర్షిస్తున్న అపూర్వశిల్పం! *

(ఆంధ్రభూమి 1-10-1993)

# పద్యకవితా 'బాష్పాంజలి'

"అది, ముప్పది సెప్టెంబరు
తుది, పందొమ్మిది వందల తొంబది మూడై
నది, నాలుగు గంటల దరి
ఉదయము, మహారాష్ట్ర మృత్యు ఊయల యయ్యెన్."

బాపురెడ్డిగారి ఈ పద్యం మహారాష్ట్రలోని ఉస్మానాబాదు, లాటూరు మండలాలలో జరిగిన ఘోర భూకంపంలో ప్రాణాలు కోల్పోయిన వేలాదిమంది ప్రజల విషాదాంత గాధను తెలిపే చరిత్ర శాసనంలో శిలాఫలకం మీద వ్రాసి ఉంచదగిన కాలసూచి.

దేశంలోగానీ, రాష్ట్రంలోగానీ ఉపద్రవాలు జరిగినపుడు కవులు తీవ్రంగా స్పందించి. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని ప్రత్యేక కవితా సంకలనాలు ప్రకటించటంద్వారా తమ కర్తవ్యాలను చాటుకున్నారు. చైనా దాడి జరిగినప్పుడు, పాకిస్తాన్ యుద్ధం వచ్చినప్పుడు, దివి సీమలో ఉప్పెన తాండవించినప్పుడు, మిలిటెంట్ల కుట్రలకు మహా నాయకులు నేలకూలినప్పుడు-ఇలా ఎన్నో విపత్కర సన్నివేశాలకు గుర్తులుగా తెలుగులో కవితా సంపుటులు వచ్చాయి. సెప్టెంబర్‌లో జరిగిన భూకంప ప్రళయానికి గుర్తుగా 'బాష్పాంజలి' అనే కవితా సంపుటి ఈ మధ్య- అంటే, అక్టోబరు 27వ తేదీన రవీంద్రభారతిలో విడుదల అయింది. సహజకవి మల్లెమాల దానికి సంపాదకత్వం వహించారు. అందులో వారితోబాటు గుంటూరు శేషేంద్ర శర్మ, నండూరి రామకృష్ణమాచార్య, డా॥ జె. బాపురెడ్డి, డా॥ ఉండేల మాలకొండారెడ్డి, డా॥ వి.వి.యల్. నరసింహారావు, డా॥ అంతటి నరసింహం, పోలాజు నాదబ్రహ్మచారి, రాజహంస, కనమలూరి వెంకటశివయ్య గారలు కవితలు రాశారు. మల్లెమాలగారికి పద్యకవిత మీద ఉండే అభిమానం వలన ఈ కవితా సంపుటి పద్యకవితలతోనే వెలువడింది. ఇతర సందర్భాలలో వెలువడిన కవితా సంపుటుల కంటే దీనికున్న విలక్షణత్వం అది. భూకంపం మీద పద్య కవితలేగాక వచన కవితలు కూడా వివిధ పత్రికలలో వెలువడ్డాయి. వాటినన్నింటిని కలిపి ఒక సంపుటిగా వెలువరించవలసిన అవసరం కూడా

ఉంది. ఇప్పటికీ ఈ 'బాష్పాంజలి' తెలుగు పద్య కవులు కొందరు భూకంప మృతుల కర్పించిన కన్నీటి శ్రద్ధాంజలి.

వస్తు వొక్కటే కాని, పదిమంది కవుల పద్య రచనా వైఖరులలోని వైవిధ్యం ఈ సంపుటిని చైతన్యవంతం చేసింది. కరుణరస గంభీరమైన ఆ వస్తువును భావించటంలో, వ్యక్తీకరించటంలో ఒక్కొక్క కవి తనదైన పద్ధతిని ప్రదర్శించి, పఠితలు ఆర్ద్రమైన అనుభూతిని పొందేటట్లు చేశాడు.

సహజకవి మల్లెమాలగారి పద్యానికి ఆశువు అంతరాత్మ; చాటువు రూప వైభవం; సహజోక్తి జీవితం; భావావేశం ప్రాణం. వాస్తవస్థితిని రూపు కట్టించి పఠిత మనసు నాకట్టుకొనే శక్తి మల్లెమాల కవితకు సహజగుణం.

"నిరతాన్నదానమ్ము నెరపుచుండిన వీడు
నూకలు చెల్లిన పాక నేడు"

అని సాగే సీసం—

"ముందు రోజున ఆగక మ్రోగుచున్న
మేల మంగళ తూర్య నాదాల నడుమ
పల్వురికి పెళ్ళివేడుక పంచినట్టి
వీడు....దుర్భరమగు వల్లకాడు నేడు" అంటూ ముగుస్తుంది.

జీవ చైతన్యంతో తొణికిసలాడే నేల ఒక్క క్షణంలో ఎలా వల్లకాడుగా మారిపోయిందో తులనాత్మక దృష్టితో చిత్రించిన వాఙ్మయ చిత్రం ఇది. ఆ సన్నివేశంలో పెల్లుబికిన శోక తీవ్రతను మాటలలో చెప్పలేనంతగా స్ఫురించేటట్లు చిత్రంగా కవితలో చమత్కరించారు మల్లెమాల.

"అతి భయానకముగ అపుడు పెల్లుబికిన
ఆర్తనాదములకు అదరి బెదరి
చలన రహితమైన శవములు సైతము
వెక్కి వెక్కి యేడ్చె నొక్క క్షణము."

శవాలు సైతం ఒక క్షణం వెక్కి వెక్కి యేడ్చాయని చెప్పటం నిజమైన కవిత్వం.

శేషేంద్ర శర్మగారు భావుకుడైన ప్రౌఢ కవి. వాస్తవానికి తత్త్వ వ్యాఖ్యానం చేయటం ఆయన స్వభావం. భూమి కంపించి బిద్ధలు కావటం శేషేంద్ర కవితా భావనలో —

"ఇది భూకంపము గాదు ధర్మగవి తానేకైక పాదంబుపై
కదలంజాలక మోరయెత్తి యతి శోకవ్యాకులోద్వేగియై
యదునాథా! మదమత్త దుష్టజన సంహారార్థమై వత్తు, నే
నిదిగో యంచొక 'గీత మిచ్చితిని, రావే' యన్న విస్ఫోటమే!"

వస్తువును భావనామయం చేయటంలో శేషేంద్ర రాయలవంటివాడు ఆధునికులలో.

అలంకారాలను భావ చిత్రాలుగా మలుస్తూ, పఠితల మనసులకు ఆ భావ చిత్రాలందించే రసభావ సంవేదనకు అనుభవతోరణంగా స్ఫురింపజేసే రచనా విశేషం బాపురెడ్డిగారి కవితాజీవితం. ఈ క్రింది పద్యం ఆ రచనా శిల్పానికి జీవనాడి :

"ఉదయభానుడు ఎంత ఊపినా లేపినా
లేవజాలని ఆ కళేబరాలు
నింగియే క్రుంగి కన్నీరెంత కార్చినా
ఆరిపోవని ఆ చితాగ్ని శిఖలు
గాలిగుండెలు ఎంతగా బాదుకొన్నను
చివురించలేని ఆ జీవితాలు
మూర్ఛపోయిన కాలమును పట్టుకొని ఏడ్చు
ఆత్మబాంధవ గడియారములను

కాంచినపుడు నిరాశావరించినపుడు
మాట రాలేదు మతిలేని మట్టినోట
ఎవరు చేసిన పాపమో ఎరుగలేక
ప్రకృతియే తల్లడిలె పసిపాపవోలె.''

డాక్టర్ ఉందేల మాలకొండారెడ్డి గారు వస్తు స్వభావాన్ని భావించి గుండెతో స్పందించి స్పందింప చేసే కవి. డాక్టర్ వి వి.యల్. నరసింహారావు గారు వస్తు తత్త్వాన్ని వివేచన చేసి పఠిత చేత ఆలోచింపజేసే కవి. వారిద్దరి వ్యక్తిత్వాలూ ఈ సంపుటిలోని వారి వారి కవితలలో స్పష్టంగా గోచరిస్తాయి. రెడ్డిగారు స్పందించిన తీరు—

"నమ్మిన నేలతల్లి ఒకనాడు హఠాత్తుగ కోపగించి లే
శమ్మును జాలిలేక తన సంతతినే కబళించివేయ లో
కమ్మున ఏరికైన నిక కల్గునె రక్షణ ఇట్టి వైపరీ
త్యమ్మును గాంచి అచ్చెరువు నందడె అంతటి సృష్టికర్తయున్.''

నరసింహారావు గారు భూకంపానికి జాలిగా స్పందిస్తూ, దానికి కారణమైన పర్యావరణ సమతౌల్య రాహిత్యానికి కారకులైన వారిపట్ల ఆగ్రహాన్ని వ్యక్తం చేశారు:

"పరరాజ్యముల భయభ్రాంతమ్ము కావింప
అణుపరీక్షలు సల్పునట్టివారు
బడబాగ్ని కిరవైన జలధులపై నూనె
విరజిమ్మి వింతల నరయువారు
చెలరేగు నదులపై సేతుజలాశయా
లతిశయమ్ముగ కట్టునట్టివారు
ఎన్నెన్నొ అంతస్థులున్న మేడలు కట్టి
క్షితి సమస్థితి పాడు చేయువారు
ఆధునిక యంత్రముల రద్ది అదుపు దప్ప
గాలి నీరును శబ్దమ్ము కలుషితముగ
ప్రకృతి సమతౌల్యమును భంగపరచువారు
అవని జనులకు బద్ధశత్రువులు కారె?''

మిగిలిన కవులలో ఒక్కొక్కరు ఒక్కొక విధంగా విషాదాన్ని వ్యక్తం చేశారు. ''కన్నులు దెరవని కసుగందు జంపితి, చిన్నారి నీకేమి చేసెనమ్మ?'' అని వాపోతూ పుడమితల్లిని అడుగుతారు వెంకటశివయ్యగారు. తాళానికొదిగే గతిలో సీసాన్ని నడిపిస్తూ కన్నీరు కార్చారు రాజహంసగారు. అంతటి నరసింహం గారూ, నాద బ్రహ్మచారిగారూ జరిగిన వైపరీత్యానికి ఆశ్చర్యం ప్రకటించారు. నండూరి రామకృష్ణమాచార్యులు గారు కన్నీటికి విలువ కట్టారు. మొత్తంమీద - భావావేశంతో బాష్పాంజలి నర్పించటానికి వచన కవితకంటె పద్య కవితయే తొందరగా బాగా పనికి వస్తుందని పదిమంది కవులు ప్రజల ముందు ప్రదర్శించి చూపారు. *

(ఆంధ్రభూమి 3-12-1993)

# సాహిత్యరసం – గానరసం

దాదాపు మూడున్నర దశాబ్దాలుగా విశ్వవిద్యాలయ స్థాయిలో తెలుగు సాహిత్యాన్ని విద్యార్థులకు బోధిస్తున్నాను; వివిధ సాహిత్య వ్యాసంగాలలో వక్తగా, సాహిత్య విమర్శకునిగా పాల్గొంటున్నాను. సాహిత్యాన్ని లోతుగా మధించిన కొద్దీ ఎన్నో అంశాలలో తెలుగు విమర్శ ఇంకా విస్తరించాలని అడుగడుగునా తెలుసుకుంటూ ఉన్నాను. నేను పడుతున్న మనోవేదనను, సాగిస్తున్న సాధనను నా విద్యార్థులకూ, నా మిత్రులకూ ఎప్పుడూ మనవి చేసుకుంటూ ఉంటాను.

సాహిత్యాన్ని అనుశీలించేటప్పుడు వివిధ ప్రక్రియలకు వివిధ సాహిత్య సూత్రాలను ఏర్పరచుకోకపోతే వాటి విలువలను వివేచించటం సాధ్యంకాదని స్పష్టం అవుతోంది. భారతం పాఠం చెప్పేటప్పుడు కవిత్రయ కవిత్వాన్ని వివేచించాలంటే అనుసరించవలసిన పద్ధతులన్నీ శ్రీనాథుని కవిత్వాన్ని గానీ, పోతన కవిత్వాన్ని గానీ, ప్రబంధ కవుల కవిత్వాలను గానీ విలువకట్టడానికి వినియోగించే అవకాశం లేదని అనుభవం మీద తెలుసుకో గలుగుతున్నాం. ఇవన్నీ పద్య కవిత్వానికి సంబంధించిన సమస్యలు. ఇక పదకవిత్వం సంగతి ప్రత్యేకంగా పేర్కొనాలి. పద్య కవిత్వానికి వర్తించే సూత్రాలు పదకవిత్వానికి వర్తించవనే విషయం మొదట తెలుసుకోవడం ముఖ్యం. సంగీత సాహచర్యంతో సృష్టింపబడే పదకవిత్వ ప్రక్రియలను గురించి ప్రత్యేకమైన అధ్యయనం వేయవలసిన అవసరం ఉన్నదని ఎన్నేళ్ళనుంచో మధనపడుతూ ఉన్నాను.

వివిధ పద్య సాహిత్య ప్రక్రియలను అనుశీలించటానికి అనువైన కొన్ని సాహిత్య సూత్రాలను స్వయంగా ప్రతిపాదించి విమర్శ చైతన్యానికి ఒక విస్తృత పరిధి సాధించానన్న సంతృప్తి కొంతవరకు గడించగలిగాను. అయితే, పద సాహిత్య ప్రక్రియలను గురించి కూడా విస్తృత పరిశోధనలు చేసే అవసరం ఉన్నా, నాకు సంగీతంలో లోతైన పాండిత్యం లేకపోవటంచేత ఆ మార్గంలో స్వయంగా నూత్న సిద్ధాంతాలను వేటినీ ప్రతిపాదించలేకపోయాను. కాని, సంగీత సాహిత్యాలతో పరిచయం ఉండి, ఆ రెండింటినీ తులనాత్మకంగా పరి

శీలింపగల వాతావరణంలో పెరిగి, పరిశోధనలో ఆసక్తిగల విద్యార్థులు, విద్యార్థినులు విశ్వవిద్యాలయ స్థాయిలో తారసిల్లినపుడు, వారిని ప్రోత్సహించి పదసాహిత్య ప్రక్రియలలో పరిశోధన చేయటానికి ప్రేరణ కల్పించేవాణ్ణి. మొదట వారు కొంత జంకినా, ఆ పద సాహిత్య ప్రక్రియలమీద వారికి సహజంగా ఉండే అభినివేశంతో పరిశోధనకు పూనుకొని సరికొత్త విషయాలను సాహితీలోకానికి అందించేవారు. ఇంతవరకు నా పర్యవేక్షలో పదకవిత్వం మీద పరిశోధన చేసినవారిలో ముందుగా ఇద్దరిని తప్పకుండా పేర్కొనాలి. వారు డాక్టర్ టి.వి. నాగరంజని, శ్రీమతి బి. ఉషాలక్ష్మిగారలు.

డాక్టర్ టి.వి. నాగరంజనిగారు 'రామదాసు కీర్తనలు; స్వరలయ విన్యాసం; సాహిత్యరసపోషణ' అనే అంశం మీద, శ్రీమతి బి. ఉషాలక్ష్మిగారు 'త్యాగరాజ కృతులు - స్వరలయ - రసభావపోషణ' అనే అంశంమీద ఎం.ఫిల్. స్థాయిలో పరిశోధన వ్యాసాలు రాశారు. రామదాసు కీర్తనల మీది గ్రంథం 1992 లోనే వెలువడి, పండితుల ప్రశంసలందుకొన్నది. త్యాగరాజ కృతుల మీది గ్రంథం ఈ యేడు ఈ నెలలో వెలువడింది. పదసాహిత్య విమర్శ వివేచనలో ఈ రెండు రచనలూ రెండు విలువైన కానుకలని నిస్సంశయంగా చెప్పవచ్చు.

పదకవితలను ముఖ్యంగా మూడు రకాల ప్రక్రియలుగా విభజించవచ్చునని పేర్కొన్నారు డాక్టర్ నాగరంజనిగారు. అవి **1.** శుద్ధ సంగీత (**Pure-music**) ప్రక్రియలు. వీటిలో త్యాగరాజకృతి మొదట లెక్కింప తగింది. **2.** అనువర్తిత సంగీత (**Applied music**) ప్రక్రియలు - వీటిలో కీర్తన గణనీయమైంది. **3**. అభినయోచిత (**Dance music**) సంగీత ప్రక్రియలు - పదం మొదలైనవి యిందులో పేర్కొనదగినవి. ఈ మూడింటినీ సంగీత సాహిత్యాలకు వాటిలో ఉండే సంబంధాన్ని దృష్టిలో ఉంచుకొని విశ్లేషిస్తే సంగీత ప్రధాన ప్రక్రియలనీ, సాహిత్య ప్రధాన ప్రక్రియలనీ, ఉభయ ప్రధాన ప్రక్రియలనీ, లేదా అభినయ ప్రధాన ప్రక్రియలనీ పరిగణించవచ్చు. ఈ రకమైన విభాగం పదసాహిత్యాన్ని మరో కొత్త చూపుతో చూచే అవకాశం కలిగిస్తోంది. శుద్ధ సంగీత ప్రక్రియల వలన శ్రోతలు పొందేది గానరసమనీ; అనువర్తిత, అభినయోచిత సంగీత ప్రక్రియల వలన శ్రోతలు పొందేది సాహిత్యరసమనీ చేసిన వివేచన వాటి విలువలను నిగ్గు తేల్చటంలో వినూత్నాంశాలను వెలువరిస్తోంది.

రామదాసు కీర్తనలలో రసభావాలను వ్యంజింపజేసేది సాహిత్యమైతే, దానిని పోషించే మూలద్రవ్యం సంగీతం. ఈ విషయం కొంత పరిచితంగా కనపడుతున్నా కీర్తనలలోని సాహిత్య భావజాలాన్ని సంగీతంలోని స్వరలయ రూపొందిస్తుందనీ, పోషిస్తుందనీ చెప్పిన సిద్ధాంతం డాక్టర్ నాగరంజని గారు పదసాహిత్య విమర్శ కందించిన నవ్యకావ్యానుశీలన సూత్రం.

ఆమె చేసిన పరిశోధన వలన పద సాహిత్య విమర్శకు నాలుగు రకాల ఉపయోగాలు కలుగుతున్నాయి. 1. పద సాహిత్యంలో రసభావ పోషణకు మూలసూత్రం స్వరలయ విన్యాసంమీద ఆధారపడి ఉన్నదని స్పష్టం కావటం. 2. స్వరలయ విన్యాసాన్ని విశ్లేషించి విమర్శించే రస నిరూపణ పద్ధతి సుగమం కావటం. 3. సంగీత సాహిత్యోభయ ప్రక్రియల స్వరూప స్వభావాలు తేటతెల్లం కావటం. 4. పద సాహిత్యంలో ఇంకా సంగీత ప్రధాన ప్రక్రియల మీద పరిశోధన జరగవలసి ఉన్నదన్న విషయం తెలియరావటం ఈ ఫలితాంశాలు ఏ ప్రమాణాలతో లెక్కించినా ప్రశంసాపాత్రా లనటంలో అనుమానం లేదు.

డాక్టర్ నాగరంజనిగారు అనువర్తిత సంగీత ప్రక్రియ - లేదా-సాహిత్య ప్రధాన ప్రక్రియయైన 'కీర్తన' మీద పరిశోధన చేస్తే శ్రీమతి బి. ఉషాలక్ష్మిగారు శుద్ధ సంగీత ప్రక్రియ - లేదా - సంగీత ప్రధాన ప్రక్రియయైన 'కృతి' మీద పరిశోధన చేశారు. ధాతు కల్పనాదక్షునిగా త్యాగరాజును వాగ్గేయకారులలో అగ్రగణ్యునిగా పేర్కొని, నిరూపించారు. త్యాగరాజ 'కృతుల' ప్రక్రియాగౌరవాన్ని వివరిస్తూ ఇలా అన్నారు :

"సంగీతమునకు ప్రధానముగా రెండు లక్షణము లున్నవి. అందు మొదటిది-గానమును అభివ్యక్తికరించుట. ఈ లక్షణముతో సమన్వితమైన సంగీతమునే శుద్ధ సంగీతము (Pure music) అని అందురు. రెండవ లక్షణము సాహిత్యమును పోషింపగలుగుట - ఈ కోవకు చెందిన సంగీతమును అనువర్తిత సంగీతమని (Applied music) అందురు. త్యాగరాజునకు పూర్వులు ఈ రెండవ లక్షణమునకు చెందిన రచనలు చేసిరి. కనుకనే వారి రచనలలో సాహిత్యము ప్రధాన పాత్ర వహించును. సాహిత్య భావ పోషణకు సంగీతమును సాధనముగా వారు గ్రహించిరి. త్యాగరాజు మొదటి లక్షణమగు గానరసాభివ్యక్తీకరణకు సన్నిహితమైన 'కృతి' అను రచనా ప్రక్రియను చేపట్టెను. కనుకనే ఇతని రచనల్లో సంగీత రసపోషణకు అత్యంత ప్రాధాన్యము కలిగినది. కళా సంగీతము

(Art music) అనబడు సౌందర్యాత్మక గాన పద్ధతికిని, శుద్ధ సంగీతమునకును సాన్నిహిత్య ముండుటచే ఇతని రచనా ప్రక్రియయగు 'కృతి' యందు సాహిత్య సంగీతములకు అంగాంగి సంబంధ ముండును. ఈ అనుశీలన మాధారముగా కృతిలో విలక్షణమైన రెండు ప్రధానాంశములు ఉండునని నిర్ధారింపవచ్చును. అవి - పద బాహుళ్యము లేకపోవుట, సాహిత్య రసపోషణము ప్రధానాంశము కాకుండుట ఈ కారణమువలననే కృతి మనోధర్మ సంగీతముపై ఆధారపడి యున్నది. ధాతు శిల్ప సంశ్లిష్టతయే 'కృతి' రచనకు లక్ష్యము. కనుకనే వాగ్గేయ కారులలో త్యాగరాజునకు సమున్నత స్థానము లభించినది."

పద సాహిత్యంలో సాహిత్యంకంటె సంగీతానికి ప్రాధాన్యం ఇవ్వడమే ఉత్తమ లక్షణం. ఉభయ ప్రాధాన్యం ఉండటం మధ్యమ లక్షణం అనలేం కాని, మరొక మహనీయ లక్షణం. సాహిత్య ప్రధానమైన ప్రక్రియగాని, అభినయ ప్రధాన ప్రక్రియగాని మరొక విశిష్ట ప్రయోగం. తెలుగులో పదసాహిత్య వికాసాన్ని గమనిస్తే అది సాహిత్య రసాన్ని అందిస్తూ క్రమంగా గానరసంవైపు పయనించింది. ఈ వికాస గతిలోని విశేషాన్ని గురించీ భారతీయ పదకర్తలలో మన పదకర్తల స్థానాన్ని గురించీ ఇంకా పరిశోధనలు బలంగా సాగవలసి ఉంది. *

(ఆంధ్రభూమి 8-4-1994)

# భక్తి రసవాదం దేశీయం

హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయంలో హిందీ ఉపన్యాసకుల పునశ్చరణ తరగతులు యు.జి.సి వారు నిర్వహిస్తున్నారు. వాటిని ప్రారంభించి, 'భారతీయ సాహిత్యాలు - తులనాత్మక అధ్యయనం' అనే అంశంమీద ఉపన్యసించటానికి కేంద్ర సాహిత్య అకాడమి కార్యదర్శి ఆచార్య ఇంద్రనాథ్ చౌదరిగారు వచ్చారు. జనవరి 31 వ తేదీ జరిగిన ఆ సభలో ముఖ్యఅతిథిగా పాల్గొని మాట్లాడుమని నన్ను హిందీ శాఖ అధ్యక్షురాలు ఆచార్య శ్రీమతి శశి ముదిరాజ్ కోరింది. ముఖ్య అతిథి అంటే ముచ్చటగా మూడు మాటలు మాట్లాడి కూర్చోవచ్చుకదా అని ఒప్పు కున్నాను. మూడంశాలమీద ముక్తసరిగా నా ఉపన్యాసం ముగించాను. తాత్పర్యం ఇది—

భారతీయ భాషా సాహిత్య చరిత్రలను అధ్యయనం చేసేవారు ఏ భాషకు ఆ భాషగా గిరిగీసుకొని సాహిత్య మూల్యాలను వివేచించే రోజులు పోయాయి. తెలుగు సాహిత్యం సంగతి కూడా అంతే. చిన్న చిన్న వివరాలనుంచి పెద్ద పెద్ద సమస్యలదాకా తెలుగులో సమన్వయం కావాలంటే భారతీయ భాషా సాహిత్యాలతో పరిచయం తప్పకుండా కావలసివస్తోంది. విశేషించి తెలుగు సాహిత్యం ఒక త్రివేణీ సంగమంలాంటిది. దాదాపు 19 వ శతాబ్దం దాకా తెలుగు కవులు భారతీయ సాహిత్య దర్శనాలను, సిద్ధాంతాలనూ తమ తమ కవితా ప్రస్థానాలకు, ప్రయోగాలకు ప్రాతిపదికలుగా భావించారు. ఇరుగు పొరుగున నున్న దేశి సాహిత్యాలలోని మేలిమిని గ్రహించి తమ సాహిత్యానికి అనుగుణంగా సంవదించు కున్నారు. తమ కాలంలో తమ భాషా సాహిత్యాలకు కావలసిన అవసరాలను గుర్తించి నవ్యతను సృష్టించుకున్నారు. ఈ మూడు రకాల చైతన్యాల ముప్పేట పురి దాదాపు ఉత్తమ రచనగా, ప్రయోగంగా వెలసిన ప్రతి కావ్యంలోనూ నిండారి ఉంటుంది. దానిని విడమరచి విశ్లేషించుకుంటేనే విలువలు తేటతెల్ల మయ్యేది.

ఉదాహరణకు తెలుగులో ఒక చిన్న సంగతి. నన్నయను 'ఆది కవి' అని పిలుస్తారు. ఎందుకు? అర్థం కావాలంటే కొందరు వాల్మీకి బిరుదంలోని సార్థక్యాన్ని గ్రహించి నన్నయకు అన్వయం చేస్తారు. వేద ఛందస్సుల తరువాత

లౌకిక ఛందస్సులతో ఆదికావ్యం రాశాడు కాబట్టి వాల్మీకి ఆదికవి. తెలుగులో వెలసియున్న దేశి మాత్రా ఛందస్సుల తరువాత గణబద్ధమైన ఛందస్సులలో నన్నయ మొదటి మహా కావ్యాన్ని రాశాడు కాబట్టి ఆయన కూడా ఆదికవి అని అనుకున్నాం కొన్నాళ్ళు. కాని, 'ఆదికవి' అనే బిరుదం కన్నడ సాహిత్యంలోని పంప కవికి కూడా ఉంది. ఆయనకు ముందున్న మార్గదేశి కవితలను సమన్వయించి దేశీయమైన ఒక మహా కావ్యరచనా సంప్రదాయాన్ని, శైలిని సృజించాడు కాబట్టి పంపనికి ఆ బిరుదం వచ్చింది. నన్నయ కూడా చేసింది అటువంటి పనే. వాల్మీకి బిరుదం కంటె పంప బిరుదమే నన్నయకు దగ్గర. నన్నయ మార్గకవికాడు, దేశికవియే. ఆయన పుట్టించింది దేశికవితాశైలియే. 'ఆదికవి' బిరుదాన్ని కన్నడిగులు వాడిన ఒడుపును తెలుగువారు తెలుసుకోవటంవలన ఈ చిన్న సమస్య మరింత స్పష్టమౌతుంది.

దీనికంటె పెద్ద సమస్య మరొకటి - శ్రీనాథ యుగంలో శ్రీనాథుడు, పోతన్న, అన్నమాచార్యులు మొదలైన కవులు రచించిన కావ్యాలలో శృంగారానికి, భక్తికి; శృంగారానికి, అద్భుతానికి శాంతానికి తదితర రసాలకు ఉన్న సంబంధాలను గురించి వారు భావించిన పద్ధతులు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి. క్రీ.శ. 14 వ శతాబ్దం నుండి 17 వ శతాబ్దం వరకు దక్షిణాది భాషలలో భక్తి రస కావ్యప్రయోగాలు అనేకం జరిగాయనీ; భక్తికీ, శృంగారానికీ, తదితర రసాలకూ ఉండే సంబంధాలను గురించి వారు దర్శించిన సిద్ధాంతాల కనుగుణంగా వారు లక్ష్యాలు రాశారనీ; అయితే, వాటికి తగిన లక్షణ సూత్రాలుగాని, లక్షణ గ్రంథాలుగానీ రాలేదనీ ఆచార్య నగేంద్ర వంటి ప్రసిద్ధ విమర్శకులు వివేచిస్తున్నారు. మరొక మాటలో చెప్పాలంటే - శృంగారం రసరాజమనీ, మధురభక్తి రసరాజమనీ, భక్తి పరిపూర్ణ రసమనీ, తదితర రసాలన్నీ రసరాజానికి గౌణరసాలే అవుతాయనీ, పరిపూర్ణరసంలో అంతర్భవిస్తాయనీ ఎన్నోరసదర్శన ప్రయోగాలు ఈ కాలంలో భారతీయ భాషలలో వచ్చాయి. ఆ ప్రయోగాల ఫలితంగా సంస్కృతంలో రూపగోస్వామి, మధుసూదన సరస్వతి వంటి లాక్షణికులు 16,17 వ శతాబ్దాలలో లక్షణ గ్రంథాలు రాసి భక్తిరస సిద్ధాంతాలను రూపొందించారని విమర్శకులు భావిస్తున్నారు. ఈ పరిణామం అఖిల భారతీయ స్థాయిలో సాగింది. ఆ పరిణామదశలకు మన తెలుగు కవులు చేసిన దోహదం ఎటువంటిది? అని నేడు తులనాత్మక అధ్యయన దృష్టితో అనుశీలిస్తే తప్ప మన తెలుగు సాహిత్యాన్ని మరికొంత లోతుగా అవగాహన చేసుకోలేమన్న మాట! ఈ అవసరం ఇప్పుడు బలంగా గుర్తిస్తున్నాం.

తెలుగు కవులు వాడిన భాషా ప్రయోగాలను పదకోశాల ద్వారా సంపుటీకరించి సమగ్ర భాషా వికాసచరిత్రను, సమగ్రాంధ్ర నిఘంటువును తయారు చేయాలనే ప్రయత్నం ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారి ప్రేరణవల్ల అప్పటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రారంభించింది. నన్నయాది కవుల పదకోశాలు, వృత్తి పదకోశాలు వెలువడ్డాయి. ఒక పార్శ్వం సఫలంగా ముందుకు సాగుతోంది.

ఈనాడు పదకోశాల కంటె కవుల సాహిత్యకోశాలు ఎంతో అవసరమని సాహిత్యలోకం భావిస్తోంది. ప్రసిద్ధాంధ్ర కవుల సాహిత్య దృక్పథాలను గురించి, వారు వాడే పరిభాషను గురించి, చేసే కావ్య ప్రక్రియా ప్రయోగాలను గురించి శాస్త్రీయ దృక్పథంతో అధ్యయనం సాగకపోతే మన సాహిత్య చరిత్ర ఊహాపోహల ఊయల పాటగానే ఉండిపోయే అవకాశం ఉంది. ఈ బృహత్కార్యక్రమాన్ని చేపట్టే వ్యవస్థ ఏది మన రాష్ట్రంలో? సాహిత్యాన్ని కూడా రాజకీయాలు పాలించటం ప్రారంభించిన తరువాత ఆంధ్రులు కోల్పోయిన సాహిత్యమూల్యాలు ఎన్నో లెక్కించటానికి కొన్నితరాలు కావలసి వచ్చేటట్లు ఉన్నాయి.

అయినా, సాహిత్యలోకంలో ఎక్కడో, ఎన్నడో ఒక పరిశోధకుడు, విమర్శకుడు ఇటువంటి చైతన్యాన్ని జాగృతం చేస్తూనే ఉంటాడు. పురుషులతో పాటు తెలుగు సాహిత్యంలో నేడు మహిళలు కూడా మహనీయమైన కృషి చేస్తున్నారు. కొన్ని రంగాలలో వారే ముందడుగు వేస్తున్నారు కూడా! భక్తి రసానుశీలనంలో ఈ మధ్య డాక్టర్ సురవరం పుష్పలతగారు రచించిన సిద్ధాంత గ్రంథం "మధురభక్తి - ముగ్ధభక్తి" (ఆంధ్ర మహాభాగవతము - బసవ పురాణము) అందుకు తార్కాణం. ఆంధ్ర సారస్వత పరిషత్తు (హైదరాబాదు) ప్రచురించిన ఈ గ్రంథం జనవరి 23వ తేదీన ఆవిష్కరింపబడింది. ఆంధ్ర విశ్వకళాపరిషత్ వారు ఆ పరిశోధనకు డాక్టరేట్ డిగ్రీ ఇచ్చారు.

ఈ పరిశోధన విమర్శకుల దృష్టిని అనేకరకాలుగా ఆకర్షిస్తుంది. మచ్చుకొకటి రెండు చెపుతాను: భరత సంప్రదాయం ప్రకారం భక్తిని లాక్షణికులు రసంగా గుర్తింపని కాలంలోనే 12వ శతాబ్దిలో పాల్కురికి సోమనాథుడు బసవ పురాణాన్ని ముగ్ధభక్తి ప్రధానంగా రచించాడు. 15వ శతాబ్దిలో బమ్మెర పోతన భాగవత కవితను భక్తిరస ప్రవాహంగా పొంగించాడు. అదే శతాబ్దిలో తాళ్లపాక అన్నమాచార్యులు పదకవిత్వంలో పంచవిధ భక్తులను

ప్రపంచింప చేశాడు. డాక్టర్ పుష్పలత ముగ్ధభక్తిని, మధురభక్తిని అనుశీలిస్తూ వాటికి లక్షణ సూక్తాలను 16, 17 వ శతాబ్దులలో వెలువడ్డ భక్తిరసామృత సింధువునుండి, ఉజ్జ్వల నీలమణినుండి, భక్తిరసాయనంనుండి ఎన్నుకొన్నారు. ప్రమాణాలు కొత్తవి, ప్రయోగాలు పాతవి. అయినా. అవి అసంబద్ధంగా మాత్రం లేవు. పూర్తిగా సరిపోయాయి అని అన్నింటా చెప్పలేము. అంటే, ప్రయోగాలు పరిణామ దశలో ఉన్నాయి; ప్రమాణాలు పరిణత దశలో ఉన్నా యన్నమాట. పరిణామదశకు సంబంధించిన పరిశీలన సూత్రాలు కూడా ఉన్న ట్లయితే క్రమవికాసదశ మనకు మరింత స్ఫురించేది.

భరతనాట్య సంప్రదాయం ప్రకారం అష్టవిధ రసాలు ప్రసిద్ధి నవమ రసమైన శాంతంమీద వాదోపవాదాలున్నాయి. దక్షిణాదినుండి ప్రసిద్ధిచెందిన మరొక సంప్రదాయం ఉంది. దాన్ని దేశిగా పేర్కొంటాం. తమిళ సాహిత్యంలో దాని ప్రాచీన ప్రాతిపదికలు, వికాసదశలు గోచరిస్తున్నాయి. దేశి సంప్రదాయంలో భక్తి రసం; వత్సలం, సఖ్యం, దాస్యం, శాంతం మొదలైన భావాలు కూడా రసస్థాయిని పొందుతాయి. శృంగారాన్ని తనలో సమన్వయించుకొన్న భక్తి మధురభక్తిగా, రసరాజంగా పరిగణింపబడుతుంది. దీన్ని పంచవిధ భక్తి మార్గంగా వైష్ణవ సాహిత్యంలో ప్రసిద్ధి చెందించారు కవులు.

ముగ్ధభక్తిలో వత్సల, సఖ్య, దాస్య భావాలకు ప్రాధాన్యం ఉంటుంది. మానవీయ సంబంధాలతో దేవునియందు రతి భావాన్ని ప్రదర్శించే స్వభావం ముగ్ధభక్తిలో ముఖ్యం. మధుర, శాంతి భక్తులు భాగవత భక్తిలో ముఖ్యం. ఇవి నవవిధ భక్తి సంప్రదాయానికి సంబంధించినవి కాకపోయినా ఆత్మ నివేదన భక్తిలో అంతర్భవించగలిగినవి. వీరశైవంలో మధురభక్తి మృగ్యం; భాగవత భక్తిలో వీరభక్తి మృగ్యం. ఇవి ఆయా కాలాలలో ఆయా ప్రయోగాలలో ఎందుకు, ఎలా ప్రయోగించారన్నది పరిశీలింపవలసిన ప్రశ్నలు. మొత్తానికి - భక్తి రసమనే వాదం దేశీయం. దాన్ని భారతీయవాదంగా వ్యాప్తికి తెచ్చింది దేశభాషాకవులే.

భారతీయ సాహిత్య దర్శన వికాసానికి తెలుగు కవులు కూడా దోహదం చేశారు. ఆ దృష్టిలో ఆలోచించి మన కవుల ప్రయోగాలకు భారతీయ మూల్యాలను నిర్ణయించవలసిన అవసరాన్ని మనం ఎంత తొందరగా గుర్తిస్తే అంత మంచిది. అది ఈనాటి విమర్శలో అత్యంతాధునిక చైతన్యంలోని అమూల్యాంశం.*

(ఆంధ్రభూమి 4-3-1994)

# సత్యభామకు మధురభక్తిమార్గం చూపిన సిద్ధేంద్రయోగి

"భామనే సత్యభామనే - వయ్యారి సత్య ॥భామనే॥
భామనే పదియారువేల - కోమలు లందరిలోన
రామరో గోపాలమూర్తికి - ప్రేమదాసినైన సత్య ॥భామనే॥
అట్టహాసము చేసి సురల - నట్టె గెలిచిన పారిజాతపు
చెట్టు దెచ్చి నాదు పెరటను - గట్టిగా నాటించుకున్న ॥భామనే॥
వారిజాక్షి ద్వారకా - నివాసుని కౌగిలిలోన
కూరిమి బెనగొని రతుల దేలిన యొయ్యారి సత్య ॥భామనే॥"

ముఖారి రాగంలో మిశ్రచాపు తాళంతో ఈ దరువు పాడే సత్యభామ పురాణ పాత్ర కాదు, ప్రబంధ నాయిక కాదు. కూచిపూడి నాట్యసంప్రదాయంలో కలాప విద్యలో కళాప్రపూర్ణలాగా తెలుగువెలుగుతో ప్రకాశించే భామ. పురాణసత్యభామ రాజసభక్తికి రమణీయోదాహరణం. ప్రబంధ సత్యభామ ప్రౌఢశృంగారనాయికా ప్రవృత్తికి అలంకారమైన ఉదాహరణం. కూచిపూడి భామాకలాపంలోని సత్య భామ తెలుగువారు నృత్యపరంగా సృష్టించుకొన్న రసాధిదేవత. ఆ దేవతను దర్శించినవాడూ, సృష్టించినవాడూ ఆంధ్ర భరతాచార్యుడు సిద్ధేంద్రయోగి. ఆయన ప్రసాదించిన కూచిపూడి కలాపవిద్యలో సత్యభామ నాట్యవేద సంకేతంగా 'భామ'గానే ప్రసిద్ధికెక్కింది. తెలుగువారికి పై పాట పాడుతూ అభినయింప గలిగిన భామయే సత్యభామ. సత్య - ఆమె పేరు కావచ్చు. భామ - ఆమె తీరు. సిద్ధేంద్రయోగి ఆమె తీరుకే జీవం పోసి, అదే సత్యమని తెలుగువారిచేత అనుభ వింప జేశారు. భామకు గుర్తుగా జడను కల్పించారు. సత్యభామకు భామ సంకేతం. భామకు జడ ప్రతీక. 'భామనే సత్యభామనే' అనే వాక్యం తెలుగువారి పలుకు బడిలో ఒక భాగమైపోయింది. తెలుగు పడుచు గడుసరితనానికి ఆ వాక్యం ఒక అభినయకేతనం!

తెలుగువారికి అంతర్జాతీయ ప్రఖ్యాతిని తెచ్చింది కూచిపూడి నాట్యం. తెలుగుజాతి క్రీ.శ. 11 వ శతాబ్ది నాటికి సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా స్వయంప్రతిపత్తిని గడించి- భాషాపరంగా, సాహిత్య పరంగా తన అస్తిత్వాన్ని

నిరూపించుకోడానికి యత్నించింది. నన్నయ భారత రచన సాహిత్యవ్యక్తిత్వ ప్రతిష్ఠాపనకు ప్రాతిపదిక లందించింది 'మును మార్గకవిత లోకంబున వెలయగ' తెలుగున దేశికవిత పుట్టించటానికి చాళుక్యరాజు మొదలుగా పలువురు కృషి చేసిన ప్రసక్తిని నన్నెచోడుడు కుమారసంభవ కావ్యావతారికలో సూచించాడు. క్రీ. శ. 13, 14 శతాబ్దాలు తెలుగువారి చరిత్రలో మరొక విశిష్టాధ్యాయంగా పేర్కొన వచ్చు. తెలుగువారు నాట్యంలోనూ, శిల్పంలోనూ, మిగిలిన లలితకళారూపాల్లోనూ, తమ ప్రత్యేక వ్యక్తిత్వాన్ని భారతీయ సాంస్కృతిక రంగం మీద నిలుపుకోటానికి తీవ్రయత్నం చేసినకాలమది. కాకతీయుల కాలంలోనే ఆంధ్ర నాట్యధోరణి ప్రభవిల్లిందని నేటి పరిశోధకులు నిరూపిస్తున్నారు. కూచిపూడి నాట్యమూలాలు 13, 14 శతాబ్దులలో ఉన్నాయని భావిస్తున్నారు. భరతనాట్య సంప్రదాయంలో ఆంధ్రులబాణి ఒకటి ఉండేదని ప్రాచీనవాదం ఒకటి ఉండనే ఉంది. జాయపసేనాని 'నృత్త రత్నావళి' తెలుగువారు నృత్యనాట్య ప్రయోగ విజ్ఞానం వినూత్న శాస్త్ర ప్రమాణాలకోసం చేస్తున్న జాడలను స్పష్టం చేస్తున్నది. తెలుగువారి కళాప్రయోగాలు నూత్నమార్గాలలో ఆవిర్భవించిన శక్తిమంతమైన ఆ కాలంలోనే కూచిపూడి నాట్యం ఉషఃకాంతులను ప్రసరించి ఉండవచ్చు.

క్రీ.శ. 15 వ శతాబ్దం తెలుగు సాహిత్య చరిత్రలో మరొక ఉజ్జ్వలమైన కాలం. భక్తి, శృంగార, శాంత, అద్భుత రసాలకు సంబంధించిన సాహిత్యం వినూత్న దర్శన శక్తితో ఆ కాలంలో ఆవిర్భవించింది. శ్రీనాథుడు ఏకైకరస మని భావించిన శృంగారానికి భక్తిని సంవదించిన ప్రయోగాలకు ప్రాచుర్యం తెచ్చాడు. పరిపూర్ణరసమని భక్తిని భావించి దానికి పరిపోషకంగా శృంగారాన్ని బమ్మెర పోతన నిర్వహించాడు. ఆ యుగంలోనే కథాకావ్య కవులు, పురాణ కవులు అద్భుత, శాంతరసాలను విశిష్ట దృక్పథాలతో పోషించారు. పదకవితా పితామహుడైన తాళ్ళపాక అన్నమాచార్యులు వైష్ణవ భక్తి సంప్రదాయం నుండి జాలువారిన పంచవిధ భక్తిమార్గాలకు ప్రాచుర్యం కలిగిస్తూ, మధురభక్తితో మహనీయంగా సంకీర్తనలు రాశాడు. ఇవన్నీ ఒక క్రొత్తయుగం అవతరిస్తున్న స్ఫూర్తినిస్తున్నాయి. ఈ భూమికను గమనిస్తే కూచిపూడి నాట్యకళ ఆవిర్భావానికి, వికాసానికి, ఒక సహజమైన, శక్తిమంతమైన నేపథ్యం ఏర్పడి ఉందని స్పష్టమౌతుంది.

కూచిపూడి నృత్య చరిత్రలో సిద్ధేంద్రయోగి రచించిన 'భామాకలాపం' ఒక ప్రధాన పరిణామదశ. అంతకు పూర్వం కూచిపూడి భాగవతులు తమ నాట్యపణితిని ప్రత్యేకంగా రూపొందించుకున్నా, తమ ప్రయోగాలను సంస్కృత రూపకాలకే పరిమితం చేసుకొని ఉన్నారు. 13, 14 శతాబ్దులలో సిద్ధేంద్రయోగి

ఒక వినూత్న నాట్యకళా కలాపాన్ని సృష్టించి కూచిపూడికి ఒక నవ్యమార్గాన్ని నిర్దేశించి మహర్షి, మార్గదర్శి అయ్యాడు. అందువల్ల ఆ కాలంలో సాహిత్యంలోనే కాకుండా, నాట్యంలో కూడా ఆంధ్రులు స్వీయవ్యక్తిత్వాన్ని ప్రదర్శించిన యుగమని సిద్ధేంద్రయోగి నిరూపించాడు. ఆ తరువాత వచ్చిన పరిణామదశలలో గొల్ల కలాపం, యక్షగానం చెప్పుకోతగినవి. వాటిని క్రమంగా శ్రీ భాగవతుల రామయ్య, శ్రీ చింతా వెంకట రామయ్యగారలు సృష్టించారు.

ఆంధ్రదేశంలోని యక్షగాన ప్రక్రియలో ఏర్పడిన నవ్యసంప్రదాయాన్ని అఖిల భారతదేశానికే పరిచయం చేసిన 'భరత కళా ప్రపూర్ణులు', కూచిపూడి కళా ప్రవక్త, ప్రయోక్త శ్రీ చింతా కృష్ణమూర్తిగారు. వారి కుమారులు డాక్టర్ చింతా రామనాథంగారు ఈ మధ్యనే 'కూచిపూడి నాట్య విశిష్టత' అనే గ్రంథాన్ని ప్రచురించారు. అది తెలుగు విశ్వవిద్యాలయం వారి బహుమతి పొందిన రచన. ఒక సంప్రదాయంలోని లోతుపాతులు తెలిసిన సాహితీవేత్త, ప్రయోక్త ఆ గ్రంథం వ్రాయటం అభినందనీయం.

డాక్టర్ చింతా రామనాథం గారు హైదరాబాదులోని చాందానగర్‌లోని కూచిపూడి ఆర్ట్ ట్రైనింగ్ అండ్ రీసెర్చి సెంటర్‌కు వ్యవస్థాపక దర్శకులు. కూచిపూడి యక్షగాన పితామహులు శ్రీ చింతా వెంకట రామయ్యగారు వీరి తాతగారు. 'భరత కళా ప్రపూర్ణులు' తండ్రిగారు. వీరు చదివింది తెలుగు సాహిత్యం ఒక సంప్రదాయానికి మరొక సంప్రదాయం బంగారానికి తావిలాగా అబ్బింది. రామనాథంగారు ప్రయోక్తలే కాకుండా పరిశోధకులు కూడా. దాని వలన కూచిపూడి నాట్యకళకు ఎంతో మేలు జరిగింది. ఆ కళయొక్క పుట్టుపూర్వోత్తరాలను గురించి, వికాస దశలను గురించి, ప్రయోగ వైశిష్ట్యాలను గురించి చెప్పగలిగిన సాహితీవేత్త కూచిపూడి కళకు లభించాడు. చింతావారు కళ కంకితమైనట్లే రామనాథంగారు కళను గురించి చెప్పే కళకు అంకితమైపోయారు.

ఇంతవరకు వీరు అయిదు రచనలు చేశారు. అన్నీ కూచిపూడి నాట్యకళ మీదే. కూచిపూడి నాట్యకళ; కూచిపూడి నాట్యం - మూర్తిత్రయం; కూచిపూడి నాట్యభారతి; కూచిపూడి నాట్యాచార్యుల చరిత్రపుటలు; ఇప్పటి గ్రంథం-అన్నీ ఆ కళకు అక్షరార్చనలే.

పరిశోధకులైన డాక్టర్ చింతా రామనాథం గారు 'కూచిపూడి నాట్య విశిష్టతను' ఒక పరిశోధన రచనగా తీర్చిదిద్దారు. కూచిపూడి నాట్యం ప్రత్యేకతను, విశిష్టతను వివరించటం ఆ గ్రంథ లక్ష్యం. అధ్యాయ విభాగం, వివేచనం ఆ సమన్వయ సూత్రాన్ని క్రమంగా ఆవిష్కరిస్తున్నాయి. ప్రతి అధ్యాయం

లోనూ వివరణలు అందించే విధం కంటె విశిష్టతను ప్రతిపాదించే ఫలితాంశం వైపు వివరణలన్నీ గురిపెట్టినట్లుగా కూర్చటం ఈ రచనలోని విశేషం. పేరును గురించి చెప్పినా, ఊరును గురించి చెప్పినా, పరిసరాలను గురించి చెప్పినా, పరిణామ వికాసాలను గురించి చెప్పినా, నాట్య విశిష్టతను వివరాలతో వివరించినా సామూహికంగా ఒక నాట్య సంప్రదాయ మూర్తిమత్వం పఠిత మనస్సులో ప్రత్యక్షమయ్యేటట్లు చెయ్యటం అభినందనీయం.

ఈ గ్రంథం విషయ వివరణ దృష్టితో చూస్తే కూచిపూడి నాట్యవిషయ సర్వస్వం. కూచిపూడిని గురించిన ఆధునిక కళాక్షేత్ర మాహాత్మ్యం. నాట్య సంప్రదాయ వికాస దృష్టితో గమనిస్తే ఒక కళయొక్క అభివ్యక్తి వికాసం. ప్రక్రియాపరంగా పరిశీలిస్తే కూచిపూడి నాట్యంలోని మార్గ - దేశి ప్రక్రియల సోదాహరణ చరిత్ర. కళాకారుల దృష్ట్యా చూస్తే కూచిపూడి కళావికాసానికి తోడ్పడిన, కృషిచేసిన ప్రయోక్తల పరిచయ సంచిక. మొత్తం గ్రంథం డాక్టర్ రామనాథం గారి కళా దర్శనం.

కూచిపూడి నాట్యంలోని ప్రాచీన దశలను ఎంత ప్రామాణికంగా రచయిత చిత్రించాడో- ఆధునిక పరిణామ దశలను శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి, శ్రీ వెంపటి చిన సత్యం, శ్రీ వేదాంతం సత్యనారాయణశర్మగారలు చేసిన వినూత్న ప్రయోగాలను గురించి కూడా అంత నిబ్బరంగా నిర్వహించాడు. చదివేవారికి రచన విసుగుపుట్టనీయదు; ఆసక్తిని ఆగిపోనీయదు.

భామాకలాపం మధుర భక్తి కాసారం, సిద్ధేంద్రుని ఆత్మీయతకు ప్రతిబింబం-అని అంటూ దాని పరమార్థాన్ని ఇలా అన్నారు డాక్టర్ చింతా రామనాథంగారు - ''(భామా కలాపమునందు) సిద్ధేంద్ర యోగి జీవేశ్వరానుబంధాన్ని చక్కగ చిక్కని పద్ధతిలో నిరూపించాడు ఇందు సత్యభామ విప్రలంభ శృంగారం, విరహం పతాకస్థాయికి చేరింది. యౌవనదశలో సన్యసించిన సిద్ధేంద్రయోగి సత్యభామ వాలకం వేశాడు. నిజమునకా విప్రలంభం సత్యదికాదు- సిద్ధేంద్రునిదే. సిద్ధేంద్రుడు శ్రీకృష్ణపరమాత్మను చేరుటకు పొందిన తాపత్రయమే యాతడిట్లు వర్ణించుటకు హేతుభూతమై అతని ఆత్మీయతను ప్రతిబింబింపజేసింది.'' ''ఇందు మధుర భక్తిని ప్రతిపాదించెను''.

తెలుగులో గోపికల మధుర భక్తికి భాగవతం ప్రసిద్ధి!
సత్యభామ మధుర భక్తికి ప్రత్యేకంగా భామాకలాపమే ప్రసిద్ధి! *

(ఆంధ్రభూమి 6 & 13-11-1994)

# కూచిపూడి నాట్యకళలో నవ్యసంప్రదాయోద్యమ నాయకుడు

'కవి సమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారికి భారత ప్రభుత్వం 'పద్మభూషణ' బిరుద ప్రదానం చేసినప్పుడు ఆ మహాకవిని పూజ్యపాదులు పుష్పగిరి పీఠాధిపతులు మదరాసులో సభచేసి సన్మానించారు. ఆ సభలో కూచిపూడి నాట్యకళా ప్రపూర్ణులు డాక్టర్ వెంపటి చినసత్యం గారున్నారు. వారిని స్వామీజీ విశ్వనాథవారికి పరిచయం చేశారు ప్రసిద్ధ నాటకరంగ కళాకారుడు మల్లాది సూర్యనారాయణగారు చెప్పగా చినసత్యంగారి ప్రతిభా విశేషాలను గురించి విశ్వనాథవారు అంతకుముందే కొంత విని ఉన్నారు. అప్పుడు ప్రత్యక్ష పరిచయం కావటంతో సంతోషించారు. ''మీరు కూచిపూడి నాట్యకళలో ఉత్తమ ప్రయోక్తగా ఉన్నత స్థాయిని సాధించారని విన్నాను. నా కెంతో ఆనందంగా ఉంది'' అన్నారు విశ్వనాథవారు.

''అయ్యా! కూచిపూడి నాట్యం ఒక మహా సముద్రం లాంటిది. నేను నా చిన్న దోసిలితో ఆ మహా సముద్రంలోని నీళ్ళను గ్రహించగలిగాను. అంతే. అందులో తెలుసుకోదగింది అనంతంగా ఇంకా ఎంతో వుంది" అన్నారు చిన సత్యంగారు వినయగంభీరంగా.

''బాగుంది. నీ దోసిట్లో దక్కిందే మహాసముద్రమని నీవు భావించకపోతే నీవు తప్పకుండా పైకి వస్తావు. నీవా సముద్రంలో మునిగి ఈదేంతవరకూ తృప్తిపడి ఊరుకోబోకు, ప్రయత్నం చాలించబోకు" అని విశ్వనాథవారు ప్రోత్సాహపరిచారు.

సాహిత్యరంగంలో నవ్యసంప్రదాయ ప్రవక్తలు కవిసమ్రాట్ విశ్వనాథ వారు. కూచిపూడి నాట్యకళలో నవ్యసంప్రదాయ ప్రయోక్తలు డాక్టర్ వెంపటి చిన సత్యంగారు. వారిరువురి సమావేశం, సంభాషణం యుగకర్తల చతురవచో విన్యాసం. ఈ సన్నివేశం ''Dr. Vempati Maestro with a Mission'' అనే గ్రంథంలో చదివాను. వెంపటివారి జీవితరేఖా చిత్రాన్ని సజీవంగా చిత్రిం

చిన ఆ గ్రంథ రచయితలు శ్రీయుతులు అందవిల్లి సత్యనారాయణ, పెమ్మ రాజు సూర్యారావు గారలు (ఎస్. ఎస్ వి. అసోసియేట్స్ ప్రచురణ, విజయ వాడ, జూన్, 1994.) నాట్యాచార్యుని జీవితరేఖా చిత్రణకు నాణెమైన ఉదాహ రణం ఈ గ్రంథం.

కూచిపూడి నాట్యపద్ధతికీ ఆంధ్రజాతి జీవ చైతన్యానికీ అవ్యక్తమైన ఒక ఆత్మబంధం ఉంది; అవినాభావసంబంధం ఉంది ఆంధ్రాభిమానానికి లలితకళాభి వ్యక్తి సత్యభామ భామాకలాపం కేంద్రంగా ఆంధ్రులు అభిమానించే మానసికా వస్థలకు మనోజ్ఞకల్పనలు చేయబడిన నాట్యాలూ, యక్షగానాలూ ఆ సంప్రదా యంలో తరతరాలుగా అభివృద్ధి చెందాయి. కూచిపూడిలో నృత్యం, నాట్యం, నృత్తం, అభినయం వంశపారంపర్య వృత్తిగా కొనసాగుతూ వస్తున్నాయి. ఎన్నో కుటుంబాలు ఆ కళను ఉపాసిస్తూ, దానిమీదనే జీవిస్తూ వస్తున్నాయి. పురుషులు అభినయించే ఆ ప్రయోగాలలో పురుషులు స్త్రీ పాత్రలను అభిన యించటం ఒక ప్రత్యేక ఆకర్షణగా మారింది. స్త్రీ పాత్రలన్నింటిలో సత్యభామ మకుటాయమానం. ఆ పాత్రను అభినయించగలిగిన నాట్యాచార్యులలో డా॥ వేదాంతం సత్యనారాయణగారు నేటి కాలంలో అగ్రగణ్యులు. అయితే, అలా సత్యభామ పాత్రను రూపొందించి, అందులో జీవింపగలిగిన నాట్యా చార్యుడు ప్రతి తరంలో ఒకరు ప్రభవించటం అసంభవం. నాటకరంగంలో స్థానంవారు, కూచిపూడి నాట్యరంగంలో వేదాంతంవారు - అలా నిలిచిపోయారు. మరి సంప్రదాయం సాగిపోవాలి సజీవంగా ముందుకు.

కూచిపూడి నాట్యంలో నవ్యదర్శనం లోపించి, సృజనాత్మకత స్తంభించి, ప్రయోగాలు పాతబాణీలలో కరుడుకట్టుకొనిపోయి, శతాబ్దాలు గడిచినా కూచి పూడి గడపదాటి కళ రాష్ట్రంలో, దేశంలో వ్యాపించే చైతన్యాన్ని నోచుకోని ఒక స్తబ్ధకాలంలో వెంపటి చిన సత్యంగారు పుట్టారు. అది 1947 సం. దేశం స్వాతంత్ర్యంకోసం స్వతంత్ర భవితవ్యంకోసం పెనుగులాడుతోంది. భరతమాత పిలుపుతో భారతీయులు స్వాతంత్ర్యోద్యమంలో దూకుతున్నారు. వెంపటి చిన సత్యంగారు దాదాపు 18 సం॥ యువకుడు. నమ్ముకున్న కూచిపూడి నృత్యం అన్నం పెట్టడం కష్టమైపోయింది. బాలాత్రిపురసుందరి కలలో కనపడి భవిష్యత్తు కోసం ఊరు వదలి దేశంలో ప్రవేశించమని ఆదేశించింది. చిన సత్యంగారు మదరాసు చేరారు. ఆకలి తీర్చుకోటానికి కాదు; కూచిపూడి కళకు భవిష్యత్తును

ప్రసాదించటానికి; తనతో కదలిన కూచిపూడి కళా భారతికి ప్రపంచ వేదిక మీద కళా నీరాజనాలిప్పించటానికి; అస్తి నాస్తి విచికిత్సలో ఉన్న కూచిపూడి నాట్య కళకు అభినవ ప్రయోగ వైభవాన్ని, నవ్య సంప్రదాయ గౌరవాన్ని కల్పించ టానికి. ఒక వ్యక్తిగా మదరాసు చేరి, ఒక ఉద్యమంగా, ఒక ప్రయోగంగా, ఒక వ్యవస్థగా, ఒక కళా జీవిత ప్రస్థానంగా మారారు డాక్టర్ వెంపటి చిన సత్యం గారు. చిన సత్యంగారి కళా ప్రయోగ జీవితం కూచిపూడి నాట్యకళ ఇరవయ్యో శతాబ్దపు ఉత్తరార్ధంలో సాగించిన ప్రపంచ ప్రస్థానం. నవ్య సంప్రదాయంగా ఆ కళ సాధించిన పునరుజ్జీవన చైతన్య చరిత్ర.

డాక్టర్ చిన సత్యంగారి ముందు తరానికి చెందిన మహోన్నత నాట్యా చార్యుడు శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు. జావళీలు, పదాలు అభిన యించే కూచిపూడి నాట్య పద్ధతికి ఆయన అభినవ భరతాచార్యుడు. ఆయన అంతరంగాన్ని విప్పి శాస్త్ర కళా హృదయాన్ని చిన సత్యంగారికి అందించారు. కళతోపాటు ఆతరంపడే వేదనలోని కన్నీటినికూడా చిన సత్యంగారికి అర్పిం చారు. దేశంలో భరతనాట్యం, మణిపురి, ఒడిస్సి, కథకళి మొదలైన నాట్య పద్ధతులలో నిష్ణాతులైన నాట్యాచార్యులు, నాట్య నారీమణులు కూచిపూడి నాట్య పద్ధతిని గుర్తించి, చేపట్టి, ఆరాధిస్తారా? ఆరాధించే అంతస్సత్త్వాన్ని కూచిపూడికి కల్పించే ఆచార్యులు ఆవిర్భవిస్తారా? ఈ కళ కొన ఊపిరితో అంతరించిపోకుండా పునర్జీవనాన్ని కలిగించే యుగ పురుషుడు పుడతాడా? ఆ యుగాన్ని మనం చూడగలుగుతామా? అని లక్ష్మీనారాయణశాస్త్రిగారు తమతరంవారి వేదనను వెంపటివారికి వినిపించారు. ఆ కన్నీరు కళాభారతిది. దానిని తొలగించటం డాక్టర్ చిన సత్యంగారు తన జీవిత లక్ష్యంగా భావించి ఉద్యమించారు. ఆధునిక కూచిపూడి కళా సంస్థాపనాచార్యులైనారు!

డాక్టర్ వెంపటి చినసత్యం గారి కృషిని ఆరు రకాలుగా విశ్లేషించవచ్చు:

1. ఆధునిక నాటక నాట్య చలనచిత్రరంగ పరిణామాలను గమనించి, నాట్య ప్రదర్శనలను, నృత్యరూపక ప్రక్రియలను నవ్య దృక్పథంతో రూపొం దించి ప్రయోగించటం.

2 పాతబడి సృజనాత్మకతను కోల్పోయిన కొన్ని నాట్య సంప్రదాయా లను సంస్కరించటం స్త్రీ పాత్రలతోపాటు, పురుష పాత్రలను గూడ స్త్రీలతో వేయించటం.

3. తెలుగుదనంలో నుండి పుట్టి తెలుగుదనాన్ని రక్షించుకుంటూ పెంపొందుతున్న కూచిపూడి ప్రత్యేక వ్యక్తిత్వాన్ని నవ్య ప్రయోగాలలో కూడా సంరక్షించటం.

4. కూచిపూడి కళా ప్రయోగాలలో ప్రాధాన్యం వహించే - రచన, సంగీతం, నాట్యాభినయనం - అనే మూడు అంగాలను ప్రత్యేకంగా గుర్తించి, వాటిని పరస్పర పోషకంగా మలచి, ఒక పరిపూర్ణ కళానుభవాన్ని కలిగించే కళాఖండంగా ప్రతి ప్రదర్శననూ రూపొందించటం.

5. చతుర్విధాభినయంలో వాచ్యతను తగ్గించి వ్యంగ్య మర్యాదను విశేషంగా పోషించటం, ప్రతీకాత్మకాభివ్యక్తిని ప్రవేశ పెట్టటం.

6. నాట్యాచార్యులుగా - పరిణతి చెందిన శిష్యులను, శిష్యురాండ్రను దేశంలో, విదేశాలలో నృత్య ప్రయోగాలు చేయటానికి ప్రోత్సహించటం.

నాలుగు దశాబ్దాల క్రితం మదరాసులోని త్యాగరాజనగర్‌లో స్థాపించిన కూచిపూడి ఆర్ట్ అకాడమి డాక్టర్ వెంపటి చినసత్యంగారు కూచిపూడి కళా నవ్య సంప్రదాయానికి కల్పించిన ప్రయోగశాల; సజీవ దేవాలయం. అందులో తయారైన శిష్యగణం నేడు ప్రపంచమంతా వ్యాపించి ఉన్నారు. "ప్రతిరోజూ ఈ ప్రపంచంలో ఏదో ఒకచోట నా శిష్యులు కూచిపూడి కళా ప్రదర్శనాన్ని యిస్తూనే ఉంటారు. ఆ కళాభారతికి నిత్య కళారాధనం జరిపిస్తూనే ఉంటారు'' అని ఆత్మవిశ్వాసంతో చెప్పుకున్నారు డాక్టర్ వెంపటి చినసత్యం. కూచిపూడిని ప్రపంచానికి ప్రదర్శించిన ప్రాచార్యుడు డాక్టర్ వెంపటి.

డాక్టర్ చిన సత్యంగారు కూచిపూడి నాట్య రంగానికి బహూకరించిన నృత్య రూపకాలు ముఖ్యంగా ఇవి— శ్రీ కృష్ణపారిజాతం (1959), చండాలిక (1961), శాకుంతలం (1962), పద్మావతీ శ్రీనివాసం (1978), కల్యాణ రుక్మిణి (1984), హరవిలాసం(1987), రామాయణం-శివధనుర్భంగం (1992), క్షీరసాగర మథనం మొదలైనవి. ఇందులో చివరిది శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి రచన; మిగిలినవి శ్రీ యస్వీ భుజంగరాయ శర్మగారి రచనలు. ఈ నృత్య రూపకాల వస్తువులు తెలుగువారి హృదయాలను బలంగా హత్తుకొనే రసభావాలకు నిధుల వంటివి. జాతి నాడిని పట్టిన ప్రయోక్త డా॥ వెంపటి. శబ్దార్థ మార్దవాన్ని తెలుగువారు రమిస్తారు. భుజంగరాయ శర్మగారు, కృష్ణశాస్త్రిగారు తెలుగువారి

అభిరుచికి రచనలో అక్షరాభిషేకం చేశారు. సంగీతం, అభినయం తెలుగుదనానికి వెలుగు నింపేటట్లు సంవిధానం చేయటంతో చిన సత్యంగారి ప్రయోగంలో జాతి తన అంతరాత్మను అవలీలగా దర్శించుకున్నది.

"In many ways, Guru Vempati Chinna Satyam is a Paradox. A living legend in his own time, he has become synonymous with the renaissance of Kuchipudi in this century. He has not merely revived and preserved Kuchipudi tradition but chiselled them further to endow them with an acceptable 'classical' profile"

ఈ మాటలను అక్షరాలా అనుభవానికి తెప్పిస్తుంది అందవిల్లి, పెమ్మరాజుగారల రచన. పత్రికా రచనలోని సారళ్యం, బిగువు, విషయ వివేకం, విశ్లేషణ నాలుగువైపులా కమ్ముకున్నట్లుండే ఈ గ్రంథం పఠితను ఒక్క ఊపులో చదివిస్తుంది. ప్రసన్నంగా సాగే కథనంలో సహజంగా వినిపించే అంతర్లయ నాట్యాచార్యుని చరిత్రకు శ్రుతిగా రాణిస్తుంది. నిజానికి ఇది డాక్టర్ చినసత్యంగారి జీవితచరిత్ర కాదు. కాని, జీవితరేఖా చిత్రం. బాపు బొమ్మల్లాగానే ఈ గ్రంథంలోనిఒక్కొక్క అధ్యాయం ఆ చిత్రంలోని ఒక్కొక్క పార్శ్వం. అందవిల్లి సత్యనారాయణగారు అక్షర శిల్పి, పెమ్మరాజు సూర్యారావుగారు స్వరశిల్పి. ఇరువురి రచన ఇంగ్లీషులో కూడా ఇక్షురసంలా సాగింది. ఆంధ్ర కళాకారులను అఖిల ప్రపంచానికి అందించే ఇటువంటి ఆంగ్ల రచనలు ఎన్నో రావాలి. ఇంత మంచి రచన చేసిన ఈ గ్రంథరచయితలను అభినందిస్తున్నాను. కూచిపూడి నాట్యకళలో నవ్యసంప్రదాయోద్యమ నాయకుని ధర్మవీర రసకావ్యం ఈ రచన! *

(ఆంధ్రభూమి 20 & 27.11.1994)

# 'యువకళావాహిని'వారి 'గౌతమబుద్ధ'

ప్రతి సంవత్సరం నవంబరు 22 వ తేదీన శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయంవారు స్నాతకోత్సవాన్ని పుట్టపర్తిలో జరుపుతారు. ఆనాటి సాయంకాలం 'హిల్‌వ్యూస్టేడియం'లో బ్రహ్మాండమైన సాంస్కృతికోత్సవం ఏర్పాటు చేస్తారు అందులో విద్యార్థులు తప్పకుండా ఒక ఆధ్యాత్మిక నాటకాన్ని ఆధునిక రంగ ప్రయోగస్పృహతో ప్రదర్శిస్తారు. రామకృష్ణ పరమహంస, శంకరాచార్య, వివేకానంద, చైతన్య మహాప్రభు, రామానుజాచార్య, భక్త మీరా మొదలైన ఆధ్యాత్మికాచార్యుల, భక్తుల జీవితగాథలను రంగప్రయోగానుగుణంగా చేపట్టి నిర్వహిస్తారు. విశేషమేమంటే, ఆనాటకాలకు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారే స్వయంగా దర్శకత్వం నిర్వహిస్తారు. భారతీయ రంగచరిత్రలో, ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ రంగచరిత్రలో ఆ నాటక ప్రయోగాలు తెస్తున్న నవ్యభవ్యతరంగాలను అధ్యయనం చేయవలసిన అవసరం ఉన్నది. నాటకరంగంలో శిక్షణ నిస్తున్న విశ్వవిద్యాలయాలు నవంబరులో జరిగే ఆ నాటకోత్సవాలకు తమ అధ్యాపక వర్గ' విద్యార్థివర్గ ప్రతినిధులను పంపి వాటి ప్రయోగ ప్రమాణాలను, ప్రయోజనాలను తెలుసుకొని పరస్పరావగాహనను పెంచుకోవటం సమంజసమనుకుంటాను.

ఆ నాటకాలు చూచినప్పుడు అధునికాంధ్ర నాటక రంగ వికాసంలో ఆధ్యాత్మిక నాటకాలకు మంచి భవిష్యత్తు ఉంటుందేమోనన్న ఆశ కలిగేది నాకు. అయితే, ఆ ఉద్యమాన్ని కొన్ని కళాసంస్థలు చేపట్టి దేశమంతా నిర్వహించినప్పుడే అది సాధ్యమౌతుంది. ఆంధ్రప్రదేశ్‌లో అటువంటి రంగ ప్రయోగాలు చేసే సంస్థలు ప్రారంభింపబడాలనీ, అవి మూడుపూవు లారుకాయలుగా అభివృద్ధి చెందాలనీ ఆకాంక్షిస్తూ ఉండేవాణ్ణి. మొన్న జులై 28 వ తేదీన రవీంద్ర భారతిలో యువకళావాహినివారు ప్రదర్శించిన 'గౌతమబుద్ధ' నాటకప్రయోగం చూచిన తరువాత నాటక రంగ ప్రయోగంలో నవ్యాధ్యాయం ప్రారంభమైందని ధైర్యం వచ్చింది.

యువకళావాహిని సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలకు అంకితమై కృషిచేస్తున్న మంచి సంస్థలలో ఒకటి. అది చేపట్టే కార్యక్రమాలన్నీ ఒక యెత్తు; రూపక ప్రయోగ కార్యక్రమాలు మరొకయెత్తు స్వామి వివేకానంద, విక్రమాదిత్య, సమ్రాట్ అశోక మొదలైన మహితాత్ముల జీవితాలను సమకాలీన సమాజానికి శక్తిమంతంగా సందేశం అందించేవిధంగా రంగంమీద ప్రయోగించి, ఆధునికాంధ్ర రంగస్థల చరిత్రలో ఒక అపూర్వప్రయోగ నిర్వాహకులుగా ప్రజలచేత ప్రశంస లందుకుంటున్నారు యువకళావాహిని కళాకారులు ఆ వరుసలో 'గౌతమబుద్ధ' వారి మరొక మహనీయ రూపకప్రయోగం.

యువకళావాహిని సంప్రదాయ పద్యనాటక ప్రయోగాలను చేపట్టలేదు. కాని, చారిత్రిక వ్యక్తుల ఉత్తమ చరిత్రలను ఉదాత్తవైఖరితో ఎన్నుకొని ప్రయోగిస్తున్నది. నగరాల్లోనూ, పల్లెపట్టులలోనూ, బయలురంగాలలోనూ ప్రదర్శించటానికి అనువుగా ప్రయోగవిధానాన్ని రూపొందించుకుంటున్నది. యువకళావాహినివారు రూపకాన్ని ప్రదర్శిస్తే అటు ఒక నాటకాన్ని చూచిన సంతృప్తినీ, ఇటు ఒక బాలే (Ballad) ను చూచిన ఆనందాన్నీ అంధ్రులు పొందుతున్నారు.

బుద్ధ చరిత్రం ప్రఖ్యాతేతివృత్తం. ప్రసిద్ధమైన కథను రంగంమీద చూడటానికి వచ్చే ప్రేక్షకులు కథకోసమే రారు. కథలో క్రొత్త మార్పులకోసం వస్తారు. మార్పులు కథా శక్తిని పెంచాయా, తగ్గించాయా అని విచారించి గుణగణాలను నిర్ణయించటానికి వస్తారు. ఆహ్లాదంకోసం వచ్చేవారు కొందరున్నా ఆలోచనామృతం కోసమే సహృదయులు వస్తారు.

'గౌతమ బుద్ధ' నాటక రచయిత శ్రీ పి.వి. కృష్ణమూర్తి ప్రఖ్యాతేతివృత్తంలో ప్రయోగ సౌలభ్యంకోసం కొన్ని మార్పులు చేసినా అవి అత్యంత సహజంగా కథలో అతికిపోయాయి.

ప్రసిద్ధ కథకంటె మార్పుగా కానవచ్చే మొదటి మేటి సన్నివేశం సిద్ధార్థుడు వృద్ధుణ్ణి, రోగిని, శవాన్నీ, సన్యాసినీ చూచిన పద్ధతిని చిత్రీకరించింది. అశ్వఘోషుని బుద్ధ చరిత్రలో గానీ, ఆర్నాల్డ్ "లైట్ ఆఫ్ ఏసియా' లో గానీ మిగిలిన బుద్ధ కావ్యనాటకాలలో గానీ ఆ సన్నివేశం ఇతివృత్తానికే ఆయువుపట్టులాంటిది. కపిలవస్తు రాజప్రసాదం నుండి సిద్ధార్థుడు నగర దర్శనార్థం రథంమీద బయలుదేరి ఊరిబయట ఈ సన్నివేశాలను క్రమంగా చూస్తాడు.

వాటి విశేషాలను రథసారథి చెన్నని నడిగి తెలుసుకుంటాడు. ఈ ప్రసిద్ధ సన్ని వేశాన్ని శ్రీకృష్ణమూర్తిగారు మార్చి ప్రేక్షకులకు ఆశ్చర్యం కల్గించటంతోపాటు కథలో ఒకరకమైన సస్పెన్సును సృష్టించారు.

సిద్ధార్థుడూ, చెన్నడూ లుంబినీ వనాన్ని దర్శించి తిరిగి వస్తుంటారు. వారు గుఱ్ఱాలమీదనే ప్రయాణం చేస్తున్నారు కపిలవస్తు నగరాన్ని సమీపించారు. గుఱ్ఱాలు అలసిపోయాయి. సిద్ధార్థుడూ అలసిపోయాడు. చెన్నడు సిద్ధార్థుణ్ణి ఒక చెట్టు నీడన విశ్రాంతి తీసుకోమని కోరతాడు. తాను సమీపంలో ఉన్న కోనేరులో గుఱ్ఱాలకు నీరు పట్టటానికి వాటిని తోలుకొని పోతాడు. ఒంటరిగా ఉన్న సిద్ధార్థుణ్ణి దైవ ప్రేరితంగా వృద్ధుడు, రోగి వరుసగా సమీపించి, వార్ధ క్యాన్ని గురించి, రోగాలను గురించి, మరణాన్ని గురించి స్వయంగా అతనికి వ్యాఖ్యానించి చెపుతారు. ఆ తరువాత సన్యాసి కనపడి, వైరాగ్యాన్ని గురించి బోధిస్తాడు. మూలంలో వృద్ధాదులు వొట్టి సాక్షులే; దృశ్య పదార్థాలే. వాటి తత్త్వాన్ని సారథి వ్యాఖ్యానిస్తాడు. కాని, ఈ నాటకంలో ఆ పాత్రలే స్వయంగా బోధిస్తాయి. ప్రకృతిలోని ప్రతి అంశంనుండి ఏదో ఒక సందేశాన్ని గ్రహిస్తూ జీవిత ప్రస్థానాన్ని సాగించే గౌతమబుద్ధుడు వృద్ధాదుల వల్లనే ఆ ఉపదేశాన్ని పొందటం ఎంతో సమంజసంగా ఉంది.

ప్రయోగంలో విసుగుదల లేకుండా చైతన్యవంతంగా కథ సాగటం ఈ కల్పన సాధించిన మరొక రమణీయమైన ప్రయోజనం. కథలోని పాత్రలకు సిద్ధార్థుని మనోవేదనకు కారణం తెలియకుండా ఉండే ఒక గడుసుదనపు కల్పన ఇందులో ఉంది. ఇది కథను ఉక్కిరిబిక్కిరి చేస్తుంది; ప్రయోగాన్ని ఆసక్తి దాయకంగా మారుస్తుంది. ఉత్కంఠకు కారకమైన ఈ కల్పనకు రచయితను అభినందించకుండా ఉండలేము.

సిద్ధార్థుని జీవితంలో మహాభినిష్క్రమణం ప్రాణసదృశమైన సన్నివేశం. శయ్యాగారంలో నిద్రిస్తున్న భార్యాపుత్రులను అర్ధరాత్రివేళ వదలి వెళ్ళిపోయే ఘట్టం పరమ కరుణరస సాంద్రంగా ఉంటుంది. దాన్ని కూడా మార్చారు శ్రీ కృష్ణమూర్తి గారు. రంగంమీద శయ్యను ప్రవేశపెట్టకుండా ప్రయోగం సాగాలని రచయిత సంకల్పం కాబోలు! దాన్ని సాధించటానికి కథలోని దేశ కాల పాత్రలలో కొన్ని మార్పులు చేయక తప్పలేదు.

యశోధర వచ్చి బాలెంత. బాలుని కింకా నామకరణ సంస్కారం జరుగ లేదు. కాని, రాహులు దని పేరు పెడితే బాగుంటుందని సిద్ధార్థుడు సూచించటం, శుద్ధోదనుడు సంతోషంతో అంగీకరించటం జరిగింది. పసిబాలుణ్ణి పురిటింటిలో నుండి వెలికి తెప్పించి జనన సంస్కారం చేసేలోగానే సిద్ధార్థుడు మహాభినిష్క్రమణం చేసినట్లు ఈ రూపకంలో చేయబడిన కల్పన ఆశ్చర్యం కలిగిస్తుంది. అంతకంటె ఆశ్చర్యం కలిగించేది కంటకాశ్వాన్నెక్కి రాజ్యసీమలను దాటు తున్నంతవరకూ తాను మహాభినిష్క్రమణం చేస్తున్నట్లు చెన్ననికికూడా తెలియ కుండా సిద్ధార్థుడు రహస్యంగా ఉంచటం అపూర్వం. ఈ కల్పనలో రచయిత ప్రదర్శించిన ప్రతిభను ప్రశంసించకుండా ఉండలేం.

ఈ నాటకంలో సిద్ధార్థ పాత్రను సర్వాంశమహనీయంగా చిత్రిస్తున్నట్లూ నాటకమంతా, పాత్రలన్నీ నాయకపాత్ర చుట్టూ తిరుగుతున్నట్లూ ఉంటుంది. అయినా, ప్రతి చిన్నపాత్రకు కూడా ఒక అస్తిత్వం, వ్యక్తిత్వం ఉన్నట్లు ప్రేక్ష కులకు చిత్రించి చూపే రచనా శిల్పాన్ని రచయిత ప్రదర్శించాడు. శుద్ధోదనుడు, దేవదత్తుడు, యశోధర, బలదేవుడు, చెన్నడు, బింబిసారుడు, అజాతశత్రువు, సారంగదేవుడు. ఆమ్రపాలి, వివిధ ఋషులు-అన్ని పాత్రలూ సజీవంగా కనపడ తాయి. ఏమైనా అసలు లోపాలు లేవనికాదు. మొదట లోప మనిపించేది-సుజాత తెరమరుగున పడిపోయిన ఘట్టం. సుజాత కథ బుద్ధ చరిత్రలో అందరికీ తెలుసు. కాని, నాటకం చూడవచ్చిన వారు విన్న సంతృప్తి కంటె కన్న సంతృప్తిని కోరుకుంటారు ఎక్కువగా!

కథ సాగింపు ఎంత సమర్థవంతంగా ఉన్నా కథ ముగింపు కొంత తొందర పడ్డట్టు తోస్తుంది. బుద్ధ బోధను నాటకీయం చేయటం కష్టమే. అయినా బౌద్ధ ధర్మం జీవితాచరణలో అందించే విలువలకు ప్రాధాన్యమిచ్చి రచించిన తీరు అందరికీ ప్రయోగం అందుబాటులో ఉన్న స్ఫూర్తిని కలిగిస్తుంది. రూపకం జీవితంలో ప్రవహిస్తున్న స్ఫూర్తిని అందిస్తుంది. యశోధర 'బుద్ధం శరణం గచ్ఛామి' అని అంటూన్నప్పుడు తెర పడటం, నాటకం ముగియటం రచయిత రచనా శిల్పాన్ని తెలుపుతున్నా యశోధరలో కలిగిన పరిణామం హఠాత్తుగా జరిగినట్లుంటుంది కాని, మనస్సుకు తృప్తి నివ్వదు. చివరలో కాల పరిమితి కలాన్ని తరిమినట్లు స్పష్టంగా తెలుస్తుంది. కాని, నాటకం మొత్తంమీద రక్తి కడుతుంది. నాటకం అద్భుతంగా ముగిస్తే ఒక నిండుదనం వెల్లివిరిసేది!

యువత ఆధ్యాత్మికతను గురించి నలుగురిలో నోరెత్తి మాట్లాడటానికే జంకే ఈ రోజుల్లో ఆధ్యాత్మిక విప్లవాన్ని తెచ్చిన ప్రవక్తల జీవితాలను రంగం మీద ప్రయోగిస్తూ క్రొత్త శకానికి సాహసంతో ఆహ్వానాన్ని అందిస్తున్న యువ కళా వాహిని వారి ప్రయత్నం అభినందనీయం. యువ కళావాహిని కార్యకర్త లందరూ రంగ ప్రయోగ కర్తలు కూడా. వారందరికీ ముందుగా నిలిచి ఆ వాహినిని నడిపిస్తున్న శ్రీ వై. కె. నాగేశ్వరరావు వివేకానందుడుగా, విక్రమాదిత్యుడుగా, అశోకుడుగా, ఈ నాటకంలో గౌతమబుద్ధుడుగా నాయక పాత్రను నిర్వహిస్తూ నాటకానికి ప్రాణం పోస్తున్నాడు. మిగిలినవారు నాటకాలకు జీవితాన్ని కల్పిస్తున్నారు యువత సమైక్యంగా పనిచేస్తే ఎటువంటి ఉద్యమాన్నైనా సాగించగలదని యువ కళావాహిని మరొకసారి ఋజువు చేస్తోంది!

యువ కళావాహినివారి ''గౌతమబుద్ధ'' చారిత్రక నాటకం అనటంకంటె 'ఆధ్యాత్మిక నాటకం' అనటం న్యాయం. గ్రంథం మీద 'చారిత్రాత్మక నాటకం' అని ముద్రించి ఉంది. రచయిత ఆ పదాన్ని ఏ అర్థంలో వాడినా అసలైన అర్థంలో అది సార్థకం కావాలని ఆశిద్దాం! *

(ఆంధ్రభూమి 19-8-1994)

# అక్షరచిత్రాల ఆల్బమ్

హాబీలు ఎన్నో రకాలు. కొన్ని వినోదాన్ని కలిగిస్తాయి. కొన్ని వికాసాన్ని అందిస్తాయి. కొన్ని చరిత్రకు తోడ్పడతాయి. మరికొన్ని చరిత్రను సృష్టిస్తాయి. స్టాంపుల సేకరణనుంచి సాలార్‌జంగ్ మ్యూజియంవరకు వ్యాపించిన అనేక రకాల హాబీలు సమాజానికి కలిగించిన సత్ప్రయోజనాలను గమనిస్తే మానవుణ్ణి చిరంజీవిగా మార్చే మహితగుణం హాబీ అని స్పష్టమౌతుంది.

హాబీలలో సాహిత్యానికి సంబంధించిన వాటిని ప్రత్యేకంగా పేర్కొనాలి. ప్రాచీన రచయితల దస్తూరులను, చేవ్రాళ్ళను, రచనలను, చాటువులను, చిత్రాలను, వారుపయోగించిన వస్తువులను, ప్రైవేటు జీవిత రహస్యాలను మొదలైన వాటిని భద్రపరుస్తూ ఉంటారు కొందరు సాహితీపరులు, ఫోటోగ్రఫీ రాక పూర్వం వర్ణ చిత్రాలను భద్రపరచటం ఒక విలువైన హాబీగా సమాజంలో ఉండేది. చిత్రకారులు కుడ్య చిత్రాలను గుహల్లోనూ, గుళ్ళల్లోనూ, సభల్లోనూ, మందిరాల్లోనూ, విహారాలలోనూ, ఆరామాలలోనూ చిత్రించి, కలకాలం రంగులతో తమ రమణీయ సందేశాలను కాలాంతరంలోని తరాలకు అందించారు. అలాగే శిల్పులు దేవాలయాలవంటి శిల్పకళా సంపుటులలో భారతీయ సంస్కృతుల సంప్రదాయాల నెన్నింటినో భద్రపరిచారు. పురాణ పురుషుల మహిమలు, మత ప్రవక్తల చరిత్రలు, కళాశాస్త్ర రహస్యాలు శిల్పకళా సంపుటులుగా శిలలలో భద్రపరిచారు శిల్పులు.

ఆధునిక కాలంలో సాంకేతికశాస్త్ర సహాయంతో మానవ ప్రతిభకు సంబంధించిన ఎన్నో గుర్తులను భద్రపరచుకొనే ప్రయత్నం హాబీలద్వారా కొందరు చేస్తున్నారు. ఆ వరుసలో ఛాయా చిత్రాలు, వీడియోలు, మైక్రో ఫిలిమ్స్ మొదలైనవి సేకరించటం హాబీలుగా కలవారున్నారు. వారి సేకరణ పరిశోధనకు ప్రాణంలాంటిది.

ఈ మధ్య డాక్టర్ ద్వానాశాస్త్రిగారు వారి 'అక్షర చిత్రాలు' పంపారు నాకు. ఆంధ్రభూమిలో, ఆంధ్రప్రభలో ఇదివరలో వారే సేకరించి ప్రచురించిన

అపూర్వ ఛాయా చిత్రాల సంపుటి అది. ''గత పదేళ్ళుగా ఎన్నో ఊళ్ళు తిరిగి, ఎన్నో గ్రంథాలయాలు దర్శించి, ఎంత మందినో కలుసుకొని, కొందర్ని ఉత్తరాలద్వారా బాధించి సాహితీరంగానికి సంబంధించిన ఎనభై ఫోటోల్ని సేకరించగలిగాను. వాటిలో అరవై చిత్రాలను ఎన్నికచేసి 'అక్షర చిత్రాలు'గా వెలువరిస్తున్నా"నని మిత్రులు డాక్టర్ ద్వానాశాస్త్రిగారు ముందుమాటల్లో పేర్కొన్నారు. ఎనభై చిత్రాల సేకరణకు దశాబ్ది పట్టింది!

చేస్తున్న వృత్తి కంటె విలక్షణమైన ప్రవృత్తిని ప్రదర్శించేదిగా ఒక్కొక్కసారి హాబీ ఉండవచ్చు. అలా ఉంటేనే హాబీకి అందం కూడా. అయితే, సాహిత్య జగత్తులో సాహితివేత్తలకు సాహిత్యపరమైన వింత అభిరుచులు హాబీలుగా చెలామణి అవుతూ ఉండటం గమనిస్తూ ఉంటాం. వీటిని అనుబంధ ప్రవృత్తులుగా కొందరు పేర్కొంటూ ఉంటారు. అంటే - ద్వానా శాస్త్రిగారి ఈ సాహిత్యవరమైన ఛాయా చిత్రాల సేకరణ 'హాబీ' అవుతుందా? లేక వారి పరిశోధన ప్రవృత్తికి అనుబంధ ప్రవృత్తిగా మాత్రమే పరిగణించదగిందా? అనే ప్రశ్న వెలువడుతుంది.

పరిశోధకులలో సామగ్రి సేకరణలో సవ్యసాచుల్లాంటివారు ఒక శాఖవారుగా కనపడతారు. పూర్వకాలంలో వేటూరివారు, నిడుదవోలువారు ఈ శాఖలో అగ్రగణ్యులుగా ఉండేవారు. ఆధునికులలో తిరుమల రామచంద్ర, ఆరుద్ర, లాంటివారు ఆ శాఖను పోషిస్తున్నారు. అదే వరుసలో ఈ తరంలో తమ ప్రవృత్తులను మలచుకొంటున్న మిత్రులలో డాక్టర్ ద్వానా శాస్త్రిగారొకరు. వీరి నందరిని సవ్యసాచులని ఎందుకన్నా నంటే - ఒక చేత్తో తామెన్నుకొన్న సాహిత్య పరిశోధనాంశాల మీద ప్రధానకృషి సాగిస్తూనే, మరొక చేతితో అందుబాటులో ఉన్న ఆసక్తికరమైన అంశాలను కూడా శ్రద్ధతో పరిశోధన సామగ్రిగా సేకరిస్తూ ఉంటారు. ఇది ఎడమచేత్తో చేస్తున్న పనిగానే మొదట తోచినా, కాలాంతరంలో దాని చారిత్రికమైన విలువ వలన పరిశోధకుల దృష్టిని ఆకర్షిస్తుంది. చిత్రపట సేకరణం అనుబంధ సాహిత్య ప్రవృత్తిగా పరిశోధకులైన శాస్త్రిగారి పట్ల చెప్పుకోవటానికి వీలున్నా, సాహిత్య సమన్వయానికి గాని, సిద్ధాంతానికి గాని, సాహిత్య మీమాంసకుగాని పనికి వచ్చే సామగ్రి కాజాలని ఛాయాచిత్రాలను సేకరించే ప్రవృత్తిని సాహిత్యపరమైన 'హాబీ' గానే భావించటం సమంజసం.

'అక్షర చిత్రాలు'లో అరవై చిత్రాలున్నాయి. వాటిల్లో వైవిధ్యం ఉంది కూడా. ఇందులోని చిత్రాలను పదిహేను రకాలుగా వర్గీకరించవచ్చు. కవుల వ్యక్తి చిత్రాలు, కుటుంబ చిత్రాలు. గ్రూపు ఫోటోలు, నాట్య నాటక ప్రదర్శనల చిత్రాలు, సభలు, సమావేశాలు, వర్ణచిత్రాలు, ఊహాచిత్రాలు, కార్టూనులు, సంస్థల భవనాలు, సంస్థల ముద్రలు, తామ్రశాసనరేకు, గ్రంథాల, పత్రికల ముఖపత్రాలు, దస్తూరీ నమూనాలు, ముద్రిత పత్ర ప్రతులు - ఇలా ఆసక్తిని రేకెత్తించే వైవిధ్యంగల వస్తువులు గల చిత్రాలున్నాయి. వాటికి రచయిత రాసిన సంగ్రహ పరిచయాలు కూడా ముద్రింపబడి ఉన్నాయి. ఈ చిత్రపట సంపుటి చూస్తూంటే 19, 20 శతాబ్దాల సాహితీ మూర్తుల దర్శనం, సంస్థల పరిచయం, ప్రచురణల నమూనాలు మొదలైన సారస్వత సంబంధి విశేషాలు నెమరువేసుకుంటున్నట్లుంటుంది.

28 వ పేజీలో 1949 నాటి కవిసమ్మేళనం ఛాయా చిత్రం ఉంది. దాదాపు 15 మంది ఆధునిక మహారచయితల అపూర్వ సమావేశం అందులో చూడవచ్చు ఒక యుగం దర్శనమిస్తున్నట్లుంటుంది. శ్రీశ్రీ విశ్వనాథ లొకేవేదిక మీద ఉన్న ఫోటో (పు 23), పురిపండా, శ్రీశ్రీ, వద్దాదీ కలిసి తీయించుకున్న ఫోటో (పు. 5), సాహితీ సమితిసభ్యుల గ్రూపు ఫోటో (పు. 13) రాయప్రోలు, ఖండవల్లి, దివాకర్ల గారలు ఒకే వేదికమీద ఉన్న ఫోటో (పుట. 16), ఆంధ్ర పురాణ ఆవిష్కరణ సభావేదిక చిత్రం (పు. 17), అమలాపురం కవిపండిత సభ (పు. 43.) ఆంధ్రేతిహాస పరిశోధక మండలి సభ్యుల గ్రూపు ఫోటో (పు. 44) చరిత్రలో కొన్ని మరువలేని అధ్యాయాలను సాహితీపరులచేత మననం చేయించేవి; కళ్ళను ఆర్ద్రపరచేవి.

పదహారేళ్ళ పెళ్ళికొడుకు చలం, పెళ్ళికూతురు రంగనాయకమ్మల 1910 నాటి ఫోటో (పు. 63), కొడవటిగంటి కుటుంబరావు గారి పెళ్ళినాటి ఫొటో (పు. 51), సురవరం ప్రతాపరెడ్డి గారి ప్రేమ వివాహం ఫోటో (పు. 38), లతగారి చిన్నప్పటి ఫోటో (పు. 36), స్థానంవారి రోషనార వేషం (పు. 20), కూర్దేటి దొరగారి 'అజంతా లోయలో బాపిరాజు' చిత్రం (పు. 19) చూచేవారికి ఎంతో ఆసక్తిని కలిగిస్తాయి. మిగతావి వికాసాన్ని కలిగిస్తాయి.

'అక్షర చిత్రాలు' ద్వానా శాస్త్రిగారు సమకూర్చిన సాహిత్య ఆల్బమ్. ఈ ప్రచురణలో సేకరణకు సంబంధించిన శ్రమ, వివరణల నిచ్చిన వివేకం అభి నందనీయ మనటంలో అనుమానం లేదు. ఇటువంటి పుస్తకాలకు ఇదే మొదలని శాస్త్రిగా రన్నారు. దీన్ని మరికొంత పరిశోధనం చేసిన తరువాత గాని గట్టిగా చెప్పలేం.

'అక్షర చిత్రాల' కూర్పరిగా ద్వానాశాస్త్రిగారి పేరు ఈ గ్రంథంలో ఉంది. ఈ కూర్పుకు 'ఆల్బమ్' లక్షణం సహజంగా ఏర్పడింది. పఠిత ఆల్బమ్ గానే దీన్ని చూచి ఆనందిస్తాడు అయితే, డాక్టర్ ద్వానాశాస్త్రిగారు దీనికి ఆల్బమ్ స్వభావాన్ని కలిగించటానికి అక్షరాలా ప్రయత్నించినట్లు లేదు. ఆ లోపం కూర్పులో కొట్టవచ్చినట్లు కనపడుతోంది.

ఉత్తర రామ చరిత నాటకంలో భవభూతి చిత్రదర్శన సన్నివేశాన్ని ప్రథమాంకంలో కల్పించాడు అందులో కాలక్రమ సూత్రం పాటించి చిత్రాలను కూర్పు చేసినట్లు, కడచిన అనుభవాలను సీతారాములు ఒక క్రమంలో నెమరు వేసుకొన్నట్లు రచించి భవభూతి ఆల్బమ్ కూర్పులో నేర్పును ప్రదర్శించాడు. డాక్టర్ ద్వానా శాస్త్రిగారు చిత్రాల కూర్పులో కాలక్రమం గాని, వస్తుక్రమం గాని ఉత్కంఠ క్రమంగాని పాటించలేదు. వారిష్టం వచ్చిన పద్ధతిలో ఫైలు చేశారు, ముక్తకాల్లాగా కళ్ళతో చదువుకోమన్నారు. సరుకు ఉంది కాని సంవిధానం లేదు.

మరికొంత శ్రద్ధ తీసుకున్నట్లయితే - ఈ శతాబ్ది సాహిత్య చరిత్రలో మరుపురాని వ్యక్తులుగా, ఘట్టాలుగా వ్యాఖ్యానిస్తూ ఒక అన్వయసూత్రాన్ని ఎన్నుకొని చిత్రాలను కాలక్రమ పద్ధతిలో అమర్చి పఠితకు అందించే అవకాశం లభించేది. మార్క్సును ఎలాగైనా ఆల్బంలో చేర్చాలన్న ఉబలాటం ప్రకటించి నట్లుంది ఇప్పటి కూర్పులో. పత్రికలలో విడివిడిగా ప్రచురించటం వేరు వాటిని ఒక అనుభూతి నందిందే ఆల్బంగా అలంకరించటం వేరు. కూర్పరిలో నేర్పరి గూడా ఇమిడి ఉంటాడని రాబోయే సంపుటులలో డాక్టర్ ద్వానా శాస్త్రిగారు నిరూపిస్తారని ఆశిద్దాం! *

(ఆంధ్రభూమి, 10-12-1993.)

# రాళ్ళపల్లివారి తెలుగు సాహిత్య విమర్శలో మౌలికత

ఈ శతాబ్ది సాహిత్యంతో పరిచయమున్న ఏ సాహిత్యరసికుడైనా రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారి సాహిత్య విమర్శలో Originality ఉన్నదని తప్పకుండా ఒప్పుకుంటాడు. అయితే, అది ఏమిటి? అని అడిగితే మాత్రం అందరూ ఒకే రకమైన సమాధానం చెబుతారనే నమ్మకం లేదు. అలా ఉండటం కూడా 'ఒరిజినాలిటీ'కి ఒక లక్షణం.

ఇంగ్లీషులో 'ఒరిజినాలిటీ' అంటే ఎటువంటి అర్థస్ఫూర్తి, అనుభవసిద్ధి ఆ భాష వచ్చినవారికి కలుగుతాయో, వాటితోపాటు తెలుగువారి దేశిలక్షణాన్ని సంపదించుకొన్న అర్థాన్ని, అనుభవాన్ని కూడగట్టుకొన్న స్ఫూర్తితో 'మౌలికత' అని వ్యవహరిస్తున్నాం మనం నవీన భావాలను ఉత్పన్నం చేయగలిగిన ఉపజ్ఞను గాని, ప్రతిభా ప్రయోగాలలో ప్రథమంగా లెక్కింపదగిన ప్రజ్ఞనుగాని మౌలికత అని పిలవటం సర్వసాధారణం. దీన్ని ఒక పదార్థ మూలధర్మంలాగా, ప్రత్యేకతకు మూలమైన ప్రజ్ఞా విశేషంలాగా, ఇతరులకు మార్గదర్శకమయ్యే మహనీయగుణంలాగా, స్వయంప్రకాశకమైన జ్ఞానచక్షువులాగా, అనుకరింప లేని అపూర్వ వ్యక్తిత్వలక్షణంగా భావించేవారూ ఉన్నారు. ఏమైనా ఒకటి మాత్రం నిజం- 'మౌలికత' సార్వకాలికమైన శాశ్వత ప్రమాణం కాదు. దేశకాల పాత్రాలను బట్టి వివేచింపదగిన సాపేక్ష ప్రమాణం మాత్రమే. సాహిత్యంలో దీనికి ప్రమాణ గౌరవం ఉన్నంతగా పరిభాషా గౌరవం ఉన్నట్లుగా లేదు.

మౌలికతకు పంచప్రాణాల్లా పంచలక్షణా లున్నాయి. అవి—

1. అనుకరించని స్వభావం, లేదా - తిరుగుబాటు స్వభావం, లేదా - ప్రయోగశీలం.
2. స్వతంత్ర వ్యక్తిత్వం - ఒక క్రొత్తబాటకు మొదటిదయ్యే ప్రతిభామూర్తిమత్వం.

3. నవీన దృక్పథం - దీనినే క్రొత్తచూపు, నవ్యసిద్ధాంతం, అభినవదర్శనం అనవచ్చు.
4. వినూత్న శైలి - దీనినే సొంతబాట సొంతగొంతు అంటారు కొందరు.
5. అనుయాయులను ఆకర్షింపగలిగే శక్తి, లేదా - విమర్శలను కొని తెచ్చుకొనే శక్తి.

సాహిత్యరంగంలో ఏ ప్రక్రియలోనైనా ఏ కాలంలోనైనా ఒక రచయిత మౌలికతను ప్రదర్శించాడని మన కనిపిస్తున్నదంటే ఈ అయిదు లక్షణాలు గల ఒక అపూర్వ ప్రజ్ఞను ఆతడు ప్రదర్శించి ఉంటాడని నిశ్చితార్థం దాన్ని వివేచించుకోటం విమర్శ స్వభావం.

"చెప్పఁబోవుదానిఁ జప్పి మాటలచేతఁ
జెప్పవచ్చుఁ; దాన మెప్పు లేదు
చెప్పవలయు రసము చిప్పిల నీయట్లు
కీర్తనీయచరిత! కృష్ణశర్మ!''

అని డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు చేసిన ప్రశంసలో-చప్పిడి మాటలతో చెప్పే విషయాలను కూడా రసం చిప్పిలేటట్లు చెప్పే నేర్పు రాళ్ళపల్లి వారి ప్రత్యేకతగా పేర్కొన్నారు. ఇది వారి శైలికి, సొంత గొంతుకు, సొంతబాటకు సంబంధించింది. రాళ్ళపల్లివారి రచనలో అందరినీ ఆకర్షించే లక్షణం అది. వారి శైలి వారి మూర్తిమత్వం

మౌలికతలోని పంచ లక్షణాలూ రాళ్ళపల్లివారి సాహిత్య విమర్శలో అయిదు రకాలుగా అభివ్యక్తమయ్యాయి. మొదటిదైన - అనుసరించని స్వభావం వారి విమర్శ పద్ధతి (Approach to literature) గా వ్యక్తమయింది. రాళ్ళపల్లివారు సంస్కృతాంధ్ర భాషా సాహిత్యాలను ఆపోశన పట్టారు. అట్లని సంస్కృత లక్షణ గ్రంథాలలో చెప్పిన కావ్య లక్షణాలను ఆదర్శంగా తీసుకొని తెలుగు సాహిత్యానికి అన్వయించాలనే ఛాందస భావం వారికి లేదు. తెలుగు సాహిత్యానికి దానిదైన దేశీయ అస్తిత్వం ఉన్నదన్న అంతర్విశ్వాసం గాఢంగా ఉన్న ఆచార్యు డాయన. ఆంధ్ర సాహిత్య విమర్శకు ఆంగ్ల సాహిత్య కాల్పనిక చైతన్యాన్ని లక్షణ సూత్రంగా నిర్మించి ఇచ్చిన కవిత్వ తత్త్వ విచారకర్త కట్టమంచి రామలింగారెడ్డిగారు రాళ్ళపల్లివారికి ఎంతటి ఆప్తమిత్రులైనా వారి

విమర్శ పద్ధతి వీరి అంతరాత్మను ఆకర్షించలేదు. దీన్ని గమనిస్తే, రాళ్ళపల్లివారు తమకు ముందున్న మహా విమర్శకుల ప్రభావానికి లొంగని, అనుకరణాన్ని, అనుసరణాన్ని అంగీకరించని మౌలికమైన స్వభావాన్ని రక్షించుకోగలిగారని స్పష్టమౌతుంది. దీనికి రెండో లక్షణం మరింత తోడ్పడింది. విమర్శకునిగా రాళ్ళపల్లికి ఒక విశిష్ట వ్యక్తిత్వం ఉంది.

ఆంధ్ర సాహిత్య విమర్శ వికాసంలో రాళ్ళపల్లి కలం పట్టేంతవరకూ లలితకళ లన్నింటిలోనూ సమాహార కళగా సంభావింపబడే నాటక రచనా ప్రయోగ విధానాలలోనూ ప్రాచ్య ప్రాశ్చాత్య మర్యాదల నన్నింటినీ అవగాహన చేసికొని, సాహిత్య విమర్శ లలితకళా విమర్శలో ఒక భాగం అన్న ఆధునిక స్పృహతో అధికారికంగా సమీక్షచేసే విమర్శకుడు లేడు. రాళ్ళపల్లి సాహిత్య వ్యక్తిత్వం సాహిత్య కళా సౌందర్య మీమాంస (Literary Aesthetics)ను తెలుగులో మొదటిసారి అవతరింపజేసింది. పద కవితనూ పద్య కవితనూ, సాహిత్యాన్ని సంగీతాన్ని, శాస్త్రాన్ని కళనూ కళా సౌందర్య దృష్టితో దర్శించి అనుశీలించే పద్ధతి ఆ వ్యక్తిత్వంలోనుండి వెలువడిన నవీన దృక్పథం.

రాళ్ళపల్లివారి నవీన దృక్పథం వారి విమర్శ మౌలికతను దృఢపరిచే మూడో లక్షణం. వారి సమకాలీనుల్లో - అంతేకాదు, ఈ శతాబ్దం మొత్తంలో వచ్చిన సాహిత్యోద్యమాలను నిర్వహించిన ప్రముఖుల్లో కూడా - చాలా మంది, రసాన్ని గురించి వారి దృక్పథాన్ని చెప్పకపోతే వారికి సాహిత్యాన్ని గురించి ఒక సమగ్రమైన దృక్పథం లేదని పండితులనుకుంటారని భావిస్తుండే వారు. అందువల్ల ఏ సంప్రదాయానికి సంబంధించినవారైనా, చివరకు సంప్రదాయాన్ని ద్వేషించేవారైనా సరే, రసాన్ని గురించి వారి అభిప్రాయాలను ప్రకటిస్తూ రచ్చకెక్కుతుండేవారు. రాళ్ళపల్లివారి రసదృష్టి వారి నవ్యదృక్పథాన్ని, అభినవ దర్శనాన్ని మనకు రూపు కట్టిస్తుంది.

"రసమనగా మన లాక్షణికులు నియమించినట్లు, శృంగారము మొదలగు తొమ్మిది భేదములే కలిగి 'యలౌకిక చర్వణా విషయ'మగు నొక వివరింపరాని పదార్థమని నా యుద్దేశము గాదు. తర్కశాస్త్ర పరాధీనులగు మన లాక్షణికులు వాదవివాదములను బెంచి యెవరో వ్రాసిన రసలక్షణములనే స్థాపింపబూని రస శబ్దమునకు మార్గమును సంకోచపఱచిరని నా యభిప్రాయము....

"శృంగారము మొదలగు రసముల 'చర్వణ' యలౌకిక మేమి? యిది లౌకిక మేమి? ఏ భావము లైనను వాని తీక్ష్ణదశలో నవిదిత వేద్యాంతరముగా ననుభవింప గల్గుదుమేని, యానందస్వరూపులై రసశబ్దవాచ్యములగును. అనగా శిల్ప మందన్న మాట! జుగుప్సా భక్తివాత్సల్యాదులు గూడ రసములే యని వాదించువారు మనలో లేకపోలేదు. తర్కశాస్త్రము నోరు మూసినను, హృదయ మును మూయజాలదు. కావున, కవి భావనాబలముచే తనకుఁ గలుగు శోకము, మోహము, అసూయ, ద్వేషము, సంతోషము, ప్రణయము మొదలగు భావము లనబడు చిత్తవికారముల మూలమున వర్ణింపవలసిన పదార్థముల స్వరూపమును నిర్ణయించి, విగ్రహమును (ఏ విగ్రహమైనను సరియే) సరళమగు భాషతోఁ దీర్చి యెదుట నిలిపినపుడు రసానుభవ సంస్కారము గల హృదయముల కట్టి మనోవికారములే కలిగి, అవి యెట్టివైనను, శిల్పమందుఁ గల యొకానొక అనిర్వచనీయ మహిమచే, ఆనందముగాఁ బరిణమించును. ఈ యర్థ మందే ప్రకృతము రస పదమును నే నుపయోగించెదను."

భారతీయమైన భరత సంప్రదాయాన్ని పట్టుకుంటే రాళ్ళపల్లి వారి రస హృదయం అర్థం కాదు; షెల్లీ, కీట్స్, కోల్‌రిడ్జి, ఎడ్గర్ అలన్‌పో, జార్జి శాంతాయన మొదలైన పాశ్చాత్య సాహిత్య కళా సౌందర్య తత్వ మీమాంసకుల ప్రస్థానాన్ని మననం చేసుకోవాలి. అప్పుడు రాళ్ళపల్లి రసమార్గం రమ్యంగా గోచరిస్తుంది. అయితే, ఇది కూడా ఒకవిధంగా పాశ్చాత్యులను అనుసరిస్తున్నట్లే కదా! మరి, రాళ్ళపల్లి వారిది అనుసరింపని స్వభావమనీ, అది వారి మౌలికతలో మొదటిగుణ మనీ ఎలా చెప్పగలం?-అనే అనుమానం ఇక్కడ రావటం సహజం. అందుకే మనం గమనింపవలసింది - 'మౌలికత' దేశ కాల పాత్రాలను బట్టి వివే చింపదగిన సాపేక్ష ప్రమాణమేనని.

ఆంధ్రసాహిత్య విమర్శ వికాసచరిత్రలో కావ్యానుశీలనయుగ (1914-48) చైతన్యానికి పోషకులుగా రాళ్ళపల్లి, దువ్వూరి పరిగణింపబడుతున్నారు. ఆ యుగకర్తగా కట్టమంచి లెక్కింపబడుతున్నాడు. అయినా, యుగకర్త కంటె భిన్నమైన విమర్శ పద్ధతిని కొట్టవచ్చేటట్లు ప్రయోగించి చూపించిన ప్రజ్ఞా వంతుడు రాళ్ళపల్లి. కట్టమంచి వారి సాహిత్యప్రమాణాలకూ రాళ్ళపల్లి వారి ప్రమాణాలకూ కాల్పనిక యుగచైతన్యపరమైన కొంత సాజాత్యం ఉన్నా, మార్గాలు భేదించటంచేత విలువల పరిగణనంలో విభేదం స్పష్టంగా కనపడు

తుంది అందువలన, తెలుగు సాహిత్య విమర్శకు సంబంధించినంతవరకు ప్రాచ్య పాశ్చాత్య సమన్వయ దృక్పథంతో ఒక నవ్య సాహిత్య సౌందర్య దర్శనాన్ని అందించారని రాళ్ళపల్లి వారిని గౌరవించటం సమంజసం. రాళ్ళపల్లి వారిది పాశ్చాత్య పద్ధతుల అంధానుకరణం అనటానికి ఆస్కారం ఎక్కడా లేదు. విషాదనాటకాన్ని మనసారా ఆహ్వానించి, ఆస్వాదించిన రసిక విమర్శకులలో ఒకరైనా రాళ్ళపల్లివారు "విషాద మెక్కువగా నాటకములం దనుభవించుటచే జనులు నీతిమంతులగుదురనుట నా సిద్ధాంతమునకు గాని, యనుభవమునకుగాని యింకను రాని మతము" అని ఖండితంగా తమ అభిప్రాయాన్ని చెప్పగలరు. తెలుగు విమర్శకు అనువైన విధానాన్ని రూపొందించే ప్రయత్నంలో ఒక బలమైన ప్రయోగంగా సాహిత్య కళాసౌందర్య విమర్శశాఖను అదనెరిగి ప్రవేశ పెట్టారు రాళ్ళపల్లివారు. చారిత్రికంగా వారు నిర్వహించిన పాత్ర అనుకర్త వంటిది కాదు; అట్లని యుగకర్తవంటిదీ కాదు. ఒక స్వతంత్ర ప్రతిపత్తి గలిగిన పోషకునివంటిది.

రాళ్ళపల్లివారి మౌలికతకు తల్లివేరులాంటిది వారిదైన రసవత్తరమైన వచన శైలి. ఇంగ్లీషు సాహిత్యంలో కాల్పనిక యుగంలోని సాహిత్య కళాసౌందర్య మీమాంసకులు అభివ్యక్తికి అగ్రస్థానం ఇచ్చారు. వారిలో కళాభివ్యక్తియే సౌందర్యం (Expression is Beauty) అనే వాదం ప్రాచుర్యం పొందింది. ఆ ధోరణిని తెలుపుతూ హెరాల్డ్ ఆస్‌బర్న్ (Harold Osborne) Aesthetics and Criticism అనే గ్రంథంలో ఇలా అన్నాడు - "The art product was valued as the expression of the artist's uniqueness, as the means by which he communicated his inspired insight into reality, or conveyed his wonderfully delicate or passionately intense emotional responses to the less favoured and gifted of mankind" (పు. 141). ఈ మాటలు రాళ్ళపల్లి వారి సాహిత్య విమర్శ శైలిని విశ్లేషించుకోటానికి అందించిన అన్వయ సూత్రంగా మనకు తోడ్పడుతాయి.

రాళ్ళపల్లివారు నాచనసోముని నవీనగుణాన్ని నిర్ణయించటంలోనూ, వేమన కవితావ్యక్తిత్వాన్ని నిరూపించటంలోనూ, పోతన కవితలో, అన్నమాచార్యాది పదకర్తల రచనల్లో, ఆధునికుల పద్య గేయ కృతులల్లో మేలిమిని గుర్తించటంలోనూ అభివ్యక్తికి సంబంధించిన అంశాలను ఆసక్తితో ఆసక్తికరంగా

అవిష్కరించటం వారి పరిశీలన సామాన్య ధర్మంగా సాక్షాత్కరిస్తుంది. చిత్ర లేఖనం, సంగీతం మొదలైన లలితకళల్లో లాగానే కవిత్వంలో కూడా భావం, వస్తువు అనే రెండు తత్త్వాలతోపాటు రచన అనే మూడో తత్త్వం ఉంటుందనీ, అటువంటి తత్త్వానికి తెలుగు కవిత్వంలో మొదట ప్రాధాన్యాన్నిచ్చింది నాచన సోముడనీ, అదే అతని నవీనగుణమనీ రాళ్ళపల్లివారు చేసిన ప్రతిపాదనలు తెలుగు సాహిత్యానుశీలనంలో వెలుగు రవ్వలుగా నేటికీ భావింపబడుతున్నాయి. అయితే, ''రచన కవిత్వ కళకు బహిరంగమగు ప్రకృతి; భావ వస్తువు లంత రంగములు. కళా వ్యక్తికి భావము జీవమని, వస్తువు బుద్ధియని, రచన శరీర మనియుఁ జెప్పవచ్చును'' అని అంటారు రాళ్ళపల్లివారే. అంటే రచనమీద రక్తి ప్రకటించేవారు శరీర లావణ్యంమీద శ్రద్ధ చూపించే వారన్నమాట!

కట్టమంచి, రాళ్ళపల్లి, దువ్వూరి - ఈ ముగ్గురూ ఒక విధంగా అభివ్యక్తి వాదులే. కాగా, కట్టమంచిది తార్కికమైన బౌద్ధికమైన గ్రాంథిక వీరావేశశైలి. రాళ్ళపల్లిది మనస్సుతో మాట్లాడుతున్నట్లుండే మధురమైన వ్యంగ్య శైలి. దువ్వూరిది మనసునూ బుద్ధినీ మన్నిస్తున్న వివేచనాత్మక శైలి. వీరి విమర్శలలో భావ వస్తువులకుండే ప్రాధాన్యంతోపాటు 'రచన' అనబడే అభివ్యక్తికి కూడా సమంగా ఉంటుంది. అయినా, కట్టమంచివారి వస్తువు ముందు రచన రక్తి కట్టదు; దువ్వూరి వారి రచనకంటె భావం పఠిత నాకట్టుకుంటుంది. ఇకపోతే- రాళ్ళపల్లి వారి రచనకు భావం జీవం పోస్తున్నట్లూ, వస్తువు వెలుగు నింపుతున్నట్లూ, రచన పారవశ్యాన్ని కలిగింప చేస్తున్నట్లూ పఠిత అనుభవిస్తాడు. అలంకారిక వచన రచనకూ రాళ్ళపల్లి వారి వచన రచనకూ తేడా ఉంది. ఒకటి పెట్టుడు సొమ్ములతో సోయగం కుమ్మరించేది; మరొకటి పుట్టుకతో వచ్చిన సోయగమే సొమ్ములుగా ఒలికించేది. విమర్శలో అందమైన కళాభివ్యక్తికి ఆస్వాద యోగ్యతను ఎలా కల్పించాలో తన అభివ్యక్తితో చూపించిన ఆచార్యుడు రాళ్ళపల్లి. అభివ్యక్తిని వచన రచనకు అభినయశక్తిగా అమర్చిన రసబ్రహ్మ రాళ్ళపల్లి.

'మౌలికత' ఉన్న సాహిత్య విమర్శకులకు అభిమాను లుంటారు; అను యాయు లుండవచ్చు; ఒక్కొకసారి ఉండకపోవచ్చు; కాని, అధిక్షేపకులుగాని విమర్శకులుగాని తప్పకుండా ఉంటారు. రాళ్ళపల్లివారి కళా సిద్ధాంతాన్ని ప్రమాణంగా తీసికొని తెలుగు సాహిత్య విమర్శలో విరివిగా విమర్శలు చేసినవారు కానరారు. ఏ మార్గానికీ చెందని కొందరు నేటి పరిశోధకులు వాటిని అవసరం

వచ్చినప్పుడు విమర్శ పాథేయాలుగా గ్రహిస్తున్నారే కాని, రాళ్ళపల్లి విమర్శ మార్గమంటూ సిద్ధాంతపరంగా సాహిత్య లోకంలో ఉన్నట్లు కానరాదు. అయితే వారు వెలువరించిన కొన్ని సమన్వయాలు నేటికీ శిరోధార్యాలుగా చెలామణి అవుతున్నాయి. అనుయాయివర్గం లేదంటే ఒక విమర్శకుని 'మౌలికత'కు వచ్చే లోపంకూడా ఏమీలేదు

రాళ్ళపల్లివారికి అనుయాయుల కంటె అభిమానులు అధికం అది వారి శైలి కల్పించిన ఒక మహేంద్రజాలం. చాలామంది వారి వ్యాసశైలిని చదివి సమ్మోహితులౌతారు శ్రీనాథుని కవితాశైలిలాగా రాళ్ళపల్లివారి వచనశైలి ఒక దివ్యమోహన శక్తిని సంపాదించుకొన్నది అది ఆరాధించటానికి బాగుంటుంది కాని, అనుకరించటానికి సాధ్యం కాదు. 1956 ప్రాంతంలో నేను ఎం. ఏ., చదువుతున్నప్పుడు నా సాహితీ వ్యక్తిత్వాన్ని రూపొందించుకోటానికి ఎన్నుకొన్న ఆదర్శమూర్తులలో రాళ్ళపల్లివారు కూడా ఉన్నారు. విమర్శలో విశ్వనాథ లాగా వివేచించాలనీ, రాళ్ళపల్లి లాగా వ్యక్తీకరించాలనీ ఒక అంటు మామిడి తోటను మనసులో కొన్నాళ్ళు పెంచి పోషించుకొన్నాను. ఆ ప్రభావం కొన్నాళ్ళు నామీద పని చేసింది. కాని, ఆ మర్రిచెట్టు, ఈ రావిచెట్టునీడల్లోనుంచి బైటకు వచ్చి నా కొమ్మలు నేను పెంచుకొన్నాను నాలాగే మరెందరో ఉండవచ్చు. రాళ్ళపల్లి వారిని అభిమానించటంలో ఉన్న ఆనందం అనుకరించటంలో లేదని జీవితానుభవంలో తెలుసుకున్నాను. పొరపాటైతే అది నా దోషం కూడా కావచ్చు.

కట్టమంచిని రాళ్ళపల్లి అన్నివేళలా మెచ్చుకోరనీ, రాళ్ళపల్లికీ విశ్వనాథకూ ఎప్పుడూ పడేది కాదనీ కథలూ గాథలే కాదు; రాతలూకోతలూ కూడా సాక్ష్యాలు పలుకుతున్నాయి. వాటికి వ్యక్తిగత ద్వేషాలు మూలం కావు; సిద్ధాంత పరమైన దృక్పథాలలో ఉన్న భేదాలే మూలకారణం. కట్టమంచి ధోరణిని కాదని రాళ్ళపల్లి తన ధోరణిని పొడిగించారు; రాళ్ళపల్లి రసమార్గానికి సాక్షాత్ విరుద్ధమైన రసప్రస్థానాన్ని విశ్వనాథ సాగించారు. ఇక ఈ ముగ్గురూ కసరుకోక ప్రశంసించుకొంటారా? ఒక తరం సైద్ధాంతికంగా వ్యతిరేకించి వాదించగలిగిన మూలబలం రాళ్ళపల్లి విమర్శలోని 'మౌలికత' అని గుర్తించాలి.

కవితాకళలో లాగా విమర్శనకళలో కూడా భావ, వస్తు, రచనాకళలుంటాయని రాళ్ళపల్లివారి మార్గంలో సంభావించవచ్చు. విమర్శలో భావకళ బలంగా ఉంటే చదువరి పరవశించిపోవాలి వస్తుకళ విశేషంగా ఉంటే విమర్శ

కుడు నిరూపించే పదార్థాలపై ఉండే దృష్టి విమర్శకుడిపై ఉండదు. రచనాకళ విమర్శలో రాజ్యం చేస్తుంటే విమర్శకుడు చిత్రవిచిత్రాలైన త్రోవలలో అభివ్యక్తులను కల్పించి చూపేటప్పుడు తాదాత్మ్యం కలిగిన దానికంటె, పదార్థదర్శనం కంటె ఆ విమర్శకుడే మన కళ్ళయెదుట ప్రత్యక్షమై నిలిచి తన నేర్పుకు కూడా ప్రశంసలు బలవంతాన అందుకొంటాడు. రాళ్ళపల్లివారి 'వేమన' చదివినా, 'రాయలనాటి రసికత'ను పరిశీలించినా, 'నిగమశర్మ అక్క'ను దర్శించినా, తిక్కన తీర్చిన సీతమ్మను ఉపాసించినా, త్యాగయ్యగారి నాదసుధారసాన్ని ఆస్వాదించినా మనకు వక్తవ్యాంశాలలో తాదాత్మ్యం కలగవచ్చు; ఆ యా వ్యాస వస్తువులూ కావ్యపాత్రలూ కంటిముందు కనపడుతున్నట్లు కదలాడవచ్చు; అయినా రచనలో ఒక అలౌకిక చమత్కారాన్ని మన కందిస్తున్న రాళ్ళపల్లివారే చివరకు మిగిలే శిల్పమూర్తి. ఆ మార్గంలో మొదటనిలిచే సాత్త్వికమూర్తి గూడా ఆయనే. *

(ఆంధ్రభూమి 6 & 13.8.1993)

[తెలుగు విశ్వవిద్యాలయం వారి తులనాత్మక అధ్యయన కేంద్రం 1993 జులై 13, 14 తేదీలలో నిర్వహించిన శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి శత జయంతి ఉత్సవాలలో సమర్పించిన వ్యాసం.]

# పింగళివారి కళాపూర్ణోదయం

జనవరి 10 వ తేదీనాడు తెలుగు విశ్వవిద్యాలయం వారు ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారి శత జయంతి ఉత్సవాన్ని, విశ్వవిద్యాలయ స్థాయి తెలుగు వజ్రోత్సవాన్ని, రెండు సాహిత్య సదస్సులుగా జరిపి ఒక మంచి పని చేశారు. ఆంధ్ర విశ్వ కళా పరిషత్తులో తెలుగు బి. ఏ. ఆనర్స్ 1931 లో ప్రారంభమైంది. ఆ చారిత్రిక ఘట్టానికి వజ్రోత్సవం. పింగళి లక్ష్మీకాంతంగారు పుట్టి నూరేళ్ళయింది కాబట్టి ఆయనకు శత జయంతి. ఈ రెండూ తెలుగు సాహిత్యం మీద అభిమానం ఉన్నవారికి ఆసక్తినీ, ఆనందాన్నీ కలిగించే అంశాలే.

పింగళి లక్ష్మీకాంతం గారు ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు ఆంధ్ర శాఖకు మొదటి అధ్యక్షులు కావటం చేత దాని రూపురేకలను దిద్ది తీర్చిన గౌరవం వారికి తొలుదొలుత దక్కుతుంది. వారి శిష్యులు వారి బాణీకి వారసులమని చెప్పుకొని గర్విస్తుంటారు కూడా. తెలుగు విశ్వవిద్యాలయ సదస్సుల్లో పింగళివారి మొదటి తరం, చివరి తరం శిష్యులు కూడా పాల్గొనటం విశేషం. పింగళివారు పాఠం చెప్పే తీరు, వ్యాసం రాసే వైఖరి, ఉపన్యాసం ఇచ్చే విధానం, మాట్లాడే వ్యవహరించే పద్ధతి మొదలైన అంశాలమీద శిష్యులు చెప్పే కథలు వింటుంటే ఆ మహాత్ముని మహనీయ వ్యక్తిత్వం ఎంతటి వైవిధ్యంతో కూడి ఉండేదో ఆశ్చర్యం కలిగిస్తుంది.

పింగళి వారి పేరు వినగానే కాటూరివారితో కలిసి రచించిన 'సౌందర నందం' మొట్టమొదట తెలుగువారి స్మృతిపథంలో తళుక్కున మెరుస్తుంది. తెలుగులో తిరుపతి వేంకటకవుల ఆశుకవితా యుగానికి భరతవాక్యంలా, నవ్య సంప్రదాయ యుగ కావ్య నిర్మాణానికి నాందీ వాక్యంలా భాసించే పింగళి-కాటూరుల కావ్య కవితా శైలి ఒక ఆధునిక కవితాభివ్యక్తికి ఆదార్శకంగా నిలిచింది.

పద్యంలో లాగానే వచనంలో కూడా పింగళి వారి వాక్కుకు ఒక శక్తిమంతమైన అభివ్యక్తి ఉంది రుచిరార్థ సూక్తి నిధిత్వం వారి వాఙ్మయ సంపద. భావకవి కృష్ణశాస్త్రి లాగా ఉండాలని తెలుగువారు ఎలా భావించేవారో ఆంధ్రాచార్యుడు లక్ష్మీకాంతం గారి లాగా ఉండాలని అలా తలపోసేవారు. విశ్వవిద్యాలయాలలో ఇంగ్లీషు భాషా సాహిత్యాలను బోధించే ఆచార్యులకు ఒక ప్రత్యేక

ఆకర్షణ, ఆదరం, గౌరవం ఉండేవి. వారికి దీటుగా ఆంధ్రాచార్యులకు కూడా ఒక అస్తిత్వాన్నీ, విశిష్ట గౌరవాన్నీ తన వ్యక్తిత్వ పాండిత్యాలతో కల్పించిన వారు పింగళివారు. ఆయనది తలవంచని తెలుగుశైలి.

పింగళివారు ఎంతటి మహావక్తయో, అంతటి మహా నటుడు. పాండవోద్యోగ విజయాలు, ముద్రారాక్షసం మొదలైన నాటకాలలో వారు పాత్రధారణం చేసి రసజ్ఞుల ప్రశంసల నందుకున్నారు. అభినయంలో ఆయన అపూర్వమైన తాదాత్మ్యాన్ని ప్రదర్శించేవారు. పాత్రలో జీవించేవారు. ఒకసారి ముద్రారాక్షస నాటకంలో రాక్షసమంత్రి పాత్ర అభినయించారు. ఆ తరువాత నాలుగైదు రోజులు ఆఫీసుకు శలవుపెట్టి ఇంట్లోనే ఉండిపోయారు. మిత్రులు, శిష్యులు దానికి కారణమేమిటని అడిగారు. రాక్షసమంత్రి పాత్రలో భావ తాదాత్మ్యం పొందిన తనకు ఆ ప్రభావంనుండి తప్పుకొని మామూలు మనిషి కావటానికి ఆసారి నాలుగైదు రోజులు పట్టిందట! మహా వక్తలు మహా నటులై ఉంటే వారి అభివ్యక్తి వాచికాభినయంలాగా రాణించి అనుభూతిని పండిస్తుంది. అందుకే పింగళివారి ఉపన్యాసం శ్రోతలను మంత్రముగ్ధులను చేసేది.

ఆంధ్ర విశ్వ కళా పరిషత్తులోనూ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం లోనూ పనిచేసి రిటైర్ అయిన తరువాత విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో సాహిత్య కార్యక్రమాల సలహాదారుగా ఉండి కొన్ని ఉన్నత ప్రమాణాలను రూపొందించారు. ఎన్నో సంస్కృతాంధ్ర నాటకాలను తమ దర్శకత్వంలో ప్రసారం చేశారు. రేడియో ఉపన్యాసకులకు, రేడియో నాటక నటులకూ వారిచ్చే వాచికాభినయ సూచనలు ఎన్నో శిల్ప రహస్యాలకు వ్యాఖ్యానం చెపుతున్నట్లుగా ఉండేది. అభినయం తెలియని ఆంధ్రాచార్యునికి అస్తిత్వం ఉండటం అసంభవ మని పింగళివారి జీవితం సందేశం ఇస్తోంది.

1968 - 70 ప్రాంతాల్లో పింగళివారితో స్వయంగా కలిసి పనిచేసే అదృష్టం నాకు కలిగింది. తెలుగు అకాడమివారు ఇంటర్ మీడియట్, బి ఏ. స్థాయిలలో తెలుగు పద్య పాఠ్యాంశాలను గ్రేడెడ్ పద్ధతిలో ఎన్నిక చేయించి వాటిని ముద్రించి వివిధ విశ్వవిద్యాలయాలకు అందుబాటులో ఉండేటట్లు చేయాలని ఒక పథకాన్ని రూపొందించారు. అప్పటి తెలుగు అకాడమి డైరెక్టర్ డాక్టర్ పి యస్.ఆర్. అప్పారావుగారు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారిని ఆ కార్యక్రమాన్ని నిర్వహించే కమిటీకి అధ్యక్షులుగా ఉండటానికి అంగీకరింప జేశారు. ఆ కమిటీలో నన్ను కూడా ఒక సభ్యునిగా ఎంపిక చేశారు. ఆ కమిటీలో

పింగళివారితో కలిసి పనిచేసిన ఆ రోజులు జీవితంలో మరిచిపోలేనివి. వారితో సాహిత్య విషయాల మీద జరిపే చర్చలు వివిధాంశాల మీద వారికున్న అభిప్రాయాలను తెలుసుకోటానికి కవాటాల్లాగా ఉపయోగపడేవి. మచ్చు కొకటి రెండు పేర్కొంటాను.

పింగళివారికి కవిత్రయ మహాభారతం ఆరోప్రాణం. ప్రయోగ ప్రామాణ్యం కోసం మహాభారతాన్ని ప్రత్యగ్రధారణలో ఉంచుకోవటం తిరుపతి వేంకట కవుల శిష్యులకూ, అవధానులకూ ఆ కాలంలో అవసరమయ్యేది. కవిత్రయ ప్రయోగాలు పండితులకు శిరోధార్యాలు ఆ రోజుల్లో. పింగళివారు పాండిత్యం కోసమే కాకుండా మనశ్శాంతికోసం కూడా మహా భారతం చదివేవారట! భారత పఠనం బహుళార్థ సాధకమని వారు అనుభవపూర్వకంగా ఎన్నో జీవిత సన్నివేశాలను వివరిస్తూ ఉండేవారు. వారికి కవిత్రయాన్ని గురించీ, ప్రబంధ కవులనుగురించీ కొన్ని నిర్దిష్టమైన అభిప్రాయా లున్నాయి. ఉదాహరణకు- "సంస్కృతమున వ్యాస వాల్మీకి కాళిదాసాది మహా కవులకును, నైషధాది కావ్యకర్తలకును ఏ వాసి యుండునో ఆ వాసియే తెలుగులో కవిత్రయము వారికిని ఇతర ప్రబంధ కవులకును కలదు. అదియే ఈ యిరువురకున్ను ఉన్న భేదము." (గౌతమ వ్యాసములు, పు. 24.)

తెలుగు సాహిత్యంలో వెలసిన ప్రతి కావ్యాన్నీ చదివి, విమర్శాత్మక దృష్టితో పరిశీలించి, కొన్ని విలువైన నిర్ణయాలను ఏర్పరచుకొని, వాటిని లక్ష్యలక్షణ సమన్వయ భావంతో వివరించటం పింగళివారి వైఖరి. వారి ప్రతిపాదన పటిమలను ఆలోచింపచేస్తూ అంగీకరింపచేసేటట్లుంటుంది. కార్య కారణ సంబద్ధంగా సాగే వారి వివరణ తీర్పులాంటి నిర్ణయాలతో ముగుస్తూ ఉంటుంది. వివరణలో ఆసక్తి జీవిస్తుంది: నిర్ణయాలలో ఫలితాంశం ప్రతి ఫలిస్తుంది.

మనుచరిత్రలో నుంచి పాఠ్యాంశాలను ఎన్నిక చేస్తున్నాం ఒకనాడు. ఆసక్తికొద్దీ ఒక ప్రశ్న వేశాను పింగళివారిని మారన మార్కండేయ పురాణం లోని స్వారోచిష మనుసంభవ వృత్తాంత ఘట్టాన్ని బి.ఏ. స్థాయిలో ఇచ్చికాంశ పాఠ్యంగా ఎన్నికచేస్తే బాగుంటుందా అని నేను ప్రశ్నించాను. పింగళివారు కను బొమలు పైకెత్తి నావైపు చూచారు. "అల్లసాని పెద్దనకు మారన కొన్ని అంశా లలో గురువులా కనపడతాడు" అని వినయంగా అన్నాను. "నిజమే. మారన

మనుచరిత్ర చదివితే పెద్దన మనుచరిత్ర మీద ఇప్పుడున్నంత అభిమానం ఆంధ్రుల కుండదేమో! అయినా, మారన వాక్పాకం వేరు, పెద్దన ప్రబంధశైలి వేరు. మనం పెద్దన కవితలో మనుచరిత్రను విద్యార్థుల కందించటం ముఖ్యం. పద్యపాఠ్యంలో ఉపాధ్యాయులు ముఖ్యంగా శ్రద్ధ వహించవలసింది కవితా కళా శిల్పాన్ని విద్యార్థులకు వివేచించి చెప్పటంలోనే. ఆ తరువాతనే కథాంశాలూ, పాత్ర చిత్రణలూనూ''- అని మనుచరిత్ర పాఠ్యాంశ ప్రాధాన్యాన్ని గురించి సోపపత్తికంగా వివరించి, నేనూ వారితో అంగీకరించేటట్లు చేశారు.

పింగళివారితో జరిగిన సమావేశాల్లో, సంభాషణల్లో నేనెన్నడూ మరచి పోలేని ఆర్ద్రమైన ఘట్టం ఒకటి ఉంది. మేము పింగళి సూరన కళాపూర్ణోదయంలో నుంచి పాఠ్యాంశాలను ఎన్నిక చేస్తున్నాం ఒకనాడు. సరస్వతీ చతుర్ముఖుల ప్రణయ సన్నివేశం గురించి ప్రస్తావన వచ్చింది. దాన్ని స్మరించుకుంటూ అంతవరకూ గంభీరంగా ఉన్న పింగళివారు ఒక్కసారిగా కంట తడిపెట్టారు. కంఠం బొంగురుపోయింది. చేతి రుమాలతో కళ్ళద్దుకున్నారు. రెండు మూడు నిమిషాలు ఉద్వేగానికి గురి అయ్యారు. ఆ తరువాత తమంతట తామే నిబ్బరించు కున్నారు. నేను వారి ఉద్విగ్నతకు కారణం అడిగాను. ఆయన ఆర్ద్రంగా తనలో తాను మాట్లాడుకుంటున్నట్లుగా చెప్పారు. అవి పింగళి వారి అర్ధాంగి శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు కాలం చేసిన రోజులు. ఆమె మీద వారు స్మృతి కావ్యం రాసిన రోజులు. దంపతులలో భార్యాభర్తల సంబంధాలను గురించి పింగళివారు చెపుతూ ఎవరిమధ్య మధురమైన అనురాగంతో పాటు, బౌద్ధికమైన స్నేహబంధం (Intellectual Companionship) ఉంటుందో అది ఉత్తమ మైనదనీ, సృజనాత్మకతకు అది మూలకందమనీ వివరించారు. సరస్వతీదేవి బ్రహ్మదేవునిలోని భావనాశక్తిని ప్రేరేపించి, సృజనాత్మకతను పోషించేదనీ అందువల్లనే చతుర్ముఖుడు కళాపూర్ణుని భావనం చేయకలిగాడనీ వ్యాఖ్యా నించారు. అంతటితో ఆగలేదు. ఆత్మీయమైన అనుభూతిని నెమరువేసుకున్నారు. శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు సరస్వతి వంటిదనీ, ఆమె సాహచర్యం వల్లనే, ప్రేరణవల్లనే, తన సాహిత్య కళాజీవితం వికసించిందనీ, ఆమె తనకు ప్రేయసి, స్నేహితురాలు, మార్గదర్శి అని అంటూ తన్మయత్వంతో అంతర్ముఖులై పోయారు.

అలనాటి పింగళి సూరన దర్శించిన చతుర్ముఖుడు, కళాపూర్ణుడు ఆనాటి పింగళి లక్ష్మీకాంతంగారిలాగా మూర్తికట్టి దర్శనమిచ్చినట్లయింది. *

(ఆంధ్రభూమి 21-1-1994)

# పింగళివారి సవిమర్శ సాహిత్యచరిత్ర

ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారి పేరు విశ్వవిద్యాలయాలలో ఆంధ్ర సాహిత్య చరిత్రతో ముడిపడి ఉంది. స్నాతకోత్తర తరగతులలో సవిమర్శ సాహిత్య చరిత్రను నిర్మించి బోధించే పద్ధతికి పింగళివారు బాటలు వేశారు. వారు పాఠం చెప్పటానికి ప్రాతిపదికగా ఒక నోట్సును ముందుగా తయారు చేశారట. దానిని ఆయా సందర్భాలలో నూత్న విశేషాలతో పెంచుతూ ఉండే వారట. విద్యార్థుల కా నోట్సు అందుబాటులో ఉంచేవారు. తరగతిలో వారి ఉపన్యాసం శ్రవణం, ఆ తరువాత వారి నోట్సు మననంగా సాగుతుండేదట. ఎన్నో వినూత్నాంశాలను విద్యార్థులకు చెపుతూ ఉండేవారట. కాని, వాటిని ప్రచురించాలనే ప్రయత్నం చేయలేకపోయారు. గురువుగారి ఆ బలహీనతను పసికట్టిన కొందరు శిష్యులు ఆ నోట్సునే తమపేర గ్రంథంగా వెలువరించుకొన్న ఉదంతాలు కూడా ఉన్నాయి. పింగళివారి శిష్యులు అధ్యాపకులైన కళాశాలల్లో విశ్వవిద్యాలయాలల్లో వారి గురువుగారి సాహిత్యచరిత్ర ప్రత్యక్షంగానో, పరోక్షం గానో శిష్య పరంపరలకు అందుతూ ఉండేది. బైట ఎన్ని సాహిత్య చరిత్రలు వెలువడ్డా తరగతి గదుల్లో మాత్రం పింగళి వారి బాణీ చాలాకాలం పీట వేసుకొని కూర్చుంది.

పింగళివారు రిటైరైన తరువాత సాహిత్య చరిత్రను ప్రచురించాలని సంకల్పించారు. అయితే, అప్పటికే వారి మాటలు వేరే వారిపేర అచ్చుబోసుకొని దేశంలో తిరగటం చూసి కొంత నిరుత్సాహం చెందినా, ఒరిజినాలిటీ ఉన్నవారు కాబట్టి మరలా ఆంధ్రసాహిత్య చరిత్రను సవిమర్శకంగా నిర్మించటం ప్రారంభించారు. కాని, శ్రీకృష్ణదేవరాయల యుగంలో అడుగుపెట్టి నాలుగైదు పుటల రచన సాగిందో లేదో పింగళివారు కన్నుమూశారు. సాహిత్యచరిత్ర సగంలోనే ఆగిపోయింది. పింగళివారు తమ 'సవిమర్శ ఆంధ్ర సాహిత్య చరిత్ర'ను శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామికి అంకితం చేశారు. అంకిత పద్యాలు మొదలే వ్రాసి గ్రంథం ఆరంభించారు. ఆ పద్యాలలో రెండు మనం గమనింపదగినవి—

ఉ. "సారతరాంధ్ర వాఙ్మయ విశాల జగత్పరిణామ కారణో
దార కవీంద్ర కావ్య పురుషార్థ నిరూపిత తత్తదాత్మ సం
స్కారవిలోక దర్పణ ముఖమ్మిది, యీ చరితమ్ము సాహితీ
మేరువు తా బుధోత్తముల మెప్పు గడించెను మున్నె నీ కృపన్."

గీ॥ "ఇది జనించిన నలుబదియేండ్లనుండి
సరస సాహిత్య విజ్ఞాన పత్ర మనుచు
ఆశ్రయింపని తెలుగు విద్యార్థి లేడు
చొచ్చి చూడని తెల్గు వ్యాసుండు లేడు."

సారవంతమైన సాహిత్య జగత్తులో జరిగే పరిణామాలకు ఉదారకారణాలు కవీంద్రులు రచించే కావ్యాలు. ఆయా కావ్యాలలో ప్రతిబింబించిన ఆయా కవుల ఆత్మ సంస్కారాన్ని దర్శించటానికి వీలైన అద్దంలా సాహిత్య చరిత్రను రచిస్తున్నానని పింగళి వారు శపథం పట్టారు. కవుల రచనలే సాహిత్య పరిణామ హేతువులుగా నిరూపించే సాహిత్య చరిత్రలో కవులకే అగ్రతాంబూలం అందుతుంది. దాని కనుగుణంగానే పింగళివారు సాహిత్య చరిత్రలోని యుగవిభాగం యుగకర్తలైన కవుల పేర్లమీద ఉండటం న్యాయమని భావించారు. ప్రాఙ్నన్నయ యుగం, నన్నయ యుగం, శివకవి యుగం, తిక్కన యుగం, ఎఱ్ఱాప్రెగ్గడ యుగం, శ్రీనాథ యుగం, శ్రీకృష్ణదేవరాయల యుగం అని 16వ శతాబ్దం వరకు యుగవిభాగం చేశారు. ఆ తరువాత దక్షిణాంధ్రయుగ మనీ, క్షీణ యుగమనీ, ఆధునిక యుగమనీ సంభావించారు. అందువలన వారు పెట్టుకొన్న నియమం సాహిత్య చరిత్ర కంతటికీ వర్తించదని వారి రచనా ప్రణాళికలోనే రుజువై పోయింది.

అయినా, ప్రతియుగంలోనూ ఉన్న విశిష్ట కవుల సాహితీ వ్యక్తిత్వాలనూ కవితా వైలక్షణ్యాలనూ సవిమర్శకంగా అంచనాకట్టి విలువల న్యాయాధికారిగా తమ అభిప్రాయాలను వ్యక్తం చేశారు పింగళివారు. నాచన సోముని కవితా స్వరూప స్వభావాలను వివేచించిన ఈ మాటలు పింగళివారి తీర్పులోని నేర్పును ప్రకటిస్తున్నాయి. - "ప్రశాంతమైన రససిద్ధి గలిగించి తన్మయుల జేయు శక్తి అతని కవిత్వమున లేదు అతడు కలిగించు హృదయ విస్మృతినిబట్టి 'ఓహో' యని ఆశ్చర్య చకితుల మగుదుమే గాని 'అహా' యనెడి పరవశ భావము పొందము. అతని మెచ్చుకొందుమే కాని అతనిలో లీనము కాలేము. ఆ పరమాను

భూతి ఎట్టిన సుకరముగా కల్గించును. కాని, ఎట్టిన కవిత్వమున గల్గు పార వశ్యము ఎడనెడ కొన్ని కొన్ని ఘట్టములలోనే జరుగుచుండగా, సోమన కలిగించు నాశ్చర్యము ప్రతిపదస్యంది యగుచుండును." ఈ తీర్పు చెప్పి దాదాపు అరవై యేళ్ళు దాటింది. ఈ అభిప్రాయాలమీద ఎన్నో తర్జన భర్జనలు జరిగాయి. ఎట్టిన, నాచన సోములమీద ఎంతో పరిశోధన కొనసాగింది. కాని, పింగళి వారి తీర్పు ఇప్పటికీ పలువురి మన్నన నందుకుంటోంది. సత్యానికి సన్నిహితమైన ప్రతిపాదనగా సంభావింపబడుతోంది ఇటువంటి ప్రతిపాదనలు బహుళ సంఖ్యలో ఉండటం వల్లనే పింగళివారి సాహిత్య చరిత్ర సవిమర్శ ఆంధ్ర సాహిత్య చరిత్ర అనే పేరుతో సార్థకమౌతోంది. దాన్ని ప్రచురించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారూ, తెలుగు విశ్వవిద్యాలయం వారూ 'సవిమర్శ' అనే విశేషణాన్ని గాలికి వదిలేశారు. అది పొరపాటో గ్రహపాటో వారికే తెలియాలి!

పింగళివారి గౌతమ వ్యాసాల్లో మొదటిది 'ఆంధ్ర వాఙ్మయ స్థూల రూపము.' అది వారి సాహిత్య చరిత్రకు ప్రాతిపదిక అయిన ప్రణాళిక. అంతే కాదు, 1930 తరువాత వచ్చిన మరెన్నో సాహిత్య చరిత్రలకు కూడా పరోక్ష ప్రణాళిక.

తెలుగు కవులు సాధించిన స్వతంత్ర ప్రక్రియగా ప్రబంధాన్ని నిరూపించి, దాని లక్షణాలను పేర్కొని, ప్రబంధమే సాహిత్య వికాస దశకు సమున్నత ప్రమాణమని భావించి తెలుగు సాహిత్యాన్ని సమీక్షించిన విమర్శకుడు, సాహిత్య చరిత్రకర్త ఆచార్య పింగళి లక్ష్మీకాంతం. సంస్కృత లక్షణ గ్రంథాల ననుస రించి గమనిస్తే ప్రబంధానికీ, కావ్యానికీ భేదం లేదు. అందువలన సంస్కృత పండితులు తెలుగు ప్రబంధానికి ప్రత్యేక ప్రతిపత్తిని అంగీకరింపరు. తెలుగు విమర్శకులే ప్రబంధ లక్షణాలను ప్రత్యేకంగా చెప్పారు. అలా చెప్పే ఆలోచన మార్గానికి ఆచార్యులుగా, దర్శకులుగా నిలిచినవారు పింగళివారు "నూత్న తేజముతో వెలుగొందు ఈ సామ్రాజ్య వైభవముతోపాటు నవనవోన్మేషమైన స్వతంత్ర సారస్వతరూపముకూడ వెలసినది. (The First Romantic move- ment). అదియే ప్రబంధావిర్భావము. ఆ ప్రబంధమే ఆంధ్రులు తమ ప్రత్యేక కావ్యసిద్ధిగా కొనియాడుకొనదగిన ప్రక్రియ" - అని ఆయన నిస్సంశయంగా చేసిన ప్రకటన. దీనిమీద దాదాపు అర్ధ శతాబ్దం చర్చసాగింది. దాదాపు రెండు దశాబ్దాల నుండి పింగళివారి వాదమే స్థిరపడిపోయింది.

'ప్రబంధం' తెలుగువారి స్వతంత్ర ప్రక్రియగా భావించే సాహిత్య చరిత్రకారులు ప్రక్రియాపరంగా యుగవిభాగం చేస్తూ ప్రబంధపూర్వయుగం, ప్రబంధయుగం, అనంతర ప్రబంధయుగం, క్షీణప్రబంధయుగం అని పేర్లు పెట్టి పిలిచారు. అదీ పింగళివారి వాదానికి వచ్చిన ప్రచారానికి ఫలమే.

పింగళివారి ఆంధ్ర సాహిత్య చరిత్ర 1974 లో ప్రచురింపబడినా, దాని తొలిరూపం 1930 ప్రాంతంలో పుట్టినట్లు వారే పేర్కొన్నారు. అప్పటి వారి రచనాప్రణాళిక అంతకు ముందున్న సాహిత్య చరిత్రల ప్రణాళికల కంటె విలక్షణమైనదని నిస్సంశయంగా చెప్పవచ్చు. గురజాడ రామమూర్తి గారి 'కవి జీవితములు' (1893) మొదట వచ్చింది. కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'ఆంధ్రకవుల చరిత్రము' 1886 నుంచి 1917 దాకా విపులీకరింపబడుతూనే వచ్చింది. అయితే, కాలక్రమ పద్ధతిలో సాహిత్య చరిత్రను యుగ విభాగం చేసుకొని, ఆయా యుగాల్లో వెలసిన కవుల చరిత్రను సాహిత్యవివేచనతో పరిశోధనాత్మకంగా రచించిన గౌరవం పంతులు గారికే దక్కింది. పింగళివారికి వీరేశలింగం పంతులుగారి కవుల చరిత్ర మీద అపార గౌరవం ఉండేది.

ఆ తరువాత వంగూరు సుబ్బారావుగారి 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర' (1920), కవిత్వవేది రచించిన 'వాఙ్మయ చరిత్ర సంగ్రహము (1928) వెలువడి, సాహిత్య చరిత్ర నిర్మాణంలో పాశ్చాత్య ప్రభావాన్ని ప్రదర్శించాయి. వారిరువురి యుగ విభాగ విధానాలలో ఉన్న లోపాలను పింగళివారు తొలగించి, ఆంధ్ర సాహిత్య చరిత్ర నిర్మాణంలో ఒక దేశీయమైన పద్ధతిని ప్రవేశపెట్టారు. సాహిత్య పరిణామానికి దేశ కాల మత రాజకీయాది పరిస్థితులు ఎలా దోహదం చేస్తాయో వివరిస్తూనే సాహిత్యంలో వచ్చిన నిజమైన పరిణామాన్ని లోతుగా విమర్శించి విలువ కట్టే వివేచన మార్గానికి పింగళి లక్ష్మీకాంతంగారు శ్రీకారం చుట్టారు. సాహిత్య చరిత్ర నిర్మాణంలో ప్రణాళిక మూల బలం; చరిత్రకారుని విలువల వివేచనం ఆత్మప్రకాశం. ఈ రెండూ పింగళివారు తమ సవిమర్శ సాహిత్య చరిత్రకు సమకూర్చారు.

ఈనాడు ఒక సత్యం గమనించాలి. పింగళివారి తరం మారింది. క్రొత్త రకం సాహిత్య వికాస చరిత్రలకు ఆధునికులు సన్నాహాలు చేస్తున్నారు. అయితే, అవన్నీ తాతగారి భుజాలమీద ఎక్కి ఆడుకుంటున్న మనుమలూ, మనుమరాండ్రే. ఆ తాతల తరానికి చెందిన ఒక నేత, విశిష్ట దృక్పథ ప్రదాత ఆచార్య పింగళి లక్ష్మీకాంతం. శతజయంతి వారికొక సాహిత్య నీరాజనం! *

(ఆంధ్రభూమి, 28-1-1994)

# సమన్వయ విమర్శ కేతనం
# సాహిత్య శిల్ప సమీక్ష

బహుముఖ సాహితీ చైతన్యం గల ప్రతిభామూర్తులు కొందరు మాత్రమే ఒక్కొక్క కాలంలో ఉంటూంటారు. వారు చుక్కల్లో చంద్రుల్లాగా ప్రకాశిస్తూ ఉంటారు. అయితే, వారి రచనావ్యాసంగంలో ఒక భేదం సామాన్యంగా గోచరిస్తూ ఉంటుంది. కొందరు తమ బహుముఖ ప్రజ్ఞను ప్రతిరచనలోనూ ప్రదర్శిస్తూ ఉంటారు. మరికొందరు తమ బహుముఖ ప్రజ్ఞలోని ఒక్కొక ముఖాన్ని ఒక్కొక్క రచనలో ప్రకటిస్తూ ఉంటారు. మొదటి తరగతివారు రచించిన ఏ రచన చదివినా వారి వ్యక్తిత్వం అందులో పూర్ణానుభవ స్ఫూర్తిని ప్రతిఫలింపజేస్తున్నట్లు అనిపిస్తుంది. వారి రచనలన్నీ చదివితే వారి సమగ్ర వ్యక్తిత్వ స్ఫూర్తి సాంద్రంగా ప్రత్యక్షమౌతుంది. ఇక రెండవ పక్షంవారు ఒక్కొక్క రచనలో ఒక్కొక్క ప్రతిభాముఖాన్ని ప్రకాశింపజేస్తుంటారు కాబట్టి, వారి గ్రంథాలన్నీ చదివితే తప్ప వారి సాహితీవ్యక్తిత్వ సమగ్రత సాక్షాత్కారం కాదు. సాహిత్యాచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారు ఈ రెండోకోవకు చెందే ప్రతిభామూర్తులు.

శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారు కవులు, విమర్శకులు, మహావక్తలు, రచయితలు, ఉపాధ్యాయులు, నాటక ప్రయోక్తలు, నటులు. ఇలా ఎన్నో రంగాలలో సృజనాత్మక ప్రతిభగల ప్రయోగశీలి పింగళివారు. కాని, అన్ని రంగాలలో వారు చేసిన ప్రయోగాలు ఒక యెత్తు; ఆంధ్ర సాహిత్యాధ్యాపన రంగంలో వారు చేసి చూపిన ప్రయోగాలు మరొక యెత్తు. ఆంధ్ర విశ్వకళా పరిషత్తులోని ఆంధ్ర సాహిత్యాధ్యయన శాఖకు వారు పితామహకల్పులు. దానికి రూపురేకలు దిద్దటం, జవసత్వాలను కలిగించటం, ప్రయోగ ప్రమాణాలను రూపొందించటం; భవిష్యద్దర్శనాన్ని ప్రసాదించటం వారు తమ బాధ్యతగా స్వీకరించి, సమర్థవంతంగా నిర్వహించారు.

శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారు సమకాలీన సాహిత్య చైతన్యానికి సమగ్రంగా, సముచితంగా స్పందించేవారు. కాని, క్రొత్తదనంలో కొట్టుకొనిపోవటం వారి స్వభావం కాదు. గతంతో సవ్యతకు మెరుగు పెట్టేవారు. వర్తమానంలోని ఆవేశానికి కళ్లెం వేసి, ఆలోచనకు అక్షరశిల్పాన్ని అందించేవారు. గతానికి, వర్తమానానికి ఒక సమన్వయ సంధాతగా ఉంటూ, తాము నిర్వహించే పాత్రను నిర్మాణాత్మకంగానే కాకుండా, సృజనాత్మకంగా కూడా ఉండగలిగేటట్లు దిద్దితీర్చుకొనేవారు.

చెళ్లపిళ్లవారి యుగంలో నివసిస్తూ వారి అవధానకవితా ప్రభావానికి స్పందించి జంటకవిత్వ ప్రవృత్తికి పూనుకున్నా- అవధానాలు చేపట్టకుండా నిగ్రహించుకొని అభినవ కావ్యరచనా మార్గాన్ని ఆవిష్కరించారు. సౌందరనంద కావ్యం జంటకవులు రచించిన కావ్యాలలో సాటిలేని సాహితీశిల్ప శిఖరంలా ప్రశంసలందుకున్నది భావకవితాయుగ చైతన్యంలోని ఖండకావ్యాన్ని అభినవ కావ్యం వైపు నడిపించిన తొలితరం ఆచార్యులలో ఒకరు పింగళి.

తెలుగు సాహిత్య విమర్శమీద ఇంగ్లీషు కాల్పనిక యుగ చైతన్యాన్ని వర్షించి క్రొత్త పంటలు పండించే పండితుడు కట్టమంచి రామలింగారెడ్డిగారు ఉపాధ్యక్షులుగా ఆంధ్ర విశ్వకళా పరిషత్తును మాగాణిగా మారుస్తున్న రోజుల్లో కూడా పింగళి లక్ష్మీకాంతంగారు రెడ్డిగారి క్రొత్త వరదలో పడి తెలుగు సాహిత్య విమర్శ కొట్టుకొనిపోకుండా గట్లులు కట్టి నేలకున్న సారాన్ని నిలువబెట్టి సమన్వయశీలాన్ని సంరక్షించిన సహనశీలిగా ఎంతో నిర్మాణాత్మకమైన పాత్రను చరిత్రలో నిశ్శబ్దంగా నిర్వహించారు.

పింగళివారి జీవితంలో ఉపాధ్యాయవృత్తికీ, రచనా ప్రవృత్తికీ సంతత సంఘర్షణ ఏర్పడ్డట్లు వారి జీవిత చరిత్ర, కొన్ని రచనలు స్పష్టం చేస్తున్నాయి. దానికి కారణం లేకపోలేదు. పింగళివారు పరిణతమైన ప్రజ్ఞను అభిమానించేవారు, ఆదరించేవారు. వారు తెలుగులో విశ్వవిద్యాలయ స్థాయిలో విద్యార్థుల సాహితీ మూర్తిమత్వాలను రూపొందించే పాఠ్య ప్రణాళికలను, విద్యాబోధన సూత్రాలను దిద్ది తీర్చవలసిన అవసరం వచ్చింది. ఆనర్సు కోర్సులో చెప్పవలసిన విషయాలేమిటి? వాటిని బోధించే పద్ధతులేమిటి? వాటికి తగిన పాఠ్యాంశాలేమిటి? వాటిని సూచించే పాఠ్యగ్రంథాలేమిటి?– అనే ప్రశ్నలకు వారే సమాధానాలు చెప్పవలసి వచ్చింది. ఈ నాలుగు మార్గాలలో మొట్టమొదటిసారి వెలుగు

బాటలను వేసి చూపించిన ప్రాచార్యులు శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు. వారు చూపించిన పాఠ్యాంశ ప్రణాళిక వివిధ విశ్వవిద్యాలయాలలోని తెలుగు శాఖలను దాదాపొక అర్ధశతాబ్ది చూపుడు వేలుతో నడిపించింది. పాఠ్యగ్రంథాలున్న పద్య కవిత్వం, నాటకం మొదలైన అంశాలను ఎలా బోధించాలో పింగళివారు చెప్పిన పాఠం తరువాతి రెండు తరాల వరకూ వరప్రదానంగా తారసిల్లింది. పాఠ్య గ్రంథాలు లేని సాహిత్య విమర్శ సూత్రాలు, 'సాహిత్య చరిత్ర', 'సంస్కృత సుబోధ వ్యాకరణం' మొదలైన అంశాలలో పింగళివారు దుర్గమారణ్యంలో త్రోవలు వేసినట్లు కొన్ని బాటలు నిర్మించి చూపించి మార్గదర్శకులు, మార్గ నిర్మాతలు అయ్యారు. 'సాహిత్య చరిత్ర'కు కవుల చరిత్రకంటే భిన్నమైన అస్తిత్వాన్ని కల్పించి, అందులోని వికాస సూత్రానికి ప్రాథమికమైన ఆధారా లను పునాదులుగా అమర్చిన మొదటి గౌరవం పింగళివారికే దక్కుతుంది. అలాగే విమర్శ సూత్రాలకూ, అనువర్తిత విమర్శ విధానానికి సంబంధించిన అంశాలలో కూడా వారిదే ఆచార్య పీఠం అయితే, ఈ మూడంశాలూ బోధిం చిన కొద్దీ పరిణతిని సూచించేవి. సాహిత్య చరిత్రను సాహిత్య విమర్శనూ బోధించే ఆచార్యుడు ప్రతి సంవత్సరం లేదా చెప్పిన ప్రతిసారీ ఏదో ఒక నూత నాంశాన్ని జోడించి చెప్పకపోతే అతడు పరిణతి చెందుతున్నట్లు కాదు. ఆ అంశా లలో పరిణతిని కోరే పండితునికి ఎప్పుడూ తృప్తి కలగదు. ఏదో ఇంకా క్రొత్తది చెప్పాలి, అభినవమైన అన్వయాన్ని సాధించాలి అనే తపన అగ్నిలా అతణ్ణి దహిస్తూ ఉంటుంది. అందువలన అటువంటివారు తమ ఆలోచనలను ఒక గ్రంథంగా సంగ్రథించటానికి అంత త్వరగా ముందుకు రారు. పింగళివారి కథలో కూడా అదే జరిగింది.

ఆంధ్ర సాహిత్య విమర్శ వికాస చరిత్రను నేను ఈ క్రింది యుగాలుగా విభజించాను :

1. వికాసయుగం (క్రీ. శ. 1874 నుండి 1913 వరకు)
2. కావ్యానుశీలనయుగం (క్రీ.శ. 1914 నుండి 1948 వరకు)
3 శిల్పానుశీలనయుగం (క్రీ.శ. 1948 నుండి 1963 వరకు)
4. సమన్వయయుగం (క్రీ.శ. 1963-1970)
5. సమీక్షాయుగం (క్రీ.శ. 1970 నుండి)

పరిశోధనయుగం సాహిత్య విమర్శలో దాదాపు 1960 నుండి సమన్వయ యుగంలో శక్తిమంతమైన శాఖగా సాగింది-ఇప్పటికీ సాగుతోంది. కాని, 1970 తరువాత తన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని కోల్పోయింది.

సమన్వయయుగంలో సృజనాత్మక విమర్శకంటే సమన్వయాత్మక, విశ్లేషణాత్మక విమర్శ ఎక్కువ వచ్చింది. సమన్వయయుగ విమర్శకులు పాశ్చాత్య విమర్శ పద్ధతులనూ, ప్రమాణాలనూ, ప్రక్రియలనూ, పారిభాషిక పదజాలాన్నీ తెలుగువారికి స్పష్టంగా తెలియబరుస్తూనే వాటిని దేశీయమైనవాటితో సమన్వయిస్తూ సంవాద విధానాన్ని వ్యక్తం చేశారు. భారతీయ సిద్ధాంతాలతో పాశ్చాత్య సిద్ధాంతాలను తులనాత్మకంగా చర్చించి, ఆంధ్ర సాహిత్యంలో అవి ఏ విధంగా ప్రయోగాలలో స్వతంత్ర ప్రతిపత్తిని సంపాదించుకొన్నాయో వివరించే విజ్ఞతను ప్రకటించారు. భారతీయ దృక్పథానికి పాశ్చాత్య ప్రభావం పరిపోషక ద్రవ్యంగా ప్రవర్ధిల్లిన పద్ధతిని ప్రపంచించారు. ఇదే సమన్వయ యుగ ప్రధాన ధర్మంగా పరిగణింపబడుతున్నది.

ఈ యుగం ప్రారంభం కావటానికిముందే ఈ యుగచైతన్యానికి బాటలు వేసిన వారిలో పింగళి లక్ష్మీకాంతంగారు ప్రథమంగా పేర్కొనదగినవారు. ప్రాచ్య పాశ్చాత్య విమర్శ సూత్ర సమన్వయం వారి విమర్శ లక్షణం. వారి గౌతమ వ్యాసాలు (1952) వారి సమన్వయ విమర్శ విధానానికి తొలి వెలుగు బాట. ఆ తరువాత వారు సాగించిన సాహిత్యవిమర్శ సప్రమాణమైన సమన్వయ ధోరణిని స్పష్టంగా వెలార్చింది. పింగళివారు మాట్లాడినా, వ్రాసినా అది సమరసమైన సాహిత్యపు తీర్పులా ఉంటుందని తెలుగువారు మెచ్చుకొనేవారు. పెక్కుమంది తెలుగు కవుల వ్యక్తిత్వాలకు విలువ కట్టిందీ, ప్రబంధ ప్రక్రియకు స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించిందీ, సాహిత్య చరిత్రలో యుగవిభాగాల నిర్ణయాన్ని వ్యవస్థీకరించిందీ, విమర్శ పద్ధతులను వివేచించిందీ ఆయనే.

పింగళివారు రచించిన సాహిత్యశిల్ప సమీక్ష (1966), ఆంధ్ర సాహిత్య చరిత్ర (అసమగ్రం) (1974) నిజానికి 1960 ప్రాంతంలోనే వెలువడవలసినవి పింగళివారు ఉద్యోగం చేసినంతకాలం ప్రవచనంలో నిమగ్నులైనారు. రిటైరైన తరువాత తాము పూర్వం చెప్పిన అంశాలను చర్వణం చేసికొన్నట్లు గ్రంథస్థం చేశారు. అందువలన ఆ గ్రంథాలలో వారి ప్రవచన కాలంలోని అభిప్రాయాలే ప్రధానంగా కనపడతాయి. వారి సాహిత్య శిల్ప సమీక్ష మీద హడ్సన్ రచించిన 'An Introduction to the Study of Literature' ప్రభావం కనపడుతుంది. వారాగ్రంథంలోని పాశ్చాత్యవిమర్శ లక్షణాలను భారతీయాలంకారిక విమర్శ లక్షణాలతో తులనాత్మకంగా చర్చించి సిద్ధాంత ప్రవచనం చేశారు.

"రచన సుందరమై, సార్వజనీన ప్రయోజనములను కలిగి, భావనాహ్లాదమైన ఆహ్లాదము నిచ్చును కర్త యొక్క ఆత్మీయతను స్ఫురింపజేయు గ్రంథము కావ్యము. ఆ కావ్యజాలమే సాహిత్యము. ఆ సాహిత్యమొక కళ. (సా. శి. స. పు. 5.) వంటి నిర్వచనాలు వారి సమన్వయ దృక్పథానికి దృష్టాంతాలు.

ఆంధ్ర విమర్శలో పాశ్చాత్య పరిజ్ఞానంతో ప్రయోగించే పారిభాషిక పదాలను నిర్ధారించటం వారు చేసిన గొప్పసేవ. అంతరమూర్తి (Inner being), ఆత్మీయత (Personality), చిత్రకళలు (Arts of delineation), సరస కళలు (Aesthetic Arts), విలాస కళలు (Arts of Pleasure), క్రియా లాలిత్యము (Geaceful execution), వాహక ద్రవ్యము (medium)' ఆదర్శరూపము (Ideal archtype), సార్థక రూపము (Significant Form)' ఆహ్లాదజనకమైన యర్థము Idea). మనోధర్మ శాస్త్రము (Psyehology), శ్రుతి (Harmony), లయ (Rhythm), తటస్థ చిత్తవృత్తి (Objective attitude), సత్యము (Truth), మానసప్రక్రియ (Reaction), కళా న్యాయము (Poetic Justice), దివ్యదర్శనము (Vision Divine), వేదన (Feeling), భావావేశము, భావము (Emotion), భావన (Imagination), కావ్యగతములైన తత్త్వములు (Elements of Poetry). ఆలోచన (Thought), పద గుంఫనము (Form), బుద్ధి గమ్యము (Intellectual), భావస్ఫోరకము (Emotional), శ్రవఃపేయము (Aesthetic), భావనాత్మక నిర్వృతి (Imaginative Pleasure), వైషయికమైన భావము (Sensuous emotion), రస భావము (Aesthetic emotion), ఉద్బోధకము (Stimulus), అసంలక్ష్య క్రమము (Imperceptibility), వాతావరణము (Atmosphere), అత్మాశ్రయమైన సత్యము (Objective reality), అసత్యము (Non-real), నైజములు (Instincts), అసహ్యత (Repugnance), కుతూహలము (Curiosity), కామము (Sex), ఆత్మాభినివేశము (Self.asertion), స్వాతిశయము (Superiority), సృజన (creativeness), ఉత్సాహత (Fervour), పరిగ్రహము (Possession), సంధి సామగ్రి (unifying factors), ఆత్మ వ్యక్తీకరణము (Self-expression), ఆత్మాశ్రయ కవిత్వము, అనుభవ కవిత్వము (Poetry of experience), భావకవిత్వము (Lyrical Poetry), ఆఖ్యాన రూపము (Narrative form), సంవాద రూపము (Dialogue form), నృత్త

గీతము (Ballad-dance), పాత్రారోపణము (Assumption of character), నాటక కార్యము (Action of the drama), జాలి, భయము (Pity and fear), అభినవ ప్రాచీనులు (Neo-Classicists), ప్రతియోగము (Contrast), భావనాహ్లాదము (Imaginative pleasure); ఆత్మ పరిమార్జనము (Self - Obliteration) - మొదలైన పారిభాషిక పదాలను, పాశ్చాత్య విమర్శ ధోరణులను భారతీయ విమర్శ పద్ధతులతో సమన్వయిస్తూ పింగళివారు పేర్కొనటం విశేషం.

పింగళి లక్ష్మీకాంతం గారు భారతీయ లాక్షణికుల అభిప్రాయాలపై ఎంతటి ప్రామాణిక భావం ప్రకటిస్తారో, పాశ్చాత్య విమర్శకుల అభిప్రాయాలపై కూడా అంతటి విలువైన ప్రామాణిక బుద్ధిని ప్రసరిస్తారు. అటువంటి వారి సమన్వయ దృష్టికి ఈ వాక్యాలు చక్కని తార్కాణాలు - "మన ఆలంకారికుల నిర్వచనానుసారముగా సాహిత్య మనిపించుకొనదగిన ఏ రచనయైనను కావ్యమే యగును. (Any particular piece of literathre.) పాశ్చాత్యులు చేసిన నిర్వచనము కవిత్వము గురించియే. (Poetry) ఆ నిర్వచనములు చేసినవారు శాస్త్రకారులు కారు; అనుభవశాలులైన విమర్శకులు, వైదుష్య పరీక్షలయందు ప్రామాణికు లనిపించుకొన్న వేత్తలు. అందుచే వారి వాక్యములు కూడ శాస్త్ర వాక్యములుగానే మన్నింపబడినవి."

సాహిత్య శిల్ప సమీక్ష ఒక ఉత్తమ విమర్శకునికి కావలసిన వ్యుత్పత్తి వివేకాన్ని అందించగలిగే జ్ఞానదీపిక. ఆధునిక విమర్శలో ప్రాచ్య పాశ్చాత్య విమర్శాంశాల సంయోజన స్థితిని వ్యాఖ్యానించే వివేక చూడామణి! పై పెచ్చు - పింగళివారి శైలితో ప్రత్యేక వ్యక్తిత్వాన్ని సంతరించుకొన్న ఆదర్శ విమర్శ పాఠం! *

(రసజ్ఞశిల్పి : ఆచార్య పింగళి లక్ష్మీకాంతం శతజయంతి సంచిక - 22-11-1994)

# యుగకర్త విశ్వనాథ

''అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదా భోగ, మస్మాదృశుం
డలఘుస్వాదు రసావతారధిషణాహంకార సంభార దో
హల బ్రాహ్మీమయమూర్తి శిష్యుడయినా డన్నట్టి దా వ్యోమపే
శల చాంద్రీ మృదు కీర్తి చెళ్ళపిళ వంశస్వామి కున్నట్లుగన్ ''

విశ్వనాథ సత్యనారాయణగారి పేరుతోపాటు తెలుగువారికి ఈ పద్యం జ్ఞాపకానికి వస్తుంది. ఆంధ్ర పౌరుషానికున్న వినయాహంకారాల విశేషాభివ్యక్తి ఈ పద్యం. విశ్వనాథ భారతికి చరణమంజీరం ఈ ఛందం. విశ్వనాథవారు తిరుపతి వేంకట కవుల ఆశుకవిత్వ, అవధాన కవితోద్యమంలో గళమెత్తారు. కాల్పని కోద్యమంలో తమదైన ఒక శాఖను పండించుకొన్నారు. ప్రబోధ కవిత్వంలో తమ ప్రత్యేకతను ప్రకటించుకొన్నారు. నవ్య సంప్రదాయోద్యమానికి తామే నాయకులై దాదాపు నాలుగు దశాబ్దాలు యుగకర్తగా తెలుగు సాహిత్యాన్నంతా ఆవరించారు.

వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో 'కవిసార్వభౌముడు' అంటే శ్రీనాథుడు; 'కవిసమ్రాట్' అంటే విశ్వనాథ సత్యనారాయణ. వీరిద్దరు బిరుదాలకే బిరుదాలైన వారు. విశ్వనాథ 1895 సెప్టెంబరు 10వ తేదీన జన్మించారు. ఈ సెప్టెంబరులో నూరవయేట ప్రవేశిస్తున్నారు. 1995 సెప్టెంబరులో శతాబ్ది పూర్తి చేసుకుంటారు. ఈ సంవత్సరమంతా దేశమంతా విశ్వనాథ శతజయంతిని సమధికోత్సాహంతో జరుపుకొంటోంది. యువభారతి (సాహితీ సాంస్కృతిక సంస్థ) ఆ సాహితీ మహా యజ్ఞంలో తానూ ఒక సమిధ నిచ్చినట్లుగా సెప్టెంబరు 4వ తేదీన విశ్వనాథ శతజయంతి మహోత్సవాలలో భాగంగా 'విశ్వనాథ సాహితీ సమాలోచనం' ప్రారంభించింది. 1995 సెప్టెంబరు 3వ తేదీ దాకా ప్రతి నెలా మొదటి ఆదివారం సమాలోచన కార్యక్రమం నిర్వహిస్తుంది. అందులో సమర్పింపబడిన ఉపన్యాస వ్యాసాలను ఒక గ్రంథంగా వెలువరిస్తుంది. జంట నగరాలలో విశ్వనాథ శత జయంతి మహోత్సవాలకు యువభారతి కార్యక్రమం ఒక శుభారంభం!

విశ్వనాథ ఈ శతాబ్ది తెలుగు కవులందరిలో జీనియస్. ఆయన ఏ బాటలో నడచినా సమ్రాట్టు. ఆత్మీయం, ఆత్మాశ్రయం, ఆత్మనాయకంగా ఆవిష్కృతమైన భావకవిత్వంలో సైద్ధాంతిక స్వభావావస్థను పోషించిన కవితా శాఖకు ఆయన అధ్యక్షుడు. భావకవిత్వం మీద తిరుగుబాటు ప్రకటించి నవ్య సంప్రదాయోద్యమాన్ని ముందుకు నడిపించడంలో ఆయన సర్వ సేనాని. భారతీయ సంస్కృతి ఆయన హృదయస్పందన. ఆంధ్ర పౌరుషం ఆయన రక్త ప్రవాహం. చారిత్రక కావ్యం ఆయన విశిష్ట ప్రయోగం విషాదాంత నాటకం విశ్వనాథవారి ప్రాక్పశ్చిమ నాటక శిల్ప సమన్వయ కేతనం. నవలలో ఆయన ముట్టని ప్రయోగం లేదు, పట్టని శిల్పం లేదు, చూపెట్టని సమకాలీన జీవిత చైతన్య ప్రవృత్తిలేదు. విశ్వనాథ మధ్యాక్కఱలు ప్రవృత్తి నివృత్తుల మధ్య ప్రతిస్పందించే జీవుని వేదనల భవ్య సంగీతాలు. రామాయణ కల్పవృక్షం అధునిక మానవ చైతన్యంలో ప్రపంచమంతా ప్రతిఫలిస్తున్న అధ్యాత్మిక అన్వేషణకు అద్దం పట్టే ఇతిహాస కావ్య కల్పన. ఈ శతాబ్ది చైతన్యాన్నంతా అగస్త్యునిలా ఆపోశన పట్టి, భారతీయ దార్శనిక మూల్యాలతో దానిని విలువకట్టిన ప్రజ్ఞా మూర్తి విశ్వనాథ. ఏనాడైనా ఆధునిక జీవితంలోని భారతీయ మూల్యాలను ఏ తరం వారికైనా తెలుగువారు వ్యాఖ్యానించి చెప్పదలచుకొంటే కథలలో, నవలల్లో, పాటలలో, పద్యాలలో, శతకాలలో, కావ్యాలలో, నాటకాలలో, విమర్శలలో, వ్యాఖ్యానాల్లో, ఉపన్యాసాలలో తాను పలికిన పలుకే ఒక ప్రమాణంగా, ఒక ఆలోచన సరళికి ఆదర్శంగా నిలిచిన పూర్ణ ప్రతిభామూర్తి విశ్వనాథ!

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు సృష్టించిన సాహిత్యాన్నంతా గమనిస్తే, దాదాపు ఇరవయ్యో శతాబ్దపు పూర్వార్ధంలో జీవించిన తెలుగు సమాజం పొందిన పరిణామాలూ, ఆ పరిణామ దశలలో జాతి అనుభవించిన సుఖదుఃఖాలూ, మారుతున్న కాలంలో జీవితపు విలువలను గురించి ప్రజలు సాగించే తర్క-వితర్కాలూ, వాటి వాస్తవిక అనుభవాల అనుశీలనాలూ, వాస్తవ జీవితంలో పరిపూర్ణతా సాధనకోసం మనిషిపడే జీవుని వేదన, పంచ కోశాత్మక ప్రవృత్తులద్వారా ప్రపంచం సాధించే పరిపూర్ణానుభూతియొక్క కళాత్మకాభివ్యక్తి, సామాజిక సాంస్కృతిక జీవిత మూల్యాల వివేచనం, ప్రపంచ సమస్యలకు పరిష్కారాలు భారతీయదర్శనాలే ఇవ్వగలవన్న ఆత్మవిశ్వాసం - ఇలా అన్నీ కలిసి ఒక సజీవ చలన చిత్రంలా మన కళ్ళముందు ప్రత్యక్షమౌతాయి. విశ్వనాథ వాఙ్మయం ఒక అర్ధ శతాబ్ది సజీవ సమాజ జీవిత సమీక్ష!

భావ కవితా యుగంలో విశ్వనాథవారి కిన్నెరసాని పాటలు, కోకిలమ్మ పెళ్ళి, గిరికుమారుని ప్రేమగీతాలు మరపురాని మహనీయ రచనలు. వరలక్ష్మి త్రిశతి అపూర్వమైన స్మృతికావ్యం. మహాకావ్య రచనలో శ్రీమద్రామాయణ కల్పవృక్షం సాటిలేని మేటి రచన. చారిత్రక కావ్య మార్గంలో ఆంధ్ర పౌరుషం, ఆంధ్ర ప్రశస్తి, ఝాన్సీరాణి, శివార్పణం - ఈ నాలుగూ నాలుగు విశిష్ట ప్రయోగాలు విశ్వనాథవారి ఆంధ్ర ప్రశస్తి ఆంధ్రజాతి అంతరాత్మను అర్థిం చేసింది.

"ఇమ్మగ కాకుళమ్ము మొదలీ వరకుం గల యాంధ్ర పూర్వ రా
జ్యమ్ముల పేరు చెప్పిన హృదంతర మేలా చలించిపోవు నా
ర్ద్రమ్మగు చిత్తవృత్తుల పురాభవ నిర్ణయమేని ఎన్ని జ
న్మమ్ములు గాగ నీ తనువునన్ బ్రవహించునొ యాంధ్ర రక్తముల్."

తెలుగులో ప్రబోధకవిత్వాన్ని రచించి ఆంధ్రాభిమానాన్ని జాగృతం చేసిన వారిలో నలుగురిని మనం ముందుగా చెప్పకొంటాం. ఆంధ్రులు తమ గత వైభవాన్ని జ్ఞాపకం చేసుకుని అభిమానంతో తలయెత్తటమే కాకుండా ఆత్మ విశ్వాసంతో అహంకరించాలని ప్రబోధించినందుకు రాయప్రోలు సుబ్బారావు గారిని అభిమానిస్తాం. ఆంధ్రుల ఉదాత్త సంస్కారాన్ని చరిత్ర సన్నివేశాలతో వినిపించి జాతిసుప్తచైతన్యంలో ఉన్న స్వాతంత్ర్యేచ్ఛను పురివిప్పేటట్లు చేసిన విశ్వనాథవారిని ఆత్మీయంగా హృదయానికి హత్తుకుంటాం. రాష్ట్రగానాన్ని పాడి తెలుగువారిని ఉద్యమ చైతన్యమూర్తులుగా మార్చిన తుమ్మలవారికి వీర వందనా లర్పిస్తాం. ఆంధ్రేతిహాసాన్ని పురాణంగా వినిర్మించి జాతిని చరితార్థం చేసిన మధునాపంతుల వారిని మనసారా అభినందిస్తాం. ఈ నలుగురిలో విశ్వనాథ వారిది విశిష్టపంథా.

విశ్వనాథవారు ఎంతటి కవులో, అంతటి నవలా రచయితలు, నాటక కర్తలు, కథా రచయితలు, విమర్శకులు, వక్తలు. ఏకవీర, వేయిపడగలు, చెలియలికట్ట, మాబాబు, బద్దనసేనాని, తెఱచిరాజు, మ్రోయుతుమ్మెద - ఇలా వారి నవలల్లో ఒక్కొక్కటి ఒక్కొక్క వ్యక్తిత్వంతో ప్రయోగ వైవిధ్యాన్ని ప్రదర్శిస్తున్నాయి ఇంగ్లీషు నవలాప్రక్రియలో తనకాలంలో వచ్చిన ప్రయోగాల కన్నింటికీ తెలుగులో సరివచ్చే రచనలు చేసిన ఏకైక నవలాకర్త విశ్వనాథ!

ఇంగ్లీషు సాహిత్యంలో నాలుగు రకాల విషాదాంత నాటకాలు చిత్రించిన గౌరవం షేక్స్పియర్ మహాకవికి ఉన్నది. తెలుగులో అటువంటి విశిష్టప్రయోగ చతుష్టయాన్ని చేసి మెప్పించిన విషాదాంత నాటకశిల్పచతురాననుడు విశ్వనాథ!

విశ్వనాథవారిది కావ్యశిల్ప విమర్శ ప్రస్థానం. 'నన్నయగారి ప్రసన్న కథా కలితార్థయుక్తి' అనే విమర్శ గ్రంథం తెలుగులో 'ప్రాక్టికల్ క్రిటిసిజం'కు ప్రవేశద్వారం. అభిజ్ఞాన శాకుంతలం మీద, అల్లసాని పెద్దన అల్లిక జిగిబిగి మీదా వ్రాసిన విమర్శలు ప్రతీకాత్మక విమర్శలకు ప్రామాణిక సూక్తాలు. ఆయన పద్యం పాడినా, పాట నాలపించినా తెలుగువారు తన్మయులై వినేవారు. ఉసకొట్టి కసరుకొన్నా ముచ్చటపడి ఊరుకుండేవారు. విశ్వనాథ సాహిత్యాన్ని వ్యాఖ్యానిస్తోంటే వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య సంప్రదాయం వెలుగువాకలా జాలువారుతున్నట్లు అనుభవించేవారు. రచయితగా ఆయన ఒక సమగ్రవ్యక్తి; కళాప్రపూర్ణుడు.

"కవి ప్రతిభలోన నుండును గావ్యగత శ
తాంశములయందు తొంబది యైన పాళ్ళు
ప్రాగ్వివశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాదృతిని మించి."

'రసము వేయి రెట్లు గొప్పది'-అని విశ్వనాథ వ్యక్తిగా అన్నాడనటంకంటె నవ్యసంప్రదాయ యుగ ప్రవక్తగా అన్నాడనటం సమంజసం, నవ్య సంప్రదాయ వాదం మొదట కాల్పనిక యుగ చైతన్యం మీద తిరుగుబాటు చేసింది. దానికి కారణం దార్శనికమైన భేదమే కాల్పనిక సాహిత్యం పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాల మూలబలం కలది. అయితే, అది తెలుగులో వెలుగు నింపే నాటికి పాశ్చాత్య సాహిత్యాలలోనే పరిస్థితులు తారుమారయ్యాయి. ఆధునిక యుగంలో టి.ఎస్. ఎలియట్ నుండి న్యూక్రిటిక్స్‌వరకు వ్యాపించి ఉన్న పాశ్చాత్య సాహిత్యం మీద భారతీయ సాహిత్య దర్శన ప్రభావం గోచరిస్తున్న కాలమది. ప్రపంచ భాషా సాహిత్యాలన్నింటిలోనూ కావ్యానుశీలనానికి విశ్వజనీనంగా పనికి వచ్చే సాహిత్య సిద్ధాంతం 'రస సిద్ధాంత'మని విశ్వసిస్తున్న రోజులవి

నవ్యసంప్రదాయవాదుల రస దర్శనం పాశ్చాత్యుల విషాదాంత నాటకంలోని 'కెథార్సిస్' అనుభవంలోని స్వభావాన్ని కూడా తనలో సంవదించుకొన్న

అభినవరూపం. దానిని విశ్వనాథవారు కరుణ రస దర్శనంలో అంతర్భవింప జేశారు. తెలుగులోని విషాద గంభీర నాటకాలలో గాని, విషాదాంత నాటకాలలో గాని, చారిత్రక కావ్య ప్రయోగాలలోగాని, రామాయణ కల్పవృక్షంలో పోషింప బడిన జీవుని వేదనలో గాని ప్రసరించిన రస దృక్పథం ప్రాచీన భరత శాస్త్ర సంప్రదాయానికి మాత్రమే పరిమితమైనది కాదు. పాశ్చాత్య ప్రస్థానాలను గూడా తనలో సమన్వయించుకొన్న నవ్య దృక్పథం. దానికి ప్రవక్త, ప్రయోక్త విశ్వనాథ!

ఆంధ్ర సాహిత్య చరిత్రలో శృంగార రస దర్శనాన్ని అభినవంగా రూపొం దించి, వివిధ ప్రయోగాలు చేసి చూపించి, కావ్య యుగకర్తగా కీర్తింపబడు తున్నాడు కవిసార్వభౌముడు శ్రీనాథుడు అలాగే ఆధునిక రస దర్శనాన్ని వివిధ ప్రక్రియలద్వారా, ప్రయోగాలద్వారా ప్రదర్శించి చూపించి నవ్యసంప్రదాయ యుగకర్తగా ప్రశంసింపబడుతున్నాడు కవి సమ్రాట్ విశ్వనాథ! *

(ఆంధ్రభూమి 16.9.1994)

# కవిసార్వభౌముడు : కవిసమ్రాట్టు

ప్రాచీనాంధ్ర కవుల బిరుదాలన్నింటిలో మకుటాయమానంగా వెలుగొందేది 'కవి సార్వభౌమ' బిరుదం. ఆధునికాంధ్ర కవుల బిరుదాలలో అనుమానం లేకుండా అగ్రగణ్యమైనది 'కవి సమ్రాట్' బిరుదం. బిరుదాలలోనే కాకుండా ఆంధ్ర సాహిత్య చరిత్రలో నిర్వహించిన పాత్రలలో కూడా శ్రీనాథునికి, విశ్వనాథకూ పోలిక ఉంది. మహాకవి శ్రీశ్రీయే ఆ సామ్యాన్ని భావించ గలిగాడు. "ఈనాడు శ్రీనాథుడంతటివాడైన విశ్వనాథ సత్యనారాయణను నేను ఎంత గౌరవిస్తానో నీకు తెలియునూ?" అని శ్రీశ్రీ విశ్వనాథను ప్రశంసించాడు. 1973 జూన్‌లో విశ్వనాథను గురించి శ్రీశ్రీ రాసిన ఈ ద్విపదలు 'సత్యానికి ఉపదలు.'

"మాటలాడే వెన్నెముక  
పాటపాడే సుషుమ్న  
నిన్నటి నన్నయభట్టు  
ఈనాటి కవి సమ్రాట్టు  
గోదావరి పలకరింత  
కృష్ణానది పులకరింత  
కొండవీటి పొగమబ్బు  
తెలుగువాళ్ళ గోల్డునిబ్బు  
అకారాది క్షకారాంతం  
ఆసేతు మిహికాపంతం  
అతగాడు తెలుగువాడి ఆస్తి  
అనవరతం తెలుగు ప్రకాస్తి  
ఛందస్సు లేని ఈ ద్విపద  
సత్యానికి నా ఉపద."

(కవ్యృద్ధ విశ్వనాథ-శ్రీశ్రీ స్వాతి (మాసపత్రిక) 76 వ సంచిక. చూడు. విమర్శిని II పు. 419.)

కవితా శైలిలో శ్రీనాథునికీ విశ్వనాథకూ సామ్యం లేకపోవచ్చు. కాని, తాను నివసించిన యుగ సాహిత్య దర్శనాన్ని తన ప్రయోగాల ద్వారా ప్రపంచించిన ప్రజ్ఞాప్రాభవాలలో వారిద్దరికీ పోలిక ఉన్నట్లు "లోనారసి" చూచే వారికి గోచరిస్తుంది. అంత లోతు చూపు సారించకపోయినా బయటికి కూడా అప్రయత్నంగా కనపడే కవితావ్యక్తిత్వ స్వభావాలు ఆ యిరువురిలో కొన్ని వున్నాయి. తనకు ముందున్న మహాకవుల కవితావ్యక్తిత్వాలను, విశేషాలను తాను నిర్వచించి, తన కవిత్వంలో వారి రచనా శిల్ప విశేషాల నన్నింటిని సంవదించుకుంటూనే, స్వీయకవితాభివ్యక్తిగల సాహితీ ప్రస్థానాన్ని సాగించినట్లు పద్యమయంగా ప్రకటించటం శ్రీనాథ కవిసార్వభౌమునికిలాగా 'కవి సమ్రాట్' విశ్వనాథకు కూడా సహజ లక్షణం. అవిచ్ఛిన్న సంప్రదాయ దృష్టిగల ఇద్దరు కవి సమ్రాట్టుల అభివ్యక్తి శిల్పాలివి—

"వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండ లీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాకృత్తు తిక్కయజ్వ ప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని తేవ
సూక్తి వైచిత్రి నొక్కొక్కమాటు...." (కాశీఖండం - 1.13)

అని శ్రీనాథుడు రచించిన సీసపద్యం తెలుగు సాహిత్యంలో ప్రసిద్ధం. ఇది ఒక క్రొత్త బాణీని సృష్టించింది. శ్రీనాథుడు చెప్పిన నన్నయగారి ఉభయవాక్ప్రౌఢిని, తిక్కనగారి రసాభ్యుచితబంధాన్ని, ఎఱ్ఱయగారి సూక్తివైచిత్రిని తరువాతి విమర్శకులు అనుశీలన సూత్రాలుగా గ్రహించి కవిత్రయ కవితావ్యక్తిత్వాలను పరిశీలించటం నేర్చుకున్నారు. శ్రీనాథుని కవితలో అవి ప్రతిఫలించిన వైఖరిని వివేచించటం మొదలుపెట్టారు. ఇటువంటి బాణీని విశ్వనాథవారు కూడా ప్రదర్శించారు. అయినా అది అనుకరణం కాదు, పునస్సృష్టి.

''ఋషివంటి నన్నయ్య రెండవ వాల్మీకి
తిక్కన్న శిల్పపుఁ దెనుఁగుతోట
యెఱ్ఱన్న సర్వమార్గేచ్ఛా విధాతృండు
పోతన్న తెలుగుల పుణ్యపేటి

శ్రీనాథుఁడు రసప్రసిద్ధధారాధుని
కృష్ణరాయఁ డనన్య కృతిప్రబంధ
పెద్దన్న వడపోత పెట్టి నిశురసంబు
రామకృష్ణుఁడు సురారామగజము

ఒకడు నాచనసోమన్న; యుక్కివుండు
చెఱిపి పదిసార్లు తిరుగవ్రాసినను మొక్క
వోని యీ యాంధ్రకవిలోక మూర్ధమణుల
మధ్దురు స్థానములుగ నమస్కరించి...."

(రామాయణ కల్పవృక్షం: అవతారిక)

ఈ పద్యం శ్రీనాథుని పద్యంలా సాహిత్య సంప్రదాయంలో సజీవంగా ప్రవహిస్తోంది. ఈనాడు ప్రాచీన కవుల వ్యక్తిత్వాలను వివేచించేటప్పుడు విశ్వనాథ వేసిన విశేషణాలను పరిగణనలోకి తీసుకోకపోతే ఆ పరిశీలన సమగ్రం కాదని సాహితీవేత్తలు భావిస్తారు. ''నన్నయ్యయు, తిక్కన్నయు నన్నావేశించిరి, పరిణాహమనస్సంభన్నత వారలు పోయిన తెన్నున మెఱుఁగులను దీర్చి దిద్దుచు పోదున్''-అని విశ్వనాథ పేర్కొన్నప్పుడు 'రెండవ వాల్మీకి', 'శిల్పపుఁ దెనుఁగుతోట' అయిన నన్నయ, తిక్కనలే ఆయనను ఆవేశించారని భావించాలి గాని మన ఊహలను, అభిమానద్వేషాలను అందులో పొందించటం సమంజసం కాదు.

విశ్వనాథవారి వివేచనలో శ్రీనాథుడు 'రసప్రసిద్ధ ధారాధుని.' స్వీయ భావనలో 'రసము వేయిరెట్లు గొప్పది నవకథాదృతిని మించి,' అంటే - రస దర్శనానికి సంబంధించిన సామ్యం శ్రీనాథునిలో, విశ్వనాథలో మనం దర్శించ టానికి వీలుందన్నమాట! లోతుగా ఆలోచిస్తే ఈ లోగుట్టు తెలియవచ్చు. ఎందు కంటే - విశ్వనాథవారే తమ సరస్వతిని గురించి ఇలా చెప్పుకున్నారు:

''తన లోతు నెఱుఁగని జనుల పూజకుఁ దిర
స్కృతిఁ జూపు మత్సరస్వతి సుభద్ర
తన లోతు నెఱిఁగిన జనుల పూజకు నవా
దృతిఁ జూపు మత్సరస్వతి సమార్ద్ర.''

''మత్సరస్వతి భావసామ్రాజ్యలక్ష్మి;
భక్తి యున్నట్టిచో మెత్తబడెడు దేవి''

అందువలన కవిసార్వభౌముని రసదర్శనాన్ని, కవిసమ్రాట్టుల రసదృక్పథాన్ని లోతుగానే పరిశీలించవలసి వస్తుంది.

శ్రీనాథుడు శృంగారిగా ప్రసిద్ధి. శృంగారి అంటే స్త్రీ లోలుడని కాదు. శృంగార రస ప్రియుడని భావం. శృంగార రస మంటే భరతశాస్త్ర సంప్రదాయంలో చెప్పే అష్ట విధ రసాలలో రతి స్థాయి అయిన శృంగారం కాదు. భోజుడు ప్రతిపాదించిన శృంగార రసం. భోజుని దృష్టిలో శృంగారమే ఏకైక రసం. అది అభిమాన రసమనీ, అహంకార రసమనీ పిలువబడుతుంది. దాని వల్లనే కావ్యానికి కమనీయత్వం ఏర్పడుతుంది. రసానికి సిద్ధి రసికుని యందు కలుగుతుంది. రసికునిలోని ఆత్మసమ్యగ్గుణోద్భూతమైన అహంకారమే సుఖ దుఃఖాత్మకాలైన రసాలను సుఖాత్మకంగా రస్యమానాలుగా చేస్తుంది. రసికుని లోని అభిమాన ప్రవృత్తి అనేక జన్మానుభవజనిత సంస్కారాల యొక్క ఉత్కృష్టదశ. అట్టి ప్రవృత్తి కలవాడే రసికుడైన కవి, రసికుడైన సహృదయుడు. రసికుని శృంగారి అంటారు. శృంగారి అయిన కవి రచించిన కావ్యం రసమయం. భోజునిదృష్టిలో అహంకార రసమే రసం. రత్యాది స్థాయి భావాత్మకమైన రసాలు అతని దృష్టిలో ఔపచారికాలు. వట్టి భావ ప్రకర్షరూపాలే. అహంకారం అగ్ని సదృశమైన సహృదయుని మూల ప్రవృత్తి. భావాదులు ఆ అగ్నికి శిఖల వంటివి. అవి దాని తేజస్సును హెచ్చించునట్టివే. మూల ప్రకృతి అయిన అహంకారాగ్నియే లేకపోతే శిఖలు లేవు, రసదీప్తి లేదు. శృంగారం రసరాజ మంటే రసాలన్నింటికీ మూలమైన రసమనీ, అదే అహంకారమనీ, దాని పేరే శృంగారమనీ భోజుని మతం.

భోజుని రసికత్వాన్ని ముమ్మూర్తులా తనలోనూ, తన సాహిత్యంలోనూ, కావ్యాస్వాదనంలోనూ స్థాపించిన కవిసార్వభౌముడు శ్రీనాథుడు. అయితే, అతని కంటె ఆధునికుడు కావటంచేత భోజు డంగీకరించిన దశరసాలనే కాక భక్తిని కూడా రసంగా సంభావించాడు. అతని ఆశువు, చాటువు, కావ్యకవిత - అన్నీ శృంగార ప్రకాశకాలే. అతని సర్వ కవితాభివ్యక్తికి మూల ప్రకృతి శృంగారం. అందులో నుండి దశరసాలతోపాటు భక్తి కూడా జనించి జ్వలిస్తుంది. శ్రీనాథునిది సాహంకార భక్తి అనీ, సాభిమానభక్తి అనీ విమర్శకులు గుర్తించారు. ఆ అభిమానం, ఆ అహంకారం భోజప్రతిపాదితమైన రసాస్వాదన శక్తియొక్క మూల ప్రకృతి. శ్రీనాథుడు తెలుగు సాహిత్యానికి మూడు మేలులు చేశాడు. అవి:

1. శృంగారమే రసం అనే ఆలంకారిక దర్శనానికి లక్ష్యాలను సమకూర్చాడు.
2. భక్తి వాత్సల్యాలు కూడా రసస్థితిని పొందగలిగిన భావాలని నిరూపించాడు.
3. శృంగారి అయిన కవికి తాను అనుభవించిన భావస్థితిని అందించటానికి అనువైన ఒక రసిక వాగ్వైఖరి కూడా ఉండాలనే స్పృహను ప్రపంచించాడు.

కవిత్రయ యుగంకంటె విలక్షణమైన కావ్యసాహిత్యం తెలుగులో వెలువడటానికి శ్రీనాథుని రసదర్శనం, దానినుండి పుట్టిన కవితాశైలి కారణాలైన వనటంలో ఎటువంటి సంశయమూ లేదు.

ఆధునికులైన కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు కరుణరస దార్శనికులు. ''ఏకో రసః కరుణ ఏవ ...'' అని భవభూతి ప్రతిపాదించిన సిద్ధాంతానికి రస సమీకరణస్థాయిలో వ్యాఖ్యానం చెప్పి, కరుణరసవాదానికి ఒక అస్తిత్వాన్ని కలిగించటమే కాకుండా, కరుణయే సర్వరసాలకు మూలమైన రసమని తాను విశ్వసించినట్లు చెప్పారు. వారి 'జీవుని వేదన' అనే అంశం కరుణరస సమీకరణవాదంలో నుంచి పుట్టిన అద్వైత పరిభాషగా విజ్ఞులు భావిస్తున్నారు కరుణరస వాదానికి విశ్వనాథ వివరణ మిది - ''లోకములో తన సొంత బ్రతుకుతో అక్కరలేకుండ నంతరాంతరముననే యనుభవించు భావములు - భయము, జుగుప్స, ఆశ్చర్యము, దుఃఖము ఇవి ఎవనికివాడు లోన ననుభవించునే తప్ప వానికి బహిరావిష్కృతి లేదు. వీనిలో మకుటాయమాన మైనది దుఃఖము. ఈ దుఃఖము జన్మలక్ష్మణమని కూడ చెప్పబడినది ఎవడీ దుఃఖము యొక్క స్వరూపము తెలియునో వానికి సర్వరసములు కరతలామల కములుగా నుండును. వానిని వినయము భజించును. వాడు పరమేశ్వరునికి దగ్గరివాడు. వాడు కావ్యజ్ఞుడు. వాడు కష్టమునందొక సుఖమును చూడగలడు. వాని గుండియ జాలికి ఉనికివట్టు వాని హృదయమునం దార్ద్రతాలక్షణము నెలకొనును. ఆ యార్ద్రతాగుణమే హృదయమునందు నెలకొన్నచో సర్వ కావ్యముల యందలి రసములు వానికి కరతలామలకములు. అందుకనియే భవభూతి 'ఏకోరసః కరుణ ఏవ....తత్సమస్తమ్'-శోకము స్థాయిభావము,రసము కరుణము కావున తక్కిన రసములన్నియు రసములుకావు, ఒక్క కరుణరసమే రసము అని, తక్కిన రసములన్నియు దీనినుండియే పుట్టును లేదా ఇందులో లీనమగును. ఇది భవభూతి దృష్టమైన పరమార్థము. మానవ హృదయమును బ్రదుకులోని సారమును విచారించి నిర్ణయించిన విషయము'' (కావ్యానందము.)

ఆధునిక ప్రపంచ మానవ జీవితానికి మూలరసం కరుణం. ఆధునిక సిద్ధాంతాలన్నింటిలో ఈ రసనాదమే బహురూపాలతో ప్రత్యక్షమౌతోంది. అటు వంటి కరుణరసాన్ని కావ్యప్రక్రియ లన్నింటిలో పట్టంకట్టిన మహాకవి విశ్వనాథ. శృంగార రసద్రష్ట, స్రష్ట - కవిసార్వభౌముడు; కరుణరస ద్రష్ట, స్రష్ట - కవి సమ్రాట్టు! అందుకే వీరిద్దరూ ఇద్దరే!!

(ఆంధ్రభూమి 23-9-1994)

# విశ్వనాథ నవ్య సంప్రదాయం

"'నిజానికి శిల్పము కాని, సాహిత్యము కాని జాతీయమై యుండవలెను. విజాతీయమై యుండరాదు. వ్రాసిన వానికి ముక్తి, చదివినవారికి రక్తి, ముక్తి. ఎంత సముద్రము మీద పక్షి ఎగిరినను రాత్రి గూటికి చేరును. ఇది జాతీయత, ఇది సంప్రదాయము." (మహతి )

విశ్వనాథ సత్యనారాయణగారి సాహిత్యోద్యమం వెనుకనున్న బలమైన జాతీయతాచైతన్య మీ మాటలలో స్పష్టమౌతోంది. సాహిత్యం, శిల్పం విజాతీయం కాకుండా జాతీయంకావాలన్న పిలుపు కాలమిచ్చింది. ఆ సమకాలీన చైతన్యానికి 'విశ్వనాథ' - సృజనాత్మక సాహిత్య శక్తి. విశ్వనాథవారిని సవ్యంగా అర్థం చేసుకోకపోతే ఆయన ప్రగతి విరోధిగా భ్రమపడే ప్రమాదం ఉంది. మాన్య శ్రీ పి. వి. నరసింహారావుగారు చేసిన హెచ్చరిక గమనించదగింది:

"శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు ప్రగతికి వ్యతిరేకులు గారు. ప్రాచీన సంస్కృతి మీద వారికిగల శ్రద్ధ అంధశ్రద్ధ కాదు. వారు సంప్రదాయ బద్ధులైన పిడివాదులు కారు. ఓర్వలేనివారు కారు అక్కడక్కడ ధర్మారావు సంభాషణల్లో వితండవాదం గోచరిస్తుంది. అయితే, దానికి కారణం ఉంది. ప్రతిపక్షాలవారు చేస్తున్న తీవ్రమైన ఆరోపణలకు, ఆక్రమణలకు సమాధానంగా శ్రీ విశ్వనాథ ఇంతటి వితండ వాదాలు చేయించాడు. స్వధర్మ రక్షణకు అవి ఉద్దేశింపబడ్డాయి. స్వయంగా దురాక్రమణ కావించాలనే ఉద్దేశ్యం కొంచెమైనా వారికి లేదు. సహస్రఫణ్ (వేయిపడగలు)లో అనేక చోట్ల ఈ విషయం మనకు గోచరిస్తుంది."

సంస్కృతికి సంబంధించినంతవరకు పి. వి. గారి మాటలు అక్షర సత్యాలు. ఈ దృక్కోణంతోనే విశ్వనాథ సాహిత్య శిల్ప దృక్పథాన్ని కూడా గమనించవలసి ఉంటుంది. ఆ బాటలో కొన్ని మాటలు.

ప్రాచీనాంధ్ర సాహిత్యంలో మార్గ, దేశి పద్ధతులు వినిపిస్తాయి. అవి శివకవులు కన్నడం నుండి అరువు తెచ్చినవి. ఏమైనా, శివకవులు చెప్పేదేమి

టంటే - శుద్ధ మార్గ, శుద్ధ దేశి పద్ధతులు వారికి గ్రాహ్యాలు కావు. ఆ రెండూ కలిసి ఏర్పడిన దేశి ఉపాదేయం వారికి. సంప్రదాయము ననుసరించిన దేశి పద్ధతి అదే. నన్నెచోడాదులు ఆశించిన దేశి విధానం కూడా అదే. ఈ సంప్రదాయాన్ని ఉదాహరణంగా తీసుకొన్నా విశ్వనాథ వారు చెపుతున్న జాతీయమైన సాహిత్యశిల్ప విషయం కొంత స్పష్టమౌతుంది. ఈ అంశాన్ని ప్రక్రియాపరంగా, శిల్పపరంగా, రసపరంగా, భావజాలపరంగా ఇలా ఎన్నో రకాలుగా వివరించవచ్చు. ప్రస్తుతానికి ప్రక్రియాపరంగా స్థూలంగా పరిశీలిద్దాం. ఎందుకంటే, ప్రక్రియా పరిశీలనం మిగిలినవాటికన్నిటికీ ప్రాతిపదికలాంటిది.

విశ్వనాథవారు జాతీయ, విజాతీయ శబ్దాలు వాడారు. ఒక్కొక్క జాతి సృష్టించుకొని అనుభవించే సాహిత్యానికి అనుభూతి ప్రాతిపదికల నందించే మూల ప్రక్రియలు కొన్ని ఉంటాయి. వాటినుండి వివిధ ప్రక్రియలు శాఖోపశాఖలుగా పెరిగి విస్తరిల్లవచ్చు. భారతీయ సాహిత్యాలన్నింటిలో పురాణ, ఇతిహాస, కావ్య, రూపక గేయాలు మూల ప్రక్రియలుగా ప్రసిద్ధి చెంది ఉన్నాయి. ప్రాచీనాంధ్ర సాహిత్య ప్రక్రియలన్నీ వీటికి ప్రతిరూపాలో, మిశ్రరూపాలో, శాఖోపశాఖలో అయి ఉంటాయి. వీటి స్వరూప స్వభావాలను, తాత్త్విక చింతనను, అనుభవ సాంద్రతను గుర్తించటం తెలుగుజాతికి సులభం. సైజం.

వీరేశలింగం పంతులుగారు పాశ్చాత్య సాహిత్య సంప్రదాయాన్ని తెలుగులో ప్రవేశ పెట్టారు. ఇంగ్లీషు సాహిత్య మూలప్రక్రియలు ఎపిక్, లిరిక్, ట్రాజెడీ, నావెల్. ఆ సాహిత్య సమాలోచనమంతా ఆ ప్రక్రియల శక్తిని, యుక్తిని తెలిసి అధ్యయనం చేయటంలో, సృజనం చేయటంలో, అనుభవించటంలో ఉంటుంది. పై నాలుగు ప్రక్రియలలో నవలకు మిగిలిన మూడింటి కున్న సాహిత్య గౌరవం లేదు. ఏమైనా వీరేశలింగం పంతులుగారు పునరుజ్జీవన యుగచైతన్యాన్నీ, సంస్కరణ ప్రవృత్తినీ పోషించటానికి నవలను, వ్యాసం వంటి వచన ప్రక్రియలను ఎన్నుకొన్నారు. పాశ్చాత్య ప్రక్రియల ప్రాతిపదికలు జాతీయమైనవి కావు కాబట్టి వాటిని, విశ్వనాథవారి పరిభాషలో, విజాతీయాలని పిలవాలి.

పాశ్చాత్య ప్రక్రియా పరిజ్ఞానాన్ని ప్రాతిపదికగా చేసికొని ప్రయోగాలు చేసినవారు గురజాడ, రాయప్రోలు, దేవులపల్లి, కట్టమంచి, రాళ్ళపల్లి మొదలైన వారు. ఆంగ్ల పునరుజ్జీవన యుగంలోని లిరిక్‌ను లక్ష్యంగా పెట్టుకొని, గేయ

ప్రధానమైన లిరిక్సును గురజాడ రచిస్తే, పద్యప్రధానమైన లిరిక్సును రాయప్రోలు దిద్ది తీర్చారు. ఆపైన దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు కాల్పనిక యుగపు లిరిక్సు వంటి వాటికి తెలుగులో వెలుగు నింపారు. కట్టమంచివారు ఆంగ్ల కాల్పనికయుగ విమర్శ సూత్రాలను తెచ్చి ప్రాచీనాంధ్ర ప్రబంధాలకు పట్టించి ఎడాపెడా వాయించారు రాళ్ళపల్లి వారు పాశ్చాత్య సౌందర్య శాస్త్రంలోని రససిద్ధాంతాన్ని, విషాదాంత నాటక తత్త్వాన్ని తెలుగులో ప్రపంచించారు. నిస్సంశయంగా వీరి ప్రయోగాల తాత్త్విక మూలాలు పాశ్చాత్యాలే. ఆ లక్షణాలు తెలియకపోతే అవి సొంతం అస్వాదనీయాలు కావు కూడా!

ఒకవైపు వీరేశలింగం పంతులుగారు పాశ్చాత్య ప్రక్రియా సంప్రదాయాన్ని ప్రచారంలోకి తెస్తూంటే, మరొకవైపు తిరుపతి వేంకట కవులు కవితోద్యమం అచ్చమైన దేశీయ స్వభావాన్ని ప్రదర్శించి, ప్రజాదరణాన్ని విశేషంగా చూరగొన్నది. పద్యనాటకం రంగం మీద విజయయాత్రలు సాగించింది. తెలుగులో పాశ్చాత్య నాటకానువాదాలకు ఏమాత్రం ప్రోత్సాహం లభించలేదు. భారతీయ నాటకాలకు, భారతీయ వస్తువులతో వ్రాసిన విషాదాంత నాటకాలకు ప్రాచుర్యం లభించింది.

ఈ చారిత్రిక పరిణామ సత్యాలను గమనిస్తే తిరుపతి వేంకటకవుల తరువాతి తరంవారు, ముఖ్యంగా వారి శిష్యులు, ప్రక్రియాపరంగా తెచ్చిన మార్పులు మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి కాల్పనిక, అభ్యుదయ కవిత్వంలో వెలువడిన ప్రయోగాలన్నీ చాలా వరకు పాశ్చాత్య ప్రక్రియలకు ప్రతిబింబాలే. విశ్వనాథాదులు ఈ ప్రవృత్తిని గర్హించారు అయితే, విదేశీ వస్త్ర బహిష్కారంలా తగలపెట్టమనలేదు. 'క్విట్ ఇండియా' ఉద్యమంలోలా దేశం వదలిపొమ్మనలేదు. విశ్వనాథాదుల జాతీయతా వాద మెటువంటిదంటే—

ఈ దేశంలో పుట్టిన ప్రక్రియలలో పాశ్చాత్య ప్రక్రియలు లీనం కావాలి. కాని, దేశీయ ప్రక్రియలు విదేశీ ప్రక్రియలలో లీనం కారాదు. అంతేకాదు, విదేశీ ప్రక్రియలనే స్వీకరించి దేశీయ ప్రక్రియలను చిన్నచూపు చూడరాదు. భారతీయ సంస్కృతిలో ఈ దేశంలో నివసించటానికి వచ్చినవారి సంస్కృతులు స్నేహసౌహార్దాలతో లీనం కావడం ఇక్కడి జాతీయత, సంప్రదాయం. విశ్వనాథవారు సాహిత్యపరంగా, శిల్పపరంగా కూడా ఆ అవిచ్ఛిన్న సంప్రదాయాన్నే కోరారు.

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు భారతీయ మహాకావ్య సంప్రదాయంలో పాశ్చాత్యుల ఎపిక్ సంప్రదాయాన్ని విలీనం చేసుకోగలిగిన ఒక నవ్యసంప్రదాయాన్ని ఆవిష్కరించారు. శ్రీమద్రామాయణ కల్పవృక్షంలా అది ఫలించింది. భారతీయ గేయకావ్య సంప్రదాయంలో లిరిక్‌ను లీనం చేసుకొన్న గొప్ప రచన "కిన్నెరసాని పాటలు." భారతీయమైన కరుణరస సమీకరణ వాదంలో పాశ్చాత్యుల కెథార్సిస్‌ను సమన్వయించుకొని ఆధునికమైన "ఏకోరసః కరుణ ఏవ" అనే సిద్ధాంతాన్ని ఖండకావ్యాల ద్వారా, చారిత్రక కావ్యాల ద్వారా, విషాదాంత నాటక ప్రయోగాల ద్వారా విశ్వనాథవారు ప్రపంచించి చూపించారు. విశ్వనాథవారి 'నర్తనశాల' విషాదాంత నాటకాన్ని గర్భీకరించుకొన్న భారతీయ నాటకం. మిగిలిన మూడు ఆ మార్గంలోనే సాగిన విశిష్ట ప్రయోగాలు. విశ్వనాథ నవలలు పాశ్చాత్య రూపాలను భారతీయ ప్రవృత్తితో పుక్కిట పట్టిన సృజనాత్మక ప్రయోగాలు. పాశ్చాత్య సాహిత్య శిల్పాలు భారతీయ మహాసముద్రంలో నదుల్లాగా సంగమించాయి. విశ్వనాథ శుద్ధ పాశ్చాత్యంగాని, శుద్ధ దేశీయంగాని కోరలేదు; పాశ్చాత్య శిల్పంతో బలపడి, తన వినూత్న వ్యక్తిత్వంతో ప్రకాశించే జాతీయ సాహిత్య శిల్పాన్ని కోరాడు. అంతేకాదు - ప్రతి అక్షరం దానికి ప్రత్యక్షంగా రాసి చూపించాడు.

విమర్శకుడుగా విశ్వనాథను వివేచించేటప్పుడు కూడా ఈ రహస్యాన్ని మరచిపోగూడదు. ఆయన మీద ఆంగ్లసాహిత్య విమర్శ ప్రభావం లేదనలేము. కట్టమంచివారు ఆంగ్ల కాల్పనికోద్యమ విమర్శ చైతన్యాన్ని మాత్రమే తెలుగులోకి తేగలిగారు. విశ్వనాథవారు మాచ్యూ ఆర్నాల్డ్ నుండి న్యూక్రిటిక్స్ వరకూ సాగిన విమర్శ చైతన్యాన్ని మెలకువగా తెలుగులోకి తేగలిగారు. ఒక విధంగా ఆనాటికి ఇంగ్లీషు సాహిత్య విమర్శయే భారతీయ సాహిత్య విమర్శచేత ప్రభావితమై ఉంది. అందువల్లనే విశ్వనాథ భారతీయాధిక్యతను విమర్శలో చాటి చెప్పాడు.

వీరేశలింగం పంతులుగారి నుంచి విశ్వనాథ సత్యనారాయణగారి దాకా సాగిన సాహిత్య విమర్శను ఆంగ్లప్రభావ పరిశీలనం దృష్ట్యా గమనిస్తే క్రమంగా. ఆకృతిమీదా, ఆలోచనమీదా, అనుభవం మీదా ప్రభావం పడిన జాడలు గోచరిస్తాయి పంతులుగారి నుంచి కట్టమంచికి ముందుదాకా ఆంగ్ల ప్రభావం ఆంధ్ర విమర్శ యొక్క ఆకృతిమీద పడింది. కట్టమంచినుంచి ఆలోచనమీద ప్రసరిం

చింది. రాళ్ళపల్లి, దువ్వూరులు దాన్ని అనుభవం వైపు మళ్ళించారు. విశ్వనాథ విమర్శలో అనుభవం మీది ప్రభావం ఒక పరిపూర్ణతను సాధించింది

ఆకృతిమీద పడిన ప్రభావం విమర్శచేత సాధన చేయిస్తుంది ఆలోచనపై పడిన ప్రభావం విమర్శచేత భావన చేయిస్తుంది. అనుభవంమీదపడిన ప్రభావం విమర్శచేత దర్శనం చేయిస్తుంది. దర్శనం చేయగల రచయిత ప్రక్రియలను ప్రజ్ఞతో సృష్టించగలడు.

ఆధునికాంధ్ర సాహిత్యంలో ఇంగ్లీషు సాహిత్యంలోని ఎపిక్, లిరిక్, ట్రాజెడీ, నావెల్- అనే మూల ప్రక్రియలకు పిదేశీ స్వభావాన్ని పోగొట్టి భారతీయ స్వభావాన్ని కలిగించి, దేశీయ ప్రక్రియలలో అంతర్భవింపజేసి, జాతీయతను ప్రకటించటంతో పాటు సంప్రదాయాన్ని సాధించారు విశ్వనాథవారు. పాశ్చాత్య దర్శన మూలాలైన ప్రక్రియలకంటే, సాహిత్య శిల్పాలకంటే జాతీయ మూలాలైనవే శక్తిమంతాలని చెప్పి, వ్రాసి, మెప్పించిన దేశీయతాభిమాని విశ్వనాథ. ఆ కాలంలో ఆయన నడచిన మార్గం నవ్య సంప్రదాయం! *

(ఆంధ్రభూమి, 30-9-1994)

# విశ్వనాథ మధ్యాక్కరలు

''మధ్యాక్కరలకును నీకు నాకు సంబంధంబు కలిసి
మధ్యాక్కరలు, నేను వేఱ పనిమీద మానివేసినను
నీ ధ్యానమేమయ్యె; నేమి యయ్యెద నేను; కృపణ మ
హీధ్యేయ! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి!''

భగవంతునికి భక్తునికి మధ్య ఇంత గాఢమైన రాగబంధాన్ని మధ్యాక్కర వృత్తంతో సాధించిన మహాకవి కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ. విశ్వనాథ మధ్యాక్కరలనే పేరుతో పది శతకాలను రచించి ఆధునిక శతక సాహిత్యంలో ఒక నవ్యసంప్రదాయాన్ని స్థాపించారు. మనసులోని మాటను ఆర్తితో, ఆత్మీయంగా, అరమరికలు లేకుండా, పరమాత్మునితో చెప్పుకోటానికి మధ్యాక్కర మధురంగా తోడ్పడుతుందని విశ్వనాథవారు నిరూపించారు. ప్రాచీనాంధ్ర సాహిత్యంలో నన్నయాదులు మధ్యాక్కరను పరిమితంగా వాడినా బహువిధ రసభావ వ్యంజకంగా ఆ వృత్తాన్ని నడిపి చూపించారు. కోపం, పశ్చాత్తాపం, దుఃఖం, ప్రబోధం, ప్రార్థనం, అధిక్షేపం, విస్మయం, నింద, స్తుతి, ఉత్సాహం, రతి, విభావ వర్ణనం మొదలైన అనేక విషయాలను అమోఘంగా అభివ్యక్తీకరించి, మధ్యాక్కరకు ఒక మరువలేని స్థితిని కల్పించారు. అయితే కడచిన నాలుగైదు శతాబ్దాలుగా మధ్యాక్కరను ఎన్నుకొని ఒక ప్రత్యేక ప్రయోజనాన్ని సాధించే యత్నం చేసిన కవి కానరాడు. ఈ వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో మధ్యాక్కరతో ఒక శతక ప్రక్రియనే నిర్మించవచ్చునని దర్శించి, పది శతకాలు రచించి, వేయి విధాలుగా ఆ వృత్తాన్ని నడిపించి, పదివేల విధాల కవితా శిల్పాలను అందులో ప్రదర్శింపవచ్చునన్న ప్రజ్ఞను ప్రదర్శించిన ప్రతిభామూర్తి విశ్వనాథ సత్యనారాయణ.

మహాదేవునికి ఆ మహాకవి మధ్యాక్కర మాధుర్యం చవి చూపించాడు ఆ రుచి మరగి, ఆ దేవదేవుడు ఆయనలోని అంతశ్చైతన్యాన్ని ఆ వృత్తానికి అనుగుణంగా ప్రేరేపిస్తుంటాడు. కవి పరధ్యానంలో పడితే పరమేశ్వరుడే ఆయనను కవితాధ్యానంలోకి మళ్ళించుకొని మధ్యాక్కరలు రాయించుకొనే స్థితి యేర్ప

డింది. పరమేశ్వర స్పర్శ పొందినప్పుడు, ఆ కవిజీవుడు పరుసవేది తాకిన లోహం బంగారమైనట్లు కవితాచైతన్యంతో మధ్యాక్కఅ గానం చేసేవారు. ఆ అనుభూతిని ఇలా చెప్పుకున్నాడు కవి:

''నిను నూహ చేసెడు నంత సేపును నే నొక్క బుద్ధి
ఖనిని, నీ యూహ మానితిని నేను మూర్ఖవతంసుడై తి;
నను దాఁకుచుంటివి పరుసవేదివి, నవ్య చైతన్య
ఘృణి ఖనీ! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి!''

శృంగార కావ్యాలలో నాయిక దశవిధావస్థలు పొందటం పరిపాటి. అలాగే భగవంతునికోసం, ముక్తికోసం పరితపించే భక్తుడు కూడా పది రకాలైన అవస్థలు పొందే అవకాశముంది అని, ఆధ్యాత్మికమైన ఆర్తిలో ఆ అవస్థలకు అభివ్యక్తిని కల్పించాలని విశ్వనాథవారు పది రకాలైన మధ్యాక్కఅ శతకాలు వ్రాశారు.

''శ్రీశైల మల్లికార్జున మహాలింగ!'' అన్న మకుటంతో శ్రీగిరి శతకం.

''శ్రీకాళహస్తీశ్వరా! మహాదేవ!'' అనే సంబుద్ధితో శ్రీకాళహస్తి శతకం.

''భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ!'' అని పిలుస్తూ భద్రగిరి శతకం.

''నందమూర్నిలయా విశ్వేశ్వరా! కులస్వామి!'' అని ప్రబోధిస్తూ కుల స్వామి శతకం.

''వేంకటేశ్వరా! శేషాద్రినిలయా!'' అని వేడుకుంటూ శేషాద్రి శతకం.

"భీమలింగ! ద్రాక్షారామసంగ!" అని ప్రార్థిస్తూ ద్రాక్షారామ శతకం.

''నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల!'' అనే పిలుపుతో నంద మూరు శతకం.

''నెకరుకల్ ప్రాంత సిద్ధాబ్జహేళి!'' అనే స్తుతితో నెకరుకల్లు శతకం.

''మున్నంగి వేణుగోపాల!'' అనే మకుటంతో మున్నంగి శతకం.

''వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి'' అనే వేడుకోలుతో వేములవాడ శతకం విశ్వనాథవారు వెలయించారు.

ఆయన శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో వివిధ పాత్రల నాశ్రయించి పరోక్షంగా ఎంతటి జీవుని వేదనను నిక్షేపించారో, ఈ శతకాలలో ఆత్మాశ్ర

యంగా, ప్రత్యక్షంగా అంతటి జీవుని వేదనను నిండింపచేశారు. రామాయణం వ్రాసిన ఈ కవి భద్రాద్రి రాముడికి ఎంత ఆత్మీయంగా, అంతర్వేదనను నివేదించుకుంటాడో ముందుగా గమనిద్దాం.

"కథ నీది సూక్ష్మమతి రమణీయముగ రచించితిఁ గద;
కథ నాది; పాలింపరాదె స్థూలమ్ముగానైన నీవు;
ప్రథితమ్ము లిచ్చిపుచ్చుకొనుటలు; నీకు పట్టవో; ముక్తి
నిధికి, శ్రీశాలికి భద్రగిరి పుణ్యనిలయ! శ్రీరామ!"
ఉండియుండి యితండు గొడవ పెంచుచు నున్నాడటంచు
పండబారని కాయకొఱకు నిరుకునఁబడకు నా స్వామి!
పండబాఱిన నాటిమాట చూచుకోవచ్చు; నా యెడఁద
నిండియుండుము చాలు; భద్రగిరి పుణ్యనిలయ! శ్రీరామ!
నిన్నార్తి చేత నిట్లడుగుచుంటిఁగానీ, లేక యున్న
వన్నెలు చిన్నెలుగాగ వర్ణింపవలఁతిని నేను;
నన్నెఱుంగుదుగాదె, మఱల రామాయణమ్మంతచేతు
నిన్ను; కష్టముకాదు; భద్రగిరి పుణ్యనిలయ! శ్రీరామ!"

విశ్వనాథ కవితలో వ్యవహారవాక్యం మధ్యాక్కఱ వొరవడిలో పడి మధురంగా జాలువారింది.

మధ్యాక్కఱ శతకాలలో ప్రతిదానిలోనూ 101 పద్యాలు రాయటం విశ్వనాథ పాటించిన సామాన్య నియమం. అయితే, మున్నంగి శతకంలో మాత్రం 108 మధ్యాక్కఱలు రాశారు. మొదటి పద్యం, చివరి పద్యం అన్నీ సంబుద్ధులతో నిండివుండి భక్తి పారవశ్యాన్ని ప్రదర్శిస్తూ ఉంటాయి. నూరో పద్యం శతకంలోకల్లా పతాకగా భాసిస్తూ ఉండటం కూడా మరో విశేషం. మున్నంగి శతకంలో నూరో పద్యంలోని భావాన్నే మరొక యేడు మధ్యాక్కఱలలో వ్యాఖ్యానించారు విశ్వనాథ. మోక్షార్థియైన విశ్వనాథ మోక్షానికి మూలమైన వైరాగ్యాన్ని, దాని సాధకమైన భక్తినీ, దానికి మూలమైన జ్ఞానాన్ని ప్రసాదించుమని వేణుగోపాల స్వామిని వేడుకున్నారు -

"జన్మ లింకెన్ని నాచేత నెత్తింప సంకల్ప మయ్య!
జన్మ లెన్నైన నాకేమి? - వైరాగ్య సంపదతోడ
మన్మనోవిహరణ మీవు వదలకు, మదన గోపాల!
విన్మ నా యీ మాట యొకటి - మున్నంగి వేణుగోపాల!"

"శివునకు నీకును నేను భేదమ్ము సేయన యేని,
సవురుగా మీఁద్దఁ టొక్కఁడే బ్రహ్మ చైతన్యమేని,
అవుర! వేదాంతముల్ నిజము లేని, నన్నది పొందుగాక.
వివరమ్ము తెలిసిన నన్ను - మున్నఁగి వేణుగోపాల!"

శివకేశవాభేద దృష్టి విశ్వనాథ అద్వైత భక్తికి మూలం. వేణుగోపాలునిలో విశ్వేశ్వరుని భావించినట్లే - వేంకటేశ్వర స్వామిలో విశ్వనాథుణ్ణి కూడా దర్శింపగలడు కవి - వినండి శేషాద్రి శతకంలో ఈ నూరో మధ్యాక్కఱ:

సౌద సుదర్శన మది చేత వాసుకి చుట్టుకొన్నట్లె
విదిత శంఖము వినాయకుని నెమ్మోము విఁసిన యట్లు
పద నూర్ధ్వ పుండ్రమ్ము లవి త్రిశూలంబు పగిది రెండుగను
చెదరక! రావయ్య. వేంకటేశ్వరా! శేషాద్రి నిలయ!

విశ్వనాథ వారి గుండెల్లో కూర్చున్నది విశ్వేశ్వరుడు; ధ్యానంలో తోచేది విష్ణుమూర్తి. ఆ అద్వైత భక్తి తత్వం విశ్వనాథ బ్రతుకులో ఫలించింది. దానిని తన కులస్వామియైన నందమూరి శివునికి నివేదించుకున్నాడు:

"గుండెలో లింగమై, నీవు స్వామివై కూర్చుండినావు;
దండిగాఁ గనుమూయ నెదుట హరివయి తారాడినావు;
పండి మీ తత్త్వము నాకు ఫలియించె, పాటితపద్మ
ఖాండ! శ్రీ నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి!"

విశ్వనాథ తన కవిత్వాన్ని శివజటాజూట వినిర్గత గంగాధారగా భావించుకున్నాడు. ఆ ధారలో సహా తనను ఆ శివునికి ధారాదత్తం చేసుకున్నాడు.

"వరగ నా శారదాదేవి నీ నుండి బయలుదేరినది;
సరసిజభవురాణియొక్క ధార నా సన్నిధిఁ బ్రాకె;
హర! నన్ను నాధారవెంట నీవద్దకరుదేర నీవె;
సురనదీ చూడ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ!"

పద్యాలతో పిలుస్తున్నా, మధ్యాక్కఱలతో మొరపెట్టుకుంటున్నా ఒక్కొక్కసారి ఆ పరమేశ్వరునినుండి బదులురాదు. అందుకు భక్తకవి హృదయం పరితపిస్తుంది 'పది శతకాలు చెప్పినా మారుపల్కవేమయ్యా!' అని ఆక్రందిస్తాడు కవి—

పది మాటలకు నొక్క మాట బదులుగా పలుకంగవచ్చు
అది ఎంత బిగిసిన నైన; వ్రతముగా నాడవో యేమొ
పది పదుల్ వందలు గాగ వ్రాసిన పద్యాలకైన
నది దిక్కు లేద - భీమేశలింగ! ద్రాక్షారామ సంగ!

విశ్వనాథ సత్యనారాయణగారు సదా కవితాచింతనాపరుడు. అదనుదొరకి నప్పుడెల్లా పద్యం వారి పెదవులమీద లాస్యం చేస్తూనే ఉండేది. ప్రయాణాలు చేస్తున్నప్పుడు కూడా విరివిగా పద్యాలు రాయటం విశ్వనాథకు అలవాటు. ప్రయాణాల్లో కొన్ని వందల పద్యాలు పుట్టి వారి ధారణలో నిలిచేవి. వాటిని తరువాత రాతలోకి ఎక్కించేవారు ఈ అలవాటును ఆలంబనగా చేసుకొని ఈ విధంగా చివరి కోరిక కోరారు సంతాన వేణుగోపాలస్వామిని విశ్వనాథవారు.

"సామాన్యముగ నేఁ బ్రయాణముం జేయు సమయంబునందు
నా ముఖంబునఁ గవితా సరస్వతి నాట్యమాడెడిని -
స్వామి! నా తుది యాత్ర నిన్నుఁ బాడుచు సాగనివే! గ
వీమార్గ! నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల!"

బహుశః ఆ బ్రహ్మలోక యాత్రలో కూడా విశ్వనాథ మధ్యాక్కఱనే ఆలపించి ఉంటాడు! *

(ఆకాశవాణి, హైదరాబాదు కేంద్రం నుండి ప్రసారం :
సాహితీ సుధ. 15 & 22-11-1994)

# విశ్వనాథ శతజయంతి ప్రారంభోత్సవం

"నా మార్గమ్మును గాదు వీని దరయన్ నా తాత ముత్తాతలం
దే మార్గమ్మును గాదు మార్గమది యింకేదో యనంగా వలెన్
సామాన్యం బనరాదు వీని కవితా సామ్రాట్త్వమా హేతువై
యీముచ్చిమ్మని దా వరించినది నే నెంతే ముదం బందెదన్."

విజయవాడ సిద్ధార్థ కళాపీఠం వారు సెప్టెంబరు 25, 26, 27 (భావ-భాద్రపద బహుళ షష్ఠి, సప్తమి, అష్టమి తిథులలో) వ తేదీలలో నిర్వహించిన కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ శతజయంత్యుత్సవ ప్రారంభ సభలు తెలుగువారు కలకాలం జ్ఞాపకం ఉంచుకునేలా ఉదాత్తంగా జరిగాయి. వందలాది సాహితీవేత్తలు విశ్వనాథ సాహితీమూర్తికి అక్షర నీరాజనా లందించారు. ఉత్స వాలలో అందరినీ ఆకట్టుకున్న విశేషాలు అయిదారు.

మొదటిది - సిద్ధార్థ కళాపీఠం వారు ఉత్సవ నిర్వహణంలో చూపించిన భక్తి శ్రద్ధలు, క్రమశిక్షణ, సౌజన్యం. ఆహ్వాన సంఘ సభ్యులలో ఒక్కొక్కరు వారి వారి రంగాలలో దిగ్గజాల వంటివారు. వారే విశ్వనాథను గురించి స్వయంగా మాట్లాడి సప్తాహాలు నిర్వహింపగలవారు. అయినా, అతిథులకు అవకాశమిచ్చి తమ పెదవులమీద మందహాసాలను చిందించి ఊరుకున్నారు. కార్యకర్తలుగా తాము చేయవలసిన ఏ చిన్న పనైనా ఒక ఆరాధనా భావంతో నిర్వహించారు. వారి అప్రమత్త వలన ఆ సభలో ఎక్కడా అనౌచిత్యం అడుగుపెట్టలేదు. రస భంగం రంగప్రవేశం చేయలేదు. ఆడిటోరియంలో ప్రవేశించగానే మంద్ర గంభీరంగా విశ్వనాథవారి గళం అటు రామాయణ కల్పవృక్ష కవితాగానాన్ని చేస్తూనో, ఇటు కిన్నెరసాని పాటలు పాడుతూనో ప్రేక్షకులను ఆహ్వానించేది. విశ్వనాథ సాహితీ జగత్తులో ప్రవేశించిన అనుభవాన్ని ఆడిటోరియంలో కల్పించిన కళాపీఠం వారి కళాహృదయానికి సభికులు సంతసించిపోయేవారు. వేదికమీద-వేదనాదంలోని లయలాంటి ఆనందముద్రలో ఉన్న విశ్వనాథ చిత్రపటం వక్త లలో విశ్వనాథ ఆవేశించిన విద్యుత్తును సృష్టించేది. ఆ మూడు రోజులూ సాహితీ రసికులకు అనిర్వచనీయమైన కావ్యానందం.

రెండపది - నూరేళ్ళలో ఏ కుటుంబంలోనైనా అయిదుతరాలు ఆవిర్భవించే అవకాశం ఉంటుంది. విశ్వనాథవారి శత జయంతిలో వారి సాహిత్య కుటుంబంలోని అయిదు తరాల ప్రతినిధులు పాల్గొన్నారు విశ్వనాథ తరంవారు మొదటి తెగకు చెందుతారు వారందరిలో అగ్రగణ్యులు డాక్టర్ బెజవాడ గోపాల రెడ్డిగారు మరొక ఆశ్చర్యమేమంటే - 85 ఏళ్ళు పైబడ్డ ఒక రైతుకూడా కార్యక్రమాల్లో పాల్గొని విశ్వనాథతో తనకున్న సాహిత్య పరిచయాన్నీ, కొన్ని మరువలేని సంఘటలనూ చెప్పి సభికులను ఆశ్చర్యంలో ముంచెత్తాడు. ఇక రెండవ తరంవారు విశ్వనాథవారి సీనియర్ శిష్యులు. వారిలో అగ్రగణ్యులు శ్రీ మల్లంపల్లి శరభయ్య. శ్రీ పేరాల భరతశర్మ, శ్రీ జువ్వాడి గౌతమరావు, శ్రీ కోగంటి సీతా రామాచార్యులు మొదలైన సాహితీమూర్తులు. మూడవ తరంలో చెప్పుకోదగినంత మంది పాల్గొన్నారు డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణ. డాక్టర్ తుమ్మపూడి కోటేశ్వరరావు, డాక్టర్ కోవెల సంపత్కుమారాచార్యులు, డాక్టర్ కోవెల సుప్రసన్నాచార్యులు, డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం. డాక్టర్ శలాక రఘునాథ శర్మ, డాక్టర్ బేతవోలు రామబ్రహ్మం, డాక్టర్ టి. వి. సుబ్బారావు. డాక్టర్ అందవిల్లి సత్యనారాయణ, డాక్టర్ చివుకుల సుందరరామ శర్మ మొదలైనవారు ఎందరో ఉన్నారు. నాల్గవ తరంలో ఉత్సాహవంతులైన రచయితలు, పరిశోధకులు గణసీయులు మరెందరో ఉన్నారు. విశ్వనాథ మీద విశ్వవిద్యాలయాలలో పరిశోధన చేస్తున్న వారు. విశ్వనాథ సాహిత్యం మీద విమర్శ వ్రాస్తున్న వారు లెక్కలు వేస్తే శతాధికంగా తేలుతున్నారు. డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్య, డాక్టర్ కాజా లక్ష్మీనరసింహారావు, డా. వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి, డా. దామర్ల శివరామ్, డా ముదివేడు ప్రభాకరరావు డా. చెన్నాప్రగడ జయలక్ష్మి, డా. ఆర్ కమల, డా. కసిరెడ్డి వెంకటరెడ్డి మొదలైనవారు వేదిక మీద కనిపించిన సాహితీమూర్తులు. కాని, మరెందరో మహానుభావులు దేశంలో ఉన్నారు సంవత్సరం పొడుగునా జరిగే ఉత్సవాలలో వారందరూ దేశంలో అన్ని మూలలా జరిగే శతజయంత్యుత్సవాలలో పాల్గొంటారు. ఇక అయిదవ తరం యువతరం, బాలతరం విశ్వనాథవారి సాహిత్యం మీద జరిగిన వ్యాస రచన పోటీలలో, కవితల పోటీలలో విజేతలైన యువతీయువకులకు ఆ వేదిక మీద బహుమతులు అందజేయబడినవి. ఎనిమిదవ తరగతి విద్యార్థి చిరంజీవి జగురోతుల రోహిణీ భాస్కరకుమార్ విశ్వనాథ మీద కవిత చదివాడు. అయిదవ తరం 'చిగురుకొమ్మైన చేవ' అనిపించింది. ఒకే కాలంలో అయిదు తరాలలో

ప్రవహింప గలిగిన మహాకవి యుగకర్త; ఆయన సాహిత్యం అజరామరంగా అమృతధారగా యుగయుగాలు సాగుతుం దనిపించింది.

మూడవది-విశ్వనాథ మార్గ వివేచనం. ఈ వ్యాసంలో మొదట పేర్కొన్న పద్యం చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు చెప్పింది. తెలుగు కవితావికాసంలో చెళ్లపిళ్ల ఒక యుగకర్త. "పూర్వకవుల మార్గాల కంటె; నా మార్గం కంటె విలక్షణమైన మార్గాన్ని ఆవిష్కరించిన విశ్వనాథ 'కవిసమ్రాట్' అనదగినవాడు. అతడు నా శిష్యుడే. కాని, నా తరువాత తనదైన ఒక మహా మార్గాన్ని నిర్మించుకొన్న మహాకవి" అని చెళ్లపిళ్ల ప్రశంసించాడు. ఒక యుగకర్త భావియుగకర్తకిచ్చిన కితాబిది. ఆ పద్యం ఆహ్వాన పత్రాలలో ముద్రించటం ఔచిత్యాలలో ఉత్తమ ఔచిత్యం. ఆ పద్యం విశ్వనాథ సాహిత్య సమాలోచనకు కీలకాంశం (Key-note)గా నిలిచింది. మొదటిరోజున మొదటి ఉపన్యాసం చేసిన ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం దానిమీద చర్చను ఆరంభించాడు ప్రత్యక్షంగా. మిగిలిన వక్తలు పరోక్షంగా దానిని కొనసాగించారు. చివరకు ముగింపుసభలో ముఖ్యాతిథి ఉపన్యాసం చేసిన ఆచార్య సి. నారాయణరెడ్డిగారు కూడా ఈ కీలకాంశ వివేచనంతోనే ముగించారు. విశ్వనాథవారు కావ్యంలో ఏకవాక్యత కావాలని ఘోషిస్తూ ఉండేవారు. శతజయంత్యుత్సవ కావ్యంలో ఆ ఏకవాక్యత సిద్ధించింది.

నాల్గవది - వివిధ దృక్కోణాలతో విశ్వనాథ సాహిత్య శిల్పానుశీలనం. విజయవాడ శతజయంతి సభలలో నాకు, నాకే కాదు - ఆధునిక స్పృహగల సాహితీవేత్తలందరికీ, ఆనందం కలిగించిన అంశం ఇది. ఆ సభల్లో పండితులు విశ్వనాథను ప్రశంసోక్తులతో పొగడటంకంటె, వారి సాహితీ వ్యక్తిత్వాన్ని స్పష్టంగా, సోపపత్తికంగా, తర్కబద్ధంగా, ఆధునికంగా విశ్లేషించి, వివేచించి, సమన్వయించటానికి ప్రయత్నించారు. ఒకరి ఉపన్యాసం లాగా మరొకరి ఉపన్యాసం లేదు. వైవిధ్యంతో కూడుకున్న చర్చాగోష్ఠులలో కూడా ఒక ఏకవాక్యత గోచరించింది. ఆధునిక జీవితంలో, సాహిత్యంలో విశ్వనాథ అంతర్వాహినిగా ప్రవహిస్తున్న వైఖరి గోచరించింది. విశ్వనాథ సాహితీ వ్యక్తిత్వంలోని వేయిరేకులు విమర్శకుల వివేచనలో విచ్చుకున్నట్లనపించింది. వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య పరిజ్ఞానం ఉన్న విద్వాంసులు మరొక వెయ్యేళ్లు ఆధునికంగా విశ్వనాథ సాహితిని వ్యాఖ్యానించటానికి తగినంత వస్తుతత్త్వం ఆ మహాకవి దర్శనంలో ఉన్నదని స్పష్టమైంది.

అయిదవది - విశ్వనాథ స్మృతులు. శతజయంత్యుత్సవాలలో సభికులను ఉర్రూతలూగిస్తున్న ఆసక్తికరమైన అంశం విశ్వనాథ స్మృతుల సంస్మరణం. ఆ మహాకవితో పరిచయమున్న ప్రతి వ్యక్తికీ కృతజ్ఞతలతో, కన్నీటితో ఆర్ద్రమౌతూ చెప్పుకొనే సంఘటన కనీసం ఒక్కటైనా ఉండటం విశేషం. అవతార పురుషుని లీలల్లాగా, మహిమల్లాగా విశ్వనాథ స్మృతులు చెప్పేవారినీ, వినేవారినీ కూడా ఒక ఆనంద తరంగంలో ఓలలాడిస్తాయి. సమాజంలో ఉన్న వివిధ వృత్తుల, ప్రవృత్తులవారితో విశ్వనాథకు గల ఆత్మీయమైన సంబంధాలను సమీక్షిస్తున్నప్పుడు వారి వ్యక్తిత్వంలోని విశ్వమానవత గోచరిస్తుంది. కవులు, సాహితీవేత్తలు విశ్వనాథకు సహజ బంధువులు. ప్రతిభ ఎక్కడ కనపడితే దానిని మెచ్చుకొనే మహోన్నత గుణం విశ్వనాథకు సహజ గుణం. అచ్చమైన కవిత వినపడితే చాలు స్వచ్ఛమైన కన్నీటితో స్వాగతం పలికేవాడు ఆ కవిసమ్రాట్టు. ఆకలితో, పేదరికంతో బాధపడుతున్న మనిషిని చూచెనా-తనకున్న దానిలో అతనికింత పెట్టి మనిషిలో మాధవుణ్ణి దర్శించి పూజించిన మహనీయుడు. కూచిపూడి నటులు, నర్తకీమణులు, వ్యవసాయ కూలీలు. హరిజన మిత్రులు, జమీందారులు, మధ్యతరగతి మేధావులు, పిల్లలు, ప్రకృత్యంగాలు - ఇలా ఎన్నింటినో, ఎందరినో విశ్వనాథ ప్రేమించి వారి జీవితాల్లో కలిసి ప్రవహించిన కథలు, గాథలు ప్రతివక్త నోటా వినవచ్చాయి. ఒక్కొక్క రచయితను విశ్వనాథ స్వయంగా ఉత్తేజపరచిన సన్నివేశం గాని, ప్రభావితుణ్ణి చేసిన సంఘటన గాని ఆయా వక్తలు చెపుతున్నప్పుడు "ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కొక్కడై తోచు" పోలిక స్ఫురించింది. మరొక విశేషం - విశ్వనాథ సాహిత్యంలో కొందరు ఒక్కొక్క ప్రక్రియ మాత్రమే, లేదా కొన్ని ప్రక్రియలు మాత్రమే చదివినవారుండవచ్చు వారందరికీ విశ్వనాథ సమగ్ర భారతి ప్రత్యక్షమయింది. అంతేకాదు - తెలుగులోనే కాకుండా విశ్వనాథ భారతదేశ రంగంలో కూడా సమకాలీనంగా నిర్వహించిన సార్థకమైన పాత్ర సాక్షాత్కరించింది. జ్ఞానపీఠమెక్కిన తొలి తెలుగు కవిని స్మరిస్తే, కవిసమ్రాట్టుకు ఆ గద్దె చిన్నదనిపించింది

మహాకవుల శతజయంత్యుత్సవాలు జరుపుకోవటం ఆ జాతికున్న ఉత్తమ సంస్కారానికి నిదర్శనం. 'శతజయంతి' అనగానే భావుకుల మనస్సులలో నాలుగంశాలు తళుక్కుమంటాయి 1. ఒక నూరేళ్ళలో వేలమంది కవులూ, రచయితలూ పుట్టి రచనలు చేసి గతించిపోవచ్చు. కాని, ఏ కొద్దిమందో

మాత్రమే శత జయంతిని ప్రజలచేత చేయించుకుంటారు. అంటే, చాలా మంది కవులు నూరేళ్ళలోనే కాలగర్భంలో కలిసిపోతారు. కొందరు మాత్రమే నూరేళ్ళ పండుగ చేసుకుంటారు. 2 కొందరికి ఒక నూరేళ్ళ పండుగ చాలనిపిస్తుంది. వారి సాహిత్యం ఒక శతాబ్ది తరువాత ప్రాచుర్యాన్ని కోల్పోవచ్చు. 3. కొందరు రచయితలు నూరేళ్ళ తరువాత కూడా ఊడలు సాచి సాగుతారు. వారికి ఒకటి కంటె ఎక్కువ శతాబ్ది జయంతులు జరుగవచ్చు. 4. కొందరు కవులు, రచయితలు ప్రతి నూరేళ్ళకూ ఒక క్రొత్తచూపుతో వ్యాఖ్యానించుకోటానికీ, సాహిత్య సంప్రదాయాన్ని రక్షించుకోటానికి ఉపకరిస్తారు. అటువంటివారు అజరామరం లేని అమృతమూర్తులు. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ అటువంటి అమృతమూర్తి.

సిద్ధార్థ కళాపీఠం సెప్టెంబరు 25 న కట్టిన పచ్చతోరణం విశ్వనాథ సహస్ర జయంత్యుత్సవానికి కట్టిన దీక్షాకంకణంలా స్ఫురించింది. విశ్వనాథవారి పేరుతో విశ్వవిద్యాలయం వెలిస్తే వెయ్యేళ్ళ పండుగకు వేయిస్తంభాల మంటపం కట్టించినట్లౌతుంది. ఎన్ని విచ్ఛిత్తులేర్పడ్డా నన్నయ్య తిక్కనలు చావరని ఇది వరకే తేలిపోయింది. వారిలాగా విశ్వనాథ జీవిస్తాడని శత జయంతి విజయవాడలో విజయగీతం పాడింది.

శతజయంత్యుత్సవాలలో 27 వ తేదీనాటి ఉదయం చర్చాగోష్ఠికి నేను అధ్యక్షత వహించాను. నా ఉపన్యాసంలో విశ్వనాథ - యుగయుగాలు ప్రవహించే సాహిత్య చైతన్యమని వక్కాణిస్తున్నప్పుడు సభలో నుండి ఒక కవి ఈ క్రింది పద్యం వ్రాసి నాకు పంపారు. పద్య కర్త పేరు వ్రాయలేదు. బహుశః ఇది ఒకరి అభిప్రాయం కాదు, ప్రజాభిప్రాయమని ప్రతీకాత్మకంగా ప్రతిపాదింపదలచినట్లున్నారు. వారి సౌజన్యంతో ఈ పద్యం.

"వంద యేండ్లలోన పలుమార్లు పుట్టెడు
వారి కగును గొప్ప - వందయేండ్లు
వేలయేండ్ల కెపుడొ పృథ్వికి వచ్చెడు
వానికేమి గొప్ప?— వంద యేండ్లు!"

*

(ఆంధ్రభూమి 7-10-1994)

# చెళ్ళపిళ్ళ సత్కరించిన కవి జాషువా

ఈ యేడు సెప్టెంబరు 28 వ తేదీనే 'నవయుగ కవి చక్రవర్తి' గుఱ్ఱం జాషువా శతజయంత్యుత్సవాలు మొదలయ్యాయి. విశ్వనాథ 1895 సెప్టెంబరు 10 వ తేదీన పుట్టితే, జాషువా 28 వ తేదీన పుట్టాడు. ఇద్దరూ తిరుపతి వేంకట కవుల అవధాన ఆశుకవితాయుగంలోనుంచి కవితా స్ఫూర్తి పొందినవారే. ఆ యుగ ప్రభావం ఉన్న కవి పద్యంలో తన వ్యక్తిత్వాన్ని గురించీ, కవిత్వాన్ని గురించీ, ఉద్యమాలను గురించీ అభిప్రాయాలను గురించీ నిర్భయంగా, నిండు గర్వంతో చెప్పుకుంటాడు. 'అల నన్నయ్యకు లేదు' అన్న పద్యం విశ్వనాథ ఆ యుగ చైతన్యంతోనే అనగలిగాడు

''కవి శక్రేశుఁడ గండపెండెరములన్ గాంగేయ తీర్థంబులన్
వివిధోపాయన సత్కృతుల్ గొనిన గాంధీ శాంతి సిద్ధాంత మా
ర్దవ మార్గాటుఁడ, గబ్బిలంబులకు దౌత్యంబుల్ ప్రబోధించు మా
నవతా స్రష్టను, నవ్యభావ చతురుండన్, జాషువాభిఖ్యుఁడన్.''

ఇంతటి ఆత్మ ప్రత్యయంతో మత్తేభాన్ని విజృంభింపజేయగల చేవ తిరుపతి కవుల కవితా యుగందే.

నిస్సంశయంగా తిరుపతి వేంకట కవుల యుగానికి నాయకుడు శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి. ఆశువులో చాటు మాధుర్యాన్ని మేళవించి జవనాశ్వంలా పద్యాన్ని నాలుగు పాదాలా దూకించగలిగిన శక్తి తాను ప్రదర్శించటమే కాకుండా మరొక తరానికి ఆ మహాశక్తిని ప్రసాదించాడు. ఆ తరువాతి తరంలో నవయుగాన్ని సృష్టించుకొన్న కవిచక్రవర్తి గుఱ్ఱం జాషువా!

ఎవరైనా తన కవిత్వంలో తప్పుపట్టినా, కవిత్వం మీద విమర్శ చేసినా, ఉద్దండంగా ఎదుర్కొని తమ కవితను సమర్థించుకోవటం, అవసరం వస్తే వాదైనా చేసి, చివరకు శత్రువును ముఖ పిధానంచేసి ఓజస్వితను ప్రదర్శించటం ఆ తరానికి చెళ్ళపిళ్ళవారి వారసత్వం. ఆశుకవిత్వంగాని, జంట కవిత్వంగాని జాషువాగారు ప్రకటంగా చెప్పకపోయి ఉండవచ్చు. కాని, ఆ కవిత్వంలోని

చాటు కవితా పాటవత్వాన్ని తన వాక్కుకు సహజ భూషణంగా అలంకరించు కున్నారు.

కాకినాడలో ఒకసారి జాషువా కవితపై కువిమర్శ చేశారట ఎవరో! జాషువాగారికి ఆగ్రహం వచ్చింది. అందులోనుండి పద్యం పొంగులువారింది—

''గవ్వకు సాటిరాని పలుగాకుల మూక లసూయచేత న
న్నెవ్విధి దూరినన్ నను వరించిన శారద లేచిపోవునే!
యివ్వసుధాస్థలిన్ పొడమరే రసలుబ్ధులు? గంట మూనెదన్
రవ్వలు రాల్చెదన్ గరగరల్ సవరించెద నాంధ్రవాణికిన్.''

జాషువా కవి కలం రవ్వలు రాల్చిన పద్యం ఇది "నను వరించిన శారద లేచిపోవునే" అనే వాక్యం జాషువా కవి ధీమాను తెలుపుతోంది. 'వాణి నా రాణి' అనే వాక్యం కంటే వాడిగా వెలువడింది. తెలుగువారి మెప్పును పొందింది.

కోపంనుండి, తాపంనుండి వెలువడిన వేడివేడి కవిత్వం జాషువా గారి పద్యం. 1933-34 ప్రాంతంలో జాషువా కవి వేంకటగిరి రాజాగారైన యాచేంద్ర భూపతిని దర్శించటానికి రైలులో బయలుదేరి వెళుతున్నప్పుడు ఒక సాటి ప్రయాణీకుడు తన కవిత్వాన్ని మెచ్చుకొని, కులంపేరు విని చివాలున లేచి పోయిన దృశ్యం వారి గుండెలో బాకు గుచ్చినంత బాధను కలిగించింది. శోకం నుండి శ్లోకం వెలువడ్డట్లు ఈ పద్యం రాజు ముందు జాషువా కవి కంఠంనుండి జాలువారింది—

"నా కవితావధూటి వదనంబు నెగా దిగ జూచి రూపరే
ఖాకమనీయ వైఖరులు గాంచి భళీభళి! యన్నవాడె 'మీ
దే కుల' మన్న ప్రశ్న వెలయించి చివాలున లేచిపోవుచో
బాకున గ్రుమ్మినట్లగును పార్థివచంద్ర! వచింప సిగ్గగున్."

నానారాజ సందర్శనంలో తిరుపతి వేంకట కవుల కవితా వధూటి ఎగాదిగ చూడటం ప్రసిద్ధి. ఇందులో జాషువా కవితా వధూటిని ఒక శ్రోత ఎగాదిగ చూడటంగా మారింది. కాని, ఈ పద్యంలో 'అస్పృశ్యత'ను కవి 'చివాలున లేచిపోవటం'తో ధ్వనింపజేయటం విశేషం. కవితా వధూటి వదనం అభివ్యక్తి సౌందర్యం; రూపరేఖలు శబ్దార్థాలు; కమనీయ వైఖరులు గుణసమన్వితాలైన రీతులు. వైఖరి శబ్దం రీతికి పర్యాయవాచకం. జాషువాగారి కవితాశైలిలో శబ్దా ర్థాలకు సమప్రాధాన్యం, రీతిరూపుకట్టుతూనే గుణాలతో మధురంగా స్ఫురించటం

అనే రెండు లక్షణాలు ఆస్వాదయోగ్యతను కలిగిస్తాయి. వాటిని సహృదయులు **'భళీ! భళి!'** అని ప్రశంసింపక తప్పదు.

కవితా కళకు కులం కళంకంగా సాహితీ రసికుడు భావించటం అతని సాహితీ స్పృహలోని జాడ్యాన్ని తెలుపుతుంది, కులాహంకారాన్ని బైటపెడుతుంది కాని, కళాసౌందర్య సంస్కారాన్ని ప్రదర్శించదు. తిరుపతి వేంకటకవుల యుగనాయకుడైన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి కులాన్ని పట్టి మాత్రమే కవిత్వాన్ని గౌరవించే కుసంస్కారాన్ని తిరస్కరించారు. వారి శిష్యులలో విశ్వనాథాదులు ఆ బాటనే పయనించారు.

"ఎంత దూరమో ఎందుల కెవడు జాషు
వా యను కవి ప్రవరుడు? కవనమునందు
వానిబోలెడు వారె ఎవ్వార లేని
విప్రకవులందు ఎవ్వరో వేత్త దక్క"

అని జాషువా కవిని ప్రశంసించారు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు అంతేకాదు. జాషువాగారి కాలికి చెళ్ళపిళ్ళవారు గండపెండేరం తొడిగి గౌరవించారు. అంటే- ఒక యుగకర్త కులాన్ని పట్టించుకోకుండా కవితా కళను గౌరవించాడన్నమాట!

''చెళపిళ సత్కవీశుడు, ప్రసిద్ధుడు వీరశతావధాని, యాం
ధ్రుల శుభరక్త నాళముల రూపము నెత్తిన బ్రాహ్మణుండు నా
పలుకుల రాణి పాదమును బంగరు గగ్గెరతో నలంకృతుల్
సలిపె, నికేమి కావలె ప్రశస్తి కవిత్వ కళా వధూటికిన్!"

అని జాషువా గారే పద్యంలో ముచ్చటపడి చెప్పుకున్నారు.

చెళ్ళపిళ్ళ యుగ కవితా చైతన్యాన్ని ఊపిరిగా నిలుపుకున్నా, జాషువా గారిలో ఉద్యమ కవితా తరంగం కూడా ఉవ్వెత్తుగా లేచింది. ఆయనకు ఒక వైపు కాల్పనిక కవితాయుగ గీతికలు వినిపిస్తున్నాయి; మరొకవైపు సామ్యవాద అభ్యుదయ రోచిస్సులు కనిపిస్తున్నాయి రెండు తెగలవారూ గళమెత్తి అరిచే వారే. ఒకరు శోకంతో, మరొకరు కోపంతో. ఒకరు ప్రణయంగా, మరొకరు ప్రళయంగా. జాషువా ఈ రెండు బాటలవాడు కాడు. అతనిది గాంధి మార్గం. అయినా, దానినీ ఆయన ఎలుగెత్తి చెప్పాడు.

''నా కవచం బహింస, సహనంబు మహాయుధ, మెక్కిరింత ధ
ర్మైక నిరూఢి, సత్యము నియంత, యనంత జగత్తు మొత్తమై
నా కెదురైన గెల్తును, వినాశపు బాంబుల గుండెకాయలో
బాకును, లోక మోహన సబర్మతి సన్మునికిం గుమారుడన్."

గాంధీయిజాన్ని కూడా గర్జించినట్లు చెప్పవచ్చునని ఈ పద్యం ధ్వనింపజేస్తోంది. ఈ పద్యం హృద్యంగా ఉన్నది కూడా అందుకే. జాషువాకవి ఖండకావ్యాలలో ఆత్మాశ్రయమైన ఆత్మీయత, ఆత్మాభిమానాలను పుక్కిట పట్టిన మాధుర్యం, ఓజస్సు అనే గుణాలు శాబ్దికంగా, ఆర్థికంగా, సమయోచితంగా రచనలో ఆవిష్కరింపబడుతూ ఉంటాయి. అయితే శబ్ద గుణాలతోనో, కాదా అర్థ గుణాలతోనో రమణీయమైన వైదర్భీరీతిని రచనలో రూపొందించే కవులను చాలమందిని చూస్తాం కాని, జాషువా కవిగారి లాగా శబ్ద గుణాలను అర్థగుణాలకు అనుగుణంగా నడిపించే అభినవ శిల్పం తెలిసినవారు చాల తక్కువ.

సామ్యవాదం వలన ఏర్పడే సమ సమాజంలో ప్రపంచ కార్మికులకు ప్రతినిధులుగా తమను అభ్యుదయ కవులు ప్రకటించుకుంటున్న రోజుల్లో వారికి దీటుగా సర్వోదయ సిద్ధాంతాలను పాటించే విశ్వమానవునిగా తనను తాను ప్రకటించుకున్నాడు జాషువా కవి. 'నేను' అన్న ప్రసిద్ధ ఖండకావ్యంలోని ఈ పద్యం సుప్రసిద్ధం.

''నివసించుటకు చిన్న నిలయ మొక్కటి దక్క
　　　గడన సేయుట కాసపడను నేను
ఆలుబిడ్డలకునై యాస్తి పాస్తులు గూర్చ
　　　పెడత్రోవలో పాదమిడను నేను
నే నాచరింపని నీతులు బోధించి
　　　రాని రాగము తీయలేను నేను
సంసారయాత్రకు చాలినంతకుమించి
　　　గ్రుడ్డి గవ్వయు కోరుకొనను నేను
కులమతాలు గీచుకొన్న గీతలు జొచ్చి
పంజరాన గట్టుపడను నేను
నిఖిల లోకమెట్లు నిర్ణయించిన నాకు
తిరుగులేదు; విశ్వనరుడ నేను!''

ఆశువులోని అవిచ్ఛిన్నధార జాషువా కలం జీవనధార!
చాటుకవితలోని జాణతనం జాషువా పలుకుల నీటుదనం!
నినాదాల్లోని అహంభావం జాషువా పద్యాల శంఖారావం!
గాంధీయిజంలోని భావజాలం జాషువా కవితల వస్తుసారం! *

(ఆంధ్రభూమి 4-12-1994)

# ప్రజల నాలుకలయందు జీవిస్తున్న సుకవి

"రాజు జీవించె రాతి విగ్రహములందు
సుకవి జీవించె ప్రజల నాలుకలయందు."

జాషువాగారి ఈ పద్యం జాతి నాలుకలమీద చిరంజీవిగా జీవిస్తోంది. రాజులు రాతి విగ్రహాలలో జీవిస్తారన్న వాక్యం సామాజిక వ్యవస్థనూ,సుకవి ప్రజల నాలుకల మీద జీవిస్తాడన్నది సాహిత్య వ్యవస్థనూ ధ్వనింపజేసే ఆధునిక కవితా సూక్తుల్లాగా తెలుగువారిని ఆకర్షించాయి. వారి జీవితంలో ప్రవహించాయి. సుకవి లక్షణం చెప్పిన జాషువా తెలుగువారి హృదయంలో అక్షరాలా సుకవిగా నిలిచిపోయాడు.

కవితను ప్రజల నాలుకల మీద నివసించేటట్లు రచించాలన్న స్పృహను ఆంధ్ర సాహిత్య చరిత్రలోని ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క రకంగా కవులు ప్రదర్శించారు. తిరుపతి వేంకటకవులు ఆశుకవితా ప్రక్రియతో పద్యాన్ని ప్రజల నాలుకమీద బ్రతికింప చేశారు. భావయుగ కవులు భావచిత్రాలలో పద్యాన్ని, గేయాన్ని పాడి, వినిపించి, భావుకుల ముఖమంటపాల్లో లాస్యం చేయించారు. అభ్యుదయ కవులు గేయంతో, వచనకవిత్వంతో ప్రజల రక్తాన్ని కవితా వేశంతో పొంగింపజేశారు. జాషువా కవి ఈ మూడు రకాల కవులలో చేరడు. ఆయన జాతీయవాది అయిన నవ్యసంప్రదాయపు మార్గ ప్రసారకుడు. ఈ నాల్గవ మార్గంలో నడిచి ప్రజల నాలుకలమీద తన పద్యాలను పదిలంగా నిలుపుకున్న ప్రతిభామూర్తి మహాకవి జాషువా!

లఘుకావ్య, ఖండకావ్య ప్రక్రియలు భావకవితా యుగంలో బాగా ప్రాచుర్యం చెందాయి. అయితే లఘుకావ్యం వస్తుపరంగా, అభివ్యక్తిపరంగా ఆధునిక సాహిత్యంలో ఒక ప్రత్యేకతను సాధించింది. అందులోని వస్తువు కథా సౌందర్యం కోసం కాదు నిర్మింపబడేది- ఒక సిద్ధాంత వ్యక్తీకరణం కోసమో, ఒక తాత్త్వికవ్యాఖ్యానం కోసమో, ఒక సామాజిక సమస్య సమగ్ర స్పృహ కోసమో ఎన్నుకోబడుతుంది. సమస్యకు అనుకూలంగా జీవితాన్ని సాగిస్తుంది. వస్తు

ప్రవృత్తిలోని నవ్యతను అభివ్యక్తిలోని నవ్యత పోషిస్తుంది. ఖండకావ్యంలో భావాన్ని అందంగా అభివ్యక్తీకరించే శిల్పానికే అగ్రతాంబూలం అందుతుంది. ఇవి ఆయా ప్రక్రియల కుండే సహజ స్వభావాలు. వాటిని గుర్తించి జాషువాగారు కలకాలం జనాదరణం పొందగలిగే కళాఖండాలను నిర్మించారు

జీవిత ప్రస్థానంలోని మొదలుకు, ముగింపుకు సంబంధించిన ఘట్టాలను తెలుగువారు స్మరించేటప్పుడు జాషువాకవి రచించిన బాల్యం, శ్మశానం అనే ఖండ కావ్యాలను నోరారా పాడుకుంటారు. అవి తెలుగువారి ఇంటింటి పద్యాలయి పోయాయి. హరిశ్చంద్ర నాటకాలు ఎవరు రాసినవి ఆంధ్రదేశంలో ప్రదర్శింపబడుతున్నా, లేదా ఆ కథను చలనచిత్రంగా ఎవరు నిర్మించినా శ్మశాన దృశ్యంలో జాషువాగారి పద్యాలు పాడందే ప్రజానీకం ఆ ప్రయోగాలకు తమ ప్రమోదాన్ని తెలుపదు. ఏకపాత్రాభినయంలో హరిశ్చంద్ర పాత్ర జాషువాగారి పద్యాలను పాడి తన అస్తిత్వాన్ని నిలుపుకోవలసిందే.

"ఇచ్చోటనే సత్కవీంద్రుని కమ్మని
 కలము నిప్పులలోన గరగిపోయె
ఇచ్చోటనే భూమి నేలు రాజన్యుని
 యధికార ముద్రిక లంతరించె
ఇచ్చోటనే లేతయిల్లాలి నల్లపూ
 సలసౌరు గంగలో గలసిపోయె
ఇచ్చోట నెట్టి పేరెన్నిక గనుగొన్న
 చిత్రలేఖకుని కుంచియ నశించె

ఇది పిశాచులతో నిటలేక్షణుండు
గజ్జ గదలించి యాడు రంగస్థలంబు
ఇది మరణ దూత తీక్ష్ణమౌ దృష్టు లొలయ
నవని పాలించు భస్మసింహాసనంబు.''

ఇందులో కొందరికి శ్రీనాథుని సీస పద్యపు నడక సొంపు కనపడింది; మరికొందరికి దేశభక్తి కవితా శాఖలోని సీస పద్య విన్యాసం గోచరించింది. అ ప్రభావాల ప్రసక్తి ఉన్నా జాషువాగారి ఉక్తి చమత్కారం ప్రత్యేకంగా ప్రదర్శితమౌతూనే ఉంది. అది రెండు మూడంశాల మీద ఆధారపడి ఉంది. శ్మశానంలో అంత్య

సంస్కారాన్ని పొందినవారిని పేర్కొంటూ క్రమంగా కవిని, రాజును, క్రొత్త పెళ్ళికొడుకును, చిత్రకారుణ్ణి ఎన్నుకోవటం గమనింపదగిన మొదటి అంశం. శ్రోతలో అత్యంత విషాదాన్ని, దాని కనుకూలమైన సానుభూతిని సమాజంలో సృష్టించగలిగిన విభావాలు పైన పేర్కొన్నవి. అయితే, చెప్పే తీరులోని చమత్కారమే ఈ పద్యంలోని ప్రాణం. నిప్పులలో కరగిపోయింది సత్కవీంద్రుని కళేబరమే కాని జాషువాగారు 'సత్కవీంద్రుని కమ్మని కలం'గా పేర్కొంటారు. ప్రజల నాల్కలమీద ప్రతికే కవిత్వం రాసే సుకవి కమ్మని కవితను వర్షించే ప్రతిభను కలంగా సంకేతిస్తున్నారు జాషువా. ప్రజలకు దానితో ప్రత్యక్ష ప్రత్యయం. అలాగే భూమినేలే రాజుకు అధికార ముద్రికను ప్రతినిధిగా ప్రతిపాదించటం, యువకుడైన గృహస్థునికి నల్లపూసలసౌరును ప్రతీకగా ప్రవేశ పెట్టటం, చిత్రకారుని కీర్తికి పతాకయైన కుంచెను ముందుంచటం పద్యరచనా శిల్పంలోని విశేషం, కవినీ, కలాన్నీ రెంటినీ పేర్కొనటంచేత మానవీకరణం గానీ (Personification), రూపకీకరణంగానీ జరగటంలేదు. కాని, కవితో పాటు అంతరిస్తున్న కళా ప్రతిభకు వ్యక్తీకరణం జరుగుతోంది. కవిని విశ్వజనీనం చేయగలిగిన విభావం కలం. అలాగే రాజుకు రాజముద్రిక. ఇలా పద్య శిల్పం భావనామయంగా వస్తువును మార్చివేస్తుంది. నిటలాక్షుని విలయనృత్యానికి రంగస్థలంగానూ, మరణ దృక్కులను సారించే భస్మసింహాసనంగానూ శ్మశానాన్ని భావించటంలో రమణీయ బీభత్స రసభావ శిల్పం రక్తి కట్టిస్తుంది. ఎత్తు గీతి సీస పద్యరచనా శిల్పంలో శిఖరప్రాయం.

స్వాతంత్ర్యోద్యమ గీతాలలో జాతి నాయకుల మీద రాసిన పాటలను తెలుగువారు నోరారా పాడుకున్నట్లు జాషువా కవి పద్యాలను కూడా ప్రజలు పరమ భక్తి ప్రేమలతో పాడుకొనేవారు. ప్రత్యేకించి జాషువాకవి బాపూజీ, నేతాజీలపై రాసిన ఖండకావ్యాలు నేటికీ ప్రజలు నెమరువేసుకుంటున్నారు.

''వినుత భూపతుల దోపిడిఁ గుందు జాతిలో
దీపంబు వెట్టిన దినకరుండు;
మానవత్వమును భూమండలంబున నెల్ల
చాటిన యాచార్య చక్రవర్తి

సత్యాగ్రహంబను శస్త్రు చాలన విద్య
భువికిఁ దెచ్చిన మహాపురుషమౌళి
నిమ్నజాతుల కంటి నీరంబు దుడిచి యా
శ్వాసించు నిఱుపేద బాంధవుండు
పండ్లు నూరుచున్న బహు మతంబుల తోడ
సహన విద్య నేర్పు సాధకుండు
భార్యబిడ్డలున్న ప్రత్యక్ష దైవంబు
కామిత ప్రదాత గాంధితాత."

1952 లో తిరుపతి కళా సమితివారు జాషువా గారికి ''మధుర శ్రీనాథు"డనే బిరుదాన్ని ప్రదానం చేశారు. గాంధీతాత మీద సీస పద్యం శ్రీనాథుని రచనను స్ఫురింపజేస్తుంది అయితే, శ్రీనాథుని కవిత్వంలో ఓజస్సు ఎక్కువ; జాషువా కవితలో మాధుర్యం ఎక్కువ. ఈ భేదాన్ని భావించి జాషువాగారికి ఆ బిరుదాన్ని ఇచ్చి ఉంటారు.

'సత్కవీంద్రుని కమ్మని కలము' అని యిప్పుడు తలచుకుంటే జాషువా గారి కవిత్వం జ్ఞాపకం వస్తుంది. వారి కవితా మాధుర్యంలోని క్రొత్తదనాన్ని గుర్తించి 1936 లోనే వినుకొండవాసులు 'కవికోకిల' బిరుదాన్నిచ్చి గౌరవించారు. 1934 లోనే ప్రథమ ముద్రణం పొందిన 'అనాథ' కావ్యం, ధ్వనిమయమైన ఆధునిక కవితాభివ్యక్తికి అక్షరోదాహరణం అభినవాభివ్యక్తికి 'కోకిల' సంకేతం.

"ఎవఁడారగించు నమృత భోజనంబునఁ
గలసెనో యీ లేమ గంజిబువ్వ
ఎవఁడు వాసము సేయు శృంగార సౌధాన
మునిఁగెనో యిన్నారి పూరి గుడిసె
ఎవని దేహము మీఁది ధవళాంబరములలోఁ
బొసఁగెనో యిన్నాతి ముదుకపంచె
ఎవఁడు దేహము సేర్చు మృదు తల్పములలోన
నక్కెనో యీయమ్మ కుక్కపడక
వసుధపై నున్న భోగసర్వస్వమునకు
స్వామిత వహించి మనుజుండు ప్రభవమందు
నెవఁ డపహరించె నేమయ్యె నీమె సుఖము
కలుష మెఱుఁగని దీని కొడుకుల సుఖంబు?"

'అనాథ' ఖండకావ్యం కంటె విలక్షణమైన లఘుకావ్యం. అందువలన భావ రామణీయకత్వంకంటె తత్త్వచింతనంవైపు పఠితను పయనింపజేసే స్వభావం ఇందులో స్పష్టం ఆమె బీదరికానికి కారకు లెవ్వరు? అనే సమస్య ఇందులో వస్తుధ్వని. చనిపోయి ఈ సమస్యను రేకెత్తించేది శ్రీశ్రీ 'భిక్షువర్షీయసి;' జీవచ్ఛవంలా బ్రతుకుతూ మన వ్యవస్థను నిలువునా ప్రశ్నించేది జాషువాగారి 'అనాథ.' చచ్చి వేసిన ప్రశ్నలో చింత ఎక్కువ; బ్రతికి వేసిన ప్రశ్నలో బాధ ఎక్కువ!

జాషువా కవితలో ఖండకావ్యజీవితం భావతాదాత్మ్యం! లఘుకావ్య జీవితం ప్రబోధ ప్రస్థానం! ఈ రెండూ ఆ'సుకవి' 'ప్రజల నాలుకలయందు' జీవించటానికి పాటించిన సంజీవని మంత్రాలు!

(ఆంధ్రభూమి 16-12-1994)

# జాషువా కవితామార్గం

భారతీయులందరూ ప్రథమ తాంబూలమిచ్చే దూతకావ్యం, లేదా సందేశ కావ్యం-కాళిదాసుని మేఘసందేశం తెలుగువారు సగర్వంగా చెప్పుకొనే దూత కావ్యం జాషువాగారి 'గబ్బిలము.' అంటరానితనం సమస్యను, హరిజనుల దేవాలయప్రవేశ సమస్యను, తదితర దేశ సమస్యలను సమాజానికి తట్టిచెప్పి సంస్కరణాన్ని అభిలషించిన ఆధునిక సందేశకావ్యం గబ్బిలం. జాషువాగారి కృతులన్నీ ఒక యెత్తు, గబ్బిలం కావ్యం ఒక్కటీ ఒక్కయెత్తు కవి స్వీయజీవితంలో ఎదుర్కొన్న అస్పృశ్యతా సమస్యల అవమానాల గాయాల వేదననుండి పుట్టిన విషాద గంభీర కావ్యం గబ్బిలం. ఆ కావ్యంలోని సామాజిక సమస్య ఎంత శక్తిమంతమైందో కవితాశక్తి అంత గాఢతరమైంది. కరుణరసశిల్పం జాషువా కవి కలం సాగించిన సాహిత్య జీవితం.

జాషువాకవి పఠితకు కరుణం ద్వారా వర్ణ్యవస్తువుమీద సానుభూతి కలిగించి, కెథార్సిస్‌లాంటి అనుభవాన్ని అందిస్తారు. సహానుభూతిని అందించే పద్ధతి రసమార్గానికి చెందింది. సానుభూతి ద్వారా ఒక విధమైన మానసికోద్వేగప్రక్షాళనకు తోడ్పడే పద్ధతి జాషువా ఖండకావ్యాలలోనూ, లఘుకావ్యాలలోనూ అంతర్లీనంగా తొణికిసలాడుతూ ఉంటుంది. దీనిని విషాద గంభీరభావం అనవచ్చు. జాషువాకవి ఎన్నుకొనే వస్తువు లన్నింటిలోనూ ఈ లక్షణం అంతస్సూత్రంగా సాగుతూనే ఉంటుంది. ఇది ఆధునికం. దీనిని పద్యరూపంలో వ్యక్తం చేశారు జాషువాగారు.

జాషువాకవి పద్య రచన కాల్పనిక కవుల రచనకంటె భిన్నమైనది; రాయప్రోలు ప్రబోధ కవితకు సన్నిహితమైనది. 'రాణా ప్రతాపసింహ చరిత్ర' వంటి కావ్యాలలో ఉండే స్వాతంత్ర్యోద్యమ చైతన్యాన్ని తనలో సంవదించుకొన్నది. చాటూక్తి చమత్కారాన్ని సహజమధురంగా రంగరించుకొన్నది. అంటే-జాషువాగారి కావ్యాలలోని వస్తువు కెంత ప్రత్యేకత ఉంటుందో, దానిని వ్యక్తీకరించే పద్యోక్తికి కూడా అంత ప్రత్యేకత ఉంటుందన్నమాట! ఆ రెండింటి

విశిష్ట సంయోజసంవలన విషాద గంభీర కవితలు, కావ్యాలూ తెలుగు సాహిత్యానికి లభించాయి.

గుఱ్ఱం జాషువాగారి మార్గం ఒకటి కవితాలోకంలో వెలసింది. దానిని గుర్తించటానికి పది లక్షణాలున్నాయి. అవి—

1. ఆత్మాశ్రయ కవిత్వంకంటె విలక్షణంగా ఆత్మీయమైన శైలిని కవితలో వ్యక్తీకరించటం.

2. భావోద్వేగావస్థలను కవితలో ఆవిష్కరించటానికి బదులు వర్ణ్యాంశం మీద భావశబలతతో కూడిన పారవశ్యాన్ని ప్రదర్శించటం.

3. నిబిడమైన వస్తువులేని కథాసూత్రాన్ని ఎన్నుకొని, అందులోని ఒక విషాద గంభీర భావానికి ప్రాధాన్యం కలిగించి, దానియందు పఠితకు సానుభూతితోకూడిన సమస్పందనను కల్పించేటట్లు రచనను నిర్వహించటం.

4. సామాజిక భావజాలపు తీవ్రతకంటె సాహిత్య స్పృహకు ప్రాధాన్యం ఇవ్వటం.

5. పద్యరూపానికే ప్రజాదరణ పొందే రీతిని కల్పించటం.

6. స్థాయి భావపోషణంకంటే సజాతీయ సంచారులచేత రూపొందింపబడే మానసిక స్థితులకు ఎక్కువ అవకాశం వస్తువులో కల్పించటం

7. ఏదో ఒక సిద్ధాంతానికో, రాజకీయ పక్షానికో కట్టుబడే ప్రవృత్తిని నిరసిస్తూ కవి స్వేచ్ఛగా స్వీయాభిమానం గల రంగాలలో కవిత్వాన్ని ప్రసరింపజేయటం.

8. ప్రక్రియలు ఖండకావ్యాలు కావటం సామాన్యం.

9. సన్నివేశాలను అలంబనంగా చేసుకొని కవి చెప్పదలచుకున్న తాత్పర్యాన్నీ, సందేశాన్నీ వక్రంగా కాకుండా వ్యంగ్యంగా వ్యక్తీకరించటం.

10. ఖండకావ్యం గాని, లఘుకావ్యం గాని చదివిన పఠితకు వర్ణ్యాంశాన్ని గురించిన వాస్తవాంశాలు భావనారమణీయంగా స్ఫురించి, ఒక కళాత్మకమైన అనుభవస్థితి ఏర్పడటం.

విషాద గంభీర స్వభావం ఖండకావ్యంలో రేఖామాత్రంగా భాసించి, పఠితను ఆలోచనలో ముంచుతుంది. అదే లఘుకావ్యంలో అనుస్యూతంగా కావ్యకథాసూత్రంలో ప్రతిఫలిస్తూ పఠితకు సానుభూతితో కూడిన ఉద్వేగాన్ని కలిగించి కెథార్సిస్‌ను సృష్టిస్తుంది. అదే మహాకావ్యంలో రసానుభవ సాంద్రతను కల్పించే

హృదయ సంవేదనను పరిపోషిస్తుంది. నవ్యసంప్రదాయ కవులు విషాద గంభీర స్వభావాన్ని చారిత్రక కావ్యాలలో, నాటకాలలో, మహాకావ్యాలలో పోషించి తమ ప్రత్యేకతను చాటుకోవటం ప్రసిద్ధమే. ఖండకావ్యం స్పందనను సృష్టిస్తే, లఘు కావ్యం విషాదగంభీర మానసిక సంవేదనను అనుభవానికి అందిస్తుంది. 'ఫిరదౌసి' 'గబ్బిలము' కావ్యాలు చదివి తెలుగువారు ఇటువంటి వినూత్నానుభవాన్ని పొందారు. ఆ అనుభవాన్ని కలిగించిన జాషువాకవి కవితను కీర్తించారు.

అధునికాంధ్ర సాహిత్యంలో అస్పృశ్యతను గురించి అత్యంత శక్తిమంత మైన కవిత్వాన్ని సృష్టించిన పద్యకవి జాషువా. హిందూ సమాజంలో చాతుర్వర్ణ్య వ్యవస్థలో హరిజనుడు పొందిన తిరస్కృతిని తీవ్రంగానే కాకుండా సూక్తి మయంగా పేర్కొన్న గౌరవం జాషువా కవికే దక్కింది. అస్పృశ్యతా దురా చార నిరసనానికి జాషువాగారు అధిక్షేపోక్తులను ఎన్నుకొన్నారు. అభివ్యక్తికి అనువైన కవితా వస్తువు కుదిరినప్పుడు ప్రజల నాల్కలమీద జీవించే సూక్తులు జనిస్తాయి. ఈ క్రింది పద్యపాదాలు అందుకు సాక్షులు-

"కసరి బుసకొట్టు నాతని గాలిసోక
నాల్గుపడగల హైందవ నాగరాజు" (గబ్బిలము)

"ప్రాక్తనం బైన ధర్మదేవతకుఁ గూడ
ఉలికిపడు జబ్బుగలదు వీడున్నచోట" (గబ్బిలము)

"వాని నైవేద్యమున నంటువడిననాడు
మూడు మూర్తులకును గూడఁ గూడు లేదు." (గబ్బిలము)

కవితలో ఉక్తి అధిక్షేపానికి తోడ్పడినట్లుగానే వస్తువులో కల్పన దోహద కారి అవుతుంది. గబ్బిలం అధిక్షేపాత్మక వ్యంగ్య పాత్ర కల్పనకు అగ్ర తాంబూలం అందుకుంటుంది. అస్పృశ్యత కవి స్వీయకథా వస్తువు. దానిని సాధార ణీకరణం చేయటానికి గబ్బిలంలోని నాయకుడు అవతరించాడు. అప్పుడు కవి యొక్క అంతరంగ కథ ఒక సాధారణీకృతమైన సమస్య అయింది. నాయకుడు దూతతో శివునికి సందేశం పంపాడు. దూత జంతువూ పక్షీ కాని వింత పాత్ర. అస్పృశ్యుని నుండి ఆదిశంకరుని దాకా నిరాఘాటంగా వర్తించగలిగిన జీవి. అస్పృశ్యుని శ్రమకు, శ్రమ ఫలానికి ఇటువంటి స్థితి ఉంది. భౌతికంగా స్పృశించ టానికి అర్హతలేని హరిజనుడు పండించిన పంట పరమేశ్వరునికి నైవేద్యంగా అందుతుంది. ఈ సంబంధంలోని అంతరార్థాన్ని గమనిస్తే అస్పృశ్యత అంతరించి పోతుంది. ఈ ఉపదేశాన్ని ఉన్మీలింపజేసే ప్రతీక గబ్బిలం. ఇంతటి ప్రతీకాత్మక ప్రవృత్తి మేఘానికి గాని, హంసకు గాని, రాచిలుకకు గాని, శశిబింబానికి గాని దూత కావ్యాలలో గోచరించటం లేదు.

ప్రజాదరణం పొందిన మరొక కావ్యం పిరదౌసి. ఇది విషాదాంతం. మాట తప్పిన గజనీ మహమ్మదుకు ఆత్మాభిమానం బంగారం కంటె గొప్పదని చెప్పిన మహాకవి కథ ఇది ఆత్మాభిమానంలో పిరదౌసి జాషువా కవిని తలపింప జేస్తారని కవితో పరిచయమున్నవారు భావించారు. సాహిత్య మూర్తులను గౌర వించటంలో ప్రభుత్వాలు ప్రదర్శించే కపట నీతిని కవి వ్యంగ్యంగా అధిక్షేపిం చారు పిరదౌసిలో. విషాదాంత కావ్యంలో విషాద వాతావరణాన్ని విశేషంగా పోషించి విషాద గంభీర కావ్యంగా కూడా దానిని జాషువాగారు దిద్దితీర్చారు. ఆ కావ్యంలోని అనుభవ శిల్పమదే.

జాషువాగారి కవిత్వం స్వీయానుభవం నుండి, ఆత్మవేదన నుండి జనిం చింది పేదరికాన్ని గురించి వారు వ్రాసినంత గొప్ప కవిత్వం పద్య రచనలో చేసినవారు తక్కువ. కావ్యాలలో పురాణ పురుషుల శృంగార వృత్తాంతాలు మాని క్షుధార్త జీవుల వ్యధార్త గాథలను వర్ణించాలని ఎలుగెత్తి చెప్పారు. వస్తువులో మార్పును, కవితావైఖరిలో మార్పును పద్యపరిధిలోనే రావాలని కోరిన అభ్యుదయశీలి జాషువా కవి.

"సీతారాముల పెండ్లి పేరటములున్, శ్రీకృష్ణరాధారతుల్
త్రేతా ద్వాపర యజ్ఞకర్మలు వినా లేవో కథా వస్తువుల్?
చేతన్ గంటము బట్టు నెట్టి కవియున్ జింతింప డేనాడు నీ
భ్రాతృక్లేశము లీక్షుధార్త భరతాంబా దీర్ఘదారిద్ర్యమున్."

పేదవర్గాల పీడిత చరిత్రలో అస్పృశ్యుల అనంతవేదనను అనువైన పద్య కవితా ప్రక్రియలతో ప్రజల హృదయాలలో ప్రతిధ్వనింపజేసిన మహాకవి జాషువా. సమస్యలను కవిత్వంలో ప్రపంచిస్తున్నప్పుడు జాషువా వాణి రగులుతున్న అగ్నిపర్వతంలా పొగలు గక్కుతున్నా మధురంగా ఉంటుంది. అస్పృశ్యుల సమస్యలకు కారణమైన సామాజిక వ్యవస్థను చూచి ఆగ్రహించటం ఎలాగో ప్రదర్శించింది జాషువాగారి కవిత సమస్యలు తీరితే సామాజిక వ్యవస్థ ఎంత ఆదర్శవంతంగా ఉంటుందో దర్శించింది కూడా జాషువాగారి కవిత. ఆగ్రహం ఆదర్శాన్ని సాధించటంలో అనుసరించవలసిన మార్గాన్ని గురించి జాషువాగారికి జాతిపిత చూపించిన అభిప్రాయాలే ఉన్నాయి. అహింసయే ఆయన ప్రస్థానం. అందులో వినవచ్చే ఆయన ఆదర్శనినాదాలు—

"ఇడినమాట తప్పను, మహాత్ముని చెప్పుల జాడలోన కా
లాడ చరించెదన్, ప్రజల కన్నము బెట్టెద, వర్ణభేదపుం
జీడ నణంచెదన్, గటికచీకటి వాపెద, వెట్టి నమ్మకా
లాడని బాడ హస్తమున నూనెద శాతకఠాకుఠారమున్." *

(ఆంధ్రభూమి 23-12-1994)

# 'అమరజీవి' అమరగాథ 'ఆంధ్ర మహాభ్యుదయము'

నవంబరు ఒకటి ఆంధ్రప్రదేశ్ అవతరణోత్సవం. ఆ మాట తలచుకో గానే ఆంధ్రరాష్ట్రం, దానికోసం ఆత్మ బలిదానం చేసిన అమరజీవి పొట్టి శ్రీరాములు వెంటనే తెలుగువారికి జ్ఞాపకం వస్తారు. ఆ స్మృతికి చిహ్నంగా హైదరాబాదులో సచివాలయం ముందు తెలుగుతల్లి విగ్రహానికి ఎదురుగా పొట్టి శ్రీరాములు విగ్రహాన్ని ప్రతిష్ఠించాం. రాష్ట్రావతరణ దినోత్సవాలను తెలుగు తల్లితోపాటు అమరజీవిని కూడా పుష్పమాలలతో అలంకరించి ఆరంభించుకొనే సత్సంప్రదాయాన్ని ఏర్పరచుకొన్నాం.

పొట్టి శ్రీరాములు మనపాలిటి మరొక మహాత్ముడని ప్రశంసించాడు బండ్ల సుబ్రహ్మణ్య కవి—

"రాజ్య సంరక్షణమునకొ రాజు కొఱకొ
వైరి రక్తము పిండినవారు కలరు
పరుల కే కీడు సలుపక ప్రజలకొఱకె
ఆత్మబలిదాన మిడిన మహాత్ము డితడు."

ఈ పద్యం 'ఆంధ్ర మహాభ్యుదయము'లోనిది. అమరజీవి అమరగాథను చిత్రించిన ఆ ఆంధ్ర కావ్యాన్ని ప్రకాశం జిల్లాలోని వేటపాలెంలో నివసించిన బండ్ల సుబ్రహ్మణ్య కవి రచించాడు. ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భంలో (1956) ప్రచురించాడు.

తెలుగులో పద్య కావ్యాలుగా జాతీయ నాయకుల చరిత్రలు వెలువడినట్లు ఆంధ్ర నాయకుల చరిత్రలు రాలేదు. అల్లూరి సీతారామరాజు చరిత్ర గేయ రూపక ప్రక్రియలలోనూ, బుర్రకథల వంటి జానపద కళారూపాల్లోనూ ప్రసిద్ధం. టంగుటూరి ప్రకాశం పంతులు మొదలైన వారి జీవిత చరిత్రలు, స్వీయ చరిత్రలు వచన రచనలుగానే వచ్చాయి. కాని, అమరజీవి జీవిత చరిత్రను ఉత్తమ కావ్యంగా రూపొందించిన గౌరవం బండ్ల సుబ్రహ్మణ్య కవికే దక్కింది.

ఆంధ్ర మహోభ్యుదయ కావ్యాన్ని ఒక త్యాగవీరుని జీవిత చరిత్రగానే కాక రాష్ట్రోద్యమ చరిత్రగా కూడా మలచాడు కవి. పొట్టి శ్రీరాములుగారి త్యాగవీరానికి తగిన ఉత్సాహశక్తిని, ఆత్మశక్తిని గాంధీ మహాత్ముని సత్యాగ్రహోద్యమం, స్వాతంత్ర్య సమరం అందించాయి. ఆంధ్రరాష్ట్ర మొక్కటే కాదు ఆంధ్రులు కోరింది - విశాలాంధ్ర వారి లక్ష్యం. పొట్టి శ్రీరాములు కథ వ్యక్తి కథగా మొదలైనా దేశ రాష్ట్ర కథలలో లీనమై ఆంధ్ర ప్రదేశ రాష్ట్రావతరణంతో ఒక ఫలాన్ని, గమ్యాన్ని సాధించిన విధంగా సాగింది. అమరజీవి ఆకాంక్ష ఆంధ్రుల అభిలాషగా అభేదాన్ని పొంది ఉద్యమరూపం తాల్చినట్లు ఉద్యమ కావ్యరూపంలో కవి చిత్రింపదలచాడు. అందువల్లనే 'ఆంధ్ర మహోభ్యుదయ' మనే పేరు కావ్యానికి సార్థకమైంది.

నవ్యసంప్రదాయోద్యమంలో భాగంగా వెలువడిన విశిష్ట చారిత్రిక కావ్యం 'ఆంధ్ర మహోభ్యుదయము.' శివభారతం, రాణా ప్రతాపసింహ చరిత్ర మొదలైన చారిత్రిక కావ్యాల వరుసలో నిలువదగిన ఈ కావ్యానికి వాటి సామాన్య లక్షణాలతోపాటు దాని ప్రత్యేక లక్షణాలు కూడా ఉన్నాయి. ఆ కావ్య నాయకుల్లాగానే ఈ కావ్య నాయకుడూ ఉదాత్తుడు, ధీరుడు, వీరుడు. "ఆ అమరజీవి జీవితంబునఁ జూపిన స్వాతంత్ర్య సమర సన్నాహయుక్తి, గురుభక్తి, ప్రజానురక్తి, స్వార్థవిరక్తి, ఆత్మశక్తి అనన్య సామాన్య"మైనవని గుర్తించి కవి వాటిని కావ్యంలో కూలంకషంగా పోషించాడు. ఈ చారిత్రిక కావ్యంలోని నాయకుడు కవి ప్రత్యక్షంగా చూచినవాడు. సమకాలిక నాయకుని చరిత్రను కావ్యంగా నిర్మించి చారిత్రిక కావ్యానికే నవ్య భవ్య స్వభావాన్ని సంతరించిపెట్టాడు సుబ్రహ్మణ్య కవి.

ఈ కావ్యం రెండు భాగాలుగా రాయబడింది. మొదటిభాగంలో నాలుగు ప్రకరణాలున్నాయి. పొట్టి శ్రీరాముల వివాహంవరకు ఈ భాగంలో కథ సాగింది కొన్నేళ్ళ విరామం తరువాత కవి దైవ ప్రార్థనాదులతో ద్వితీయ భాగాన్ని ఆరంభించి రచించాడు. నాయకుని జీవితంలోని భాగంగా బాపూజీ సాగించిన భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర దాదాపు ఏడు ప్రకరణాలలో పెన వేసుకొని పోయింది. అందులోనే సందర్భ శుద్ధిగా అల్లూరి సీతారామరాజు ఉద్యమ గాథ ఉపాఖ్యాన గౌరవంతో నిబంధింపబడింది. స్వాతంత్ర్యానంతర వృత్తాంతం అయిదు ప్రకరణాలు సాగింది. ఆంధ్రప్రదేశ్ అవతరణం కావ్య

ఫలం. దేశ విముక్తికి, రాష్ట్రసిద్ధికి, సమగ్రాంధ్రప్రదేశసిద్ధికి, ఒక వ్యక్తి- సత్యాగ్రహ శక్తిగా, త్యాగమూర్తిగా, పరోక్ష స్ఫూర్తిగా ఎలా తోడ్పడతాడో 'అమరజీవి' కథా నిర్వహణంతో నిరూపించి చూపించిన ఉజ్జ్వలేతివృత్తం గల చారిత్రిక కావ్యమిది

ఈ కావ్యంలో ప్రధాన రసం స్వాతంత్ర్య వీరం. పూర్వ లాక్షణికులు వీర రసంలో ఇరవై యొక్క భేదాలు చెప్పారు. నేను నా 'వీర రసము' గ్రంథంలో మరో మూడు రకాల వీర రస భేదాలను ప్రతిపాదించాను. అవి 1. స్వాతంత్ర్య వీరం, 2 మానవీరం, 3. యశోవీరం. నవ్య సంప్రదాయ చారిత్రిక కావ్యాలలో ప్రతిఫలించే స్వాతంత్ర్యోత్సాహాన్ని విశ్లేషించి పై మూడు భేదాలనూ సంభావించాను. శివభారతం, రాణా ప్రతాపసింహ చరిత్ర, వందేమాతరం, మొదలైన కావ్యాలలో వాటిని అనుశీలించాను. ఇప్పుడు స్వాతంత్ర్య వీర రసానికి సమగ్రావతారంగా భావింపదగిన కావ్యం 'ఆంధ్ర మహాభ్యుదయ'మని తెలుసుకోవటానికి ఎంతో ఆనందపడుతున్నాను.

ఈ కావ్యంలో త్రిమూర్తుల్లాగా ముగ్గురు స్వాతంత్ర్య యోధులున్నారు. 1. గాంధీజీ, 2. అల్లూరి సీతారామరాజు, 3. పొట్టి శ్రీరాములు. ఈ ముగ్గురూ వ్యక్తులే కారు- జాతి సంకల్ప చైతన్య క్రియాశక్తులకు ప్రతినిధులు, ప్రతీకలు. ఉద్యమ దృష్టితో చూస్తే సత్యాగ్రహోద్యమ నాయకుడు గాంధీజీ. సాయుధ సంగ్రామ మార్గానికి నాయకుడు అల్లూరి. వారిద్దరూ అసువు లర్పించిన అమర వీరులే. కాని, మరెవరిచేతనో హత్య చేయబడినవారు. పొట్టి శ్రీరాములు కూడా సత్యాగ్రహోద్యమంలో సాగినవాడే. కాని, ఆతడు ప్రాణా లర్పించిన తీరే వేరు. దానిని కవి ఇలా వ్యాఖ్యానించాడు —

"ఎవడో చంపిన చచ్చెఁ గాని తను తానే చంపుకోలేదు మా
నవసేవానిధి గాంధి - నీవా వ్రతచింతన్ దానవీరుండవై
యెవ రేరీతిని బోధ చేసినను గానీ ప్రాణ మర్పించుచే
సవనాంతంబని పట్టుపట్టితివి నీ సత్యాగ్రహం బెట్టిదో!"

'పొట్టి శ్రీరాములు గాంధీజీ కంటె గొప్పవాడా? అల్లూరి కంటె అధికుడా?' అని అడిగితే అవునని చెప్పలేం గాని, ఈ కావ్యంలో ఆయన నాయకుడు. ఆంధ్ర రాష్ట్రం కోసం నిండు ప్రాణాలను అర్పించిన త్యాగవీరునిగా అగ్రతాంబూలాన్ని కావ్యకథలో అందుకుంటాడు. భారతంలో శ్రీకృష్ణభీష్మాదులున్నా ధర్మరాజే ఎలా నాయకుడౌతాడో ఈ కావ్యంలో గాంధీజీ, అల్లూరి ఉన్నా శ్రీరాములే నాయకుడు. ఈ కావ్యనిర్మాణ శిల్పం నాయక రస పోషణ శిల్పాలకు అనుకూలంగా ఉంది. అంగిరసం శ్రీరాముల నాశ్రయించి సాగుతుంది. అతడే క్రమంగా తన ఉత్సాహాన్ని జాతిపరంగా ఉద్దీపింపజేస్తాడు. గాంధీజీ పొట్టి శ్రీరాముల గురువు. గురువుగారి సత్యాగ్రహం దేశానికి స్వాతంత్ర్యం తెచ్చింది. గురువు వద్ద నేర్చుకున్న సత్యాగ్రహవిద్య శ్రీరాములులో ఆంధ్రరాష్ట్ర సిద్ధికి తోడ్పడింది. గాంధీజీ చైతన్యం శ్రీరాముల చైతన్యానికి ప్రేరకం, పోషకం. అందువలన పొట్టి శ్రీరాముల కథలోని రసమే ఈ కావ్యంలో ప్రధానం ఈ కావ్య కథలో అసలు నాయకుడు పొట్టి శ్రీరాములు. గాంధీజీ పతాకనాయక స్థానం నిర్వహిస్తారు. అల్లూరి సీతారామరాజు ప్రకరినాయకుడుగా ప్రకాశిస్తాడు.

మరొక విశేష మేమంటే-ఆంధ్ర రాష్ట్ర నాయకులు కూడా ఈ కావ్యంలో ఉన్నారు భారతదేశ నాయకులూ ఉన్నారు. ముఖ్యంగా అప్పటి భారత ప్రధాని పండిత నెహ్రూ కూడా ఉన్నారు. వీరందరూ చరిత్రలో పాత్రలు. కావ్యంలోనూ పాత్రలే. కాని, కావ్యనాయకత్వం మాత్రం పొట్టి శ్రీరాములదే. వారందరూ 'అమరజీవి' ఉద్యమ చైతన్యంలో పాలు పంచుకొన్నవారే. ఆయన త్యాగఫలాన్ని పంచుకున్నవారే. దేశంలో వారందరూ ఎంతెంతటి నాయకులైనా కావ్యంలో మాత్రం లెక్కకు అందరూ అనునాయకులే. దేశపరంగా, రాష్ట్రపరంగా స్వాతంత్ర్యవీరం పోషించి, నాయకపరంగా రసపరంగా ఒక సమగ్రతను సాధించిన నవ్యసంప్రదాయ చారిత్రిక మహాకావ్యం 'ఆంధ్ర మహాభ్యుదయం.'

'అమరజీవి'తో పాటు, ఆయన జీవిత చరిత్రను కావ్యంగా రాసిన కి.శే. బండ్ల సుబ్రహ్మణ్యకవిని గూడ ఆంధ్రులు స్మరించుకోవటం న్యాయం. ప్రతి యేటా ఆ కవి జయంతి వేటపాలెంలో జరుపుకుంటారు వారి అభిమానులు. తెలుగు విశ్వవిద్యాలయం లాంటి సంస్థలకి ఆ కవి సాహిత్యాన్ని వివిధ కార్యక్రమాల ద్వారా మరింత వెలుగులోకి తీసికొనిరావటం కనీస కర్తవ్యం. *

(ఆంధ్రభూమి 29-10-1993)

# రాజమహేంద్రవర సాహిత్యసౌరభం

మొన్న మార్చి 5 వ తేదీ రాజమహేంద్రవరం వెళ్ళాను. 'వేదంలా ప్రవహిస్తున్న' గోదావరికి ముందుగా నమస్కరించాను. ఆ వేదమే కొన్నాళ్ళకు ఆంధ్ర పంచమవేదంలా పరవళ్ళు తొక్కటం విన్నాం ఆనాడు మాత్రం ఆంధ్ర పురాణంలా జాలువారుతోంది, తరతరాల ఆంధ్ర చరిత్రకు, సాహిత్యానికి సజీవ సాక్షిగా సాక్షాత్కరిస్తోంది మహాకావ్య శైలిలాగా. దానికి కారణం లేకపోలేదు. ఆ తల్లి ముద్దుబిడ్డలలో ఒకరు, ఆధునిక నన్నయగా ఆంధ్రులచేత ఆరాధింప బడుతున్నవారు, ఆంధ్ర కల్హణులుగా ఆప్యాయంగా పిలవబడుతున్నవారు మహాకవి మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి పుట్టినరోజు అది. రాజ మహేంద్రవర సాహితీ కుటుంబమంతా కలిసి ఆనాడు మధునాపంతులవారి జయంత్యుత్సవం భక్తి ప్రపత్తులతో నిర్వహించుకుంటోంది. మధునాపంతులవారు నన్ను వారి కుటుంబసభ్యులలో ఒకనిగా, పుత్రవాత్సల్యంతో ప్రేమించేవారు. అందువలన ఆ సాహితీ కుటుంబ సభ్యులు నాకు కూడా ఆ పర్వదినంలో పాలు పంచుకొనే భాగ్యం కలిగించారు. మధునాపంతుల స్మారకోపన్యాసం 'ఆంధ్ర పురాణం' మీద నాచేత ఇప్పించారు.

మధునాపంతులవారు జీవించి ఉన్నప్పుడు ఆంధ్రపురాణ రజతోత్సవాలలో పాల్గొని వారి సమ్ముఖంలో ఆ చారిత్రిక మహాకావ్య గౌరవాన్ని గురించి ముచ్చ టించాను. వారి అవ్యాజవాత్సల్యాన్ని పొందగలిగాను. మొన్న వెళ్ళినప్పుడు భౌతికంగా వారు లేరు. కాని, ఆ లోటు నా కనిపించకుండా, జీవకళ ఉట్టిపడే నిలువెత్తు తైలవర్ణ చిత్రంలా మధునాపంతులవారు ప్రత్యక్షమయ్యారు. రాజమహేంద్రవరంలోని సాహితీప్రియులందరూ ఆ మహాకవి తైలవర్ణచిత్రాన్ని రూపొందించుకొని వారిని మరచిపోలేని ఆప్యాయతను ప్రకటించుకున్నారు. ఆంధ్రకేసరి యువజన సమితివారిచే నిర్వహింపబడే ఆంధ్రకేసరి శతాబ్ది జూనియర్ కళాశాలలో మధునాపంతులవారి నిలువెత్తు చిత్రపటం నిలిపారు. దాన్ని ఆవిష్కరించే అదృష్టాన్ని కూడా పెద్దలు నాకు కల్పించారు. ఆ చిత్ర పటాన్ని చూస్తుంటే శాస్త్రిగారు ప్రశాంతంగా మౌనంగా మనమధ్య నించున్నట్లు

అనుభవం కలుగుతుంది. ఆ చిత్రరూపకల్పనం వెనుక పెద్దలు శ్రీ యాతగిరి శ్రీరామ నరసింహారావు మొదలైనవారున్నారని విని చాల సంతోషించాను. మహాకవి శిలావిగ్రహాలలో కాదు-ప్రజల మనసుల్లో నాలుకలయందు జీవిస్తాడనే మహాకవి జాషువా గారి సూక్తి నాకు జ్ఞాపకం వచ్చింది.

ఆ రోజంతా రాజమహేంద్రవర సాహితీజీవితంలో మధునాపంతులవారే ప్రత్యక్షమౌతూ వచ్చారు. ఆధునికాంధ్ర సాహిత్య చైతన్యానికి మూలపురుషుడు కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఒక ఉద్యమవీరుడుగా జీవితాన్ని నడిపి, సంస్కరణోద్యమ చైతన్యానికి రాజమహేంద్రవరాన్ని రాజధానిగా చేసిన మహాత్ముడు. ఆయన నివసించిన గృహాన్ని ప్రభుత్వ పురావస్తుశాఖవారు చేపట్టి వారి జ్ఞాపక చిహ్నంగా దానిని రక్షిస్తున్నారు. ఆయన రచనలన్నీ అందులో భద్రపరుస్తున్నారు. వీరేశలింగం పంతులుగారు ఉపయోగించిన ప్రింటింగ్ మిషన్ను కూడా సేకరించి పెట్టారు. దానిని ఉచితంగా ఆ కేంద్రానికి విరాళంగా ఇచ్చిన మిత్రులు 'సమాచారం' సుబ్రహ్మణ్యం గారిని ఆంధ్రులు హృదయపూర్వకంగా అభినందించాలి. తాము స్వయంగా పత్రిక నడుపుకుంటూ ముద్రణ యంత్రం అవసరమున్నా దాన్ని జాతి చిహ్నంగా అంకితం చేసిన సుబ్రహ్మణ్యం గారి ఔదార్యం ప్రశంసనీయం గోదావరి గడ్డమీద పుట్టిన తెలుగు బిడ్డలకు సంప్రదాయమున్నా, తమ ప్రాంతంలో పుట్టి రచనలు చేసిన కవులన్నా ఎంతటి అమృతమైన అభిమానమో, దానికోసం ఎంతటి త్యాగాలకైనా ఎలా పూనుకుంటారో కథలు కథలుగా వింటూంటే ఆ రోజల్లా నా మేను పులకించిపోయింది. సత్కవి కావ్యం రాస్తే చాలదు. సహృదయ జగత్తును సృష్టించాలి. ఆ పని వీరేశలింగం పంతులుగారు చేశారు. ఆధునికులలో మధునాపంతులవారు చేశారు. వారిద్దరినీ అభిమానంతో అక్కడ గౌరవిస్తున్నారు.

రాజమహేంద్రవరం సాహితీ రసికులు వొట్టిమాటలవారుకారు; గట్టి చేతలవారు. సంఘర్షణశీలురు కారు, సమన్వయ వాదులు; గతాన్ని వర్తమానంలో గౌరవించేవారు కాని వర్తమానం కోసం గతాన్ని ఖండించేవారు కారు. అందువల్లనే వీరేశలింగం పంతులుగారి నివాసగృహంలో ఒక గదిలో మధునాపంతులవారి స్మారక కేంద్రం నిలిపారు. ఆ గదిలో ఆ మహాకవి రచనలు, వ్రాతప్రతులు, లేఖలు, వారు వాడిన ఉపకరణాలు మొదలైన వాటిని సేకరించి భద్రపరిచే యత్నం సాగించారు. సంస్కరణవాది వీరేశలింగం గారి పక్కనే సంప్రదాయవాది

మధునాపంతులవారిని భద్రపరచుకొనే సమన్వయవాదులు అక్కడి సాహితీ మూర్తులు. వారు కాలం చిత్రించిన కళాకారులు. వారి సాహితీమూర్తులను సమదృష్టితో చూడటం అక్కడి రసికుల అపూర్వ సాంస్కృతిక చైతన్యం; అక్కడి గాలిలోని సాహితీ సౌరభం!

వారు నాకు మరొక మహదవకాశాన్ని కల్పించారు. మధునాపంతుల వారి రచనలు, వస్తువులు భద్రపరిచే ఆ పురావస్తు మందిరశాఖను నాచేత ఆనాడు ఆవిష్కరింపజేశారు. నాపట్ల రాజమండ్రి సాహితీలోకం చూపిన అవ్యాజ వాత్సల్యానికి అదొక తార్కాణ. నా జీవితంలో మరువలేని మహనీయ క్షణం!

గోదావరి తెలుగువారి సామాజిక, సాహిత్య జీవితాలను తరతరాలుగా ఉత్తేజపరుస్తున్న జీవనచైతన్యం. నన్నయ కాలంనుండి ప్రతి శతాబ్దానికీ ఒక మహాకవిని తెలుగు సాహిత్యానికి అందించిన మహానది గోదావరి. పందొమ్మిది, ఇరవయ్యో శతాబ్దాల పంటలు కందుకూరి. మధునాపంతుల. గోదావరి మండల కవులు వారి వారి శైలులకు ప్రత్యేక ప్రసిద్ధిని సాధించినవారు, స్వతంత్ర ప్రక్రియలకు పేరుమోసినవారు. ఆ సంప్రదాయాన్ని నేటికీ కవులు సాగిస్తున్నారనటానికి ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, శ్రీ కొత్తపల్లి సత్య శ్రీమన్నారాయణ వంటి ఈతరం కవులే ఉదాహరణం. దక్షిణ గంగ దాక్షిణ్యానికి పెట్టింది పేరు ఆ పుణ్యతీర్థ ప్రవృత్తిని వీరేశలింగ స్మారక కేంద్రంలో మధునా పంతులవారి మధురస్మృతి రమణీయంగా వ్యాఖ్యానిస్తోంది.

రాజమహేంద్రవర నగరంలో తిరుగుతూంటే వీరేశలింగంపంతులు గారి ఉద్యమ చైతన్యం మన మనస్సును వాఙ్మయ వీచికలతో ఉత్తేజపరుస్తూ ఉంటుంది. వీరుడుగా పంతులుగారు చేసిన సంస్కరణోద్యమ సమరాలు చిరువెచ్చగా మనకు ఇప్పటికీ చెమటలు పట్టిస్తాయి. భారతీయ సాహిత్యంలో విషాద గంభీర నాటకంగా విఖ్యాతి గాంచిన కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలాన్ని వీరేశలింగం పంతులు గారు అనువాదంచేసి, ఆంధ్ర నాటక పరిణామ దశలలో ఆంగ్ల నాటకానువాదాల తరువాత మరొక చైతన్యాన్ని సృష్టించారు. ఆ ప్రతిభాచైతన్యం మనల్ని ప్రసన్నులను చేస్తుంది. కణ్వమహర్షి శకుంతలను అత్తవారింటికి పంపుతూ కార్చిన కన్నీరులో తెలుగుదనాన్ని గుబాళింపజేసిన కందుకూరివారి కవితాశిల్పం రాజమండ్రి పురవీధుల్లో ఇంకా స్మృతి పథాల్లో పల్లవిస్తూనే ఉంది. సంస్కరణోద్యమ శంఖారావంగా ప్రహసనాన్ని ప్రవర్తించి ప్రయోగించిన కందుకూరి

వారి తీక్ష్ణతేజం రాజమండ్రి టౌన్‌హాల్ చుట్టూ పరివేషంలా పరిభ్రమిస్తూనే ఉంది. మనసునూ, మెదడునూ సాహితీ ప్రక్రియలకు పంచి యిచ్చిన పంతులుగారు కృషి చేసిన వాఙ్మయక్షేత్రం ఆ గోదావరి తీరం. పంతులుగారు పండించిన సీమ వంగడాల తెలుగుపంటలు ఆంధ్రభారతికి అపూర్వ రుచులను అందించిన కాలం రాజమహేంద్రవరంలో ఇప్పటికి పైరగాలిగా వీస్తూంటుంది. సాహితీపరువి అంతర్వీధిలో అనుభూతి పరంపర నందించే రాజమహేంద్ర వరంలో వీరేశలింగం గారి రచనలన్నీ భద్రపరచిన సాహిత్యమందిరం టౌన్‌హాల్‌లో ఉంది. ఒక యుగ పురుషుని వాఙ్మయ విశ్వరూపాన్ని దర్శించిన అనుభవాన్ని పొందుతాం ఆ గ్రంథాలయంలో. నేను ఆ సరస్వతీపీఠాన్ని దర్శించి శ్రద్ధాంజలి నందించాను.

మాన్యులు శ్రీ యాతగిరి శ్రీరామ నరసింహారావు గారూ, శ్రీ పోతుల వీరభద్రరావుగారు మొదలైన పెద్దలు రాజమండ్రి టౌన్‌హాలులో కందుకూరి వారి సాహితీ ప్రక్రియల మీద మాట్లాడుమని నాకొక అపూర్వమైన అవకాశాన్నిచ్చారు. ప్రతి సాహిత్య వికాసానికీ కొన్ని మౌలికమైన ప్రక్రియా రూపాలు ప్రాతిపదిక లుగా ఉంటాయనీ, భారతీయ ప్రక్రియలు సృజనాత్మక శక్తిని కోల్పోయిన కాలంలో, వాటి స్థానంలో పాశ్చాత్య మూల ప్రక్రియలను తెచ్చి తెలుగునేలకు, గాలికి, రుచికి, శైలికి అనువుగా దేశీయం చేసి, మరొక యుగానికి శ్రీకారం చుట్టిన కందుకూరిని గురించి కొంతసేపు మాట్లాడి, ఆ సాహితీమూర్తికి నీరాజ నాల నందించాను. గద్యానికి గతి కల్పించిన కందుకూరినీ, పద్యానికి పరువం నేర్పిన మధునాపంతులనూ రెండు కన్నులుగా చేసుకొని చూస్తున్న రాజమహేంద్ర వర సాహితీలోకం సహృదయజగత్తుకు సజీవోదాహరణంలా నాకనిపించింది. *

(ఆంధ్రభూమి 11-3-1994)

# ఒక్కడు మధునాపంతుల

స్వాతంత్ర్య వీర కావ్యబ్రహ్మ 'దుర్భాక'
అపర తిక్కన 'గడియారము' కవి
ధవళాంధ్ర కీర్తిపతాక 'రాయప్రోలు'
విజయాంధ్ర హృద్గీతి 'విశ్వనాథ'
రాష్ట్రగానవిపంచి రాగాత్మ 'తుమ్మల'
పూదేనె తొలకరి 'పుట్టపర్తి'
ఉద్యమస్ఫూర్తికి ఊపిరి 'ముదిగొండ'
భక్తిరక్తికి బాట 'వానమామ(ల)'
ఒకడు మధునపంతుల; యిల నొక్కజాతి
వైభవము నెంచి కవితల శోభ పెంచు
కవులు నవరత్న సదృశులు కలరు మనకు
తెలుగు చారిత్రిక కృతులు వెలుగు నింద

అని గొంతెత్తి పాడా నొకప్పుడు. ఈ పద్యానికి ప్రేరణ విశ్వనాథవారు కల్ప వృక్షావతారికలో రచించిన ప్రాచీన కవిస్తుతి - 'ఋషివంటి నన్నయ రెండవ వాల్మీకి' అనే సీసపద్యం. విశ్వనాథవారు తమకు గురుస్థానాలుగా చెప్పుకున్న తొమ్మిది మంది మహాకవుల సాహితీ వ్యక్తిత్వాలను సూక్తిసుధామధురంగా చెప్పిన గొప్ప తెలుగు పద్యం అది. నేను నవ్యసంప్రదాయోద్యమ చైతన్యాన్ని ముందుకు నడిపించిన చారిత్రిక కావ్యకర్తలను స్మరించుకున్నప్పుడు అలవోకగా ఈ సీసపద్యం ఆశువుగా అవతరించింది. మధునాపంతుల స్మారకోపన్యాసం మనసులో మెదలంగానే ఈ పద్యం కూడా తళుక్కున మెరిసింది. కాని, పండిత సభల్లో నా పద్యాలను నేను సాధారణంగా పాడను. ఎందుకంటే, నాలోని కవిని, నటుణ్ణి, కళాకారుణ్ణి కొన్నాళ్ళు కావాలని నిద్రపుచ్చి; విమర్శకుణ్ణి, పరిశోధకుణ్ణి మాత్రమే మేల్కొల్పి ప్రోత్సహించాను కవిత్వానికి కళ్లెం వదిలితే విమర్శ వెనుకబడిపోతుందేమోనన్న భయం దాని కొక కారణం. ఏమైనా, ఆంధ్ర చారిత్రిక కావ్య నిర్మాతలలో మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు సాటి

లేని ఒక మేటి గద్దెను సాధించారనీ, ఆయనవి ఒక్కరిదీ ఒక బాట అనీ నేను భావిస్తుండేవాణ్ణి. దానికి అనుగుణంగా విశ్వనాథవారు 'ఒకడు వాచన సోమన్న' అన్న స్థానంలోనే 'ఒకడు మధునపంతుల' అని ఎత్తుగీతిలో ఎత్తుకున్నాను. ప్రాచీనాంధ్ర కవులలో నాచన సోమనలాగా నవ్యసంప్రదాయ యుగ చారిత్రిక కావ్యకవులలో మధునాపంతులవారు 'ఒకడు'. అంటే - అతనికి అతడే సాటి; ప్రత్యేకమార్గ ప్రవర్తకుడు; అందరితో కలిసి నడుస్తున్నా విలక్షణంగా వెలుగొందేవాడు. చివరకు అతని బాటలో మిదిలేదీ అత డొకడే! 'ఒకడు'కు తెలుగులో ఇన్ని అర్థాలు వస్తాయి.

నవ్యసంప్రదాయ కావ్య ప్రయోగాల వెనుక భారత స్వాతంత్ర్య ఉద్యమ చైతన్యం ప్రధాన ప్రేరక శక్తిగా పనిచేస్తూ ఉండేది. దేశవ్యాప్తంగా ఉద్యమ నాయకు లిచ్చే పిలుపుల నుండి, సందేశాల నుండి, కార్యాచరణ శీల సూత్రాల నుండి కవుల హృదయాలలో క్రొత్త కొత్త ఊహలు, ప్రక్రియలు, వస్తువులు, రచనారీతులు వెలువడుతుండేవి. "ఒకదేశం రాజకీయంగా స్వాతంత్ర్యం కోల్పోయినా పరవాలేదు కాని, ఆ దేశ ప్రజలు తమ గత చరిత్ర గొప్పది అనే ఆత్మప్రత్యయాన్ని మాత్రం కోల్పోరాదు. వారి జాతి చరిత్రాభిమానమే వారి స్వాతంత్ర్యాన్ని తిరిగి సంపాదించుకోటానికి శక్తిని ప్రసాదిస్తుంది" - అని మహాత్మా గాంధీ మన దేశ ప్రజలకు బోధించాడు. ఆ ప్రబోధలోనుండి తెలుగులో చారిత్రిక కావ్యం పుట్టింది; ప్రబోధ కవిత్వం పుట్టింది. రాణాప్రతాపసింహుడు, శివాజీ వంటి నాయకులు గల కావ్యాలు దేశ స్వాతంత్ర్యం కోసం సాగించే సత్యాగ్రహ సమర ప్రవృత్తిని, ధర్మ నిరతని ప్రజలకు బోధించి చెప్పాయి. తెలుగులో రాయప్రోలు వారి ప్రబోధ కవిత్వం ఆంధ్ర చరిత్రలోని ఉజ్జ్వలాధ్యాయాలను జ్ఞాపకం చేసింది, చావలేదు చావలేదు ఆంధ్రుల పరాక్రమమని జాతిని ఉత్తేజపరిచింది. సీస పద్యాలు ఆ భావానికి కొత్త బాణీలను పెట్టాయి. తెలుగువారు దేశభక్తితో ఊగిపోయారు.

రాయప్రోలు ప్రబోధ కవితలు ఖండకావ్యాలు. విశ్వనాథవారు వాటిని లఘు కావ్యాలుగా దిద్ది తీర్చారు. రాయప్రోలు కవితలలో ప్రస్తావింపబడిన సన్నివేశాలు చిన్న చిన్న ఘట్టాలుగా రూపు గట్టి లఘుకావ్యా లయ్యాయి. ఖండ కావ్యం భావకవితా యుగ ప్రక్రియ. ఆ తరువాత భావకవితా యుగంపై తిరగబడిన నవ్యసంప్రదాయోద్యమ కవులు మహా కావ్య చైతన్యాన్ని సమర్థించేవారు.

ఒక దేశ ప్రజలు తమ స్వాతంత్ర్యాన్ని ఎన్ని యుద్ధాలైనా చేసి, ఎన్ని త్యాగాలైనా చేసి సాధించుకోవాలి. అప్పుడే వారు ఆ నేలతల్లిబిడ్డలు, మాతృదాస్య శృంఖలాలను వదిలించిన వీరపుత్రులు అనే సంస్కారాన్ని అందించినవి చారిత్రిక కావ్యాలు మరి రాయప్రోలువారి ప్రబోధ కవిత్వంలో ప్రారంభమైన ఆంధ్రుల పూర్వవైభవ కీర్తన ప్రవృత్తి క్రమంగా చారిత్రికాంశాలను ఆలంబనం చేసికొని లఘుకావ్య సంపుటులుగా పరిణామం చెందింది. అయితే, ఆంధ్రుల చరిత్రను ఒక ఇతిహాస కావ్యంగా ఒక మహాకావ్య శైలిలో రూపొందించినప్పుడు మాత్రమే నవ్య సంప్రదాయ యుగ చైతన్యం ఫలవంతమైనట్లవుతుంది. ఆ లక్ష్యాన్ని గుర్తించి, ఆంధ్ర పురాణ వస్తువును భావించి, దానికొక అనన్య సాధ్యమైన రూపాన్ని నిర్మించి ఉదాత్తశైలిలో నిర్మించిన గౌరవం మహాకవి మధునాపంతుల వారికే దక్కింది. ''అమరావతీ పట్టణంబున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు'' అని ప్రారంభమైన ఆంధ్ర ప్రశస్తి, 'ఆంధ్ర పురాణం' గా పరిపూర్ణదశ నందుకున్నది. ఒక సెలయేరు సాగరంగా మారినట్లయింది.

ఆంధ్ర పురాణంలోని మొదటి నాలుగు పర్వాలూ పూర్వార్ధంగా 1954 లోనూ, మిగిలిన అయిదు పర్వాలూ ఉత్తరార్ధంగా 1964 లోనూ మొదట వెలువడ్డాయి అంటే - ఆంధ్రపురాణం వెలువడి మూడు నాలుగు దశాబ్దాలయిపోయినా, దానివంటి కావ్యం గాని, దానిని మించిన కావ్యం గాని రాకపోవటం చూస్తే - అది 'క్లాసిక్' అని చరిత్ర ఒప్పుకున్నదన్నమాట! అందుకే ఆంధ్ర పురాణం ఆ మార్గంలో ఈనాటికీ ఆదర్శరూపం!

నేను ఆంధ్ర పురాణాన్ని గురించి 'యువభారతి' వారి 'ఇతిహాస లహరి' లోనూ, తెలుగు అకాడమీ ప్రచురించిన 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు'లో నవ్యసంప్రదాయ సాహిత్యాన్ని గురించి రాసిన సందర్భంలోనూ వివరంగా వివేచించాను. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'ఆంధ్ర సామ్రాజ్యం' కంటె 'ఆంధ్ర పురాణం' ఎలా విశిష్టమైన చారిత్రిక వస్తు కావ్యమో శ్రీ పి. శివరామ శర్మవంటివారు పరిశోధించారు. ఆంధ్ర పురాణంలోని చారిత్రిక వస్తు సంవిధాన శిల్పాన్ని, అంతస్సమన్వయ సూత్రాన్ని నా ఉపన్యాస వ్యాసాలలో వివరించాను. అయినా, ఇంకా ఎన్నో విషయాలు ఆంధ్ర పురాణంలోనుండి వెలువలికి తీయవలసి ఉన్నాయి.

ఆంధ్ర పురాణం చారిత్రిక నిష్ఠను మరచిపోని రసవత్తర కావ్యం. రాజమంద్రిలోనే ఉంటూ చిత్రాంగి కథను రాయాలన్న ప్రలోభానికి మధునాపంతుల

వారు గురి కాలేదు - ఆంధ్ర పురాణంలో. ఆంధ్ర ప్రతాపరుద్రీయం నాటకం తెలుగునాట ప్రజాదరణం బాగా పొందిందని తెలిసి కూడా యుగంధర మంత్రి ప్రతాపరుద్రుణ్ణి ఢిల్లీనుండి ఓరుగల్లుకు తిరిగి తెచ్చాడన్న అద్భుతమైన కల్పనకు ఆసక్తుడు కాలేదు. భువన విజయ సాహిత్యరూపకాలు ఆంధ్రుల ఆదరాభిమానాలను అపారంగా చూరగొంటున్న దృశ్యాలను కన్నారా చూచికూడా మధునాపంతులవారు అష్టదిగ్గజాలను మనమనుకున్నట్లు సభలో కూర్చోపెట్టి చమత్కారాలాడించలేదు. మల్లంపల్లి సోమశేఖర శర్మవంటి చరిత్ర పరిశోధకులు వాస్తవాలని ఆధారాలతో చూపించిన సన్నివేశాలకే ఆంధ్ర పురాణంలో మధునాపంతుల వారు చోటు కల్పించారు. ప్రామాణికత్వం చారిత్రిక కావ్యానికి ప్రాణం. ఆంధ్ర పురాణం కట్టుకథల గాథ కాకుండా సత్య కథల చారిత్రిక కావ్యమైంది. అందుకే అది చిరంజీవి అయింది.

"జన్మము లెన్ని పైఁబడుచు వచ్చిన నొచ్చిన నాత్మగౌరవ
స్కన్నత నైఁపలేని గుణశాలి - యుదాత్తము క్షత్రధర్మ మా
పన్నత నొంద నోరువని పౌరుషవంతుడు శాంతు డాంధ్రుఁడు...."

అని ఆంధ్ర జాతి మూలపురుషుని పరిచయం చేశాడు కవి. ఆ జాతి చరిత్రలో ఆ మూలపురుషుని మూల ప్రవృత్తియే తరతరాలుగా దేశకాల పాత్రాల మార్పుతో ప్రవహించే పౌరుషేతిహాసం ఆంధ్ర పురాణం. దానికి కావ్యరూపం ఇస్తే ఏర్పడిన గుణాలివి—

"అమలోదాత్తము, ధర్మ నిర్వహణ మర్యాదమ్ము, విద్యాకృత
శ్రమమాయోధనరంగ సంగత పరోగ్రంపశ్య మాశాతటా
క్రమిత స్వచ్ఛయశమ్ము, కావ్య కవితా కల్యాణ నీరంధ్ర, మాం
ధ్రమహావీర చరిత్ర...."

ఆంధ్ర మహాభారతం కావ్యేతిహాసం; ఆంధ్ర పురాణం ఇతిహాస కావ్యం. పురాణం ప్రజాపరిషత్తులలో పాడబడుతూ ఉండాలి! శ్రీ మధునాపంతుల ట్రస్ట్ వారు - ఆంధ్ర జాతి తన పూర్వ చరిత్రను చెవులారా, చవులూరా వినే కావ్య గానసభలను రాష్ట్రమంతా ఏర్పాటు చేయాలి

ఒక్కడు మధునాపంతుల
ఎక్కడ లేదిట్టి కావ్య మీ భరతోర్విన్
అక్కజమగు నీ కవితను
మక్కువతో జనుల కిచ్చి మనుపుడు ప్రీతిన్. *

(ఆంధ్రభూమి 18-3 1994)

# కరుణశ్రీ కావ్యకళ

ఈ యేడు జనవరిలో 'నదీరా' (శ్రీ యన్.వి.యస్. శర్మ) 'కరుణశ్రీ కవితా కౌస్తుభము' ప్రచురించారు. డాక్టర్ జంధ్యాల జయకృష్ణ బాపూజీ, డాక్టర్ జంధ్యాల సుమన్‌బాబు ఆ సంకలనానికి సంపాదకులుగా వ్యవహరించారు ఎనిమిదవ హైదరాబాదు బుక్ ఫెయిర్‌లో ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ పరిషదధ్యక్షులు శ్రీ కోదాడ నారాయణరావుగారు ఆ సంపుటిని ఆవిష్కరించారు. కరుణశ్రీ కవితలలో పద్మశ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావుగారు కొన్ని పాడి ఆంధ్రదేశాన్ని ఉర్రూతలూగించారు. అలాగే మరెందరో కూడా కరుణశ్రీ పద్యాలను పాటలను పాడి తెలుగువారి మన్ననలు పొందారు. వారిలో శ్రీయుతులు పి సూరిబాబు, కొడాలి వెంకటేశ్వరరావు, దుర్గాప్రసాద్, డా॥ నూకల చిన సత్యనారాయణ, పి.బి. శ్రీనివాస్ శ్రీమతి శ్రీరంగం గోపాలరత్నం, శ్రీమతి వేదవతీ ప్రభాకరరావు, ఎన్.సి.వి. జగన్నాథాచార్యులు, డా॥ అక్కిరాజు సుందరరామకృష్ణ, నల్లూరి సుధీర్‌కుమార్, పట్నాయక్- ఇలా ఎందరో గాయనీ గాయకులున్నారు. వీరందరు పాడిన కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి కవితలలో తెలుగువారు కంఠస్థం చేయదగిన కావ్యఖండికలను యాభై అయిదింటిని కవితా కౌస్తుభంలో సంపుటీకరించారు. ఒకవిధంగా ఈ సంకలనం కరుణశ్రీ కవితా నవనీతం!

'ఉదయశ్రీ నా హృదయం : విజయశ్రీ నా శిరస్సు; కరుణశ్రీ నా జీవితం' అన్నారు డాక్టర్ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు. కవి కలం పేరూ, కావ్యం పేరూ అద్వైతసిద్ధి పొందిన కావ్యం 'కరుణశ్రీ.'

"కరుణామయుఁ డగు బుద్ధుని
కరుణశ్రీ వాణి విశ్వకల్యాణ గుణా
కరమై, ఆచంద్ర దివా
కరమై వెలుఁగొందు దిగ్దిగంతము లందున్"

అని కరుణశ్రీ కావ్యం ముగుస్తుంది. ఈ పద్యంలో 'బుద్ధుని కరుణశ్రీ వాణి' అనే సమాసం సార్థకం. బుద్ధుని దయాసంపదగల వాఙ్మయం అనీ, బుద్ధుని దయను

తెలిపే మంగళకరమైన ప్రబోధమనీ, బుద్ధుని గురించి చెప్పిన 'కరుణశ్రీ'గారి కవితావాణి అనిన్నీ మూడు రకాల అర్థాలను చెప్పుకోవచ్చు. మొత్తానికి బుద్ధుని ప్రబోధాల్లాగానే, కరుణశ్రీ కవితలు గూడా సూర్యచంద్రులుండేంతవరకూ జీవిస్తూ ఉంటాయని భరతవాక్య తాత్పర్యం. ఆశ్చర్య మేమిటంటే - ఆ పద్యమే 'కరుణశ్రీ' కావ్యానికీ కరుణశ్రీగారి జీవితకావ్యానికీ మంగళాంతం కావటం!

ఉదయశ్రీలో బుద్ధుని జీవితగాథలోని ఒక కిరణం ఖండకావ్యంగా వెలుగొందింది. ఆ తరువాత 1950 లో బుద్ధుని జీవితంలోని కొన్ని సన్నివేశా లను రమణీయంగా చిత్రించే లఘుకావ్యం కరుణశ్రీగా వెలువడింది. ఇరవై అయిదు ముద్రణలు నోచుకొన్నది. నలభై యేళ్ళ తరువాత 'కరుణశ్రీ' సంపూర్ణ కావ్యంగా అవతరించింది. ఈ నాలుగు దశాబ్దాలూ ఈ కావ్యానికి సంబంధించినంతవరకు కాలవిరామమే కాని, కావ్యరచన సాగిన కాలం కాదు. కరుణశ్రీ మొదటి భాగం లోని కవితకూ, తరువాతి కవితకూ ఈ కాలం తెచ్చిన పరిణతి నిశితంగా పరి శీలిస్తే బయటపడుతూనే ఉంటుంది. ఏమైనా కరుణశ్రీగారి కావ్యాలలో కలికి తురాయి 'కరుణశ్రీ.'

సాహిత్యంలో కావ్యం వెలువడిందంటే - అది ఒక పరిణామ దశను సూచించేదై ఉండాలి. కరుణశ్రీ కావ్య నిర్మాణం చూస్తే ఒక పరిణామ దశ స్ఫురిస్తుంది. తెలుగులో ఖండకావ్య రచనా ప్రక్రియ బాగా ప్రచారంలోకి వచ్చే కొద్దీ ప్రాచీనాంధ్ర కావ్య నిర్మాణం మీద బలమైన ప్రభావాన్ని వేసింది. కావ్యంలో కథను మొదటినుంచి చివరిదాకా కాలక్రమ పద్ధతిలోగానీ, కార్యకారణ పద్ధతిలోగానీ పూసగ్రుచ్చినట్టు చెప్పటం కావ్య మర్యాదగా ఇదివరకుండేది. తిరుపతి వేంకటకవుల 'బుద్ధ చరిత్రము' కావ్యం ఆ పద్ధతిలో సాగిందే. అయితే, ఖండకావ్య ప్రక్రియ వచ్చిన తరువాత కథను పూసగ్రుచ్చినట్లు చెప్పే విధానం పాతబడిపోయింది. కథలోని కమనీయ సన్నివేశాలను ఒక్కొక్కసారి ఆత్మీయం గానూ, ఒక్కొక్కసారి ఆత్మాశ్రయంగానూ భావోద్విగ్నంగా చిత్రించి, వాటిని గుదిగ్రుచ్చినట్లు అమర్చే పద్ధతి నవ్యకావ్య నిర్మాణ వైఖరిగా రూఢికెక్కింది. ఈ పద్ధతికి మార్గదర్శకులు పింగళి, కాటూరులు. వారి సౌందరనంద కావ్యం నవ్యకావ్య నిర్మాణ శిల్ప మందిరం. అది ఎంతగా తరువాతి కవులను ఆకర్షించిం దంటే - నవ్య సంప్రదాయ ఉద్యమనాయకుడైన విశ్వనాథవారు రామాయణ

కల్పవృక్ష కావ్యాన్ని కాండాలుగానే కాక ఖండాలుగా కూడా విభజించారు. సంప్రదాయ కావ్యాలకంటె కల్పవృక్షం ఈ లక్షణంలో ఆధునికం.

కరుణశ్రీ కావ్యంలో నలభై మూడు ఖండికలున్నాయి. వాటిని ఆశ్వాసాలనలేం. ఒక ఖండికకూ మరొక ఖండికకూ మధ్య కథా సూత్రం చెప్పబడదు. అది భావుకుని భావనాశక్తిని వదలిపెట్టబడింది. ఒక్కొక ఖండికకు ఒక్కొక శీర్షిక ఉంటుంది. అది ఆ ఖండికలోని వస్తు స్వభావాన్ని ధ్వనింపజేస్తుంది. ఖండికలో కథకు కంటె భావానికి, మానసిక అవస్థలకు, వాతావరణ కల్పనకు; కవిగాని, పాత్రలుగాని ఆత్మీయంగా, ఆత్మాశ్రయంగా పొందే స్పందనలకు ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడుతూ ఉంటుంది. ఇటువంటి కావ్య నిర్మాణంతో బుద్ధుని జీవిత చరిత్ర రాయాలని అనుకోవటంలో నవ్యకావ్యస్ఫూర్తి ఉంది.

సౌందరనంద కావ్యంలోని కార్యం ఒక నిండు జీవితమంత విస్తృతం కాదు. దానికి తగినట్లు ఆ కావ్య ఖండికలు ఎంతో అర్థవంతంగా అమరాయి. మరి కరుణశ్రీ కావ్యం ఒక ప్రవక్త మహాజీవితమంత పెద్ద వస్తువు నెత్తుకొన్నది. కన్నడంలో అయితే ఇదొక పురాణమై ఉండేది. నిండు జీవితాల్ని చిత్రించే కావ్యాంశాలలో ఖండికలుగా ఎన్నుకోదగినవాటిని నిర్ణయించటంలో ఆ కావ్య మహత్వం ఇమిడి ఉంటుంది. అటువంటి మహా కావ్య నిర్మాణ మర్మం కావ్య ఖండ విభాగంలో ప్రస్ఫుటం కావాలి. అయితే, కరుణశ్రీ కావ్యం ఒక సమగ్రత్వాన్ని సంతరించుకొన్నా, అందులోని ఖండికలన్నీ సమప్రాధాన్యం కలవని గానీ, అన్నీ ఆ కావ్య గౌరవానికి తోడ్పడేవని కానీ చెప్పటం కష్టం. ఖండికల వస్తువుల ఎన్నికలో ఏదో సరితూకం సరిపోనట్లు సహృదయులు భావించే అవకాశం ఉంది. బాల సిద్ధార్థుణ్ణి ఊయలలో పెట్టి పాడే జోలపాటల తాత్పర్యానికి ఒక ప్రత్యేక ఖండికను 'బంగారు తండ్రి'ని కవి కేటాయించారు. ఆ ఖండికలోని శిల్పానికంతా చివరి సీసపద్యం ప్రాణం. బాలునిలో దివ్యాత్మ దర్శనం చేయటం ఆ ఖండిక భావనలోని ఫలం. అయితే, బుద్ధుని ప్రబోధలకు ప్రాతినిధ్యం వహించి, కరుణశ్రీ తత్త్వగాంభీర్యాన్ని వెలార్చవలసిన చివరి ఖండిక 'ధర్మచక్ర ప్రవర్తనం' కూడా 'బంగారు తండ్రి' కంటె ప్రాధాన్యం పొందినట్లు రచించక పోవటం శిల్పసంబంధమైన ఒక శైథిల్యం లాగా లోనారసి చూచేవారికి గోచరిస్తుంది. అయితే, కరుణశ్రీ రచనలోని మాధుర్యం శిల్పసంబంధమైన శైథిల్యాలను

కనపడకుండా కప్పివేస్తుంది కరుణశ్రీ వాణీ విలాసం కావ్యకళకు అమర్చిన మేలిముసుగు.

తెలుగులో బుద్ధ చరిత్రను గాని, తత్సంబంధి వస్తువులను గాని తీసికొని కావ్యాలను రచించి ప్రసిద్ధి కెక్కినవారందరూ బౌద్ధ ధర్మాన్ని జీవన పద్ధతిగా స్వీకరించినవారు కాకపోవటం విశేషం. కరుణశ్రీగారు బుద్ధదేవుని గురించి అద్వైతిగా భావన చేసినట్లు అనుభూతి నందిస్తారు. అది సానుభూతికి తోడ్పడి నంతగా సహానుభూతికి తోడ్పడదు. మతమేదైనా మానవతా దృక్పథంతో కరుణశ్రీ కథను రమణీయంగా భావించి రమించే ఒక ఆత్మీయపద్ధతికి కరుణశ్రీ గారి భావనాశక్తి పూలబాటగా పనికి వస్తుంది.

కరుణశ్రీ జీవితాన్ని కావ్యజీవితానికి సంబంధించిన వివిధాంశాలతో పోల్చి కథకూ కావ్యరచనా శిల్పానికీ ఒక వూలవంతెనను నిర్మించే నైపుణ్యం కరుణశ్రీ గారి కవితలో గోచరిస్తుంది. ఇటువంటి సందర్భాలు కావ్యంలో ఇరవైచోట్ల కనిపించటం కవి 'కాన్షస్ ఆర్టిస్ట్' అనటానికి సాక్ష్యంగా చెప్పవచ్చు. గర్భవతిని 'అతిలోక రమణీయమైన వ్యంగ్యార్థమ్ము వహియించు సత్కవి వాక్యనంగ'అని వర్ణించినప్పుడు, 'కరుణకవి కావ్యమట్లనుద్ఘాత లలిత మృదుల శయ్యాకమగు తెర'ను సిద్ధం చేసినప్పుడు, 'సుకవి ఛందమ్ము రీతి' ఒడుదుడుకులులేని పథంలో రథాన్ని నడిపించినప్పుడూ, 'సహజ సముదాత్త భావనాశక్తి నుండి అమృతమయ కావ్య ముత్పన్నమైనట్లు' పుత్రోదయాన్ని వర్ణించినప్పుడూ, 'నవ్యమధుర కల్పన విధాన' హంస పైకెగిరినప్పుడూ, 'సాహిత్యములో రసధ్వని'లాగా యశోధరను పరిచయం చేసినప్పుడూ, 'శబ్దములతోడ పనిలేని సరసహృదయ భాష'ను వినిపించి నప్పుడూ కవి స్వీయ కవితాగుణాలను అన్యాపదేశంగా అలంకార నెపంతో చెప్తు తున్న గడుసుదనం గోచరిస్తుంది. ఉపమ కరుణశ్రీ కావ్యకళకు ఊపిరి.

ఏకవాక్యత అంతస్సూత్రంగా ఖండకావ్యాల సంపుటినే మహాకావ్యంగా మలిచి మెప్పించిన పద్య కవిత్రయం పింగళికాటూరులు, విశ్వనాథ, కరుణశ్రీ గారలు. వచన కవితా కవిత్రయం - గుంటూరు శేషేంద్రశర్మ, సి. నారాయణ రెడ్డి, కె. శివారెడ్డిగారలు. కరుణశ్రీ ఒక కొమ్మకు పూచిన చిటారిపువ్వు! *

(ఆంధ్రభూమి 24-9-1993)

# కాకినాడలో కవితాశ్రీనాథుడు

కవులకు కూతుళ్లై తండ్రుల సాహిత్యాన్ని గురించి కృషిచేసి వారికీ, తమకూ పేరు తెచ్చుకున్న విదుషీమణులు ఆధునికాంధ్ర సాహిత్యయుగంలో కొంతమంది కనపడుతున్నారు. వాళ్ళ పేర్లన్నీ కలిపి పట్టీ రాయటం పరిశోధనలో భాగం కావచ్చు. కాని, అనుకోంగానే అందరి మనసుల్లో స్ఫురించే అటువంటి రచయిత్రులు అయిదారుగురు ఉన్నారు. నాయని సుబ్బారావుగారి పేరు లాగానే తన పేరూ సాహిత్యలోకంలో నిలుపుకొని, నిజంగా భావకవి అంటే మా నాన్నగారే అని ఒక క్రొత్త ప్రతిపాదన చేసి దాన్ని నెగ్గించుకుంటున్న కవయిత్రి నాయని కృష్ణకుమారిగారు. అలాగే ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు నాళం కృష్ణరావుగారిని గురించీ, హేమలతగారు గుఱ్ఱం జాషువాకవిగారిని గురించీ ఎంతో కృషిచేసి, వారి పేరు కలకాలం సాహిత్యంలో నిలవటానికి అనువైన ఎన్నో మంచి పనులు చేస్తున్నారు. వీరిలాగానే తండ్రి పేరు నిలువబెట్టే రచనా వ్యాసంగం చేస్తున్నవారిలో కాత్యాయనీ విద్మహేని ముందుగా చెప్పుకోవాలి. సరస్వతీపుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులుగారి అమ్మాయి నాగపద్మిని- ఇప్పుడు ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో పనిచేస్తోంది. తండ్రిగారు పాడినట్లు శివతాండవాన్ని పాడి వినిపించగలిగిన ప్రతిభామూర్తి. నారాయణాచార్యులవారి సాహితీ వ్యక్తిత్వాన్ని గురించి ఆమె ఎక్కువగా రాసినట్లు లేదు. అయినా, అనేకసభల్లో అనర్గళంగా మాట్లాడటం విన్నాం. నిజంగా ఆ తండ్రులు అదృష్టవంతులు; ఈ రచయిత్రులు ధన్యులు.

మా విశ్వవిద్యాలయంలో శరత్‌జ్యోత్స్నారాణిగారు వారి తండ్రిగారైన డాక్టర్ యస్. టి. జ్ఞానానందకవిగారి జీవితం - వాఙ్మయం మీద ఎం ఫిల్. పరిశోధన వ్యాసం వ్రాసి డిగ్రీ పొందింది కామేశ్వరీదేవిగారు ప్రసిద్ధ కథకులు, నవలాకర్త కప్పగంతుల మల్లికార్జునరావుగారి జీవితం-రచనల మీద పి హెచ్ డి. చేసింది. కొడుకులకంటె కూతుళ్లెందులోనూ తీసిపోరని సాహిత్య రంగంలోనూ అన్ని విధాలుగా అభ్యుదయ పథాల్లో పయనిస్తున్న మహిళాలోకాన్ని మనం అభినందించాలి.

కళాప్రపూర్ణ జ్ఞానానందకవిగారు నాకు చాలకాలంనుంచీ మంచి మిత్రులు. అంతేకాదు, ఆయనంటే ఒక విధమైన అభిమానం కూడా నా కేర్పడింది అది క్రమంగా దృఢపడింది. దానికి కారణాలు నాకిప్పటికి మూడు కనపడుతున్నాయి. మొదటి కారణం జ్ఞానానందకవి కవితాశైలి. ఆయన ఎప్పుడు పద్యం చదివినా నేను చదువుకున్నా పద్యం చదివే కవి ఇలా ఉండాలి అనే ఒక రూపచిత్రం నా మనస్సు కందిస్తారు నా మనసులో - పద్యాలు చదివేవాళ్ళలో కూడా ఎన్నో రకాల రూపచిత్రాలు అందించిన అనుభవాలున్నాయి. ఆశుకవి, అవధానకవి, పురాణకవి, భావకవి, కావ్యగానకవి - ఇలా ఎన్నో చిత్రాలున్నాయి. కావ్యగాన కవులు నా కందించిన రూపచిత్రాలలో జ్ఞానానందకవిది ఒక సజీవజ్ఞాపిక. ఇది బలమైంది కూడా.

మొదటిముద్ర ఒక సహృదయుడుగా పొందిందయితే, రెండవ ముద్ర ఒక సాహిత్య విమర్శకుడుగా ఏర్పరచుకున్నది జ్ఞానానందకవిగారి కావ్యాలలో చాల వాటికి విశ్వనాథ వారి ముందుమాట లున్నాయి. దాదాపు 1947 నుండి 1976 దాకా కవి రాసిన ప్రతి కావ్యానికీ కవిసమ్రాట్ తమ ఆశీస్సు లందించారు; తమ శిష్యులని వారిని అభిమానించారు. 'అక్షర గుచ్ఛా'న్ని అభినందిస్తూ "ఆధునిక కవీశ్వరులలో నిస్సందేహముగా నీకు స్థాన మున్నది. ఇంకను నీ పుస్తకముల మీద ఎవరో యభిప్రాయములు పీఠికలు వ్రాయుట నా ఉద్దేశ్యములో అనవసరము" అని ప్రకటించారు.

ఒక రచయిత కావ్యాలకు మరొక రచయిత వరుసగా ముందుమాటలు రాయటంలో ఒక ఇబ్బంది ఉంది; ఒక సౌలభ్యమూ ఉంది. ఒక్కొక్కసారి రాసిందే రాయవలసి వస్తుంది. అది పీఠికాకర్తకు కలిగే పెద్ద యిబ్బంది. అయితే, విశ్వనాథవంటి విమర్శకుడు ముందుమాట రాసేటప్పుడు మెరుపులు మెరిపిస్తారే కాని జడివానలు కురిపించరు. అందువలన కవిలోని ప్రతిభను పెక్కుగ్రంథాల పీఠికల మీద పరిచి చెప్పే అవకాశం ఉంది. జ్ఞానానందకవి రచనలకు ముందు మాటలు రాస్తూ విశ్వనాథ వారు ఆ పనే నిపుణంగా చేశారు. నాకు జ్ఞానానంద కవి కవిత లెంత ఆహ్లాదాన్ని కలిగిస్తాయో విశ్వనాథవారి ముందుమాట లంత ఆసక్తిని మెరిపించేవి. విశ్వనాథ వివేచనలు జ్ఞానానందకవి రచనలలోని విలువలను, శిల్పాలను తెలుసుకొని అభిమానం పెంచుకోటానికి తోడ్పడ్డాయి. కవిని లోనారసి చూడటంలో నాకు విశ్వనాథ తొలి మార్గదర్శకుడు!

విశ్వనాథ పీఠికలలో కవిగారి 'పాంచజన్యా'నికి రాసిన పీఠిక పెద్దది. ఒకపాటి చిన్ని సిద్ధాంత వ్యాసం జ్ఞానానందకవి గారికి అప్పటికి (1955 నాటికి) 'కవికోకిల', 'కవితావిశారద' అనే బిరుదాలు రెండే ఉండేవి. విశ్వనాథవారు ఆ రెండు బిరుదాలకు అర్థాలు చెప్పి, వాటిని శాస్త్రీయంగా, సోదాహరణంగా నిరూపించారు. అనువర్తిత విమర్శకు చక్కని ఉదాహరణంగా దిద్దితీర్చారు. మధురంగా కవిత చెప్పగలవాడు కవికోకిల అని పిలవదగిన వాడన్నారు. రచనలోని రహస్యాలు తెలిసినవాడు కవితావిశారదు డన్నారు. జ్ఞానానందకవి గారి కవిత్వంలో మాధుర్యం శబ్దగతంగానూ, అర్థగతంగానూ ఉంటుందని వివేచించారు. ధారాశుద్ధి, అచ్చులను హల్లులను కలపటంలో కలిగే శ్రావ్యత, కొంచెం కొంచెం వృత్త్యనుప్రాసం కలిస్తే శబ్దగతమైన మాధుర్యం ఏర్పడుతుందని పేర్కొన్నారు. అది జ్ఞానానందకవి కవిత్వంలో పుష్కలంగా అందరికీ తెలిసేటట్లు ఉంటుందని చెప్పి, లోతుగా పరిశీలిస్తేనే తెలిసే అర్థమాధుర్యాన్ని గురించి విశ్లేషణాత్మకంగా వివరించి చెప్పారు. భావగత మాధుర్యం అర్థమాధుర్యంలోని అంతశ్శక్తి. దానికి చమత్కారం, లోకోక్తి, అలంకారం, ప్రౌఢి (గడుసుదనం), కూర్పు, పద్యపునడక, అపూర్వశబ్ద ప్రయోగం మొదలైన అంశాలను నిపుణంగా జోడించినప్పుడు అర్థగతమైన మాధుర్యం ఎలా అభివ్యక్తమౌతుందో జ్ఞానానంద కవిగారి కవిత్వంలోనుంచి ఉదాహరించి చూపించారు. విశ్వనాథ వారి విమర్శతో జ్ఞానానందకవి కవిత్వంలోని శ్రవణానందంతో పాటు మననానందాన్ని కూడా మనసుతో పట్టుకోగలిగాను. రచనలోని రహస్యాలను తెలిసికొని అభిమానం పెంచుకున్నాను.

ఏడు పదులు దాటిన జ్ఞానానంద కవిగారి జీవితంలో కవిత్వం అంకురించి ఆరు పదులు దాటింది. మొదటి కవితా సంకలనం 'తరంగమాల' (1944) వెలువడి అయిదు పదులు దాటింది. అంటే-వారి కావ్యరచనా జీవితానికి స్వర్ణోత్సవంగా భావించాలి. ఆ సందర్భంలో వారమ్మాయి వారిమీద రాసిన గ్రంథాన్ని వెలువరించటం ఎంతో ఔచిత్యంగా ఉంది. గారాబంగా పెంచిన కన్నతండ్రికి కలకాలం నిలిచే కానుక నిస్తోంది, కన్నకూతురు! ఇది నాకు నచ్చిన మూడో అంశం.

ఆరుపదుల జ్ఞానానంద కవి సాహిత్య ప్రస్థానాన్ని గురించి ఒక్కమాటలో చెప్పాలంటే - మూడు బాటలు, పది మలుపులు - అని పేర్కొనవచ్చు నను

కుంటాను. జ్ఞానానంద కవిగారు కొంతకాలం విశ్వనాథ పద్యరచనా ప్రభావంలో ఉన్నారు. అప్పుడు వారు ఎన్నుకున్న వస్తువుకంటే చెప్పే భావంకంటే అభి వ్యక్తీకరిస్తున్న రచనా శిల్పానికే ఎక్కువ ప్రాధాన్యం ఇస్తుండేవారు. పద్యరచనా శిల్పంలో శబ్దార్థ మాధుర్య గుణాలను పలురకాలుగా ప్రదర్శింపగలిగే ప్రజ్ఞను సాధించారు ఆంధ్ర విశ్వకళా పరిషత్తువా రిచ్చిన కళాప్రపూర్ణ బిరుదం బహుశః ఆయన పద్య శిల్పానికే ఇల్చారేమో అన్నంతగా ఆంధ్రులు భావిస్తారు.

అయితే, జ్ఞానానంద కవి విశ్వనాథ వద్ద శిల్పవిద్య సాధించి ఆగలేదు. జాషువా గారి వద్ద భావ మాధుర్యాన్ని, సాంఘిక జీవన విధాన ప్రతిఫలనాన్నీ, సంస్కరణ శీలాన్నీ, అన్యాయాన్ని ఎలుగెత్తి చెప్పే చైతన్యాన్నీ, పలుకుబడిలో ఒక విధమైన పొంకాన్నీ సాధించారు. విశ్వనాథ, జాషువాల ప్రభావాలు జ్ఞానానంద కవిని అభ్యుదయ కవితా మార్గంకంటే భిన్నమైన సవ్యసంప్రదాయ మార్గానికే అంకితమయ్యేటట్లు చేశాయి. పద్యాన్నే తన కవితావాహికగా మొదటి నుంచీ నేటిదాకా ఎన్నుకునేటట్లు చేశాయి ప్రభావాలు పడ్డా తన అస్తిత్వాన్ని కోల్పోలేదు కవితలో. తన శైలి తాను నిలుపుకున్నాడు. విశ్వనాథ వారే అన్నారు - "నీకొక శైలి కలదు. నీ పద్య లక్షణము నీదిగా ఏర్పాటైపోయినది" అని. జాషువా గారు "నీ రచన నిగ్గుతేలిన రచన. రాను రాను దేశం నిన్ను గుర్తించి నీ మనఃక్లేశాన్ని తీరుస్తుంది అనుమానము లేదు. వెనుకంజవేయక ముందుకు సాగిపో" అని భుజం తట్టి ప్రోత్సహించారు

ఒక మర్రిచెట్టు నీడలోనుంచి, ఒక మామిడిచెట్టు నీడలోనుంచి బయటకు వచ్చి, ఒక మందారపు చెట్టులాగా పద్యాల పూలశాలువా కప్పుకొని నించున్న కవితామూర్తి కళాప్రపూర్ణ సురగాలి తిమోతి జ్ఞానానంద కవి. రెండు బాటలు దాటిన మూడో బాటలో దాదాపు మూడు దశాబ్దాలు పయనించారు వారు.

కాకినాడలో ఆ కవితామూర్తి తిరుగుతుంటే చూచిన గుబ్బల మాధవ మూర్తిగారు అక్షరాల ఫోటో తీసి శార్దూల వృత్తం ఫ్రేములో బిగించి దేశాని కిచ్చారు చాటు సుందరంగా.

"రిక్షాపై కవిరాజు శుభ్రతర కీర్తి ప్రోల్లసద్దేహుఁడై
దీక్షాదక్షత కాకినాడ పురవీథీ రమ్య తేజస్వియై
సాక్షాత్ శ్రీకవిసార్వభౌము డనగా సంచారముంజేసెడిన్
అక్షీణాంధ్ర కవిత్వ దూర్వహుడు జ్ఞానానందు డుత్సాహియై." *

(ఆంధ్రభూమి, 25-3-1994.)

# మూడు బాటలు-పది మలుపులు

డాక్టర్ జ్ఞానానంద కవిగారి కవితా ప్రస్థానంలో సాగిన మూడు బాటలు గమనించాం. అందులో కనపడే పది మలుపులు పరిశీలిద్దాం. కవిగారు రచించిన ప్రక్రియలలో సంఖ్యా బాహుళ్యం ఖండకావ్యాలకే లభిస్తుంది. అపారమైన వస్తు వైవిధ్యం, రచనా వైశిష్ట్యం వారి ఖండ కావ్యాలకు సహజాలంకారాలు. ఖండ కావ్య ప్రక్రియలోనే జ్ఞానానంద కవిగారు గాంధీజీ వంటి జాతీయ నాయకులు పోయినప్పుడు రచించిన స్మృతి రచనలు, స్వీయ దేశ భాషా సంస్కృతులమీద గల అభిమానాన్ని వ్యక్తం చేసే ప్రబోధ కవితలు ప్రత్యేకంగా పేర్కొనదగినవి.

డాక్టర్ జ్ఞానానంద కవిగారు ఖండ కావ్య రచనతో ఆగిపోకుండా నవ్య సంప్రదాయ యుగ చైతన్యంతో స్పందించి, విలక్షణమైన ఆధునిక కావ్య నిర్మాణ ప్రయోగాలకు పూనుకున్నారు. 'గోల్కొండ' కావ్యం తెలుగులో చారిత్రిక కావ్య వికాస దశలో ఒక ఆధునిక ప్రయోగం. 'ఆమ్రపాలి' నవ్య సంప్రదాయంలో వెలువడిన సౌందరనంద కావ్యం వంటి బౌద్ధ కథా కావ్యం. 'పర్జన్యం' కావ్యం (రెండు భాగాలు) ఆకలి బాధవంటి సమాజ సమస్యలను భగవంతునికి స్వయంగా నివేదించుకున్న ఆత్మాశ్రయ (సందేశ) కావ్యం. 'క్రీస్తు ప్రబంధం' జీవిత చరిత్ర కావ్యం. 'నా జీవిత గాథ' స్వీయ చరిత్ర కావ్యం. ఇవి కాక నాటకాలు, శతకాలు, పాటలు అనే ప్రక్రియలు కవిగారి కలంలో బలంగా రూపొందాయి. ఇలా డాక్టర్ జ్ఞానానంద కవి పది ప్రక్రియలలో పద్యాన్ని హృద్యంగా మలచారు. వీటినే వారి కవితా ప్రస్థానంలో పది మలుపులని పేర్కొంటున్నది.

'గోల్కొండ' కావ్యానికి తెలుగులో మంచి కీర్తి ఉంది. దానికి కారణం, ఎన్నుకున్న వస్తువును నిర్వహించిన విధం. ప్రబోధ కవిత్వంలో చారిత్రిక ఘట్టాల స్మరణ ఉంటే, లఘు కావ్యాలుగా రూపొందే పరిణామ దశలో చారిత్రిక కావ్యం ఒక చారిత్రిక ఘట్టంలోని ఉజ్జ్వల సన్నివేశాల సంపుటీకరణంగా వెలువడిన వైఖరిని ఈ ప్రయోగం ప్రదర్శిస్తున్నది. దేశంలో పండితులు చాలమంది

ఈ రచనా నిర్మాణాన్ని మెచ్చుకున్నారు. ఈ కావ్య నిర్మాణం మీద విశ్వనాథ వారి వేగిక్షేత్రం లాంటి రచనల ప్రభావం కనబడుతుంది. ప్రతి అధ్యాయానికీ ఒక శీర్షిక, ఒక ఉపక్రమణిక, ప్రతి అధ్యాయం, ఒక కావ్య ఖండికగా భాసించే కళా స్వభావం, వెరసి ఒక కావ్యత్వం స్ఫురించే సంవిధాన చాతుర్యం ఈ ప్రక్రియకున్న ప్రత్యేకత.

అవతరణము, మీర్జుమ్లా, అక్కన్న-మాదన్న, రామదాసు- అనే అయిదు భాగా లున్న ఈ కావ్యం పూసగుచ్చినట్టు కథ చెప్పదు. సామ్రాజ్య చరిత్ర వికాసానికి దోహదంచేసిన మహనీయుల మహద్వ్యక్తిత్వాలను మనోజ్ఞంగా కీర్తించి చెప్తుంది. ఇది ఒక సామ్రాజ్య సజీవ చిత్రాన్ని తలపించే రమణీయ రేఖాచిత్రం. ఖండ కావ్యాల నుండి కమనీయ కావ్యాన్ని కల్పనం చేసే ఆధునిక నవ్య సంప్రదాయ ప్రయోగానికి ఇది ప్రాణం పోసింది.

ప్రబోధ కవితాస్ఫూర్తితో వెలువడుతున్న చారిత్రిక కావ్యాల రచనలో కవికి చరిత్ర ఘట్టాలన్నా, చారిత్రిక వ్యక్తులన్నా మేను పులకించి కవితావేశంతో ఆత్మీయతను రంగరించి రచనను అభివ్యక్తీకరించే సహజ వాక్శక్తి ఉండాలి. జ్ఞానానందకవిగారి కలంలో, గళంలో తన్మయత్వంతో అభినివేశాన్ని వ్యక్తీకరింపగలిగే ఒక వాగ్వైఖరి ఉంది. భక్త రామదాసు మీది ఈ పద్యం ఒక శక్తితోనే వెలువడింది కాదు; భక్తితో పొంగులువారింది

''మాధుర్య సంభృతాంభః పూర పుణ్య గో
దావరీ స్పృశిత పూత స్థలమ్ము
జానకీ రామ లక్ష్మణ పాదకంజాత
ధూళిధూసరమైన దొడ్డనేల
ద్రుమవల్లరీ కుడుంగము లెల్ల లావెక్కి
చిమ్మచీకటి వెదజిమ్ము చోటు
ధర్మమార్గాలంబ తమ్ముల దమ్మక్క
మనసిచ్చి రాముని గనిన భూమి

పూజనములు మఱియు భాజనమ్ములు లేక
పేదవడిన రామ విగ్రహమ్ము
కలుగు పంచవటికి విలువ హెచ్చెను నీదు
రాకవలన భక్త రామదాస!" (గోల్కొండ. పు. 60)

నవ్యకావ్య రచనా నిర్మాణం దృష్ట్యా 'గోల్కొండ' కంటె 'ఆమ్రపాలి' ఆధునిక కావ్య మర్యాదలను అధికంగా పండించుకున్నది. సౌందర్యాన్ని సుకుమారంగా తనలో సంతరించుకొన్న కావ్యం ఇది. ఇంగ్లీషు సాహిత్యంలోని లాంగ్ పోయెం లక్షణాలను సమన్వయించుకున్నది. తెలుగులో వెలసిన బౌద్ధ కావ్యాల్లో 'ఆమ్రపాలి'కి ఒక పాత కొత్తల మేలు కలయికగా ప్రత్యేకస్థానాన్ని ఇవ్వక తప్పదు.

తిరుపతి వేంకట కవుల కాలంనుంచీ స్వీయచరిత్ర, జీవితచరిత్రలను పద్యమయంగా వ్రాయటం ప్రయోగంగా ప్రారంభమయింది. స్వయంగా ఒక కావ్య రచనం చేసే మహాకవిత్వ దీక్ష తీసుకోగలిగినవారు మాత్రమే ఇటువంటి ప్రక్రియలను ప్రచారంజకంగా, సత్యసుందరంగా, శివంకరంగా రాయగలరు. జ్ఞానాందకవిగారు క్రీస్తు ప్రబంధం రాసినా, స్వీయ జీవిత చరిత్ర రాసినా పఠితల మనసులకు విసుగు పుట్టించనిదీ, ధారామధురమైనదీ, గతివైవిధ్యం గలిగినదీ అయిన కవితాశక్తి ఉండటంచేత నిరాఘాటంగా పట్టింది బంగారం చేయగలుగుతున్నారు.

ఒకటిమాత్రం నిజం. బలమైన శైలి ఉన్న కవి ఏ ప్రక్రియనెత్తుకున్నా దాన్ని తన శైలితో సన్మానిస్తాడు. ప్రక్రియ నారాధించే కవి దాని కనుకూలంగా తన శైలిని మలచుకుంటాడు. ఈ రెండు రకాల కవులూ సాహిత్యంలో రెండు విధాల సాహిత్యానుభూతులను సృష్టించగలుగుతారు. ఆ రెండు తెగలలో ఎవరు గొప్ప అనే చర్చకు అంతు ఉండకపోవచ్చు. మొదటి తెగకు శ్రీనాథుడు, రెండవ తెగకు ప్రబంధ పరమేశ్వరుడు ప్రాచీన సాహిత్యంలో ప్రతినిధులుగా నిలుస్తారు. జ్ఞానానందకవి ఈ మొదటి మార్గానికి చెందినవారు.

అయితే, ఈ మార్గంలోని బలమైనా, బలహీనతైనా కవిశైలిమీద ఆధార పడి ఉంటుంది. జ్ఞానానందకవిగారి కవితలోని శబ్దార్థ మాధుర్య గుణం ఏ ప్రక్రియలో ఆయన రచన చేసినా ఆస్వాదనీయత్వాన్ని అలవోకగా కలిగిస్తుంది. అది వారి కవితలోని బలం. ఎన్ని ప్రక్రియలు నిర్మించినా, ఎన్ని పాత్రలు మాట్లాడినా అన్నీ జ్ఞానానంద కవిగారే పలుకుతున్నట్లుంటాయి. ఇది కొందరి దృష్టిలో బలహీనత; మరికొందరి దృష్టిలో బలం. కావ్యమంతా కవివాగ్వ్యాప్తిలో గండూషించినట్లుండటం కావ్యంలో కవిశైలికి ప్రాధాన్యమిచ్చే సాహితీ విమర్శకుల దృష్టిలో ఉత్తమ లక్షణం!

జ్ఞానానందకవి గారిని జాషువా కవిగారితో పోల్చి హెచ్చుతగ్గులు చెప్పే వారున్నారు. బోయి భీమన్నగారితో పోల్చి వ్యాఖ్యానించే వారున్నారు. దానికి కారణం వారిరువురు రచించిన కావ్యరచనా ప్రక్రియలకు కొన్ని ఛాయలవంటివి జ్ఞానానంద కవిగారు నిర్మించటం. జాషువా కవిగారిలాగా క్రీస్తు జీవిత కావ్యం రాయటం ముఖ్యంగా పతితకు కొట్టవచ్చినట్లు కనపడే సామ్యం. భీమన్న గారిమీద 'పాలేరు నుండి పద్మశ్రీ వరకు' గ్రంథం శ్రీమతి హైమవతిగారు రచించారు. అయితే 'కూలీ నుండి కళాప్రపూర్ణ వరకు' అని 1988లో జ్ఞానానంద కవిగారొక గ్రంథం వెలువరించారు ఎంత కాదనుకున్నా పోలికలు పరిశీలించకుండా ఉండ లేనట్లు ఈ రచనలు వచ్చాయి రహస్య మేమంటే- జాషువా, భీమన్నల రచనలు ఆయా మార్గాలలో జ్ఞానానందకవి రచనలు రాకపూర్వమే ప్రసిద్ధికెక్కి ఉన్నాయి. వాటిని మించి వెలుగొందటం జ్ఞానానందకవిగారి ఆ రెండు గ్రంథాలకు సాధ్యం కాలేదనుకుంటాను. అసలు అటువంటి పోటీ శీర్షికల గ్రంథాల జోలికిపోవటం అన్ని వేళలా అంత లాభదాయకం కాదు

వాటికంటె మెచ్చుకోతగింది మరొక అంశం ఉంది. మన సాహిత్యంలో దళితవాద కవిత్వం ఇప్పుడు బలంగా వస్తోంది. ఎన్నో గళాలు వినిపిస్తున్నాయి. వాటిల్లో పద్యంలో బలంగా పలుకుతున్న గళం జ్ఞానానంద కవిగారిదే. అందులో అనుమానం లేదు. వినండి-

''కులములతోడ సత్ప్రతిభ గొల్చెదు నేటి యుగాన కూడ క
ర్షులు గలరమ్మ! వారల యనూన మహాప్రతిభా వివేచనా
కలనకు లేదు రక్షణము గంపెడు పిల్లలు కల్గుదాన! ఓ
తెలుగులతల్లి నీవెటుల తీర్చెదొ యార్చెదొ, యీ సమస్యలన్!"

1993లో వెలువడిన వారి 'ఆహ్వానము' ఖండకావ్య సంపుటి దళితవాద స్పృహను స్పష్టంగా వ్యక్తం చేస్తోంది. దాశరథిగారన్నట్లు - 'కలమెత్తినా, గళ మెత్తినా, జ్ఞానానంద కవి, జనావళిని అలరిస్తారు.' *

(ఆంధ్రభూమి 1.4.1994)

# అపార్థంలో పుట్టే నవార్థం

'రాఖీపూర్ణిమ ఈ వరానన; శరద్రాకా సుధాపాత్ర మీ
రేఖాచిత్రము; రాగమోహన కళాశ్రీ స్ఫూర్తి ఈ మూర్తి; వై
శాఖీ సుందరి సత్య మీ రమణి; ఏ సౌఖ్యమ్ము నాకోసమై
లేఖాదూతికయై గడించినది ఈ లేమన్, హిమానీరమన్.'

ఇది ప్రాచీన కవి రాసిన ప్రబంధ పద్యం కాదు. ఆధునిక కవి డాక్టర్ బోయి భీమన్న మూడు దశాబ్దాల క్రితం ముచ్చటగా చెప్పిన ప్రణయపద్యం.

1965 లో వెలువడిన శృంగార లేఖాకావ్యం 'రాగవైశాఖి'లో నాయకుడు నాయికను తొలిచూపులో వర్ణించిన తొలకరి పద్యం. ఆ లేఖాకావ్యానికే శ్రీకారం చుట్టిన నాందీ పద్యం. వైశాఖపూర్ణిమకు మరొక శృంగార వైభవాన్ని సాహిత్య రంగంలో సమకూర్చిన సరసపద్యం. రసిక హృదయాలలో రాగ పూర్ణిమలు పర్వ సుందరంగా పొంగించిన శృంగార పద్యం. మరలా మొన్న వైశాఖపూర్ణిమ నాడు ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాంగణంలో భీమన్నగారి గొంతులో మంద్ర మధురంగా పలికింది. 'రాగవైశాఖి' రెండవ ముద్రణం ఆవిష్కరింపబడింది మే 25 వ తేదీ సాయంకాలం

'రాగవైశాఖి' వెలువడిన కొత్తల్లో రసికలోకాన్ని ఒక ఊపు ఊపింది. దానికి ముఖ్య కారణం అందులోని వస్తువు. నాయకుడు కవి, నాయిక సంస్కారవతి. ఇరువురిలో రగిలే రతిజ్వాల. తమ కోరిక శారీరకమా, మానసికమా, ఆధ్యాత్మికమా అన్న మీమాంస. ఆ మూడింటినీ ముడివెయ్యాలన్న ముచ్చట. ఉత్తరాలలో కవితలవంటి మాటలు; నెత్తురును పులకింపజేసే తనూసంగ రాగ వీచికలు, వాస్తవాన్ని కాల్పనికంగా చిత్రించే కవితాభావ విహంగ విహారాలు, మట్టిని కస్తూరిగా పరిమళింప చేసే ఆధ్యాత్మిక ప్రేమ చర్చలు. ఆత్మీయతను ఆత్మనాయకంగా ఆవిష్కరించే మధుర శృంగార లేఖా తరంగిణి వస్తువు. అందులో సెక్సుకున్న భూమ్యాకర్షణ శక్తి ఉంది; కాల్పనికతకున్న ఊహాంచల శక్తి ఉంది; జీవితాన్ని తాత్త్వికంగా వ్యాఖ్యానించే ఆలోచనామృత దీప్తి ఉంది.

ఈ రచన విచిత్ర మిశ్ర ప్రక్రియ. నాయకుడు, నాయిక సహజసాహితీ నిర్మాణ రక్తులు కాబట్టి పద్యాలు, పాటలు వారి భావోద్వేగ స్థితిని వ్యక్తం చేస్తాయి. ఇందులోని వచనం వచన కవిత్వం కాదు కాని, కవిత్వం వంటి వచన రచనం. అందువల్ల లేఖా స్వరూపంలో జాలువారినా నవలకంటె విలక్షణంగా మూర్తికట్టి కావ్యంగా రూపొందింది. పది పూర్ణిమల పేర్లతో పది అధ్యాయాలు సాగటం విశేషం. పూర్ణిమ సమగ్ర కళానుభవానికి ప్రతీకగా ప్రసిద్ధి చెంది ఉన్నా ప్రణయజీవితంలో ప్రేయసీప్రియులు పరిపూర్ణ ప్రేమను శరీరాలతో, మనస్సులతో అనుభవించే అనుభూతికి పూర్ణిమ ఈ కావ్యంలో ప్రతీక. నాయికానాయకుల ప్రణయ రస పరిపూర్ణ అద్వైత సిద్ధికి వైశాఖ పూర్ణిమ కళాప్రతీక!

వైశాఖి వివేకవతి. ప్రేమానుభూతిని నిత్యనూతనంగా జీవితంలో పండించుకొనే ఒక పరిపూర్ణత కోసం జీవితాన్ని ఏకాంతంగా గడుపుతున్న ఆదర్శవాది ఆమె మొదట్లో. ఆమెకు నాయకుడు మొదటి లేఖ రాస్తాడు. ఆమెకు రోహిణిలో మృగశిర ప్రవేశించినట్లయింది. ఆ వింతఅనుభూతి ఆమెలో ఆలోచనలు రేపింది కూడా!

"అయితే - మొదట్లో ఇలాంటి అనుభవాలే పొంది, ఏవేవో ఆనందాలను ఊహించుకొని, శరీరాలు కలుపుకున్న ఎంతోమంది స్నేహితురాండ్రను ఎరుగుదును నేను. వాళ్ళంతా ఇంచుమించు నా వయసువాళ్ళు. ఈనాడు శవాలు, వట్టి జీవచ్ఛవాలు."

"ప్రేమ, ఆరాధనం, అనుభూతి, ఆనందం నిత్యనూతనంగా, సుస్థిరంగా ఉండాలంటే అమలిన శృంగారం ఒక్కటే మార్గమని, శరీరాన్ని అనాఘ్రాత పుష్పంగా ఉంచుకోక తప్పదనీ నేను అనుకోటానికి ఇదే కారణం.''

''ఇంటికి నిప్పంటించుకోవడమే ప్రేమించినవాడికి శరీరాన్ని ఇవ్వటం తరచు.''

"మనకు శరీరాలు వద్దని నేను అన్నదందుకే'' - అంటుంది నాయిక.

నిత్యనూతనమైన ప్రేమానుభవాన్ని పొందలేని భార్యాభర్తలు జీవచ్ఛవాలలాంటి వారనీ, నేటి సంసారాలు ఇంటికి నిప్పంటించుకున్న చందంగా ఉన్నాయనీ, అటువంటి సంసారంలో పడిందానికంటె ఆడది అనాఘ్రాత పుష్పంలా ఉండటమే ఉచితమనీ, ప్రేమ మనసుల పరకే ఆగి శరీరసంగమ స్పృహలేకుండా

ఉండే అమలినశృంగార మార్గం ఒక్కటే అనుసరింపదగిందని నాయిక భావిస్తూ ఉండేది.

నాయిక తనయందు అనురక్తురాలై తానామెను పొందాలంటే ఆమె మనసులో ఉన్న అమలిన శృంగారభావాన్ని పారద్రోలాలి అందుకని తన తర్కాన్నంతా ఉపయోగించి తన శృంగార వాదాన్ని రూపొందించాడు నాయకుడు.

"ఆత్మ కావాలా? శరీరం కావాలా? అని కదూ నీ ప్రశ్న?....భావకవుల అమలిన శృంగారభావం నీదాకా ఎలా వచ్చిందో? శరీరాలు కలవకుండా వట్టి మానసిక ప్రేమతో ఆత్మ తృప్తి పడదు. మనః పరిధిని దాటి, హృదయాన్ని ద్రవింపజేసి, శరీర పీఠను మీటి, జీవితాన్ని రాగరంజితం చేసుకోగలిగిందే సమగ్రంగా వికసించిన ప్రేమ సెక్సు లేకుండా ప్రేమ ఫలించదు శృంగారంగా; ప్రేమ లేకుండా సెక్సు ఫలిస్తుంది సంసారంగా. సెక్సు పూర్తిగా శారీరకం; ప్రేమతో కూడినప్పుడు అది అమృతం అవుతుంది. అదే శృంగారం. శృంగారం మలినమూ కాదు; అమలినమూ కాదు. అదొక ఆనంద రసానుభూతి. ద్వంద్వాతీత పరమస్థితి అది."

"అమలిన శృంగారభావం శారీరక బలహీనతలు కల కేవలం భావుకులది. తాచెద్దకోతులు వాళ్ళు....హృదయపూర్తిగా, ఆత్మశుద్ధితో చేసిన ఏ పనికీ మాలిన్య దోషం లేదు. శరీరాన్నిచ్చి ఆత్మను దాచుకోవచ్చు. ఆత్మను ఇచ్చి శరీరాన్ని దాచుకోవడం అసాధ్యం, అనవసరం కూడా!" - ఇదీ నాయకుని తర్కం. ఇది నాయికకు నచ్చుతుంది. ఈ సిద్ధాంతాన్ని అమలుపరిచే స్త్రీ - రాగవైశాఖి.

రాగ వైశాఖిలో నాయికానాయకులు సెక్సుకంటె, సంసారంకంటె, ప్రేమ గొప్పదని భావిస్తారు. సెక్సు వలన సుఖం కలుగుతుందని, సంసారం దాన్ని స్థిరీకరిస్తుందనీ, ప్రేమ ఆనందాన్ని అందిస్తుందనీ తెలుసుకుంటారు. అందువలన సెక్సులేని సంసారాన్నీ, సెక్సులేని ప్రేమనూ వారు ఊహించలేదు. జీవితంలో కామం - ప్రేమ రెండూ తృప్తి పొందితేనే పరిపూర్ణత అని జీవన తత్త్వాన్ని దర్శిస్తారు.

అయితే, వారు అనుసరించే ప్రేమ అమలిన శృంగార భావాన్ని కాదనటం వల్లనే సిద్ధిస్తుందనుకోవటం, అసలు అమలిన శృంగారభావానికి మూలమైన

మలిన శృంగారభావం శాస్త్రీయం కాదనటం రాగవైశాఖిలో నాయికానాయకుల తర్కవితర్కాలలో కనపడుతుంది. నాయికానాయకులు రాగవైశాఖిలో అమలిన శృంగారం గురించి మాట్లాడుతుంటే నాకు ఇంగ్లీషులోని 'క్రియేటివ్ మిస్ అండర్‌స్టాండింగ్' (Creative misunderstanding) జ్ఞాపకం వచ్చింది.

ఒక రచయిత ఒక సిద్ధాంతం ప్రతిపాదిస్తే, మరొక రచయిత దాన్ని తన కిష్టమొచ్చినట్లుగా అర్థం చేసుకొని దానిమీద వివిధ ప్రయోగాలు చేయటం, కల్పనలు నిర్వహించటం జరగవచ్చు. దాన్ని క్రియేటివ్ మిస్ అండర్‌స్టాండింగ్ అంటారు. 1935 ప్రాంతంలో వెలెరీ (Velery) అనే విమర్శకుడు దీనికి పేరు పెట్టాడు. ఆ తరువాత హెరాల్డ్ బ్లూమ్ దానికి ఆంగ్ల సాహిత్య విమర్శలో వ్యాప్తి కల్పించాడు. దాన్ని తెలుగులో చెప్పుకుంటే 'అపూర్వసృష్టికి మూలమైన అపార్థం' అనాలి, లేదా 'అపార్థంలో పుట్టే నవార్థం' అనాలి.

ఒకసారి అన్ద్రె బ్రెటన్ (Andre Breton) ఫ్రాయిడ్ (Freud) తో మాట్లాడుతూ అధివాస్తవికవారు లందరూ ఫ్రాయిడ్ మానసికశాస్త్ర సిద్ధాంతాల లోని అవ్యక్త చైతన్య ప్రవృత్తి పరిశీలనాంశాల నుండియే తమ సాహిత్యోద్యమ సిద్ధాంతాన్ని రూపొందించుకొన్నారని చెప్పాడట. ఆ మాటలకు ఫ్రాయిడ్ ఆశ్చర్యపడి తన సిద్ధాంతాన్ని పూర్తిగా అపార్థం చేసుకున్న అవివేకు లెవరంటే అధివాస్తవిక వాదులనే చెప్పాలి అన్నాడట. అది నిజమేనని గ్రహించినా, అపార్థం కూడా సాహిత్యానికి అనర్థం కలిగించటానికి బదులు అపూర్వమైన మరొక సృష్టిని ప్రసాదించిందని చెప్పటంలో అనుమానం లేదు

రాయప్రోలువారి అమలిన శృంగార రస వాదాన్ని రాగవైశాఖిలోని నాయికానాయకు లిద్దరూ వారికి తోచిన అర్థంలో వాడుకున్నారే కాని రాయప్రోలు వారు చెప్పిన పద్ధతిలో చూడలేదు. అమలిన శృంగారాన్ని అపార్థం చేసుకోవ టంలో నాయికానాయకులు కృతకృత్యులయ్యారు. అయితే, వారి అపార్థమే రాగవైశాఖిలోని వారి ప్రేమ సిద్ధాంతానికి ప్రాతిపదిక కావటం విశేషం. అమలిన శృంగార భావంలో స్త్రీ అనాఘ్రాత పుష్పంగా ఉండాలని రాయప్రోలు చెప్పలేదు. నాయిక భావించిన అమలిన శృంగారభావం ఒక అపార్థం. దానివలన ఆ సిద్ధాంతం తెలిసినవారు నాయికమీద జాలి ప్రకటించి, ఆమె అనుసరించిన అమలిన శృంగా రాన్ని అర్థం చేసుకొనటానికి యత్నిస్తారు. అదొక కొత్త రుచి. అపార్థంలో పుట్టిన నవార్థం.

అమలిన శృంగారభావం శారీరక బలహీనతలు కలవారు - అంటే అసమర్థులు, నపుంసకులు మొదలైనవారు - కేవలం భావించుకొనేది కాని, సెక్సు శక్తి ఉన్న పురుషులు సమర్థించేది కాదని రాగవైశాఖి నాయకుడు వ్యాఖ్యానించటం అమలిన శృంగారానికి అపార్థంతో కూడిన వక్రభాష్యమనే చెప్పాలి. ఏమైనా ఆ క్రియేటివ్ మిసండర్ స్టాండింగ్‌లో నుండి రాగవైశాఖి శృంగార సిద్ధాంతం పుట్టింది. అదొక విచిత్రం జరిగింది.

'రాగవైశాఖి' కామ ప్రేమ తత్త్వాలను శోధించిన కావ్యం. ''సెక్సుకూ, సంసారానికి ఏ స్త్రీ అయినా చాలు, ఏ పురుషుడైనా చాలు. ప్రేమించటం అతి లోకసుందరం. ప్రేమస్థాయిలో పెళ్ళాడి, ఆ తర్వాత కూడా ప్రేమను అదే స్థాయిలో నిలుపుకొని తరించగల పూర్ణత్వం ఎవరికుంది? ప్రేమ ఆధ్యాత్మికం. పెళ్ళి లౌకికం. అందుకే ఈ రెంటికీ సంబంధం ఉండకూడదంటాను నేను. ఉంటే సామాన్యుల విషయంలో ప్రేమ దెబ్బ తింటుంది" అంటాడు నాయకుడు.

నవనీతం లాంటి ఈ నీతి సుధను సేవిస్తున్న రాగవైశాఖి నాయికానాయకులు పూర్ణత్వం కోసం పూర్ణిమలను ఉపాసిస్తున్నారు నిజమే ప్రేమ స్థాయిలో పరిపూర్ణత చెందటానికి కూడ సెక్సు ముఖ్యమనుకుంటే, అది లేకుండా ఆధ్యాత్మికం లేదనుకుంటే పరిపూర్ణత్వం ఒక కాల్పనిక వాస్తవంగానే జీవితంలో మిగిలిపోతుందేమో!

''జడ ప్రకృతికి అనుభవం లేదు ఆ మీది జంతు ప్రవృత్తికి అనుభూతి ఉందిగాని, దానికి పరమజ్ఞత లేదు. ఆమీది పూర్ణపురుష ప్రవృత్తికి పరమజ్ఞత ఉంది. పూర్ణపురుషుడు పురుషోత్తముడయ్యే దశ ఇక్కడ ప్రారంభమౌతుంది. అక్కడ పుడతాడు కవి. పరమానుభూతి మెట్టుమీద పుడతాడు కవి!" - ఇవి నాయకుడు చెప్పే సూక్తులే ఆధ్యాత్మికంగా ఎంతో విలువైన మాటలు!

అయితే అమలిన శృంగారాన్ని అపార్థం చేసుకున్నా కలిగే అనర్థం ఏమీ లేదు కాని పూర్ణపురుష, పురుషోత్తమ, పరమానుభూతులు అపార్థాలకు గురి కారాదు. అయినా, శృంగారంలో అపూర్వసృష్టి జరుగుతూనే ఉంటుంది! అదొక రంగుల హరివిల్లు! *

(ఆంధ్రభూమి 10-6-1994)

# కోనసీమ కవికోకిల

జనవరి 28 వ తేదీన అమలాపురంలో ఒక మంచి సాహిత్యసభ జరిగింది. 'కోనసీమ కోకిల'గా పేరొందిన డాక్టర్ వక్కలంక లక్ష్మీపతిరావుగారు 'కాంతి జలపాతం' అనే వచన కవితా సంపుటిని వారి సతీమణి శ్రీమతి వక్కలంక సీతాదేవి గారికి అంకిత మిచ్చారు. ఆ కావ్యావిష్కరణ - అంకితోత్సవానికి అమలాపురంలోనూ, కోనసీమలోనూ ఉన్న సాహితీమూర్తులు ఎంతోమంది వచ్చారు. వక్కలంకవారి మొక్కవోని సాహితీ వ్యక్తిత్వంమీద అపారమైన గౌరవాన్ని ప్రదర్శించారు. నేనుకూడా ఆ సభలో పాల్గొన్నాను. కోనసీమ అందాలతో పాటు ఆ సీమకోకిల కల కవితాగీతాన్నికూడా విన్నాను.

వక్కలంకవారు మూడు తరాల పఠితలను ప్రభావితులను చేశారు తమ కవితలతో. వీర భారతము, పారిజాతము వంటి ప్రౌఢ పద్యకావ్యాలు రచించి విశ్వనాథ తరాన్ని మెప్పించారు. నర్తనశాల వంటి నాటకాలు, స్వతంత్రభారతి వంటి గేయకావ్యాలు, రాధికా ప్రణయంవంటి పాటల సంపుటులు రచించి, గేయ కవితా కవులలో ఒక విశిష్టతను సంపాదించుకొని మరొక తరాన్ని ఆకట్టు కున్నారు. ఇప్పుడు వచన కవితా రంగంలో కూడా 'కాంతి జలపాతాన్ని' దూకించి మరొక తరాన్ని మెప్పిస్తున్నారు. పద్యం, గేయం, వచనం- ఈ మూడిం టినీ ముగ్ధమోహనంగా నడవగలిగే శక్తి వక్కలంకవారి కలానికి బలంగా ఉంది. వాహిక ఏదైనా అందులో స్పందించే కవితయే వారికి ముఖ్యం.

''పద్యమైన గేయంబైన వచనమైన
నెడఁద స్పందింపఁ జేయునదే కవిత్వ
మిది యెఱుంగరు చట్రమునే గణించి
చిత్తరువు చెల్వ మరయని రిత్తజనులు"

అని అన్నారు పాఠికేళ్ళకిందే. విశేష - మేమంటే వక్కలంకవారి రచనల్లో చిత్తరువు అందాన్ని జీవింపజేసే చట్రం (అంటే రూపం) అమరటం సర్వత్రా గమనింపదగిన సాహిత్య శిల్పం!

వక్కలంకవారి రచనలు దాదాపు 50 దాకా ఉన్నాయి. రేడియోలో ఇప్పటికీ వారి పాటలు కొత్త రుచులతో శ్రోతలను ఆకట్టుకుంటున్నాయి!

సంగీత రూపకాల రచనలో వక్కలంకవారు తెలుగువారి హృదయాలలో ఒక విశిష్ట స్థానాన్ని పొందారు. కోనసీమ ప్రాంతంలో వక్కలంకవారి పాటలు చాల మంది రసికుల గుండె గొంతుకలు ఆలపిస్తూంటాయి ప్రత్యేకించి రాధికా ప్రణయాన్ని రవళింపజేసే గీతికలు వక్కలంకవారి మధుర కవితకు వేణు నాదాల్లాగా తెలుగువారి హృదయాలను రంజింపజేస్తున్నాయి.

తిరుపతి వేంకటకవుల కాలంలో శతాధిక గ్రంథరచనం ఒక గొప్పగా గుర్తింపబడేది అప్పటి కవులు శతాధిక గ్రంథకర్తృత్వం ఒక మహాకవి లక్షణంగా భావించారు. అయితే సంఖ్యకంటె సారం ముఖ్యమని కాలం చెప్పిన తీర్పు. వక్కలంకవారు సారాన్ని కాపాడుకుంటూనే సంఖ్యను పెంచుకున్నవారు. సంఖ్యను ఒకే ప్రక్రియలో కాకుండా వివిధ ప్రక్రియలలో విస్తరించటంవల్లా, ప్రతి ప్రక్రియలోనూ ప్రతిష్ఠను సంపాదించి పెట్టే రచనలు చేయటంవల్లా వక్కలంకవారి సాహిత్యజీవితం ఎప్పుడూ వాడిపోకుండా పరిమళిస్తూ ఉంది పారిజాత సౌరభంలా. ఏఱు పదులు దాటినా ఎప్పుడూ మాసిపోని దుస్తులతో సహజ సౌకుమార్యాన్ని, సౌందర్యాన్ని సంరక్షించుకుంటూ సరస కవితా వినోదంగా సంభాషణలు చేస్తూ సాహితీ సరసత్వాన్ని పరిసరాలకు పంచిపెట్టే సంస్కారం వారి కవితాశైలిలో సజీవంగా ప్రతిఫలిస్తూ ఉంటుంది. వారి కవితలో అందరినీ ఆకర్షించే ఆత్మీయతకూడా అదే.

వక్కలంక వారి రచనలలో ఇప్పటికే సాహిత్యచరిత్రలో గణనీయమైన స్థానాన్ని గణించుకున్న కావ్యం 'వీరభారతము'. నవ్యసంప్రదాయ ప్రయోగాలలో అది పాతకొత్తల మేలుకలయిక. భారత స్వాతంత్ర్యోద్యమ చైతన్యాన్ని కావ్య వస్తువులో ధ్వనింపజేసే చారిత్రిక కావ్యాలు రాయటం నవ్యసంప్రదాయ కవులు సాధించిన ప్రత్యేకతలలో మొదట లెక్కింపదగినది. రాణా ప్రతాపసింహ చరిత్ర, శివ భారతం, ఝాన్సీ లక్ష్మీబాయి వంటి కావ్యాలు ఆ శాఖకు అస్తిత్వాన్ని, విస్తృతినీ కలిగించిన ప్రయోగాలు. ఆ వరుసలో వక్కలంక లక్ష్మీపతిగారి 'వీర భారతము' స్వీయవ్యక్తిత్వంతో నిలువగలిగిన విలువైన కావ్యం.

కథా సూత్రం చెడిపోకుండా అన్ని వివరాలతోనూ ఆఖ్యాన పద్ధతిలో చెప్పే విధానం పాటించిన కావ్యాలు శివభారతంలాంటివి. కథను రమణీయ రసవత్తర ఘట్టాలుగా చిత్రించే అధ్యాయాలుగా అమర్చి, కావ్యాన్ని రమణీయ

సన్నివేశ సంవిధాన సంపుటిగా అమర్చే శిల్పాన్ని అనుసరించినవి సౌందర నందము వంటి కావ్యాలు. వక్కలంకవారు చారిత్రిక కావ్యానికి సౌందరనందం వంటి నిర్మాణ సౌందర్యాన్ని సంతరించి నవ్యతను సాధించారు.

వక్కలంకవారికావ్యం రాసే కాలానికి తెలుగులో పద్యగేయ కావ్య ప్రక్రియలలో ఆధునికంగా కూడా అనేక ప్రయోగాలు వెలువడ్డాయి. పద్యంలో గానీ, గేయంలోకానీ కావ్యాన్ని నిర్మించగల దక్షులు శ్రీ లక్ష్మీపతిరావుగారు. కాని, ఆ రెండింటిని కలిపి ఒక విశిష్ట సమన్వయంతో పాటు ఒక వినూత్న ప్రయోగాన్ని సాధించారు. నవ్య ప్రయోగాన్ని తెలిసి చేసిన ప్రౌఢకవి కాబట్టి ఇలా అన్నారు-

"మమ్మనుసరించి శాస్త్రమ్ము మాఱుఁగాక
కావ్యసంతతిబట్టి లక్షణముకాని
లక్షణము బట్టి కావ్యముల్ ఘనత గనునె?"

పాశ్చాత్య భావదాస్యానికి ప్రతీకగా జయచంద్రుణ్ణీ, అంతఃకలహాలను అనురాగ సూత్రంతో అంతమొందించే స్నేహ త్యాగ శక్తులకు ప్రతినిధిగా సంయుక్తనూ, స్వాతంత్ర్య వీరోచిత పోరాటానికి ప్రతినిధిగా పృథ్వీరాజునూ వక్కలంకవారు వీర భారతంలో చిత్రించారు చాందుకవిని స్వాతంత్ర్యోద్యమ చైతన్య ప్రేరక శక్తిగా రూపొందించారు. నవ్యసంప్రదాయశాఖకు శ్రీ లక్ష్మీపతి రావుగారు అందించిన అపూర్వ ప్రయోగం వీర భారతం.

అలంకారంతో వస్తువును ధ్వనించటం వక్కలంకవారి కావ్యశిల్పం. పృథ్వీరాజుపైగల విరోధంతో జయచంద్రుడు మహమ్మదుగోరీతో స్నేహం చేసి కూతురుమీది పగ సాధించుకోదలచుకుంటాడు ఈ కథార్థాన్ని చిత్రించే అష్టమా శ్వాసం ఇలా మొదలౌతుంది:

"లోక బాంధవుఁ గన్న సుశ్లోక యయ్యుఁ
దోకచుక్కను బ్రసవించెఁ దూర్పు దిక్కు!
త్యాగులను గన్న కడుపున స్వార్థపరులఁ
బరమ విద్రోహులం గాంచె భరతధాత్రి!"

ఇది కథకు సంబంధిస్తే అలంకార వస్తు ధ్వనులు స్ఫూర్తి. విడిగా చదువుకుంటే నేటికీ నిజమైన రమణీయార్థ సూక్తి! అడుగడుగున వక్కలంకవారు పద్య

కావ్యాలలో నిక్షేపించే భావి కథార్థ వ్యంజక రచనా చమత్కారాలను విశ్వనాథ వారే వేనోళ్ళ పొగిడారంటే వక్కలంక వారి పద్య కవిత్వానికి మరొక పతక మవసరంలేదు

పద్య కవిత్వంలో వక్కలంకవారు అలంకారాన్ని ఎంత ఒదుపుగా వాద గలరో వచన కవిత్వంలో ప్రతీకను, భావచిత్రాలను అంత పొంకంగా వ్యక్తీక రించగలరు. కాంతి జలపాతంలో చెట్టు, చీకటి దీపాలు, కాంతి జలపాతం, తుది మజిలీ, ఆకాశానికి జబ్బు చేసింది మొదలైనవి మంచి కవితలు. జీవితంలో అవిచ్ఛిన్నతకు చెట్టును గుర్తుగా చిత్రించారు :

''నేను పుడితే చూడాలని
నేను పుట్టకముందునుంచీ
మా గుమ్మంలో కనిపెట్టుకుని
ఉందట ఈ చెట్టు'' అని మొదలుపెట్టిన ఆ కవిత—

''చెట్టుకి మనిషిమీద వల్లమాలిన ప్రేమ
అందుకే—
మనిషి చస్తే అతనితోపాటు
చెట్టుకూడా కాలిపోతుంది!'' అని ముగుస్తుంది.

ఈ మధ్య 'వెలుగు నీడలు' అనే పద్య కావ్యం భగవంతుని కందిస్తున్న జీవుని వేదనలా రచించారు. దాదాపు అర్ధ శతాబ్దిగా ఆగకుండా ప్రవహిస్తున్న కవితా జలపాతం డాక్టర్ వక్కలంక!

భార్యకు కృతినిచ్చి ప్రణయమూర్తిని ఆరాధించే రసిక కవి పండితులు కొద్దిమందే ఉంటారు ఒకప్పుడు డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు అటువంటి అంకిత సభ చేశారు. మొన్న డాక్టర్ వక్కలంకవారు ముచ్చటగా సభ జరిపారు. కవితలాగా స్త్రీ కూడా నాకు ఉపాస్య శక్తి అని ప్రకటించిన 'కోనసీమ కవి కోకిల'కు ఆంధ్రభూమి అభినందనలు! *

(ఆంధ్రభూమి 25-2-1994)

# వీధికెక్కిన పాతబస్తీ

"తెలుగువారికి ఒక్క దినపత్రికయు లేదు
నిజమైన వార్త లందించ గలది;
నిస్స్వార్థపరుడైన నేత ఒక్కడు లేడు
కులమత ప్రాంత దుర్గుణములేని:
ఉత్కోచ మడుగని ఉద్యోగి లేడు ఏ
అధికారి కార్యాలయమున గాని;
అధికారమునకైన ఆందోళనలె కాని
ప్రజలగో డెవరికి పట్టదసలు;

మైకులను బట్టి వేసెడి కేకలెల్ల
వీధిజ్యోస్యులు చెప్పు భవిష్యవాణి
పత్రికలను చదివి జబ్బు పడితి వీవు
చదువకుండగ నేను స్వస్థతను గంటి."

ఈ పద్యం ఎవరిదో వేరుగా చెప్పవలసిన పని లేదు. ఉత్పల సత్యనారాయణాచార్యులు గారు తప్ప ఇలాంటి పద్యం రాసే కవి యిప్పుడు లేడు. ఇది తిట్టు కవిత్వం కాదు; నైరాశ్య కవిత్వంకాదు; అధిక్షేపాత్మకంగా వెలువడ్డ వ్యంగ్య కవిత్వం. అంటే సెటైర్. సంఘంలో నిత్యం చూస్తువ్న జనజీవన వేదనను చురక పెడుతున్నట్లు చెప్పే చాటు చమత్కారకవిత ఉత్పలవారికే ఈ యుగంలో చెల్లింది. అధిక్షేపం ఆగ్రహించి వడతిట్టినట్లుండదు. యేడిపించి చక్కెర పెట్టి ఓదార్చినట్లుంటుంది. వ్యంగ్యంగా - వక్రంగా వ్యాఖ్యానం చేస్తున్నా కవికి ఒక దురుద్దేశంగాని, ఒక రంగద్దాల చూపు గాని, ఒక బలమైన బలహీనతగాని లేదని తెలిసినపుడు లోకం అతని నిజాయితీని మెచ్చుకొని హర్షించి ఊరుకుంటుంది. ఉత్పలవారి ఉక్తి చమత్కారమంతా ఆగ్రహం తెప్పించని అధిక్షేపంగా, వ్యథ కలిగించని వ్యంగ్యంగా, కన్నీటిని పన్నీరుగా మార్చినా కటుత్వం కనిపించని కవిత్వంగా జాలువారుతుంది. అందువల్లనే దినపత్రికలను అధిక్షేపించినా

వాటికి కోపం రాదు. కాని, ఈ పద్యం ఈ కాలాన్ని గురించి కాలాంతరానికి అందిస్తున్న నిజమైన వార్తగా గుర్తించినప్పుడు గుండె గుభేలుమనకమానదు!

మార్చి నెల 25వ తేదీన ఉత్పలవారు రాసిన 'పాతబస్తీ విలాసము' అనే పద్యకృతి ఆవిష్కరింపబడింది. అది ఆధునిక 'వీథి'. పదునాల్గవ శతాబ్దంలో వినుకొండ వల్లభరాయడు పద్యంలో 'వీథి' రాసి ఓరుగల్లు జనజీవితానికి అమృతత్వాన్ని కల్పించాడు. ఉత్పలవారు జంటనగరాల జనజీవితాన్ని వీథిలో చరిత్ర కెక్కిస్తున్నారు. వల్లభరాయని కాలంలో వీథిలో నుండి జనజీవితాన్ని చూచి రాశాడు కవి. ఉత్పలవారి కాలంలో వీథిలోపడ్డ బ్రతుకును 'వీథి'గా చిత్రిస్తున్నారు. 'ఈ జంట నగరాలు హేమంత శిశిరాలు' 1971 లో వెలువడిన వీథి; 'పాతబస్తీ విలాసం' 1994 లో వెలువడిన వీథి. ఒకదానికి మరొకటి అనుబంధంగా ఉందదగినవి. పాతబస్తీ మొన్న వెలువడ్డా పదిహేనేళ్ళ క్రితమే వ్రాయబడింది. అయినా, ఆనాటికీ, నేటికీ బస్తీ బ్రతుకులో మార్పులేదు కాబట్టి ఇది సమకాలీన రచనగా చెప్పుకోవచ్చు,

ఈ వీథిలో కవికి పున్నయశాస్త్రి చెలికాడు. కవి వక్త, పున్నయశాస్త్రి వ్యాఖ్యాత. శాస్త్రిగారి నోట ఈనాటి పాతబస్తీ స్వభావంలోని అధిక్షేపయోగ్యమైన ప్రవృత్తి బయటపడుతుంది. పాతబస్తీ క్షేమంగా ఉందా అని అడగటానికి 'వీథి దాదాలు క్షేమమా?' అని అడుగుతాడు మిత్రుడు.

> ''స్త్రీలను ఒంటిగా నెట చరింపగ నీయక ఇండ్ల కెప్పుడున్
> తాళము వేయనీక తమ తావు వసించెడి గేస్తురాంధ్ర అం
> దాలకు నెల్లనుం బసుపుదార మొకండె మిగుల్చు వీథి దా
> దాలకు క్షేమమే కద! సదా మన నేతల పోషణమ్ము నన్.''

పాతబస్తీకి, మతకల్లోలాలకూ, అల్లర్లకూ, కర్ఫ్యూలకూ, బందులకూ, దొమ్మీలకూ, దోపిళ్ళకూ ఒక అవినాభావ సంబంధం ప్రజల హృదయాల్లో శాశ్వతంగా నిలిచిపోయింది. ఈ అనుభూతికి కారకులైన రాజకీయ నాయకులనూ, వారి పోషణలో పెచ్చుపెరుగుతున్న వీథి దాదాల ఆగడాలనూ ప్రజలు మరిచిపోలేదు. పాతబస్తీలో సాగే ఈ వీథి నాటకమే ఉత్పలవారి 'వీథి' కావ్యంలో వెలుగులోకి వచ్చింది వ్యంగ్యధోరణిలో.

ప్రభుత్వ కార్యాలయాల మీద ఒక పెద్ద విమర్శ - కొరడా దెబ్బలాగా ఛెళ్ళున మ్రోగుతుంది. ఆఫీసరును చూడటానికి మిత్రులు కార్యాలయం చేరతారు. బిళ్ళజవాను బింకంగా ఇలా జవాబిస్తాడు మిత్రులు తెల్లబోతారు.

"వెళ్లుడు రేపు వచ్చి కనిపింపుడు, ఇయ్యది లంచివేళ ఒ
క్కచోట నుండరాదు, దొరగా రిపుడిప్పుడె రారటంచు ఆ
బిళ్ళజవాను చెప్పి పనిపెన్ మము; పెద్దధికారి లంచికిన్
వెళ్ళిన నింక వచ్చునె కవీ! కథ కంచికి చేరినట్లగున్."

ఆఫీసులన్నీ, ఆఫీసర్లు అందరూ ఇలా ఉంటారన్న వాస్తవం కాదు ఇందులో గణింపదగింది. ఎటువంటి ప్రభావాన్ని ప్రభుత్వ కార్యాలయాలు ప్రజల హృదయాల మీద వేస్తున్నవో తెలియజెప్పటమే ఈ అధిక్షేప కవితలోని అంతరార్థం.

బస్తీలలో వీథులు రద్దీకి మారుపేర్లు; ప్రమాదాలకు క్రీడారంగాలు. ఈ అనుభవం ఈనాడు కాదనలేని సత్యం. అయితే, ప్రమాదాలను వర్ణించినా, కవితలో ప్రమోదాన్ని అందించే చమత్కారం ఉత్పలవారి వ్యంగ్యోక్తికి సహజాలంకారం. బస్తీలో మనుషుల్లో రౌడీలు, శకటాల్లో రౌడీలు మరువలేనివంటాడు కవి అధిక్షేపాత్మకంగా—

''స్కూటరు వచ్చి సైకిలిని గుద్దెను స్కూటరుబండి నప్పుడే
ఆటో ఒకండు గ్రుద్ది హతమార్చెను, ఆటోను బస్సు గ్రుద్దె ద
బ్బాలున లారి పైనబడి బస్సును రూపడగించె వీథి పో
రాటమునందు నిప్పటికి లారిని మించిన రౌడి లేదిలన్.''

జడ వస్తువుపై మానవారోపణం రూపకాలంకారంలో ఒక వైచిత్రి. లారీని రౌడీగా దర్శించి రూపించిన చమత్కార గౌరవం ఉత్పలకే దక్కుతోంది!

పాతబస్తీ పూర్వవైభవాన్ని స్మరించి, నేటి స్థితిని దర్శించి మనకొక శిథిల శిల్పాన్ని సానుభూతి కలిగేటట్లు చిత్రించి నిలుపుతారు ఉత్పలాచార్యులు:

''ఈ పాతబస్తి ఎన్నేండ్లదో కాలంపు
గడిదొంగ దోపిడి పడిన యిల్లు
ఈ పాతబస్తి ఎన్నేండ్లదో సొంపారి
లొత్తుబుగ్గల ముది పొత్తుటాలు

ఈ పాతబస్తి ఎన్నేండ్లొ విరియబూచి
పురుగుపట్టిన గులాబుల పొలమ్ము
ఈ పాతబస్తి ఎన్నేండ్లొ యెండి చివికి
రంగింత చెడని నారంగ ఫలము

వీథులవి సందు గొందులై వీటిపోయె
సభ్యతాసభ్యతలు నొక్క చక్కి నొదిగె
జీవకళ లిప్పటికిని శేషించినట్లు
శిథిల గృహముల జిల్లేడు చెట్లు మొలచె.''

పాతబస్తీలో ఒక నాగరకత నాజూకుగా మేలిముసుగుల్లో పెరిగింది. అత్తరు వాసనలు గుబాళించింది. కాని, మతకల్లోలాలతో మానవత్వాన్నే మంట కలిపే మారణ హోమంగా మారింది. దానిని కవి మనోనేత్రంతో దర్శించి మథన పడ్డాడు:

''నలువం ద్రిచ్చట మానవత్వమును మంటం గల్పి గగ్గోలుగా
ఎలుగెత్తించిన ఘోర దుర్ఘటన లెన్నెన్నో! మతోన్మాదిని
మలిన క్రూర కరానిచే నిట గులాం యాసీం కవిశ్రేష్ఠు గుం
డెలర క్త మ్మది మొండిగోడలకు చిందెన్ లోకమల్లాడగన్.''

కన్నీరును, పన్నీరును కలిపి తయారుచేసిన ఒక కొత్త రసాయనం ఈ కావ్యం. వీథిలో మిత్రులు చూచిన చోట్లన్నీ శృంగార వీథుల్లాగానే గోచరి స్తాయి. కాని, శృంగారం వెనుక ఒక బీభత్సం కూడా జనజీవన వేదనలో జ్వాలగా మండుతూనే ఉంది. కవి కంటికి రాసిక్యం, రామణీయకం అడుగడు గునా కనపడుతున్నా రాజకీయం, రాక్షసత్వం వాటిమీద నల్ల బురఖాలా వేలాడు తూనే ఉన్నాయి. ఈనాటి వీథి స్వభావం ఇది.

ఉత్పలవారి 'పాతబస్తీ విలాసం' వినోదయాత్రా విలాసం కాదు- 'విషాద జన జీవిత విలాసం.' "పాత బస్తి ఇద్ది బాగు చేయక యున్న, నగరజీవితమ్ము నాశనమ్ము, కల్లుపాక నిప్పు చల్లార్పకుండిన, యజ్ఞశాల కద్ది అంటుకొనదె'' అని కవి హెచ్చరించాడు. "జీవుడు హిందువ? ముస్లిను?" అని ప్రశ్నించాడు-

"అన్నలు తమ్ములై యిచట హైందవులున్ మరి ముస్లిముల్ స్వదే
శోన్నతి కుద్యమింప దగియుండును గాని, మతాల మార్పిడుల్,

కన్నెరతో పరస్పర జిఘాంసలు, హింసలు కక్షతోడ తా

మున్నటువంటి యింటిని సముద్ధతి ధ్వంసము చేయఁజూతురే!'

అని ప్రబోధించాడు.

అధిక్షేప కవిత్వం వ్యంగ్యోక్తిలో, వక్రోక్తిలో, స్వభావోక్తిలో, చమత్కారోక్తిలో ముత్యంలా మెరుస్తూ ముచ్చట కొలిపిస్తుంది. మొత్తినట్లు చెప్పినా ముద్దుగా ఉంటుంది. వేమన మార్గం కంటె మరొక వింత పుంతను చూపిస్తుంది. అయితే, అది నీతినిగాని, ప్రబోధాన్ని గాన్ని సూటిగా చేస్తే దాన్ని ప్రజలు సూటిగా, ఘాటుగా తీసుకోకుండా చమత్కార చాటువుగా గ్రహించే అవకాశం కూడా లేక పోలేదు.

పీఠి వెటకారం చేస్తుందే కాని, వెలుగుబాట చూపించలేదు. ఉత్పల వారి పీఠి చమత్కారానికి, భక్తిశతకం పారవశ్యానికి ప్రసిద్ధి. కావ్యకళకు ఉత్పల వారు చాటు కవితా మాధుర్యాన్ని, హాస్యరస జీవితాన్ని, కరుణరస మార్దవాన్ని అందించారు. జంటనగరాలకు అభినవ వల్లభరాయలు ఉత్పల! *

(ఆంధ్రభూమి 15-4-1994)

# నడుస్తున్న పద్యం శ్రీ వేముగంటి

సిద్ధిపేట పేరు తలచుకోగానే నాకు ముగ్గురు మహనీయులు జ్ఞాపకం వస్తారు. ఒకరు - సాహితీ వికాసమండలి అధ్యక్షులు శ్రీ వేముగంటి నరసింహాచార్యులు. మరొకరు - ప్రసిద్ధ కళాకారులు డాక్టర్ కె. రాజయ్య. మూడవవారు శ్రీ సత్యసాయి సేవాసమితి అధ్యక్షులు శ్రీ సిరికొండ వెంకటరావు. ఆ ముగ్గురూ మూడు రంగాల్లో ఆ పట్టణానికి ఒక విశిష్టమైన గుర్తింపును తెచ్చారు.

మెదకు జిల్లా సాహిత్య చైతన్యానికి 'అభినవ తల్లావఝ్ఝల' లాగా కృషి చేస్తున్న సాహితీమూర్తి శ్రీ వేముగంటి వారికి నెల 30వ తేదీన 65వ జన్మ దినోత్సవం. ఈ యేడు వారి సాహితీ జీవితానికి స్వర్ణోత్సవం. తెలంగాణంలో పద్యం నేటికి బ్రతికి ఉందంటే దాశరథి, వానమామలై, వేముగంటి వంటి ఎందరో మహానుభావులు కారణం. సాహితీ వికాసమండలి వేముగంటివారు కవితా వ్యాప్తికి పెట్టిన కళాక్షేత్రం, సాహిత్య చైతన్యంకోసం నడిపిస్తున్న సేవా క్షేత్రం. సిద్ధిపేట ప్రాంతానికి ఆచార్యులు గారొక వైతాళికులు; నిరాడంబరమైన వారి జీవితం కడచిన యాభై యేళ్లుగా సాహిత్య సేవకు అంకితమై సాగుతోంది. సాహితీ వికాసమండలి 1960 లో స్థాపింపబడింది. అదే 1964 లో 'మెదక్ జిల్లా రచయితల సంఘ' స్థాపనకు నాంది పలికింది. ఈ రెండింటికంటె ముందు తెలంగాణా రచయితల సంఘం, ఆంధ్ర సారస్వత పరిషత్తు, సాహిత్య అకాడమీ మొదలైన సంస్థల కార్యకలాపాలను మెదకు జిల్లాలో వ్యాపింప చేసిన సాహితీ కృషీవలుడు, ఈనాటికీ సిద్ధిపేట సాహిత్యాచార్యులు శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు.

వారిని గురించి కీ. శే. అబ్బూరి వరద రాజేశ్వరరావుగారన్న మాటలు ముందుగా నాకు జ్ఞాపకం వస్తున్నాయి: "రాయప్రోలుతో ప్రారంభమైన ఆధునిక కవితా పారంపర్యంలో శ్రీ నరసింహాచార్యులు ఆఖరివారుగా నిలుస్తారని నా ఆశయం" అని అన్నారాయన. వారి హృదయాన్ని అంతగా ఆకర్షించారు శ్రీ వేముగంటి. ఆధునిక కవితా పారంపర్యమంటే ఆధునిక పద్యకవితా సంప్రదాయమనియే అబ్బూరివారు భావించి ఉంటారు. ఎందుకంటే, వేముగంటివారి 'భావ తరంగిణి' (పద్య కవితా సంపుటి) కి ముందుమాట రాస్తూ అబ్బూరివారు

ఇప్పుడు పద్య కవిత్వం రాసి మెప్పించటం సాహసమేనని అన్నారు. ఆచార్యుల వారి పద్య రచనను ప్రశంసించారు.

నేటి తెలుగు సాహిత్య స్థితిమీద కీ. శే. అబ్బూరివారి అభిప్రాయం అంత ఆశాజనకంగా లేదు. ''తెలుగు సాహిత్య చరిత్రలో ప్రస్తుతం నడుస్తున్నది సందిగ్ధ కాలం. భాషాసాంకర్యంవల్లా, భావ సాంకర్యంవల్లా తెలుగుసాహిత్యం- అందులోనూ కవిత్వం - విభిన్న రీతుల్లో పతనోన్ముఖంగా పరిణమిస్తోందని అనుమానం కూడా కలుగుతుంది కేవలం నవ్య ప్రయోగాన్వేషణలో ఛందస్సుపై సదవగాహన లేకుండా కవిత్వాన్ని ఛందోరహితంగా రాయటంలోనే నవ్యత్వం స్ఫురిస్తుందనుకునేవారు యీనాటి అధిక సంఖ్యాకులయిన రచయితలు. భావమే ప్రధానమనీ; భాష కానీ, ఛందోగతమైన స్ఫూర్తి కానీ ప్రధానం కాదనీ వీరు భావిస్తున్నారనుకుంటాను. లేకపోతే నేటి కాలపు కవిత్వంలో యింత అరాచకం చోటు చేసుకునేది కాదు." పద్య సంప్రదాయాన్ని అభిమానించే అబ్బూరివారి మాటలు వచనకవులకు నచ్చవు కాని, ఆధునిక కవిత్వం మీద ఇటువంటి అభిప్రాయం గల దృక్పథాన్ని మాత్రం స్పష్టంగా పరిచయం చేస్తున్నాయి. శ్రీ వేముగంటివారుకూడా అబ్బూరివారి అభిప్రాయాన్ని ఆదరించేవారే.

"తొలకరిగుండె చిన్కులు చిన్కులై రాలి
పుడమిపై వాగులు పోయునపుడు
మలిసంజె వెలుగు గుత్తులు గుత్తులై మింట
కావి తోరణములు గట్టునపుడు
చీకటి చూపులు రేకులు రేకులై
చుక్కల పూలు విచ్చుకొనునపుడు
వలపుటామని గొంతు పాటలు పాటలై
జీవుల పులకింపజేయునపుడు
ఎందుకో నా యెదంద పొంగెత్తిపోయి
ముగ్ధభావ ప్రపంచముల్ పుక్కిలించు
ఎందుకో నాదు బ్రతుకు స్పందించిపోయి
కోటి వీణా నినాదముల్ గ్రుమ్మరించు."

ఈ పద్యం కాల్పనికయుగ చైతన్యాన్ని పుక్కిలిస్తోంది. ఇంత అందంగా భావాన్ని మలచి పద్యం చెప్పగలిగిన కవులు తెలుగులో ఇప్పుడు కొద్దిమందే ఉన్నారు. ఆచార్యులవారి అభివ్యక్తికి ఆధునిక పద్య రచనలో ఆదరణీయమైన స్థాన ముంది.

నాటికీ నేటికీ పద్యప్రక్రియలను మాత్రమే పోషిస్తూ తమ ప్రత్యేకతను నిలుపుకుంటున్నారు ఆచార్యులవారు. పద్యాన్ని భావకవితాయుగ స్వభావానికి అనుగుణంగా దిద్దితీర్చే ఒక కళారేఖ వారి శైలికి అలవడింది. దానితో ఆ యుగ కవులు వివిధ ప్రక్రియలలో ప్రపంచించిన ప్రవృత్తులను ఆచార్యులవారు పద్యం లోనే ప్రకటించే పద్ధతిని స్వాయత్తం చేసుకున్నారు. ఎలాగంటే - కాల్పనిక యుగకవులు తమ పద్య, గేయ ఖండ కావ్యాలలో మూడురకాల ప్రవృత్తులను ప్రధానంగా ప్రదర్శించేవారు అవి వివిధ మానసికావస్థలను (states of mind) వ్యక్తం చేసేవి; భావోద్వేగావస్థలను (moods) వ్యక్తం చేసేవి; స్థిరమైన కొన్ని సిద్ధాంతాల నాధారం చేసికొని వెలువడే స్వభావావస్థలను (Attitudes) వ్యక్తం చేసేవి. ఈ మూడు రకాల కవితలను పద్య ఖండకావ్యాలలోనే వెలువరిందటం శ్రీ వేముగంటివారి ప్రత్యేకత. ఈనాడు ఇటువంటి శాఖలో కృషి చేస్తున్నవారి సంఖ్య కూడా గణింపదగినంతగా ఉంది. వారిలో ఆచార్యస్థానం వేముగంటివారిదే.

భావగీతాలు పాడినా ఐదుగువారి రాగాలు పల్లవించే రచనలు చేయలేక పోయినా నన్న విషాదయోగాన్ని ఆచార్యులవారు 'అంతర్వాణి'లో వినిపించారు.

"వెదురు కట్టను పిల్లన గ్రోవిగ నొనర్చి
తీయతీయని స్వరము లూదితిని గాని
మూగ బ్రతులలో స్నిగ్ధ రాగ మధుర
గీతికా జాలములను పల్కింపనైతి."

ఇది కవిగారి స్వీయ మానసికావస్థను తెలుపుతోంది. ప్రకృతిని వర్ణిస్తూ అందులోని వస్తువుల వివిధ మానసికావస్థలను మానవత్వా పాదన (Personification) శిల్పంతో వ్యక్తీకరించటం ఆచార్యులవారి రచనా స్వభావం. ఈ పద్యం దానికి హృద్యమైన ఉదాహరణం. వస్తువు విజయదశమి వర్ణనం.

"నిన్న మొన్నటిదాక కన్నులు విచ్చని పచ్చ
చేమంతి బంగారు చీరగట్టె
మూణ్ణెల్లుగా నిద్రపోవుచుండిన విష్ణు
డొక్కింత ప్రక్కకు నొత్తిగిల్లె
గర్జించి, మిన్నెల్ల గారించి ప్రావృట్టు
చల్లగా, మెల్లగా జారిపోయె
ఇరుగుపొరుగులను విరిపోటు గావించు
కన్నెవాగు బ్రతుకు సన్నమయ్యె

పచ్చపచ్చని చిగురాకు పాన్పులందు
మేలుకొన్నట్టి ప్రకృతి శోభాలతాంగి
మబ్బుపట్టిన ఆకాశమంటపమున
అమల చంద్రికా క్షీర భాండములు దించె."

మహాకవి దాశరథిమీద రాసిన స్మృతికవితా ఖండికలో భావోద్వేగస్థితిని తెల్పే బలమైన పద్యాలను వెలువరించారు శ్రీ వేముగంటివారు. మచ్చుకొకటి-

''దాశరథీ! విశిష్ట కవితాశరథీ! సమతాసుధీ! సుధా
పేశల మానసా! సకల పీడిత మానవకోటికై విశా
లాశయ నిష్ఠతోడ నిఖిలాంధ్రము నొక్కముడిం బిగింప ఆ
వేశము పొంగులెత్త వినిపించితి వెన్నియొ పద్యగేయముల్"

'సంక్రాంతి హేల'ను వర్ణిస్తూ జాతీయతను, సమతను, మమతను ప్రజలకు ప్రబోధించే దేశభక్తి ప్రవృత్తిని ప్రకటిస్తారు శ్రీ ఆచార్యులవారు :

''సన్నాయి ఊదుట చాలదు స్వీయ
జాతీయత కూపిరు లూదవలయు
గంగెద్దు లాడించు కార్యమే చాలదు
స్వేచ్ఛా ప్రవృత్తి సాధింపవలయు" అని ప్రబోధించారు.

భావకవితా చ్ఛాయలు కొన్ని పద్యాలలో పండించుకున్నా శ్రీ వేముగంటి వారు ప్రధానంగా సంప్రదాయవాది. వారి తిక్కన కావ్యం స్థిరయశస్సును తెచ్చిపెట్టింది. వీరపూజ, ఆంధ్రవిష్ణువు, భక్త రామదాసు మొదలైన కావ్యాలు వారి కవితా శక్తికి వైజయంతికలుగా నిలిచాయి. మహాకావ్యం రాసే యత్నం దాశరథిలా వీరూ చేయలేదు. అయితే, భక్తి కవితలు, ఖండకావ్యాలు అనేకం రచించారు. శ్రీ వాసర సరస్వతీ వైభవము వాటిలో ఉత్తమమైనది. వారికెన్నో పురస్కారాలు వచ్చాయి. అన్నీ పద్యానికే వచ్చినట్లు ఆచార్యులవారు పరవశించి పోతారు.

సాహితీ వికాస సమితి కవితోద్యమం కోసం, ముఖ్యంగా పద్యరచనోద్యమం కోసం పుట్టిన సంస్థ. దానికి అధ్యక్షులైన శ్రీ వేముగంటివారు పద్యం కోసం ఉద్యమాన్ని నడుపుతున్న చైతన్యమూర్తి. ఆయన అర్ధశతాబ్దిగా నడుస్తున్న పద్యం! ఆ ప్రస్థానం ఆగకుండా మరో అర్ధశతాబ్దం ముందుకు సాగాలని 'జీవియస్ కాలమ్' మనసారా కోరుతోంది. జన్మదిన శుభాకాంక్ష లందజేస్తోంది! *

(ఆంధ్రభూమి 29.7.1994)

# పద్యంలో పలికిన భారతీయత

''నే నొక కాంతిరేఖ నయి నిచ్చలు చీకటి కొట్లలో పరా
ధీనత నున్న జీవులకు దివ్వెగ మారగ నెంచుచుందు, స
న్మాన పథమ్ముగా దలతు నా ద్యుతి తత్త్వము సార్థకమ్ముగా
మానవ తామసాంధతను మాన్పునదెప్పుడొ విశ్వవీథిలో.''

'తెలుగు లెంక' తుమ్మల సీతారామమూర్తి చౌదరిపేర ప్రారంభించిన సాహితీ పురస్కారాన్ని కొద్ది రోజుల క్రితం చీరాలలో అందుకున్న డాక్టర్ కసిరెడ్డి వెంకరెడ్డి 'చైతన్యశ్రీ'లోని పద్య మిది. పద్యంలో మహాత్ముని చరిత్రను, రాష్ట్ర ప్రబోధ కవితను రచించి తెలుగువారి హృదయాలలో చెరగని ఒక గౌరవ స్థానాన్ని సంపాదించుకొన్న సాహితీమూర్తి తుమ్మల. వారి స్మారక సాహిత్య పురస్కారం పద్య కవితకు ఇవ్వటం సముచితం. పద్యాన్ని ప్రబోధానికీ, ప్రజ్ఞానానికీ, ఆవేశానికీ, ఆలోచనకూ, సమ్మానానికీ, సంభాషణానికీ హృద్యంగా, ప్రసన్నంగా ప్రయోగించి ఔచిత్యానికి జీవితం కల్పించిన ఉపజ్ఞామూర్తి తుమ్మల.

డాక్టర్ కసిరెడ్డి వెంకటరెడ్డి పద్య కవిత్వంలోకూడా తుమ్మలవారి కవితా స్వభావానికి సంబంధించిన జాడలు కొన్ని కనపడుతూ ఉండటంవల్ల పురస్కార ప్రదానంలో ఒక మంచి ఒరవడి ఏర్పడింది. కసిరెడ్డి పద్యకవితకు ప్రబోధ లక్షణం ప్రాణ చైతన్యం. భారతీయ ఏకాత్మతాభావంలో వారికున్న నిబద్ధత జాతిని మేల్కొల్పటానికి - జాతీయ భావాలను చైతన్యవంతం చేసి ఉద్యమ స్ఫూర్తిగా రూపొందింపజేయటానికి వారి కవితాభివ్యక్తిని ప్రధానంగా ముందుకు నడిపిస్తూ ఉంటుంది.

''స్వర్గమునకన్న జననియు జన్మభూమి
మిన్న యన్నట్టి ఆర్షోక్తి మీరకుండ
అనుదినమ్మును నడిచెడి అన్నలున్న
ఉగ్రవాదమ్ము హింసయు నుర్విపీడు''

అన్నది డాక్టర్ కసిరెడ్డి దృఢనిశ్చయం దాని కనుగుణమైన వారి భావజాలాన్ని బలమైన ప్రబోధ కవితాభివ్యక్తితో ఆవిష్కరించటం కసిరెడ్డి కవితకు జీవితం.

"సౌందర్యమ్మను పంచిపెట్టవలెరా! సౌజన్య భావమ్ముతో
బందూకుల్ మన మధ్య స్నేహమును సంబంధమ్ములన్ ద్రుంచురా
బందూకున్ మరపించిపోయె కుల మబ్బా! దీని ఊసేలరా!
ముందేగాలను దీక్ష ఉన్న కుల నిర్మూలాసికై రమ్మురా!"

ఉగ్రవాదాన్నీ, హింసనూ ఎంత తీవ్రంగా నిరసిస్తారో కసిరెడ్డిగారు కుల వ్యవస్థ పేరుమీద సాగే వేర్పాటు ధోరణులను గూడా అంత తీవ్రంగా తిరస్కరిస్తారు. గోవధను మాన్పించే ఉద్యమమంటే కసిరెడ్డిగారికి అభిమానం. డబ్బుకోసం గోమాంసాన్ని గల్ఫ్ దేశాలకు ఎగుమతి చేసే పద్ధతిని వ్యతిరేకించే ప్రబోధ కవిత వారి కలం నుండి శక్తిమంతంగా వెలువడింది :

"నిను నన్ను బ్రతికించ నిఖిలమ్ము నర్పించు
గోమాత కోసేటి క్రూరు లెవరొ!
తనదు సర్వస్వాన ధాత్రి సారము నింపు
గోమాత నమ్మేటి కుటిలు లెవరొ!
మన పిల్ల జల్లకై తన పిల్లలను ఇచ్చు
గోమాత కూల్చేటి క్రుద్ధు లెవరొ!
మన పాడిపంటకై మమతనే కురిపించు
గోమాత దూరేటి క్రోధు లెవరొ!

యంత్రవధశాలలో చంపి అర్థదృష్టి
గల్ఫు దేశాల కమ్మేటి అల్పులార!
ఏది అమరమొ మరి యేది కాదొ తెలిసి
వ్యవహరించుడు జ్ఞాన సంపన్నులగుడు!"

భారతదేశంలో గోమాత లౌకిక ఆధ్యాత్మిక దృష్టులతో గౌరవింపబడుతుంది. భూమినీ, గోవునూ తల్లి తరువాత తల్లిగా భావించే సంస్కృతి మనది. దేశద్రోహ మెటువంటిదో గోమాత వధ అటువంటిదని ధార్మికుల అభిమతం. వారిమనసును కవితలో ప్రబోధ రూపంలో చిత్రించారు డాక్టర్ కసిరెడ్డి.

సమకాలీన రాజకీయ, ఆర్థిక, సామాజిక పరిస్థితులమీద కనిరెడ్డికి కచ్చిత మైన జాతీయ భావాలున్నాయి. వాటిని నిర్మొగమాటంగా కవితా వస్తువులుగా ఎన్నుకొని సూటిగా వ్యక్తీకరించటంలో ప్రబోధ కవితా లక్షణాలను ప్రదర్శి స్తారు వారు. 'ఎవ్వడ నేను?' అనే ఖండ కవితలో తాను భారతీయుడనని పేర్కొంటూ, కాశ్మీరంనుండి కొందిశీకులై కడగండ్ల పాలౌతున్న ప్రజల సమస్యను ఆత్మాశ్రయ ధోరణితో ఆవిష్కరించారు. ఈ పద్యం దానికి మచ్చు తునక —

''అది కాశ్మీరము నాది, నే నిపుడు నందందుండగా లేక, బూ
డిదమై పూసితి భిక్షమెత్తుకొన తండ్రీ! తల్లి! నే వచ్చితిన్
వదన మ్మెందును ముట్కరించుకొని సంబంధంబు సౌజన్యమున్
తుదముట్టింతువు, రేపొ మాపొ మరి నీ దూర్తత్వమే చచ్చెడున్.''

ప్రబోధ కవిత్వంలో ఏదైనా సమస్యను వస్తువుగా ఎన్నుకొంటే అది వాడిగా, వేడిగా వెలువడుతుంది. తుమ్మలవారి ఆంధ్ర రాష్ట్ర సమస్య అప్పుడు ఒక ప్రత్యేకమైన బాణీని కల్పించింది. ఈ రోజు కనిరెడ్డిగారికి భారతీయుల అస్తిత్వ సమస్య ఉద్యమ సమస్యగా మారింది. అందువలన ఆ సమస్యకు చెందిన వివిధాం శాలే ఈ సంపుటిలోని కవితాఖండికలకు వస్తువులుగా ఎన్నికగావటం సహజమై పోయింది. సమస్యను తుమ్మలవారిలాగా ఆవేశంతోనూ, ఆలోచనతోనూ ఆవి ష్కరింపగలిన శక్తులు కనిరెడ్డి కలానికి జవసత్త్వాలుగా అమరాయి.

''ఇది నా దేశ మటంచు చెప్పుకొనగా నెంతేని వాంఛించితిన్
ఇది నా సంస్కృతియంచు చాటుకొనగా నెంతేని భావించితిన్
ఇది నా ధర్మమటంచు చూపుకొనగా నెంతేని యోచించితిన్
పెదవుల్ విప్పగనీక కుట్టిరిట! ఓ స్వేచ్ఛా ధరిత్రీ సతీ!"

అత్యవసర పరిస్థితులలో కవి పడ్డ ఆవేదనకు ఈ పద్యం అక్షర సాక్ష్యం!

డాక్టర్ కనిరెడ్డి వెంకటరెడ్డి భక్తిభావంలోనూ, ప్రశంసాపద్ధతిలోనూ, అధిక్షేపమార్గంలోనూ, ప్రకృతివర్ణనా వైఖరిలోనూ జాతీయతా భావాన్ని, భార తీయ సమైక్య చైతన్యాన్ని రంగరించి వ్యక్తీకరిస్తారు. దానివలన వస్తువుకు ఆర్ద్రత, ఒక వైశిష్ట్యం ఏర్పడతాయి. మాతృభూమిని ప్రేమించే ప్రవృత్తి, భగవంతుని ముందు మోకరిల్లే పద్ధతి ఈ పద్యంలో ప్రతిఫలించింది.

"పుట్టిం దిచ్చట, పెర్గ టిచ్చటను, పెంపొందేది ఇచ్చోటనే
గిట్టే దిచ్చట, మట్టిగా నిచట, సంక్లిష్టాలు సంతాపముల్
నెట్టే దిచ్చట, స్వర్గవాసముగ తీర్చే దిచ్చటన్, తోషముల్
చెట్టాపట్టలువేసి పంచవలెనో శ్రీ సిద్ధ రామేశ్వరా!"

ఈ గడ్డలో పుట్టి ఈ మట్టిలో కలిసిపోయేవారందరూ ఒకటే. వారందరికీ చెట్టాపట్టలు వేసుకొని నడిచే ఏకాత్మతాభావాన్ని అందించుమని శ్రీ సిద్ధ రామేశ్వరుణ్ణి కోరుతున్నాడు కవి. నాలుగు పాదాలలోని ఎత్తుగడలు ఉక్తికి వ్యావహారికశక్తిని సమకూరుస్తూ శతక కవితా శిల్పాన్ని వెలారుస్తున్నాయి.

38 కవితాఖండికలుగల చైతన్యశ్రీ కవితలు కవి భావజాలంలోని ప్రధాన ముఖాలను ఆవిష్కరిస్తున్నాయి. శిల్పకళారహస్యాలమీద అభిమానం, తెలుగు సాహిత్య చరిత్రలోని వెలుగులమీది గారవం, అస్పృశ్యతా నివారణంమీద అభిమానం, నూతన వత్సరాలకు ఆహ్వానం పలికే అభినివేశం, మద్యపాన వ్యతిరేక భావోద్యమం, భారతీయ చరిత్ర సంస్కృతులమీద ఆత్మప్రత్యయం, భారతీయ సమైక్యతమీద చిత్తశుద్ధితో కూడిన ఆచరణాత్మకశీలం డాక్టర్ కసిరెడ్డి కవితకు పురస్కార గౌరవాన్ని కలిగించాయి. పద్యంలో పలికిన భారతీయత కసిరెడ్డి కవిత!

"అందరు నొక్కటే యనుచు నాడెడు మాటలు చాల ప్రాతవే
ముందుకు వచ్చి ఆచరణము న్నొనరించెడువారు లేకనే
కొందరు పెద్దలైరి మరికొందరు వారికి దాసులైరి, ఆ
చందము మాన్పగా దగును స్వాగత వాక్యము పల్కగా దగున్." *

(ఆంధ్రభూమి, 14-1-1994)

# అభినవ ప్రబంధ పరమేశ్వరుడు

''కత్తి కంటెను కలం గొప్పదని
మత్తుగ వ్రాసే రచయితలారా!
కూత కంటెను వ్రాత గొప్పదని
వ్రాతకంటె మరి చేత గొప్పదని
వాస్తవ మెరిగి వ్రాయండి!'' (గర్జించే ముబ్బులు)

ఈ మాట నోటితో అనటమే కాకుండా, కవితగా వ్రాయటమే కాకుండా, చేతలలో చేసి చూపిస్తున్న మానవీయమూర్తి డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి గారు. 1992 ఆగస్టు 23 వ తేదీన షష్టిపూర్తి మహోత్సవం చేసుకుంటూ త్వరలో ప్రతి సంవత్సరం 50 వేల రూపాయల పురస్కారాన్ని అందించే ఒక పథకాన్ని ప్రారంభిస్తానని వాగ్దానం చేశారు. ఈ సంవత్సరం 62 వ జన్మదినోత్సవం జరుపుకుంటూ ఆ వాగ్దానాన్ని నిలువబెట్టుకున్నారు. సాహితీవేత్తకు ఇరవై అయిదువేల రూపాయలు, కళావేత్తకు పదిహేనువేల రూపాయలు, ఇంజనీరింగ్ విద్యార్థికి పదివేల రూపాయలు బహూకరించే ఉండేల విజ్ఞాన కళాపీఠ పురస్కారాలను ఆంధ్రప్రదేశ్ గవర్నర్ మాన్యశ్రీ కృష్ణకాంత్‌గారి చేత ఇప్పించారు. మాటనిలబెట్టుకున్న మహనీయమూర్తి అనిపించుకున్నారు. ''వ్రాతకంటె మరిచేత గొప్పదని'' ఆయన నమ్మిన విలువ మరి - వారి చేతలు వ్రాతల గొప్పతనాన్ని చాటుతున్నాయి కూడా!

ఈ సందర్భంలో సహజకవి శ్రీ మల్లెమాల ఎం. ఎస్. రెడ్డిగారి మాటలు జ్ఞాపకానికి వస్తున్నాయి:

''మాలకొండారెడ్డి వృత్తిరీత్యా పేరు మోసిన ఇంజనీరు.
ప్రవృత్తిరీత్యా పేరూ, ప్రఖ్యాతి రెండూ ఉన్న కవి.
అయితే ఆయన ఇంజనీరుగా గొప్పవాడా?
కవిగా గొప్పవాడా?
అంతకంటె ముందు వ్యక్తిగా గొప్పగాడు.

పట్టుదల, ప్రతిభ ఆయనకు జీవనాడులు
కట్టుకోలే దెప్పుడూ ఆయన గాలిమేడలు.
సంస్కృతాంధ్ర సాహిత్యాలు ఆయనకు కొట్టిన పిండి.
చాలా విషయాల్లో ఆయన జగమొండి.
ఆ మొండితనం అభ్యుదయవాదానికి కూకటివేరు
అనుకున్నది సాధించేవరకూ ఆయన నిద్రపోరు.''

మల్లెమాల అన్నమాట ఉండేలవారిలో ఉన్నమాట.

డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డిగారు స్నేహమూర్తి, మానవతాస్ఫూర్తితో మాట్లాడే సహృదయశక్తి. కవితా పరిమళాన్ని విరజిమ్మే సంభాషణం వారి సహజగుణం. నాకు వారితో పరిచయం దాదాపు మూడుదశాబ్దాల నుంచి. ఎప్పుడు పలుకరించినా నవ్వుతూ, మనసువెన్నెల చిమ్ముతూ, కవితా చందనంతో సత్కరిస్తున్నట్లు ఒక అనుభవాన్ని కల్పిస్తూ ఉంటారు. నా అదృష్టం ఏమంటే మాల కొండారెడ్డిగారి బాల్యంలో, విద్యార్థి దశలో గురువులుగా ఉండి పద్య విద్యకు పదును పెట్టుకొనే బాటను చూపినవారిలో సుబ్రహ్మణ్య నామధేయు లున్నారు. శ్రీయుతులు నూకరాజు వెంకట సుబ్రహ్మణ్యంగారు వారికే కాదు - వారు పుట్టిన ఊరికే గురువు. ఆయన ప్రభావంతో మాలకొండారెడ్డిగారిలో సహజంగా పొట మరిస్తున్న సాహిత్యసౌగంధ్యం కవితాశక్తిని, రక్తిని సాధించగలిగింది. పోతన పద్యాలలోని మకరంద మాధుర్యం, మనుచరిత్రలోని ప్రబంధ సౌందర్యం, కంకంటి పాపరాజు ఉత్తర రామాయణంలోని ఉక్తి లాలిత్యం మాలకొండారెడ్డి గారిలో త్రివేణీ సంగమంగా సన్నిహితం చేసినవారు ఆ గురువులు సుబ్రహ్మణ్యులే.

ఆ తరువాత అల్లూరులో శ్రీ వెల్లటూరు సుబ్రహ్మణ్యంగారు, నెల్లూరులో 'అభినవ తిక్కన' శ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు మాలకొండారెడ్డిగారి సాహితీ వ్యవసాయానికి ఎంతో ప్రోత్సాహాన్ని అందించారు. నన్ను చూసినప్పు డెల్లా డాక్టర్ మాలకొండారెడ్డిగారు ఆ సుబ్రహ్మణ్య గురుత్రయాన్ని స్మరించు కుంటూ ఉంటారు. నాపట్ల ఏదో అవ్యక్తస్నేహ బంధుత్వాన్ని ప్రసరిస్తూ ఉంటారు. మా యిద్దరిమధ్య అక్షరమైన ఆత్మీయత ఏర్పడటానికి నా పేరు ఒక ఆలంబనం కావటం నా అదృష్టం!

డాక్టర్ మాలకొండారెడ్డిగారు ఉండేల విజ్ఞానపీఠం నెలకొల్పి, అందులో సాహిత్యానికి పెద్దపీట వేయటం వారి హృదయంలో కవితకు, సాహిత్యానికిగల

ఉన్నత గౌరవాన్ని వ్యక్తం చేస్తోంది. కళాపీఠం అందించే మొదటి సాహిత్య పురస్కారాన్ని నాకు చెందించటం వారి సౌజన్యాన్నీ, ఆత్మీయతనూ తెలియ పరుస్తోంది. నాలో రెడ్డిగారు మగ్నతతో స్నేహమూర్తినీ చూడగలరు. విజ్ఞతతో సాహితీ వ్యక్తిత్వాన్నీ దర్శించి అంచనా వేయగలరు. ఆ రెండింటి ఫలితమే నాకు కళాపీఠం అందించిన పురస్కారమని భావిస్తున్నాను. వారికీ పీఠంవారికీ నా కృతజ్ఞత లందజేస్తున్నాను.

మనిషిలోని మంచినే ఎప్పుడూ మననం చేసుకొనే మానవతామూర్తి డాక్టర్ మాలకొండారెడ్డిగారు. నేను వ్రాసే వ్యాసాలనూ, చేసే ఉపన్యాసాలనూ, అప్పుడప్పుడు పలికే కవితలను కూడా ఎంతో ఆసక్తితో పరికిస్తూ, పరిశీలిస్తూ, వాటిని చర్చల్లో ప్రస్తావిస్తూ వాటిలోని మాటలతోసహా ఉట్టంకిస్తూ నన్ను ఆశ్చర్యంలో ముంచేస్తూ ఉంటారు క్షణం తీరిక లేక పనుల ఒత్తిడిలో సతమతమయ్యే రెడ్డిగారు స్నేహితులను గురించి, వారి సాహితీ వ్యవసాయాలను గురించి తెలుసు కొనే ఓపికా, వాటిని మననం చేసుకొనే తీరికా కలిగించుకోవటం వారి సాహిత్య స్నేహాభిలాషను వ్యక్తం చేస్తుంది. మానవీయమైన విలువలమీద మాలకొండా రెడ్డిగారికున్న మహనీయమైన గౌరవమే వారిలోని ఉత్తమ వ్యక్తిత్వాన్ని ఉన్నత శిఖరాల కెక్కించింది. మన్నన నిచ్చి మన్నన పొందటం మాలకొండారెడ్డిగారి గౌరవ సూత్రం. అందువల్లనే అందరిలో అజాతశత్రువులాగా మసలుకోగలిగిన ప్రత్యేకత ఆయనకు అలవడింది. ఆయన ఉన్నచోట మానవత మంచిగంధంలా గుబాళిస్తూ ఉంటుంది.

పద్యం రెడ్డిగారి బాల్యం నుండి ఆయనలో పెరిగి ఫలాలు కాసింది; గేయం యౌవనంలో అంకురించి చిగురాకు తొడిగింది. వచనకవిత రెడ్డిగారి పరిణతితోపాటు వికసించి పూలను పూసింది. వారి 'కవితా కల్పకా'నికి మూడూ ముచ్చటైనవే.

నిర్దిష్టమైన కవితాదృక్పథంతో కలంపట్టి, కవితా ప్రస్థానాన్ని సాగిస్తున్న ఆధునిక కవులలో రెడ్డిగా రొకరు. వారన్న ఈ మాటలు గమనింపదగినవి—

"నా రచనలను నేనే విమర్శించుకొన్నప్పుడు కలిగే ఊహలు మీముందుంచు తాను; 'కళ కళకోసమే' అన్న సిద్ధాంతంనుండి కళ విశ్వశ్రేయస్సుకు అన్న నినాదం వరకు నేను పయనించాను. 'వాక్యం రసాత్మకం కావ్యమ్' - అనే సూక్తి నాకు నచ్చింది. దేశభక్తిని గూర్చి వ్రాసినా, వేదాంత తత్త్వాన్ని ప్రబో ధించినా శృంగార హాస్యరసాదులను పోషించినా, చమత్కరించినా, ఆధిక్షే పించినా- పైసూక్తిని ఒరవడిగా పెట్టుకొని రచనలు చేయడానికి ప్రయత్నించాను.

ఇతరుల మనసు నొప్పించకుండా ప్రేయసికి ప్రియుడు చెప్పినట్లుగా ధ్వని పూర్వకంగా వ్రాయడమే కవిత్వం యొక్క ప్రధాన లక్షణమని నా విశ్వాసం." లక్ష్య శుద్ధితో తెలిసి వ్రాస్తున్న కాన్షస్ ఆర్టిస్ట్ డాక్టర్ మాలకొండారెడ్డిగారు.

కవిగా మాలకొండారెడ్డిగారు పరిణామ దశలను కొన్ని దాటి వచ్చారని వారి కవితలను - విశేషించి వారి 'కవితాకల్పకము' (సంకలనం) ను చదివితే తెలుస్తుంది.

రెడ్డిగారి పద్యాలమీద ప్రాచీన కవుల పద్యబాణీల ప్రభావం మొదటి రోజుల్లో బలంగా ఉండేది. అయితే, ఏ ఒక్క కవి ప్రభావం మాత్రమో కాకుండా ప్రసిద్ధ కవుల పద్య రచనా శిల్పాలలోని నేర్పులన్నీ ఆకళించుకొని తమ రచనలలో వ్యక్తీకరించేవారు.

ఆధునిక సాహిత్యంలోని ప్రబోధ కవిత్వం, దేశభక్తి కవిత్వం, నవ్య సంప్రదాయ ధోరణి కవిత్వం, స్మృతి కవిత్వం మొదలైన శాఖలలో వెలువడిన పద్య రచనా ధోరణులు రెడ్డిగారికి కరతలామలకాలుగా నిలిచేవి. ఆయా శాఖలకు సంబంధించిన కవితలను వ్రాస్తున్నప్పుడు ఆయా పద్య ధోరణులను అదనెరిగి ఔచిత్యం పాటిస్తూ ప్రయోగించటం రెడ్డిగారి ప్రత్యేకత!

ప్రాచీన కవుల పద్యబాణీల ప్రభావం ఉన్నట్లు మొదటిరోజుల్లో అనిపించినా, క్రమంగా ఆ ప్రభావం నుండి బయటపడి తన పద్య రచనను, వాగ్వైఖరిని, శైలిని రూపొందించుకున్నారు రెడ్డిగారు. అందువలన రెడ్డిగారి పద్యం బలమైన కుదురులో పుట్టిన చెట్టు. దాని పూలు దానివి.వాటి వాసన వాటివి.

ఆధునిక కవులలో పద్య, గేయ, వచన కవితలను మూడింటిని వ్రాసి మెప్పు పొందినవారు కొంతమంది మాత్రమే ఉన్నారు. వారిలో మాలకొండారెడ్డి గారొకరు.రెడ్డిగారి పద్యం భావానికి తగినశైలిని ప్రదర్శిస్తున్నట్లుంటుంది;గేయం రక్తితో పాటు సూక్తి మాధుర్యాన్ని కూడా ప్రకటిస్తున్నట్లుంటుంది; వచన కవిత్వం వాస్తవ దృష్టితో ఆలోచిస్తూ వ్యంగ్యపద్ధతిలో వ్యక్తీకరిస్తున్నట్లుంటుంది. ప్రక్రియోచితమైన రచనాపద్ధతిని రూపొందించుకోవటం కవితాశిల్పంలో ఒక విశిష్టమైన ప్రజ్ఞ. ప్రాచీన కవులలో అటువంటి ప్రతిభను ప్రదర్శించినందుకు ఎఱ్ఱాప్రెగ్గడను 'ప్రబంధ పరమేశ్వరుడు' అని పిలిచేవారు. డాక్టర్ మాలకొండా రెడ్డిగారు ఆ కోవకు చెందినవారు- అంటే, అభినవ ప్రబంధపరమేశ్వరుడు. *

**(ఆంధ్రభూమి, 26-8-1994)**

# ముళ్ళపూడి ఒక మైలురాయి

మధ్యాక్కరకు ప్రాణం పోసింది నన్నయ; జీవించటం నేర్పింది విశ్వనాథ. భారత రచనలో నన్నయ, ఎఱ్ఱాప్రెగ్గడలు మధ్యాక్కరలను కథాకథన పద్ధతిలో ప్రయోగించి, దాని అస్తిత్వానికి ఆంధ్ర సాహిత్యంలో అంకురారోపణం చేశారు. ఆ ప్రయోగాలలోని ఛందశ్శిల్పాన్ని సమీక్షించి డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు ఇలా వివేచించారు: ''కోపము, పశ్చాత్తాపము, దుఃఖము, ప్రబోధము, ప్రార్థనము, అధిక్షేపము, విస్మయము, నింద, స్తుతి, ఉత్సాహము, రతి, సభావర్ణనము - మున్నగు పెక్కు విషయములందు అక్కర లుపయోగింపబడినవి.'' (ఆంధ్ర మహాభారతము - ఛందః శిల్పము. పు. 382)

నన్నయ తరువాత మధ్యాక్కరకు పునర్జన్మ కల్పించింది కవిసమ్రాట్టు విశ్వనాథవారే. పది శతకాలు మధ్యాక్కరలలో రచించి ఆ ఛందానికి ఆధునికమైన ఒక సజీవాభివ్యక్తిని కల్పించారు. వస్త్వాశ్రయమైన ప్రాచీన మధ్యాక్కర రచనకు ఆత్మాశ్రయమైన ఆత్మీయభావ ప్రకటనను అలవరచారు. కావ్యకథా సూత్రంలో కంటె ముక్తకంగా మధ్యాక్కర మణిదీపంలా వెలుగుతుందని నిరూపించారు. వర్ణనంలోకంటె మనసులోని వేదనను చనువుగా చెప్పుకొనే పద్ధతిలో అది వదనుగా పనికి వస్తుందని శతక ప్రక్రియలో శతథా ప్రయోగించి చూపించారు. దేవునికి చెప్పుకొనే జీవుని వేదనయే మధ్యాక్కరగా విశ్వనాథ తమ శతకాలలో రూఢి కెక్కించారు. ఇహ పరాల మధ్య సాగే ఊహల ఊగిసలాటలను పాదవిన్యాసాలుగా, వాక్యగతులుగా, అభివ్యక్తుల అలంకారాలుగా, ఉక్తి వైచిత్రులుగా జీవద్భాషలో తెలుగు తియ్యదనాలను వెలార్చే మధురాక్కరలుగా విశ్వనాథ శిల్పించారు. వచన కవిత్వం లయాత్మక సంభాషణగా జాలువారి ఒక ఛందస్సైనట్లుంటుంది విశ్వనాథ మధ్యాక్కర. మకుటం ఉంటేనే మధ్యాక్కర మనోజ్ఞంగా రూపొందుతుందనే అభిప్రాయాన్నీ, అలవాటును ఆంధ్రులకు అలవరచారు విశ్వనాథ. విశ్వనాథ మధ్యాక్కర శతకరీతికే ఒక నవ్యసంప్రదాయం.

విశ్వనాథవారి మధ్యాక్కర శతకప్రయోగాలను బాణీలుగా పెట్టుకొని తనదైన పలుకుబడితో పలికి తన ప్రత్యేకతను చాటుకొంటున్న సత్కవి

శ్రీ ముళ్ళపూడి సచ్చిదానందమూర్తిగారు వీరిప్పటికే రెండు శతకాలు రచించి యున్నారు. శ్రీ కురవి వీరభద్ర మాహాత్మ్యము (1977) మకుట విశిష్టాలైన 167 మధ్యాక్కరల రచన. క్షేత్ర దైవ మాహాత్మ్యాలను శతక సౌరభం గుబాళించే టట్లు కూర్చిన పద్యమంజరి. 'వెండికొండ పావురాలు' అనే పేరుతో వెలువడిన వెండికొండ సిద్దేశ్వర శతకం (1978) 125 మధ్యాక్కరల రచన. మొదటి దానికంటె రెండవది విశ్వనాథ మధ్యాక్కరల శతక స్వరూప స్వభావాలను విశేషంగా సంతరించుకున్నది ఇప్పుడు వెలువడుతున్న ఈ 'యాదగిరి పారి జాతం,' ముచ్చటైన మూడో మధ్యాక్కర శతకం; 175 పద్యాల రచన.

ముళ్ళపూడివారు ఈ శతకాలే కాక 'తెలుగుబిడ్డ' అనే మకుటంతో ఆట వెలదిలో ఒక శతకాన్ని (1963), 'పనిమనిషి' అనే కథల సంపుటినీ, 'మహాభి యానం' అనే కవితా సంపుటినీ (1987) రచించారు. రచనలను బట్టి చూస్తే కవిత్వంలో పద్యగేయ వచన రచనా పద్ధతులన్నీ మూర్తిగారికి కరతలామలకా లని స్పష్టమౌతోంది. కథ, నవల ప్రక్రియలు కూడా వారి రచనాపరిధిలోకి వచ్చాయి. అంటే - సమకాలీన సాహిత్య ప్రక్రియలలో వారికి అభినివేశంతో పాటు సామర్థ్యం కూడా ఉన్నట్లు విదితమౌతోంది. అయితే, ముళ్ళపూడివారి పద్యరచనల్లో వారి కవితాభివ్యక్తిని ముమ్మూర్తులా ఆకట్టుకొన్న ఛందం మధ్యాక్కర. శతకాలన్నీ చదివింతరువాత 'మధ్యాక్కర సచ్చిదానందమూర్తి గారూ!' అని వీరిని పిలవాలని నాకు అనిపించింది. వీరి జీవలక్షణానికీ మధ్యాక్కరకూ అంతటి మధుర సంబంధం ఉంది!

తెలుగునాట వెలసిన దైవమూర్తుల దివ్యత్వాన్నీ, తెలుగువారికి వారిపట్ల ఉన్న ఆత్మీయతనూ వ్యక్తం చేసేవి మధ్యాక్కర శతకాలు మనసులో ఉన్న గుట్టును మొగమోటం లేకుండా చెప్పకోటానికి ముక్తసరిగా తోడ్పడే ముచ్చటైన ఛందం మధ్యాక్కర. దీనిలో భక్తి శతకం వెలువడ్డా అది ఆత్మనివేదన రూపంగాకంటె ఆత్మ వేదన నివేదనగా ఎక్కువగా భాసిస్తుంది; తన్మయత్వం కంటె తత్పరత్వాన్ని ఎక్కువగా అందిస్తుంది; ఆలోచన కంటె ఆర్తిని అధి కంగా అంతరంగంలో నిలుపుకుంటుంది; తుకతుక ఉడుకుతున్న లౌకిక జీవన సంవేదనలో నుండి వెలువడుతున్న ఆధ్యాత్మిక చింతనమనే సెగల పొగల చిత్ర విచిత్ర గతులను తనలో ప్రతిఫలింపజేసుకుంటుంది; వాస్తవంనుండి పార మార్థికంవరకు మానవుడు చేసే తర్క వితర్కాలను సూటిగా ఘాటుగా వ్యక్తం చేస్తుంది. సచ్చిదానందమూర్తిగారి ఈ భక్తి శతకంలో ఈ లక్షణాలన్నీ సహజంగా రాణిస్తున్నాయి.

మూర్తిగారిలో ఆధునిక యుగ ప్రవృత్తిలో ఉన్న ఆధ్యాత్మికానురక్తి ఉంది; సామాజిక స్ఫూర్తి ఉంది. ఆకలి బాధ యెరుగని ధనికవర్గ నాయకునిగా భావించి యాదగిరి నృసింహస్వామిని అధిక్షేపించినట్లున్న ఈ మధ్యాక్కరకు ఆ అధిక్షేపమే అలంకారం:

"కొండ మీద గుహాంతరము కోరి కాపుర ముంటివయ్య,
వెండి తొడుగు తొడిగికొని వీరాధి వీరుని బోలె!
నెండిన డొక్కలయేడ్పు లెట్లు విన్పించునో, కడుపు
నిండిన దొరవు, యాదగిరి నిలయ, శ్రీ లక్ష్మీనృసింహ!" (పు. 7)

మాయమర్మాలు లేకుండా అమాయకంగా మాట్లాడుతున్నా వేదాంతపు మార్మికతను సన్నని మేలిముసుగులాగా కప్పినట్లు కనిపించే పద్యం-

"ఏల బంపించితివయ్య ఈ అద్దె కొంపకు నన్ను
ఖాళీ చేయమని వెగటుగ కసరుదు రటునిటు గాక
వ్రేలాడుచుంటి స్వస్థలము విడిచి వచ్చి మతిలేకిపుడు
నీలుగుచుంటి యాదగిరి నిలయ, శ్రీ లక్ష్మీనృసింహ!" (పు. 11)

కవి హేతువాదాన్ని నిరసించి, జాతీయవాదాన్ని బలపరచేవాడు. నిరసనను తర్కబద్ధంగానూ, కట్టె విరిచినట్లుగాను చెప్పగలిగిన దిట్టతనాన్ని ప్రకటించాడు మధ్యాక్కరలో:

"హేతువాదమట! అదే జయించి తీరునట! మనకొక
జాతీయత యని దేశమని సంప్రదాయమని లేవంట!
తాత లాస్తులకు మాత్రమ్ము తాను వారసుడట! వింతె?
నీతి నే డిద్ది! యాదగిరి నిలయ, శ్రీ లక్ష్మీనృసింహ!"

హింసావాదాన్ని ఖండిస్తూ అచ్చమైన వ్యావహారిక శైలిలో కచ్చెను కళ్ళకు కట్టించేటట్లు చెప్పిన మధ్యాక్కర:

"ఇళ్ళు వాకిళ్ళు పొలాలు, నిన్ని మేడలు మిద్దెలుండి
వీళ్ళ దుంపతెగ రోగమ్ము వీరల కేమి పుట్టినది?
వాళ్ళ వీళ్ళ తలలుగొట్టి వచ్చినెత్తురు త్రాగుదు రవి
నీళ్ళయిన యట్లు, యాదగిరి నిలయ, శ్రీ లక్ష్మీనృసింహ!" (పు. 20)

పారమార్థిక చింతనకు పసిడినిచ్చెనగా మధ్యాక్కరను వాడిన వైఖరి-

''చచ్చుచు బుట్టుచు మరల జచ్చుచు బుట్టుటకంటె
నచ్చిన మార్గముబట్టి నమ్మి తరించుట మేలు
అచ్చెరు వేమి? దాని కొంక హరినామ కీర్తన పనిడి
నిచ్చెన యౌను, యాదగిరి నిలయ, శ్రీ లక్ష్మీనృసింహా!'' (పు. 35)

ఈ శతకంలో అంతస్స్రోతంగా ఆధ్యాత్మిక చైతన్యాన్ని అందించిన దివ్య తేజస్సే యాదగిరి శ్రీ లక్ష్మీనృసింహస్వామి అన్న సత్యం చివరి పద్యంలో కాని మనకు స్పష్టంకాదు. ''అద్ది ఉదయాస్తమయములు లేని ఒక దివ్యబిందువు, అది నిదురలో కూడ దోచు.''

ఈ యుగంలో ఆధునిక శతకమంటే మధ్యాక్కర శతకమే. ఇంతవరకు తెలుగులో వెలువడిన వివిధరకాల శతకాల ప్రవృత్తులన్నిటినీ తనలో అవలీలగా ప్రతిఫలింపజేసుకోగలిగిన ప్రజ్ఞ ఈనాడు మధ్యాక్కర సాధించింది. ఆధునిక జీవితంలోని సంశ్లిష్టతను సరళంగా, జాతీయంగా, సజీవంగా. సహజంగా చెప్ప గలిగిన వృత్తం మధ్యాక్కర. నిందించటానికి, స్తుతించటానికి, నిష్ఠురాలాడటానికి, నిజం చెప్పడానికి, కోపతాపాలను వ్యక్తం చేయటానికి, అధిక్షేపించటానికి ఆర్తికి, స్మృతికి, ప్రబోధానికి, వితర్కానికి, భక్తికి, హాస్యోక్తికి, మార్మికతకూ, వక్రతకూ మధ్యాక్కర ఈ శతకంలో మనోజ్ఞంగా ప్రయోగింపబడింది. విశ్వనాథవారు మధ్యాక్కరకు మర్యాదగా జీవించే మనుగడను, మాట్లాడే తీరునూ నేర్పి పెద్దరికాన్ని కట్టబెట్టారు. ముళ్ళపూడివారు పద్యాల మనుగడకే ముళ్ళ బాట ఏర్పడినప్పుడు మధ్యాక్కరకు మల్లెబాటలు కల్పించి, ఆధునిక జీవితంలో అలవోకగా విహరించే సౌకర్యాలు కల్పించారు. అందుకు సాహితీలోకం పక్షాన మిత్రులు సచ్చిదానందమూర్తిగారిని అభినందిస్తున్నాను.

తెలుగులో సాగుతున్న మధ్యాక్కర ప్రస్థానంలో విశ్వనాథ ఒక పెద్ద మలుపు. ముళ్ళపూడి ఒక మైలురాయి. ఇది యాదగిరి నృసింహస్వామి సాక్షిగా యథార్థం!

*

(శ్రీవాణి, సెప్టెంబరు - 1993)

# ప్రబంధ ఘనపాఠి

తెలుగులో పద్యం రాయగలిగినవాడే కవి. వచన కవితలు, గేయ కవితలు, మినీ కవితలు- ఇలా ఎన్ని రకాల ప్రయోగాలు చేసినా మౌలికంగా పద్యకవితను హృద్యంగా వెలయింపగలిగిన ప్రతిభను ప్రదర్శింపగలిగిన వారిని మాత్రమే కవులుగా తెలుగువారు గుర్తిస్తారని డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డిగారన్నారు. ఆ మాట ఈనాడు నిజమనిపిస్తోంది.

మొన్న ఆగస్టు 28 వ తేదీన త్యాగరాయ గానసభలో శ్రీ కడిమి నాగార్జునశ్రీ వసుచరిత్ర పద్యధారణాత్మక ప్రదర్శనను నిర్వహించారు. "సాహిత్య రంగంలో ఇదో నూతన ప్రక్రియ. సంగీత సాహిత్య కళానిధి శ్రీ రామరాజ భూషణుడు రచించిన 'వసుచరిత్ర' ప్రబంధంలోని ఆరు ఆశ్వాసాలలోని 892 గద్యపద్యాలను (5148 పంక్తులు) పుస్తకం చూడకుండా సుమారు 6 గంటల వ్యవధిలో మనోజ్ఞంగా రాగయుక్తంగా లయబద్ధంగా ఏకధాటిగా ధారణాత్మక ప్రదర్శన నిర్వహించడం అసాధారణ ప్రతిభకు నిదర్శనం. భారతీయభాషలలో ఒక కావ్యానికి కావ్యమే ధారణ చేయడం అద్భుతమైన విషయం" అని ఆ కార్యక్రమాన్ని నిర్వహించిన రసమయి ప్రస్తావనలో పేర్కొన్నది. ఈ ప్రక్రియను శ్రీ కడిమి నాగార్జునశ్రీ రాజమండ్రిలో మొదటిసారి ప్రదర్శించారు. హైదరాబాదులో జరిగిన ప్రదర్శన నాలుగవది. ఉదయం మొదలుకొని సాయంకాలదాకా సాగే ఆ పద్యధారణ ప్రదర్శనను ప్రజలు ఆసక్తితో, అనురక్తితో ఆదరిస్తున్నారు. 'పాఠ్యే గేయేచ మధురమ్' అనే ప్రశంస ఒక రామాయణానికే కాదు, ప్రతి శ్రవ్య కావ్యానికి కూడా వర్తిస్తుందనీ, అది పద్యధారణ ప్రదర్శన వలన ప్రకటితమౌతుందనీ భావిస్తున్నారు. శ్రవ్య కావ్య ప్రక్రియకు పేరు సార్థకం చేసిన ప్రయోగంగా ప్రశంసిస్తున్నారు.

వసుచరిత్ర పదహారవ శతాబ్ది ప్రబంధం. ఆ యుగంలో ఆంధ్ర కవితా పితామహుడు అల్లసాని పెద్దన ప్రబంధం రాయాలంటే తనకు కల్పించవలసిన సౌకర్యాలను గురించి రాయలవారితో చెప్పుకొన్న చాటువును తెలుగువారు నోరారా, నోరూరా చదువుకుంటారు:

"నిరువహతి స్థలంబు, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పుర విడె, మాత్మకింపయిన భోజన, మూయల మంచ, మొప్పుత
ప్పరయు రసజ్ఞు, లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరికినగాక నూరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే?"

పైపద్యంలో అన్ని అవసరాల్లోనూ "ఊహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్" కూడా ఉండటం గమనింపదగిన అంశం. లేఖకులు లిఖిత సంప్రదాయ సంరక్షకులు. పాఠకులు శ్రవ్యకావ్యాలకుండే మౌఖిక సంప్రదాయ పరిపోషకులు. పాఠకులంటే చదువుకొనేవారే కారు, చదివి వినిపించేవారు కూడా. అంటే, ప్రబంధానికి అనుబంధంగా లేఖన పఠన పాఠన కళలు కూడా వర్ధిల్లుతుండేవన్నమాట! ప్రబంధంలో కవిత్వం రాయటం ఎంత గొప్పో, దానిని భావయుక్తంగా చదివి వినిపించటం కూడా అంత ముఖ్యమని తెలుగువారు భావించారన్నమాట! ఒకటి ధారకు, మరొకటి ధారణకు సంబంధించింది. దీనితో పాటు ప్రబంధానికి, ప్రబంధగానానికి కూడా ఒక ధోరణి ఉండవచ్చు. రామరాజభూషణుని వసుచరిత్ర ప్రబంధానికి శ్లేషధ్వని కావ్య స్వభావం ఉంది: సంగీత సాహిత్య సమన్వయ స్వభావం ఉంది. ఆ ప్రబంధం చదివి వినిపించేటప్పుడు ఆ ప్రబంధ స్వభావాన్ని ప్రసన్నం చేయగల పఠన ధోరణినికూడా పాఠకుడు లేదా గాయకుడు కల్పించుకోవలసివస్తుంది. వసుచరిత్ర పద్యాలను కొన్నింటిని రాగయుక్తంగా పాడే సంప్రదాయం, వీణమీద వాయించే పరిపాటి, స్వరపరచి సాధన చేసే పద్ధతి తెలుగులో పరంపరంగా వస్తోంది. అయితే, ప్రబంధమంతా ధారణపట్టి, చూడకుండా చదివి వినిపించే ప్రక్రియ అసలు లేదని చెప్పలేము కాని, కొన్ని శతాబ్దాలుగా అది కనుమరుగైపోయింది. దానిని ఆధునికంగా, అభినవంగా ఆవిష్కరిస్తున్నారు శ్రీ కర్రి నాగార్జునశ్రీ.

ఛందస్సుకూ, ధారణకూ అవినాభావ సంబంధం ఉంది. ఛందస్సులని పేరుపొందిన వేదాలు స్వరప్రధానాలు కావటంచేత ధారణయే వాటికి ప్రాణాధారమై నిలిచింది. వేదధారణ ఒక వృత్తిగా పరిణమించింది. ఆ వృత్తిపోషణకు అగ్రహారదానాలు కూడా రాజులు చేశారు. వేదాన్ని ధారణ చేసేవారిలో ఘనపాఠీలకు ఈనాటికీ ఘనమైన గౌరవం ఉంది.

లౌకిక ఛందస్సులో వెలసిన రామాయణాన్ని ధారణపట్టి గానం చేసిన లవకుశులు ప్రసిద్ధులు. అంటే, కావ్యమంతా ధారణ పట్టే సంప్రదాయానికి ఆది

కావ్యమే శ్రీకారమన్నమాట! తెలుగులో కూడా ఈ సంప్రదాయం వర్ధిల్లిన జాడలున్నాయి. పాల్కురికి సోమనాథుని బసవపురాణం ద్విపదకావ్యం. అది పాడటానికే రచింపబడింది. ఓరుగల్లులో శివభక్తులు దానిని పాడుతూ ఉండగా మొదటి ప్రతాపరుద్రదేవుడు విన్నట్లు పిడపర్తి సోమనాథుడు పేర్కొన్నాడు. రంగనాథ రామాయణం తోలుబొమ్మలాటల్లో పాడబడుతూ ఉండటం ప్రసిద్ధమే. శతకాలను గురించి వేరే చెప్పవలసిన పనిలేదు. ప్రాచీన కాలంలో ప్రాథమిక విద్యను ముగించేసరికే విద్యార్థికి కనీసం ఒక నీతి శతకం, ఒక భక్తి శతకం నోటికి వచ్చి ఉండేవి. 17 వ శతాబ్దంలో అవధాన విద్యకు, ప్రబంధ ధారణకు రాజపోషణ లభించింది. రాజులు, వారి రాణులు ప్రబంధాలను ఆశువుగా చెప్పటం, ధారణ చేయటం ఒక కళగా పోషించారు. అలా చేసిన కవులకు, కవయిత్రులకు కనకాభిషేకాలు కూడా చేశారు. రాజ్యాలు పోయి ఆస్థానాలు మిగిలిన రోజుల్లో కూడా ఈ కళ కొన ఊపిరితో బ్రతికి ఉండేది. బ్రిటిషువారి కాలంలో తెలుగు సాహిత్యం కోల్పోయిన అనుబంధ సాహిత్య కళలలో ప్రబంధ ధారణ ఒకటి. దానికి శ్రీ కడిమిళ్ళ? — శ్రీ కర్రి నాగార్జునశ్రీ ఇప్పుడు పునర్జన్మ కలిగించారు. నవ జీవితాన్ని అందించారు.

శ్రీ కర్రి నాగార్జునశ్రీ పద్యధారణ ప్రదర్శనం కాలం కన్న కళ. పద్యం మీద బాంబుదాడులు జరుగుతున్న ఈ కాలంలో దాని గాయాలలోనుండి కారుతున్న ప్రతి రక్తబిందువులోనుంచీ పద్య విద్యకు సంబంధించిన ఒక నూత్న ప్రక్రియ వినూత్నశక్తితో ఆవిర్భవిస్తోంది. అవధానాలకు ఈమధ్య అత్యంతావరణం లభించటం ఒక దృష్టాంతం. ప్రసిద్ధ శతకాలను పఠిస్తే ప్రజలు పరవశించి వినటం మరో నిదర్శనం సమస్యాపూరణం ఇంటింటి పద్యకళ కావటం మరో విశేషం. ఇలాగే వసుచరిత్ర పద్యధారణాత్మక ప్రదర్శనం మరొక తాజా ప్రయోగం. భూమిని బ్రద్దలు చేసుకుంటూ పుట్టుకొస్తున్న అభినవ పద్యయుగానికి బహుశః ఇవన్నీ పుడమితల్లి పడుతున్న పురిటినొప్పులుగా వినపడుతున్నాయి.

తెలుగువారు పద్యరచనాశిల్పాన్ని ఎలా అభిమానిస్తారో, పద్యపఠనాశిల్పాన్ని కూడా అలా అభినందిస్తారు. పద్యపఠనంలో కూడా తెలుగువారు పలు రకాలైన బాణీలను సృష్టించుకొంటారు. ఆస్వాదిస్తారు. రంగస్థల పద్యం పాడే బాణీ ఒక సంప్రదాయం. దానిలో ఉపసంప్రదాయాలు కూడా ఉన్నాయి. పురాణ పఠనంలో పద్యం పాడే బాణీ మరొక సంప్రదాయం. కవులు స్వయంగా స్వీయ

పద్య కవితా గానాన్ని చేసి వినిపించేటప్పుడు తెలుగువారు అభిలషించే బాణీలు కొన్ని ఉన్నాయి. ఇవన్నీ అలా ఉండగా- ఒక కావ్యాన్ని గాయకుడుగాని, పఠిత గాని చదివి వినిపించే పద్ధతులు కూడా కొన్ని ఉన్నాయి. వాటిల్లో కవి పాడినట్లే అనుకరిస్తూ పాడే బాణీ ఒకటి; కవి హృదయాన్ని ఆవిష్కరిస్తున్నట్లు పాడే బాణీ మరొకటి. అనుకరణను విని ఆహ్లాదిస్తారు. సొంత బాణీతో ఆవిష్కరించే ప్రతిభా ప్రయోగానికి ఆనందిస్తారు. శ్రీ కర్రి నాగార్జునశ్రీ తమ సొంత ధోరణితో వసు చరిత్ర పద్యాలను పాడుతున్నారు. కవితలో ఉన్న శ్లేషాది చమత్కారాలను, వాక్యవిన్యాసాలను, శబ్దాలంకార సౌందర్యాలను, సంగీత, సాహిత్య సామరస్యాలను పఠితల ఊహలకు అందించేటట్లు వసుచరిత్ర కావ్యగాన విధానాన్ని నాగార్జునశ్రీగారు రూపొందించుకొన్నారు.ఆయా సందర్భాలలో భావోచితంగా పద్యాన్ని రాగాలాపనతో, కొన్ని గమకాలతో వారు చదివే పద్ధతి పండితపద్యగాన ఫణితికి అలంకారంగా రాణిస్తోంది. శ్లేషోక్తుల రామరాజభూషణుని వాక్యవిన్యాసం చతురోక్తుల అల్లసాని పెద్దనకంటె, సరసోక్తుల నంది తిమ్మయకంటె, వక్రోక్తుల తెనాలి రామకృష్ణునికంటె,ప్రౌఢోక్తుల రాయలవారికంటె విలక్షణంగా ఉంటాయి. నాగార్జునశ్రీగారి పద్యపఠన ధోరణి రామరాజభూషణుని వాక్య విన్యాసానికి అనువైన ధోరణిగా కుదిరింది. వారు పద్యం చదువుతూ ఉంటే రామరాజభూషణుని పద్యశిల్పం పద్మంలా వికసిస్తున్నట్లుంటుంది; భావసౌరభాలు గుబాళిస్తున్నట్లనిపిస్తుంది. కవి హృదయాన్ని ఆవిష్కరిస్తున్న కావ్యధారణ పఠనకళగా రూపొందించటంచేత శ్రీ కర్రి నాగార్జునశ్రీ 'ధారణావాచస్పతి' అయ్యారు.

మానవ ధారణశక్తిని కంప్యూటర్ కబళించి తనలో భద్రపరచుకుంటున్న ఈ ఆధునికయుగంలో ధారణ మానవ సహజశక్తిగా నిరూపిస్తూ, ప్రాణవంతమైన కంప్యూటర్‌గా వసుచరిత్ర పద్యధారణాత్మక ప్రదర్శనలు నిర్వహిస్తూన్న శ్రీ కర్రి నాగార్జునశ్రీ సన్మాన్యులైన ప్రబంధ ఘనపాఠి. *

(ఆంధ్రభూమి, 9-9-1994)

# వచనకవితలో పంచమార్గాలు

ఆరున్నర దశాబ్దాల తెలుగు వచనకవిత్వ చరిత్రలో ఎన్నో చెప్పుకోతగ్గ పరిణామాలూ, ప్రయోగాలూ వచ్చాయి. చారిత్రికంగా వచన కవిత సాహితీ రంగంలో నిర్వహించిన పాత్రను దృష్టిలో ఉంచుకుంటే కొన్ని దశలను గమనించవచ్చు.

పద్యానికి ప్రతిగా వచనకవిత పుట్టి తన అస్తిత్వాన్ని గురించి, శక్తి యుక్తులను గురించి, వాహికగా, రూపంగా, అభివ్యక్తిగా వ్యాఖ్యానించుకొన్న రోజుల్లో వచన కవితలో ప్రథమంగా ప్రయోగదశ గోచరిస్తుంది. అభ్యుదయ మార్గంలో వస్తువును ఎన్నుకొని అభివ్యక్తీకరించటంలో ఆంతర శిల్పాన్ని రూపొందించే వైవిధ్యాన్ని ప్రయోగశాలలో ప్రదర్శించిన కాలం వచనకవితకు మంచి వ్యక్తిత్వాన్నీ, వ్యాప్తినీ కల్పించిన దశగా పేర్కొనవచ్చు. జీవితాన్ని భౌతికవాదంతోనే కాకుండా కాల్పనికవాద దృష్టితోకూడ చూచి, ఆంతర - బహిర్జగత్తుల సంగమతీర్థంలా రూపొందించి జీవిత విషాదమాధుర్యాలను శైలీ విన్యాసంతో వ్యక్తీకరించే పద్ధతిని ప్రబలంగా వచన కవితలో కవులు నిర్మించినకాలం శిల్పదశగా పేర్కొనవచ్చు.

ప్రజలు మాట్లాడే భాషను, పలుకుబడిని, సమకాలీన ప్రజలు సాగించే బ్రతుకులోని సంఘర్షణలను వర్గదృక్పథంతో చిత్రీకరిస్తూనే కవితాజీవితానికి ఒక ప్రత్యేకశైలినీ, ప్రక్రియాపరమైన ప్రయోగ గౌరవాన్నీ కల్పించే దశ వచన కవితలో ఒక పెద్ద మలుపుగా చెప్పవచ్చు. దీన్ని తెచ్చింది కుందుర్తి. ఒక విధంగా వచనకవిత్వ చరిత్రను కుందుర్తికి ముందు దశ, కుందుర్తి తరువాతి దశ అని విభజించుకొని వివేచన చేయవచ్చునేమో? ఇది ఒక పద్ధతి. తిలక్‌ను కేంద్రంగా చేసికొని అతనికి ముందున్న యుగమనీ, అతని తరువాతి యుగమనీ విశ్లేషించుకొనే పద్ధతి మరొకటి.

కుందుర్తి తరువాత వచనకవిత మూడుపాయలుగా చీలింది. ప్రక్రియాగత ప్రయోగదృష్టి వచనకవితలో ప్రౌఢ మహాకావ్యాలనూ, ఇతిహాసకావ్యాలనూ, కావ్యేతిహాసాలనూ రచించే ప్రవృత్తిని బాగా ప్రేరేపించింది. వచనకవిత్వంలో

కూడ ఆధునిక మహాకావ్యాలు వచ్చే ఒక మహత్తర చారిత్రిక ఘట్టం ఈ మొదటి పాయ కల్పించింది. వచనకవితలో దీర్ఘకవితనూ, ఖండకావ్యాన్నీ వస్తు దృష్టితోనే కాకుండా, కవితాభివ్యక్తి స్పృహతో కూడా నిర్మించే మరొకశాఖ బలంగా సాగింది ఇది రెండవ పాయ. ఇక మూడవ పాయ: వచనకవితలో రూపాంతర ప్రక్రియగా మినీ కవిత పుట్టి కోయిలలా కూయసాగింది; కస్తూరి మృగంలా పరిమళింపసాగింది. మహాకావ్యంలో వస్తువు కథకోసం చెప్పేది కాదు. ప్రతీక మూలస్తంభంగా భావచిత్రాల బలంతో ఒక శిల్పకళామందిరంలా కావ్యం రూపొందుతుంది. కళాగోపనం అందులోని కళాశిల్పం. సామాన్యులకు ఆ శిల్పం సులువుగా అర్థం కాదు. క్లిష్టత, శ్లిష్టత, ఒక్కొక్కసారి అయోమయత్వం అనబడే గుణంకూడా వచనకవితలోని మహాకావ్య ప్రక్రియలో చోటు చేసుకొనేవి.

ఈ పరిణామాల కన్నింటికీ కారణాలుగా తెలుగు వచన కవిత్వ జీవితాన్ని కవులు ఆయా కాలాలలో ఆయా కవితాగుణాలతో దిద్దితీర్చాలని నిర్ణయించుకొన్న తీరులను గుర్తించవచ్చు. మొదటిదశలో వచనకవిత స్వభావోక్తితో జీవించింది. క్రమంగా భావచిత్రాలంకరణను సంతరించుకొని, చెప్పే తీరులో ఒక నవ్యతను ప్రకటించే మార్గాన్ని ఆశ్రయించి ప్రచారం చెందింది. ఆ తరువాత చెప్పే వస్తువును చమత్కారంగా ప్రౌఢోక్తులతో వ్యక్తీకరించే గుణాన్ని సారించింది. చమత్కార మార్గంలో భావచిత్రాలను వాడుకొని అనుభూతివైపు నడిపించినవారు కొందరు, ఉద్యమం వైపు పురికొల్పినవారు కొందరు. చమత్కారం కొరకే అన్నట్లు కవిత్వాన్ని చిత్రించినవారు కొందరు.చమత్కారాన్ని కాకువుతో, అధిక్షేపంతో, వ్యంగ్యోక్తితో ప్రజాసూక్తాలతో, తిట్లతో, దీవెనలతో, ప్రశంసలతో, ప్రసంగాలతో, నిర్వచనాలతో, నినాదాలతో, మెరుపులతో, కొసమెరుపులతో - ఇలా ఎన్నో మెళకువలతో సాధించినవారు ఎందరో కనపడతారు.

కుందుర్తి వచన కవితాజీవితాన్ని వక్రోక్తి మార్గంలోకి తోశాడు. ఆయన చమత్కార వక్రోక్తులను విరివిగా వాడేవారు. అయితే, ప్రతీకాత్మక ప్రవృత్తి ఆయన కవితలో తక్కువ. ఆయన తరువాతి కవులు - విశేషించి కావ్యకవులు, ఖండకావ్య కవులు - ప్రతీకలనూ, భావచిత్రాలనూ వక్రోక్తి జీవితంతో కలిపి వండారు. పదహారవ శతాబ్ది ప్రబంధ కవులు కథలను ప్రబంధ వక్రతతోనూ, సన్నివేశాలను ప్రకరణ వక్రతతోనూ, రచనను వాక్యవక్రతతోనూ వినిర్మించి

నట్లు వచనకావ్య కవులు కూడా ఆధునిక ప్రయోగాలను ప్రతీకార్థ వక్ర చమత్కారాలతో నిర్మించారు. ప్రతీకలూ, భావచిత్రాలూ వస్తువును క్రమంగా సూచిస్తాయి; ధ్వనింపజేస్తాయి; ఆలోచింపజేస్తాయి; అనుభవింపజేస్తాయి. అందువలన ఆధునిక వచనకావ్యంలోని వస్తువుగాని, ప్రతిపాద్యాంశంగాని అవివక్షితంగా - అంటే, ఝటితిస్ఫూర్తితో, ఆలవోకగా, అప్రయత్నంగా అర్థం కావు. ప్రతీకలు ప్రత్యక్షంగా చెప్పదలచుకొన్న అర్థాన్ని అనుభవానికి తెస్తే కావ్యం అర్థం కావటం సులభం. కాని, ఆధునిక కావ్యకవి ప్రతీకలను వక్రతావిశిష్టంగా భావచిత్రాల బిగింపుతో ప్రదర్శిస్తున్నాడు. దానివలన అవవిక్షిత క్రమ ప్రతీకార్థ వక్ర చమత్కారం వచనకవితకు జీవితంగా నిబంధిస్తున్నాడు. నేటి వరితలకు ఆధునిక వచనకావ్యం అలనాటి పదహారవ శతాబ్దపు తెలుగు ప్రబంధానికి అభినవ రూపంగా అనుభవానికి అందుతున్నది. ఇది కావ్య శిల్పం ఎక్కగలిగిన ఎత్తుగా కొందరు పరిగణిస్తున్నారు. బ్రతుకుకు దూరమైన ప్రయోగంగా మరికొందరు భావిస్తున్నారు.

వచన కవితలోని ఈ గాఢ కవితాగుణాన్ని కొంత తగ్గించి, వివక్షిత క్రమాన్ని అవిక్షితక్రమంగా మార్చే ప్రయోగాలు చేసేవారు చాలమంది ఉన్నారు. వీరు ఖండకావ్యాలనూ, దీర్ఘకవితలనూ మాత్రమే రాస్తారు. వక్ర చమత్కారం వీరి వచన కవితకు జీవితం. కొందరు వస్తువులను వక్రంగా చెప్పి, మరి కొందరు భావాన్ని వక్రతరం చేసి, మరికొందరు ప్రతీకల నాశ్రయించి, భావ చిత్రాల నాశ్రయించి ప్రతిపాద్యాంశాన్ని వక్రవ్యాఖ్యానం చేసి వ్యక్తీకరించే అనంత రచనాశిల్పాన్ని ప్రదర్శిస్తున్నారు.

వీటన్నిటికంటె మినీకవిత ఒక విలక్షతను సాధించింది. మినీకవిత భావచిత్రాలలో జీవించే సాహిత్యరూపం. సమర్థులైన కవులు మినీ కవితకు వక్రోక్తిని, స్వభావోక్తిని, వ్యంగ్యోక్తిని, అధిక్షేపోక్తిని, శ్లేషోక్తిని యథావకాశంగా ప్రాణశక్తిగా వాడుకుంటున్నారు. వస్తువును అలంకారంగా మార్చటమే ఆధునిక స్వభావమైతే-దాన్ని సూక్ష్మంలో మోక్షంలా వ్యక్తం చేయగలిగిన ముక్తసరి రూపం మినీకవిత. దానికంటె ముగ్ధరూపంగా వెలువడుతోంది హైకూ. అక్షరనియమం (17 సిలబిల్స్ - అక్షరాలు) కలిగిన ఈ ఛందస్సు వచన కవిత పొందగలిగిన సూక్ష్మాతిసూక్ష్మరూపంగా పేర్కొనటానికి వీలుంది. క్లుప్తత, గుప్తత, ప్రతీకాత్మకత హైకూకు ముప్పెన్నెలు.

వచన కవితలో ఎన్ని రూపాలు వెలువడినా, ఎన్ని ప్రయోగాలు సాగినా, ఖండ కావ్యమే బలంగా నేటికీ ప్రచారంలో ఉంది. అరవై అయిదేళ్ళుగా ప్రగతిని సాధిస్తున్న ఖండకావ్యం పంచమార్గాల్లో ప్రవహిస్తోంది. మొదటి మార్గం - మహా కావ్య రచనా శిల్పాన్ని మోసుకొనివచ్చే ఖండకావ్య రచనా ప్రయోగాలతో సాగే రచనా స్రవంతి. రెండో మార్గం - మినీ కవితాశక్తిని పోషించుకొని రూపొందే ప్రయోగాలతో సాగే పాయ. మూడో మార్గం - దీర్ఘ కవితా శిల్పాన్ని హ్రస్వీక రించి ఖండ కావ్యంగా మలచుకొనే మార్గంగా ప్రవహించే వాహిని. నాలుగో మార్గం - జీవిత వాస్తవాన్ని చమత్కారమయం చేస్తూ చెపుతున్న దేదైనా పఠిత లను స్పందింపజేసే ప్రయోజనంతో ప్రసారమయ్యే తరంగిణి. అయిదో మార్గం - సర్రియలిజం (అధివాస్తవిక వాదం)లాంటి అభివ్యక్తి వాదాలను ఆలంబనంగా చేసికొని అంతర్జగత్తును, బహిర్జగత్తును సమీక్షించే శిల్పరూపాల ప్రయోగ వీచిక లను విరజిమ్మే మార్గం.

ఆధునిక వచన కవితా ప్రయోగాలను అనుశీలించాలంటే ఈ పంచవిధ వచన కవితా శిల్ప మార్గాలలో ఏదో ఒకదానిని అనుసరించి కవిని, రచనను వివేచించవలసి వస్తుంది. ఈ అయిదు మార్గాలల్లో చివరిది క్లిష్టమైనది. ఆ ప్రయో గాలను మనసులో ఉంచుకొని సమీక్షగా వెలువడిన కవితగా భావించవచ్చు శ్రీ నరేష్ నున్నాగారి "బ్రతికే స్వప్నాని కావల ..."

"మళ్ళీ తెరుచుకుంటున్న తలుపు చాట్నుంచీ
హృదయతంత్రి తెగిన నిశ్శబ్ద సంగీతం.
ఊపిరి ఉలి చెక్కిన మౌనశిల్పం
అక్కడ యక్షప్రశ్నల సాలభంజిక!
బహుశా పదాలుండవ్ ప్రతీకల్ తప్ప....
అనాదిగా తోడొచ్చే సంజ్ఞల చెలిమి తప్ప
వెన్నెల మెట్లనిండా కృష్ణపాద ముద్రలు
జలతారు తోరణానికి పల్లేరు నగిషీలు....
అంతా అవకతవగ్గా అసంబద్ధంగా....
హిందోళనాందోళనాల సమ్మేళనంలా....
కన్నీటి కిప్పుడు వర్గ పరీక్ష
నలుపా? తెలుపా?" (రెండ్నిమిషాలు మౌనంగా....పు. 18). *

(ఆంధ్రభూమి 14-10-1994)

# సి.నా.రె. 'దృక్పథం'

ఈ మధ్య మేము ఆంధ్ర సారస్వత పరిషత్తులో కలుసుకొన్నప్పుడు డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు తమ 63వ జన్మదినోత్సవ సందర్భంగా వెలువరించిన కవితా సంకలనం 'దృక్పథం' నాకు అందించారు. వారి ప్రచురణలన్నీ స్వయంగా ఆప్యాయంగా ఇవ్వటం వారి స్నేహానికి చిహ్నం. పేజీల కూర్పు నుండి పేరు పెట్టేంతవరకూ అన్నీ సార్థకంగా, ఔచిత్యంగా ఉండేటట్లు నారాయణరెడ్డిగారు జాగ్రత్తగా తమ ప్రచురణలను పర్యవేక్షిస్తారు. దానితో అరవై మూడో యేట వెలువడే ప్రచురణకు 'దృక్పథం' అని పేరుంచారంటే ఏదో విశేష మనిపించింది. ఆలోచింపదగిన దనిపించింది చూడగానే. అదీ ఒక విశేషమే.

రెడ్డిగారు 'దృక్పథ'మనే ఖండకావ్యం మొదట నిలిపి, దాని పేరే సంకలనానికి ఉంచారు. ప్రాధాన్య వివక్షకోసం వారుచేసే పద్ధతులలో అది ఒకటి. కాలక్రమంలో మొదటి రచన కాకపోయినా పఠనాక్రమంలో ప్రథమంగా ఒక శీర్షికను ఎన్నిక చేస్తున్నారంటే, దానికీ ఆసంకలనంలోని చివరి శీర్షికకూ, కవితకూ ఒక అవినాభావ సంబంధం ఉండేటట్లు సంవిధానపరంగా జాగ్రత్త తీసుకోవటం సహజం. ఆ సంకలనంలో రెండు శీర్షికలనూ కలిపి చదువుకుంటే 'దృక్పథం-జాతి విత్తనం' అని తెలుస్తుంది. అవును. అదే ఆ కావ్య రహస్యం కూడా! అంటే- కవి హృదయం కూడా!

నాలుగు దశాబ్దాల సాహిత్య సృష్టి తరువాత ఈనాడు నారాయణరెడ్డిగారు తమ దృక్పథాన్ని వ్యక్తం చేస్తున్నారా? ఇంతవరకూ వారిదైన దృక్పథం అంటూ ఎక్కడా చెప్పుకోలేదా? వంటి ప్రశ్నలు ప్రాథమికంగా కొందరికి స్ఫురించవచ్చు. రెడ్డిగారు ఎప్పటికప్పుడు తమ స్థితిగతులను కవితామయంగా సంకేతించుకుంటూనే వస్తున్నారు. అది వారికి క్రొత్త కూడా కాదు. అయితే, 1985 తరువాత వచన కవిత్వ ప్రయోగాలలో వస్తున్న ప్రయోగ వైవిధ్యంలో, దృక్పథాల సంఘర్షణలో, అభివ్యక్తుల అభిరుచులలో తన బాట యేదో స్పష్టంగా తేల్చి చెప్పుకోవలసిన అగత్యం ప్రతి ఆధునిక కవికీ ఈనాడు కలిగింది. సాహిత్య

లోకం ముందు నిగారె తన దృక్పథాన్ని ప్రకటించుకొనటం సమయౌచిత్యమని నిర్ణయించుకున్నారు. ఆ ప్రకటన కూడా ప్రత్యర్థులతో వాదిస్తూ తన దృక్పథాన్ని సమర్థించుకున్నట్లుండటం సమకాలీన స్పృహకు సంకేతం.

"ఏ విదేశీ పద్య బీజాలో స్మగుల్ చేసి తెచ్చి
ఈ కాగితం నేలలో నాటాలా?
పదునైన సృజనశీలమున్న ప్రతి అక్షరమూ రూపొందుతుంది
పరిణత రక్తపుష్పం రాల్చిన
జాతి విత్తనంలా......."

"కవిత్వం కావాలంటే
నక్షత్రాల విపణుల్లోకి వెళ్ళనక్కరలేదు.
డాలర్ల గడ్డను త్రవ్వనక్కరలేదు.
ఖండాంతర గ్రంథపంక్తుల వీర్యకణాలను కొనితెచ్చి
అత్యాధునికంగా నారుపోసుకొని
ఇక్కడి కలంలోంచి ప్రసవించనక్కరలేదు.
అక్షరం ఉదయించాలి
ఒంటిమీది చెమటబిందువులా
కవిత్వం ప్రసరించాలి
ప్రాణవాయువుల్లో స్నానంచేసి కురులార్చుకునే
ప్రభాత కిరణంలా." (పు. 100.)

విదేశీ భాషా సాహిత్యాల అధ్యయనం విస్తరించినకొద్దీ వాటిల్లో వస్తున్న ప్రయోగాలను తెలుగులోకి తీసుకొని వచ్చే ప్రయత్నం రచయితలు చేయటం సహజం. వీరేశలింగంపంతులు, కట్టమంచి రామలింగారెడ్డి, శ్రీశ్రీ మొదలైన రచయితలు ఎందరో పాశ్చాత్య ప్రభావాలను బలంగా తెలుగులోకి తెచ్చిపెట్టారు. దాదాపు ఒక దశాబ్దంపైగా ఇప్పుడు యూరోపుఖండ దేశాలలోనే కాకుండా ఆఫ్రికాఖండ దేశాలలో; అమెరికా, ఆస్ట్రేలియా ఖండ దేశాలలో; రష్యా, చైనా, జపాన్‌వంటి అభివృద్ధి చెందిన దేశాలలో వెలువడుతున్న సాహిత్యాలను భారతీయ కవులు అధ్యయనం చేస్తున్నారు. రాజకీయ భావజాలాలు అనుకూలంగా ఉన్నా, ప్రతికూలంగా ఉన్నా వ్యావహారిత్యా కొన్ని అధ్యయనాలు ఆర్థికంగానూ, అంత ర్జాతీయావగాహనరీత్యానూ మేధావులను ఆకర్షిస్తున్నవి. దేశీయ భాషలలో

దిగుమతి చేసుకోవటానికి క్రొత్త సరుకుకు మంచి గిరాకీ లభిస్తున్నది. అందు వలన ఈనాటి వచన కవితా ప్రయోగాలు చేస్తున్నవారిలో కొందరు ఆఫ్రికన్ సాహిత్య వారసత్వాన్ని, ఆస్ట్రేలియన్, అమెరికన్ వంటి విదేశీ సాహిత్యాల వారసత్వాన్ని తెలుగులో పెంచుతున్నారు. వారి కవిత్వంలోని అభివ్యక్తులు, ప్రతీకలు, భావచిత్రాలు పాశ్చాత్యకవుల కవితా నిర్మాణ మర్మాలను తెలుసు కుంటే తప్ప, ఆయా దేశాల సాంస్కృతిక వాతావరణాల సంస్కారాలను అంత రంగాలలో నింపుకుంటే తప్ప అనుభవంలోకి రావు. అందువలన తెలుగుకవిత్వం చదువుతున్నా కొన్ని సందర్భాల్లో ఇది జాతీయమా, విజాతీయమా? అని ప్రశ్నించుకునే రోజులు వచ్చాయి. డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు ఈ భావశిల్ప ప్రయోగ సంఘర్షణలలో జాతీయతను కోరుతున్నారన్నది వారి 'దృక్పథం' స్పష్టం చేస్తున్నది.

నిర్వచన కవితల్లో నిగ్గు తేలిన నారాయణరెడ్డిగారు 'దృక్పథాన్ని' తెలుగు 'చూపు'గా తర్జుమా చేసి, దానిని "సృష్టికి పథప్రతిష్ఠ చేసే ప్రాణ ధాతువు చూపు" అని నిర్ధారించారు. ఆ చూపు దేశీయం, జాతీయం కావాలని నిర్దేశిస్తున్నారు.

జాతీయతను కావాలని కోరుకుంటున్న కవి తన అస్తిత్వాన్ని ఎన్నో విధాలుగా అన్వేషించుకుంటూ ఉంటాడు. విశ్వాన్నంతా వాయు విహారంలో దర్శించగలిగిన ఆధునిక మానవుడు ఆకాశంలోనుంచి క్రిందికిచూచి ప్రవహిస్తున్న యేరును దర్శించి తన అస్తిత్వంతో సహానుభూతిని పొందుతాడు.

"లోతైన లోయలో పారే నదిని నేనే అని
విమానంలోంచి చూస్తే తెలిసింది.
ఎన్నెన్ని యుగాలుగా ప్రవహిస్తున్నానో
దరుల బుగ్గల మీద చిరు తరగల చిటికెలేసుకుంటూ." (పు. 97)

అంతర్జాతీయత ఆధునిక జీవితంలోని అంతస్సూత్రమని భావిస్తున్న ఈ రోజు ల్లోనే జాతీయమైన అస్తిత్వాన్ని కోల్పోయిన అంతర్జాతీయతకు అంతస్సత్త్వం లేదని కూడా గాఢంగా విశ్వసించటం యుగధర్మమై పోయింది. ఎంత ఎత్తున విమానంలో ఎగిరినా, లోతైన లోయలో తరతరాలుగా నేలమీద పారుతున్న యేరే నా అస్తిత్వమని అనుభవించటాన్ని అభిమానిస్తున్నారు నారాయణరెడ్డిగారు.

విమాన యానాన్ని, గాలి పరుగునూ ఆధునిక మానవుడు అభ్యుదయంగా భావించే అంతర్జాతీయ స్పృహగానూ; రోడ్డును, రోడ్డు ప్రయాణాన్ని జాతీయ

స్పృహగానూ నారాయణరెడ్డిగారు అలంకరించి కొన్నిచోట్ల రూపకంగా చెప్పారు; కొన్ని చోట్ల ప్రతీకాత్మకంగా అభివ్యక్తం చేశారు. 'రోడ్డు' కవితలో—

"నేల కుదుళ్ళను పట్టుకున్న రోడ్డు బిగువు
గాలి పరుగు కుంటుందా?
జీవితమా! నువ్వూ రోడ్డులా జీవించకూడదూ?" (పు. 21)

అని ప్రబోధిస్తారు సి.నా.రె. అది ఈనాడు వారు కవితకూ జీవితానికీ ఇస్తున్న చూపు!

డాక్టర్ సి. నారాయణరెడ్డిగారిలోని ప్రయోగశీలత్వం జాతీయత, దేశీయత అనే స్పృహలనుండే పుట్టిందని చెప్పాలి. వచన కవితను ఒక వైపు రాస్తూనే మరొకవైపు ప్రపంచపదులూ, కొత్త గజళ్ళూ, ద్విపదలూ రచిస్తున్నారు. వచన కవిత్వంలో కూడ విదేశీ భావరూపాల స్మగ్లింగును నిరసిస్తున్నారు. ఇటువంటి దృక్పథంతో ప్రయోగాలు చేస్తున్న వారిలో సి.నా.రె. గారిని ప్రత్యేకించి చెప్పక తప్పదు.

జాతీయతకు పోషకంగా ఆత్మీయతను,స్థానీయతను నిలపటం నారాయణ రెడ్డిగారికి అభిమతం. "మనీ అంటని చోటికి" అనే కవిత పుట్టిన నేలమీద కవి చూపే ఆత్మీయతకు అమృతోదాహరణం.

"అప్పుడప్పుడైనా ఇక్కడికి రాక తప్పదు
కల్తీలేని నిజాయితీగాలితో
శ్వాసకోశాలను శుభ్రం చేసుకోవడానికి
గుండెఅద్దానికి పట్టిన మసకను తుడిచేసుకోవడానికి." (పు. 13)

నడుస్తున్న చరిత్రతో ఆత్మీయంగా స్పందించటం, సమకాలీన సన్నివేశాలను ఆత్మాశ్రయంగా వ్యాఖ్యానించటం సి.నా.రె. కవితలకు సామాన్య లక్షణం. తేదీలవారీగా ప్రచురితమయ్యే ప్రతి రచన వెనుకా ఒక జీవిత సన్నివేశం దోబూచులాడుతూ ఉంటుంది. 'తిరిగొచ్చిన గొంతు' కొన్నాళ్ళు వారి గొంతు బొంగురుపోయినస్థితికి వారు పడ్డ అంతర్వేదనకు బహిర్వ్యాక్తి. 'అది చెట్టే కాదు' కవిత ఆయన మీద కొందరు సాగించిన దుష్ప్రచారానికి శిల్పపరమైన వ్యాఖ్యానం. ఇలా సి.నా రె. జీవితచరిత్రలో శిల్ప సంకేతాలుగా నిలిచే కవితలు ప్రతి సంపుటిలో తమ ప్రత్యేకతను చాటుకుంటూనే ఉంటాయి. అందుకే అంటారు సి.నా.రె. 'అస్తిత్వరేఖ'లో—

"కడదాకా సాగిపోలేవు నువ్వు
సమయసముద్రంమీద చరణముద్రలు నాటితే తప్ప" అని. (పు. 43)

ఈ కవితా సంపుటిలో 1991 నుండి 1994 వరకూ రాసిన కవిత లున్నాయి. వాటి కాలస్థితిని గమనిస్తే సి.నా.రె. దృక్పథం స్పష్టంగా అభివ్యక్త మైంది 1994 మే, జూన్ నెలల్లోనని స్పష్టమౌతోంది. అయితే, ఆ చూపుకు మాతృక 1991 లోనే కనబడుతుంది. మనిషికి అస్తిత్వానిచ్చేదీ, మరణాన్ని అందించేదీ మట్టేనని అంటారు సి.నా.రె. మట్టిని మాతృకగా మన్నిస్తే అస్తిత్వం, మట్టిని వదలిపెడితే మరణం అని తీర్పిస్తారు.

"మనసుపెట్టి చదివితే మట్టి మెరుస్తుంది
మనిషి అస్తిత్వానిచ్చే మాతృకగా
మరణగమ్యాన్ని బోధించే అధ్యాపికగా." (పు. 11)

అయితే, 1992 లోని ఉద్రిక్త క్షణాలలో అస్తిత్వ స్పృహ ఊగిసలాడింది. ఆ యేటి కవితలు సంక్షోభాన్ని సూచిస్తున్నాయి. 1993 లో 'భద్రత' లేదని ప్రక టించిన కవితలు వెలువడ్డాయి. బాంబు పేలుళ్ళతో భద్రత కరువైన ఆ యేటి చరిత్ర సి.నా.రె. మనసును ఛిన్నాభిన్నం చేసింది. ఆ సంవత్సర చరిత్ర కావ్యాన్ని చదవలేనని వాపోయారు.

"ఈ పుస్తకం ఎలా చదవను?/అన్వయంలేని అక్షరాలు ఢీకొనే దృశ్యాలు/ తలలు తెగిన సర్పాల్లా తోకలతో పాకే వాక్యాలు.... ఈ పుస్తకం ఇక చదవలేను/ ఇది నడుస్తున్న చరిత్రకు తీసిన/తాజా న్యూస్ రీల్‌లా ఉంది." (పుట 84, 85)

1993 చేదునిజం 1994 లో జాతీయతమీద దృష్టి మళ్ళించింది. జాతి విత్తనాల కోసం అన్వేషణ మొదలుపెట్టించింది. విమానంమీదనుండి భూమి మీదకు దూకింది చూపు. జాతీయతను జీవచైతన్యంగా గుర్తించింది. కవి అస్తిత్వం ఇలా ప్రకటించింది—

"తీక్షణంగా చూస్తాను పైకి / విమానం నిష్క్రమిస్తుంది అంతరిక్షసాక్షిగా.
నేనుంటాను అనాహతంగా / ఉభయసంధ్యాపర్వతాలమధ్య
కాలాన్ని అదిలిస్తూ పోయే నిర్నిద్ర జీవనదిలా / నిత్య సంచరణ
కవితానిధిలా." *

(ఆంధ్రభూమి 21-10-1994)

# సహస్రమాసమేఘం : సౌదామినీదీప్తులు

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు జ్ఞానపీఠ పురస్కారాన్ని అందుకొన్నప్పుడు "గోపాలరెడ్డి లేకుంటే నాకు జ్ఞానపీఠ అవార్డు వచ్చేది కాదు" అని అన్నారు విజయవాడ బహిరంగ సభలో ''మీ సాహిత్య సేవ వల్లనే, మీ బహుముఖ ప్రజ్ఞవల్లనే, ఆ అవార్డు మీకు వచ్చింది. నేను నిమిత్తమాత్రుడనే" అని అన్నారు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారు విశ్వనాథవారితో. తెలుగువారు వారిద్దరి మాటలూ విన్నారు. విశ్వనాథవారి ప్రతిభ ఆ పురస్కారానికి అన్ని విధాలా తగి ఉన్నదని ఆంధ్రులకు తెలుసు ఆ యేడు పురస్కార ప్రదాన సంఘానికి గోపాలరెడ్డి గారు అధ్యక్షులుగా ఉండటం, వారికి విశ్వనాథ మీద అభిమానం ఉండటమూ తెలును. అయినా, అసలు జరిగిన వాస్తవ మేమిటో తెలుసుకోవాలని అందరూ ఆసక్తిని ప్రకటిస్తూనే ఉన్నారు. (పురస్కారప్రదాన సంఘానికి తెలుగువాడు అధ్యక్షుడైనప్పుడే తెలుగు కవులకు జ్ఞానపీఠ పురస్కారాలు వచ్చాయన్న సత్యాన్ని కూడా తెలుగువారు మరువలేరు) ఈ వాస్తవం ఇన్నాళ్లూ తెరమరుగున ఉండేది. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు విశ్వనాథ వారికి వచ్చిన పురస్కారం వెనుకనున్న వాస్తవాన్ని బయటపెట్టారు - 1991 డిసెంబరు 12 వ తేదీన.

ఆ సత్యాన్ని డాక్టర్ గోపాలరెడ్డిగారు ఈ యేడు సెప్టెంబరులో వారే ప్రచురించిన ''సౌదామినీ దీప్తులు'' అనే గ్రంథంలో పొందుపరిచారు. వారి మాటలే మీ కందిస్తాను: "ఆరవ సంవత్సరము తెలుగుకు విశ్వనాథవారికి వచ్చింది. పదిమందియున్న ప్రవర సమితి (Selection Committee) సమావేశానికి నలుగురు హాజరుకాలేదు....నేను రామాయణ కల్పవృక్షాన్ని ప్రతిపాదించాను - విశిష్టతను విశ్లేషిస్తూ. జ్ఞానపీఠ అవార్డు స్థాపకురాలు శ్రీమతి రమాజైన్, కార్యదర్శి లక్ష్మీప్రసాద్‌జైన్ 'యయాతి'కి మొగ్గుజూపారు. 'ఒకటి రామాయణం, మరొకటి భారతం కథ, పాత విషయాలే! గ్రంథకర్తల వ్యుత్పత్తి ఏముంది?' - అని డాక్టర్ నీహార్ రంజన్ రాయి తను వోటు చేయడం లేదు అని ప్రకటించారు. దివాకర్, డాక్టర్ కరణ్‌సింగులు నాతో ఏకీభవించారు.

హాజరైన ఆరుగురిలో ఒకరు తటస్థులు, ముగ్గురము దివాకర్, కరణ్‌సింగు, నేను 'కల్పవృక్షాన్ని' బలపరచాము. శ్రీమతి రమాజైన్, కార్యదర్శి 'యయాతి' అన్నారు. అంటే - ముగ్గురు కల్పవృక్షానికి, ఇద్దరు యయాతికి, ఒకరు తటస్థులు అని నేను ప్రకటించాను... రామాయణానికే అవార్డు అని నేను ప్రకటించి, పత్రికలవారితో చెప్పాను. అదీ జరిగిన కథ. విశ్వనాథ వారి ప్రతిభవల్లనే ముగ్గురము దానికి వోటు వేశాము. నేను ఎవరినీ వోటు విషయమై కాన్‌వాస్ చేయలేదు. సొంత అభిప్రాయాలనే వెల్లడించారు. వోటింగువరకు వచ్చినదని విచారిస్తూ నా అధ్యక్ష పదవికి లక్నోనుండి రాజీనామా పంపాను. ఢిల్లీలో అవార్డు యిచ్చిన సభకు నేను హాజరు కాలేదు.'' (పుట 59-60.)

ఈ మాటలు చదివిన తరువాత విశ్వనాథ వ్యాఖ్యలో కొంత సత్యం లేక పోలేదని తెలుస్తోంది. గోపాలరెడ్డిగారి వోటే అవార్డును నిర్ణయించింది. అది ఎంత సత్యమో గోపాలరెడ్డిగారి వ్యాఖ్యకూడా అంతే సత్యం. గోపాలరెడ్డిగారున్నా కల్పవృక్షానికి వోటు వేయకపోతే కథ మరొక రకంగా ఉండేది. దివాకర్, కరణ్‌సింగులు తమంతట తాము విశ్వనాథవారి కల్పవృక్షానికి వోటు వేయకపోయినా, అందులో ఏ ఒకరు తటస్థులైనా, వ్యతిరేకులైనా ఫలితం మరొకవిధంగా వెలువడి ఉండేది. మూడు వోట్లకు కారణం విశ్వనాథ ప్రతిభయే కాని అధ్యక్షుని చొరవ కాదు. పురస్కార ప్రదాన సంఘంలోని సభ్యులు స్వతంత్ర నిర్ణయాలు ప్రకటించటంలో వెనుకాడేవారు కారని కూడా స్పష్టమౌతోంది. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు ఈ సత్యాన్ని బయటపెట్టటం వలన అందరికీ గౌరవం మిగిలింది. గోపాలరెడ్డిగారు పంపిన రాజీనామా ఆయన ఎత్తును పెంచింది; విశ్వనాథ కీర్తిని ఇనుమడింపజేసింది.

"20వ శతాబ్ది మందిరములో నేను పూజారిని. అన్ని దశాబ్దాలనూ చూచినవాడిని" అని డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు ప్రకటించుకొన్నప్పుడు ఆ సత్యాన్ని కాదనలేం. 'ఆంధ్ర భీష్ముని'గా ఆయన్ను ఆమోదిస్తాం. ఆయనకు రాజకీయ జీవితం ఎంత ఉందో సాహిత్య జీవితం అంత ఉంది. రాజకీయం నుండి విశ్రాంతి తీసుకున్నా సాహిత్యం నుండి ఇంకా విశ్రాంతి తీసుకోలేదు. రవీంద్ర సాహిత్యాన్ని తనదైన శైలిలో తెలుగువారికి తర్జుమా చేసి యిచ్చిన "శాంతినికేతన'' సాహిత్య తపస్వి. రవీంద్ర కవీంద్రుని పుట్టినరోజుకంటె మరొక పుణ్యదినం ఆయనకు లేదు. రెడ్డిగారి జీవితంలో ఎన్నో విలువైన సన్ని

వేశాలు ఆ రోజునే జరిగాయి. రెడ్డిగారు రవీంద్రుని అనువాదకుడే కాదు - తెలుగులో అరుదుగా కనపడే రవీంద్ర సౌందర్యతత్త్వారాధకుడు. ఊర్వశి, కాళిదాసు, తాజ్‌మహల్ కావ్యానువాదాలు రెడ్డిగారు గానం చేస్తూ ఉంటే అణువణువూ తన్మయత్వంతో ఆర్ద్రమైపోతూ ఊగిపోతారు.

ఊర్వశి ప్రణయతత్త్వాన్ని ప్రసాదించింది; కాళిదాసు భావనాచైతన్యాన్ని అందించాడు; తాజ్‌మహల్ మధురవేదనను రగిల్చింది. ఈ మూడూ త్రివేణీ సంగమంలా గోపాలరెడ్డిగారిలో కలిసి తెలుగు కవితాగంగను సృష్టించాయి. గాలిబ్, ఇక్బాల్ కవితా పరిమళాలు రెడ్డిగారి తెలుగు పలుకులకు పారశీక రుచిని ప్రసాదించాయి. ఏడు పదులు దాటిన వయసులో రెడ్డిగారు తమ ధోరణిలో తమ కవితలు వ్రాయటం ప్రారంభించారు. 'ఆమె' పంచకం రెడ్డిగారి అస్తిత్వాన్ని నిలిపింది. దీర్ఘ కవితలు వారి కవితా జీవితాన్ని పరిమళింప చేశాయి. 'రేఖాచిత్రాలు' వారి భావతరంగాలను వెదజల్లుతున్నాయి. 'సౌదామినీ దీప్తులు' వారి కలంనుండి వెలువడిన 'రేఖాచిత్రాల' అయిదవ సంపుటి. సహస్రమాస మేఘం మెరిసిన మెరుపులు!

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారికి వారిదైన ఒక ప్రత్యేక శైలి ఉంది. వారు ఆ విషయాన్ని స్వాభిమానంగా చెప్పుకుంటారు. "నన్ను ప్రతిబింబించే వ్రాతలు! నాధోరణి నాది అశ్లీలత, అపవిత్రత యిందు లేవు. నాకు దారి చూపే వారు లేరు. వెంబడించేవారు లేరని తోస్తుంది. నా ఒంటరితనములో నాకు స్వేచ్ఛ ఉంది. దానిని ఆస్వాదిస్తూ 'ఏక్ లా ఛలోరే' అనుకొంటూ నా సాహిత్యపథాన నడుస్తున్నాను'' అని సౌదామినీ దీప్తులకు రాసిన ముందుమాటలో అన్నారు. ఆ మాట నిజం.

సౌదామినీ దీప్తులలో 39 రచన లున్నాయి. అన్నీ వచన రచనలే. ఇందులో అన్నీ రేఖాచిత్రాలంటే ప్రక్రియావరంగా ఒప్పుకోవటం అందరికీ సాధ్యపడదు. కొన్ని బలమైన రేఖా చిత్రాలున్న మాట నిజమైనా, మరికొన్ని స్మృతులు, వాస్తవ కథనాలు, అభిప్రాయాలు, డైరీలవంటి రచనలు ఉన్నాయి. 1988 నుండి 1993 మే నెల వరకూ వ్రాసుకొన్న రచనలు - మనసులో మెరిసిన మెరుపుల కాంతులు.

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు అందరితో కలిసిమెలిసి తిరిగినా తమ స్వతంత్ర భావాలను మాత్రం ఎవరికోసమూ మార్చుకోరు. ఉదాహరణకు ఒకటి,

రెండు: "దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్" అనే గురజాడ సూక్తికి సాహిత్యరంగంలో కొన్నేళ్ళుగా ఎదురులేని ప్రశంస ఉండేది. కొన్నాళ్ళ నుండి ఆ సూక్తిని ప్రతిఘటించే గళాలు వినపడుతూ ఉండటం మనం గమనిస్తూనే ఉన్నాం అటువంటి గళాలలో రెడ్డిగారి దొకటి. వారి మాటలు—

''గురుజాడా! నీవు చెప్పినది పాత పడిందోయ్, బెజవాడ చెప్పేది కూడా కొంత వినుకోవోయ్, నీ గిరీశం, మధురవాణులకూ చెప్పుకోవోయ్. నీవు చెప్పిన దంతా అర్ధసత్యమేనోయ్ ఆవలది నీకు తెలియని విజ్ఞానమోయ్. అది తెలుగు లోని అరసున్నానోయ్. ఇప్పుడైనా, తెలుసుకోవోయ్, నీ చుట్టూ ఉన్నది మట్టే నోయ్. మనిషి లేకపోయినా మట్టి ఉంటుందోయ్. దేశమంటే మట్టేనోయ్! పుట్టి చచ్చే మనిషికాడోయ్!'' రెడ్డిగారి వాదం కొందరికి సమ్మతం కాకపోవచ్చు: కాని, ఆయన వాదం లేదనటానికిగాని, కాదనటానికిగాని వీలులేదు ఈనాడు.

సహస్రమాసాలు దాటిన జీవితాన్ని సాహసంతో, సాహిత్యసాంగత్యంతో సాగిస్తున్న డాక్టర్ గోపాలరెడ్డిగారు జీవితమంతా కాంగ్రెసుకు అంకితమైనవారు. అనేక పదవులు నిర్వహించినవారు. తలపండిన రాజకీయనేత - ఆయనకు - ''కాంగ్రెసును తలచినప్పుడెల్లా గంగానది జ్ఞాపకానికొస్తుంది. అనేక కలయికల రాశే కాంగ్రెసు అన్ని ప్రాంతముల మాగాణములలో పెరిగేదే కాంగ్రెసు మొలక. మొలకను త్రుంచివేయాలని చాలా వడగాలులు వీస్తూనే ఉన్నాయి. కాని, ఏమి చేయలేకున్నాయి. చేసినా నిలువలేకపోతున్నాయి.... కేంద్ర హస్తాలలోనే రాష్ట్ర ప్రభుత్వ గాలిపటాల దారాలుండాలె. బలహీనమైన కేంద్రం దేశానికే ముప్పు. అది సైన్యపాలనకు దారితీస్తుంది.'' ఈనాటికీ ఇది అప్రస్తుతం కాదు.

డాక్టర్ గోపాలరెడ్డిగారి మెదడు రాజకీయం; మనసు సారస్వతం. *

(ఆంధ్రభూమి 17-12-1993)

# రాజీలేని శతాబ్దపు ఋషి

కళాప్రపూర్ణ, పద్మశ్రీ బోయి భీమన్నగారి సహస్ర పూర్ణచంద్రదర్శనో త్సవం అక్టోబరు 19 వ తేదీన వైభవోపేతంగా జరిగింది. జస్టిస్ డాక్టర్ కొత్తపల్లి పున్నయ్యగారి అధ్యక్ష్యంలో ఏర్పడిన ఉత్సవ నిర్వహణ కమిటీ భీమన్నగారికి ఘనమైన సన్మాన సభ ఏర్పాటుచేయటమే కాకుండా లక్ష రూపాయల నగదును బహూకరించి సాహిత్యాభిమానాన్ని ప్రకటించింది. ఆనాడు భీమన్నగారు ఉపన్య సించారు. ఒక యుగకర్త మాట్లాడినట్లనిపించింది.

నేను తెలుగు ఎం.ఏ. చదువుతున్నప్పుడు సి.నా.రె.తో కలిసి బోయి భీమన్నగారితో మొదటిసారి పరిచయం కలిగించుకున్నాను. ఆ తరువాత నేను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సభ్యునిగా, మహావక్తగా, కార్యవర్గ సభ్యునిగా ఉన్నప్పుడు భీమన్నగారితో సన్నిహితంగా సాహిత్య చర్చలలో పాల్గొన్నాను. పాలేరు నాటక రచయితగా భీమన్నగారు మా విద్యార్థి జీవితంలో మా అభిమా నాలను చూరగొన్నారు. ఆ తరువాత 'దీపసభ', 'రాగవాశిష్ఠం' యువతరంలో క్రొత్త ఆలోచనలు రేకెత్తించిన రచనలు. క్రొత్త ఆలోచనలతోపాటు స్త్రీ పురుష సంబంధాల పట్ల ఒక తాత్త్విక చింతనను కలిగించి యువతరాన్ని ఉర్రూతలూగించిన గ్రంథం 'రాగవైశాఖి.' డాక్టర్ బోయి భీమన్నగారు సమాజ భౌతిక వ్యవస్థను, మానసికావస్థను, తాత్త్విక చింతనను చారిత్రిక, సాంస్కృ తిక దృక్పథంతో సమీక్షించి, హరిజనులు ఆర్యులనీ, వారు నిర్మించిన అపూర్వ సంస్కృతియే భారతీయ సంస్కృతి అని నిరాఘాటంగా ప్రతిపాదించి ప్రచారం చేశారు. అట్టడుగున పడిన అనంతసత్యం భూమిని బ్రద్దలుచేసుకుంటూ అభి వ్యక్తం కావటానికి పడే సజీవవేదనగా వినిపిస్తుంది బోయి భీమన్నగారి కవితా వాణి.

భారతీయ సంప్రదాయంలో సహస్రపూర్ణచంద్ర దర్శనోత్సవం ఒక ప్రత్యేకతను సంతరించుకొని ఉంది. షష్టిపూర్తి, శతాబ్ది ఉత్సవాలు ముందుగా వయఃపరిణతిని సూచిస్తూ అపైన వ్యక్తిత్వ వికాసాన్ని ప్రకటిస్తాయి. కాని, సహస్రపూర్ణచంద్రదర్శనోత్సవం వ్యక్తి వయఃపరిపాకంకంటె అతడు సాధించిన

దార్శనిక విభూతిని ఎక్కువగా పట్టియిస్తుంది. డాక్టర్ బోయి భీమన్నగారు ఒక పరిణత పరిపూర్ణద్రష్టగా స్రష్టగా రూపొంది ఈ ఉత్సవం చేసుకోవటం ఆ ఉత్సవానికే ఒక సత్సంప్రదాయాన్ని పాటించిన సంతృప్తి కలిగింది.

మూడున్నత దశాబ్దాలకు పైబడిన సాహిత్య పరిచయంలో నన్ను డాక్టర్ బోయి భీమన్నగారు సోదరవాత్సల్యంతో చూచారు. వారికి నాపట్ల ఉండే అభిమానానికి నిదర్శనంగా సహస్రపూర్ణచంద్ర దర్శనోత్సవంలో వారు రచించిన "ఎంత చీకటి! ఎన్ని దీపాలు!!" అనే గ్రంథాన్ని నాచేత ఆవిష్కరింపజేయించారు. అదృష్టమేమంటే-ఆ గ్రంథం భీమన్నగారి భావజాలానికి వెలుగొందే కరదీపం! మహాకవి వ్యక్తిత్వాన్ని దర్శించటానికి ముంజేతి కంకణం! అందులో అరుదైన 44 జ్ఞాపకాల ఖండికలున్నాయి వచనంలోనే. జీవితంలోని అంతస్సంఘర్షణలలో చెలరేగిన అగ్నిశిఖలతో చిమ్మచీకట్లలో వెలిగించిన చిరుదివ్వెలుగా ఉన్నాయి ఈ గ్రంథంలోని వచనఖండికలు.

గ్రంథ శీర్షిక కవితామయంగా తలయెత్తింది. లోపలి ఖండికలు కవితలుగా మారబోయి వచన రచనలుగా జాలువారాయి. అయినా, అందులోని కవితావేశం ప్రత్యక్షరంలోనూ ప్రతిస్పందిస్తూ ఉంటుంది. 'దీపసభ' బోయి భీమన్నగా కవితా ప్రస్థానాన్ని ప్రారంభించిన ఈ కవి 'తమసోమా జ్యోతిర్గమయ' అనే మహా ప్రస్థానమే నేటికీ చేస్తున్నట్లు స్పష్టమౌతుంది. చీకటి ఏమిటి? దీపాలు ఏవవి? ప్రతీకాత్మక కవితాభివ్యక్తితోనే ముందుమాట మొదలౌతుంది ఈ గ్రంథంలో—

"ఆకాశం (అవకాశం)లోని చంద్రుడు, సూర్యుడు, గ్రహాలు, నక్షత్రాలు-అన్నీ ఒక్కసారిగా ఆరిపోతే ఎలా వుంటుంది?....దానిని హైందవ సమాజంలోని అంటరానితనంతో పోలిస్తే, అందులో పుట్టాను నేను. అతీ గతీ లేని అయోమయ అనాథస్థితి అది. అట్టి దుస్థితినుంచి నేను ఇంత దూరం సాగివచ్చానంటే, ఈ పురోగమనం ఎలా సాధ్యమయింది?

ఏదో ఒక దీపపు వెలు
గేదో ఒక మూల మిణుక కే మానవుడున్
నీ దారి తెలియ నేరడు—

అంటూ నేను 'దీపసభ' కావ్యంలో పేర్కొన్నాను.... నేను నా పురోగమనంలో అడుగడుగునా దారి చూపించిన అనేకానేక దీపాలను గురించి పేర్కొన్నాను" — అంటూ మొదలుపెట్టారు డాక్టర్ భీమన్నగారు. దీపాలుగా దారి చూపిన పెద్దలకు కృతజ్ఞతలు తెలిపారు.

మొన్న ఉపన్యసిస్తూ- అంటరానితనంలో ఉండే అనంత దుఃఖం ఈ తరం వారికి తెలియటం కష్టమన్నారు భీమన్నగారు. నిజం. సమాజం ఎంతో ముందుకు నడిచింది. ఆ గాఢాంధకారంలోనుండి చీల్చుకొని వచ్చిన పాంథునికి తెలుస్తుంది ఆ ప్రస్థానంలోని యమయాతన. భీమన్నగారు ఆ చీకటి గర్భంలోనుండి వెలువడటానికి సామాజికంగా, సాంస్కృతికంగా, సాహిత్యపరంగా, పరిపాలన పరంగా, తాత్త్వికపరంగా పంచావరణలను ఛేదించుకొని రావలసి వచ్చింది. అయితే, ఈ అయిదు మార్గాలలోనూ భీమన్నగారు జ్ఞాన ప్రధానమైన శాంతి పథాన్నే ఎన్నుకొన్నారు.

డాక్టర్ బోయి భీమన్నగారు హరిజన సమస్యతో తనను అద్వైతభావనం చేసుకొని ఆలోచించారు. భారతీయమైన పంచావరణాలలో హరిజనులే ఆదినుండి నాయకత్వాన్ని సాగించారని చారిత్రికంగా నిరూపిస్తూ ఎన్నో వ్యాసాలూ, పీఠికలూ వ్రాశారు. వారి రచనలన్నింటిలోనూ హృదయస్పందన, ఆలోచనా విధానం ఈ భావజాలాన్నే ప్రదర్శిస్తుంది. ఒక అర్థంలో ఈ గ్రంథంలోని దీపాలు భీమన్నగారి సిద్ధాంతాలు!

మచ్చుకు కొన్నింటిని ఉదాహరిస్తాను:

1. "ఈ దేశంలో మెజారిటీ జాతి హరిజనులే. జాతి యొక్క వైదిక పౌరాణిక, తాత్త్విక, సాంస్కృతిక నాయకత్వమంతా హరిజనులదే (వ్యాస వాల్మీకుల ద్వారా) అన్న గాఢ విశ్వాసం నాది. అక్షర సిద్ధాంతం నాది."

2. "అందుకే సర్వభారత జాతికి వాల్మీకి, వ్యాసుడూ వంటి మా హరిజన మహర్షులే, మూల పురుషులన్న సిద్ధాంతాన్ని నేను సనాతన వాఙ్మయం నుంచి పునరుద్ధరించి ప్రతిపాదించటం జరిగింది. ఈ నా వాదాన్ని ఏ బ్రాహ్మణ పండితుడూ, ఏ హిందూ మతాధిపతీ ఖండించడం లేదు. పైగా, చాలామంది సమర్థించారు కూడా."

3. "ఈ దేశంలో మైనారిటీలంటే మత మైనారిటీలే; జాతి మైనారిటీలు కాదు. పైగా, అన్ని మత మైనారిటీలు మైనారిటీలుగా పేర్కొనబడడం లేదు. క్రైస్తవులు, ముస్లింలు మాత్రమే అలా పేర్కొనబడుతున్నారు. అంబేద్కరు గారు స్పష్టంగానే ఈ విషయం చెప్పారు. ఈ రెండూ విదేశీమతాలు కనుక వీటిని తాను స్వీకరించటం లేదన్నారు. ఆయన ఉద్దేశం నిజమే అయినా, ఈ రెండు మతాలూ విదేశీ మతాలే అయినా, వాటిని అనుసరించి ఈ దేశం పౌరులుగా స్థిర నివాసా లేర్పరచుకొని వున్న క్రైస్తవులూ, ముస్లింలూ భారతపౌరులే గదా? మౌలికంగా ఈ దేశ ప్రజలే కదా? వైష్ణవులను, శైవులను, జైనులను మతం మైనారటీ లనటం లేదు కదా? ... "క్రైస్తవులను, ముస్లింలను చూచినప్పుడు మతాలు వేరైనా వీళ్ళంతా నావాళ్ళే అనిపిస్తుంది నా బంధువులే అనిపిస్తుంది. ఎంతకాలం వీళ్ళు ఈ నా దేశంలో మైనారిటీలుగా ఉంటారు అనిపిస్తుంది.''

4. "పశ్చాత్తాపపడవలసిన పని చెయ్యకు, చేసిన పనికి పశ్చాత్తాపపడకు- ఇదీ నా సిద్ధాంతం.''

5. "దేవుడు లేడు, పరమాత్మ ఉంది - అనేది నా మరొక సిద్ధాంతం.''

6. "నేను సాంఘిక రాజకీయ విషయాలను ఇతివృత్తాలుగా తీసుకొన్నప్పటికీ, నేను వ్రాసేది కవిత్వమే. నేను నిర్మించేది సాహితీ శిల్పమే.''

7. ''ఈనాడు కవిత్వం పేరుతో వస్తున్న అనేక రచనలు వట్టి ప్లాస్టిక్ బొమ్మలు. వాటికి శబ్దాలంకారాలూ, అనుప్రాసలూ, అంత్యప్రాసలూ, యమకాలూ, గమకాలూ వంటి అలంకారాలు తగిలించినా సజీవ సాహితీమూర్తులు కాలేవు. ఆత్మానందం కలిగించలేవు."

8. "నా సమకాలీన ఆధునిక కవులను గురించి చెప్పవలసి వచ్చినప్పుడు నాకు ఇష్టమైనవాళ్లూ, నన్ను ఎక్కువగా ఇష్టపడినవాళ్లూ ఇద్దరు- అందులో విశ్వనాథ సత్యనారాయణగారు ఒకరు. గుర్రం జాషువాగారు ఒకరు."

ఇలా ఎన్నో ఆణిముత్యాల్లాంటి భావవీచికలు ఈ గ్రంథంలో ఉన్నాయి. ఇవన్నీ యువతరానికి దీపాలే! భావితరానికి కరదీపికలే!

డాక్టర్ బోయి భీమన్నగారి భావజాలం ఆధునిక భారతీయ సమాజం స్నేహసౌహార్దాలతో మనగలిగే మహావాక్యాలను అందిస్తున్నది. హైందవసమాజంలోని కులవ్యవస్థ నుండి బహిష్కరింపబడే సాటి సోదరు లెవరో గమనించండని

హెచ్చరిస్తున్నారాయన. వారు ఇతర మతాలలో చేరే దుస్థితిని కల్పించవద్దని హితవు చెపుతున్నారు. మట్టిలో పుట్టిన మనిషికి మతాలగోడు కంటె ఈ మట్టి వాసన ముఖ్యమని ప్రబోధిస్తున్నారు.

"ఏ సామాజిక వ్యవస్థలోనైనా ఆయా వ్యక్తుల గుణస్వభావాలనుబట్టి వృత్తుల విభజన వుంటుంది. చెప్పులు కుట్టేవాళ్ళు, బట్టలు నేసేవాళ్ళు, కుండలు చేసేవాళ్ళు, భూమి దున్నేవాళ్ళు - ఆవిధంగా రకరకాల పనులు చేసేవాళ్ళు అన్ని దేశాలలోనూ, అన్ని జాతులలోనూ వుంటారు. వాళ్ల మధ్య సాంఘికమైన తరతమ భేదాలేమీ వుండవు.

"భారతదేశంలో - వేదకాలంలో కూడా హైందవ సమాజంలో కూడా అలాంటి భేదాలేమీ లేవు. భూమి దున్నేవాడు రాజ్యం పాలించేవాడుగా ఎదగ వచ్చు. చెప్పులు కుట్టేవాడు వేదగురువుగా వికసించవచ్చు. ఈనాడు వున్న కుల వ్యవస్థ ఆనాడు లేదు. కులవ్యవస్థ, వర్ణవ్యవస్థ ఒక్కటి కాదు.

"అందుకే నేను పదే పదే చెపుతున్నాను - ఈనాటి జాతి విచ్ఛిన్నకరమైన కులవ్యవస్థను తొలగించి ఆనాటి వైదిక వ్యవస్థలోని సోషలిజంవైపు పయనిద్దామని."

సహస్రపూర్ణచంద్ర దర్శన బుద్ధి పరిపాకంతో సమాజ హితాన్ని అందిస్తున్న డాక్టర్ బోయి భీమన్న గారి ప్రబోధం వచ్చే శతాబ్దానికి తప్పక ఒక వెలుగుబాటను చూపించగలుగుతుంది. వచ్చే శతాబ్దపు ఋషుల్లో బోయి భీమన్న ఒకడు! *

(ఆంధ్రభూమి 30.10.1994)

# కథాశిల్పం కవితలో కన్నీరు కారుస్తోంది

స్మృతి గీతం లేని సాహిత్యం ప్రపంచంలో లేదు. మొదట లయబద్ధంగా గీతంగా స్మృతి కవిత వెలువడినా వివిధ ఛందస్సులలో ఆ తరువాత కవులచేత ప్రయోగింపబడింది. ఒక్కొక్క కవి ఒక్కొక్క రకమైన స్మృతి కవితకు ఆయా సాహిత్యాలలో ప్రఖ్యాతి పొందుతూ ఉండటం సామాన్యం. తెలుగులో మిత్ర స్మృతి కవితకు శ్రీశ్రీ, సతీ స్మృతి కవితకు విశ్వనాథ, సుత స్మృతి కవితకు నాయని సుబ్బారావు గారలు చప్పున జ్ఞాపకం వస్తారు. శ్రీశ్రీ వచన కవితలో రాస్తే, విశ్వనాథ నాయనులు పద్యాలలో స్మృతి కవితలు రాశారు.

తెలుగులో స్మృతి కవితలకు కావ్య గౌరవం కూడా కల్పించారు విశ్వనాథాదులు. అయితే, స్మృతి కావ్యాలను వచనంలో కూడా శక్తిమంతంగా సృష్టించవచ్చని ఈమధ్య నిరూపించారు డాక్టర్ రావూరి భరద్వాజ. కాంతమ్మ వియోగం తరువాత ఇప్పటికి స్మృతి కావ్య సంపుటులను అయిదింటిని వెలువరించారు. భరద్వాజగారి అయిదవ స్మృతి కావ్యం 'ఒకింత వేకువ కోసం' భారతీయ భాషా పరిషత్తు పురస్కారానికి ఈ యేడు ఎన్నికయింది. భారతీయ భాషలలో ఉత్తమ తెలుగు రచయితగా డాక్టర్ రావూరి భరద్వాజగారు ఈ నెల 26 వ తేదీన కలకత్తాలో ఆ పురస్కారాన్ని అందుకోబోతున్నారు. కథారచయితగా, నవలా కర్తగా ఇదివరలో బహుమతులు, పురస్కారాలు పొందిన భరద్వాజగారు వచన స్మృతి కావ్యరచనలో తమ ప్రత్యేకతను సాధించిన గుర్తింపును ఈ పురస్కారం ద్వారా ప్రకటించుకున్నారు. సాహితీ లోకం పక్షాన వారిని అభినందిస్తున్నాను.

స్మృతి కావ్యానికి గాఢమైన సంవేదన (Mood) ను కల్పించటంలోనూ, వ్యక్తీకరించే పద్ధతి (Mode) లో ఒక నవ్యప్రక్రియా స్వరూపాన్ని రూపొందించటంలోనూ డాక్టర్ భరద్వాజగారు తెలుగులో విశిష్ట ప్రయోగాలు చేస్తున్నారు. వాటి విలువలను వివేచిస్తే ఆ ప్రయోగాల ప్రత్యేకత స్పష్టమౌతుంది.

స్మృతి కావ్యంలో వస్తు వైవిధ్యంతో ఛందో వైవిధ్యంతో ప్రక్రియా స్వరూపాన్ని మలచటాన్ని తెలుగుకవుల ప్రయోగాలు ప్రదర్శించాయి. స్మృతి

కావ్యం పద్య గేయ వచన కవితా రూపాల్లోనే వెలువడటానికి వీలుందని తెలుగు సాహిత్య లోకం తలపోస్తున్న సమయంలో డాక్టర్ రావూరి భరద్వాజగారు స్మృతి కావ్యానికి కథాస్వభావాన్ని విచిత్రంగా మేళవించి దానికొక ప్రత్యేకావతారాన్ని కల్పించారు. భరద్వాజగారి స్మృతి కావ్యాలు కథాశిల్పం కవితలో కన్నీరు కారుస్తున్నట్లుంటాయి. వస్తువు సతీవియోగ దుఃఖమే. దాన్ని శోకంగా, స్థాయి సంవేదనంగా, కావ్యంలో మొదటినుండి చివరిదాకా పోషించే రచనాశిల్పం భరద్వాజగారు కథాపరమైన ప్రవృత్తితో సాధించారు. దానికి కారణం డాక్టర్ భరద్వాజగారు స్వతస్సిద్ధంగా కథకులు కావటమే కథకుడు తీవ్రమైన సంవేదనకు గురియైతే కవితగాని, కవితాస్పృహగల వచనంగాని సహజంగా వెలువడుతుంది. ఆ కవితాస్పృహగల వాక్కులను కథా కథన శిల్ప మర్యాదలకు అలంకారాలుగా మార్చటంవలన ఒక నవ్యమైన అభివ్యక్తి ఆవిష్కృతమైంది. అది భరద్వాజగారి స్మృతి కావ్య శైలిగా మారింది. అంతస్సంవేదనను ఆద్యంతం మోసుకొనిపోయే రచనాశైలి వీరి కావ్య ప్రత్యేకత. అందువల్ల వీరి రచనలను స్మృతి కథా కావ్య శైలిగా సంకేతించవచ్చు.

ఈ కావ్య బహిస్స్వరూప లక్షణం దినచర్య రచనగా పైకి కనపడుతుంది. కాని, దినచర్యను కథా శిల్పానికి, సంవేదనకు అంగంగా మార్చే ఒక అంతర్లక్షణంవల్ల స్మృతి కావ్య స్వరూపం ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. ఒక్కొక్కనాడు ఒక్కొక్క స్మృతి ఒక్కొక్క కథా సన్నివేశంగాగాని, గాథగా కాని, ఊహా జల్పికగా కాని, వర్ణనగా కాని, పరివేదనగాగాని, స్పందనగా గాని, పరిశీలనంగాగాని, వివేచనంగాగాని, తాత్త్విక సమీక్షగాగానీ జాలువారుతూ ఉండటం ఈ రచనలోని విశేషం. సంవేదనాత్మకమైన ఒకే భావధార వస్తువును భిన్న కోణాలనుంచి కమ్ముకుంటూ తరంగ వైవిధ్యాన్ని ప్రదర్శిస్తున్నట్లుండటం గమనింపదగిన అంశం. అందువలన కావ్యంలో ఏకవాక్యత పూలల్లో దారంలా ప్రవహిస్తూ ఉంది.

భరద్వాజగారి రచన కవితలో కథ సాగినట్లుండదు; కథ కవితాస్పృహతో ప్రవహిస్తున్నట్లుంటుంది :

"దయచేసి నా దగ్గర కెవ్వరూ రాకండి
నే నిప్పుడో విఫలమయిన పున్నమిలాంటివాణ్ని
కాంచన గంగను పోగొట్టుకొన్న హిమాలయంలాంటివాణ్ని

మూడోకన్ను లేని మహేశ్వరుని లాంటివాణ్ని
శుక్రతార లేని చీకటిరాత్రిలాంటివాణ్ని
దయచేసి నా దగ్గర కెవ్వరూ రాకండి." (ఒకింత వేకువకోసం-పు. 22)
ఇది ఒక స్మృతిలో జాలువారిన కవితా ఖండిక. శోకభావ సంవేదనను బలపరిచే కవితాభివ్యక్తి. ఈ రచనలో ఇటువంటి కవిత సంవేదన తీవ్రతను వ్యక్తం చేయటానికి వాడబడింది. ''దయచేసి నా దగ్గర కెవ్వరూ రాకండి" - అనే పునరావృత్తి సంవేదన స్థాయిత్వాన్ని పోషిస్తుంది,

వాతావరణాన్నీ, మానసికావస్థలనూ (Moods) కల్పించటానికి రచయిత వర్ణనలను కవితాస్పృహగల మంత్రశక్తిగా వాడుకుంటాడు. కొత్త సంవత్సరం మొదటిరోజు స్మృతి ఇలా సాగింది - "పడుచు మేఘం మెరుపు కవిత్వం రాస్తున్నట్టు, వచ్చికమీంచి యవ్వనం పరుగులు తీస్తున్నట్టు, తీరాలు నదీ సుందరి అలల పెదవులను తాకుతున్నట్టు, కొమ్మలలో చిక్కుపడిన కిరణం నీడల తాడు మీదుగా నేలకు జారుతున్నట్టు, గాలిలో తేలుతోన్న రంగులు ఇంద్ర చాపంలా వొంగుతున్నట్లు, పూల కనుల నిండా కలల చినుకులు తుళ్ళుతున్నట్లు, కొత్త సంవత్సరం (1990) వచ్చింది; ఈ శతాబ్ది ఆఖరి దశాబ్దాన్ని మోసుకొంటూ; నా చీకటి జీవితంలోకి కార్తీక దీపంలాగా నీ వొచ్చినట్టు." (పు. 1.)

కాంతమ్మ కాపురానికి వచ్చిన స్మృతిలోని మాధుర్యం వర్ణన చవి చూపిస్తుంది. 'చీకటి జీవితంలోకి కార్తీకదీపంలా' వచ్చినట్లు చెప్పిన ఉపమానం 'ఒకింత వేకువకోసం'లో రచయిత స్మృతికావ్యమంతటా ప్రకటించిన మానసికావస్థను సూచిస్తోంది.

డాక్టర్ భరద్వాజగారి స్మృతి కావ్యాలు అయిదూ ఒక వికాసదశను వ్యక్తీకరిస్తున్నాయి. ఈ కావ్యాలలోని నాయికా నాయకులు అద్వైత ప్రణయ జీవితాన్ని సాగించారు ఆకస్మాత్తుగా ఆమె అతణ్ణి విడిచి స్వర్గానికి వెళ్ళిపోయింది. ఇతడు పాంచభౌతికంగా జీవిస్తూ, ప్రకృతిలోని పంచభూతాలలో లీనమైన ప్రణయమూర్తిని చైతన్యరూపంలో పొందాలని చేసే వింత విషాద యోగం ఇందులో అనుభూతికి అందుతూ ఉంటుంది.

మానవుడు పంచకోశాత్మక సంపుటి. అనుభవం క్రమంగా అయిదుకోశాల ఆవరణాలు దాటి ఆత్మదాకా ప్రసరిస్తుంది. కాంతమ్మ వియోగం భరద్వాజగారిలో గాఢమైన శోక సంవేదనను పుట్టించింది. అగ్ని ఆమె దేహాన్ని దహించింది:

శోకం అతని ఆత్మను ప్రజ్వలింపజేస్తున్నది. భూదేవి గర్భంలో ఆమె అంతర్ధాన మైంది; ఆయన అంతఃకరణంలో శాంతి అంతర్ధానమైంది. స్మృతి అగ్నికీలలా పంచకోశాలను దహిస్తోంది. మొదటి సంపుటం 'నాలోని నీవు'లో కాంతమ్మ స్మృతి అన్నమయకోశాన్ని ఆవరించుకొని జ్వలించింది. అందువల్లనే అతడు ఆమె మూర్తినీ, మూర్తిమత్వాన్నీ ఎక్కువగా స్మృతిపథంలో నిలిపి వరిత పించాడు. 'అంతరంగిణి' రెండో సంపుటి. మనోమయకోశంలో కాంతమ్మ స్మృతి మథన పెట్టిన పద్ధతి ఎక్కువగా కనవడుతుంది. కాంతమ్మ స్మృతులతో పాటు మనస్సు సామాజిక సమస్యలకు కూడా స్పందించిన మానవతకు ఈ కావ్యం చోటు కల్పించింది. 'ఐతరేయం', 'అయినా ఒక ఏకాంతం' మూడవ నాల్గవ సంపుటాలు. వీటిల్లో స్మృతిశిఖ సామాజికాంశాలపైనుండి ఆధ్యాత్మికాంశాల వైపు ప్రసరించటం గోచరిస్తుంది. జ్ఞానమయకోశంలో శోకాన్ని గురించిన తర్క వితర్కాలు మొదలై, వాటి ఆధ్యాత్మిక మూలాలవైపు ఆలోచన సాగుతుంది. ఈ ఆలోచన స్పందనలను అనుభూతి తరంగాలుగా మార్చుకొనే పరిణామం ప్రాణమయకోశంలో గోచరిస్తుంది. ఆ ప్రాణమయకోశంలోని శోకసంవేదనాత్మక మైన అనుభూతి తరంగిణి 'ఒకింత వేకువకోసం'లో ఒడ్డులొరసి పారుతోంది. శోకాగ్ని జీవాగ్నిలో లీనమయ్యే యోగం ఇందులో బలంగా కనపడుతుంది. అది ఆనందమయకోశంలోని చిదానందాగ్నిని ఈశ్వరునిగా దర్శింపజేస్తుంది. ఈ అనుభూతి నిచ్చెన నెక్కుతున్నట్లు రచయిత స్పందించాడు-

''దృశ్యమయిన సుశబ్దంలాగా ఉన్నావు
శ్రవ్యమయిన జ్ఞానకాంతిలా ఉన్నావు
అతీంద్రియమైన అనుభూతిలా ఉన్నావు
వ్యక్తమయిన సద్భావంలాగా ఉన్నావు
అవ్యక్తమయిన ఈశ్వర స్పర్శలా ఉన్నావు
అన్నా దతను నిలింపుడయి ఆమెను చూస్తూ." (పు. 75)

ప్రాణమయకోశంలో ప్రజ్వలించే శోకాగ్ని క్రమంగా జీవాగ్నిగా మారి ఈశ్వ రాగ్నిలో చేరుతుంది. అది అనుభూతిలో ఆనందమయకోశంలోని ఆత్మాగ్నిలా అద్వైతంగా నిలుస్తుంది. ఆ దశకు వేకువను చూపే సంపుటి ఇది. ఇంకా ఉషస్సును, సూర్యోదయాన్ని సూచించే మరికొన్ని కావ్యాలు వెలువడవచ్చు.

పంచకోశాలలో ప్రజ్వలిస్తున్న స్మృతిజ్వాల ప్రాణమయకోశాన్ని పట్టు కొన్న సంవేదనాత్మక కావ్యం 'ఒకింత వేకువ కోసం.' *

(ఆంధ్రభూమి 24-12-1993)

# శేషేన్ మార్కు 'జనవంశమ్'

"ఒక అందమైన పొయెం అంటే
దానికి ఒక గుండె ఉండాలి
అది కన్నీళ్ళు కార్చాలి
క్రోధాగ్నులు పుక్కిలించాలి
పీడితుల పక్షం అవలంబించి
మనిషి ఋణం తీర్చుకోవాలి
బ్రతకడానికి ఒక బురుజై మనిషి
విజయానికి జెండా అయ్ ఎగరాలి." (జనవంశమ్, పు. 299)

ఆధునిక సాహిత్యంలో అరవైయేళ్ళనుంచి ఒక మంచి బాణీ ఏర్పడింది. ప్రసిద్ధ కవులందరూ కావ్యం ఎలా ఉండాలి? కవిత్వం ఎలా ఉండాలి? అనే తమ దృక్పథాలను కావ్య ఖండికలుగా రాసి ఉంచటం ఒక సంప్రదాయమై పోయింది. 'సిందూరం రక్త చందనం .... కావాలోయ్ నవకవనానికి" అని శ్రీశ్రీ ఒక విధంగా ఈ మర్యాదకు శ్రీకారం చుట్టాడు. ఇందులో వున్న గడుసుదనం ఏమంటే - కవి తన కవిత్వంలో ఉండే సాపేక్ష లక్షణాలనే తన ఉద్యమ కవిత్వ సాధారణ లక్షణాలుగానో, తన యుగచైతన్యాన్ని మోసుకొని వచ్చే యుగకవితా లక్షణాలుగానో చెపుతూ, వాటినే సర్వకాల సర్వావస్థలలో కవితకుండవలసిన ఉత్తమ లక్షణాలుగా ప్రకటిస్తున్నట్లుండటం. అయితే, ఇటువంటి గడుసుదనం ప్రకటించినవారు ఈ అరవైయేళ్ళ కవితాచరిత్రలో వేళ్ళమీద లెక్కపెట్టదగినంతమంది మాత్రమే ఉన్నారు.

కవిత్వం అలా ఉండాలి, ఇలా ఉండాలి అనిగానీ; నా కవిత్వం ఇటువంటిది, అటువంటిది అనిగానీ ప్రకటించని కవి తెలుగులో లేడనే చెప్పాలి. శ్రీశ్రీ చెప్పినట్లు చెప్పాలనుకొని పులిని చూచి వాతలు పెట్టుకున్నట్లుగా పలికిన వాళ్ళు వందలమంది ఉన్నారు. కవిత్వమంటే వీళ్లకు ఓనమాలు తెలియవని వినేవాళ్ళకు ఒళ్ళు మండేటట్లు కవిత్వాన్ని గురించి కవిత్వం చెప్పిన కవులు ఆధునిక తెలుగు సాహిత్యానికి చేసిన అన్యాయం అంతా ఇంతా కాదు. అయినా,

ఈ యుగచైతన్య స్పందనను కవితాలక్షణాలుగా వివేచించిన కవులు అయిదుగురు ఉన్నారు. వారు కవిత్వాన్ని గురించి చెప్పిన కవితలు లాక్షణికసూక్తులులాగా సాహిత్యరంగంలో ప్రామాణికతను పొందుతున్నాయి.

ఆ ప్రామాణిక కవి పంచకం - శ్రీశ్రీ, విశ్వనాథ, తిలక్, కుందుర్తి, గుంటూరు శేషేంద్రశర్మ ఆధునిక కవితాలక్షణ చర్చలలో ఈ అయిదుగురు చెప్పిన కవితలు అయిదురకాల ఉద్యమాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. అందువలన వారి కావ్య కవితాలక్షణాలను తెలిపే కవితలు ఆధునిక కవితా పరిణామంలో మైలురాళ్ళుగా పనికివస్తున్నాయి.

లక్ష్యం ఉంటేనే లక్షణం పుడుతుంది. తన లక్ష్యాన్నే చూపి లక్షణం చెప్పేవాడు కవి. ఇతరుల లక్ష్యాలను సమీక్షించి లక్షణాలు చెప్పేవాడు విమర్శకుడు. పైన పేర్కొన్న కవి పంచకం తాము చెప్పిన కవితా లక్షణాలను తమ కవితలలో పాటించినవారు. మిగిలినవారిలో చాలమందికి ఆ సామర్థ్యం కనపడదు. అందువలన పై కవి పంచకం వెలువరించిన సాహిత్య దృక్పథాలను, వారి రచనలన్నింటినీ భద్రపరచవలసిన అవసరం, అధ్యయనం చేయవలసిన అగత్యం తప్పకుండా ఏర్పడుతోంది. ఇప్పటికే ఆయా కవుల రచనల సర్వస్వప్రచురణలు కొన్ని వెలువడ్డాయి. మరికొన్ని వెలువడుతున్నాయి. విశ్వనాథ సాహిత్యమంతా కొన్ని సంపుటాల్లో వెలువరించే ప్రయత్నం 1995 లో జరిగే శతజయంతి కన్నా ఒక రూపం దాలుస్తుందేమో చూడాలి. గుంటూరు శేషేంద్రశర్మగారు తమ కవితా సంపుటులన్నింటిని (చాలవరకు) కలిపి 'ఆధునిక మహాభారతము' (ప్ర.ము. 1985, ద్వి.ము. 1992, తృతీయసంస్కరణం 1993), 'జనవంశమ్' (1993) అనే కావ్యాలుగా ప్రచురించారు. అందులోనూ తమ 'శేషేన్ మార్కును' చెక్కుచెదరకుండా రక్షించుకున్నారు.

ఆధునిక మహాభారతం పది పర్వాల కావ్యేతిహాసం. ఒక్కొక్క పర్వం ఇదివరకే వెలువడిన ఒక్కొక్క కావ్యం. 'నా దేశం నా ప్రజలు' ప్రజాపర్వంగా, 'మండే సూర్యుడు' సూర్యపర్వంగా, 'గొరిల్లా' పశుపర్వంగా, 'నీరై పారిపోయింది' ప్రవాహపర్వంగా, 'అరుస్తున్న ఆద్మీ' ఆద్మీపర్వంగా, 'ప్రేమలేఖలు' ప్రేమపర్వంగా, 'సముద్రం నా పేరు' సముద్రపర్వంగా, 'శేషజ్యోత్స్న' జ్యోత్స్నపర్వంగా, 'ముక్తకాలు' మౌక్తికపర్వంగా, 'నేనూ నా నెమలి' మయూర పర్వంగా ఆ కావ్యేతిహాసంలో కూర్చబడ్డాయి.

ఈ కూర్పు సంకలనం అవుతుంది కాని, ఇతిహాసం ఎలా అవుతుంది? అని అనుమానపడే పఠితలకు పాశ్చాత్యుల ఎపిక్‌లాంటి ప్రక్రియను ఆధునికాంధ్ర సాహిత్యానికి అమూల్యమైన కానుకగా ఇస్తున్నానని శేషేంద్రశర్మగారు దాని కొక ప్రక్రియా వ్యక్తిత్వాన్ని కల్పించి ప్రదర్శించి తన 'శేషేన్ మార్కు'ను ముద్రించారు.

"ఇది నా కావ్య సంకలనం కాదు. ఇది నా కావ్యం. నా సంపూర్ణ కావ్యం. కవి అనేక కావ్యాలు రాయడు. కవి ఒకే మనిషి. ప్రవహిస్తున్న ఒకే జీవితం జీవిస్తాడు. అలాగే ఒకే కావ్యం రాస్తాడు. జీవితం ఒక యాత్ర; యాత్ర అనేక మజిలీల ప్రయాణం. దీని అర్థాంతరమే కవి కావ్యయాత్ర; అనేక కృతుల సాముదాయక స్వరూపం. అంటే-ఒక కవి తన జీవితంలో ఒకే కావ్యం రాస్తాడు. అయితే, దాన్ని అప్పుడప్పుడూ క్రమక్రమంగా రాస్తూ ఉంటాడు. అలా రాయ బడే ఒక్కో కృతి నిజంగా పూర్ణకృతికోసం పుట్టే ఒక్కో పర్వం. కావ్యయాత్ర అంతిమ చరణంలో అన్ని పర్వాలూ కలిసి ఒక కావ్యం మాత్రమే అవుతుంది" అని ఆధునిక కావ్యేతిహాసానికి నిర్మాణ శిల్పాన్ని శేషేంద్ర ప్రతిపాదించాడు. లక్ష్యాన్నిబట్టేకదా లక్షణం?

"ఈ ఆధునిక మహాభారతానికి 'ఋతువంశ'మనే అనుబంధ కావ్యం ఒకటి ఉంది - ఇంతటితో నా కావ్యయాత్ర ముగిసింది" అని 1985 లో ప్రకటించారు. ఋతువంశమ్ - ఇప్పుడు 'జనవంశమ్'గా పేరు మార్చుకొని వెలువడింది. ఇతి హాసానికి ఒక కావ్యం అనుబంధంగా రావటం విశ్వసాహిత్య సంప్రదాయంగా పేర్కొంటూ తమ ప్రయోగాన్ని సమర్థించుకున్నారు శేషేంద్రశర్మగారు.

"ఇతిహాసం యుగీనవాణి. పూర్వకాలంలో వచ్చిన ప్రతి ఇతిహాసానికి ఒక అనుబంధ కావ్యం ఉండేది - ప్రాచ్యదేశాల్లోగానీ, ప్రాశ్చాత్యదేశాల్లోగానీ. వాల్మీకి రచిత రామాయణానికి ఉత్తరకాండ అనుబంధ కావ్యము. అట్లాగే వ్యాసమహాభారతానికి అనుబంధ కావ్యం హరివంశమ్. ఇదే విధంగా ప్రాచీన కాలంలో గ్రీసులో వచ్చిన జగద్విదితమైన హోమర్ విరచిత ఇలియడ్ అనే ఇతిహాసానికి ఆడిస్సీ అనుబంధ కావ్యం. ఇతిహాస కావ్యరచనా ప్రక్రియాను సారంగా ఆధునిక మహాభారతానికి అనుబంధ కావ్యంగా ఈ 'జనవంశమ్' వచ్చింది."

హరివంశ స్ఫూర్తి కలిగేటట్లు జనవంశమన్నారు శేషేంద్రశర్మగారు. తాను చెప్పేది తన కథ అయినా, అది తన దేశకథ అనీ, అదే విశ్వమానవ కథ అనీ ప్రకటించిన కవి 'జనవంశమ్' ఆధునిక కావ్య స్వభావాన్ని వ్యంజింపజేసే పేరుగా భావించారు. ఉత్తర రామాయణంలాంటిదైనా జనవంశంలో రామాయణ కావ్యంలోలా అరు కాండలున్నాయి. కాండలలో కొన్నిచోట్ల ఖండాలు కూడా కుదురు చేసుకున్నాయి. ఖండకావ్యాల సంకలనం ఉన్నచోట ఖండాలను నిర్దేశించటం ఒక ఔచిత్యం. ఋతుకాండ, భ్రమరకాండ, ప్రజాకాండ, చంపూ కాండ, యుద్ధకాండ, చమత్కారిక కాండ అనేవి ఈ కావ్యంలోని అరు కాండలు.

ఈ కావ్యంలో పద్యకవిత లున్నాయి, వచనకవిత లున్నాయి, ఆశువు లున్నాయి, చాటువు లున్నాయి, చమత్కారిక లున్నాయి. మధమధ్య వచనంలో కథనం గూడా ఉంది. అక్కడక్కడ సంస్కృత శ్లోకాలున్నాయి. క్వాచిత్కంగా గేయ స్ఫూర్తిగల రచనలున్నాయి. ఈనాడు తెలుగు సాహితీ క్షేత్రంలో ప్రయోగంలో ఉన్న వాహికలన్నీ ఛందోరూపాలుగా ఇందులో ప్రత్యక్షమౌతాయి. అభివ్యక్తి కొక రూపం నిర్దిష్టంగా పేర్కొనటం అభివృద్ధి నిరోధకమేమో అన్న అనుభూతి కలిగేటట్లు ఈ కావ్యకృతి వైవిధ్యంతో భాసిస్తోంది.

మరొక విశేషం: శేషేంద్రశర్మగారు సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషు భాషలలో ధారాళంగా మాట్లాడగలరు, కవితలు చెప్పగలరు. ఆ మూడింటినీ మణిప్రవాళంగా వాక్యాలలో ప్రయోగించటం విప్లవ భాషా విధాతగా వినూత్న విన్యాసం. "ఆధునిక భారతస్య అనుబంధ కావ్యం జనవంశమ్‌లో ఋతుకాండం సమాప్తం" - ఇలా ఉంటుంది ఆశ్వాసాంత గద్యభాగమ్ కాన్షస్‌గా విద్వత్కవి చేసే విదూషక చమత్కారమ్?!

'జనవంశమ్' అనుబంధ కావ్యమ్. అంటే శేషేన్ మార్క్ పరిభాషలో 'ఒక అందమైన పోయెం.' *

(ఆంధ్రభూమి, 5-11-1993)

# శేషేన్ మార్కు పద్యం

''చంపి కొండల్లో పారేసిన వాడి శరీరం
ఒక రాగంకోసం బిగించిన ఫిడేలులా
పడి ఉంది
అతడి నోరు పాడిన పాటలు
ప్రవహించే నదులు ఆగి ఆలకించేవి
చావులేని వాడ్ని చంపే మూర్ఖులకు తెలీదు
ఏ మృత్తిక పువ్వును మనిషికి కానుకగా ఇస్తుందో
అది వాడి నిర్మాణంలో ఉందని'' (జనవంశమ్- పు 298)

ఇది శేషేన్ మార్కు పద్యం. కొండల్లో అడవుల్లో ఉంటూ విప్లవ పోరాటంలో ప్రాణాలు కోల్పోయిన అమరవీరుని శవాన్ని శిల్ప సుందరంగా వ్యాఖ్యానించే కవితాస్పృహ యిందులో సజీవంగా తొణికిసలాడుతోంది. ఒక నాడు కవిబ్రహ్మ తిక్కన బీభత్స రమణీయంగా వర్ణించే ఒక శిల్ప తరంగాన్ని కావ్యేతిహాస కవితలో పొంగించాడు. అర్జునుని బాణాల దెబ్బలకు తనువులు తూట్లు పడి రక్తం ధారలు ధారలుగా పారుతూ ఉన్న యుద్ధవీరుల శరీరాలను పూచిన మందార వృక్షాలుగా రూపించి, బీభత్స సన్నివేశాన్ని రమణీయమైన ఉపమానంతో ఆస్వాదింపజేసే కళామార్గం తెలుగు కవితకు కొత్తగా నేర్పాడు. ఆ కళను శిల్ప సుందరంగా పాటించిన తెలుగుకవులు ఆ తరువాత అరుదుగా కనపడతారు. ఆధునిక యుగంలో గుంటూరు శేషేంద్రశర్మగారు ఆ కళను అభినవంగా భావచిత్ర పరిధిలో ప్రవేశపెట్టి, దానికొక కళాతత్త్వ సూత్రాన్ని కల్పించి శేషేన్ మార్కును రూఢి కెక్కించారు. అందమైన పోయెంకు ఆయువు ఈ కవితాకళాస్పృహయే.

ఆధునిక కావ్యంలో కథ ఉండదు. బహు రీతులలో ప్రదర్శింపబడే భావాత్మక సంవేదన కావ్యాత్మ చైతన్యంలా తొణికిసలాడుతూ ఉంటుంది. అలంకారంగా, భావచిత్రంగా, ప్రతీకగా కనపడేదే కావ్యంలోని వస్తువు. మొదటి నుంచి చివరిదాకా కవి స్వీయ కళాంశగా ప్రవహిస్తూ పఠితలను తనతోపాటు

ప్రవహించేటట్లు చేసే శైలి కావ్యానికి రక్తప్రసారం లాంటిది. ఆకట్టుకొనే శైలి లేకపోతే ఆధునిక కావ్యం బ్రతుకుతున్న స్పర్శను పఠితలకు అందించలేదు. శేషేంద్రశర్మగారి కావ్యానికి ఈ లక్షణాలన్నీ సహజంగా, సమృద్ధంగా ఉన్నాయి.

'జనవంశమ్'లో మొదటి కాండ ఋతుకాండ. ఇందులో ఋతు ఘోష లోని పద్యాలతోపాటు మరికొన్ని వచన కవితలు కూడా సమకూర్చాడు కవి. ఋతుఘోషలో అంతర్వాహినిగా ఆత్మఘోష వినిపిస్తుంది.

"నాలో నున్నది మాధవ మ్మొకటి అంతర్భూతమై జీవన
జ్వాలాకీలకమై మదీయ మధుర స్వప్నప్రపంచమ్ములన్
బాలించున్ పరిణామ జీవిత దశావ్యాఖ్యాన సంకేతమై
కాలంబన్నది దుర్విలంఘ్యమని యుద్ఘాటించు నుచ్చైర్గతిన్." (పు. 11)

కవిలో ఉన్న 'మాధవం' కవిత. అది స్వప్న ప్రపంచాలను జీవన జ్వాలగా వెలిగిస్తూ పాలిస్తూ ఉంటుంది. అది జీవితంలో పొందే పరిణామ దశలను వ్యాఖ్యానిస్తుంది. 'కాలం దాటలేనిది' అని పెద్దగా ప్రకటిస్తూ ఉంటుంది. ఇది ఈ కాండలోని తత్త్వసూత్రం. కవిలోని కవితావసంతాన్ని మానవ జాతికి సర్వ సామాన్యంగా వర్తింపజేసి సమన్వయించుకోవాలి. కవి స్వీయచరిత్రే దేశచరిత్ర, మానవ జాతి చరిత్ర. వ్యక్తిలోని విశ్వజనీన చైతన్యాన్ని వ్యాఖ్యానించే ఈ పద్యం ప్రథమ కాండలోని ప్రాణం. ఇది ఒక భావాత్మక సంవేదనను పఠితలో జ్వాలగా వెలిగిస్తుంది; ఋతుకాండనంతా ఒక భావసంవేదనగా మారుస్తుంది. భావాలు, అలంకారాలు, భావచిత్రాలు, ప్రతీకలు అన్నీ ఆ భావ సంవేదనకు ప్రాణం పోస్తూ ఉంటాయి.

"కాలం రుతు చిత్రాలు గీయడానికి
నులోప్చి ఉన్న కాన్వాసే
వృక్షం-
పంచాంగాల్లో ఉండవు రుతువులు
జీవితాల్లో ఉంటాయి
అరణ్యాల్లో ఉంటాయి
చెట్టు చెట్టునా ఉంటాయి
రుతువులు
చెట్ల సుఖదుఃఖాలు.'' (పు. 6).

ఇందులో వృక్షం ప్రతీక. ఆరు ఋతువులనూ ఆకృతి కట్టించేది చెట్టు. అనుభూతులను వ్యక్తీకరించేది మానవుని మనస్సు. చెట్టు మానవ చైతన్యాన్ని వ్యంజింపజేస్తోంది. సుఖదుఃఖాలే ఋతువులుగా చెప్పబడుతున్నాయి. జీవితాలూ, అరణ్యాలూ వస్తు ధ్వనులుగా వెలిగిపోతున్నాయి. పద్యకవిత అలంకారంలో వస్తువును పొదివి చెప్పింది. వచన కవిత అలంకారంగానే వస్తువును ఆవిష్కరించింది. ఈ ఉభయ కావ్యశిల్పం శేషేన్ మార్క్ పద్యం.

భ్రమర కాండలో చెట్టుకు కవి చెప్పిన వ్యాఖ్యానం జీవనయాత్రలోలాగా ఈ కావ్య జీవనయాత్రలో కూడా తెలుసుకోదగిన అంతస్సూత్రాన్ని ఆవిష్కరిస్తోంది. "ఇవాళ నా జీవనయాత్ర తెలిపింది / చెట్టుపరచే ప్రతి నీడ / చెట్టు వ్యక్తిత్వపు సంపూర్ణ / సారాంశం అని.'' ఇదే కావ్య రచనా శిల్ప సారాంశం కూడా!

ప్రజాకాండలో రగులుతున్న పద్యాలున్నాయి. ''నా హృదయంలో ఒక పద్యం/రగులుకుంటోంది/అది లోకాన్ని దహిస్తుంది'' అని ఉద్యమ చైతన్యాన్ని కవి ధ్వనింపజేశాడు. ప్రజాకాండలో ప్రతి ఉదయం ఒక ఎన్‌కౌంటర్‌లాంటి భావచిత్రాన్ని గీసి చూపించి శేషేన్ మార్క్ సాధించాడు కవి. మచ్చుకు—

''ఉదయాన్నే కిరణాలు పోలీసుల్లా
ఏదో వెదుకుతున్నాయి తీవ్రంగా
చెట్లలో చెరువుల్లో ఇళ్ళలో
తామరపువ్వుల్లో
దూరి దూరి చూస్తున్నాయి దొంగలకోసం
పాపం వాటికి తెలీదు
రక్తకణాల్లో దాక్కొ ఉన్న దొంగల్ని
రాష్ట్రపతి కూడా పట్టుకోలేడు.'' (పు. 110)

'జనవంశమ్'లో చంపూకాండ పెద్దది. కవి జీవితంలోని వివిధ సన్నివేశాలలో చెప్పిన అనేక రకాల కవిత్వాలు సంకలనం చేయబడ్డాయి. యుద్ధ కాండలో ఆగ్రహం, కసి, అభిమానం, తిరస్కారం లాంటి భావాలను ప్రతిబింబించే కవితలున్నాయి. ''విప్లవమొక కాలపుహస్తం; దార్శనికత రెండోహస్తం'' అని అన్వయ సూత్రం. చమత్కారికా కాండలో - చెప్పిన చమత్కారాలే మరల

మరల చెప్పినవి ఉన్నాయి పునరుక్తి లేకుండా ఉంటే బాగుండేది. అయినా, చమత్కారిక ఒక్కొక్కటి - 'కవితా శాఖమీద పూచిన పుష్పం బాష్పం/బాష్ప గర్భంలో నుంచి జన్మించె శిశువు కవిత'' అన్నట్లుంటాయి.

శేషేంద్ర శర్మగారు విప్లవ కవిత్వం చెప్పారు. అందులోకూడా శేషేన్ మార్కు విస్ఫోటనం ఉంది. ఆగ్రహం వారి కావ్యంలో స్థాయిగా స్ఫురించే భావాత్మక సంవేదన.

''అరే బేటా వాణ్ణి మాత్రం నమ్మకు
వాడు జెండా లెగరేసే దొంగ
నీళ్లున్నచోటికే ఎగిరిపోయే కొంగ
భయపడకు నీ చేతిలో
రాళ్లున్నాయి రాకెట్లు లేకపోతేయేం
ఛాతీలో గుండె ఉంది
చేతిలో బందూకు లేకపోతేయేం" (పు. 96)

ఈ గద్దించే వ్యంగ్యవైఖరి శేషేన్ మార్కు. జీవితంలోని వివిధ భావాలూ, అనుభవాలూ సజాతీయ విజాతీయభావాలుగా ఆగ్రహాన్ని, విప్లవభావసంవేదనను కావ్యంలో పోషిస్తుంటాయని కవి సిద్ధాంతం. శిల్పాన్నీ, రసాన్నీ విప్లవకవిత్వానికి అన్నపానీయాలుగా అందించిన ఆధునిక మహాకవి శేషేంద్ర.

"శేషేన్ నీవు పీడిత ప్రజలకే చెందుతావు
అక్షరమై అందరికీ అందుతావు
మర్రిచెట్టు నీడనంతా నీవు
ఒక్క గులాబీనీడలోనే పొందుతావు." (జనవంశమ్- పు. 299)

(ఆంధ్రభూమి, 12.11.1993)

# ఆధునిక కావ్యకళ-బూతు, కామం, ప్రేమ

చండీఘర్ నగర నిర్మాణంలో మిగిలిన శిలాశకలాల నన్నింటినీ వృధాగా పారేయకుండా ఇంజనీర్లు శిలానందనాన్ని (రాక్ గార్డెన్) నిర్మించి తమ కళా రసికత్వాన్ని ప్రకటించుకొన్నారు. అలాగే మహా కవులు ఒకవైపు మహా కావ్యాలనో, ఉత్తమ కవితలనో రచిస్తూ అప్పుడప్పుడూ అవసరంకొద్దీ, వినోదంకోసం, విలాసంకోసం, వెక్కిరింతకోసం, వెటకారంకోసం కొన్ని చెదురు ముదురు భావాలను అలవోకగా అశువుగా చాటువుగా చెప్పి, తమ రసికత్వాన్ని ఒక్కొసారి ముద్దుగానూ, మరోసారి మొరటుగానూ ప్రకటిస్తూ ఉండటం గమనిస్తాం.

వయసులో ఉన్న ఏ కవి అయినా శృంగార కవిత్వం చెప్పటం, దాన్ని ప్రకటించుకోవటం కూడా సర్వ సామాన్యం. అయితే, అప్పుడప్పుడూ జనాంతికంగానో, స్వగతంగానో బూతు కవిత్వం చెప్పటం కూడా సహజమే. కాని, దాన్ని కొందరు గోప్యంగా మౌఖిక ప్రచారంలోనే ఉంచేస్తారు. మరికొందరు తెగించి సందర్భం చూసి అచ్చువోసి లోకంమీద వదులుతారు. ప్రచురించేటప్పుడు మాత్రం ప్రతిభావంతులైన కవులు బూతుకు కూడా ఒక సందర్భ శుద్ధిని, సన్నివేశ సౌందర్యాన్ని కల్పించటానికి యత్నిస్తారు. జీవితంలో భాగమైన బూతును తమ కవితాజీవితంలో భాగంగానే భావించి అన్ని రసాలతోపాటు దానికీ అనువైన పీట వేస్తారు.

శృంగారం మితిమీరి అశ్లీలం, అసభ్యం, అవాచ్యం చోటు చేసుకుంటే బూతు కవిత్వమౌతుంది. సభ్య ప్రపంచంలో వాటిని ప్రకాశంగా ప్రకటించ కూడదు. కాని, కవులలో కొందరు ఆంధ్ర భారతిని ఉద్ధరించటానికే బూతు కవిత్వం చెబుతున్నామనీ, ప్రచురిస్తున్నామనీ వాదించేవారున్నారు. వారిలో కీ. శే. ఆచార్య యస్వీ జోగారావుగారొకరు. వారు బూతును రసికతగా పేర్కొన్నారు. అటువంటి కవిత్వంలో కవిరాజునని చెప్పుకున్నారు.

"రసికత చచ్చి కావ్య మధురత్వ మెరుంగని దేబెగాళ్ళతో
మసినుసి యౌచునున్న కసుమాలపు కాలము దాపురించె నం
చసురుసురంచు నేడ్వకు మదాప్తుడు పంపన సూరివంటి స
ద్రసికులు నన్నుబోలు కవిరాట్లు సజీవులు నమ్ము భారతీ!"
(అపూర్వ కాకలి- ప. 174)

సరస్వతీదేవి బూతు కవిత్వం కోసం కన్నీరు మున్నీరుగా దుఃఖిస్తున్నట్లు జోగా రావుగారికి దర్శనమిచ్చినట్లుంది. పోతన్నలాగా పద్యం రాసి తమ బూతు కవిత్వ పక్షపాతాన్ని ప్రకటించుకున్నారు. వారి దృష్టిలో కవి చౌడప్ప బూతు కవిత్వం రాసింది జగద్ధితం కోసమే. ఈ పద్యంలో కవికీ చౌడప్పకూ జరిగిన సంభాషణ ఇది—

"అంత బూతు కవిత్వ మప్పనంబుగ నేల
చెప్పితిరి కవి చౌడప్పగారు?
"ముక్కోటి యాంధ్రులు మోదముం బొరయగా
కైత సెప్పితిని జగద్ధితముగ." (అపూర్వ కాకలి- స. 90)

స్త్రీపురుష దేహభోగవాంఛ వాచ్యమౌతున్నట్లు చెప్పే కవితావైఖరులను బూతు కవిత్వ మంటాం. స్త్రీ పురుష రతిభావం కళామయంగా భావనాశక్తితో కవితలో పరిమళిస్తున్నట్లు రచిస్తే శృంగార కవిత్వమంటున్నాం. సినిమా పాటల్లోలాగా, సెక్సు కథల్లోలాగా, నవలల్లోలాగా కామోద్రేకాన్ని కలిగించే రచనాపద్ధతిని కవిత్వంలో ఆధునికులు గౌరవించటం లేదు. శృంగారకవిని ప్రజలు బూతుకవి కింద జమకట్టే రోజులు కూడా వచ్చేయి అందువలన రెండిటినీ కలిపికొట్టి ప్రజలచేత చప్పట్లు కొట్టించుకొనే చౌకబారు కవులు కూడా ఈనాడు అధిక మయ్యారు. రసికత పేరుతో సాగే ఈ అరాచకత్వాన్ని కూడా సినిమాల్లోని రెండర్థాల అశ్లీల రచనలలాగానే బహిష్కరించటం మన కర్తవ్యం. ఈ ఉద్యమంలో కొందరు యువతీయువకులు, సంఘాలు ముందుకు రావటం ముదావహం.

'శృంగార కవిరాట్టు' నని ప్రకటించుకొన్న కవి శృంగారకవితనో, బూతుకవితనో చెప్పి తన సాహిత్య సార్వభౌమత్వాన్ని ప్రకటించుకోవటంలో కొంత సహజత్వం ఉంటుందని సర్దిచెప్పుకోటానికి వీలుంది. కాని, విప్లవ పంథాలో సాగే ఒక సుకవి శృంగారాన్ని గాని, ప్రేమనుగాని ప్రదర్శించే కవిత్వం రాయటంలో గానీ, కామభావోద్రేకాన్ని కలిగించే కవిత చెప్పటంలో గాని ఔచిత్యం ఉందా? ఎలాగైనా సర్దిచెప్పుకోటానికి వీలుంటుందా? అన్నది మీమాంస. విప్లవకవికి జీవితంలో స్త్రీపట్ల వైముఖ్యముంటుందని అనుకోవటం పొరపాటే. అయితే, అతని చిత్తవృత్తి విప్లవోద్యమానికి అంకితమై ఉన్నప్పుడు, అతనిస్థాయి భావాత్మక సంవేదన విప్లవోద్యమాన్నీ, రౌద్రాన్నీ పోషించాలి కాని, శృంగారం వైపుగాని, కామం వైపుగాని ప్రసరించినట్లు చిత్రించకూడదు.

విప్లవ కవిత్వాన్ని రాస్తున్నానని ప్రకటించుకొన్న గుంటూరు శేషేంద్ర శర్మగారు ఆధునికేతిహాసంలో గాని, దాని అనుబంధ కావ్యంలో గానీ శృంగార భావాత్మక సంవేదనను ఒక భాగంగా ప్రపంచించటంలో ఉన్న శిల్పౌచిత్యాన్ని గురించి ఆలోచించవలసే ఉన్నది. ఇతిహాసంలో మానవ జీవన ప్రవృత్తులన్నీ ప్రతిఫలిస్తాయనీ, అందువలన విప్లవ భావాలతోపాటు యావత్తు మానవ జీవిత సామగ్రి ఆధునిక భారతంలోనూ, జనవంశమ్‌లోనూ ప్రతిఫలించినట్లు వివిధ పర్వాలలో, కాండలలో చిత్రింపబడిందనీ కవి చేసుకున్న సమర్థన. అది ఆయన ఏర్పరుచుకున్న కావ్య లక్షణం కూడా!

శేషేంద్రశర్మగారి దృక్పథంతోనే, వారు చెప్పిన లక్షణంతోనే వారి ఇతిహాస కావ్యాలను వివేచిస్తే విప్లవ చైతన్యాన్ని సమర్థించే భావాత్మక సంవేదన రచన మొత్తంలో స్థాయిగా ఏకవాక్యత ననుసరించి పఠితకు స్ఫురించాలి. ఆధునిక విప్లవ కావ్యేతిహాసంలో పోషింపబడే శృంగారం కూడా తనూసంగ భావానికంటె విప్లవోద్యమానికి అంకితమయ్యే త్యాగభాగంవైపు మొగ్గుచూపుతున్నట్లుండాలి. ప్రేమికులు సైతం విప్లవానికే తమ ప్రేమను పణంపెట్టి ప్రాణాలను ఉద్యమంకోసం అర్పిస్తున్నట్లు చిత్రించాలి. ఇతిహాసంలో భావసంవేదన ఎంత ముఖ్యమో, స్థాయి భావ సంవేదనకు సజాతీయ విజాతీయ భావసంవేదనల పరిపోషకత్వంకూడా అంతే ముఖ్యం. విప్లవకావ్యంలో శృంగారానికి ఉండదగిన విధాన మెటువంటిది? స్థాన మెటువంటిది? అన్న వాటిమీదనే దాని ఔచిత్యం ఆధారపడి ఉంటుంది.

'ప్రేమలేఖలు' కావ్యం ఆధునిక మహా భారతంలో 'ప్రేమపర్వం'గా మారింది. మారినందుకు విచారం లేదు. అయితే, విప్లవ భావాత్మక సంవేదనకు ఆలంబనంగా ఆత్మకథను - విశ్వమానవ కథగా చెపుతున్న కవి - ప్రేమను విప్లవ చైతన్యానికి పోషకంగా మలచినట్లు ఆ పర్వంలో చిత్రించినట్లయితే కావ్య శిల్పం కనపడేది. ''ఎంత బాధ కలిగించినా ఎంత కన్నీరు పారించినా హృదయాన్ని ఎంత శిథిల సామ్రాజ్యంగా మార్చినా ఈ ప్రేమ మాత్రం ఉండనీ'' - అనే కోరికతో ప్రేమపర్వం మొదలౌతుంది. అందులో కొంత ఔన్నత్యం, ఔదార్యం గోచరిస్తున్నాయి కాని, చివరకు - ''నన్ను అహర్నిశలూ వేధించే కీర్తి స్వప్నాలన్నీ రద్దు చేసుకుంటా-నీతో కలిసి హాయిగా నిద్రపోవాలనే ఒక్క స్వప్నంకోసం ఒక గమ్యంకోసం తక్కిన ప్రయాణాలన్నీ త్యాగం చేసుకుంటా"

సనటం ప్రధాన విప్లవ భావాత్మక సంవేదనకు సాక్షాత్ విరుద్ధం. దీనికితోడు - "ఆ రెండు తొడల్లో నుంచే నా ఆనందబ్రహ్మలన్నీ ఒడుక్కునేలా ప్రేమిస్తా" అని అనటం ప్రేమ తత్త్వాన్ని కామరూపంలో బూతుకోసం మంట కలపటం. విప్లవవీరుడు ప్రేమికుడు కావాలి. అవసరంవస్తే తన ప్రేమను విప్లవోద్యమం కోసం బలిదానం చేయాలి. అది వీరుని లక్షణం. ప్రియురాలి రెండుతొడలమధ్య ఆనంద బ్రహ్మలను దర్శిస్తూ, ఆ గమ్యం కోసం తక్కిన ప్రయాణాలన్నీ త్యాగం చెయ్యకూడదు. ఇది సంప్రదాయ భాషలో చెపితే రసభంగం. విప్లవ పరిభాషతో చెపితే ఉద్యమభంగం. ప్రేమను కామంగా బూతుగా చిత్రించే భావ సంవేదనం 'జీవన సంగ్రామం నుంచి పారిపొమ్మనే పిరికితనం.'

ఆధునిక భారతంలో లాగా, దానికి అనుబంధ కావ్యమైన 'జనవంశమ్'లో కూడా చంపూకాండలో 'ప్రేమఖండం' ఉంది. అందులో కూడా కామోద్దీపనమే కాని, ప్రేమోపాసనం లేదు. స్త్రీ శరీరభోగవాసన ఈ పద్యంలో గుప్పున గుబాళిస్తుంది.

"కులుకుం బంగరు బొంగరంబులబలెన్ గుత్తంపు జాకెట్టులో
కొలువై యున్న సమున్నత స్తనములన్ కుంభించి హస్తద్వయిన్
కలయం బట్టి మధింపనీవె సుమనోగంధీ! తదీయాగ్రముల్
కలచెన్ చిత్తకవాటపాటన కళాకౌశల్యశల్యంబులై."

(జనవంశమ్ - పు. 133)

భావాలను ఆవేశంతో కవితాకళగా మలచటం వేరు; కావ్యశిల్పంలో భాగాలుగా భావించటం వేరు. పర్వాలను కట్టకట్టటం కాదు కావ్యశిల్పం; ప్రధాన భావాత్మక సంవేదనకు పోషకంగా సంవిధానం చేయటం శిల్పం. సంయమనంలేని శృంగారం ఆధునిక కావ్యశిల్పం కాదు! *

(ఆంధ్రభూమి 19-11-1993)

# కొత్తబాట చూపిన కరదీపిక చేతనావర్త కవితాభూమిక!

ఈమధ్య రాజధానిలో చాలరకాల రజతోత్సవాలు జరుగుతున్నాయి. పుట్టి పాతికేళ్లైనందుకు కొన్ని; బట్టకట్టి, గజ్జెకట్టి, కలంపట్టి, తాళిగట్టి, బహుమతి చేపట్టి ఇరవై అయిదేళ్ళయినందుకు మరికొన్ని - ఇలా ఎన్నోరకాలు. వాటిలో ఆడంబరాలకు పోయినవి కొన్ని. నిశ్శబ్దంగా సాగినవి కొన్ని. 'చేతనా వర్తం' రెండు సంపుటాలు కలిపి రజతోత్సవ ముద్రణగా వరంగల్ సాహితీ బంధుబృందం ప్రకటించింది. దాని ఆవిష్కరణ సభ హైదరాబాదులో జరిగింది. 'చేతనావర్తం' ఎంత నిశ్శబ్దంగా సాహితీజగత్తులో సాగిందో ఆ సభలోనే దాని రజతోత్సవం కూడా అంత నిరాడంబరంగా జరిగింది.

చేతనావర్త కవుల్లో ఒకరైన సంపత్కుమారగారు ఆప్యాయంగా రజతోత్సవ ప్రతిని నాకు పంపారు. ముఖచిత్రం చూడగానే ఒక్కసారి చేతనా వర్తంలో మునిగితేలినంత అనుభూతిని పొందాను. సాహిత్యధోరణిగా అది నిర్వహించిన పాత్రను నెమరువేసుకోకుండా ఉండలేకపోయాను.

'రజతోత్సవ ముద్రణ' అనగానే ఆ ధోరణి సాగించిన ఇరవై అయిదేళ్ళ నిరంతర జీవనధారను తెలిపే కవితల విలువైన సంకలనమేమోనని పఠిత ఉత్సాహపడతాడు. కాని, అది పునర్ముద్రణం మాత్రమే. 1967 లో, 1970 లో సుప్రసన్న, పేర్వారం జగన్నాథం, సంపత్కుమార, వే. నరసింహారెడ్డిగారలు ప్రచురించిన రెండు వచన కవితా సంకలనాలను ఇప్పుడు కలిపి ఒక సంపుటిగా ముద్రించారు. వడలి మందేశ్వరరావుగారి సమీక్ష, పేర్వారం జగన్నాథంగారి ముందుమాట దానికి మకుటాలుగా జోడించారు. చేతనావర్త కవితా సంపుటులు దొరకని ఈ రోజుల్లో ఈ ముద్రణ వాటిని అందరికీ అందుబాటులోకి తెచ్చింది.

'చేతనావర్తనం' మొదటి సంపుటికి సుప్రసన్నగారు సంపాదకుడుగా 'భూమిక'ను సమకూర్చారు రెండవసంపుటికి సంపత్కుమారగారు 'అనుశీలన'ను

అందించారు. ఆ రెంటినీ కలిపిన ఈ సంపుటికి జగన్నాథంగారు ముందు మాట రాశారు. నరసింహారెడ్డిగారు బ్రతికివుంటే ఇప్పటికి నాలుగు సంపుటాలూ వచ్చి ఉండేవేమో! కాలపురుషుడు కఠినంగా వ్యవహరించాడు. నరసింహారెడ్డిగారి జీవితానికీ చేతనావర్త సంపుటులకూ విడదీయలేని లంకె పెట్టాడు.

పేర్వారంగారి ముందుమాట సహజంగానే ఘాటుగా ఉంది. చేతనావర్త కవితాధోరణి పుట్టిన పరిస్థితులకు స్వయంగా గట్టిగా స్పందించి పలికిన మాటలవి. చేతనావర్త స్వీయ కథలాగా, జీవుని వేదనలాగా సాగిన వారి వ్యాసం సాహిత్యోద్యమకారులను కదిలించివేస్తుంది.

నాకు చేతనావర్త కవులు నలుగురూ మిత్రులే. ఒక్కొక్కరు ఒక్కొక్క విశిష్ట వ్యక్తిత్వం కలవారు. సుప్రసన్నగారు దార్శనికుడైన సహజ కవి. సంపత్కుమారగారు సంవేదనాత్మక విమర్శక కవి. పేర్వారంగారు అధిక్షేపాత్మక చమత్కార కవి. నరసింహారెడ్డిగారు భారతీయమైన ఏకాత్మను దర్శించటానికి ఎగిసిపడే సాగర తరంగం లాంటి ఆవేశ కవి. మనిషికుండే అయిదు కోశాల్లో 'సుప్రసన్న' తన కవితతో ఆనందమయకోశాన్ని స్పృశించి, ప్రాణ చేతనకు పారవశ్యాన్ని కలిగిస్తాడు; 'సంపత్కుమార' విజ్ఞానమయకోశంలో ప్రాణచేతనకు వికాసశీలాన్ని కలిగిస్తాడు 'పేర్వారం' మనోమయకోశంలో చైతన్యానికి చమత్కార జీవితాన్ని అందిస్తాడు. 'నరసింహారెడ్డి' అన్నమయ కోశంలో ప్రాణచైతన్యాన్ని ఆవేశపరుస్తాడు. నలుగురివీ నాలుగురకాలైన అభివ్యక్తి పద్ధతులు, అయినా, నలుగురినీ కలిపి చదువుకుంటే పఠితకు ఒక పరిపూర్ణ సంతృప్తి. అదే మానవ ప్రాణచేతన ఒక ఆవృత్తి పొందిన కవితానుభూతి. అటువంటి అనుభూతిని అధికరించి పెట్టిన పేరు 'చేతనావర్తం.'

రజతోత్సవ ముద్రణకు విశేషాకర్షణగా చేర్చిన వడలి మందేశ్వరరావుగారి సమీక్ష ఎందువల్లనో రక్తి కట్టలేకపోయింది. చరిత్రలో గతించిన ఒక ఘట్టాన్ని గుర్తు చేసుకొని యాంత్రికంగా నెమరు వేసుకున్నట్లనిపించింది. నిజమే, కొంతమందికి ఒక అనుమానం కూడా రావచ్చు. దిగంబర కవితా సంపుటాల్లాగా, చేతనావర్త సంపుటాలు కూడా మధురస్మృతులకు మైలురాళ్ళుగా మిగిలిపోతాయా? అని. దిగంబర కవులు ఆశ్రమం మార్చారు. చేతనావర్త కవులు సంకలనాలు మానారు. వారు పూర్వాశ్రమంలో దిగంబరులు; కాని, వీరు తమ ధోరణిని మానారా? ఇప్పటికీ వీరు చేతనావర్త కవులుగా జట్టుకట్టి రచనలు

చేస్తున్నారా? చేతనావర్తాన్ని చరిత్రలో ఒక చిన్న సన్నివేశంగా జీవించి వదిలారా? అనేవి ఇన్ని పీఠికలు చదివిన తరువాత కూడా పఠితకు అనుమానంగానే మిగిలిపోతాయి.

దివాకర్ల తిరుపతి శాస్త్రిగారు దివగంతులైన తరువాత చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు 'తిరుపతి వేంకటీయం'గానే కవితలు రాసి ప్రచురించేవారు - వారు జంటకవులు కాబట్టి. నరసింహారెడ్డిగారు చనిపోయిన తరువాత చేతనావర్త కవులు మగ్గురూ కలిసి మరొక సంకలనం తీసికొనివచ్చి ఉంటే చేతనావర్తం నేటికి చైతన్యవంతంగా ఉందని భావించటానికి వీలుకలిగి ఉండేది. అందువలన అది మూడేళ్ళ ధోరణి అయింది. అయినా, నేటికీ దాని ప్రభావం ఉన్నదని ముందుమాటలు చెపుతున్నాయి

అధునిక సాహిత్యంలో బృందకవులుగా కొందరు ప్రసిద్ధికెక్కారు వారిలో దిగంబర కవులు, చేతనావర్తకవులు ముఖ్యులు. అయితే, చేతనావర్త కవులలో ఏకసూత్రత ఏమిటి? అనే అంశంమీద చాలమంది ప్రశ్నిస్తూ ఉంటారు. దానికి ఆ కవులే ఎన్నో విధాలుగా వ్యాఖ్యానించి చెప్పుకోవలసివచ్చింది. సుప్రసన్నగారి మాటల్లో—"మానవ జీవితం ఐహికలోకం, భావలోకం, ఆధ్యాత్మికలోకం అని మూడు విధాలుగా విభజించవచ్చు. సమగ్రమైన మానవ వికాసానికి అన్నిరంగాల సమన్వితమైన వికాసం అవసరం. పాక్షికదృష్టి అభివృద్ధి హేతుకం కాదు. ఈ సమన్వితికోసం ఈ కవులు భావి దర్శనం చేస్తున్నారు. ఈ దర్శనం వీళ్ళను కవితారూపాన బంధిస్తూ ఉన్న ఏకీకృతి.'' (పుట 127).

సుప్రసన్నగారి వాక్యం కరదీపిక. దాని సాయంతో నలుగురి కవితలూ అన్వేషించాలి. ఆ ఏకత్వాన్ని దర్శించుకోవటం మన వంతు. శక్తికొద్దీ దర్శనం.

"ప్రతి ఒక్కడు ఒక దీపశిఖ
ఎవడిమనస్సు వాడికే ఆవిష్కారశాఖ
కాని, ఒకటే ప్రాణస్రోతస్సు అంతటికీ
అదే జీవనాధార.'' —సుప్రసన్న (పు. 19)

ఏమైనా చేతనావర్తం చేసిన మేలు మరువలేం.

1. భారతీయ దార్శనిక దృక్పథంతో సమగ్ర మానవ చేతనను భావించి, దర్శించి, దానికి సంబంధించిన భావజాలాన్నీ, భావచిత్రాలనూ, ప్రతీకలనూ వచనకవితాప్రక్రియలకు అందించి పోషించిన సాహిత్యధోరణి చేతనావర్తం.

2. 1962 చైనా యుద్ధం తరువాత అభ్యుదయ వాదులలో చీలిక లొచ్చాయి. దానితో ఎంతటి అంతర్జాతీయ సిద్ధాంతమైనా జాతీయవాదం పునాదిగా లేకపోతే నిలవడం కష్టమని తేలింది. ఆ అవగాహనలోనుండి అవతరించింది చేతనావర్తం.

3. సమాజానికి షాక్ ట్రీట్ మెంట్ అనే పేరుతో కసితో, తిట్లతో అశ్లీల, జుగుప్సాకర దిగంబర కవిత్వం విజృంభించిన తరుణంలో సమాంతరంగా నిలచి సాహిత్యగౌరవాన్ని, మానవ మూల్యాలనూ సంరక్షించిన చైతన్యం చేతనావర్తం.

4 వచన కవితకు అభివ్యక్తి వైవిధ్యాన్ని అందించి అంతశ్శక్తిని పెంచిన ధోరణి చేతనావర్తం.

సాహిత్యంలో సాహిత్యేతర సిద్ధాంతాలకు ప్రాధాన్యం ఇచ్చేవారు భావకవిత్వం తరువాత అభ్యుదయ, దిగంబర, విప్లవ కవిత్వాలొచ్చాయని చెపుతారు. సాహిత్య సిద్ధాంతాలకు, జాతీయవాదానికి ప్రాముఖ్యమిచ్చేవారు నవ్యసంప్రదాయ, చేతనావర్త, అనుభూతి కవిత్వాలొచ్చాయని సమాంతరంగా చాటుతున్నారు. ఇలా సమాంతర సాహిత్య మార్గదర్శనానికి కరదీపికగా పనిచేసింది చేతనావర్త కవితా భూమిక! *

(ఆంధ్రభూమి, 18-6-1993)

# షష్టిపూర్తి చేసుకున్న ఉభయకవిమిత్రుడు

కొంతమంది సాహితీ మిత్రుల్ని చూడగానే అప్రయత్నంగా వారిని ఏదో బిరుదనామంతో పిలవాలని అనిపిస్తుంది. ఒక్కొక్కసారి అంతరాత్మ ప్రబోధించిన అనుభవం కూడా స్ఫురిస్తుంది. ముద్దుపేర్లకంటె, కలం పేర్లకంటె, బిరుద నామాలు ఒక ప్రత్యేకతను కలిగి ఉంటాయి కూడా. పిలిచేవాడి అభిరుచి నుండి పుట్టేది ముద్దుపేరు. పెట్టుకొనేవాడి స్వభావరుచిని వ్యక్తం చేసేది కలం పేరు. పిలవబడే వాని వలన పిలిచేవాడు అంతఃకరణాల ద్వారా పొందే అనుభవంనుంచి అలవోకగా ఆవిర్భవించేది బిరుదనామం. బిరుదం వేరు. బిరుదనామం పేరు. బిరుదం గౌరవంతో ఇచ్చేది. బిరుదనామం ప్రేమతో, అభిమానంతో పిలిచేది. బిరుదం ఒక గౌరవపట్టాలాంటిది అనుభవం కంటె దానికి అధికారలాంఛనా లెక్కువ. బిరుదనామం మాత్రం బిరుదం కాదు ఒక్కొక్కసారి బిరుదం కూడా బిరుదనామంగా చెలామణి కావచ్చు

మిత్రులు 'సంపత్కుమార'ను (ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యులు) తలచుకొన్నా, కలుసుకొన్నా నా గుండె గొంతుక 'ఉభయకవిమిత్రు'డనే బిరుద నామంతో పలకరిస్తుంది. నిజానికది తిక్కనకున్న బిరుదం. సంపత్కుమారను నేను అభిమానంతో పిలుచుకొనే బిరుదనామం. ఆ అభిమానం సాహితీపరమైంది మాత్రమే వారి సాహితీమూర్తి సహజంగా నాలో స్పందింపచేసే సాహితీపరమైన స్నేహానుభూతికి ఆ పేరు ప్రతీక. ఈ బిరుదనామాన్ని గురించి నేను ఎన్నోసార్లు మథనపడ్డాను. ఆలోచించినకొద్దీ సంపత్కుమార నాకేకాదు - సాహితీమిత్రులంద రికీ ఉభయకవి మిత్రుడుగా ఒక విలక్షణమైన అనుభవాన్ని అందించే వ్యక్తిత్వం కలవాడని అనుమానం లేకుండా తేలింది. వారి షష్టిపూర్తి మహోత్సవాల సంద ర్భంగా (జూన్ 23,24,25 తేదీలలో వరంగల్లులో జరిగాయి) నాలో నలుగుతున్న ఈ పేరును నలుగురి ముందూ వారికి చదివిస్తున్నాను.

సంపత్కుమారను తిక్కనగారితో పోల్చటం కాదు ఈ బిరుదనామ పరమార్థం. ఆనాడు తిక్కన్నను ఆ బిరుదంతో పిలిస్తే సమకాలీనుల కెటువంటి స్పందనలు కలిగాయో స్పష్టంగా చెప్పలేముగాని, ఆధునికులకు 'ఉభయకవి

మిత్రు'డనే బిరుదనామం ఇచ్చే సమకాలీనానుభవాలకి కొంత వ్యాఖ్యానం చేయగలం.

సంస్కృతాంధ్రాలలో కవిత్వం చెప్పినందుకు తిక్కనను ఉభయకవిమిత్రుడని పిలిచేవారని సమకాలీనుడు కేతన తన దశకుమారచరిత్ర అవతారికలో చెప్పాడు. ఆ మాటకు వస్తే సంపత్కుమార కూడ ఉభయ భాషలలో కవిత్వం రాయగలడు. అయితే, ఆధునికులు తిక్కనగారి బిరుదానికి కేతన చెప్పిన అర్థం ఒకటి మాత్రమే సరిపోతుందని అనుకోలేదు. కడచిన ఒకటిన్నర శతాబ్దికి పైగా తమకు తోచిన వ్యాఖ్యలు చేస్తూనే ఉన్నారు. అలా చేసినవారిలో సంపత్కుమార కూడా ఒకరు. కావ్య మీమాంసలో రాజశేఖరుడు కవులను మూడు రకాలుగా పేర్కొన్నాడు. 1. శాస్త్రకవి, 2. కావ్యకవి, 3. ఉభయకవి. వీరిలో ఉత్తరోత్తరులు శ్రేష్ఠులన్నాడు. తిక్కన అటువంటి ఉభయ కవులకు మిత్రుడని సంపత్కుమార వ్యాఖ్యానం. ఆ వ్యాఖ్యానం కేతన తిక్కన వ్యక్తిత్వాన్ని గురించి చెప్పిన విశేషాలన్నింటినీ సమన్వయించుకుంటే సరిపోతుందని చెప్పారు. తమ 'పూర్వకవుల కావ్యదృక్పథాలు' గ్రంథంలో.

సంపత్కుమార తమ తండ్రిగారైన కోవెల రంగాచార్యులుగారి వద్ద సంస్కృతం అధ్యయనం చేశారు. చిట్టిగూడూరు సంస్కృత కళాశాలలో 'భాషా ప్రవీణ' కోసం చదివారు. (1953). ఉస్మానియా విశ్వవిద్యాలయంలో తెలుగులో (1963), హిందీలో (1966) ఎం.ఏ, డిగ్రీల కోసం అధ్యయనం చేశారు. నేర్చిన భాషలన్నింటిలో కవిత్వం కూడా చెప్పగలరు. అయినా తిక్కనలాగా తెలుగులోనే కవితలు వెలయించారు. ఒక విధంగా కేతనలాగా చూచినా సంపత్కుమార ఉభయకవి మిత్రుడు. సంపత్కుమార సమన్వయంతో సమీక్షించినా, అంటే రాజశేఖరుడు చెప్పిన ఉభయకవిగా లెక్కకట్టినా ముమ్మూర్తులా సరితూగేవాడు. నేడు ఆంధ్రప్రదేశంలో ఛందశ్శాస్త్రం మీద తెలుగులో ప్రామాణికంగా మాట్లాడగలిగిన శాస్త్రజ్ఞుడు సంపత్కుమార. వేదాలనుండి వచనకవిత్వ ప్రయోగాలదాకా లక్ష్య లక్షణ సమన్వయంతో ఒక శాస్త్రసంప్రదాయం ప్రకారం ఆలోచించి వ్యాఖ్యానించగలిగిన వారిలో సంపత్కుమార మొదట లెక్కింపదగినవారు. ఒక మాటలో చెప్పాలంటే అటు పద్యకవితలు రాసే కవులకూ, ఇటు వచన కవితలు రాసే కవులకూ మిత్రుడూ, ప్రామాణికుడు సంపత్కుమార. వారి లక్షణదీపిక (1960), తెలుగు ఛందో వికాసం (1962) వారి ఛందశ్శాస్త్ర పాండిత్యానికి,

కూచిమంచి తిమ్మకవి 'లక్షణసార సంగ్రహా'నికి కూచిమంచి వెంకటరాయని 'సుకవి మనోరంజనా'నికి రాసిన పీఠికలు ప్రయోగ విజ్ఞానానికి, చేరాతో కలిసి చేసిన 'వచన పద్యకవిత లక్షణ చర్చ' వారి ఆధునిక ఛందశ్శాస్త్ర పరిజ్ఞానానికి దృష్టాంతాలుగా నిలుస్తున్నాయి.

కవిగా కూడా సంపత్కుమారకు 'ఉభయకవిమిత్రు'డి వంటి ఒక ఆధునిక మూర్తిమత్వం ఉంది. తిరుపతి వేంకటకవుల కాలంలో ప్రసిద్ధులైన కవులు కొందరు మొదట జంట కవులుగా, ఆమీద సొంత గొంతుక కవులుగా రెండు దశలను సాగించారు. అభ్యుదయ కవిత్వానంతర ధోరణుల్లో బృంద కవులలో ఒకడుగా, ఒంటికవిగా రచనలు చేసే పద్ధతులు వచ్చాయి. ఈ రెండు రకాలు తిక్కన కాలంలో లేవు. సంపత్కుమార ఆధునిక యుగంలో జంటకవిగానూ, ఒంటికవిగానూ, బృందకవిగానూ, ఒంటరి కవిగానూ కవితలు రాశారు. హృద్గీత (1953), ఆనందలహరి (1956) కావ్యాలు సుప్రసన్నతో కలసి సంపత్కుమార రచించినవి. అందులో ఆయన జంటకవి తరువాత ఆయన కవితలు ఆయన వేరుగా రాస్తున్నా చేతనావర్త కవులలో ఒకరుగా (1967, 1970) రెండు కవితా సంపుటులలో పాల్గొన్నారు. వారి ఇటీవలి భక్తి కవితలలో 'అంతర్మథనం' ఆధునిక ఆధ్యాత్మిక పద్య శతకం సంపత్కుమార పద్యాన్ని హృద్యంగా రాయగలడు, వచన కవితను ఆలోచనాత్మకంగా పలకగలడు, అటు సంప్రదాయ బద్ధంగా వ్యాఖ్యానించవలసిన ప్రాచీన సాహిత్యాన్ని, కవుల దృక్పథాలనూ ప్రామాణికంగా ప్రపంచించగలరు; ఇటు అత్యంత ఆధునిక సాహిత్య ప్రయోగాలలోని అంతరాంతరాలను అలవోకగా ఆవిష్కరించగలరు. అటు విశ్వనాథ సాహిత్యం మీద ఎంత సాధికారికంగా రాయగలరో, విప్లవసాహిత్యం మీదకూడా అంత శాస్త్రీయంగా చెప్పగలరు. ఏ వర్గంవారు సాహితీ సదస్సు పెట్టినా అందులో పాల్గొనేందుకు ఆహ్వానం అందుకోగలిగిన ఉభయ కవి మిత్రుడు సంపత్కుమార. రాజశేఖరుడు చెప్పిన ఉభయకవి లక్షణానికి సంపత్కుమార ఆధునిక లక్ష్యం. అందుకే నా గుండె గొంతుక ఆయనను ఉభయకవి మిత్రునిగా సంబోధిస్తుంది.

ఉభయ కవి మిత్రుడు విమర్శకుడైతే ఎటువంటి వివేచన చేస్తాడో ఉదాహరణంగా ఉండేది వారి సిద్ధాంత గ్రంథం "ఆధునిక తెలుగు సాహిత్య

KM.14

విమర్శ-సాంప్రదాయికరీతి'' (1981). ఆధునిక ప్రక్రియలన్నీ ఆంగ్ల ప్రభావ ముద్రితాలనే భావాన్ని జల్లెడబట్టి తెలుగు కవులకున్న సాంప్రదాయిక మూలాలను, విమర్శకులకున్న దేశీయ ప్రాతిపదికలను ప్రవచించి చూపిన పరిశోధన గ్రంథమది. తెలుగు విమర్శలో ఏర్పడిన ప్రభావ పరిశీలన మార్గంలో సంపత్కుమార పరిశోధన ఒక మైలురాయి.

సంపత్కుమార జీవుడు కవి; అతని చూపు శాస్త్రం; అతని ఆలోచనం సమన్వయ దర్శనం, ఈ మూడింటి ముచ్చటైన సంగమం సంపత్కుమార సాహిత్యం. కవిగా చేతనావర్త కవితా సంపుటుల్లో వచన కవితను రాశారు. అందులో సవివర్శక సంవేదనం సాక్షాత్కరిస్తుంది. ఆ సంవేదనంలోనే వచన కవిత సామాజిక స్పృహను ప్రకటిస్తే, పద్య కవిత ఆధ్యాత్మిక చైతన్యాన్ని పదర్శించింది. ఆధునికయుగంలో ఉన్న ఇటువంటి ఉభయ తత్త్వదృష్టులు కలవారికి సంపత్కుమార మిత్రులైనారు. ఎన్ని విధాల చూచినా సంపత్కుమార ఉభయ కవి మిత్రుడే.

ఆలనాటి 'ఉభయకవిమిత్రు'నికిలాగా ఈనాటి 'ఉభయకవిమిత్రు'నికి కూడా ఓరుగల్లుతో సంబంధం ఉండటం విశేషం. కాకతీయవిశ్వవిద్యాలయంలో సంపత్కుమార ఆచార్యుడుగా పనిచేసి జులై 1 వ తేదీన రిటైరయ్యారు. ఎక్కడ ఉంటే అక్కడ ఒక సాహితీగోష్ఠిని కల్పించే సాహితీ బంధువు సంపత్కుమార. ఎంత చిన్న విషయాన్నైనా నిశితంగా పరిశీలించనిది నమ్మని తర్కబుద్ధి సంపత్కుమార! ఎన్ని శాస్త్రశిఖరాలను పెంచుకున్నా అందులో సుందరంగా జాలువారే కవితాస్రవంతులను పోషించుకొన్న కవి సంపత్కుమార! మిత్రులకు హృదయమిచ్చే స్నేహార్ద్రమూర్తి సంపత్కుమార! అతని షష్టిపూర్తి ఆధునిక ఉభయకవిమిత్ర భావనకు జరుగుతున్న ఇష్టపూర్తి! *

(ఆంధ్రభూమి, 16-7-1993)

# మచ్చలేని మనీషి

"దేశ కాల సమాజాల త్రిపుటి
అన్నిటికీ కేంద్రమైన వ్యక్తి
అనంత వైవిధ్యంగల మనఃప్రవృత్తి
అన్నిదశల్లోనూ మానవ సమగ్ర వికాసం.
ఆధునిక భావచైతన్య విన్యాసం —"

'సంపత్కుమార'(ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య)సాహిత్య వ్యక్తిత్వాన్ని, లక్ష్యాన్ని చెపుతాయి ఈ మాటలు. ఇవి చేతనావర్త కవుల రెండవ సంపుటికి 'సంపత్కుమార' రాసిన ముందుమాటలాంటి కవిత. వారి సాహిత్య దృక్పథానికి ఇది పతాక సూచిక లాంటిది.

సంపత్కుమారాచార్యగారితో నాకు ముప్పైయేళ్ళకుపైగా పరిచయం. సుప్రసన్న, సంపత్కుమార - వీరిద్దరూ జంటకవుల్లాగా నా హృదయం మీద మొదటి రోజుల్లో ఒక ముద్ర వేశారు. అంటే 1960 కి పూర్వం. నేను 1958 లో వరంగల్ ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాలలో తెలుగు ఉపన్యాసకునిగా చేరినప్పటి నుండి వారితో గాఢమైన స్నేహం ఏర్పడింది. సుప్రసన్నగారు ఆలోచనకూ, సంపత్కుమారగారు ఆత్మీయతకూ ప్రతినిధులుగా అనిపించేవారు మా మిత్ర మండలిలో. మేమంతా ఒక తరంవారంగా మసలుతుండేవారం. ఎవరి జీవితాలు వారివి, ఎవరి ఆలోచనలు వారివి; కాని, ఏదో ఒక కాలమహానదీ తరంగం మీద అందరం కలిసి తేలిపోతున్నామన్న అనుభూతి మా చైతన్యాలను ఒక సూత్రంతో కట్టివేసింది. మా స్నేహాన్ని గురించి తలచుకున్నప్పుడెల్లా సంపత్కుమార కవిత గుండెల్లో కూనిరాగాలు తీస్తుంది.

"అనాద్యనంతోహ సంవలితమైన ఈ కాలం
ఉన్మత్తోద్విగ్నంగా ప్రవహిస్తున్న మహానది
ముంచే తరంగమొక్కటైతే తేల్చేది మరొటి
తరంగ తరంగానికి చెప్పరానంత తారతమ్యం"

మేం కలుసుకున్నప్పుడుడెల్లా సజీవకాల మహానదీ తరంగాలు కరచాలనం చేసుకుంటున్న అనుభవం అర్ద్రంగా పొందుతూనే ఉంటాం.

సంపత్కుమారగారితో నాకు ఆత్మీయతతో కూడుకొన్న స్నేహానుబంధం ఏర్పడటానికి కాలమహానది కల్పించిన మరో కారణం కూడా ఉంది. మా యిద్దరి సాహిత్య జీవితాల్లో కాలం కలిపిన కొన్ని సామ్యాలున్నాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 1960 లో తెలుగులో ఛందస్సు మీదా, వీరరసం మీదా బహుమతు లివ్వటానికి గ్రంథరచనలను ఆహ్వానించినప్పుడు, ఒకరికొకరం అనుకోకుండా స్పందించాం. నేను వీరరసం మీద రాస్తే, సంపత్కుమార తెలుగు ఛందోవికాసం మీద రాశారు. మారెండు గ్రంథాలకూ సాహిత్య జగత్తులో మంచి గుర్తింపు వచ్చింది. ఆయా రంగాలలో కొన్ని క్రొత్త విశేషాలు చెప్పామన్న కీర్తి వచ్చింది. మేమిద్దరం బాగా వెలుగులోకి రావటానికి మా తొలి విమర్శ గ్రంథాలు మాకు బాగా తోడ్పడ్డాయి.

విశ్వనాథవారిమీద మా యిద్దరికి అభిమానం ఉంది. అయితే, సంపత్కుమార వారితో ప్రత్యక్ష సంబంధం బాగా పెంచుకొన్న అదృష్టవంతుడు. నేను ఎప్పుడూ ఏకలవ్య శిష్యునిగానే ఉండిపోయాను. అయినా, విశ్వనాథవారి సాహిత్యాన్ని గురించి సమాలోచనం చేయటంలో సుప్రసన్న, సంపత్కుమార, తుమ్మపూడి కోటేశ్వరరావు, అరిపిరాల విశ్వం, రామకోటి శాస్త్రి,నేనూ-ఇలా మా తరం వాళ్ళం ఎక్కడ ఉన్నా దాదాపు ఒకే రకంగా స్పదించేవారం. ఆ తరువాత విశ్వనాథవారి నవ్యసంప్రదాయ మార్గాన్ని వివేచించి వివరించటంలో మేమందరం యథాశక్తి కృషిచేశాం.

దిగంబర కవుల కవితా సంపుటాలు వచ్చిన రోజుల్లో వారి చైతన్యానికి ప్రతిగా స్పందించిన చేతనావర్త కవుల్లో ఒకరుగా సంపత్కుమార తన గళాన్ని వినిపించాడు. ఒక ఉద్యమం సాగించాడు. నేను సమాంతరంగా యువభారతి సాహిత్యోద్యమ చైతన్యంలో ఒక ప్రధానపాత్ర నిర్వహించాను. ఇప్పటికీ నిర్వహిస్తున్నాను. సాహిత్యంలోని కొన్ని విలువల కోసం చైతన్య శీలంతో సమాజాన్ని జాగృతపరిచే ఉద్యమం కోసం కలాన్ని, గళాన్ని అంకితం చేయటంలో మేమిద్దరం జాతీయ భావం కన్నబిడ్డలం, సోదరులం.

ఆధునిక సాహిత్య విమర్శ రంగంలో కూడా సంపత్కుమారా, నేనూ రెండు పార్శ్వాలను స్పృశించే గ్రంథాలను రాసి గుర్తింపు పొందటం కాలం కల్పించిన మరొక అనుబంధం. "ఆధునిక సాహిత్య విమర్శ: సాంప్రదాయికరీతి" అనే గ్రంథం సంపత్కుమార సిద్ధాంత గ్రంథం. "ఆధునిక సాహిత్య విమర్శ :

ఆంగ్ల ప్రభావం" - కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి నందుకొన్న నా సాహిత్య విమర్శ గ్రంథం. ఈ రెండూ ఆధునిక సాహిత్య విమర్శ వివేకానికి ఉభయ పార్శ్వాలుగా తోడ్పడే ఉత్తమ విమర్శ గ్రంథాలని సాహితీలోకం గుర్తించింది. మా స్నేహం ఆ విధంగా సార్థకమైంది.

సంపత్కుమార 'పూర్వకవుల కావ్య దృక్పథాలు', 'సాహిత్య చరిత్ర' మొదలైన గ్రంథాలు రాశారు. నా బాణీలో నేను 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు' రాశాను. ఇద్దరం సాహిత్యచరిత్ర వికాసం గురించి మధనపడుతున్న స్నేహితులమే. మానవ వికాస రచయితల సంఘం స్థాపించటంలో సంపత్కుమారతో పాటు నేనూ పాలు పంచుకున్నాను. జాతీయ సాహిత్య పరిషత్తు సాహిత్యోద్యమంలో కూడా ఎన్నోసార్లు కొన్ని విలువలకోసం కలిసి పనిచేశాం మేమిద్దరం. ఇవి చాలనుకుంటాను మేమిద్దరం మూడు దశాబ్దాలుగా ఈ కాలమహానదిలో తరంగాలుగా కలిసి సాగుతున్నందుకు సజీవసాక్ష్యాలు!

సంపత్కుమార ఒక సమున్నత స్నేహతరంగం. అది ఎప్పుడూ ఒంటిగా సాగదు. తనతోపాటు తరంగపంక్తిని జంటకట్టి ముందు కురికిస్తుంది. నేను సంపత్కుమారతో కలిసి సాగిన తరంగాన్ని అని సంతోషించటానికి వారు నాకెంత అవకాశం ఇచ్చారో అటువంటి అవకాశాలు ఎంతోమంది మిత్రులకాయన కల్పించారు. బహుశః సుప్రసన్న ఈ అంశంమీద ఒక గ్రంథమే రాయగలడు. చేతనావర్త కవులందరూ కలిసి ఒక చేద లాగినవారే. అంతేకాదు - జువ్వాడి గౌతమరావుగారు గాని, చేకూరి రామారావుగారు గాని, బండారు సదాశివరావు గారుగాని, తుమ్మపూడి కోటేశ్వరరావుగారు గాని - ఇలా తెలుగులో ప్రసిద్ధులైన పండితులుగానీ, కవులుగానీ, సంపత్కుమారతో కలిసి తమ అనుభవాలను ఆనందంగా నెమరువేసుకుంటారు. మరొక విశేషం-సంపత్కుమార భావజాలంతో ఏకీభవించనివారుకూడా వారితో స్నేహం చేస్తారు. సిద్ధాంతా లేవైనా స్నేహ సిద్ధాంతం ఒక్కటే అని చాటే విశిష్టాద్వైతి సంపత్కుమార.

సంపత్కుమార కవిగా, లక్షణ శాస్త్రవేత్తగా, విమర్శకుడుగా, అధ్యాపకుడుగా, వక్తగా, ఉద్యమశీలిగా, కార్యకర్తగా, మానవతామూర్తిగా సమకాలీన సాహితీలోకంలో చాలామంది మన్ననల నందుకొన్నారు. ఎంతోమందికి తలలో నాల్కలాగా ఉన్నారు. కాకతీయ విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా పనిచేసి

కొన్ని ఉత్తమ ప్రమాణాలు పాటించారు. ఈనాడు వారికి జరిగే సన్మానం కొన్ని విలువలకు జరిగే సత్కారం.

అందరితో కలిసిమెలిసి ఉన్నా అందరి అభిప్రాయాలనూ అంగీకరించరు సంపత్కుమార. అయినా, ఎదుటివారి అభిప్రాయాలను గౌరవించటం సంపత్కుమారకు బాగా తెలుసు. తమ అభిప్రాయాలను నిర్ద్వంద్వంగా ప్రతిపాదించి నిరూపించుకోవటం కూడా బాగా తెలుసు. ఆయన కళ్ళల్లో కన్నీరుంది; కళ్ళ జోడులో కరకుదనం ఉంది. అరవై యేళ్ళలో ఎన్నడూ ఆయన వేషం మార్చింది లేదు; వేసుకున్న తెల్ల బట్టల మీద ఎన్నడూ మచ్చపడింది లేదు. సంపత్కుమార మచ్చలేని మనిషి.

తానింతవరకూ ఖండకావ్యాలే వ్రాశానన్న ఏదో అసంతృప్తి సంపత్కుమార అంతరంగంలో ఉన్నట్లుంది. మహాకావ్యం వ్రాయాలన్న అవ్యక్తమైన ఆకాంక్ష ఆయన జీవగతంగా వేధిస్తున్నది కాబోలు. వ్యాజరామానుజునిగా దర్శనమిచ్చిన లక్ష్మణ యతీంద్రులతో యిలా విన్నవించుకొన్నారు సంపత్కుమార:

"ఏదో అల్పచమత్కృతిన్ గవిత నూరేగింతు రేగింతు పె
న్వాదమ్మున్ గవితాస్వరూప మదిగా నైరూప్య వైరూప్య శి
ల్పాదుల్ దీర్తు సమగ్ర కావ్య పరిణాహ స్ఫూర్తికిన్ మాలి, కా
వ్యాదర్శమ్మది ముక్కలై చెడి యతీంద్రా! వ్యాజరామానుజా!"

అరవయ్యేళ్ళ సాహితీ వ్యవసాయం ఒక మహాకావ్యఫలాన్ని అందించాలనీ, షష్టి పూర్తి మహోత్సవం మరో ఆధునిక మహాకావ్యావిష్కరణ మహోత్సవానికి నాంది కావాలనీ మనసారా సాహితీలోకం కోరుకొంటున్నది! *

(కృష్ణాపత్రిక 2-8-1993)

# అయ్యపురెడ్డి ఊహాతరంగాలు

శ్రీ చింతామణి దేశ్‌ముఖ్‌గారు భారత ప్రభుత్వంలో ఆర్థికశాఖామాత్యులుగా పనిచేస్తున్నప్పుడు వారి శ్రీమతి, మన తెలుగు ఆడబడుచు శ్రీమతి దుర్గాబాయ్‌గారు వారిలోని కవిని విచిత్రంగా పసికట్టగలిగారు. శ్రీ దేశ్‌ముఖ్ పార్లమెంటుకు వెళ్ళివచ్చినప్పుడుగాని, పర్యటనలనుండి తిరిగి వచ్చినప్పుడుగాని వారు వేసుకొనే కోటుజేబుల్లో నలిపి ఉండలుగా చేసిన కొన్ని కాగితాలుండేవట! ఆమె మొదట వాటిని గమనించి ఆశ్చర్యపోయిందట! నెమ్మదిగా వాటిని విప్పి ఏమిటా అని చదివిందట! ఒక్కొక్క కాగితంలో కొన్ని సంస్కృత కవితలు వ్రాసి ఉండేవట! మిగిలిన ఆఫీసు కాగితాలకూ తాను రాసుకున్న కవితలున్న కాగితాలకూ తేడా తెలియటానికి కవితలను ఉండలుగా చేసి జేబుల్లో దాచుకునే వారట ఆయన. రాజకీయాలతో, ఆర్థిక సమస్యలతో సతమతమౌతున్నా విరామం దొరికినప్పుడెల్లా ఆఫీసులో, కారులో చింతామణిగారు కవితాచింతనలో మునిగి కవితలు రాస్తూ ఉండేవారని తెలుసుకొని శ్రీమతి దుర్గాబాయిగారు వాటినన్నింటిని భద్రపరిచి భర్తలోని కవిని ప్రోత్సహిస్తూ ఉండేవారట!

రాజకీయవేత్తలలోనూ కవులు, రచయితలు ఉండటం ఆశ్చర్యం కాదు. కొందరు రచయితలే ముఖ్యమంత్రులు, ప్రధానమంత్రులు, కేంద్రమంత్రులు, రాష్ట్రమంత్రులు కావటం మనకు తెలుసు. రాజకీయ జీవితానికి ప్రథమస్థానమిచ్చి, రచనకు రెండోస్థాన మిచ్చేవారు కొందరు కనపడతారు. రాజకీయాల్లో మునిగితేలుతున్నా అందులోని అనుభవాలను ఆర్ద్రంగా హృదయంలో పదిలపరచుకొని, విరామం దొరికినప్పుడు వాటికి అక్షరరూపం కల్పించేవారు కొందరు కనపడతారు. మరికొందరు రాజకీయ జీవితం నుండి విశ్రాంతి తీసుకున్న తరువాత వెనుకటి అనుభవాలగుర్తులను కవితలుగా, రచనలుగా, కథలుగా, గాథలుగా, స్వీయచరిత్రలుగా, జ్ఞాపకాలుగా వెలువరించేవారుకూడా ఉన్నారు.

రాజకీయాలనూ రచనలనూ జోడుగుర్రాలుగా నడపగలిగినవారిని పూర్వకాలంలో రాజకవులనేవారు. ఇప్పుడు రాజకీయ కవులనవచ్చు. వీరు ఉభయశాఖా ప్రౌఢి పాటించు శిల్పంలో పారగులని ప్రశంసలు పొందగలుగుతారు. రాజకీయ విరామంలో రచనలు చేసేవారిని విరామకవులనవచ్చునేమో! రాజకీయాలు మానినతరువాత కవితలు రాసేవారు అవిశ్రాంత కవితా కళాప్రియులనదగినవారు.

అయితే, వీరిలో మరొకరకంవారు కూడా ఉండే అవకాశం ఉంది. రాజకీయంలో రాణిస్తున్నప్పుడు కవిత్వం రాస్తున్నా రహస్యంగా ఉంచుకొని, ఆ తరువాత అనుకూలాన్నిబట్టి దానిని వెలువరించేవారు. వీరు గుప్తకవితాశిల్పులు.

ఈమధ్య శ్రీ ఏరాసు అయ్యపురెడ్డిగారు 'ఊహాతరంగాలు' అనే కవితా సంపుటిని ప్రచురించారు. న్యాయవాదిగా, ప్రజాప్రతినిధిగా, మంత్రిగా పేరు పొందిన శ్రీ అయ్యపురెడ్డిగారు ఈ కవితా సంపుటిని వెలువరించేంతవరకూ తమ కవితా వ్యాసంగాన్ని ఎప్పుడూ బయటపెట్టలేదు. అట్లని కవితలన్నీ ఈమధ్య కాలంలోనే రాయలేదు. జీవితంలో ఆయా సందర్భాలలో అంతరంగం స్పందించి నప్పుడు తమకు తోచిన ఊహలను కవితలుగా రాసుకొని గుప్తంగా ఉంచారు. వాటిని ఒక్కసారి బయటపెట్టి ఆత్మమిత్రులకుసైతం ఆశ్చర్యం కలిగించారు. శ్రీ అయ్యపురెడ్డిగారు అచ్చమైన గుప్తకవితాశిల్పి!

రాజకీయవేత్త కవితలో స్పందించినా తన రాజకీయ మూర్తిమత్వాన్ని మరుగుపరుచుకోలేదు. దసరా పండుగను గురించి అయ్యపురెడ్డిగారి ఊహలు అందుకు సాక్ష్యాలు—

''మారుతున్న సమాజంలో /మహిషాసురమర్దనం/మళ్ళీ మళ్ళీ జరగాలా?/ మనిషిలో ఉంది మహిషం/అధికారపీఠాలపై / అతి పెద్ద మహిషాలు / అందుకే వస్తుంది దసరా! / మర్దనపాండిత్య మహిమాన్విత / మహాప్రజాచైతన్యదుర్గకు/ నిర్దళిత దుర్జనవర్గకు/జయీభవ / విజయీభవ!!" (పు. 36) అధికార పీఠాలపై నున్న అతి పెద్ద మహిషాసురులను మర్దించటానికి మహాప్రజాచైతన్యదుర్గను ఆహ్వానించగలిగినవాడే రాజకీయ చైతన్యంగల కవి!

రాజకీయ రంగంలో చైతన్యవంతంగా ఉండేవారికి సమాజంలోని దాదాపు అన్నిరకాలైన ప్రవృత్తులవారితో, సమస్యలతో పరిచయం ఉంటుంది. 'కోటి విద్యలు ఓటుకొరకే' అన్నది ప్రాథమికసూత్రం. దాన్ని పాటిస్తూనే శ్రీ అయ్యపు రెడ్డిగారిలో అంతస్సాక్షిగా ఉండే కవి అంతర్వేదన పడతాడు—

''ఓటుదొంగల /అడ్డుకొనుటకు /ఓటరెప్పుడు /మాటుకొనదో /జనచైతన్యం/ జ్వలించదో /ప్రజాస్వామ్యం/బ్రతుకు హాస్యం" అని కవితలో హెచ్చరిస్తాడు. "మాజీ ముఖ్యమంత్రి/మామూలు మనిషిగా/మసలుకోలేడు/మరి మారనూ లేడు" అని అధిక్షేపిస్తాడు. "ముఖ్యమంత్రి వచ్చిన ఖర్చుతో/మూడు చెరువులు త్రవ్వ చ్చన్నాడు/ముదిమదితప్పిన/ముసలివాడొకడు" అని అన్యాపదేశంగా ప్రభుత్వ ఖర్చులను ఆక్షేపిస్తాడు "సమర్థతను సంహరించి/చెంచాలను పెంచుకోవడం/

పార్టీ నాయకుని/పరమధ్యేయం/పదవుల పంపకం / పదిలమైన వజ్రాయుధం"
అని ప్రజాస్వామ్య రాజకీయాలను ఎత్తిపొడిచాడు.

మహాభారతంలో వీరుడైన నరునికి ప్రతినిధి అర్జునుడు. నేటి రాజకీయ మహాభారతంలో ధనార్జనుడే అర్జునుడంటారు శ్రీ అయ్యపురెడ్డిగారు:

"నేటి రాజకీయ కురుక్షేత్రంలో/ధనార్జనుడే అర్జునుడు.
పచ్చనోట్ల పాశుపతాస్త్రం/ప్రత్యర్థులపై విద్యుద్ఘాతం!
లక్ష్మీనాథుని సారథ్యం/లక్ష్య సిద్ధి కనివార్యం
నీతి రీతుల నిర్బంధం/ఛేదించాలి పద్మవ్యూహం.
విజయం సాధిస్తే/దుర్జనుడైనా/అర్జునుడే." (పు. 103)

నేటి రాజకీయ వ్యవస్థను వ్యంగ్యంగా అధిక్షేపిస్తూ రాసిన ఇటువంటి కవితలు శ్రీ అయ్యపురెడ్డి గారు కవిగా ప్రకటించిన నిజాయితీకి పతాకలు!

వృత్తు లెన్ని చేసినా శ్రీ అయ్యపురెడ్డిగారు ప్రవృత్తిచేత మానవతావాది. జీవితంలోని అన్ని అంచులూ ఆయన హృదయాన్ని స్పందింపజేశాయి. మౌనంగా స్పందించే తన హృదయ భాషను మాతృభాషగా వర్ణించారు రెడ్డిగారు. చిన్ననాటి జ్ఞాపకాలకు ఎన్నో గాలిపటాలు కట్టి ఊహాతరంగాలపై ఎగురవేశారు. యౌవనంలో నినదించిన రాగ హృదయాన్ని పద్యాలలో హృద్యంగా వదిలపరిచారు.

''నా కథ కంతరార్థమయి నన్ కరగించెదు స్ఫూర్తిమూర్తివై
నా కవితా స్రవంతివయి నా గళమందలి వాగ్విపంచివై
నా కలలోని గానమయి నా కనుపాపల కాంతిరేఖవై
నాకు సమస్త విశ్వసుగుణాకృతివై అగుపింతువే సఖీ!''

ఈ పద్యంలోని గుప్తంగా దాగి ఉన్న అనురాగమూర్తి అయ్యపురెడ్డిగారి కథలోని అంతరార్థం. ఆయనలోని కవిని రక్షించిన పరమార్థం. జీవిత మాధుర్యాన్ని ఎంతగా ఆస్వాదించారో కన్నీటిని కూడా అంత కనికరంతో స్వీకరించి జీవితంలోని లోతులను చవి చూదారు కవి. ''నా కనులలో కాంతి కరువైనా, కన్నీరుకు కరువు ఉండరాదు'' అని మానవతా ముద్రను ప్రదర్శించారు. ఇజాలలోని నిజాలనన్నింటినీ వడగట్టి ''యథార్థ వాదం, మార్క్సిజం, లెనినిజం మార్చలేదు మానవనైజం'' అన్న సత్యాన్ని తెలుసుకున్నారు. మానవుడు వైజ్ఞానికంగా, సాంకేతికంగా సాధించిన ప్రగతిని సమీక్షిస్తూ కవితామయంగా ప్రపంచ పురో

గతిని వర్ణించారు. వేమనపై కూడా వికటకవి విసుర్లు విసిరారు. శ్రీనాథుని చివరి ఘట్టం, పెద్దన ప్రణయఘట్టం కీర్తించారు!

శ్రీ అయ్యపురెడ్డిగారు చెప్పే భావంలో వెలువరించే మానసిక స్థితినిబట్టి అభివ్యక్తి శిల్పం ఆధారపడి ఉంటుంది. ఒక్కొక్కసారి తగినంత సమాధి కవితకు లేనట్లు అనిపిస్తుంది. శిథిల బంధంగా సాగుతుంది. మరొకసారి ధ్వని ప్రధానంగా శిల్పవైభవాన్ని వెలారుస్తుంది. ఒక్కొక్కసారి సమాస సౌందర్యాన్ని సంతరించుకుంటుంది. కాని, ఎక్కడా ఆడంబరాన్ని ప్రదర్శించదు శ్రీ అయ్యపు రెడ్డిగారి కవిత!

పీడిత వర్గాలు, బడుగు వర్గాలు కలకాలంగా చేసిన సమైక్య త్యాగ కృషి కారణంగా నేటి నాగరకత విప్పారిందనే గంభీర భావాన్ని ధ్వనిమయంగా చెప్పే ఈ కవిత మచ్చుకు మంచి ఉదాహరణం—

"కాకి లోకంలో కలదు సమత
కాకి కులంలో కలదు మమత
కాకికి, కాకికి మధ్య లేదు కలత
కాకికి కాకికి కలదు ఏకత
కాకి స్వరూపంలో/కాకి స్వరంలో
కనిపించదు విభిన్నత
కాకి పెంచిన కోయిల
కమ్ర కూజితమే కదా
ఆమ్ర వనాలకు ఆమని!" (కాకిలోకం పు. 204)

శ్రీ అయ్యపురెడ్డిగారి కవిత ఆలోచిస్తుంది; ఆలోచింపజేస్తుంది. అధిక్షేపిస్తుంది కాని ఆగ్రహపడదు. పెద్ద మనిషి తరహా ఎక్కువ. పెద్ద మనసుతనం మీద మక్కువ ఎక్కువ. ఊహలు పంచటానికి పుట్టిన కవితయే కాని ఇది ఒక యుగాన్ని యేలాలని బయలుదేరింది కాదు. నిజాలను నిజాయితీతో చెప్పతున్న అమాయకపు నిండుదనం శ్రీ అయ్యపురెడ్డిగారి అసలైన కవితా స్వభావం. ఈ ఊహా తరంగాలు మనసు మాట్లాడుతున్నట్లు వినబడుతూ ఉంటాయి; పఠిత కవిత్వం సంగతి మరచిపోయి వింటూంటాడు. నిజానికి ఈ రచన రెండు దశాబ్దాలు ఆలస్యంగా అవతరించిందని అనిపిస్తుంది! *

(ఆంధ్రభూమి 17-6-1994)

# 'పుడమితల్లికి పురిటినొప్పులు'

మాతృభాషలో మధురంగా కవితలు రాస్తూ ఇంగ్లీషులో కూడా ఆత్మీయంగా కవితను ఆవిష్కరించగలిగిన సవ్యసాచులు ఏ భాషా సాహిత్యంలోనైనా కొద్దిమందే ఉంటారు. తెలుగులో ఇప్పుడు అటువంటి కవులు వేళ్ళమీద లెక్కబెట్టేటట్లున్నారు. వాళ్ళలో డాక్టర్ జె. బాపురెడ్డిగారు మొదట లెక్కింపదగినవారు. In Quest of Harmony, Longing for Life, Urn of Love, Loving is Living - అనే ఆంగ్ల కవితా సంపుటాలు నాలుగు బాపురెడ్డి గారికి భారతీయ ఇంగ్లీషు కవుల్లోనూ, ప్రపంచ ఇంగ్లీషు కవుల్లోనూ గుర్తింపు తెచ్చిపెట్టాయి. "వరల్డ్ కాంగ్రెస్ ఆఫ్ పొయెట్స్'లో బాపురెడ్డి గారి కవితలు ప్రపంచ భాషా కవుల మన్ననల నందుకొన్నాయి. ఆ కాంగ్రెస్‌లోని కవులు ఇంగ్లీషులో బాగా నచ్చిన కవితలను, సంపుటాలను తమ తమ మాతృభాషలలోకి కూడా తర్జుమాచేసి కవుల ప్రపంచ కుటుంబాన్ని, భావాల ఆదాన ప్రదానాన్ని పెంచుకొనే ఉద్యమాన్ని నిశ్శబ్దంగా సాగిస్తున్నారు. ఇటువంటి చైతన్యాన్ని పెంచుతున్న వారిలో కూడా డాక్టర్ బాపురెడ్డి గారు తెలుగువారిలో ముందడుగు వేస్తున్నారు.

అమెరికన్ కవయిత్రి డాక్టర్ కనారిగ్ బొయాడ్జియాన్ కవితా సంపుటి 'There is no time' ను, డానిష్ కవయిత్రి డాక్టర్ ఎస్థర్‌గ్రెస్ కవితా సంపుటి 'Raise' ను, ఇంగ్లీషు కవయిత్రి డాక్టర్ రోస్‌మేరీ విల్కిన్‌సన్ (U.S.A.) కవితా సంపుటి 'Sacred in Nature' ను డాక్టర్ జె. బాపురెడ్డి గారు వరుసగా 'వ్యవధి లేదు' (1985), 'పైకెత్తాలి' (1988), 'ప్రకృతిలో పవిత్రత' (1993) అనే పేర్లతో అనువదించారు. మూలంతో కలిపి అనువాదాలను ప్రచురించి తులనాత్మక పరిశీలనకు అవకాశాన్ని కలిగించారు. తెలుగువారు సంతోషింపదగిన మరొక అంశం ఏమిటంటే - డాక్టర్ బాపురెడ్డి గారి ఇంగ్లీషు కవితాసంపుటి 'Beyond the Horizon' స్పానిష్‌భాషలోకి అనువాదమయింది. మరికొన్ని కవితలు జర్మనీ మొదలైన భాషల్లోకి వెళుతున్నాయి. విశ్వకవి సౌభ్రాతృత్వానికి ఈ అనువాదోద్యమం ఒక బలమైన స్నేహసూత్రంగా పనిచేస్తుందనటంలో అనుమానం లేదు.

బాపురెడ్డిగా రెన్నుకొన్న మూడు కవితా సంపుటాలను రేఖామాత్రంగా గమనించినా మూడంశాలు స్పష్టంగా గోచరిస్తాయి. 1. మూడూ కవియిత్రుల కవితాభివ్యక్తులే, 2. ముగ్గురూ ఖండకావ్యాలనూ, మినీ కవితలనూ, హైకూలవంటి మెరుపు రచనలనూ రచించినవారే. 3. ముగ్గురూ శాంతినీ, ప్రేమనూ, ఆధ్యాత్మికతనూ - ఆధునిక ప్రపంచాన్ని సంక్షోభంనుండి ఉద్ధరించగల తరణోపాయాలని భావించేవారే. మరొక విశేష మేమంటే - ఆ ముగ్గురు కవయిత్రులూ భారతీయ భావధారకు సమాంతరంగా ప్రపంచ కవితావీణ మీద మ్రోగుతున్న వాదతంత్రుల్లాగా స్ఫురిస్తున్నారు.

విశ్వ కుటుంబ భావనం ఈ కవయిత్రులు ముగ్గురినీ కలిపి ముడివేస్తోంది. దాన్ని రాజకీయంగా, ఆర్థికంగా సాధించబోయి మానవుడు అశాంతిని, రక్తపాతాన్నీ సృష్టించి ప్రపంచాన్ని సంక్షోభానికి గురి చేస్తున్నాడనీ, ఈ విపత్కర పరిస్థితినుండి మనల్ని మనం రక్షించుకొవలసిన అవసరం ఉన్నదనీ ఈ ముగ్గురూ ముక్తకంఠంతో ఎలుగెత్తి చెప్పుతున్నారు. భౌతికవాదం మానవుడికి సమదృష్టిని ప్రసాదించలేక విఫలమయిందనీ, సర్వజీవ సమభావం సర్వభూత హితభావం అనే నేత్రద్వయంతో చూడగలిగిన ఆధ్యాత్మిక దృక్పథం ఒక్కటే ప్రపంచానికి శాంతినీ, సౌఖ్యాన్ని, వసుధైక కుటుంబ భావాన్నీ ప్రసాదింపగలుగుతుందనీ ఈ ముగ్గురూ భావిస్తున్నారు.

శ్రీమతి కనారిగ్ బొయాడ్జియాన్ (KANARIG BOYADJIAN) తమ కవితా సంపుటికి 'There is no time - వ్యవధి లేదు' అనే పేరు పెట్టటంలోనే మానవతకు ఆధ్యాత్మికత యొక్క ఆవశ్యకత ఎంత అవసరమో వ్యక్తం చేసింది. పుడమితల్లి ఆధ్యాత్మికతకు పుట్టుకనిచ్చే పురిటినొప్పులు పడుతోన్నదని ఆమె ప్రకటించింది.

"The land is pregnant
It has no time."

ఆధ్యాత్మికత ఆవిష్కరింపబడితే మానవుల మధ్య రంగులూ, జాతులూ, వర్ణాలూ, వర్గాలూ, వయసులూ, లింగాలూ పరిగణింపుకు రావు. అందరిలో ఆవరించిఉన్న ఆత్మ ఒక్కటే ప్రేమచైతన్యంగా దర్శనమిస్తుంది.

"Souls donot have colour
But have love."

అని బొయాడ్జియాన్ భారతీయ తత్త్వదర్శనానికి ప్రతిబింబంగా పలికింది. ఆమె కవితాసంపుటిలో సర్వత్రా వ్యక్తం చేసే ఆధ్యాత్మిక ప్రవృత్తికి ప్రతి కవితనూ ఉదాహరించటానికి వీలున్నా 'Competition' - 'స్పర్థ' అనే కావ్య ఖండిక నొక్కదాన్ని గమనిస్తేచాలు అంతరంగం, అంతరార్థం బయటపడ తాయి.

"I felt the movement of my body
Like a professional dancer,
Drunk with its own beauty,
Neglecting mind and soul.

Mind, always ignoring both,
Arrogant with knowledge,
Flying in philosopher's heaven,
Left soul and body.

Soul, sad for their conceit,
Longing for harmony,
Cried : 'If I leave now,
Neither of you will exist,
I am Life, and you
Its shelter, Beauty matures
By moving together.''

Competiton was suddenly over
When the ego disappeared.'' (పుట 27)

ఈ కవిత నేపథ్యంలో భగవద్గీతలోని "ఇంద్రియాణి పరాణ్యాహుః, ఇంద్రియేభ్యః పరం మనః, మనసస్తు పరా బుద్ధిః, యో బుద్ధేః పరతస్తు సః" (3.42) అనే శ్లోకం కదలాడుతుంది. దేహదృష్టి ఇంద్రియ భోగదృష్టిని పెంచి బుద్ధిని, ఆత్మను విస్మరింపజేస్తుందని మొదటి పద్యం తాత్పర్యం. నర్తకి ఉపమానం, సౌందర్యపానం వలన కలిగే మత్తును సూచించే నిరవయవ రూపకం ఆ భావాన్ని బలంగా పోషిస్తున్నాయి. బుద్ధి - పాండిత్యాహంకారంతో వేదాంత సిద్ధాంతాలను

తర్క వితర్క పక్షాలతో అనుభవానికి అందని అంబరాల్లో విహరింపజేస్తోందని, అది ఇహానికీ పరానికీ పనికిరాకుండా పోతోందని విచారపడింది రచయిత్రి రెండవ పద్యంలో. వైజ్ఞానికయుగంలో ఉన్న నేటి శాస్త్రజ్ఞుని పరిస్థితి కూడా ఇటువంటిదే. ఇంద్రియ మనోబుద్ధ్యహంకారాలకు వెనుకనున్న జీవచైతన్యం ఆత్మ. దాన్ని విస్మరించి తమలో తాము స్పర్థను సాగిస్తున్న ఆ దుష్ట చతుష్టయానికి తన అస్తిత్వం యొక్క విలువకు తెలియజేసింది ఆత్మ. నిజానికి జీవించేది 'నేను' అనే ఆత్మ. 'I am Life.' అది లేకపోతే దేహాదులు లేవు. దేహం దాని ఆశ్రయం మాత్రమే. సౌందర్యం నశించే దేహానిది కాదు. ఆత్మజ్ఞానం వలన కలిగే ఆధ్యాత్మిక సమన్వయ దృక్పథమే - అంటే ఆత్మ సౌందర్యమే సౌందర్యం అని మూడో పద్యం ముచ్చటగా చెపుతోంది. ఇంద్రియ మనోబుధ్యహంకారాల మధ్య స్పర్థ అహంకార త్యాగం వలన సమసి పోతుంది. అహంకార రాహిత్యమే ప్రేమ. అదే అందరిలో ఉన్న ఆత్మను ఆధ్యాత్మికంగా దర్శించటానికి వీలైన ఆధునిక మార్గం. అదే నేటి ప్రపంచానికి తరణోపాయం.

శ్రీమతి బొయాడ్జియాన్ ఆర్మీనియాన్ - అస్సీరియన్ సంప్రదాయాన్ని పుణికిపుచ్చుకొన్న కవయిత్రి. ప్రముఖ అస్సీరియన్ కవి అషర్ యూసుఫ్ మనుమరాలు. ఆధ్యాత్మికత కోసం ఆధునిక మానవత పడుతున్న తీవ్రమైన వేదనను ఎటువంటి అస్పష్టత లేకుండా కవితగా అభివ్యక్తీకరించింది. ఆమె కవితలో ఉన్న విశ్వమానవతా స్పృహ భారతీయతకు ప్రతిబింబంగా ఉండటం చేత డాక్టర్ బాపురెడ్డిగారు ఆత్మీయంగా తెలుగులో ఆవిష్కరించారు.

జీవాత్మకు పరమాత్మకు మధ్య మధురభక్తి సంప్రదాయం భారతీయం. 'వ్యవధి లేదు'లో శ్రీమతి బొయాడ్జియాన్ క్రైస్తవ సంప్రదాయంలో మధుర భక్తి మార్గాన్ని మనోజ్ఞంగా ఆవిష్కరించింది 'The Wedding of my heart'లో. మూలాన్ని మధురంగా ఆవిష్కరించిన బాపురెడ్డిగారి అనువాదం ఆ అనుభూతిని అందిస్తుంది:

''అది రాత్రివేళ-
వెలుగుతున్నాయి మూడు లాంతర్లు
వ్రేలాడుతున్న కొయ్య శిలువముందు.
మోకరిల్లి వల్లించాను నేను

యథార్థ ప్రకటనాత్మక కీర్తన
నా భావనాత్మక యాత్రలో
తపించే నా మోవిపై
అద్దిన ముద్దెవరిదంటే
నీ పేరే చెపుతా!
నీ ప్రేమానంద సంచలితమైన నా హృదయం
నీ అక్షరత్రయాన్ని స్వీకరిస్తుంది
ఆ మూడు లాంతర్ల సమక్షంలో
వాటికీ నా నామధేయానికీ
మూడు ముళ్ళు వేస్తుంది
అదే నా హృదయ కల్యాణం
గుట్టుగా
ఆ అక్షరత్రయాన్ని వల్లించే
నా పెదవులకు
నా సంకీర్తనమే సాక్షి.''

*

(ఆంధ్రభూమి 31-12-1993)

# ముగ్గురు కవయిత్రులు : ఆధ్యాత్మిక స్పృహ

పుడమి తల్లికి వచ్చిన పురిటినొప్పులను విని తన కవితలో స్పందించారు డాక్టర్ కనారిగ్ బొయాడ్జియాన్ దానిని తెలుగులో అనుభవింపజేశారు డాక్టర్ బాపురెడ్డిగారు. ఆ తల్లికి పుట్టబోయే ఆధ్యాత్మిక శిశువును దర్శించే సంస్కారాన్ని నేర్పారు తన కవితలలో శ్రీమతి ఎస్థర్ గ్రెస్ (Esther Gress). కవితా సంపుటికి పేరు పెట్టిన కవిత యిది—

He would raise/The man/From a lower level.
He would raise/The life/To a higher level.
He would raise/The world/And he lost himself.
Now the world/Must raise/Him to higher level.

"అతడు/క్రింది స్థాయిలో ఉన్న/మనిషిని/పైకెత్తేవాడు
అతడు/జీవితాన్ని/పైస్థాయికి లేవనెత్తేవాడు
అతడు/లోకాన్నే/లేవనెత్తి/తానే పడిపోయాడు
లోకమే ఇప్పుడు/అతణ్ణి/పైస్థాయికి/లేవనెత్తాలి." (బాపురెడ్డి అనువాదం)

ఆర్థికంగా అభివృద్ధిని సాధించటంద్వారా జీవిత స్థాయిని పెంచాలని మానవుడు ప్రయత్నం చేసి నైతికంగా, ఆధ్యాత్మికంగా తన అస్తిత్వాన్ని తాను కోల్పోయాడు. ఈ స్థితినుంచి ప్రపంచమే మానవుణ్ణి ఉద్ధరించి ఉన్నత స్థితికి చేర్చవలసిన అవసరం వచ్చిందని కవయిత్రి గుర్తించింది. అందువల్లనే కవితా సంపుటికి 'Raise' 'పైకెత్తాలి' అని పేరు పెట్టి, ఆధునిక మానవ స్థితినిగురించి తన ఆవేదనను ఒక కేకగా, పతాక శీర్షికగా ప్రదర్శించింది.

నేటి మానవ జీవితాన్ని సీతాకోకచిలుకతో పోల్చి సహజ సుందరంగాను, వివేక మధురంగానూ వెలార్చింది డాక్టర్ ఎస్థర్ గ్రెస్.

"సీతాకోకచిలుకలాగే/తరచు మనం
వ్యర్థంగా ఎగురుతుంటాం
గాజు కిటికీలకు/తల బాదుకుంటూ
సీతాకోకచిలుకవలెనే/గమనించం మనం
అనంతాకాశం వైపు/తెరచి ఉన్న ద్వారాలను." (బాపురెడ్డి అనువాదం)

భౌతిక జీవితంలో ప్రమాద భూయిష్ఠమైన, స్వేచ్ఛకు వీలులేని ఎన్నో సమస్యలతో మనం తలబాదుకోవటానికే సీతాకోకచిలుకలవలె అలవాటుపడ్డాంగాని, విశాలంగా తెరిచి ఉన్న ఆధ్యాత్మిక ద్వారాలను పట్టించుకోం; విశాల దృష్టిని అలవరచుకోం; విశ్వ దర్శనాన్ని చేసుకోలేం. అందువల్లనే ఈ మినీ కవితకు "Fly" "ఎగనిపో" అనే శీర్షిక ఉంచబడింది. ఆధ్యాత్మికతను దర్శించటానికి మానవుడు మొదట విశ్వ దర్శనం చేయాలి - అని సూచిస్తుంది కవయిత్రి.

ఆధ్యాత్మికతను దర్శించే మానవుడు ప్రేమను అలవరచుకోవాలి. ప్రేమ సాధన ఎంత కష్టమో చెపుతూ, అంత సులభంగా మూడు మెరుపుల్లో మెరిపించింది ముచ్చటైన మినీకవితలో ఎస్థర్ గ్రెస్. డాక్టర్ బాపురెడ్డిగారి తేటతెలుగులో-

## కష్టాతికష్టం

''నీవు ప్రేమించని వ్యక్తిని
సిలువ వేయటం/సులభమే కావచ్చు.
కాని, నీవు సిలువ వేయని/వ్యక్తిని ప్రేమించటం
కష్టతరం కావచ్చు.
నీవు సిలువ వేయాలనుకొనే వ్యక్తినే
ప్రేమించటం మాత్రం కష్టాతికష్టతరం.'' (పైకెత్తాలి - పు. 9)

ప్రేమించని వ్యక్తిని సిలువ వేయటం తమోగుణ లక్షణం. సిలువవేయని వ్యక్తిని ప్రేమించలేకపోవటం రాజస లక్షణం. సిలువ వేయాలనుకొనే వ్యక్తిని కూడా ప్రేమించటం సాత్త్వికగుణ లక్షణం. ఆధ్యాత్మికత చివరి గుణంలో చిగురిస్తుంది. దానిని దర్శించి ఆచరించే చిత్త సంస్కారాన్ని అలవరచుకొమ్మని, సమాజాన్ని పైకెత్తలెమ్మని పిలుస్తోంది ఎస్థర్ గ్రెస్.

ఆధ్యాత్మికతను దర్శించటానికి పిలుపునిచ్చే గైడ్‌లాగా పలికింది కవితలో శ్రీమతి ఎస్థర్ గ్రెస్ ఆధ్యాత్మికతను అనుభవిస్తూ మనకు అనుభూతిని పంచుతున్నట్లు కవిత చెప్పింది డాక్టర్ రోస్‌మేరీ విల్కిన్సన్. ఆధ్యాత్మికత వలన మానవులు అంతర్బహిఃప్రకృతులలో పవిత్రతను అనుభవించే ప్రవృత్తిని కవితలన్నింటిలో కవయిత్రి ప్రసరించింది. పై ముగ్గురిలో ఈమె అన్నివిధాలా మిన్న.

ఆధ్యాత్మికతను ప్రపంచంలో మానవాళి అన్ని స్థాయిల్లో ఎలా అన్వయించుకొని ఆచరణలో పెట్టాలో డాక్టర్ రోజ్‌మేరీకి ఒక నిర్దిష్టమైన అవగాహన ఉన్నది. అందువలన రాజకీయంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా ఆధ్యాత్మికానుభూతిని ఆమె వ్యక్తీకరించింది; ఆధ్యాత్మికతకు అభివ్యక్తిగా పవిత్రతను సంకేతించింది. "The earth is holy, you are holy, create the holy" అన్నవి రోజ్‌మేరీ శాంతి సూక్తాలు. ఈ త్రిపిటకాల్లోనించే ఆమె కవితా తివిక్రమత్వం విస్తరించింది.

ఆమె దృష్టిలో ఈ ధరిత్రి మానవాళికి ఏకైక మాతృమూర్తి ఆమెను సహనంతో సేవించటమే కవయిత్రి భావనలో ఆధ్యాత్మికత, పవిత్రత. అందుకే అనుమానం లేకుండా ఇలా అంటుంది ఆమె :

"Mother Earth is one. How she is
SERVED best, is the goal we run!
We make it so!"

ప్రపంచదేశాలన్నీ ఆధ్యాత్మికంగా పునర్జన్మ యెత్తినట్లు తల లెత్తాలని ఆమె ఆశిస్తోంది—

"Round up the 175 nations
On the earth into re.birth."

"పరస్పరం తోడుపడే సంస్కృతి వర్ధిల్లే
రణరహిత, రక్తపాత రహిత
లోకాన్ని ఆవిష్కరించు!
ఈ పరమాణుశక్తి పరిణామదశలో
పరస్పరం మనం నేర్చుకోవలసింది ఎంతో ఉంది
అలా జరిగేటట్లు మనం చేయవలసి ఉంది." (బాపురెడ్డి అనువాదం)

పరస్పర సహనభావంతో యుద్ధాలు, రక్తపాతాలు లేకుండా పుడమితల్లిని ప్రశాంతంగా ఉంచటమే ఆమె దర్శించే పవిత్రత. పరమాణు యుగంలో ప్రపంచాన్ని ప్రళయం నుండి తప్పించి ప్రణవం వైపు పయనింపజేయటమే మానవులు చేయవలసిన నిజమైన సేవ!

ఆధ్యాత్మికతను పెంచవలసిన సంస్థలే దానిని త్రుంచివేస్తున్నాయని నిర్భయంగా ప్రకటించింది.

| | |
|---|---|
| "Spirituality is dying | "ఆధ్యాత్మికత అడుగంటిపోతూంది |
| because churches are making | చర్చిగురువులు మతాన్ని |
| a business of religion " | వ్యాపారంగా మార్చేస్తున్నాయి." |

జీవితాన్నంతా ఆధ్యాత్మిక దృష్టితో అనుశీలించిన రచయిత్రి అనేకాంశాలను ఆ దృష్టితో నిర్వచించింది; వ్యాఖ్యానించింది; వివేచించింది. స్త్రీల గురించి ఆమె చెప్పిన మాటలు భారతీయ దృక్పథానికి ప్రతిబింబంగా భాసిస్తున్నాయి.

"Women cannot say :
I want not your inspiration, Lord.
Women cannot refrain from:
I want to give you glory, Lord.
Women cannot refuse:
The sixth sense given them by God.
Women cannot restrain:
The poetry of reverence in their heart.
Women cannot deny:
The magnificence of all the earth.
Women cannot live this magnificence:
Without respect for man.
Women cannot love:
Without respect from man.
God made woman, Yes, God made woman
The complement of man."

స్త్రీవాదం చిలువలు పలువలుగా విస్తరిస్తున్న ఈ రోజుల్లో ఈ స్త్రీ సూక్తం శాంతి పాఠంలా వినబడుతోంది. ఎందుకంటే - డాక్టర్ రోస్‌మేరీ విల్కిన్‌సన్ కవయిత్రిగా తన బాధ్యత తెలిసి పలికింది. ఆమె దృక్పథంలో-''కవులు దేశపుఆత్మలు/సంపూర్ణ నగ్నసత్యదర్శనంతో/జాతి అంతఃకరణాన్ని ఆవిష్కరిస్తారు/మరి అదే వారి ఏకైక అస్త్రం." ఆమె కవిత్వాన్ని గురించి చెప్పిన ఈ క్రింది మాటలు మన భక్తకవుల మానసిక పరిపాకాన్ని ప్రకటిస్తున్నాయి.

''నిజమైన కవిత్వం మానవాళికి దేవుడిచ్చిన వరం
అది అతని అఖండ వైభవానికి అద్దం పడుతుంది
అది పవిత్రాత్ములపాలిటి పరమపావన అమృతాసవం.''

ఈ కవయిత్రులు తూర్పుపడమరల సరిహద్దులు చెరిపేశారు. భారతీయుల్లాగా ప్రపంచమంతా స్పందిస్తున్నదని నిరూపిస్తున్నారు. ఆధ్యాత్మికతకు ప్రపంచమంతా ఒకే కుటుంబమని చాటుతున్నారు. ప్రేమ, పవిత్రత సమస్త ప్రాణిధర్మాలని, అవే ప్రపంచ శాంతికి మూలశక్తులనీ వివరిస్తున్నారు. ప్రపంచ కవులు ఆధ్యాత్మిక చైతన్యమే ఆధునిక కవితాస్పృహగా ప్రదర్శిస్తున్నారని ప్రకటిస్తున్నారు.

డాక్టర్ జె బాపురెడ్డిగారు ఈ సత్యాన్ని తెలుగులో అనువదించి చెప్పారు. పడమటి కిటికీలు తెరుచుకున్న మనకు ఎప్పటిదో మన గాలి చప్పుడు చేయకుండా తిరిగి చల్లగా వీస్తున్నట్లున్నది. బాపురె! అనిపిస్తున్నది. *

(ఆంధ్రభూమి, 7-1-1994)

# వంతెనమీంచి వచ్చే పాలవ్యాను

"ఇది బతుక్కీ చావుకీ మధ్య వంతెన!
అలవి మాలిన ట్రాఫిక్‌ను మింగి
మెలికలు తిరిగే కొండచిలువ........
నిజానికి దీన్ని డైనమైట్లతో కూల్చాలి
నిజానికి దీన్ని స్వార్థాల గుండెల్లో పేల్చాలి
కాని రేపు దీనిమీంచే పాలవ్యాను రావాలి
అప్పటి దాకా
దీన్ని మునివేళ్ళమీద మోయక తప్పదు."

ఇది డాక్టర్ ఎన్. గోపిగారి 'వంతెన' కవితలోని మొదలూ చివరా కలిపి నిలిపిన ఖండిక. ఆ కవిత పేరే కవితాసంపుటికి కూడా పెట్టారు. (వంతెన-1993.)

డాక్టర్ గోపిగారు కవితలకు, కవితా సంపుటులకు పేర్లు పెట్టటంలో ఒక ప్రత్యేకత కనిపిస్తుంది. తంగేడుపూలు, మైలురాయి, చిత్రద్వీపాలు,-ఇవి మొదటి మూడు కవితా సంపుటుల పేర్లు. పాత ప్రతీకలుగా రూఢి కెక్కిన వాటికి కొత్త అనుభూతుల ప్రాతిపదికలను కల్పించి నవ ప్రతీకలుగా, నవార్థ ప్రదీపికలుగా వెలిగింపజేయటం వారి కవితా రహస్యం. ఆ మూడు పేర్లూ అందుకు ముచ్చటైన ఉదాహరణలు. 'వంతెన' కూడా అటువంటిదే. రెండింటికి నడుమ అవిచ్ఛిన్నమైన సంబంధాన్ని గాని, సమన్వయాన్ని గాని సూచించేది వంతెన. అది అటువంటి అనుభూతికి అభివ్యక్తిగా మారితే ప్రతీక. అయితే, ఈ కవితలో వంతెనను అచ్చంగా అటువంటి అర్థంలోనే వాడలేదు. ఇది బ్రతుకనీ, ఇది చావనీ చెప్పలేని ఒక మధ్యస్థమైన జీవన వ్యవస్థ కలిగించే మానసిక స్థితికి ప్రతీకగా ఇందులోని 'వంతెన' నిలబడుతుంది. 'ఇది' అనే సర్వనామం మానసిక స్థితిని నిర్దేశిస్తుంది. 'వంతెన' అలంకారంగా, ప్రతీకగా ఆ అనుభూతిని అభివ్యక్తీకరిస్తుంది.

ధ్వనిలో వాచ్యార్థం లాగానే 'వంతెన' ప్రతీకకున్న భౌతిక భావచిత్రం కూడా ప్రతీకార్థంలో ముఖ్యమే. వంతెనను కొండచిలువగా రూపకం చేయటం భావ చిత్ర పరికల్పనం. 'ట్రాఫిక్' నిండైన జీవితానుభవాల ప్రవృత్తులు. వాటినన్నీ జీవచ్ఛవావస్థ కొండచిలువలా తిని జీర్ణించుకుంటున్నది. జీవన మాధుర్యం తిండితిప్పటల యాంత్రిక జీవితంలో ఆహుతి అయిపోతున్నది. బ్రతుకు జీవచ్ఛవ

తుల్యమై పోతున్నది. దీన్ని పేల్చివేయాలిసిందే. కూల్చివేయాలిసిందే. కాని, రేపైనా క్రొత్త జీవితం మన బ్రతుకుల్లో తప్పక వస్తుందన్న ఆశ ఒకటి జ్వలిస్తూ ఉంటుంది. అదే వంతెనమీద దాటివచ్చే 'పాలవ్యాను'. పాలవ్యానుకు నవార్థ కల్పనం అపూర్వం. మునివేళ్ళంటే కొన ఊపిరి ప్రాణాలతో ఉండే ఆశాజీవులు. వారే కవులు లేదా ఈతరం ప్రజలు. వారు ఈ వంతెనను మోయక తప్పదు.

విప్లవ కవిత్వానంతర ధోరణులలో స్థానీయత (Local attachment), ఆత్మీయత (Personal involvemant) అనే భావాలు అనుభూతి వ్యక్తీకరణలో ప్రత్యేక స్థానాన్ని ఆక్రమించుకున్నాయి. ఈ రెండింటినీ దేశీయత (Native Colour), జాతీయత (National identity) అనే భావాలు బలపరస్తూ ఉన్నాయి. ఈ నాలుగు లక్షణాలూ సమకాలీన తెలుగు కవులలో కొందరికి వివిధ ప్రయోగాలు చేసే ప్రేరణ లిచ్చాయి. కొందరు ఒక్కొక్కదానికే ప్రతి నిధులుగా నిలిచారు. కొందరు అన్నిటినీ ఆవిష్కరించారు.

డాక్టర్ ఎన్. గోపిగారు స్థానీయత ఆత్మీయతల అనుభూతిలో పరాయీ కరణం సృష్టిస్తున్న సంక్షోభాన్ని, క్రైసిస్‌ని వ్యక్తీకరించే ఒక మలుపును కవితలో చిత్రించే పద్ధతిని 'వంతెన'లో ప్రధానంగా ప్రదర్శించారు. పల్లెపట్టులలో పుట్టి, అక్కడే స్థానీయతను, ఆత్మీయను బాల్యంలో గాఢంగా పెంచుకొని, పట్నవాసా లకు మెట్టి, వాటితో ఆత్మీయతను పెంచుకోలేక, అటు పల్లెకూ ఇటు పట్నానికీ దూరమై పరాయీకరణంతో బాధపడటం అధునిక నగర జీవితంలోని ఒక అంతర్వేదన. దానిని అభివ్యక్తీకరించటమే డాక్టర్ గోపిగారి వంతెనలోని ఆంతర్యం. ఆ సత్యాన్ని మొదటి కవితలోనే నాందిలా సూచించారు కవి:

"పట్టణం ప్రియురాలు కూడా కాదు
పల్లెల్లో తల్లివొడి కరువైంది
రెంటికి చెడిన ఒంటరి మోడులా నేను...." (కల్వర్టు- పు.3)

'కల్వర్టు' స్థానీయతకు ప్రతీకగా నిలిస్తే, 'క్షణాల్లో స్టేషన్లను మింగేస్తూ మెలికల పాములా సాగే' రైలు పల్లెనుండి పట్నానికి మారుతున్న జీవనవిధానానికి ప్రతినిధి. 'రైలుకు వీడ్కోలు చెప్తున్న దిక్కు' పుట్టినచోటు. రైలు ప్రయాణం నిండా ఆమె కన్నీరే; ఆమే. రైలు పట్నం చేరుతుంది. 'ప్లాట్‌ఫారాన్ని మోయ లేక నిట్టూర్పు కూలిపడుతుంది.' ఇది స్థానీయతను వీడలేని ఆత్మీయత. ఆ తరువాత నగరంలో స్వార్థం ఆత్మీయతను పరాయీకరణంతో హతమార్చ టానికి యత్నిస్తుంది. స్వార్థం నగరజీవిత పరమార్థం. స్థానీయత స్థానభ్రంశమై మనిషిలో అంతస్సంఘర్షణ సృష్టిస్తుంది. దానికి ప్రాణమైన ఆత్మీయత అంతర్ధాన మైపోతుంది. జనసందోహంలో ఉండి కూడా మనిషి నగరంలో ఏకాకి అయి పోతాడు.

"స్వార్థం తెరమీద క్రమంగా
ఆమె కనుమరుగైపోతుంది" (ఆమె అంటే స్థానీయతలోని ఆత్మీయత) అని డాక్టర్ గోపిగారు ఆవేదన వ్యక్తం చేశారు రెండవ కవిత-'ప్రవాహం'లో.

నగర జీవితంలో అడుగడుగునా ఆత్మీయతను కోల్పుతూ, పరాయీకరణకు గురి అవుతూ, కోల్పోతున్న ఆత్మీయతను పునరుద్ధరించుకోవాలనీ, పరాయీకరణను బద్దలు చేయాలనీ కవి పొందే వేదన 'వంతెన' కవితలలో హృదయతంత్రులను మీటుతూ ఉంటుంది. నగర జీవితంలో ఆత్మీయతకు ఆహ్వానం పలికేదిలా కనపడేది 'అప్రవేశం' కవితలోని 'గేటు.' కాని, స్థానీయత లేని ఆత్మీయత మూలబలంలేక పెరిగే మొక్క; గుండెలో కలుక్కుమనే బాణంముక్క! చేదుపీడని తీపి స్మృతి! మనసున్నా ప్రవేశించలేని ముఖద్వారం!

"గేటుకూ నాకూ ఉన్న సంబంధం
ఎంత తవ్వుకున్నా బోధపడదు.
కాలిన కాలం కమురు కంపులో
వట్టివేళ్ళ వాసన.
మెలిపెట్టే చలిలో కదలని ఆకు.
కరిగించే ఎండలో పదునెక్కిన బాకు
మెత్తని పూలమీద పరుచుకున్న తుమ్మముళ్ళు" (అప్రవేశం. పు. 64)

ఈ కవితలోని భావచిత్రాలు పరాయీకరణం వలన ఆత్మీయతలో కలిసే అనుభవ క్షోభను వ్యక్తీకరిస్తున్నాయి. 'వట్టివేళ్ళ వాసన' ఆత్మీయతను పెంచుకొనే యత్నాన్ని సూచిస్తుంది. కదలని ఆకు హృదయ స్పందన కలుగని స్థితిని తెలుపుతుంది. చలి గడ్డగట్టిన లక్షణం సూచిస్తుంది. ఆత్మీయత సుముఖంగా ఉన్నా పరాయీకరణం బాకులాగా, తుమ్మముళ్ళలాగా బాధపెడుతూ ఉందని కవి భావచిత్రాలతో వ్యాఖ్యానించి చెప్పాడు. ఆ చెప్పటానికి ఒక కవితాశైలిని రూపొందించుకొన్నారు డాక్టర్ గోపిగారు.

"శబ్దంలో చిక్కుపడ్డ భావం
పెనుగులాట ప్రారంభించకముందే
నన్ను నేను పునీతం చేసుకోవలసి వుంది." (కాలం నొసట, పు 68)

అని ఆకాంక్షించారు. అస్పష్టతలో, క్లిష్టతలో కూరుకొనని శబ్దచిత్రాలను భావచిత్రాలను ఆవిష్కరించారు.

"నే నెన్నటికైనా రాయాల్సిన వాక్యం కోసం
ఎంతకాలమైనా తపస్సు చేయవలసే వుంది'' అని ప్రకటించుకున్నారు.

డాక్టర్ గోపీగారు సహజవాద కవితాశిల్పి. వాస్తవాలను అనుభవ భావ చిత్రాలుగా మలచి, భావచిత్రాల్లోంచి వాస్తవాలను దర్శింపజేసే పద్ధతి వారి కవితకు సహజ లక్షణం.

"నగరం నరాల్లో వాహనాలు ప్రవహించవు
సిటీ వొంటిమీద జనం చెమర్చరు" (స్తబ్ద సంచలనం - పు. 10)

రూపకాలంకారం నుండి భావచిత్రం కల్పించి వ్యంగ్యాన్ని సృష్టించినా, అది గుణీభూత వ్యంగ్యంలాగా వాద్యాన్ని చమత్కృతం చేస్తూ ఉండటం వాస్తవవాద కవితాశిల్ప స్వభావం. దానిలో డాక్టర్ ఎన్. గోపిగారు ఒక శాఖకు నాయకత్వం వహిస్తున్నారు. ఆ బాటలో మరో అయిదుగురు కవులు, కవయిత్రులు తమతమ స్వతంత్ర వ్యక్తిత్వాలతో ముందుకు సాగుతున్నారు. అయినా, వాళ్ళందరి గొంతుకలలో వినపడే మాటలు డాక్టర్ గోపిగారి గళం నినదిస్తోంది.

"వద్దు! వద్దు! / క్షుద్ర రాజకీయాల చర్చలొద్దు / ప్రయోజకత్వాలొద్దు/
తల్లి పేరును మళ్ళీ ముడివేసుకుని / ప్రకృతిలోకి వెళ్తున్నాం
ఉదయించటానికి జంకుతున్న సూర్యుణ్ణి / ఉత్సాహపరుస్తున్నాం
అందరినీ ప్రేమించే అయస్కాంత శక్తికోసం
త్యాగాలను త్యాగాలుగా గుర్తించే
రాగాలను రాగాలుగా పూయించే
నిప్పులాంటి స్పష్టతకోసం
పూసలన్నీ ఒక్కదారంగా జ్వలించే
అద్భుతమైన విద్యుదనుభవంకోసం"....

చావుబ్రతుకులనడుమ ఊగిసలాడే వంతెనను మునివేళ్ళమీద మోస్తున్న కవులు వీళ్ళే— అనుభూతి కవితల వాస్తవవాదులు. వారందరిలో ఎత్తుగా కనపడుతున్నాడు డాక్టర్ ఎన్. గోపి. రేపొచ్చే పాలవ్యానులో వీళ్ళ కవితల పాలే చిందుతూ ఉంటాయి. ఆ పాలు తాగిన వంతెన డైనమేట్లు పెట్టినా పగలదు! ఆత్మీయతతో అమృతంగా అఖండంగా మారుతుంది. ఆ మార్పువైపు మలుపు తిప్పే క్రైసిస్‌లో పుట్టిన అనుభూతి ప్రతీక వంతెన! క్రైసిస్‌లో మంచి కవిత పుడుతుంది!

*

(ఆంధ్రభూమి, 15-7-1994)

# గోదావరీదిన కొందరు కవులు

తెలుగువారు తమ బ్రదుకును గోదావరిగా భావిస్తారు; సంస్కృతిని కృష్ణ వేణమ్మగా దర్శిస్తారు; పౌరుషాన్ని తుంగభద్రగా ఊహిస్తారు; తెలుగుదనాన్ని పెన్నగా తలపోసుకుంటారు. జాతి జీవనంలో తెలుగు నదులు కల్పించిన సజీవ భావ చిత్రాలవి. అనుభవ ముద్రలవి. జాతి తరతరాలుగా గోదావరిలో ఈదు తూనే ఉంది.

రెండు మూడేళ్ళుగా కొందరు కవులు గోదావరి పేరుతో కవితా సంపు టులు వెలువరించారు. అవి తెలుగువారిని ఆకర్షిస్తున్నాయి కూడా. వాటిలో ముఖ్యంగా చెప్పుకోదగ్గవి: కీ. శే. గోదావరిశర్మగారి 'గోదావరి గలగలలు', బేతవోలు రామబ్రహ్మంగారి 'క్రొత్త గోదావరి,' అద్దేపల్లి రామమోహనరావుగారి 'గోదావరి నా ప్రతిబింబం,' తల్లావజ్ఝల పతంజలి శాస్త్రిగారి 'గుండె గోదారి.' ఇవన్నీ తమలోని కావ్యఖండికల శీర్షికలను అధికరించి పేర్లు పెట్టుకున్న సంపుటాలైనా, కావ్యమంతా గోదావరి మీద రాసినంత అనుభవ సాంద్రతను అందిస్తున్నాయి. వీటిలో 'క్రొత్త గోదావరి' ఒక క్రొత్త బాణీని కల్పించిన కీర్తి సంపాదించుకుంది. గోదావరి పేరును అట్టమీద పెట్టుకోకపోయినా దాని అను భూతులతో ఖండ కావ్యాలను నింపి, పేరు పెట్టుకొన్న సంపుటుల కంటే పేరు తెచ్చుకొన్నవీ ఉన్నాయి. వాటిల్లో ఎండ్లూరి సుధాకర్‌గారి 'వర్తమానం' అత్యంత ఆధునిక కృతుల్లో అగ్రగణ్యం.

ఆంధ్రులకు అన్నం పెట్టే అన్నపూర్ణే కాదు గోదావరి - ఆంధ్రుల ఆత్మీ యతకు ఆదర్శప్రాగ్రూపంగా అంతరాంతరాలలో అనుభూతికందే జీవనధార. "గోదావరి గట్టుంది, గట్టుమీన పిట్టుంది; పిట్ట మనసులో ఏముంది?" అనే సినిమా పాట వింటున్నా తెలుగువారికి గోదావరి, గట్టు, చెట్టు, పిట్ట - గోదావరికి సంబంధించి ఉండటంచేత భౌతిక చిత్రాలుగా కాక భావ చిత్రాలుగా మారి శ్రోతలను భావనాలోకాల్లోకి పంపిస్తాయి. కవితలో గోదావరి భావ చిత్రలహరి.

"దక్షిణ గంగనాఁ దద్దయు నొప్పిన గోదావరియు" (మహాభారతం, ఆది. 8. 139) అని పుణ్యనదిగా ఉత్ప్రేక్షతో ఊహా చిత్రాన్ని అందించాడు ఆదికవి

నన్నయ; జనంలో ఉన్న రూఢికి అలంకృతో క్తిని సహజంగా సమకూర్చాడు. నన్నయ గుణవాది కాబట్టి గోదావరిని పుణ్యవతిగా పరిచయం చేశాడు.

శ్రీనాథుడు రసిక కవిసార్వభౌముడు భీమేశ్వర మండలంలో జనజీవన ధాత్రియైన గోదావరిని పుట్టింటినుంచి మెట్టినింటిదాకా పుణ్య తీర్థాల దివ్య విహారంగా యాత్ర సాగించిన ఆమె భవ్య వ్యక్తిత్వాన్ని చిత్రించాడు. "ఆంధ్ర భూభువన మధ్యము పుండరీకంబు"గా రూపించి, 'సప్త గోదావరీ జలాన్ని తేనె'గా సంభావించాడు. శ్రీనాథుని గోదావరి వర్ణనం వాయు పథంలోనుంచి తీసిన వాఙ్మయ ఛాయాచిత్రం. నన్నయ గోదావరిలో ఆయన ఆత్మీయత ప్రతిఫలించింది; శ్రీనాథుని గోదావరిలో ఆయన అభిమానం తరంగాలుగా తురంగిలించింది.

ప్రాచీక కవులు గోదావరిని సాంస్కృతిక మూల్యాల జీవనధారగా మనకందించారు. గోదావరిలో స్నానం చేసి, ఆ నీటిని తాగితే ధారామధురమైన కవిత్వం అబ్బుతుందని ఆధునికులు కూడా విశ్వసిస్తున్నారు. రాయప్రోలువారు గోదావరిని సేవించి అభినవ నన్నయగా కీర్తిని పొందారు. వేదకాల ఋషుల నుండి బేతవోలు రామబ్రహ్మంగారిదాకా చాలామందిలో ఈ విశ్వాసం బలంగా ఉంది. అది కొందరిలో నిజమై నిరూపించుకొన్నది కూడా.

గోదావరి పరుగుల కెన్ని పారవశ్యం కలిగించే భంగిమలున్నాయో, వరదల కన్ని బీభత్సం కల్పించే అట్టహాసాలున్నాయి. ఈ రెండూ కవుల కవితల్లో వాస్తవసుందరాలుగా ప్రతిధ్వనించాయి. విశ్వనాథవారి కిన్నెరసాని పాటలలో గోదావరి గాంభీర్యం, ఔదార్యం, కారుణ్యం, సౌందర్యం మూర్తికట్టి, తెలుగు పెద్దింటి ముత్తైదువ నిండుదనానికీ, నైపుణ్యానికీ ప్రతీకగా జీవించినట్లు అనుభూతి నందిస్తుంది. దీనికి ప్రతిగా అడవి బాపిరాజుగారి "ఉప్పొంగిపోయింది గోదావరి" గేయం ఆ నది ప్రదర్శించే ప్రళయ బీభత్సాన్ని కళ్ళకు రూపుకట్టిస్తుంది. అప్పుడప్పుడూ ప్రళయతాండవం చేసినా, గోదావరి తెలుగువారికి ప్రణయలాస్యాన్ని పంచిపెట్టే ప్రేమమూర్తిగానే కొనసాగుతోంది.

భావకవితాయుగంలో తెలుగు కవులు పుణ్యంకోసంకంటె పురుషార్థం కోసం గోదావరిని వర్ణించారు. జాతి పురావైభవస్మృతిలో గోదావరిని అవిచ్ఛిన్న ధారకు సాక్షిగా సంభావించారు. "గోదావరీ పావనోదార వాఃపూర

మఖిల భారతము మాదన్ననాడు."

అని ఎలుగెత్తి కీర్తించిన విశ్వనాథ పద్యం ప్రబోధకవితా శిఖరంమీద గోదావరి బావుటాలాగా నేటికీ రెపరెపలాడుతూన్నది. ఆంధ్ర ప్రశస్తికి తెలుగు నదుల వైభవశిల్పం ఈ పద్యం గోదావరిని ఒక దేశభక్తి మూల్యంగా మార్చి ప్రతిష్ఠించిన గౌరవం విశ్వనాథకు దక్కింది గోదావరిమీద ఎన్ని ఖండకావ్యాలు వచ్చినా ఈ పద్య చైతన్యాన్ని మించి జీవించలేకపోయాయి భావకవితాయుగంలో.

ఆధునికులలో అభ్యుదయ కవులు గోదావరిని చూచే చూపు వేరు; అనుభూతివాదులు గోదావరిని చిత్రించే పద్ధతి వేరు. గోదావరిని తమ దృక్పథాన్ని వ్యాఖ్యానించటానికి వాహికగా వాడుకుంటారు అభ్యుదయవాదులు. అంతరమైన అనుభూతిని అభివ్యక్తం చేయటానికి ఆత్మీయమైన ఆలంబనంగా స్వీకరిస్తారు అనుభూతివాదులు. ఈ రెండు పద్ధతులకూ రెండు ఉదాహరణలు గమనిస్తే మరింత స్పష్టమౌతుంది. అభ్యుదయవాదులకు ప్రతినిధిగా అద్దేపల్లి రామమోహన రావుగారిని తీసికొని, వారి 'గోదావరి నా ప్రతిబింబం'లోని ఈ పంక్తులు గమనిద్దాం:

''ఒకప్పుడు
కవిత్వాన్ని మాత్రమే ప్రేమించినప్పుడు
గోదావరి నన్నయ పద్యాల్లా
శ్రీనాథుని సీసాల్లా కనపడింది—
యిప్పుడు
జీవితాన్ని గూడా అర్థం చేసుకున్నప్పుడు
రోవ పొడుగునా పోరాటాన్ని మోసుకుపోతున్న
పరమాణు ప్రవాహంలా కనిపిస్తోంది.''

ఇందులోని గోదావరిలో ఏ మార్పు లేదు. కాని, చూస్తున్న కవి దృక్పథంలో వచ్చిన మార్పే ఇందులో ముఖ్యం. కవికి తన ప్రతిబింబమే ధ్యేయం కాని, అద్దంలాంటి గోదావరి కాదు. అభ్యుదయ కవితలో గోదావరి మామిడిపండులో టెంక లాంటిది.

గోదావరి అభ్యుదయవాదంలోకంటె అనుభూతివాదంలోనే ఎక్కువగా ఉపయోగపడిందని చెప్పాలి. అనుభూతి శాఖకు చెందిన కవులలో కొందరు గోదావరికి తమకూ తనజాతికీ ఉన్న ఆత్మీయ సంబంధాన్ని వ్యక్తం చేయటానికి

గోదావరిని చోదకశక్తిగా రూపొందించుకున్నారు. అందుకు బేతవోలువారి 'క్రొత్త గోదావరి' మంచి ఉదాహరణ. వస్తుదృష్టితో గోదావరిని వర్ణిస్తూ స్వీయదర్శనాన్ని కళాత్మకంగా అభివ్యక్తీకరించే పద్ధతికి గోదావరి శర్మగారి 'గోదావరి గలగలలు', ఎండ్లూరి సుధాకర్‌గారి 'వర్తమానం' ముచ్చటైన ఉదాహరణలు. ఈ రెండింటియొక్క మేళవింపు పతంజలిశాస్త్రిగారి 'గుండెగోదావరి.'

గోదావరి పేరు చెప్పగానే పతంజలి శాస్త్రిగారికి నన్నయ జ్ఞాపకం వస్తారు. గంభీర 'గోదావరి'లా ఆయన దర్శనమిస్తాడు. గోదావరి సముద్రంవైపు పయనం చేస్తుంటే అద్వైతదర్శన సాగరంవైపు సాగించిన నన్నయ ప్రస్థానం స్ఫురణకు వస్తుంది. ప్రతి సుప్రభాతంలో గోదావరి దర్శనం, స్పర్శనం, సంభాషణం ఎలా ఉంటాయో చూడండి, 'గుండె గోదావరి'లో-

"మీ (నన్నయ) ఆశీస్సులు మోసుకుంటూ
ఉదయమే గోదావరి
చల్లగా మమ్మల్ని
తాకుతూ ఉంటుంది.'' (నన్నయగారూ - పు. 79)

గోదావరికీ, నన్నయకూ అద్వైతం, అభేదం దర్శించటం ఈ కవితకు ఆత్మ. గోదావరి జలం నన్నయ ఆశీర్బలంగా నేటికీ భావిస్తున్న అనుభూతిని ఆవిష్కరించాడు కవి. 'నేనూ, గోదావరి' అనే కవితలో 'గోదావరి నా సహోదరి' అని ప్రకటించాడు. 'నే కార్చిన కన్నీరు/కడుపులో దాచుకుని/అలలుగా స్పందించి/సాయం సమీరాల నిట్టూర్పులతో/నన్నోదారుస్తుంది/మా బ్రతుకులొక్కటే.'' (పు. 24). గోదావరిని సోదరిగా భావించిన ఆత్మీయతతో ఉభయ జీవితాల అనుభవ సామ్యభేదాలను రూపొందించే ప్రక్రియ ఇందులో రచనాశిల్పం. అనుభూతి పరమావధి.

ప్రాచీనులు గోదావరిని వస్త్వాశ్రయ దృష్టితో వర్ణించారు; ఆధునికులు ఆత్మీయమైన, లేదా, ఆత్మాశ్రయమైన దృష్టితో వ్యక్తీకరించారు. కవి అనే గవాక్షం నుండి గోదావరిని చూస్తాం ప్రాచీన సాహిత్యంతో; గోదావరిలో ప్రతిఫలించిన కవిని వివేచించి కనుగొంటున్నాం ఈనాడు. పురాణకవులకు గోదావరి పుణ్యవతి; కావ్యకవులకు శీలవతి; ప్రబోధకవులకు వీరసతి; అభ్యుదయ కవులకు విప్లవమతి; ఈనాటి కవులకు అనుభవశ్రుతి. ఈ కవులందరూ తరతరాలుగా గోదావరి నీదుతున్నవారే! *

(ఆంధ్రభూమి, 30-7-1993)

# 'వర్తమానం'లో మట్టి పరిమళిస్తోంది

జులై 30 వ తేదీ 'జీవియస్ కాలమ్' లో గోదావరీదిన కొందరు కవులను గురించి రాస్తూ డాక్టర్ ఎండ్లూరి సుధాకర్ రచించిన 'వర్తమానం' కవితా సంపుటిని ప్రస్తావించాను. గోదావరి పేరు పెట్టుకోకపోయినా గోదావరినిగురించి కొన్ని గొప్ప కవితలను సంకలించుకొన్న అత్యంతాధునిక కవితా సంపుటుల్లో 'వర్తమానం' మొదట లెక్కించదగిందిగా పేర్కొన్నాను. వెలువడి సంవత్సరం దాటిందో లేదో దిగ్విజయం సాధించినట్లు ఇప్పటికే నాలుగు ఉత్తమ కవితా పురస్కారాలను అందుకోటం గమనిస్తే ఆంధ్రభూమి అంచనా అక్షరాలా నిజమనిపిస్తోంది.

డాక్టర్ సుధాకర్ మొదటి కవితాసంపుటి 'వర్తమానం' అయినా, ఫ్రీవర్స్ ఫ్రంట్ (హైదరాబాదు) ఉత్తమ వచనా కవితా పురస్కారానికి ఎన్నిక చేసింది. అలాగే సమతా రచయితల సంఘం (అమలాపురం), వి.యస్.టి. దీక్షితులు సాహిత్య పురస్కార సంఘం (ఎలమంచిలి), గరికపాటి పురస్కార సంఘం (కాకినాడ) ఈ యేడు ఉత్తమకవితా పురస్కారాలను అందిస్తున్నాయి. వర్తమాన కవితకు మంచి భవిష్యత్తు ఉందని ఆంధ్రావళి మోదాన్ని ప్రకటిస్తున్నది.

వర్తమానం కవితలు నన్ను ఆసక్తితో ఒక్కబిగిన చదివించాయి. ఒకటి రెండు ఇంప్రెషన్సు నాలో అప్రయత్నంగా ఏర్పడ్డాయి. ఎండకు బాగా ఎండిన రేగడి నేలమీద తొలివాన చినుకులు బలంగా పడ్డప్పుడు గుప్పున పరిమళించే మట్టి మనసుకు కలిగించే ఒక వింత రుచి దట్టంగా నా అంతరంగాన్ని అలముకున్నట్లయింది. సుధాకర్ వచనకవితా శైలిని నా గుండె గొంతుక చవిచూచి 'ముక్కుతిమ్మనార్యు ముద్దు పలుకు' ను జ్ఞాపకం చేసుకొని ముచ్చట పడింది.

సుధాకర్ కవితకు బ్రతుకువాసన జీవితం. పరిమళిస్తున్న మట్టి ప్రాణం. మజ్జిగకుండలో తీర్చిపెట్టిన వెన్నముద్దలా ప్రతి ఖండికలోనూ కవిత్వం నవనీతంగా పఠిత రసనకు అందుతుంది. కొన్ని కవితలు చదువుతుంటే కవిత్వానికి జీవితం వాసన పట్టినట్లుంటాయి. మరికొన్ని జీవితానికి కవిత్వం వాసన అబ్బినట్లుంటాయి. రెండురకాల రీతుల్లోనూ డాక్టర్ సుధాకర్ పరిణతిని చూపించారు.

సుధాకర్ కవిత్వంలో మనకు వచ్చే మొదటిగుణం అతడెవరినీ అనుకరించ టానికి ప్రయత్నం చేయకపోవటం. పాశ్చాత్య కవితోద్యమాలలో దేనితోనో ప్రభావితుడై ప్రచ్ఛన్నంగానో, పరోక్షంగానో ఆ ఉద్యమ స్వభావాన్ని తెలుగులో నిర్మించే ప్రవృత్తి వెదకినా కనపడకపోవటం. తాను అనుభవించిన జీవిత సత్యా లనే కళానుభవాలుగా మార్చే పద్ధతిలో భావాలకు ప్రాధాన్యం ఇస్తూ వాటిని అందంగా అభివ్యక్తీకరించటానికి అలంకారాలను గాని, భావచిత్రాలను గానీ ఆలంబనాలుగా మాత్రమే తీసుకోవటం. ఉక్తిని సహజంగా సరళంగా అలంక రించటం సుధాకర్ కవితా కళాశిల్పం గూర్ఖాను పరిచయం చేస్తూ "అతడు ఆరు ఋతువుల చెలికాడు, కాలం ఆతడి చేతిలోని టార్చిలైటు" అన్నప్పుడూ, మైసమ్మను గురించి చెపుతూ-''పిల్లలకి స్నానం చేయిస్తున్నంత ప్రేమగా, ఆమె రోడ్లు వూడ్చేది" అని వర్ణించినప్పుడూ, "పాతపద్యం లాంటి సైకిల్‌క్యారియర్‌పై ప్రాసల్లా కూర్చున్న'' మిత్రుల్ని చూపిస్తున్నప్పుడూ, కొబ్బరిచెట్లు గోదావరితల్లి ముందు, ఎదిగిన కొడుకుల్లా నిలబడతాయని ఛాయాచిత్రం తీసినప్పుడూ, నగరాన్ని "బాగా డబ్బు గడ్డిమేసి పోతరించిన ఖడ్గమృగంగా" దర్శించినప్పుడూ, "పేదరికం పెంకులమీద దౌర్జన్యంగా చినుకుల సవ్వడి" వినిపించినప్పుడూ, ''నిన్నటి చరిత్ర బొటనవేళ్ళనే కోసింది, వర్తమానం ఐదువేళ్ళనూ నరికేస్తుంది'' అని ఆధిక్షేపించినప్పుడూ, "పొగమబ్బుల మధ్య చార్మినారు అగరువత్తిలా వెలుగుతూం''డటం చూపించినప్పుడూ "మధ్యతరగతి మహారణ్యంలో, మనం తేనెటీగలం'' అన్నప్పుడూ, "మట్టి నా ప్రతిభ'' అని ప్రకటించినప్పుడూ, ''నా దేశంలో నేను వలసపక్షిని''అని దీనంగా తెలిపినప్పుడూ సుధాకర్ భావాన్ని కవిత్వీకరించటంలో ఎటువంటి కృత్రిమమైన ప్రయత్నం చేసినట్లుండదు. మాటా, మనసూ పరిమళిస్తున్నట్లు వ్యక్తీకరించటం సుధాకర్ సూక్తికి సహజ గుణం.

దాదాపు 1985 నుండి భారతీయ భాషల్లోని కవితలలో భారతీయతను అన్వేషించే ఒక అత్యంతాధునిక ప్రవృత్తి బలంగా ప్రతిఫలిస్తున్నది. అందులో స్థానీయత (Local Attachment), ఆత్మీయత (Personal involvement), దేశీయత (Native Colour), జాతీయత (National spirit) అనే నాలుగు అవస్థలు ప్రత్యేక గౌరవాన్ని, స్థానాలనూ ఆక్రమిస్తాయి. వీటిల్లో ఏ ఒక్కటి బలంగా కవితలో చిత్రించినా అత్యంతాధునికతను కవి సాధించి

నట్లు విమర్శకులు వివేచిస్తున్నారు. డాక్టర్ ఎండ్లూరి సుధాకర్ ఈ నాలుగింటినీ ఆధునిక స్పృహతో పోషించి వర్తమాన కవితకు సంబంధించిన ఒక పరిపూర్ణ వర్తులాన్ని (Complete circle) చైతన్య పరంగా సాధించగలిగాడు. మంచి కవిత్వం చదివానన్న తృప్తిని పఠితకు కలిగించే మౌలికమైన కవితాగుణం ఈ నాలుగు స్పృహలను సహజంగా సమన్వయించటంలోనే దాగివుంది.

నేటి కవిత్వంలో - కవి తన అస్తిత్వాన్ని అన్వేషిస్తూ పుట్టిన మట్టితో తన వ్యక్తిత్వాన్ని విలువ కట్టుకోవటం, ఆ మట్టివాసన తనలో ఎంత ఉందని బేరీజు వేసుకోవటం తాను పుట్టిన గడ్డతో సమస్త జగత్తును కొలిచే నవ్యప్రమాణాన్ని రూపొందించుకోవటం, బాస, యాస, కట్టు, బొట్టు, తిట్టు, దావు, బ్రతుకు, పోరాటం - అన్నీ తాను పుట్టిన స్థానంలో నుండి పుట్టే సహజ చైతన్య స్పృహల్లాగా సంభావించటం స్థానీయతకు లక్షణాలుగా అత్యంతాధునికులు గ్రహిస్తున్నారు. 'శ్వాసించే బాల్యం', 'రక్తనగరం', 'చెరువులేని వూరు', 'ఇందిరాపార్కు', 'తెలంగాణా ఉత్తరం', 'బర్సాత్‌కీరాత్' మొదలైన కవితల్లో కవి స్థానీయతను చిత్రించాడు. పల్లెటూరులో పుట్టి పట్నంలో పెరిగి, ఆ రెంటి వెలుగునీడలల్లో దిద్దితీర్చుకొన్న బాల్యజీవితానుభవాల శకలాలను తన అస్తిత్వానికి ప్రాతిపదికలుగా వ్యాఖ్యానించే బలమైన గళం పై కవితల్లో వినబడుతుంది.

పుట్టిన చోటు లాగానే, ఏ ప్రాంతానికి వెళ్ళినా, ఏ ప్రదేశంలో మెట్టినా పరాయితనాన్ని పారద్రోలే ఆత్మీయతను పెంచుకొనే ఒక ఏకాత్మభావం ఆత్మీయత. ప్రాంతీయతను ఆత్మీయత మింగివేస్తుంది; స్థానీయతను దేశీయతగా విస్తరింపజేస్తుంది మానవ జాతి సమైక్యతకు, దేశ సమైక్యతకు బలంగా తోడ్పడే లక్షణం ఆత్మీయత. దీన్ని గాఢంగా చిత్రించిన కవే అత్యంతాధునికతలోని ఆత్మను పట్టుకున్నవాడు. డాక్టర్ సుధాకర్ కవిత ఆత్మీయతకు అమృత పుత్రిక. ఈ కవి గోదావరి కవితల్లో 'ఎక్కడ ముట్టుకున్నా' తగిలే 'గుండె తడి' ఆత్మీయత. హైదరాబాదు ఇరానీచాయికి మరిగిన కవి జీవితం గోదావరిని సమీపించగానే వరదగోదావరినే ఇరానీచాయిగా భావించింది. సహృదయత్వంతో స్థానీయత స్థానాంతరాన్ని ఆత్మీయంగా భావింపగలిగింది. గోదావరే తల్లీ తండ్రిగా మారిపోయింది. "నాన్న కొట్టినప్పుడు, ఒక మూల ముడుచుకొని పడుకున్న అమ్మలా" తోచించి గ్రీష్మగోదావరి; 'శ్రమజీవన సౌందర్య లహరిగా', 'కదిలే ఒక గొప్ప కళాఖండంగా' భాసించింది కొత్తనీటి గోదావరి;

"గోదావరికే గొంతుంటే, జల భాషలో శతాబ్దాల గుడిసె కథలు చెప్పేది" అని పించింది 'ఒక సాయంత్రం గోదావరి.' గోదావరిని ప్రేమించి కవి తానే గోదావరైనాడు. "గోదావరి నేలమీదే కాదు, నన్ను చుట్టుముట్టి నా కళ్ళల్లోంచి ప్రవహిస్తోంది" అని చెప్పి ఆత్మీయతకు అనంతఫలాన్ని కాయించాడు. గోదావరితో పాటు, భార్యాపిల్లలపై రాసిన కవితలు, గూర్కా, మైసమ్మ, మిత్రులు, 'బతుకు వాసన' మొదలైన కవితలు ఆత్మీయతకు అచ్చమైన దినుసులు.

శ్రీశ్రీ 'భిక్షువర్షీయసి'లాగా, విశ్వనాథ 'అంధభిక్షువు'లాగా, సుధాకర్ కవితల్లో పరిచయమైన పిల్లనగ్రోవి వాయించే గుడ్డిబిచ్చగాడు; 'రాత్రంతా వానలో తడుస్తున్న పిచ్చుక లాగా పబ్లిక్ గార్డెన్‌లో' కానవచ్చే 'పిచ్చితల్లి'; 'వల' రాజులై జల పుష్పాలకోసం కదలి తోటకు వెడలిపోయే 'నీటిమనుషులూ' తెలుగువారిక మర్చిపోలేరు. దేశీయతకు 'నెత్తుటిప్రశ్న', 'పాదముద్రలు' సాక్ష్యాలు. దళిత సమస్యలో ఉన్న కార్చిచ్చును కవితాగ్నిగా ఆవిష్కరించాడు డాక్టర్ సుధాకర్. జాతీయతలో నేటి స్వరాన్ని వినిపించాడు; వర్తమాన కవితాస్పృహను వ్యాఖ్యానించాడు; "నా మాతృదేశాన్ని వెతుక్కుంటున్నాను; నా మాతృస్తన్యాన్ని తడుముకుంటున్నాను." ఈ అన్వేషణే అత్యంతాధునిక భారతీయ కవితా స్పృహకు ప్రతీక; 'వర్తమానం' దాని పతాక! *

(ఆంధ్రభూమి 17-9-1993)

# చిలక్కొయ్య సాక్షిగా శిఖామణి పెళ్లి

'నమస్కారం మాస్టారూ! ఫిబ్రవరి 20 న పెళ్ళి పుస్తకం పెట్టుకున్నాను. తప్పక రావలసిందిగా కోరుతున్నాను' అని మిత్రులు శిఖామణి (కె. సంజీవరావు) గారు లేఖ వ్రాశారు ఆప్యాయంగా. అమ్మయ్య! మువ్వల చేతికర్రను తగిలించు కోటానికి ఒక చిలక్కొయ్య దొరికిందని సంతోషించాను. వివాహముహూర్తం కంటె ముందుగా 'చిలక్కొయ్య' కావ్యావిష్కరణం, కవి సమ్మేళనం పెట్టు కొని కవితా పక్షపాతాన్ని ప్రకటించుకున్నారు కొత్త పెళ్ళికొడుకు శిఖామణి.

కొంతమంది కవులూ, రచయితలూ మాట్లాడుతున్నా, రాస్తున్నా, ఏ పని చేస్తున్నా నా కుటుంబంలోని సభ్యులే మా యింట్లోనే నా గుండెలోనే ఆత్మీయంగా మసలుతున్నట్లూ, పలుకుతున్నట్లూ, అభివ్యక్తమౌతున్నట్లూ అనుభూతి నంది స్తూంటారు. అటువంటివారిలో శిఖామణిగా రొకరు. ఆధునిక జీవితంలో ఏకాంతత, అంటే ఒంటరితనం, ఎక్కువై - ఆత్మవేదనను కవిత్వంలో కళల్లో రగిలిస్తున్న ఈ రోజుల్లో గోపి, సుధాకర్, శిఖామణి అఫ్సర్, ఆశారాజు, నిర్మల - ఇలా కొంతమంది ఆత్మీయతను సంజీవనిలాగా కవితారంగంలోకి తెచ్చి మానవతకు ఒక కొత్తరకం ఊరడింపును అందిస్తున్నారు. మన చుట్టూ ఉన్న ప్రతి చిన్న వస్తువునూ ఎలా ఆత్మీయంగా చూడాలో, అందులో నీ జీవితాన్ని పంచుకొనే ప్రేమబిందువు ఎలా నిన్ను ఆహ్వానిస్తుందో దర్శించే ఒక చెలికారపు చూపును ప్రసరిస్తున్నారు. మనలో చచ్చిపోతున్న మమకారానికి ప్రాణం పోస్తున్నారు. సిద్ధాంతాల లౌడ్‌స్పీకర్లలో తప్ప గొంతు విప్పలేని గొప్ప గొప్ప కవుల ఎదుట నిలబడి సొంత గొంతుతో స్వభావసిద్ధంగా సహృదయుల మనసులతో సూటిగా మాట్లాడగలుగుతున్నారు. 'మైకం లేని మాట ఎన్నాళ్ళకు వింటున్నాం!' అన్న రిలీఫ్‌ను తెలుగువారికి కల్పిస్తున్నారు. వీరిలో శిఖామణి ఒక శిరోమణి.

మా యింట్లో చిలక్కొయ్యను చూచినప్పుడెల్లా శిఖామణి జ్ఞాపకం వస్తున్నాడు. చిలక్కొయ్య నా వర్తమానానికి అస్తిత్వాన్ని కలిగించిన అవిచ్ఛిన్న

తను జ్ఞాపకం చేస్తోంది. చిలకొయ్య మీద పిచ్చుకల జంట ముచ్చట్లాడుకుంటున్నప్పుడెల్లా నాకు ముండకోపనిషత్తులోని తృతీయ ముండకం తలపులో నిండుతుంది. శిఖామణిగా రందించిన ఈ కొత్త అనుబంధం జీవితానికో కొత్త చూపును కలిగిస్తోంది.

"నాకు తెలిసిన దగ్గర్నుండి
ఎన్నోతరాల పిచ్చుకలు అటూ ఇటూ గెంతుతూ
ఆనందంతో మైధునాలు జరిపి
తమ సంతతిని వృద్ధి చేసుకుందీ చిలకొయ్యమీదే."

కొత్తగా పెళ్లైన జంటకు అరుంధతికి బదులు ఇకముందు శిఖామణి చిలకొయ్యను చూపిస్తే చాలు. చిలకొయ్యకు ఇంత గొప్పగా ప్రతీకాత్మక ప్రాణ ప్రతిష్ఠ చేసిన తెలుగుకవి మరొకడు లేడు. పచ్చికుండలా పగిలిపోయే కుటుంబ వ్యవస్థకు అనురాగసూక్తం చిలకొయ్య.

ఆత్మీయత శిఖామణి కవితకు ఆయుస్సూత్రం. మమత, సమత నేత్ర ద్వయం. ఇంతకాలం కొడవళ్ళకు పదును పెట్టే కవితలు విన్నాం. శిఖామణి కూడా అప్పుడప్పుడు కొడవలి ఎత్తుతున్నా- దాని ప్రయోజనం మాత్రం కొత్తది. వ్యాపార సంస్కృతి మీద వాడిగా ప్రయోగించటానికి కవిత్వంతో కక్కుఱ్ఱు పెట్టటం విశేషం. సమ సమాజం కంటె ముందు సభ్య సమాజాన్ని కోరుతున్నాడు కవి.

"మనం బాల్యాన్ని అమ్ముకున్నాం
మనం యవ్వనాన్ని అమ్ముకున్నాం
మనం భూమిని అమ్ముకున్నాం
మనం రక్తాన్ని, మూత్రపిండాల్ని అమ్ముకున్నాం
మనం అజేయమైన శ్రమను అమ్ముకున్నాం
మనం అచంచలమైన నమ్మకాన్ని అమ్ముకున్నాం
మనం అకుంఠితమైన ఐక్యతను అమ్ముకున్నాం
మనం కట్నం డబ్బులు పేరుతో పుంసత్వాన్ని అమ్ముకున్నాం
సంసారం పేరుతో స్త్రీత్వాన్ని అమ్ముకున్నాం
మనం సర్వస్వాన్నీ అమ్ముకున్నాం
అన్నీ అమ్మేసుకుని మనం
బతుకును వ్యాపారం చేశాం!

అన్నీ అమ్మేసుకుని మనం మనిషినే కోల్పోయాం....
మనం బతకటం కోసమే కదా
బతుకును అమ్ముకున్నది?....
'కోత'ల సమయం ఆసన్నమైంది
మనం కొడవళ్ళకు కక్కుర్తుళ్ళు పెడదాం!" (కక్కుర్తుళ్ళు)

మనిషి బాగుపడంది మన సమాజం బాగుపడదన్న భావాన్ని ప్రకటిస్తున్నాడు. శిఖామణి ఆవేదనను ఆవేశంతో వ్యక్తం చేస్తున్నప్పుడు పునరుక్తిని శక్తిమంతంగా ప్రయోగించగలడు. అయితే, ఆవేశం శిఖామణిగారి సహజలక్షణం కాదు. శిల్పం శిఖామణి కవితాశీలం.

నిషేధాజ్ఞను గురించి నిలువునా మండుతున్నట్లు రాయవచ్చు. కాని, భావనా ప్రపంచాన్ని బద్దలు చేయగల నిప్పురవ్వల్లా అక్షరాలను అంటించి మనకందిస్తాడు శిఖామణి.

"ఎరుపెక్కిన అమ్మ చనుబాలు కూడా నిషేధమే
తల్లీ నువ్వు బిడ్డను కనుకుంటే కనుకోగానీ
నీ పుట్టిన బిడ్డడి పిడికిళ్ళు బిగించి మాత్రం వుండకూడదు!" (నిషేధాజ్ఞ)

ప్రతి అక్షరాన్నీ ప్రయోజనాత్మకంగా ప్రయోగించే శిల్పికాబట్టి శిఖామణి—

"అక్షరాల్ని చెరిపెయ్యగలవేమో,
అక్షరాల్ని నినదించే గొంతుల్ని నులిమెయ్యగలవేమో!
కానీ, గాలి అంతటా, నేల అంతటా
పరివ్యాప్తమైన నినాదాల ప్రతిధ్వనుల్ని దేంతో బంధించగలవు?'' అని

అనగలిగాడు.

దాదాపు 1988 దాకా శిఖామణి తన మాటను డైనమైట్‌గా మార్చాలని యత్నంచేసినట్లు కనపడుతుంది. "ఈ రోజు నా మాటలు/రాత్రిపూట అడవిలో రహస్యంగా చరించే యోధులు/మరణించిన వీరుల త్యాగాలను కీర్తించే నది గొంతుకలు'' అన్నారు. "నిన్న తల్లి లాలిపాటలో వొదిగిన మాటలే/నేడు పేలటానికి సిద్ధంగా వున్న డైనమైట్లు" అని కూడా హెచ్చరించారు. అయితే, ఆ తరువాత మాటల్లో పేలుడు పదార్థం తగ్గింది; కవితా పదార్థం పెరిగింది. చిలక్కొయ్యను 'చేత్తో మీటగానే' అది 'కోటిస్వరాలను' ఆలపించింది. అప్పటి నుంచి 'అద్భుత శిల'లా శిఖామణి కవిత్వం భావచిత్రాలతో 'కథలెన్నో' చెపుతోంది. 1990 నుంచి నడిబజార్లో తిరిగిన దిసమొల మగాడూ, 'పరిమళాన్ని మోసుకొచ్చే వాయుదేవుడులా' కనపడే పూలవాడూ, 'ప్రమిదకింద చీకటిలా

ముడుచుకుని పడుకొనే' ఆసుపత్రి సిస్టరూ, 'తెలుగు వాచకాల్లో నెమలి యీకలుగా' మారిన పిల్లలూ, 'కామధేనువు గంగడోలు'లాగా ఉన్న గిజిగాడూ, 'తడిచూపు' మునిలాడూ, అలాగే మేఘన, గాలివోద, వెన్నెల దువ్వటి, పాటల బండి, ఎన్నో వాస్తవ దృశ్యాలు కనపడ్డాయి. దానికి కారణం బహుశః 1989 లో 'కలలనెమలి' పురివిప్పి కనపడటమే కాబోలు! "నెమలి కలవడం మాత్రం నిజం/తనువాలినప్పుడు/తనువుతో/ఊదా నీలం హరితంతో నన్ను వీస్తుంది/వెళ్తూ వెళ్తూ నా సమస్త ప్రాణాల్నీ తోడేసి/వెక్కిరింత ప్రేమలో/తన పింఛపు ఈకను తురాయిగా తురిమి/కిసుక్కున వెళ్ళిపోతుంది"-అని చెప్పిన కవి జోస్యం నిజమైనట్టుంది! తెలుగు కవితకు ఒక కొత్తతరం దొరికింది. తెల్లవారుతున్న ఆ ఘట్టం కవి భావచిత్రంలో కొత్తవెలుగులు ప్రసరించింది:

"కొమ్మల్లో పక్షులు
ముక్కులతో వేకువను పొడిచి పొడిచి
పక్షాల ఈకలను సవరించుకుంటాయి
వీధులన్నీ ప్రవాహం ఆగిన నదుల్లా ప్రశాంతంగా ఉంటాయి."

ఈ అభివ్యక్తి శిఖామణివంటి కవులు సాధించిన ఉషస్సు! ఇప్పుడిటువంటి కవులు కనీసం అరడజను మంది ఉన్నారంటే ఆంధ్ర భారతి గర్వించదగిన విశేషమే. వీరందరూ వీరతాండవం చేయరు. తమ కలాలతో కవితాలాస్యం చేయిస్తారు. శాంతివీరులు; శిల్పకారులు. ఒక నవతరాన్ని నడుపుతున్న ప్రశాంతి ఘరులు!

వీరిని గమనిస్తూంటే నాకు కొన్ని చరిత్ర స్మృతులు జ్ఞాపకం వస్తున్నాయి. వక్రతామూలమైన అలంకారమే కవిత్వమన్న రోజుల్లో స్వభావోక్తి అలంకారం కాదంటే - దానిని అలంకారంగా నిలిపి కవిత్వ సహజ సౌందర్యాన్ని కాపాడిన కవులు ఈరోజు మరలా కళ్ళముందు కదలుతున్నారు. వక్రోక్తి ప్రస్థానం విరగబడి నవ్వుతూ ధ్వనినీ రసాన్నీ ధిక్కరించినవేళ కావ్యాన్ని అనుభూతితో కాపాడిన కవిలోకం మనస్సులో మెదలుతోంది. భావచిత్రాలు చిక్కబడి వాస్తవం కనపడకుండా కమ్ముకుపోయిన ఈరోజుల్లో వాస్తవాన్నే అలంకారంలో అందగించి అందంగా జీవితాన్ని ఆస్వాదింపజేస్తున్న శిఖామణితరం చరిత్రలో చిరస్మరణీయం!

చిలకొక్కయ్యసాక్షిగా శిఖామణి పెళ్ళికి జీవియస్‌కాలమ్ శుభాకాంక్షలు! *

(ఆంధ్రభూమి, 18-2-1994)

# పావురం ప్రతీక, పావురాలు భావచిత్రాలు

"చూడు —

పూజారి చేసిన గుడిగంటల సందడికి
ఆలయపు గోపురాలనుండి
ఎగిరిన పావురాలు
        ప్రభువు ప్రార్థనకోసం
        పాస్టర్ చర్చి తలుపులు తెరిచినప్పుడు
        ఎగిరిన పావురాలు
అల్లా-ఓ-అక్బర్ మౌజన్
హృదయనాదానికి
మసీదు మీనారులనుండి
ఎగిరిన పావురాలు
        అన్నీ కలిసి తిరుగుతున్నాయి
        అన్నీ కలిసి తింటున్నాయి
కాని—
పూజారి;
పాస్టర్;
మౌజన్?!"

శ్రీ బోయ జంగయ్య రాసిన ఈ కవితను 1976 మార్చిలో చదివాను. సమకాలీన సమాజంలోని మత సామరస్యరాహిత్యాన్ని ఇంత వ్యంగ్యంగా అధిక్షేపిస్తూ మనసుకు హత్తుకుపోయేటట్లు చెప్పిన ఇంత మంచి మినీ కవిత తెలుగులో నేనింతవరకు చదువలేదు. నే నెన్నో సభల్లో ఈ కవితను చదివి వినిపించాను. విన్నప్పుడెల్లా సభికులు సంతోషాతిశయంతో కరతాళధ్వనులు చేసేవారు. కవిత చదివిన నాలుగైదేళ్ళకుగాని శ్రీ జంగయ్యను నల్లగొండలో కలుసుకోలేకపోయాను. కవి పేరు 'బోయ జంగయ్య' అయినా, నేను 'పావురాల జంగయ్య' అని మనసులో(తో) పిలుచుకుంటుండేవాణ్ణి. ఎందువల్లనంటే - పావురాల భావచిత్రాన్ని అంత బలంగా నా గుండెలో నిలిపాడు కవి. ఆ తరువాత 'పావురాలు'

అనే కవితా సంపుటిని శ్రీ బోయ జంగయ్య వెలువరించారు. దాని ద్వితీయ ముద్రణాన్ని నాకు ఆప్యాయంగా పంపారు దాన్ని చూడంగానే దాదాపు వద్దెనిమిదేళ్ళ నుండి నా మనోరంగంలో కలనితిరుగుతున్న జంగయ్యగారి పావు రాలు ఒక్కసారి రెక్కలు విప్పి భావాంబర వీధుల్లోకి ఎగిరాయి. జీవియస్ కాలమ్ స్పందించింది.

పై కవితకు శీర్షిక 'పావురాలు.' కవితా సంపుటి పేరు కూడా 'పావు రాలు.' కాని, ఈ కవిత ఆ సంపుటిలో లేదు. పైపెచ్చు గుంపులు గుంపులుగా తిరుగాడే పావురాలకు బదులు ఒంటరి పావురం మాత్రమే గోచరిస్తుంది. అదీ తప్పిపోయి కనిపించక వెదికిస్తుంది.

"పావురం కనిపించడం లేదు
కనుచూపు మేరలో దాని జాడే లేదు
ఎగురేసిన పావురం ఎటు పోయినట్టు?...
కాశ్మీరు పూదోటల్లో/కన్యాకుమారి కాలి బాటల్లో
గోవా చర్చి గంటలపై/కలకత్తా కాళీ గుడిపై
భాగ్యనగర్ చార్‌మినార్‌పై/వణుకుతూ నిలుచుందట
కర్ఫ్యూ కాల్పులకు/కునుకు మాని కూర్చుందట........
మందిర్ - మసీదుల కోసం/మనుషులే పోట్లాడుతుంటే
స్థావరం కోల్పోయిన పావురం/ఎక్కడెక్కడో ఎగురుతూ
మీ ఊరు, వాడా చేరితే/రాళ్ళు రువ్వకండి
ఆ అపురూప శ్వేతకపోతాన్ని/స్వేచ్ఛగా ఎగురనివ్వండి."

ఈ కవితలోని ఒంటి పావురం శాంతికి ప్రతీక. దేశంలో మతకల్లోలాలవల్లా, హింసాకాండవల్లా మనందరం ఆశించే శాంతి కనుమరుగైపోయిందనీ, నగరా లల్లో అగ్నిజ్వాలగా వ్యాపించిన అశాంతివలన శాంతి బహుశః పల్లె ప్రాంతాలను వరించవచ్చుననీ, అక్కడ కూడా రాళ్ళతో కొట్టి శాంతిని తరిమివెయ్యవద్దనీ కవి ఈ కవితలో ప్రబోధం చేశాడు. పాత ధోరణిలో చెపితే - నాకు 'పావురాలు' 'ఆహా' అనిపించింది; 'పావురం' 'ఓహో' అనిపించింది. వస్తుపరంగా రెంటికీ కొంత సామ్యం కనపడుతున్నా కవి పావురాలను చిత్రించిన శిల్పాలలో భేదం ఉంది. ఏకవచనంలో ఉన్న పావురం ప్రతీక; బహువచనంలో ప్రయోగించిన పావురం భావచిత్రం. శాంతికపోతం బహువచనంలో రాణించదు; శాంతి నిత్యైక వచనంలా భావింపబడుతుంది; ఆస్వాదింపబడుతుంది. శ్వేతకపోతాన్ని శాంతిగా భావించే సంస్కారం సామాజికులకు సహజం. అందువల్ల కపోతం శాంతికి ప్రతీకగా విశ్వజనీనతను సంతరించుకున్నది. దానిని శ్రీ బోయ జంగయ్య ఒక

దేశ కాల పరిస్థితులకు సంబంధించిన చట్రంలో బిగించి చమత్కరించాడు. అందు వలన అది 'ఓహో' అనిపించింది.

'పావురాలు' (బహువచనం) భావచిత్రం. ప్రతీకలను పసులగొట్టి భావ చిత్రాలను చిత్రించటం కవితా నిర్మాణ శిల్పంలో మంచి పనితనం తెలిపే పట్టు. ప్రతీక సూర్యకిరణంలాంటిదైతే, అది కవి ప్రయోగమనే ప్రిజంలో పడి సప్త వర్ణాలుగా చీలిపోవచ్చు; అలాగే ఒక ప్రతీక జాతికి అందించే సమగ్రానుభూతి లోని ఛాయలను శాఖలను పసికట్టి కవి నిపుణంగా వాటిని భావచిత్రాలుగా పరి వర్తనం చేయవచ్చు 'పావురం' 'శాంతి' అయితే, 'పావురాలు' 'శాంతి కాముకులు'గా పఠితల అనుభూతి కందుతున్నాయి మొదటి కవితలో. గుడి గోపురం మీది పావురాలు, చర్చి ద్వారాలమీది పావురాలు, మసీదు మీనారుల మీది పావురాలు మూడు మతాల అనుయాయులుగా కనపడ్డా; కలిసి తిరుగుతూ తింటున్న పావురాలు మతాతీత మానవత్వానికి ప్రతినిధులుగా మిగిలి పఠితలకు సహానుభూతిని కలిగిస్తాయి. 'అహా' అనిపించే అర్థవంతమైన శిల్పమది.

ఆధునిక కవితకు అలంకారం భావచిత్రం. కావ్యంలోని వస్తువునూ, భాషనూ, అలంకారాన్ని భావచిత్రంగా పరివర్తనం చేయగల కళాశక్తియే ఆధునిక కవితకు జీవం. వస్తువును వాచ్యం చేయకుండా భావచిత్రాల ద్వారా ప్రతీయమానం చేయటంవలన, భాషను భావచిత్ర సమర్పణకు సమర్థవంతంగా శిల్పీకరించటంవలన, వస్తువు. భాషా అలంకారరూపమైన భావచిత్రాలుగా మారి పోతాయి. ఉదాహరణకు శ్రీ బోయజంగయ్య 'కన్యాదాత' (మినీకవిత)—

"డబ్బిచ్చేవాడు / దాత
భూమినిచ్చేవాడు/ ధర్మదాత
అన్నీ యిచ్చి/ బిడ్డనిచ్చేవాడు
ఉష్!/ గడ్డిపోచ."

మొదట - రెండుపాదాల చొప్పున రెండు భావచిత్రాలు ప్రత్యక్షమౌతాయి. అవి పైకి నిర్వచనాల్లాగా కనపడుతున్నాయి. కాని, డబ్బిచ్చినవాడూ భూమినిచ్చిన వాడూ లోకంలో ఎలా ప్రశంసింపబడతారో ధ్వనింపజేసే పదాలు: దాత, ధర్మదాత. అవి అలంకారాలు కాని అలంకారాలు. డబ్బును, భూమినీ, బిడ్డను కూడా దానంచేసిన కన్యాదాత పై ఇద్దరికంటె గొప్పవాడు కావాలి. కాని, లోకంలో గడ్డిపోచలా పరిగణింపబడుతున్నాడు. 'ఉష్!' అనేమాట ఒక్కటీ పైకవితలో ఒక చరణం. అయ్యో, లాభంలేదు అనిన్నీ, లెక్కలేదనిన్నీ, గట్టిగా అనకండి అనిన్నీ ఎన్నో అర్థాలు చెప్పుకోవచ్చు ఆ ఏకపదచరణానికి 'గడ్డిపోచ' రూపకా

లంకారమే, భావచిత్రంగా పరిణమించింది. కవితలోని తులనాత్మక దృక్పథం వస్తువును భావచిత్రంగా మార్చే పరికల్పనాశిల్పం.

కవిత్వంలో భావచిత్ర పరికల్పనం సామాన్యంగా రెండు విధాలుగా కనపడుతుంది. ఒకటి - భావచిత్రాన్ని అలంకారంగా అమర్చటం; లేదా అలంకారాన్నే భావచిత్రంగా అందించటం. రెండు - భావచిత్రాన్ని వస్తుపరంగా నిర్మించటం. 'కన్యాదాత' మొదటి రకానికి, 'పావురాలు', 'పావురం' రెండో రకానికి చక్కని ఉదాహరణలు.

'పావురాలు' కవితలోని పావురాలు వస్తువులోని సజీవకళాగాలే. గుడిమీదివి, చర్చిమీదివి, మసీదుమీదివి మూడు చిత్రాలుగా లేస్తాయి. ఆ మూడూ ఒకచోట వాలి కలిసి తిరుగుతూ కలిసి తింటూ ఏకచిత్రంగా మారిపోతాయి. ఆ పావురాలు మతాలు వేరైనా మానవత్వంతో మనుగడ సాగించే మానవ సమూహాన్ని, సహజీవన సమైక్యతకు ధ్వనింపజేసే ఒక భావచిత్రాన్ని అందిస్తాయి. పావురాలను గురించి ఎక్కడా కవి వ్యాఖ్యానించడు. కాని, వస్తుధ్వనిని కవితకు ఆత్మగా ఆవిష్కరిస్తాడు. మూడు ప్రవాహాలు కలిసిపోయినట్లు పావురాల భావ చిత్రం మనకొక రమ్యమైన అనుభూతి నందిస్తే; పూజారి, పాష్టర్, మౌజన్- ముగ్గురూ మానవతకు దూరమై మూడు సమాంతరరేఖలుగా మిగిలిపోయినట్లు భావచిత్రాన్ని మనకు మిగులుస్తారు. అధిక్షేపంలోని వక్రతవలన వ్యతిరేకార్థక వ్యంగ్యం స్ఫురిస్తుంది. దానివలన వారు నిజంగా పూజారి, పాష్టర్, మౌజను లేనా? అన్నప్రశ్న పుడుతుంది. ఇలా ఆలోచించినంత మేరకు అందంగా భావ చిత్రాలు మనసు పండుగ చేస్తూనే ఉంటాయి.

నేటి కవులలో భావచిత్రాలను, ప్రతీకలను శక్తిమంతంగా వాడుతున్న వారిలో శ్రీ బోయ జంగయ్య మొదటివరుసలో ఉన్నారు. సంక్షిప్తత,వ్యంగ్యం, స్పష్టత, సౌందర్యం జంగయ్య కవితకు సహజాలంకారాలు. కవిగా కవితలకే కాక కథకుడుగా, నవలాకర్తగా ఆయా ప్రక్రియలకు కూడా ఈ లక్షణాలను సంపదిస్తూ భావచిత్రాల నందించే శీర్షికలు పెట్టటం, శిల్పాలు తీర్చటం జంగయ్య ప్రత్యేకత. సామాజిక స్పృహతోపాటు సాహిత్య స్పృహను సాహిత్యానికి ఊపిరి లిత్తులుగా నిల్పిన రచయిత శ్రీ బోయ జంగయ్య.

పావురమంటే ప్రతీక, పావురాలంటే భావచిత్రాలు అని కప్పిచెప్పిన రచనలు శ్రీ బోయ జంగయ్య కవితలు! *

(ఆంధ్రభూమి, 8-7-1994)

# అక్షరాలా అగ్గిబొబ్బలే

ఎండలు మండిపోతున్నాయి. మిత్రులెవరైనా కలుసుకుంటే ఎండల ముచ్చట్లే. ఒక్కొక్క మిత్రుడు అనుభవాల పేటిక విప్పి అనంత గ్రీష్మాల స్మృతులను వినిపిస్తాడు. ఈనాటి గ్రీష్మం నిజానికి ఈనాటి తాజా అనుభవమే కాదు, పూర్వానుభవాల పోలికలతో రూపుదిద్దుకున్న నవ్యానుభవ తరంగం. ఇలా అనిపించినప్పుడెల్లా నాకు రాయలవారి ఆముక్త మాల్యదలోని ఈ పద్యం జ్ఞాపకం వస్తూంటుంది:

''మెండు మీఱిన పగటి బీఱెండ దాఁకి
యొల్లఁబోయిన లేబొండు మల్లెపొదల
తుదలఁ జప్పటలై కడు దొడ్డ లగుచుఁ
బొడమె మొగ్గలగము లగ్గిబొబ్బలట్లు.'' (2. 56)

రాయలు రసికుడైన భావుకుడు. పగలెల్లా ఎండ బాగా కాసింది ఆ యెండకు లేత బొండు మల్లెపొదలు వాడిపోయాయి. కాని, పొదల కొనలమీద అణిగినట్లున్నా పెద్దవిగా, మల్లెమొగ్గలు అగ్గిబొబ్బల్లాగా పుట్టుకొచ్చాయి. మల్లె మొగ్గల్ని అగ్గిబొబ్బలుగా భావింపచేయగలిగింది ఒక గ్రీష్మమే. మల్లెలు మనసుకు కలిగించే చల్లదనం అగ్గిబొబ్బల ఉపమానంతో అంతర్ధానమైపోతుంది. అగ్ని గోళాల్లాగా మల్లెపూలు మండిపోతాయి. ఇది భావుకునిలో జరిగే పునస్సృష్టి.

లేత బొండు మల్లెపొదలాంటిది కవి హృదయం. అది గ్రీష్మతాపానికి సొమ్మసిల్లుతుంది. ఒక వేడి అనుభవం పొందుతుంది. ఆ తాపంలోనుంచే హృదయపుటంచున ఊహాంచలాలలో ఓ కవిత మొగ్గ తొడుగుతుంది. దాన్ని చదివితే అగ్గిబొబ్బలా అనుభూతి నందిస్తుంది. మల్లెపూలు మనసులోని తాపానికి ప్రతీకలైతే అగ్గిబొబ్బలు. శృంగారంలో నుంచి పుట్టుకొచ్చిన ఒక బీభత్స ప్రతీకను రాయల భావుకత మనకు పరిచయం చేసింది. మండుటెండలో మల్లె పూలు కనపడితే మనసు పొక్కినట్లౌతుంది. ఇలా అనుకుంటూ నా పుస్తకాల షెల్ఫ్ వైపు చూదాను. మరో మల్లెపొదరిల్లు కనపడింది. ఈ మధ్య 'సాత్యకి' సంపుటీకరించింది-కవితాసంకలనం - 'గ్రీష్మం చెక్కిన శిల్పం.' ఇందులో ఉన్న కవిత లన్నీ గ్రీష్మంలో పుట్టిన బొండు మల్లెమొగ్గలే! అక్షరాలా అగ్గిబొబ్బలే!!

సాత్యకి రెండు దశాబ్దాలుగా కవితలు రాస్తున్నాడు. ఈ కాలమంతా కవి దృష్టిలో ఒక మహాగ్రీష్మం (ఇది ఈ కవి జీవితకాలం ఉండే కవితా ఋతువేమో

తెలియదు. రెండో కవితాసంకలనం వచ్చిన తరువాత చెప్పటానికి కొంత వీలౌతుంది.)

"నీ రోజులు గ్రీష్మంలో రాలే ఆకులు
దుర్వార్తలు మోసుకొచ్చే టెలిగ్రాములు
మెతుకుల్లాంటి రోజుల్ని ఏరి ముద్దచెయ్యడమే
కడుపనే ఉపాధ్యాయుడు నేర్పే విద్య
సూర్యుడు శిరస్సున సెగగడ్డ." (రాత్రులు- పు. 19)

సూర్యుణ్ణి శిరస్సుమీది సెగగడ్డగా రూపించాడు సాత్యకి అలంకారంతోనే వస్తువును ధ్వనింపజేసే ఆధునిక కవి లక్షణం ఇందులో స్పష్టం. ఈ కవితా సంపుటిని ప్రచురించిన ఢిల్లీ తెలుగు సంఘం కార్యదర్శి శ్రీ ఆర్.వి.యస్. రామలింగేశ్వరరావుగారు ముందుమాటలో ఇలా అన్నారు: "పరాయీకరణకు లోనవుతున్న వ్యక్తి జీవితాన్ని, వ్యవస్థాగతమైన దౌష్ట్యాన్ని, తదభివృద్ధికి ప్రభుత్వపరమైన సంపూర్ణ సహకారాన్ని ఈ కవితలతో (కవి) ప్రతీకాత్మకంగా చిత్రించారు కనుక వ్యక్తి, వ్యవస్థల స్వరూపాన్ని ఏకకాలంలో ధ్వనిస్తూ, రెండింటికీ సమానంగా వర్తించే శీర్షిక 'గ్రీష్మం చెక్కిన శిల్పం.' "ఈ వ్యాఖ్య ఈ కవిత్వం అర్థం చేసుకోటానికి ఒక 'క్లూ'గా పనికివస్తుంది.

వ్యవస్థాగతమైన దౌష్ట్యానికి గురి అయినాడు కవి. వ్యవస్థ సూర్యుడు; దౌష్ట్యం గ్రీష్మం. దానివలన కవికి లేదా సాధారణీకరణంవలన సూచింపబడే సమకాలీన సమాజానికి కలిగే తీరని బాధకు, వ్యధకు చిహ్నం సెగగడ్డ. సూర్యుడే సెగగడ్డగా మారాడంటే వ్యవస్థయే బాధగా దాపురించిందన్నమాట! గ్రీష్మంలో - అంటే వ్యవస్థా దౌష్ట్యంలో - రాలే ఆశలే రోజులు. నిరాశా నిస్పృహలతో క్రుంగిపోతూ తిండికోసం తిప్పలుపడటమే బ్రతుకు పరమార్థంగా సాగుతున్న జీవితంలో బాధకు మూలమంతా వ్యవస్థే అని ప్రతీకాత్మకంగా సాత్యకి వ్యక్తీకరించాడని స్పష్టమౌతుంది. ఇదే మూడ్ కవిత లన్నిలటిలో దాదాపు వ్యాపించి ఉంటుంది. సెగగడ్డ మానే మందు సూచింపబడలేదు ఈ కవిత్వంలో. కాని, సెగగడ్డ బాధల కవిత్వీకరణం మాత్రం చిత్రవిచిత్రంగా ప్రదర్శితమౌతుంది.

సాత్యకి కవిత పగళ్ళకంటె రాత్రిళ్ళనే ఎక్కువ వరిస్తుంది. సూర్యోదయం రాత్రిగా మారిపోవటంతోనే ఈ కవితా ప్రస్థానం మొదలైంది

"చూస్తూ ఉండగానే కళ్ళముందు
సూర్యోదయం రాత్రిగా మారిపోవడం
మనిషి నిస్సహాయతకు నిదర్శనం."

అని వ్యాఖ్యానించిన సాత్యకి రాత్రిని నిస్సహాయతకు ప్రతీకగానే పోషించాడు. జీవితంలో నిస్సహాయత వేయి రకాలు. అలాగే చీకటిరాత్రి ఈ కవితలో అనంత భావ చిత్రాల వైచిత్ర్యశాల. మచ్చుకొకటి రెండు:

"ఎప్పుడో నన్ను కాటువేసిన పాము
రోజూ రాత్రిరూపంలో వచ్చి
నన్ను చూచిపోతూ ఉంటుంది" - (పుట 14)

"ఒక్క క్షణంలో కొన్ని కోట్ల పాముల పుట్టలు
పెట్టే నైపుణ్యం గల కాలానికి కార్యరంగం రాత్రి -
కాలసర్పపు అసంఖ్యాక పడగల నీడే చీకటి" - (పుట 13)

"రాత్రి అందరూ పడుకునే మంచం
దినం అందరూ పరుగెత్తే మైదానం
పరుగు తప్ప నిద్దెరుగని జీవితం శ్మశానం" - (పుట 16)

''రాత్రి అంటే పీడకలల ఖజానా.'' (పు. 32)

''రాత్రి / ఏ బోనూ పట్టలేని ఎలుకలా తిరుగుతోంది.'' (పుట 37.)

కవి తాను రాత్రిలో జీవిస్తూ, పఠితను కూడా రాత్రిలోకి దింపి, దానిని కవితామయంగా వ్యాఖ్యానిస్తాడు. కవి వ్యక్తం చేసే పరాయీకరణకూ, అనుభవించే అంతరమైన ఆవేదనకూ రాత్రిని అనువైన కాలప్రతీకగా ఎన్నుకొన్నాడు కవి

పగలెల్లా పరుగెత్తినా, రాత్రి పడుకోవాలని చేసే ప్రయత్నం విఫలం కావటంతో జీవితం శ్మశానంలా తయారౌతూ ఉంటే అందులో అప్పుడప్పుడు కలలుప్రవేశించి జీవితాన్ని పొందాలని చేసే విహారయత్నాలు కవితలు. అయితే, ఈ కవి కళ్ళు ఇంకా కలలు కనటం మొదలుపెట్టలేదు. అందువల్ల రాత్రి జీవితం బీభత్సంగా తయారైంది ఆ భావసంవేదనాన్నే కవితా ఖండికలుగా తీర్చిపెట్టాడు సాత్యకి.

ఆధునిక కవిత్వంలోని బీభత్సం నవరసాలలోని బీభత్సం కాదు. నవరసాలలోని బీభత్సం జుగుప్సకు పతాకస్థానం. ఆధునిక సాహిత్యంలో భయానకంలోని భాగంగా- ముఖ్యంగా హారర్‌లో ప్రతిధ్వనించే అవ్యక్త జీవాక్రందనలోని చూడలేని, ఇదమిత్థంగా నిరూపించలేని బాధామయ వేదనగా వ్యక్తం కావాలి. అందువల్లనే దీనిని రసంగా కాకుండా రసాయనంగా (ఒక మిశ్రలేహ్యంగా) భావించాలని శ్రీశ్రీ కూడా సూచించాడు. బీభత్సాన్ని కావ్యంలోని భావసంవేదనగా ఎన్నుకోవటం కొంత సులభమేమో కానీ, దాన్ని నిర్వహించటం మాత్రం కష్టం.

నిర్వహణంలో ఎన్నో రకాల పద్ధతు లున్నాయి. వాటిల్లో కవి ఎన్నుకో టానికి తర్కించవలసినవి తప్పకుండా రెండు అవి ఏమిటంటే - కవితలో బీభత్సాన్ని ఒప్పించటానికీ, మెప్పించటానికీ ఒక కవిత్వీకరణం చాలుతుందా? లేక సౌందర్యీకరణం కూడా దానికి పోషకంగా నిలపాలా? అనే సమస్యలు.

రాయలు మల్లెమొగ్గలను అగ్గి బొబ్బలన్నప్పుడు, సాత్యకి 'సూర్యుడు శిరస్సున సెగగడ్డ' అన్నప్పుడూ కవిత్వీకరణం వలన బీభత్స భావాభివ్యక్తి కలుగుతోంది. అచ్చమైన బీభత్సం ఆలంకారికంగా చెప్పినా అది శృంగార మయమైతే తప్ప ఆస్వాదయోగ్యం కాదనీ అలా అహ్లాదంగా ఆస్వాదింపజేసే ఆలంకారిక వ్యక్తీకరణం లేదా భావచిత్ర పరికల్పనం సాగితేనే కవిత్వం మధురంగా ఉంటుందనీ కొందరంటారు. ప్రాచీనులలో తిక్కన్న, ఆధునికులలో శ్రీశ్రీ, గుంటూరు శేషేంద్రశర్మ బీభత్సాన్ని రమణీయంగా చిత్రించటంతో ఇటువంటి శిల్పాన్ని సాధించారు. ఉదాహరణకు—

''చంపి కొండల్లో పారేసిన వాడి శరీరం
ఒక రాగంకోసం బిగించిన ఫిడేలులా పడి ఉంది." (శేషేంద్ర.)

బీభత్సం విప్లవభావ సంవేదనకు ఆలంబనంగా ఈ కవితలో గ్రహింపబడ్డా ఫిడేలు ఉపమానంతో సౌందర్యీకరణం చేయబడింది. దానివలన బీభత్సం రసాభాసం కాలేదు. కాకపోగా ఆస్వాద మధురంగా మారింది. ఆధునికులు చాలా మంది ఈ శిల్పాన్ని పాటిస్తున్నారు నేడు.

కాని, సాత్యకి ఈ పద్ధతిని ఎన్నుకోలేదు. అతడు సౌందర్యీకరణం జోలికి పోకుండా కవిత్వీకరణంవరకే ఆగిపోతాడు. కారణం? తన కవిత 'గ్రీష్మం చెక్కిన శిల్పం' కావాలని. బీభత్సభావ సంవేదనాన్ని బీభత్స ప్రతీకలతో సృష్టించటం గ్రీష్మం చెక్కిన శిల్పంగా చెప్పుకుంటే శృంగార ప్రతీకల ద్వారా వ్యక్తీకరించటం వసంతం చెక్కిన శిల్పంగా చెప్పవచ్చునేమో? ఏమైనా—

''నీవు లేత ఆకుల నీడ ఎరుగని
నగ్నవృక్షానివి
గ్రీష్మం చెక్కిన శిల్పానివి"

అని సాత్యకి అంటున్నప్పుడు తనను గురించే చెప్పుకుంటున్నట్లు స్పష్టమౌతుంది.

లేత ఆకుల నీడలు పడకపోతే చెట్టు పది కాలాలపాటు జీవించటం కష్టం. సాత్యకి ఈ సత్యం కూడా తెలుసుకోవాలి! *

(ఆంధ్రభూమి, 3-6-1994)

# ఆడవారిని గౌరవించిన మినీకవిత

నేను విశ్వవిద్యాలయం నుండి తిరిగివచ్చేసరికి ఒకనాడు నా భార్య సుశీల 'మినీ కవిత్వం - నిర్మాణ శిల్పం - భావాభివ్యక్తి' అనే పుస్తకాన్ని ముందు పెట్టుకొని సీరియస్‌గా ఆలోచిస్తోంది. ఆ గ్రంథాన్ని మా విద్యార్థిని యం. చంద్రిక రాసింది. అది ఆమె ఎం.ఫిల్. పరిశోధన వ్యాసం. ఆ గ్రంథాన్ని మా దంపతులకు అంకితం చేసింది చంద్రిక. బహుశః ఆ సన్నివేశం జ్ఞాపకం వచ్చిందేమో ననుకొన్నాను. అంతేకాక, మా పిల్లల్లో ఒకతెగా చంద్రిక మా ఆవిడ వాత్సల్యాన్ని చూరగొన్నది కూడా. ఆమె గంభీరంగా పెట్టిన మౌనముద్రకూ, మినీ కవిత్వానికీ సంబంధం ఏమైనా ఉంటుందా? అని లోలోన వితర్కించుకొంటూ ఇంట్లోకి వచ్చాను. అప్పటికీ ఆమె సమాధి చెదిరిపోలేదు. నెమ్మదిగా నేనే అందుకొన్నాను:

"ఇవ్వేళ చీకటి పడక పూర్వమే చంద్రిక ముంచుకొచ్చినట్లున్నదే" అన్నాను. ఆమె ఈ లోకంలోకి వచ్చి నవ్వుతూ ఇలా అంది: "కాస్త విరామం దొరికితే చంద్రిక పుస్తకం చదవటం మొదలు పెట్టాను. ఒక చిన్న వివరణం కావాలి. దాన్ని గురించి ఆలోచిస్తూ ఉండగా మీరే వచ్చారు."

"ఏమిటది?"

"తెలుగు మినీ కవితల్లో స్త్రీ సమస్యలను వస్తువులుగా తీసుకొన్నవాటిని స్త్రీలు ఎక్కువ మంది రాశారా? పురుషులే ఎక్కువ మంది రాశారా?"

"ఎవరు రాస్తే యేం? ఎంత మంది రాస్తే యేం? ఎన్ని సమస్యలు కవితలలో ప్రతిఫలించాయి అన్నదే గమనింపదగింది."

"నేను దాన్ని కాదనటం లేదు. స్త్రీలు తమ సమస్యలను తామే కవితలలో చెప్పుకొనే స్థాయికి బాగా ఎదిగారా అనిన్నీ, స్త్రీ సమస్యలను పురుషులు సవ్యంగా వ్యక్తీకరిస్తున్నారా అనిన్నీ తెలుసుకోవటానికి అడుగుతున్నాను" అని అన్నది ఆమె.

ఆమెలోని జిజ్ఞాస నన్నూ ఆలోచింప చేసింది. ఆమెకు తెలుసు- నా ఆలో చనకు ఆమ్రేడిత మేమిటో. మినీ కవితలాంటి కప్పుకాఫీ ఇచ్చింది. కాఫీలోని చిరుచేదులాగానే సమాధానం కూడా సాగింది.

తెలుగు మినీ కవితలు రచించిన స్త్రీలు, స్త్రీ సమస్యలు చిత్రించిన కవితలు మొత్తం పది శాతం కంటె మించి ఉండవనుకుంటాను. అయితే, స్త్రీ సమస్యలను స్త్రీలు మినీ కవితలలో వ్యక్తం చేసినప్పుడు ఎక్కడా గాంభీర్యాన్ని గాని, నిబ్బరాన్ని గాని కోల్పోలేదు. సాధ్యమైనంతవరకు చెప్పదలచుకొన్న సమస్యకు సంబంధించిన సమగ్రానుభవస్ఫూర్తిని 'అల్పాక్షరాలలో అనల్పార్థ రచన' ద్వారా వెలువరించటానికి యత్నించారు. ఉదాహరణకు—

"తన ప్రేమను
తనను కన్నవారికీ
కట్టుకున్నవారికీ
తను కన్నవారికీ
పంచిపెట్టి
జాలిచూపులతో చూస్తున్నది
ఎవరా వ్యక్తి?
ఈనాటి స్త్రీ!"

భాస్కర స్వర్ణాంబ రచించిన 'స్త్రీ' అనే మినీకవిత యిది. శిల్పరీత్యా ఇది ఒక మంచి కవిత. మొదటి అయిదు చరణాలూ స్త్రీమూర్తి పంచప్రాణాలు. పుట్టింటి ఆడబిడుచుగా, అత్తింటి ఇల్లాలుగా, సొంతింటి యజమానురాలుగా ఆమె పంచిన ధనం ప్రేమ ఈ కవితలో కాన్ట్రాస్ట్‌తో కరుణను సృష్టించే శక్తిమంతమైన చరణం 'జాలిచూపులతో చూస్తున్నది' అన్నది. ఇది రచయిత్రి దర్శించింది, లోకానికి దర్శింపచేయాలనుకున్నది. ప్రేమకు ఫలంగా ఆమె పొందింది నిరాశ. దానికి కారకు లెవరు? ఆ జాలిచూపులు ఏ పరిస్థితులవలన ఏర్పడ్డాయి? ఇది జీవితంలో తెలుసుకొనే ధ్వని. ఎవరావ్యక్తి? అనే ప్రశ్న ఆలోచనను రేకెత్తించేది. 'ఈనాటిస్త్రీ' అనేది మొత్తం పద్యంలో రచయిత్రి ప్రతిపాదింపదలచుకొన్న తాత్పర్యంతో పఠిత తాదాత్మ్యం పొందటానికి వీలైన వాహిక. అది వాచ్యమౌతున్న వాస్తవంగా కాకుండా వ్యక్తమౌతున్న అనుభూతిలా గోచరిస్తుంది.

ఒక స్త్రీ సమగ్ర జీవితచిత్రాన్ని ముంజేతికంకణంలో చూపుతున్న మినీకవిత యిది. స్త్రీ రచనాసామర్థ్యాన్ని చాటుతున్న స్త్రీ సమస్యాచిత్రణకవిత.

సమస్యలను కవితలలో వ్యక్తీకరించేటప్పుడు రచయిత్రులు స్త్రీరేఖా చిత్రాన్నిగాని, భావచిత్రాన్నిగాని మనముందు నిలిపి, దానిని గురించి తామేమీ వ్యాఖ్యానించకుండా సమస్యల సాంద్రతను భావించి అనుభవించేటట్లు చేసే స్వభావోక్తిశిల్ప వైభవాన్ని ఒక్కొక్కసారి ప్రదర్శిస్తే, మరొకసారి తమ వ్యాఖ్యానాలతో మన వివేచనాశక్తిని రెచ్చగొట్టే తులనాత్మక వైఖరిని ప్రకటిస్తూ ఉంటారు. ఇందులోనూ నిర్వచన పద్ధతితో ఒకసారి, నినాద పద్ధతిలో మరొక సారి చెప్పే అవకాశాలున్నాయి ఈ రెండింటికీ రెండు ఉదాహరణలు—

"ఆడది
అయిదు రూపాయలకు
అమ్ముడుపోతే
వెలయాలు
అదే మగాడు
ముప్పై వేలకు
అమ్ముడుపోతే
పెళ్ళి కొడుకు!"

యలమర్తి అనూరాధ రచించిన ఈ అధిక్షేపాత్మక వ్యంగ్య రచనకు శీర్షిక - 'ఆడది-మగాడు.' సమాంతర అవస్థలను ఆభాసగా సృష్టించి తులనాత్మకంగా లోక స్వభావాన్ని ఎత్తిపొడుస్తున్న ఈ కవితలోని అభివ్యక్తి నిర్వచన ధోరణిని ప్రకటిస్తున్నది.

ఇలాంటిదే మరొక మినీకవిత జానకి రచించిన 'నాడూ-నేడూ.' కాని, ఇందులో ప్రశ్నార్థక ప్రవృత్తి, లేదా, నినాదాత్మక వైఖరి గోచరిస్తుంది.

"నాడు అపవాదు వేసి
వదిలేశాడు ఆలిని
నేడు కట్నం సొమ్ము
చాల్లేదని తరిమేశాడు
ఇల్లాలిని
కాల మెక్కడ మారింది?
కారణాలు వేరుతప్ప?"

ఈ కవితలో బలం తర్కం. సమాజంలో పురుషాధిపత్యం నాడూ - నేడూ ఉంది. అది అలిపట్ల ఒకే విధంగా అన్యాయం చేస్తూనే ఉంది. అయితే, ఆనాడు ధార్మిక కారణం చూపింది. ఈనాడు ఆర్థిక కారణం చూపుతోంది. ఈ కారణాల వెనుక ఉన్న సామాజిక వ్యవస్థలను, అవి స్త్రీలపట్ల చేసే అన్యాయాలను మన దృష్టికి తేవడం ఈ కవితా లక్ష్యం. దీనికి ప్రశ్నార్థక - లేదా నినాద వైఖరి బాగా తోడ్పడుతుంది. నిర్వచన వైఖరి చమత్కారాన్ని కలిగిస్తే, నినాదవైఖరి చైతన్యాన్ని రేకెత్తిస్తుంది. అయితే, స్త్రీలలో నినాద వైఖరికంటె నిర్వచన వైఖరికే ఎక్కువ ప్రాచుర్యం కనపడుతుంది.

పురుషులకంటె స్త్రీలు మినీకవితలను సంఖ్యలో పరిమితంగా వ్రాసినా శిల్పంలో వారికంటె ఎందులోనూ తీసిపోలేదు. పద్య, గేయ, వచన కవితలలో రచయిత్రులు రచయితలతో అన్ని విధాలా పోటీలో సమస్థానాన్ని పొందారని చెప్పలేముగాని, మినీకవితలలో మాత్రం శిల్పరీత్యా ఒక సమాంతర గౌరవ స్థానాన్ని సాధించగలిగారని నిస్సంశయంగా చెప్పవచ్చు.

అయితే, మరొక వాస్తవం కూడా గమనించాలి. మినీకవితా రచయితలు స్త్రీ వ్యక్తిత్వాన్ని, సమస్యలనూ, స్త్రీపురుష సంబంధాలనూ రచయిత్రులకంటె వైవిధ్యంతో, అవగాహనతో, చిత్తశుద్ధిలో, సానుభూతితో చిత్రించిన ఘట్టాలు ఎన్నో ఉన్నాయి. నేటి పురుషాధిక్య సమాజంలో సైతం మినీకవితల్లో స్త్రీకి పురుషులతో సమానమైన ఒక గౌరవస్థానం లభించిందని పరిశీలన వలన తేట పడుతున్నది. పురుషులు మినీకవితల్లో మగవారి స్వభావాన్ని అధిక్షేపించటానికి ఎన్నడూ వెనకాడలేదు; కాని, స్త్రీని పల్లెత్తి మాటనటానికి మాత్రం తెగించి ముందుకు రాలేదు. ఇది అభినందించదగిన అంశం. ఆధునిక నాగరక లక్షణం.

స్త్రీ పొందే విశిష్టానుభూతి మాతృత్వం. దీన్ని స్త్రీ ఆత్మాశ్రయంగానూ, పురుషుడు వస్త్వాశ్రయంగానూ వ్యక్తీకరించగలరు. ఈ రెండూ రెండు రకాల శిల్పాలు. జోశ్యభట్ల 'మాతృమూర్తి' గుణంచేత గుర్తింపబడిన మూర్తిమత్వంగల వ్యక్తి. అది వస్త్వాశ్రయంగా ఉన్నా శిల్ప సుందరంగా ఉంటుంది:

"తినడానికి / మూడే రొట్టెలు / వున్నప్పుడు
తినేవాళ్ళు / నలుగురు / అయినప్పుడు
తనకేమాత్రం / ఆకలి లేదు / అన్నవ్యక్తి
తప్పకుండా / అయ్యుంటుంది / మాతృమూర్తి."

పురుషులు రాసిన మినీ కవితలలో మగవారు ఆడవారిపట్ల వ్యవహరించే స్వార్థ క్రూర హింసా విధానాలను, వేధింపు పద్ధతులను, వాటిని సమర్థించే సాంఘిక దురాచారాలను, వ్యవస్థలను వ్యంగ్యంగా అధిక్షేపించినవి ఎన్నో ఉన్నాయి. రావి రంగారావు, బండారు పర్వతాలరావు, కిశోర్ బాబు, అశోక్ బాబు, కాశీనాథ & కాశీనాథ, ఎన్ వి. ఆర్. సత్యనారాయణమూర్తి, బోయ జంగయ్య, జానీ, వెంకట పాపారావు మొదలైనవారు బలమైన మినీకవితలు ఈ పద్ధతిలో రాశారు. మచ్చుకొక్కటి-

పంచనామ - బోయ జంగయ్య:

''తలంబ్రాలు పోసిన దోసిలి
కిరోసిన్ గుమ్మరిస్తుంది
నుదుట తిలకం దిద్దిన వేళ్ళు
అగ్గిపుల్ల గీస్తున్నవి
పందిళ్ళు వేయించిన పెద్దమనిషి
పంచనామ రాయిస్తుంటే
ప్రభుత్వమూ ప్రకటించింది
స్టౌ పేలిందని!''

కడచిన నాలుగైదేళ్లుగా రచయితలు, రచయిత్రులు మినీకవితల కంటె వచన కవితలను ఎక్కువగా రాస్తున్నారు. అందులోనూ స్త్రీవాద సమస్యలను చిత్రించేటప్పుడు వస్త్వాశ్రయ పద్ధతికంటె ఆత్మాశ్రయ ధోరణిని మక్కువతో అనుసరిస్తున్నారు. *

(ఉదయం : 12-1-1992)

# మినీకవితలో జాతివార్తలు

తెలుగునాట ఏ కూడలిలోనైనా ఒక శిలావిగ్రహాన్ని చూచినప్పుడు మహాకవి జాషువాగారి పద్యం మనకు జ్ఞాపకానికి వస్తుంది.

''రాజు మరణించె; నొక తార రాలిపోయె
కవియు మరణించె; నొక తార గగనమెక్కె
రాజు జీవించె శాతివిగ్రహములందు
సుకవి జీవించె ప్రజల నాలుకలయందు."

ఈ పద్యం ఒక కావ్యంలో భాగమైనా ఒక చాటువుగా లోకంలో బాగా ప్రచారం పొందింది. ఈ తేటగీతిలో పూర్వార్ధం, ఉత్తరార్ధం రెండూ కూడా విడివిడిగా తెలుగువారి సంభాషణలలో చోటుచేసుకుంటూ ఉండటం రసికలోకానికి పరిచయమే. జాషువాగారి ఈ పద్యాన్ని 'సూక్తి' అన్నదానికంటె 'వార్త' అని పిలవటం సమంజసం. ఈ రెండు మాటలనూ నేను పారిభాషిక పదాలుగానే వాడుతున్నాను. సూక్తి అంటే అందంగా అభివ్యక్తీకరించిన నీతివాక్యం లేదా ధర్మబోధ లేదా లోకనీతి. 'వార్త' అనే మాట జాతివార్తాచమత్కారాలని ప్రసిద్ధి చెందిన పారిభాషిక పదాలలో ఒకటి.

'జాతి' అంటే-కవి వర్ణింపదలచుకున్న వస్తువుయొక్క జాతి లక్షణంగాని స్వరూపస్వభావాలుకాని తేటపడేటట్లు సహజసుందరంగా సాహిత్యస్ఫూర్తి కలిగేటట్లు చెప్పటం. 'వార్త' అంటే-సమకాలీన సమాజంలోని జనజీవన విధానానికి సంబంధించిన ఏ అంశాన్నైనా వివరించటం. జాతి వార్తలు క్రమంగా సమకాలీన జనజీవన చిత్రణలో ఛాయాచిత్ర గ్రహణం, చలనచిత్ర గ్రహణం లాంటివి. స్థిరచిత్రాలను ఒకటి పరిచయంచేస్తే స్థిరచిత్రాలతోపాటు చలత్‌చిత్రాలను గూడ మరొకటి ప్రదర్శిస్తుంది. జాతి ఒక అవస్థను వ్యక్తం చేసినట్లే, వార్త ఒక వ్యవస్థను వివరిస్తుంది. ఈ రెండూ కవిత్వంలో ఎంత ముఖ్యమో వాటిని చమత్కారంగా వ్యక్తీకరించటం కూడా అంతే ముఖ్యం. ఆ చమత్కారం, శబ్దాలంకారం వలనగాని, అర్థాలంకారంవలనగాని, భావచిత్రంవలనగాని, వక్రోక్తిశ్లేషాదులవలనగాని కలుగవచ్చు. జాతివార్తలు చమత్కారంలో మునిగిపోయేటట్లు రచించే కవిత చమత్కార కవితగా కూడా పేర్కొనవచ్చు. ప్రాచీన సాహిత్యంలో జాతివార్తాచమత్కారాలు చాటుకవిత్వంలో పుట్టి కథాకావ్యాలలోకి, శ్లేషకావ్యాలలోకి ఎగప్రాకి తమ జీవితాన్ని సాగించాయి. ఆధునిక పద్య కవితలలో కూడా ఆ

జాడలు బలంగా పోషింపబడ్డాయి. మహాకవి జాషువాగారి పైపద్యం వార్తను చమత్కారంగా ఆవిష్కరించిన కవితాభివ్యక్తి.

వచన కవిత్వంలో కూడా జాతి వార్తాచమత్కారాలు తమ తమ జీవితాలను శక్తిమంతంగా రూపొందించుకున్నాయి. ప్రాచీన సాహిత్యంలో 'చాటువు' నిర్వహించిన పాత్ర వచనకవిత్వంలో 'మినీకవిత' నిర్వహిస్తోంది. జాతి వార్తా చమత్కారాలకు జీవం పోస్తోంది. కథాకావ్యాలలాగానే ఆధునిక సామాజిక (పద్య, వచన) కావ్యాలు వాటికి ప్రోత్సాహాన్నిస్తున్నాయి.

జాషువాగారి భావచ్ఛాయలా అనిపించే భగ్వాన్‌గారి మినీకవిత 'ప్రజాదరణ' నాకు జ్ఞాపకం వస్తోంది:

"నేను నాయకుడ్ని కాదు
కవిని
అందుకే—
నాకు సన్మానం జరిగేది
దండలతో కాదు
గుండెలతో'' (శబ్దాల్ని ప్రేమిస్తూ- పు. 39)

జాషువా గారి కవితలో రాజులొక వర్గం, కవులొక వర్గం. రాజులు రాతి బొమ్మలుగా గౌరవింపబడితే, కవులు ప్రజల మనస్సుల్లో పూజింపబడతారన్నారా మహాకవి. భగ్వాన్‌గారి కవితలో రాజకీయనాయకు లొకవర్గం; కవులు మరొక వర్గం. ఒకరికి దండలతో సన్మానం: మరొకరికి గుండెలతో గౌరవం. రాజుల కోవలో నేడు లెక్కింపబడుతున్నారు రాజకీయ నాయకులు. వారికి కవులకులాగా ప్రజల గుండెల్లో శాశ్వతంగా నిలిచే అవకాశంలేదని భగ్వాన్‌గారి భావం. జాషువాగారూ, భగ్వాన్‌గారూ ఆధునిక కాలంలో ప్రజలలో కవులకు గల ఒక గౌరవస్థానాన్ని కవితామయంగా వ్యాఖ్యానించి 'వార్త'కు వన్నె పెట్టారు.

ఈమధ్య వెలువడిన మినీకవితా సంపుటాలను గమనిస్తే కవులు ఆ ప్రక్రియను చాటుకవిత్వంలాగా జాతివార్తాచమత్కారాలను ప్రపంచించే ప్రవృత్తినే ప్రకటించటానికి వాడుకున్నట్లు స్పష్టమౌతోంది. ఉద్యమాలకోసం మినీకవితను వాడుకోవటం తక్కువే. అలా కావటానికి కారణం మినీకవితలో ఉద్యమోత్సాహం కంటె సామాజిక వాస్తవికతలను సాహిత్య స్పృహతో చెప్పడమే సులభం కావటం.

ఒక్కొక్క ప్రక్రియకు దాని స్వరూప స్వభావాలనుబట్టి కొన్ని ప్రత్యేకతలూ ఉంటాయి; కొన్ని పరిమితులూ ఉంటాయి. రూపం చిన్నదైనప్పుడు సంక్షిప్తత దాని స్వభావమైనప్పుడు, ధ్వని దాని ప్రాణమైనా, ఆ ప్రాణ చైతన్య శక్తి ఆ రూపప్రమాణాన్నిబట్టి కొంత పరిమితం కాకతప్పదు. చాటువుల్లోనూ,

మినీకవితల్లోనూ మెరుపులాంటి ఏ భావమైనా, వస్తువైనా చమత్కారహేతు వౌతుందేకాని, రసానుభవ సాంద్రతను కలిగించలేదు. మినీకవిత చాటుపద్యంలా ఉన్నా దానికంటె విలక్షణమైనదే. చాటువులో అలంకారం చమత్కారం కలిగిస్తుంది. మినీకవితలో అలంకారంకంటె భావచిత్రం చమత్కారాన్ని పోషిస్తుంది. జాతివార్తలు సహజంగా చమత్కారంతో జీవించడమే మినీకవితా జీవితం.

ఈ యేడు వెలువడిన మినీకవితా సంకలనాలలో శ్రీ కె. హరనాథ్‌గారి 'స్వర్ణపుష్పాలు' జాతివార్తా చమత్కారాల వ్యక్తీకరణలో పేరు సార్థకం చేసుకున్నది. హైదరాబాదు పాతనగరంలో యువరచయితలు రెండు దశాబ్దాలుగా తెలుగు కవితా చైతన్యానికి చేస్తున్న కృషి ప్రశంసనీయం. లిఖితపత్రికలు, గోడపత్రికలు, కవితాసంపుటులు ప్రచురిస్తూ తెలుగు వెలుగును ప్రసరిస్తున్నారు. 'స్వర్ణపుష్పాలు' హైదరాబాదు పాతనగరం రచయితల సంఘం ప్రచురించిన నాల్గవ గ్రంథం. శ్రీ హరనాథ్ ఆ సంఘ చైతన్యానికి ముఖ్య కార్యకర్త; ముందడుగు వేస్తున్న రచయిత!

'జాతి'ని చమత్కారంగా చెప్పే లక్షణం మినీ కవితలు రాసే కవులకు సహజంగా ఉంటుంది. జాతిని చక్కగా చెప్పలేని కవి వార్తను నిపుణంగా నిర్మించలేడు. హరనాథ్‌గారికి జాతివార్తలను చమత్కరించే నేర్పు సహజంగా ఉంది. జాతికి 'అస్తి-నాస్తి' అనే మినీ కవితను ఉదాహరణంగా తీసుకుందాం:

"ఎయిర్‌కండిషన్ గదులూ/త్రీ యేసెస్ బార్‌లు
ఫియట్ కారులు/ డన్‌లప్ పరుపులు
బొచ్చు కుక్కలు/ ఆస్తికుని ఆస్తికత్వం
మురికివాడలూ/ కూలిన గోడలూ
పేవ్‌మెంట్లూ / గజ్జికుక్కలు
నాస్తికుని/ ఆస్తికత్వం'' (స్వర్ణపుష్పాలు- పు. 58)

ఇందులో కవి చెప్పదలచుకుంది సంపన్నవర్గ లక్షణం; పేదల వర్గలక్షణం. వీరిరువురికి తేడా ఆస్తి ఉండటం, లేకపోవటంలోనే ముఖ్యంగా ఉంటుందని నిరూపించదలచాడు కవి. ఆ ప్రధానాంశాన్ని ప్రదర్శించే పదజాలాన్ని సృష్టించి, శబ్ద చమత్కారం ద్వారా అర్థచమత్కారం కలిగించటం ఈ కవితా శిల్పం. 'ఆస్తికుడు' అనే మాటకు లోకంలో దేవుణ్ణి నమ్మేవాడనే అర్థం రూఢికెక్కి ఉంది. దాన్ని మార్చి కవి 'ఆస్తికలవాడే ఆస్తికుడు' అనే చమత్కారార్థాన్ని కల్పించాడు. దానికి వ్యతిరేకార్థంలో ఆస్తిలేనివాడు నాస్తికుడైనాడీ కవితలో. అస్తికత్వం అనే మాటను అస్తిత్వం అనే అర్థంలో వాడటంకూడా చమత్కారమే.

జాతిని చమత్కారంగా చెప్పే చాటుకవితా స్వభావాన్ని ఈ మినీ కవిత ఆసక్తిదాయకంగా ఆవిష్కరించింది శ్రీ హరనాథ్ కవితలలో జాతిచమత్కారాలే ఎక్కువ.

వార్తా చమత్కారాలను కొద్దిగా రాసినా వాడిగా చెప్పగల నేర్పును ప్రకటించారు శ్రీ కె. హరనాథ్. మచ్చుకు-'పైశాచికం.'

"జాతర్లలో/జంతు బలులు
ఎలక్షన్లలో/నరబలులు-
అది/పల్లెప్రజల/అమాయకమైతే
ఇది/పట్నవాసుల/మత పైశాచికం." (స్వర్ణపుష్పాలు- పు. 21)

సమకాలీన జనజీవనవిధానంలో హింసాప్రవృత్తి పల్లెల్లో పట్టణాల్లో ఏయే అవతారాలతో విలయతాండవం చేస్తోందో చెప్పాడు కవి. జంతుబలులు, నరబలులు-అనే రెండంశాలను ఎన్నుకొని తులనాత్మక వివేచనం చేసి చమత్కరించాడు. సమకాలీన సమాజ వాస్తవికతను తెలిపే వార్త బలంగానూ, చమత్కారం దానికి పోషకంగానూ నిలపటం ఇందులోని విశేషం

జాతి వార్తలకంటె చమత్కారానికి పెద్దపీట వేసే కవితలు శిల్పపరంగా గొప్పవిగా రాణిస్తాయి. కవి భావుకతను పట్టియిస్తాయి. ఉదాహరణకు- 'ఆకలి మహల్.'

"తాజ్‌మహల్/నిర్మాణానికి/రాళ్ళెత్తిన కూలీల
ముని మనవళ్ళెవరైనా/ఉంటే రండి!
మండే గుండెల్ని చీల్చి/యెండిన డొక్కల ఇటుకల్ని పేర్చి
కండల కాంక్రీటుతో/ఆకలి మహల్‌ను నిర్మించి
ఆకలి తీర్చుకుందాం రండి!"

శ్రీశ్రీ గేయంలోని తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలను స్మరిస్తూ, వారి వారసులను ఆకలి మహల్ నిర్మాణానికి ఆహ్వానిస్తున్న ఈ కవితలో సామాజిక స్పృహ చమత్కార ప్రధానంగా సాధింపబడింది.

మంచి మినీ కవిత చదివినప్పుడు - "ఈ చిన్న కవితను/ప్రసవించటానికి/నా కలం/ఎన్ని పురిటినొప్పులు/పడిందో మీకేం తెలుసు?" అని ప్రశ్నిస్తున్న శ్రీ కె. హరనాథ్ మాటలు మన చెవులలో రింగుమంటూ ఉంటాయి. జాతి వార్తలను చమత్కారాలతో చుట్టి, భద్రంగా భావితరాలవారికి అందిస్తున్న అక్షర మూర్తులు మినీ కవితలు. *

(ఆంధ్రభూమి 12-8-1994)

# మహితాత్ముడు రావిశాస్త్రి

మహా రచయితలందరూ ప్రజల ఆదరాభిమానాలను అందుకునేవారే. అయితే వారు ప్రదర్శించే అభిరుచులనుబట్టి, రచనల ద్వారా కలిగించే రుచులను బట్టి జాతి పొందే అనుభూతులలో వైవిధ్యం ఉంటుంది. రచయిత బ్రతికి ఉన్నప్పుడు అతడు కల్పించే అనుభూతులు జనావళి హృదయాలలో నిశ్శబ్దంగా స్పందిస్తూ ఉంటాయి అతడు దివంగతుడైన క్షణంలో ప్రజల హృదయాలలో అతనిపట్ల ఉన్న అభిమానం విషాదంతో విస్ఫోటం చెందినట్లవుతుంది. జాతి అంతా ఒక షాక్ తిన్నట్లవుతుంది.

అటువంటి షాకులను కూడా విశ్లేషించవచ్చు. కృష్ణశాస్త్రి పోయినప్పుడు తెలుగువారి కోయిల దేశాంతరాలకు పోయినట్లు సాహితీలోకం దిగులుపడింది. విశ్వనాథ దివంగతుడైనప్పుడు తాను కలకాలం రక్షించుకున్న విలువైన రత్నాలనిధిని కాలుడు కైంకర్యం చేసినట్లు బెంగపడింది తెలుగుజాతి. అలాగే శ్రీశ్రీ పోయినప్పుడు రోజూ చూచే మహా సముద్రం ఒక్కసారిగా ఇంకిపోయినట్లు బెంబేలుపడింది. మొన్న నవంబరు పదినాడు రావిశాస్త్రి (రాచకొండ విశ్వనాథ శాస్త్రి) ఇక లేదన్న వార్త వినేసరికి ఒక ఆత్మీయుణ్ణి కోల్పోయిన మిత్ర హృదయంలా జాతి విలవిలలాడింది. తెలుగు కథ, నవల వెలితిపోయినట్లనిపించింది.

నవల, కథ వంటి ప్రక్రియలను సృష్టించినా శాస్త్రిగారిది ప్రధానంగా కవిత్వ చైతన్యం. వారి దర్శనంలో హేతువు ఇమిడి ఉన్నప్పటికీ, అంతకన్న ఎక్కువగా అనుభూతిశక్తి, ఆవేశమూ పొంగిపొర్లుతూ ఉంటుంది. అందువల్లే అయన గొప్ప కళాకారుడయ్యాడు. వృత్తిచేత న్యాయవాది కావడమూ, ప్రవృత్తి చేత కళాస్రష్ట కావడమూ - వారికి వస్తు, శిల్పాల కొరత లేకుండా చేసింది. ఆయనది ఒక ప్రత్యేక శైలి. అది అనన్యసాధ్యం. వారి ప్రతిభ విశ్లేషణకు లొంగనంత విశాలమైనదని అందే అతిశయోక్తి కాదు. అసలు వారి ప్రతిభను లోతుగా విశ్లేషించటం ఇంకా పూర్తిగా మొదలుకాలేదన్నా సత్యదూరం కాదు.

రావిశాస్త్రిగారు తెలుగువచనానికి క్రొత్త ప్రాణం పోశారు. గురజాడ అప్పారావుగారితో మొదలైన ఈ కృషి రావిశాస్త్రిగారిలో పూర్తిగా ఫలించింది. వారు నవలల్లో, కథల్లో, నాటకాల్లో వాడిన భాషను పరిశీలిస్తే వారే ప్రక్రియను చేపట్టినా అవన్నీ కవిత్వంలోకి పరుగెత్తి చేరిపోవడం కనిపిస్తుంది. ఉక్తి వైచిత్ర్యం వారికి ఉగ్గుతో వచ్చిన విద్య. "లంచాలు జేబుల్లోకి వెళ్తున్నాయి. లాభాలు బ్యాంకుల్లోకి వెళ్తున్నాయి. రాజకీయవేత్తలు ఖద్దరుబట్టలు తొడిగికొని పార్లమెంటుకి వెళ్తున్నారు. దేశంలో అందర్నీ ఉద్ధరించడానికి ఆర్థికమంత్రులు కోట్లమీద అప్పుకోసం ప్రతి దేశానికీ వెళ్తున్నారు. దేముడు చెప్పిన న్యాయాన్ని నిలబెట్టేందుకు స్వాములూ, మౌల్వీలూ, బిషప్పులూ రోజూ ఉపన్యాసాలకి వెళ్తున్నారు" అని 'నిజం' నాటకంలో శాస్త్రిగారు రాసిన మాటలు మామూలు మాటలు కావు. ఇక్కడివన్నీ 'వెళ్ళటాలే.' కాని, అవి ప్రజలకు న్యాయం చేయడం నుంచి దూరంగా వెళ్ళడాలే. శాస్త్రిగారి వాక్యాన్ని ఇతరుల వాక్యాలనుంచి అతి తేలికగా గుర్తించకల్గుతాం. వారి శైలికి వారిదైన ప్రత్యేక ముద్ర ఉంది.

ఇంతవరకు వారిని అనుకరించిన - అనుకరించగలిగినవాళ్ళుకూడా రంగంలో లేరు ఒక్క బీనాదేవిగారు కాస్త కాస్త ఆ జాడల్లో నడిచారు. బంగారయ్య విమలను కొండమీది దేవాలయానికి తీసికొని వెళ్తున్న ఘట్టంలో (మూడు కథల బంగారం నవలలో) శాస్త్రిగారు రాసిన క్రింది మాటలు వారి కవితాశక్తిని తెల్పుతాయి: "కొండంతా ఏడురంగుల్తోనూ, రంగురంగుల కలల్లాంటి కలయికల్తోనూ, భగవంతుడు ఇక్కడ నా శిఖరంమీదకాక ఇంకెక్కడ ఉంటాడు అన్నట్టు గర్వంగానూ, నిర్మలాకాశంకింద నిశ్చలంగానూ, నిర్మలంగానూ మరలా ఎంతో వినయంగానూ, కదిలే చెట్ల ఆకులతో అది కట్టుకొన్న బట్టలు గాలికి కదుల్తూన్నట్టుగానూ మందహాసం చేస్తూ ఆహ్వానించే దైవద్వారపాలకుళ్ళా ఉంది" - ఇలాంటి రచన వారి సర్వరచనల్లోనూ కనిపిస్తుంది. అందుకే మిత్రులు ఆయన రచనల్లోని కవితామయమైన వాక్యాలను ఏరి ఒక గ్రంథంగా ప్రచురించారు.

పాత్ర చిత్రణలో, సంఘటన సృష్టిలో సైతం శాస్త్రిగారు కవితామయంగా రచించే పద్ధతిని శక్తిమంతగా వాడుకుంటారు. ఒక స్త్రీ పాత్ర సౌందర్యాన్ని వర్ణిస్తూ శాస్త్రిగారు - "అహో! అందమా! నువ్వు శరత్కాలపు చల్లచల్లని పూర్ణచంద్రుని రేఖవే! ఒహో అందమా! నువ్వు మాఘమాసపు ఉదయకాలపు సూర్యకిరణ శోభవే! అవు నందమా! నువ్వు ఎండవేళల పంచరంగుల మంచుకొండల

వన్నెవన్నెల వెలుగువే! అందమా! నువ్వు వేయిరాత్రుల నీలివెన్నెల మంచు సోనల జల్లువే! అవు నందమా! పొంగిపొర్లే నువ్వు ఎర్రనెర్రని గోదావరి ఎర్ర నీటి వరదవే వరదవే! అందమా అందమా, నువ్వు పూలకోటి తోటవే - కోటి తోటల పూలవే! ఓ అందమా! నువ్వు చీకటికి కాంతినిచ్చే కంటి కాటుకరేఖవే! అవును. అవునవును, ఔనౌహో, ఓ అందమా, అందమా, అవును సుమా-నువ్వు నీలాల నింగినికూడా వెక్కిరించి ధిక్కరించే నీలి మహా సముద్రానివే! ఓహో అందమా!" అని అంటారు.

విశ్వనాథ సత్యనారాయణ గారి నవలల్లోని వర్ణన లెలా కావ్యస్థాయిలో ఉంటాయో, రావిశాస్త్రిగారి రచనల్లోనూ అలాగే ఉంటాయి. రావి శాస్త్రిలో ఈ లక్షణాన్ని తీసేసి వారి రచనలను ఊహించనుకూడా ఊహించలేమేమో! అందుకే కొందరు విమర్శకులు రావిశాస్త్రిగారిలోని ఈ అంశంమీద కొంత కృషి చేశారు. రావిశాస్త్రిలో నిమిలీమీద, ఉపమాలంకారంమీద కొంత వివేచన జరిగింది. కథ, నవలా రచయితల్లో ఈ అంశం శాస్త్రిగారి రచనా కళలో ప్రత్యేకతను తెల్పుతుంది.

రావిశాస్త్రి గారి రచనల్లోని పాత్రల్లో దగాపడిన తమ్ముళ్ళు, పతితులూ, భ్రష్టులూ, జూదరులూ, తాగుబోతులూ, వ్యభిచారులూ, లంచగొండులూ, నియోరిచ్ వర్గమూ, అవినీతిపరులైన అధికారులూ, రాక్షసులైన ఆఫీసర్లూ, మానవత్వంలేని మానవ శరీరధారులూ, ఏ విలువలేని దుర్మార్గులూ కనిపిస్తారు. ఒక్కమాటలో చెప్పాలంటే - అధోజగత్సోదరులూ, వారిని ఏ విలువా లేకుండా దోపిడీ చేసే పైతరగతులవాళ్లూ నన్నమాట. ఈ పాత్రల్లో వేటినైనా ఒక్కసారి మనం చదివితే మరిచిపోలేం. గేదెల రాజమ్మ దగ్గరనుంచి పోలమ్మదాకా, బంగారమ్మనుంచి న్యాయం కథలోని యువ మేజిస్ట్రేట్‌దాకా అందరూ సజీవ మూర్తులు. వేల పాత్రలతో రావిశాస్త్రి గారు తెలుగు సమాజాన్ని సజీవంగా సృష్టించారు. తీసికొన్నది ప్రధానంగా అధోజగత్ పాత్రలనే అయినా ఇవేళ మన సమాజాన్ని పట్టిపీడిస్తున్న అనేక అంశాలను స్పష్టంగా, పఠితకు స్పష్టమైన అవగాహన కలిగే విధంగా చిత్రించారు. ఏదీ కేవలం పుస్తకంలోని విషయంగానే ఉండదు. సర్వమూ మన జీవచైతన్యంలోకి వచ్చి చేరి, దాన్ని పెంచుతుంది.

మచ్చుకు - మధ్యతరగతి స్వభావాన్నే చూడండి: ఎన్ని మార్క్సిస్టు గ్రంథాలు చదివినా కలగని అవగాహన మనకు వారి 'వేతనశర్మ' కథ చదివి

నప్పుడు ఈ తరగతి స్వభావం ఒక దృక్కోణం నుంచి అర్థమవుతుంది. నేరం చేసినవాడిలోని న్యాయబుద్ధి, న్యాయం పాలించాల్సినవాడిలోని అన్యాయబుద్ధి, వేశ్యాకూటంలో సచ్ఛీలవతి, సేవావృత్తులైన వైద్యం, న్యాయవాదంలాంటివాటిల్లో ఉండే కుళ్ళు మనస్తత్వాలు, కూలీ చేసుకొనేవాళ్ళల్లో కన్పించే నిర్మల పుణ్య మనస్కతా - ఇవన్నీ శాస్త్రిగారి రచనల్లో స్పష్టంగా గోచరిస్తాయి.

వారి కథల్లో ఋక్కులు, సారా కథలు, సారో కథలు విశిష్టమైనవి. మానవ స్వభావాన్ని ఇంతగా చిత్రించిన కథలు ప్రపంచ సాహిత్యంలోనే అరుదు. ఒక్క 'బల్లచెక్క' అన్న కథ చాలు. మార్క్సిస్టు ఆర్థిక మూలసూత్రాన్ని అర్థం చేసుకోవడానికి. శ్రీశ్రీ ఇచ్చిన క్యాటలాగ్‌కి శాస్త్రిగా రెంత ప్రాణం పోశారు! తెలుగుజాతి వారి ఋణం తీర్చుకో గల్గుతుందా?

ఆయనకొక పక్షం బౌద్ధికస్థాయిలో ఉన్నప్పటికీ రచనల్లో వారు మొత్తం సమాజాన్ని మానవతా దృక్పథంతోనే చూచారు. అందుకే వారి ప్రతిభకు సంకెళ్లు పడలేదు. అందువల్లే వారి రచనల్లో స్వేచ్ఛ ఉన్న రచయితయొక్క లక్షణాలే ఎక్కువగా కనిపిస్తాయి. అందుకే వారిని అన్నిరకాల పాఠకులూ అభినందిస్తారు. 'మార్క్సిస్టుల్లోనూ మహితాత్ము లుంటా' రన్న ఇస్మాయిల్‌గారి మాట విలువైన వ్యాఖ్య.

శాస్త్రిగారు తెలుగులోనే రాయడంతో, వాటికి ఇంగ్లీషు, హిందీ అనువాదాలు రాకపోవటంతో వారి కీర్తి తెలుగు తెలిసినవాళ్ళకే పరిమితం కావడంలో ఆశ్చర్యం లేదు. కనీసం శాస్త్రిగారి ఆరు సారా కథలు, ఋక్కులు అనువాదమైనా ప్రపంచానికి వారి ప్రతిభను గురించి తెలిసేది. రావిశాస్త్రి రచనల అనువాదం వారికి ఆంధ్రు లందించదగిన అక్షర శ్రద్ధాంజలి! *

(ఆంధ్రభూమి 26-11-1993)

# భవానీదేవి 'అంతరంగ చిత్రాలు'

భారతీయ తత్త్వ చింతనంలో షడ్దర్శనాల్లాగా ప్రపంచ మానవ సంబంధాల వివేచనంలో కూడా షట్సందర్శన సూత్రాలు ప్రసిద్ధంగా ఉన్నాయి. మానవ సంబంధాల మీమాంస ముఖ్యంగా ఆరు శాఖలుగా సాగింది. ఆ శాఖలను స్థూలంగా ఇలా గుర్తించవచ్చు - 1. మానవ ప్రకృతి సంబంధాలు, 2 మానవ పరస్పర సంబంధాలు, 3. నరనారీ సంబంధాలు, 4. మానవ జీవ సంబంధాలు, 5. వ్యక్తి సమాజ సంబంధాలు, 6. జీవాత్మ పరమాత్మ సంబంధాలు. ఈ సంబంధాలకు మూలాధార మేమిటని చేసే చింతనలో కానవచ్చే సందర్శన సూత్రాలను ఆరింటిని ఈ విధంగా పేర్కొనవచ్చు. అవి - 1. జీవితావసరాలే మూలమని చెప్పేవాదం, 2. ఆర్థిక ప్రాతిపదిక మూలమని చెప్పే సిద్ధాంతం, 3. సెక్స్ మూలమని చెప్పే వాదం, 4. స్నేహం మూలమని ప్రతిపాదించే సిద్ధాంతం, 5. ప్రేమ మూలమని వ్యక్తీకరించే సిద్ధాంతం, 6. ఆధ్యాత్మికం మూలమని దర్శించే సిద్ధాంతం. ఆధునిక సాహిత్యంలో ప్రతిఫలించే మానవ సంబంధాల సందర్శనం ఈ ఆరు సూత్రాలలో వేటికైనా సంబంధించి ఉండవచ్చుననీ, వాటి తులనాత్మక వివేచనం మీద కూడా ఆధారపడి ఉండవచ్చుననీ సులభంగా నిర్ణయించవచ్చు. ఆధునిక చింతన ఈ ఆరు రకాల సందర్శన సూత్రాలపై ఆధారపడి ఉంది. కాబట్టి, సాహిత్యానుశీలనంలో ఆ సూత్రాలు రచయితల దర్శనాలను, దృక్పథాలను తెలుసుకోటానికి వివేచన ప్రమాణాలుగా పనికివస్తున్నాయి.

ఈనాటి సాహితీ ప్రక్రియ లన్నిటికీ మానవ సంబంధాల చింతనవల్లనే ఆధునిక స్పృహ కలుగుతోంది. వాటిలో ఖండ కావ్యాలూ, ఏకాంకికలూ, కథానికలూ ఆ చింతనను బలంగా, వాడిగా, సూక్ష్మ పరిశీలనతో చర్చిస్తున్నాయి. ఈ మూడు రకాల ప్రక్రియల విలువలనూ వివేచించేటప్పుడు ఈ సూత్రాలకు తప్పక ప్రమేయం ఉంటుంది.

సెప్టెంబరు 28 వ తేదీన శ్రీమతి చిల్లర భవానీదేవి రచించిన 'అంతరంగ చిత్రాలు' అనే కథానికా సంపుటి ఆవిష్కరణ జరిగింది. భవానీదేవీ 'నాలోని నాదాలు' (1986), 'గవేషణ' (1992) కవితా సంపుటులతో సమకాలీన

రచయిత్రులలో మంచి పేరు తెచ్చుకున్నది. 1973 నుండి రచనా వ్యాసంగం మొదలుపెట్టిన ఆమె ఇప్పటికి నూటికి మించిన కవితలు, అరవై కథానికలు రచించారు. ఆ యేడే బెర్‌హాంపూరు 'వికాసం'వారి ఉత్తమ కథానికా రచయిత్రి పురస్కారాన్ని పొందారు. అది మొదలు కవితలకూ, కథానికలకూ ఎన్నో బహుమతులు ఆమె అందుకున్నారు; అందుకుంటున్నారు. 'అంతరంగ చిత్రాలు' ఆమె మొదటి కథానికా సంపుటి. వివిధ పత్రికలలో దాదాపు 18 యేళ్ళుగా వ్రాస్తున్న కథానికలలో పద్దెనిమిదింటిని ఎన్నిక చేసి ప్రచురించారు. అవన్నీ ఇదివరలో వివిధ పత్రికలలో ప్రచురింపబడినవే. వాటిలో ఆంధ్రభూమి వారపత్రికలో వచ్చినవి నాలుగున్నాయి. ఎన్నుకొన్న కథానికలనుబట్టి ఆంధ్ర భూమిదే అగ్రతాంబూలం.

శ్రీమతి చిల్లర భవానీదేవి బాపట్లలో చదువుకున్నారు. వారిలోని రచయిత్రిని మేల్కొల్పి ప్రోత్సహించినవారు కీ.శే. డాక్టరు కొట్టుపాటి గంగాధరరావు గారు, శ్రీ పోలాప్రగడ సత్యనారాయణమూర్తిగారు. కొట్టుపాటివారిమీద వున్న అభిమానానికి గుర్తుగా 'అంతరంగ చిత్రాలు'ను వారికే అంకితం చేసింది రచయిత్రి. సాహితీ సంస్థలలో చురుకైన పాత్ర తీసికోటం భవానీదేవిగారికి బాపట్లయే నేర్పింది. ఇప్పుడు ఆ లాభాన్ని జంటనగరాలు పొందుతున్నాయి. యువ భారతి, యువ కళావాహిని, నెలనెలా వెన్నెల, విశ్వసాహితి, చేతన, రంజని సంస్థలు ఆమె సహాయ సహకారాలను అందుకోగలుగుతున్నాయి. సచివాలయంలో ఉద్యోగాన్ని బాధ్యతాయుతంగా నిర్వహిస్తూనే సాహితీ వ్యాసాంగాన్ని చిత్తశుద్ధితో సాగిస్తున్న భవానీదేవిగారు జంటనగరాల్లో ఎటువంటి సాహిత్యకార్యక్రమాలు జరుగుతున్నా ఆసక్తితో వాటిలో పాల్గొంటారు. కార్యకర్తలలో కలసి పోగలిగే ఆత్మీయతను అందించే అరుదైన రచయిత్రిగా అందరి మన్ననలూ అందుకుంటున్నారు. తక్కువగా మాట్లాడటం, తనచుట్టూ వున్న సమాజాన్ని ఎక్కువగా లోచూపుతో చూడటం - అనే కథానికా రచయిత(త్రు)ల గుణాలు ఆమెలో సహజంగా వికసించినట్లు కనపడతాయి.

శ్రీమతి భవానీదేవిగారి కథానికా సంపుటిలోని కథలు వైవిధ్యంతో ఉండటం చేత; చెప్పేతీరు ఆర్ద్రంగా, ఆత్మీయంగా, ఆలోచనాత్మకంగా ఉండటం చేతా పఠితలు మనసుపడి చదివే ఒకరకమైన ఆకర్షణ ఆ సంపుటికి సమకూరింది. చౌకబారు కీర్తినిచ్చే సెక్సు కథానికల బాణీకి రచయిత్రి దూరంగా

ఉండటం వల్ల అన్నివర్గాల గౌరవ మర్యాదలను పొందగలుగుతున్నారు. వర్గ, వర్ణ, సిద్ధాంత సంఘర్షణలను రాజకీయ నిబద్ధ దృష్టితో చిత్రించే రంగులు కళ్ళ జోళ్ళు ధరించటం ఆమెకు ఇష్టం లేకపోవటంతో కథకు ఒక సహజత్వంతో కూడిన సారళ్యం అబ్బింది. నిజాయితీతో తాను అనుభవించింది కథానికలో చిత్రిస్తున్న పద్ధతి పఠితలో రచనమీద ప్రామాణిక భావాన్ని పెంచుతోంది. నేటి కథానికలలో కనపడుతున్న అత్యంతాధునిక ధోరణులు కొన్ని ఈమె కథానిక లలో కనపడవు. 'స్థానీయత'ను భాసలోని యాసతో చిత్రించటం, ఇంతవరకు వెలుగుకు రాని కొండజాతుల, బడుగువర్గాల చీకటి జీవిత కోణాలను వాస్తవిక చిత్రాలుగా వెలువరించటం మొదలైనవి కథకు క్రొత్త చైతన్యాన్ని అందిస్తున్న అత్యంతాధునిక ప్రయోగాలు పీటిని కొట్టవచ్చినట్లుగా చిత్రించకపోయినా అధు నిక కథ తనలో ప్రతిఫలించుకొంటున్న మానవ సంబంధాల మూల్యాలను మాన వతా దృక్పథంతో సమీక్షించే సామర్థ్యాన్ని ప్రదర్శించింది రచయిత్రి.

'అంతరంగ చిత్రాలు' - పుస్తకం పేరు. సంపుటిలో ఒక కథ ఆ పేరుతో ఉంది. ఆ పేరే గ్రంథనామంగా ఎన్నుకోవటంలో రెండు లాభాలు కలిగాయి. మనసులో కలిగే/కదిలే చిత్రాలనీ, మనసు ప్రకటించే విచిత్రావస్థలనీ రెండర్థాల నిస్తుంది ఆ శీర్షిక. ఈ రెండర్థాలనూ సార్థకం చేస్తాయి కథానికలు.

అంతరంగ చిత్రాలలో అంతస్సూత్రం రచయిత్రి అంతర్మథనం. నేటి సమాజంలో ఉత్తమ మానవసంబంధాలూ, మూల్యాలూ మానవుడు కోరు కుంటున్నా వాటిని ఆచరణలో పెట్టటానికి అడ్డంకుగా నిలుస్తోంది ఆర్థికమూల మైన నేటి వ్యాపార సంస్కృతి లేదా స్వార్థలాభదృష్టి. అన్నివిధాలా మానవ సంబంధాలు ఆర్థికమూలంగా బలపడుతున్న ప్రవృత్తితో కలుషితం కావటం తప్పటం లేదనీ, అది ఆధునిక జీవితాన్ని ఆవేదనకు గురిచేస్తున్నదనీ రచయిత్రి ఒక అంతర్వేదనను అంతస్సూత్రంగా అంతరంగ చిత్రాలలో నిలిపింది. ఈ సంపుటికి అంతశ్శక్తి కూడా అదే.

జానకిరామయ్య ఆర్థిక కారణాలవల్ల భార్యకు తగిన వైద్యం చేయించలేక ఆమెను కోల్పోతాడు. ఆయనకు ఒక కొడుకు, ఒక కూతురు. కూతురుకు పెళ్ళి చేద్దామని యత్నం. వకీలు విశ్వనాథంగారి అబ్బాయికి అడుగుదామని వారింటికి వచ్చాడు. జానకిరామయ్యకు విశ్వనాథం ఆప్తమిత్రుడు, కళాశాలలో కలిసి తిరిగినవాడు, అతనివలన సహాయం పొందినవాడు. పూర్వ స్నేహం నెమరు

వేసుకొని కట్నం లేకుండా తన కొడుక్కి జానకిరామయ్య కూతురిని చేసుకుంటానన్నాడు విశ్వనాథం అలాగే తన కూతురిని అతని కొడుక్కి చేసుకోమని అడిగాడు జానకిరామయ్యను. కాని, ఆయన మాత్రం తన కొడుకు చదువు కోసం చేసిన అప్పు ఎలా తీర్చుకోవాలా అని అనుమానిస్తూ కట్నం కావాలని మనసులో కోరుకుంటాడు. కట్నంలేని పెళ్ళి తన కూతురుకు కుదరటం ఆదర్శం. కాని, తన కొడుకు మాత్రం ఆర్థిక కారణాలవలన కట్నం కావాలని కోరుకోవటం అవసరం. ఈ రెండింటి మధ్య నలుగుతూ జానకిరామయ్య కట్నం కాదనలేని ఆర్థికమూలమైన చిత్తసంస్కారాన్ని ప్రకటించటం రచయిత్రి చిత్రించింది. జానకిరామయ్యకు తన నీడ తనకే మరగుజ్జులా కన్పిస్తోంది. తన అంతరంగ చిత్రం తనకే స్పష్టంగా కన్పించటం లేదు. మనసు అద్దం మసకబారినట్లుంది.''- అని వ్యాఖ్యానిస్తుంది. 'అంతరంగ చిత్రాలు' కథలో జానకిరామయ్య ఒక ప్రవృత్తికి, మన తరానికి ప్రతినిధి అతని అంతరంగం ఆర్థిక కాలుష్యంచేత మసకబారింది. అదే కథానికా సంపుటికి అంతస్సూత్రం వంటిదని గ్రంథనామం చెబుతున్నది. ఆ సూత్రానికి వేలాడదీసిన చిత్రాలే ఇందులోని కథలు.

సమాజంలో ఉన్న మూడు తరగతుల మనుష్యుల్లోనూ, వారి జీవనవిధానాల్లోనూ ఆర్థిక మూలమైన మానవ మూల్యాలు కలిగించే సంక్షోభాలే కథా సమస్యలుగా రచయిత్రి ఎన్నుకొన్నది. కుప్పు ఆత్మాహుతికి వీర్రాజు వ్యాపార దృష్టి మూలం. రాము రైలు క్రిందపడటానికి ఆర్థికమూల్యంతో మనిషి విలువకట్టే అధిక్షేపం కారణం. పావ, కిష్టు వాడిన మొగ్గల్లా, ఆ తరువాత అగ్నిపర్వతాల్లా మారటానికి మూలం ఆర్థికమూల్యంగా బ్రతుకును గౌరవించే అహంకారమే. ఇలా బడుగుజీవితాలను చిత్రించిన రచయిత్రి మిగిలిన 14 కథానికలలో మధ్య తరగతి, పై తరగతి మనస్తత్వాలలో జీర్ణించిన ఆర్థికమూలమైన వ్యాపార సంస్కృతి ఎన్ని విపరీత పరిస్థితులకు దారి తీస్తుందో సహజంగా చిత్రించింది.

సమస్యల ఎన్నికలో, నిర్వహణలో సాధించిన పరిణతిని తనదైన ఒక శైలిని రూపొందించుకోవటంలో సాధించగలిగితే శ్రీమతి భవానీదేవికి మరింత ఉజ్జ్వల భవిష్యత్తు ఉంటుంది. *

(ఆంధ్రభూమి, 15-10-1993)

# 'లోన వెన్న కనిపించును'

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకోభవతి యత్సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావ స్థిరాణి జననాంతర సౌహృదాని."

ఈ శ్లోకం చదవగానే భావుకులకు అభిజ్ఞాన శాకుంతల నాటకంలో కాళిదాసు చెప్పదలచుకున్న పరమార్థం అంతరాంతరాలలో స్ఫురిస్తుంది. అలాగే "ఏకోరసః కరుణ ఏవ" అనే శ్లోకం విన్నప్పుడు భవభూతి ఉత్తర రామచరిత నాటకంలోని ఆత్మ తత్త్వాన్ని ఆవిష్కరించినట్లు రసికులకు బోధపడుతుంది. ఒక్కొక్క కావ్య స్వభావాన్ని ఒక్కొక్క పద్యం వ్యక్తం చేయటం మహాకవుల రచనలలో గమనిస్తాం. అలాగే ఒక్కొక్కసారి ఒక రచయిత తన ఆత్మ స్వభావాన్ని ఒక గీతంద్వారాగానీ, ఒక సన్నివేశం ద్వారాగానీ, ఒక ప్రతీక ద్వారాగానీ వ్యక్తం చేయవచ్చు. అది అతని రచనలలోని అంతర్యాన్నీ, అంత శ్శిల్పాన్నీ తెలుసుకోవడానికి తోడ్పడవచ్చు.

ఈ సూత్రంతో సాహిత్యాన్ని సమీక్షించటానికి - అది కవిత్వమే కావలసిన అవసరం లేదు. నాటకం కావచ్చు, నవల కావచ్చు, కథ కావచ్చు - మరే ప్రక్రియయైనా కావచ్చు. కవి అజ్ఞాతంగా ఉన్న తన ఆత్మాభివ్యక్తిని తన మాట లతోనైనాగాని, ఇతరుల మాటలతోనైనాగాని గుర్తించి ఒక తాదాత్మ్యభావంతో రచనలలో రవళింపజేసే అవకాశం ఉంది. ఇసుక కుప్పలో దాచిపెట్టిన వస్తు వును కనుక్కొనే చిన్నపిల్లల ఆటలాగా రచనలో తన మర్మాన్ని దాచి రచయిత పఠితలను కనుక్కోమంటాడు. ఈ రకంగా రాయగల రచయిత శిల్పిగా పరిగణింపబడుతూ ఉంటాడు. ఈ మధ్య శ్రీ భమిడిపాటి కృష్ణమూర్తిగారి కథానికల సంపుటి 'అనంతం' (1993) చదువుతూంటే అటువంటి అంతర్యం అనంత శిల్పంగా నాకు అనుభవానికి అందింది. ఒక కేంద్రబిందువునుండి వెలు వడుతున్న చైతన్యవర్తులాల్లాగా వారి కథలు అహ్లాదాన్ని కలిగిస్తాయి.

భమిడిపాటి కృష్ణమూర్తిగారు దాదాపు 1952 నుండి కథలు, కథానికలు రాస్తున్నారు. సుమారు 150 కథలకు పైగా పత్రికలలో వెలువడ్డాయి. చిన్నా పెద్ద పత్రికలన్నీ వారి కథలను ప్రచురిస్తున్నాయి. కొత్తగా తెలుగు కథా ప్రపంచానికి పరిచయం చేయవలసిన అవసరంలేని ప్రసిద్ధుడే. అయినా, వారి కథలలో 'అనంతం'గా సాగే ఒక అంతస్సూత్రాన్ని సమీక్షించి, వారి రచనా శిల్పాన్ని అనుశీలిస్తే ఆత్మీయంగా ఉంటుంది.

ఈ కథానికల సంపుటిని చదువుదామని తెరిచి విషయ సూచికను చూచాను. కథానికలకు - మినీకవితలకు లాగా - శీర్షికలు ఆకర్షణీయంగా ఉంటాయి. అవే మొదట ఆసక్తికి అంకురారోపణం చేస్తాయి. కృష్ణమూర్తిగారి కథల పేర్లు అంత కొట్టవచ్చినట్టుగానీ, అంత పట్టవచ్చినట్టుగానీ ఉండక పోయినా, సహజంగా ఉండి కథాస్వభావాన్ని వ్యజింపజేసేవిగా ఉన్నాయి. ఉన్న పది శీర్షికలలో మూడు నాలుగు మనసును ఆకర్షింపగలుగుతాయి. వాటన్నింటిలో మొదట నాకు నచ్చింది 'పైన కఠిన మనిపించు.ను' (1966). ఆపైన 'అపరంజి', 'నల్లనివాడు', 'తెరపడింది', 'అనంతం' - ఇలా చెప్పుకోవచ్చు.

భమిడిపాటి కృష్ణమూర్తిగారు ఒకసారి బస్సులో పోతుంటే, ఆ వేసవిలో బస్సుస్టాండ్ దగ్గర ఒక ముసలివాడు మూర్ఛపోయాడు. అయినా, బస్సు కదలి పోయింది. పరుగెత్తే సమాజంలో నిర్లిప్తతతో కూడుకున్న ఎంత కాఠిన్యం ఉందో రచయిత సుప్తచైతన్యం చవిచూచి స్పందించింది. లెఫ్టినెంట్ కర్నల్ డాక్టర్ శాస్త్రిగారి ఔదార్యాన్ని అనుభవించాడు ఆపైన రచయిత. కఠినంగా ఉంటాడను కున్న ఆర్మీ ఆఫీసర్ ఆర్ద్రత నందించాడు. ఈ వైరుధ్యాలను అంతర్మథనంలో తరచి ఒక కథానిక సృష్టించాలని రచయిత తపన పడుతున్నప్పుడు రేడియోలో నుంచి డాక్టర్ సి. నారాయణరెడ్డిగారు రాసిన ఒక సినిమా పాట (అమరశిల్పి జక్కనలోది) వినిపించింది. అందులోని రెండు పంక్తులు రచయిత గుండెను పిండేశాయి; అతని ఆత్మ తత్త్వానికి అక్షరరూపంగా ప్రత్యక్షమయ్యాయి.

"పైన కఠిన మనిపించును
లోన వెన్న కనుపించును."

ఆ పాటలో శిల్పి శిలలను చూచి అనేవి ఈ మాటలు. అది నిజ జీవిత తత్త్వంగా, మానవ నైజంగా, నిత్యం తన చుట్టూ ఉన్న సమాజంలో అనుభవించే సత్యంగా,

అంతేకాదు - రచయిత కృష్ణమూర్తిగారి జీవిత దర్శనానికి లయాత్మకమైన అభివ్యక్తిగా తోచింది. ఆ పాట బయటి పాట కాదు - రచయిత లోపలి పాట!

భమిడిపాటి కృష్ణమూర్తిగారి కథలన్నీ ఈ అంతస్సూత్రాన్ని మోసుకొని వెలువడేవే. సమాజంలోని కరుడుగట్టిన తనాన్ని చెప్పడానికంటె కృష్ణమూర్తిగారు అందులోని ఆర్ద్రతను చెప్పటానికే తన కథలను చాలా వాటిని వెచ్చించారు. మానవత మీద మమకారం పెంచే ఆ లక్షణం కథలను వదలిపెట్టకుండా చదివిస్తుంది.

'పైన కఠిన మనిపించును' 1966 లో వెలువడింది. అందులో మిలిటరీ ఆఫీసర్ మరపురాని మనిషి. చావుబ్రతుకుల్లో ఉన్న వృద్ధునికి చివరి క్షణంలో అతని పుత్రునికి మారుగా వచ్చి, కొన్ని గంటలు శిలగా అతని చెయిపట్టుకొని కూర్చుని, తన కర్తవ్యాన్ని నిర్వహించి, నిర్లిప్తుడుగా తిరిగివెళ్ళిపోయి, వృద్ధుడైఆసుపత్రిలో నర్సుల సేవ గొప్పదా, తాను చేసిన సేవ గొప్పదా అన్న మీమాంసలో తాను పడి, మనలను పడేస్తాడు. రాయివంటి మిలిటరీ డిసిప్లిన్‌లో కూడా వెన్నవంటి హృదయం ఉంటుందని మనకు శిల్పిగా కథలో రచయిత చిత్రించి చూపుతాడు. నిజానికి ఆ కథ పైకి కఠిన మనిపించినా, లోన వెన్న కనిపించును.

అసలలా రాయటం భమిడిపాటి కృష్ణమూర్తిగారి సహజ కథాశిల్పంలో ఉంది. అదే ఆయన కథలలోని ఆత్మచైతన్యం; అసలు రహస్యం. ఈ సంపుటిలో చివరిదైన కథ - తేదీల ప్రకారం మొదటిదైన కథ 'ముందూ - వెనుకా' (1952)లో కూడా 'సోమూ' పాత్రలో ఈ స్వభావం కనపడుతుంది. అంటే, నారాయరెడ్డిగారి పాట వినిపించినట్లు చెప్పింది ఒక ప్రతీకాత్మక కథనం మాత్రమే. మొదటినుంచీ కృష్ణమూర్తిగారి కథల్లో ఆ వేణునాదం వినపడుతూనే ఉంది. ఇది నైజశిల్పం.

'అనంతం'లో మొత్తం పది కథలు సంకలనం చేయబడ్డాయి. అవి కాలక్రమంలో ఎన్నికయి ప్రచురించబడలేదు. కథానికా వస్తు మూల్యాలనుబట్టి, శిల్పనైపుణ్యాలనుబట్టి, పఠితసౌకర్యాన్ని దృష్టిలో ఉంచుకొని ఈ సంపుటిలో కథలు ఒక వరుసలో ఉంచబడ్డాయి. శిల్పంలోని పరిణామాన్ని గమనించాలంటే కథలను వెలువడిన కాలక్రమ పద్ధతిలో చదవటం మంచిది. ఆసక్తికోసమైతే ఇప్పుడున్న వరుసకు అభ్యంతరం లేదు.

'పరిభ్రమణం' (1966) లో భార్యాభర్తల నడుమ ఉండే ఒక విచిత్రమైన బంధాన్ని చిత్రించారు కృష్ణమూర్తిగారు. ఈ కథలోని శారదారామంలు ఆధునిక సుగ్రాత్రీ శాలీనులు. చిలకాగోరింకల్లా సాగే వారి కాపురం చింతలపాలౌతుంది. రామం సన్యాసుల్లో కలిసిపోతాడు అయినా, ఆమె కోర్కె ప్రకారం చివరిగడియల్లో ఆమె ప్రక్కన నిలిచి, ఆమె సుఖంగా ప్రాణాలు వదలటానికి తోడ్పడతాడు. మరునాడు తానూ ఆమెను స్మరిస్తూ ఆశ్రమంలో కన్నుమూస్తాడు. ఆ యిద్దరూ పట్టుదలలకు పైకి ఎంత కఠినులో - ప్రేమకు అంత లోన మెత్తనివారు.

ఈ కథల సంపుటిలో ఒక్కొక్క కథ ఒక్కొక్క పెరుగుకుండ. దాన్ని చిలికితే ఒక్కొక్కదానిలో ఒక్కొక్క రకం వెన్నముద్ద బయటపడుతుంది. కొడుకుల్లేని లోపాన్ని అద్దెకుండి చదువుకుంటున్న నలుగురు విద్యార్థులపై మమకారంతో తీర్చుకుంటున్న ఆ యిల్లుగలావిడ మనసు పైకి ఎంత కఠినమో, వాత్సల్యంతో లోన అంత వెన్న చందం. సింహస్వప్నంలాగా ఉండే ఆమెకు చివరిరోజు శవవాహకులుగా ఆ నలుగురు విద్యార్థులూ ఉండి కొడుకులనిపించుకొన్నట్లు చిత్రించిన కథ ఎంత సరదాగా సాగుతోందో అంత కరుణరస భరితంగా ముగుస్తుంది.

'నల్లనివాడు' గొప్ప విలువైన కథ. భాగవత భక్తి ప్రతీకను పనిపిల్లవాడి మీదకు మరలించి ఆధ్యాత్మిక లోకానికీ, భౌతికమానవానుబంధాలకీ ఒక క్రొత్త రకం ప్రేమ వ్యాఖ్యానం చెప్పి, కృష్ణతత్త్వం ఎంత కఠినమో ప్రేమించే మనసుకు అంత నవనీతమని నిరూపించిన కథ. ఇహపరాలకు మానవ సంబంధాలతో కల్పించే ఒక లంకె ఇందులోని లోన కనిపించే 'వెన్న.'

'అపరంజి' (1991) కథలో కాఠిన్యాన్నీ, వెన్ననూ కవలపిల్లలుగా సృష్టించి ఒక నూత్న శిల్పాన్ని ప్రదర్శించారు కృష్ణమూర్తిగారు, 'తెరపడింది' (1980) లో నర్తకి డాక్టర్‌ను వివాహమాడటంలో వృత్తి సంబంధమైన క్రమశిక్షణ కాఠిన్యంలో సహజంగా విచ్చుకొనే హృదయానుబంధం వెన్నగా నిరూపింపబడింది. అనంతం (1991). అంతర్మథనం (1992) ఈ రెండు కథలూ ఆణిముత్యాలు. 'అనంతం'లోని డైరీలో కనపడే ప్లస్, మైనస్ గుర్తులు,'అంతర్మ

ధనం'లో బావమరదులను త్రాగుడు మానటమే వరకట్నంగా కోరి ఇప్పించుకొన్న బావగారు - వింత ప్రతీకలు. పైకి కఠినమనిపిస్తూనే లోని వెన్నను చుట్టూ ఉండేవారికి పంచిచ్చేవారు. ఏమైనా ఈ కథలు మానవ ప్రకృతిలోని 'లోని వెన్న కనుపించే' కళాఖండాలు.

భమిడిపాటి కృష్ణమూర్తిగారి కథలలో ఒక క్రమపరిణామం కూడా కనపడుతుంది. దాదాపు 1965 దాకా కృష్ణమూర్తిగారు కథాకథనానికే ఎక్కువ ప్రాముఖ్యమిచ్చారు. ఆపైన 1980 వరకూ పాత్రచర్యల ద్వారా మనశ్చిత్రణం చేసే రచనాపద్ధతిని పెంపొందించుకున్నారు. 1980 తరువాత రాసిన కథల్లో అంతర్నిర్మాణ శిల్పానికి అనువైన విలువలను కల్పించారు. పదకొండు గంటలు కొట్టే గడియారం 'అపరంజి'లో అపూర్వ కథాశిల్ప ప్రతీక. కథ దానితోనే మొదలై దానితోనే ముగుస్తుంది. అందుకే అది ఈ కథలలో 'అపరంజి'; మొదట నిలిచింది.

కృష్ణమూర్తిగారు వర్ణనం చేసినదానికంటె కథే బాగా చెప్పగలరు. వస్తుతః వర్ణనల్లో గొప్ప భావుకత్వాన్ని ప్రకటించలేదు ఈ రచయిత. పశ్చిమాద్రిమీది సూర్యబింబం ఎన్నిసార్లు కనపడ్డా ముత్తైదువు మొగంమీది పెద్ద కుంకుమబొట్టులాగానే ఉంటుంది. కృష్ణమూర్తిగారు ఆడంబరాలులేని కథకులు. మనుమల్లోని ప్రకృతి స్వభావ వైవిధ్యాన్ని చిత్రిస్తూనే వారిలోని మనసును, మర్మాన్నీ వెన్నలా మనకందించే మధురకథకుడు శ్రీ భమిడిపాటి కృష్ణమూర్తి. *

(ఆంధ్రభూమి, 29-4-1994)

# త్రిముఖ త్రేతాగ్ని

తెలుగు విశ్వవిద్యాలయం గతవారం 13 వ తేదీన '1993 - సాహితీ పురస్కారాల ప్రదానోత్సవం' జరిపింది. ఆ సభలో తొమ్మిదిమంది సాహితీ మూర్తులు పురస్కారాలందుకున్నారు. వారందరికీ జీవియస్ కాలమ్ అభినందనల నందజేస్తోంది.

అందులో ఆనందింపదగిన మరో విశేష మేమంటే 'ఆంధ్రభూమి'లో ధారావాహికంగా ప్రచురింపబడిన 'త్రేతాగ్ని' - రచయిత్రుల రచనలలో ఉత్తమ మైందిగా పురస్కారాన్ని పొందటం. ఆ నవలా రచయిత్రి శ్రీమతి అడివి సూర్యకుమారి.

'టాప్ సీక్రెట్, మేడిన్ ఇండియా, సిరిపెరంబుదూరు కుట్ర వెనుక మోడస్ అపరాండీ' మొదలైన నవలలు రాసిన ఈ రచయిత్రి 'త్రిల్లర్ నావెల్సు'లో ఒక సహజత్వాన్ని, వాస్తవికతను కల్పించే ఒరవడికి తెలుగులో బాట వేశారు. కాల్పనికతకు కూడా ఒక శాస్త్రీయతను, మానవతను అలవరచిన వస్తువును ఎన్నుకొని నిర్వహించే నేర్పు శ్రీమతి అడివి సూర్యకుమారిగారికి సహజంగా అబ్బిన నవలాశిల్పం, అయితే, ఆ ఒరవడిలోకూడా పై మూడు రచనలకంటె అన్నివిధాలా అగ్రగణ్యమైంది, పరిణతిని సాధించిందీ 'త్రేతాగ్ని.' ఆ లక్షణం పేరుపెట్టటం దగ్గరినించీ సమస్యను, పాత్రలను, సన్నివేశాలను, నవలా విలువలను పోషించే ప్రతి అంశంలోనూ కొట్టవచ్చినట్లు కనపడుతుంది.

కుంతకుడు వక్రోక్తి జీవితంలో కావ్యానికి పేరు పెట్టటం కూడా ఒక రకమైన వక్రతగా పేర్కొన్నాడు. అధునిక సాహిత్య ప్రక్రియలు (కవిత్వం ప్రధానంగా) వక్రోక్తి జీవితాన్నే పరోక్షంగా పాటిస్తున్నాయి. ఈనాటి నవల కూడా ఆ ప్రవృత్తిని గౌరవిస్తే సాహిత్య గౌరవాన్ని పొందుతుంది. నవలా వస్తు మూలతత్త్వాన్ని శిల్పిక ధ్వనింపజేయాలి. ఆ శిల్పాన్ని శ్రీమతి అడివి సూర్యకుమారి యిందులో ప్రౌఢంగా పాటించారు. నాలాంటి సాహితీ విద్యార్థికి తోచే నాలుగు మాటలు చెబుతాను.

ఈ నవలకు ముందుమాట రాస్తూ శ్రీ సి. కనకాంబరరాజుగారు 'త్రేతాగ్ని! పేరులోనే ప్రకంపనం!' అని మొదలుపెట్టారు. అటువంటి అనుభూతిని కలిగించేదే ఆ శీర్షిక. పఠితలో ప్రకంపనాలు కలిగించే నవలను 'త్రిల్లర్' అని అంటున్నాం. త్రేతాగ్ని త్రిల్లర్ అన్నమాట!

లోకంలో త్రేతాగ్నులు మూడు ప్రసిద్ధం. లౌకికంగా జఠరాగ్ని, దావాగ్ని, బడబాగ్ని త్రేతాగ్నులు. వైదికంగా ఆహవనీయాగ్ని, దక్షిణాగ్ని, గార్హపత్యాగ్ని త్రేతాగ్నులు. ఈ అగ్నులను సహజార్థంలోనూ, భావచిత్రాలగానూ, అలంకారాలగానూ సాహిత్యంలో వాడతారు త్రేతాగ్నులు - అనే బహువచనరూపం ప్రతీకాత్మకంగా ఆధునిక కవితలో ఆవిష్కృతమైంది. 'త్రేతాగ్ని' అనే రూపం పరిచితమైన బహువచనరూపం కంటె విశిష్టమైంది. 'త్రేత' అంటే మూడు పాయలుగా సాగిన అని చెప్పవచ్చు; మూడు పాయలుగా సాగి ఏకమైన అని కూడా చెప్పవచ్చు. అటువంటి అగ్ని త్రేతాగ్ని. ఆ ప్రయోగమే ప్రతీకాత్మకతను ప్రకటిస్తోంది. ఒకే అగ్ని మూడుగా చీలినట్లుగాని, మూడు దిశలుగా సాగిన అగ్ని ఒకటిగా మూగినట్లుగాని చెప్పే ప్రవృత్తి ఈ నవలలో ఉన్నదని ధ్వనింపజేస్తోంది శీర్షిక. అంటే - ఈ త్రిల్లర్‌కు ప్రతీకాత్మకత ప్రాణమన్నమాట!

ప్రక్రియా విమర్శలో ముఖ్యంగా నాలుగు అంశాలపై వివేచన సాగుతుంది. అవి: **kind, type, mood, mode**. సాధారణంగా ప్రక్రియలను **kinds of literature** అని పిలుస్తుంటారు. ఉదాహరణకు **Epic, Novel** మొదలైనవి. వీటిలో మిశ్రరూపాలు కూడా ఉండవచ్చు- **Epic-Novel, Romance - Novel** లాగా, **Types** లో **Narrative, Discriptive, Dramatic, Symbolic** మొదలైనవి పేర్కొనవచ్చు. **Moods** లో **Tragic, Pathetic, Comic, Farcical, Horrific, Melancholic** మొ॥ వాటిని ఉదాహరించవచ్చు. **Modes** లో **Satiric, Ironic** మొదలైనవి. ఇవి కవితా ప్రక్రియలకే కాకుండా నవలకు కూడా వర్తిస్తాయి

త్రేతాగ్ని ప్రక్రియగా త్రిల్లర్ నవల, ప్రతీకాత్మక ప్రవృత్తితో సాగిన కథాకథనాత్మక రచనకు సంబంధించిన శాఖ (టైప్) దీనిది. విషాద గంభీరమైన రౌద్రం ఈ నవలలోని భావాత్మక సంవేదన (Mood), వాస్తవికతలో వ్యంగ్య

ధోరణి కలిసిన ఒక మిశ్రమ వైఖరి (Mode) ఈ నవలలోని నవజీవనశక్తి. ప్రతీకాత్మకత, విషాదగంభీర రౌద్రం, వాస్తవికతలో వ్యంగ్య ధోరణి అనే మూడు సాహిత్యాంశాలు థ్రిల్లర్ నవలలో సంపుటీకరించే శిల్పం 'త్రేతాగ్ని.'

'త్రేతాగ్ని'- ఈ నవలలో ఒక విప్లవ నాయకుని సంకేత నామం (Code name). అడవిలో అతని వర్గం పీడిత వర్గాల విముక్తి కోసం సాయుధ విప్లవాన్ని గొరిల్లా పద్ధతిలో సాగిస్తూ ప్రభుత్వానికి అశాంతి సమస్యగా తయారయింది. ప్రభుత్వం సాయుధ విప్లవాన్ని సామదానభేద దండోపాయాలతో అణచి ప్రజా సామ్యపు విలువలను, శాంతిని, వ్యవస్థను కాపాడాలని యత్నిస్తూ ఉంటుంది. విప్లవ వీరులు పోరాటం చాలించి జనజీవన స్రవంతిలో కలిసిపోయి సమాజ నిర్మాణంలో శాంతియుతంగా, ప్రజాస్వామ్య పంథా ననుసరించి పాల్గొంటే కక్ష సాధించే చర్యలు మాని, స్వయం ఉపాధి పథకాలను కల్పిస్తానని ప్రకటిస్తుంది. రక్తపాతం మాని రాజ్యాంగ వ్యవస్థకు అనుగుణంగా జీవించమని కోరుతుంది. 'త్రేతాగ్ని' అనే విప్లవవీరుడు 'ఈశ్వర్' అనే పేరుతో ప్రభుత్వానికి లొంగి, జన జీవనస్రవంతిలో సాగటానికి గంగాపురంలో సాగుభూమి పట్టా నందుకొని నవ జీవనం సాగిస్తాడు. కాని, అక్కడ రాయుడు జమీందారీ భూస్వామ్య వ్యవస్థకు, పీడక వర్గానికి, వెట్టిచాకిరీ పద్ధతికి, దోపిడీ విధానానికి ప్రతినిధిగా త్రేతాగ్నికి ప్రతిగా నిలుస్తాడు. త్రేతాగ్నికి- రాయుడికి జరిగే సంఘర్షణయే ఈ నవలలోని కథ. తీవ్రమార్గాన్ని మాని అహింసా పద్ధతిని అవలంబించి దోపిడీ పద్ధతి నుండి పీడిత వర్గాన్ని తప్పించి, స్వయంపోషకులుగా వారిని నిలపటానికి, ప్రభుత్వం బీదవారికై తలపెట్టి చేస్తున్న ఎన్నో మంచి పనులను వారిదాకా చేరేటట్లు చూడ టానికి శాయశక్తులా యత్నిస్తాడు. చిత్తశుద్ధిగల ప్రభుత్వోద్యోగుల మంచితనాన్నీ లంచగొండుల ద్రోహబుద్ధినీ, అమాయకుల ఆక్రందలనూ, రాయుడు వంటి భూస్వాముల చేతులలో పల్లెసీమ రక్తపు మడుగుగా మారుతున్న విధానాలనూ చూచి సహనంతో, సాహసంతో, సహకారంతో, సమస్యలను పరిష్కరించటానికి యత్నించి, చివరకు తనవారినందరినీ కోల్పోయి హంతకుడుగా బందీ అవుతాడు. న్యాయస్థానంలో బోనెక్కుతాడు. సి.ఐ.డి. శాఖ ప్రతినిధి ముఖీద్ అసలు త్రేతాగ్ని చనిపోయాడనీ, ఈశ్వర్ పేరుతో ప్రజలమధ్యకు వచ్చినవాడు గాండేయ వాది అయిన అతని బావమరది అనీ తేల్చి చెపుతాడు. న్యాయమూర్తి అతని కథంతా విని ఈశ్వర్‌ను నిర్దోషిగా తీర్పు చెప్పి విడుదల చేస్తాడు.

త్రేతాగ్ని మీద జడ్జి ఇచ్చిన తీర్పు గూడా మరొక త్రేతాగ్ని. అందులో మొదటి అగ్నిధార విప్లవ సదవగాహన. విప్లవం పతాక స్థాయికి చెందిన మానవ చైతన్యం. సమాజంలోని రాజకీయ ఆర్థిక సాంస్కృతిక పరిణామాలు విప్లవ ఫలితాలే, 'ఈనాటి విప్లవాన్ని ప్రజలు, ప్రభుత్వం ఒక అరాచక చర్యగాను, ప్రజావ్యతిరేక చర్యగాను తలపోస్తున్నారంటే దీనిక్కారణం గురితప్పిన విప్లవ కారులు, వారి సిద్ధాంతరాహిత్యం.'

రెండవ అగ్నిధార- జనజీవన స్రవంతిలో ప్రవేశించి ఈశ్వర్ చేసినవన్నీ రాజ్యాంగ పరిధిలో సాగిన సామాజిక జాగృతి చర్యలుగా గుర్తించటం. "ఈశ్వర్ తేవటానికి ప్రయత్నించిన 'జాగృతి' నేరమే అయితే, చీకట్లను పారద్రోలే 'సూర్యోదయం' కూడా నేరమే అవుతుంది. గ్రామీణుల జీవితాల్లో మార్పులు తెచ్చి, దేశ సిరిసంపదల్లో తామూ భాగస్వాములమేనన్నమాట గుర్తుచేశాడు. అధి కారులు కొందరైనా ప్రజాసంక్షేమంకోసం పాటుపడుతున్నారని రుజువు చేశారు"- అన్న వాస్తవం అగ్నిలాంటిది.

మూడవ అగ్నిధార-ఈశ్వర్ చేసిన నేరాలు రెండింటినీ క్షమించటం. త్రేతాగ్నిలా వచ్చి కలెక్టర్ని మోసం చేయటం ఒక తప్పు. దానికంటె ఘోర మైందీ, ఉరిశిక్షకు అర్హమైందీ డ్యూటీలో ఉన్న సబ్ ఇన్స్పెక్టర్ని కాల్చిచంపటం రెండో తప్పు. అయినా, తప్పుని దండించు, తప్పు చేసిన వ్యక్తిని కాదు అనే ప్రాథమిక సూత్రాన్ని ఆధారంగా చేసుకొని జడ్జి ఈశ్వర్‌ని విడుదల చేశాడు. "ఈశ్వర్ హత్యచేసింది ఒక వ్యక్తిని కాదనీ, వారు చేసిన అక్రమాలపైన, అన్యాయాలపైన జరిపిన ప్రతిచర్య మాత్రమేననీ; ఈశ్వర్‌కి శిక్షవిధిస్తే న్యాయా నికీ, జాగృతికీ శిక్షపడినట్లవుతుందనీ'' జడ్జి హైకోర్టుకు నివేదిస్తాడు, సామాజిక న్యాయం సాధించిన సత్యాగ్ని ఇది.

త్రేతాగ్నివంటి విప్లవకారుడు ఈ సమాజంలోని అన్యాయాలను ఎదురించ టానికి పుట్టినవాడే. అన్యాయాలకు తీవ్రమార్గ మొక్కటే శరణ్యమని అడివిలో చేరి గొరిల్లా యుద్ధం ప్రకటించాడు. అతణ్ణి జనజీవన చైతన్యంలోకి తేవటంకోసం సంక్షేమ పథకాలను ప్రకటించింది ప్రభుత్వం. ఏ సమాజంలోని పరిస్థితులు ఒక విప్లవకారుణ్ణి పుట్టిస్తున్నాయో ఆ పరిస్థితులను మార్చకుండా అతణ్ణి మారమంటే అది సాధ్యమా? అన్నది ఈ నవలలోని సమస్య. దోపిడీ వర్గంతో దోస్తీచేసి పేద ప్రజలను బానిసలుగా మార్చటమా? సమసమాజ భావన శాంతితో సాధించటం

సాధ్యమా? సాయుధ విప్లవం సమస్యకు పరిష్కారమా? అన్న త్రేతాగ్నులవంటి ప్రశ్నల సంపుటీకరణమే త్రేతాగ్ని.

మరొక ఆశ్చర్యమేమంటే- ఈ రచనలో రచయిత్రి నవల అంగాలను మూడింటిని త్రేతాగ్నిలా సంధించి ప్రతిభా త్రేతాగ్నిలా వెలుగొందింది. నవలా రచనలో నాయకుడు (లేదా పాత్రలు), సమస్య, టెక్నిక్ అనేవి త్రేతాగ్ను ల్లాంటివి. ఈ నవల ఈ మూడింటికీ పోటీపెట్టినట్టుంటుంది. మూడూ వేటికవి నెగ్గినట్లు కనవడుతూ ఒక సమైక్యత (unity)ను కూడా సాధిస్తాయి. అందుకే 'త్రేతాగ్ని' పేరు మరొక రకంగా సార్థకం.

ఒకరకంగా చూస్తే ఇది నాయక ప్రధానమైన నవల. మొత్తం కథ అతని చుట్టూ తిరుగుతుంది. అత డెదుర్కొన్న సమస్యలకంటె వాటిని అతడు పరిష్క రించిన విధానికీ, విఫలమైన పద్ధతికీ ఈ కథలో ప్రాధాన్యం. ప్రభుత్వం, ప్రజలు, ధనికవర్గం, మిత్రవర్గం అందరూ అతణ్ణి కేంద్రంగా పెట్టుకొని తమ కార్యకలాపాలు సాగిస్తారు, ప్రవృత్తులను సాధిస్తారు. అతడు అళ్లా అనురాగ బంధాలు పెంచుకుంటాడు. అన్నింటినీ సాహసోపేతంగా రక్షించుకుంటాడు. గూడెంలో మిత్రు లొక్కొక్కరూ ఒక్కొక్క రత్నం. తన్మయి ఈశ్వర్‌ను మించిన స్నేహమూర్తి, త్యాగమూర్తి. అందర్నీ రాయుడు మూలంగా పోగొట్టు కున్నాడు ఈశ్వర్. మారని దోపిడీ వ్యవస్థకు ప్రతినిధి రాయుడు. ఒంటరిగా జనజీవన స్రవంతిలోకి వచ్చిన ఈశ్వర్ ఒంటరిగా, హీరోగా, మిగిలాడు. నాయకుని లెక్కించిచూస్తే 'హీరో నావెల్' ''త్రేతాగ్ని.''

సమస్యదృష్ట్యా చూస్తే సామాజిక సమస్యా నవల (Social Problem-Novel). గురజాడవారి 'కన్యాశుల్కం' సాంఘిక సమస్యానాటకం. అలాగే ఇది ఆ జాతికి చెందిన నవల. ఇందులో సమస్యకు పరిష్కారం చెప్పటం ముఖ్యం కాదు; సమస్యకు సంబంధించిన సర్వాంశ పరిజ్ఞానాన్నీ సర్వాంగంగా ప్రదర్శించటం ప్రధానం. ఆ ప్రణాళిక కనుగుణంగానే పాత్రలూ, సన్నివేశాలూ, పరిణామం, పరిమాణం నిర్ణయింపబడతాయి. సమస్యయే త్రేతాగ్ని జీవితం. త్రేతాగ్ని, ఈశ్వర్- ఈ పాత్రలు ప్రతీకాత్మకాలు కావటంతో వ్యక్తిస్ఫృహను కోల్పోయి సమస్యలకు ప్రతినిధులుగా నిలబడతారు. త్రేతాగ్ని ఎందుకు చని పోవాలి? అతని సలహాతోనే ఈశ్వర్ అతని పేరుతో జీవనోపాధిని ఎందుకు స్వీకరించాలి? అంటే గాంధీవాదం నమ్మిన బావమరిది బ్రతుకుకోరాడా త్రేతాగ్ని

ఉగ్రవాదం బ్రతుకుతెరువుకు కూడా ఒక మార్గమా? ఈశ్వర్‌లో త్రేతాగ్ని జాడలు ఎందుకు కనపడ్డాయి? ప్రభుత్వానికి 'అతడు నిజంగా త్రేతాగ్నియేనా?' అని అనుమానం ఎందుకు వచ్చింది? గూడెంలోని ప్రజలతో సంబంధాలు, ఆఫీసర్లతోటి సంబంధాలు, నక్సలైట్లతోటి సంబంధాలు, తన్మయి కుటుంబ సభ్యులతోటి సంబంధాలు - వాటి స్వరూప స్వభావాలేమిటి? తీవ్రవాదులు జనజీవన స్రవంతిలో ఎదుర్కొనే వివిధ సమస్యలకు సంకేతాలే. అవి చెప్పటానికే ఇంత కథ! అడవిలో ఉద్యమం సాగించినప్పుడు సాయుధ విప్లవం సహజం. అది ఎప్పటికైనా విఫలమయ్యేదే. అయితే, ఆ చైతన్యం ప్రజా జీవనంలో పునః ప్రవేశించాలంటే గాంధీవాదమే దానికి ప్రాతిపదిక కావాలి. అయినా, గాంధీ వాదాన్ని విస్మరించిన సమాజం తన తప్పు తాను తెలుసుకొని హింసావాదానికి స్వస్తి చెప్పాలి. దాన్ని ఎలా సాధించాలో చెప్పాలన్న పరిష్కారం ఈ నవల సమస్య ధ్యేయం కాదు. అదే దాని ప్రత్యేకత కూడా! పరిష్కార నవలకంటె సమస్యానవల శిల్పపరంగా గొప్పది.

టెక్నిక్ దృష్ట్యా ఈ నవల భావసంవేదనాత్మకమైన మూడ్‌ను సృష్టించ గలిగింది. ఇది విషాదాంత నవల అన్నదానికంటె విషాద గంభీర నవల అనటం న్యాయం. ఇందులో విషాద వాతావరణం బలంగా చిత్రింపబడింది. మానవత్వపు విలువల చిత్రణకు ఈ టెక్నిక్ బాగా పనికివస్తుంది.

ఎన్ని రకాలుగా చూచినా త్రేతాగ్ని త్రేతాగ్నియే. రచయిత్రికి శుభా కాంక్షలు! దీనిని మొదట తెలుగువారి కందించిన ఆంధ్రభూమికి అభినందనలు!

(ఆంధ్రభూమి 22-7-1994)

# స్త్రీవాదం - ఒక ప్రమాణం - ఒక ప్రయోగం

సాహిత్యాన్ని ప్రధానంగా సాహిత్యేతర ప్రమాణాలతో విలువ కట్టటం ఆధునికయుగ లక్షణంగా కడచిన ఒకటిన్నర శతాబ్ది కాలంనుంచి సంభావింప బడుతోంది ప్రపంచంలో. అయితే ఆ భావం కడచిన రెండు మూడు దశాబ్దాలుగా క్రమంగా వెనుకంజ వేసింది కూడా. ఆ మాటకొస్తే ఒక సాహిత్యరంగంలోనే కాదు, సామాజికరంగంలో - అందులోనూ ముఖ్యంగా స్త్రీపురుష సంబంధాల మూలతత్త్వాన్ని అన్వేషించటంలో కూడా ఈ పద్ధతి ప్రచారంలోకి వచ్చింది. నరనారీ సంబంధాల మూలసూత్రం ప్రేమ మూలమని సనాతన ధర్మపరులు భావిస్తే, కామ మూలమనీ, ఆర్థిక మూలమనీ, స్వేచ్ఛా మూలమనీ ఆధునికులు వాదిస్తున్నారు. పురుషస్వామ్యవాదాన్ని ప్రతిఘటించే స్త్రీ చైతన్యం స్వీయ స్వతంత్ర సమానస్వామ్య అస్తిత్వాలకోసం ప్రతిఘటించటం ఈ శతాబ్ది చవి చూచింది. దాని ఫలితంగా ఈనాడు ప్రపంచమంతా కుటుంబవ్యవస్థను పునర్వ్యవస్థీకరించుకుని సంరక్షించుకోవాలన్న స్నేహ స్పృహకోసం ప్రపంచ నరనారీ ప్రవృత్తి ప్రయత్నం చేస్తోంది.

ప్రపంచ నరనారీ సంబంధాల మూలతత్త్వాన్ని గురించి ఆధునిక తత్త్వవేత్తలు, సాహితీవేత్తలు, సామాజిక శాస్త్రవేత్తలూ, అందులోను స్త్రీలు ఎన్నో రకాలైన అభిప్రాయాలు వ్యక్తం చేశారు. అన్నింటిలోనూ నేడు ప్రేమవాదం, కుటుంబజీవన విచ్ఛిత్తి వ్యతిరేకవాదం ప్రపంచ ప్రజల ప్రశంసల నందుకుంటున్నాయి. ఈ దశాబ్దంలో ఇద్దరు రచయిత్రులు రెండు అంచుల్లో నిలబడి తమ రచనల ద్వారా ఈ చైతన్యాలకు జీవం పోసిన ఉదాహరణలను రెండింటిని మచ్చుకు పేర్కొంటాను.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారికి వారి 60 వ జన్మదినోత్సవ సందర్భంగా 1985 నవంబరు 23 వ తేదీనాడు పుట్టపర్తిలోని శ్రీ సత్యసాయి ఉన్నత విద్యా సంస్థ (డీమ్డ్ యూనివర్సిటీ) 'సాయిచందన' అనే వ్యాస సంకలనాన్ని భక్తి కానుకగా సమర్పించింది. అందులో ప్రపంచంలోని నలుమూలల నుండి వివిధరంగాలలో నిష్ణాతులైనవారు అనేకాంశాలమీద వ్యాసాలు ఇంగ్లీషులో రాశారు.

వారిలో అమెరికా సంయుక్త రాష్ట్రాలకు సంబంధించిన శ్రీమతి ఫిల్లిస్ క్రిస్టల్ (Mrs. Phyllis Krystal) రాసిన వ్యాసం నరనారీ సంబంధాలకు మూల ధర్మం ప్రేమతత్త్వమని ప్రతిపాదించింది. ఆమెకు ఆ తత్త్వాన్ని దర్శింపచేసిన వారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా. దానిని ఆమె నిత్యజీవితంలో అనుభవించి, ఆచరించి, నిరూపించి నిజమని వివరించింది. ఆధునిక జీవితంలో ఆధ్యాత్మికమైన విలువలను మన్నించటం అత్యంత ఆధునిక పాశ్చాత్యధోరణిగా ఆమె సంభావించింది స్త్రీలకు సంబంధించిన సమస్యలను దృష్టిలో ఉంచుకొని 'నేటి ప్రపంచంలో సంప్రదాయానికున్న ప్రాధాన్య'మన్న పేరుతో రాసిన ఆ వ్యాసం స్త్రీ పురుష సంబంధాలను గురించి కొన్ని విలువైన అంశాలను చెప్పింది.

ఒకనాడు ఫిల్లిస్ క్రిస్టల్ ధ్యాన సమాధిలోకి వెళ్ళింది. అంతర్దృష్టిలో బాబా దర్శనమైంది. ఆయన ముందు నడుస్తున్నారు. ఆమె అనుసరించింది. భూగోళాన్ని విహంగ వీక్షణంతో చూడగలిగిన ఒక సమున్నత స్థానంలో బాబా ఆమెను నిలబెట్టారు. "ఇప్పుడు నీకు నిజమైన 'హార్ట్ బై-పాస్'ను చూపిస్తా"నని బాబాగారు ఆమెతో అన్నారు. భూమండలాన్ని చూడుమన్నారు. ఆమె చూచింది. భూమండలంమీద షట్చక్రాలతో కూడుకొన్న మానవాకారం ముద్రితమై కనపడింది. బాబా హృదయ చక్రాన్ని వేలితో చూపించారు. దానికి చేరుకోవలసిన మార్గాలు కొన్ని పూడుకొనిపొయ్యాయి; కొన్ని ఇరుకైపోయాయి. అందులోకి ప్రేమ రక్తం ప్రవహించటం లేదు. అందువలన ప్రేమ మానవులకు హృదయం ద్వారా వ్యక్తం కావటం లేదు అయితే, హృదయంలో పవిత్రంగా వ్యక్తం కావలసిన ప్రేమ ఇప్పుడు మెదడు, నాల్క, మర్మావయవాలు మొదలైన ద్వారాల గుండా ప్రవహిస్తోంది. అందువలన మానవసంబంధాలను మనిషి హృదయంలోని అచ్చమైన ప్రేమతో భావించి, అనుభవించలేకపోతున్నాడు. ఆర్థికంగా, లైంగికంగా, తార్కికంగా, వాచికంగా, డాంబికంగా, ఆంగికంగా, కృత్రిమంగా వ్యక్తం చేస్తున్నాడు మానవ సంబంధాలకు మనసులోని ప్రేమ నిజమైన ప్రమాణం. మిగిలినవి ప్రేమేతర ప్రమాణాలు. వాటివలన ప్రేమతత్త్వం ప్రసన్నం కాదు. అందువలన ఈనాటి మానవతకు బైపాస్ సర్జరీ అవసరమని బాబా శ్రీమతి ఫిల్లిస్ క్రిస్టల్‌కు ధ్యానదర్శనంలో స్పష్టం చేశారు.

ప్రేమ హృదయం ద్వారా ప్రవహించకపోతే మానవ సమాజంలో ఎన్నో విపరీత ప్రమాదకర సమస్యలు తల యెత్తుతాయి. నేరప్రవృత్తి, హింసాప్రవృత్తి

విచ్చలవిడిగా చెలరేగుతాయి; స్వార్థ సంకుచితత్వాలకు పరిమితమయ్యే భౌతిక వాదం ప్రబలుతుంది: స్వేచ్ఛాలైంగికవాంఛలు, వాటికొరకు జరిగే అత్యాచారాలు బలపడతాయి; బలవంతంగా అవినీతి ప్రవృత్తులు పులమబడతాయి. సంతాన ద్వేషం, వివిధ వ్యసనాలకు బానిసలు కావటం, విశృంఖల లైంగిక ప్రవృత్తికి దాసులు కావటం, సంసార (కుటుంబ) వ్యవస్థలను శిథిలం చేసికోవటం మొదలైనవి వీటివలన కలిగే దుష్ఫలితాలు. ఈ ప్రళయం నుండి మానవ సమాజం ఉద్ధరింపబడాలంటే ప్రేమమూలమైన హృదయ సంబంధాలు కుటుంబ వ్యవస్థలో, సమాజ జీవితంలో మూడు పూవులూ, ఆరు కాయలుగా వర్ధిల్లాలని బాబా చేసిన ప్రబోధాలను ఆమె తన వ్యాసంలో పేర్కొన్నది.

హృదయ ద్వారాలు మూసుకుపోయినప్పుడు సామాన్యంగా పురుషులు యుద్ధాలకూ, రక్తపాతాలకూ, క్రూరకర్మలకూ పాల్పడతారు. ఆ సమయంలో హింస, అశాంతి చెలరేగుతాయి. ఆ విపత్తునుంచి ప్రపంచాన్ని కాపాడగలిగిన కరుణామయశక్తి స్త్రీ మాత్రమే. స్త్రీ అటువంటి సమతౌల్యాన్ని సృష్టిలో రక్షించే మహత్తరశక్తిగా మొదట గౌరవింపబడేది. కాని, ఆమె స్థితి క్రమంగా పురుషాధిక్యంలో దిగజారిపోయి అతి దీనావస్థకు చేరుకుంది. స్త్రీ తన స్వేచ్ఛకోసం ఉద్యమాలు సాగిస్తోంది. అవి అవసరం కూడా. అయితే, ఆ ఉద్యమాలలో స్త్రీ నిర్వహించే పాత్రను గురించి శ్రీమతి ఫిల్లిస్ క్రిస్టల్ అభిప్రాయం ఇటువంటిది—

"However, in their struggle for liberation from the worsening dilemma, they have mistakenly chosen to act out the role, not of strong loving women, but as carbon copies of men, proclaiming that they are their equals in every way; and often going to ludicrous extremes to prove their point. The result of their quest for liberation and equality has caused many women to make a conscious decision to by-pass their hearts. In this way they have cut off, suppressed or frozen their emotions, fearing that feelings would be a hindrance in the competition with men." స్త్రీని ఆదర్శ ప్రేమమూర్తిగా దర్శించటమే ఆమె ధ్యేయం. కాని, ఉద్యమ స్త్రీ- కావాలని ప్రేమకు దూరమౌతున్నదని ఆమె బాధ.

ఆదర్శ ప్రమాణం స్త్రీ అస్తిత్వ సమస్యను ప్రేమ సూత్రంతో గౌరవించే స్త్రీపురుష సంబంధాలు ఉన్నప్పుడే సాధ్యపడుతుంది. ఆర్థికాది సూత్రాలతో

అన్వయిస్తే దీనికి అందరి ఆమోదం దొరకక పోవచ్చు. సమాజ వ్యవస్థలో ప్రేమ సూత్రం కుటుంబ వ్యవస్థ భద్రతమీద ఎక్కువగా ఆధారపడి ఉందని నేడు ప్రపంచమంతా గుర్తిస్తోంది. భారతదేశం కొన్ని యుగాల క్రిందనే ఈ సత్యాన్ని గుర్తించింది. కుటుంబ వ్యవస్థ కేంద్రంగా, ప్రేమతత్త్వం పరిధిగా, స్త్రీపురుష సంబంధాలను సామాజికపరంగా వ్యాఖ్యానించటం నేటి స్త్రీ సమస్యా చిత్రణలోని కీలకాంశం.

దీన్ని ఇతివృత్తంగా తీసికొని ఈ మధ్య వెలువడిన సీరియల్ నవల శ్రీమతి అడివి సూర్యకుమారిగారి 'కాలం ఒడిలో....'. సమస్యకు తగిన వస్తు చిత్రణం రూపొందించుకోవటంలో సూర్యకుమారిగారు సునిశితమైన శిల్ప దృష్టి కలవారు. కుటుంబ జీవన సంబంధాలలో హృదయం, డబ్బు నిర్వహించే పాత్ర లలో గల వైవిధ్యాలను దృష్టిలో పెట్టుకొని ఈ నవలలోని కుటుంబాలు చిత్రింప బడ్డాయి. గుంటూరులోని శంకరరావుగారి కుటుంబం ప్రేమసంబంధాల కుటుం బానికి ప్రతీక. ఆ కుదురులో నుంచి పుట్టిన అనర్ఘరత్నం ఈ నవలానాయిక 'మాధవి.' ఆమె స్త్రీవాద సమస్యపై రచయిత్రి కళాత్మకంగా చేయదలచుకున్న వ్యాఖ్యకు సజీవ చైతన్యమూర్తి. ప్రేమమూలమైన సంస్కార కుటుంబం నుండి ఆర్థికమూలమైన యాంత్రిక కుటుంబంలోకి మెట్టుతుంది మాధవి. ఆర్థిక మూల్యా లతో అస్తిత్వాన్ని కోల్పోయిన అనామకుడు మాధవి మామగారు చలపతిరావు. ఆర్థిక చింతతో సాంస్కృతిక మూల్యాలను చంపుకున్న స్త్రీశక్తి మాధవి అత్త గారు సావిత్రి. అమ్మగారి పెంపకంలో అలవడిన ఆర్థిక సంస్కృతిలో స్త్రీపురుష సంబంధాలను ప్రేమేతరమైన పద్ధతులలోనే వ్యాఖ్యానించుకోగలిగే యాంత్రిక నాగరక ప్రవృత్తికి ప్రతీక శరత్.మాధవి భర్త. స్త్రీపురుషసంబంధాలకు లైంగిక స్పృహయే మూలం అని నమ్మేవ్యక్తులు క్రమంగా తమ కుటుంబవ్యవస్థను ఎలా భగ్నం చేసికొంటారో శరత్ పాత్ర నిరూపిస్తుంది. ఆటువంటి స్పృహతోనే పెళ్ళీ పెటాకులూ లేకుండా కుటుంబాలకు చీడపురుగుల్లా తయారయ్యే విషశక్తులకు ప్రతీక శ్యాం.

ఈ నవలలో ప్రేమలేని కుటుంబం శరత్‌దే. మిగిలిన కుటుంబాలన్నీ వివిధ స్థాయిలలో ప్రేమతత్త్వాన్ని పెంచుకుంటున్న సజీవసంస్కృతి వ్యవస్థలు. వాళ్ళకు జీవిత మాధుర్యం తెలుసు, మనుషుల మధ్య ఉండవలసిన మమతలు తెలుసు. పెద్ద ధనికులు కాకపోయినా ప్రేమధనానికి వారెవ్వరూ పేదలు కారు;

ఒక్కొక్క కుటుంబంలో ఒక్కొక్క విషాదగాథ ఉంది. అయినా, విషాద యోగాన్ని తరించగలిగే ఆధ్యాత్మిక గీతాయోగం వారి జీవన సూత్రంగా పెన వేసుకొనిపోయింది.

వీరందరూ మాధవికి స్నేహితులు, గురువులు, మార్గదర్శకులు. ఆమెకు జీవితసంస్కృతియే గురువు. అంతరాత్మ ప్రబోధమే ఆచరణ సూత్రం, కాని, ఆమె అంతరాత్మ ప్రబోధం ఈ జాతి సంస్కారానికి సజీవాభివ్యక్తి. కుటుంబం కోసం సుఖాన్ని, ఆప్యాయతను, ఆత్మాభిమానాన్ని, అస్తిత్వాన్ని పోగొట్టు కోటానికి సిద్ధమౌతుంది. కాని, సంతానాన్ని, శీలాన్ని మాత్రం పోగొట్టుకోదు. మాధవి భర్త పెంచుకున్న ఆర్థిక మూలమైన సంస్కృతిని శీలరక్షణం కోసం దూరం చేసుకుంటుంది. ఆమెకు శాంతి లభిస్తుంది. జీవితంలో పిల్లలను తీర్చి దిద్దగలిగే శక్తి ప్రేమకున్నంతగా డబ్బుకు లేదని ఆమె నిరూపిస్తుంది. మాధవి శీలంతో జీవించిన సజీవ సంస్కృతి శిల్పం. ఆమె పిల్లలు, స్నేహితులు ఆ శిల్పాన్ని అలంకరించే హృదయ మందిరాలు.

శరత్ చివరకు జీవచ్ఛవంగా మారి, మాధవి ముందు నేరస్థుడుగా నిలు స్తాడు పశ్చాత్తాపంతో. మాధవి అతణ్ణి ద్వేషించలేదు. కాని, స్వీకరించనూ లేదు, ఈ ముగింపు నవలాశిల్పంలో ఒక కలికి తురాయి, ఆర్థిక మూల సంస్కృతి కుటుంబ వ్యవస్థను శిథిలం చేసేదేకాని ఎన్నడూ పునరుద్ధరింపగలిగేది కాదు. ప్రేమసూత్రం శిథిలమైన వ్యవస్థను నిలపగలదు; స్వయంపోషక శక్తిని సమ ర్పించగలదు, విషశక్తులను జయించ కలదు, ప్రేమశక్తులను సమన్వయించ కలదు. అది స్త్రీ శక్తికే సాధ్యం. స్త్రీవాదోద్యమం కుటుంబ వ్యవస్థను రక్షించు కోవాలి, ప్రేమతత్త్వాన్ని జీవనవేదంగా వినిపించాలి. వేదంవంటి ఆ వాదానికి ఆధునిక స్త్రీ ప్రతీక 'మాధవి'.

శ్రీమతి ఫిల్లిస్ క్రిస్టల్ ఆదర్శ స్త్రీ వాదానికి ప్రమాణం చెప్పింది అమెరికాలో. శ్రీమతి అడివి సూర్యకుమారి ప్రయోగం చేసి చూపించింది తెలుగులో. *

**(ఆంధ్రభూమి, 6-5-1994)**

# సాహిత్యమందిర ద్వారపాలుడు

ప్రజాస్వామ్య వ్యవస్థలో ఒక ప్రజాప్రతినిధిగాని, ఒక మంత్రిగాని, ఒక గవర్నరుగాని సాహిత్యంతో, లలితకళలతో ఎటువంటి సత్సంబంధాలు కలిగి ఉండాలో చెప్పాలంటే తెలుగువారు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారిని ఒక ప్రామాణిక ఉదాహరణంగా తీసుకొంటారు. ప్రభుత్వంలో ఎంతటి పెద్ద పదవిని అలంకరించినా రెడ్డిగారు కవులను, రచయితలను, కళాకారులను దర్శించటమన్నా, వారితో మాటలాడటమన్నా, వారిని సన్మానించటమన్నా ఒక ఆరాధనా విశేషంగా భావించేవారు. రచయితలను తమకు బంధువులుగా, ఆత్మీయులుగా భావించేవారు. రచయితలు కూడా వారిని ఎప్పుడూ సాహితీ బంధువుగా సంభావిస్తూంటారు.

డాక్టర్ గోపాలరెడ్డిగారిది సమున్నత విగ్రహం. సభల్లో ఎవరైనా వారిని పూలమాలతో అలంకరించటానికి వస్తే మొదట వారు తలవంచని వీరునిలాగా నిటారున నిలబడతారు. దండ వేసేవారికి వారి మెడ అందదు. ఒక నవ్వు నవ్వుతారు. రసికులు చాలమంది ఆ సన్నివేశాన్ని చూచి ఆనందిస్తూ ఉంటారు. అందులో తెలుగువారికి ఒక సంతృప్తి కూడా మిగులుతుంది. తన రంగంలో ఎంతో ఎత్తు ఎదిగిన ఒక వ్యక్తిని చూస్తున్నామనే గుర్తింపు ప్రజలకు కలుగుతుంది. గోపాలరెడ్డిగారు తమ జీవితంలో ఏ రంగంమీదనైనా ఎత్తుగా నిలబడ గలిగిన కొద్దిమంది తెలుగు పెద్దలలో ఒకరు.

తిరుపతి వెంకటశాస్త్రిగారికి పద్యం వ్రాయనిరోజు దుర్దినంగా ఉండేదట. అలాగే బెజవాడ గోపాలరెడ్డిగారికి ఒక రచయితని కలుసుకోనిరోజు దుర్దినంగా తోస్తుంది. మానవ సంబంధాలకంటె మహనీయమైన జీవితపు విలువలు లేవని నమ్మే మనస్వి ఆయన. మన దేశంలో ఉన్న రచయితలను గురించి, కళాకారులను గురించి తెలుసుకోటానికీ, వారితో స్నేహం చేయటానికీ ఎప్పుడూ రెడ్డిగారు తహతహలాడుతూ ఉంటారు. అటు రవీంద్రనాథ టాగోరు నుండి నేటి యువ కవి దాకా దాదాపు నాలుగుతరాల రచయితలు వారికి పరిచయం. ఒకవిధంగా ఈ శతాబ్ది సాహిత్య చైతన్యమంతా రెడ్డిగారి స్నేహధారలో ప్రతిఫలించిందని

చెపితే ఆశ్చర్యం లేదు. విశేషించి తిరుపతి వెంకటకవుల నుంచి నేటి ప్రసిద్ధ కవులవరకూ ఏ కవియైనా తన జీవితచరిత్ర వ్రాసుకొంటే అందుట్లో బెజవాడ గోపాలరెడ్డిగారి ప్రసక్తిరాని ప్రధాన ఘట్టం కనీసం ఒకటైనా ఉండదని చెప్ప టానికి అనుమానం ఉండదు. సాహిత్యవనంలో పాదులు తీసి బోదెలు కట్టిన తోటమాలి డాక్టర్ రెడ్డిగారు.

భారతదేశ సమైక్యతను రాజకీయంగా, సాంఘికంగా, సాంస్కృతికంగా, సారస్వతంగా సంభావించిన భావుకులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు. వారు తెలుగువారుగా పుట్టినా ప్రాంతీయభావంతో ఎన్నడూ వ్యవహరించలేదు. ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రిగా బాధ్యతలు స్వీకరించినా, తెలుగువారంతా ఒక గొడుగు నీడలో కలిసి ఉండాలనే స్వప్నాన్ని కన్నారు తెలంగాణను స్నేహహస్తంతో ఆహ్వానించారు. తెలుగు సోదరులనందరినీ సమాదరించారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవతరించటానికి సూత్రధారులుగా కృషి చేశారు. ముక్కలైన తెలుగు గడ్డను ఒక్కటి చేసిన మహోంద్రోద్యమంలో గోపాలరెడ్డిగారు విజయసారథులు. అంతేకాదు, ఒక్కటైన రాష్ట్రం ముక్కలయ్యే ఉద్యమాలు ప్రజలను ఉద్రేకాలతో ఉర్రూతలూగించినప్పుడు కూడా దృఢ దీక్షతో రాష్ట్ర సమైక్యత కోసం కృషి చేసిన రాజకీయ నాయకుల్లో బెజవాడ గోపాలరెడ్డిగారు ముఖ్యులు. వారు గళ మెత్తి రాష్ట్ర సమైక్యతను సమర్థించారు; ఏ కలం సమైక్యతను ప్రబోధించినా దానిని సమ్మానించారు. ఆంధ్ర రాజకీయరంగంలో రచయితలు నా కుటుంబ సభ్యులని సగర్వంగా చెప్పుకుంటూ, శాసనసభల కెంత గౌరవం ఇస్తారో అంతటి గౌరవం సాహిత్య సభలకు గూడా కల్పిస్తూ తమ 'ఉభయకవిమిత్ర' భావాన్ని నిలుపుకొన్న అభినవ తిక్కన సోమయాజి డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు.

రెడ్డిగారికి గతం మీద ఎంత గౌరవమో, వర్తమానం మీద అంత విశ్వాసం; భవిష్యత్తుమీద అంతటి నమ్మకం. ఆయన చిన్నప్పటినుంచీ కవియే. అసలు ఆయన మాటలాడుతూంటేనే వచన కవితలాగా ఉంటుంది. అందంగా భావాన్ని చెప్పటం ఆయనకు అలవాటైపోయింది. అలంకారం లేకుండా అభివ్యక్తి ఆయననోట రాదు. ఆయన పుట్టుకతోనే పరిమళించిన సాహితీ పారిజాతం. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు దాదాపు డెబ్బైయేళ్ళవరకూ రవీంద్ర సాహిత్య సౌరభాలకు తెలుగు నీరాజనాలను సమర్పించారు. జీవితంలోని మార్మిక కళా సౌందర్యాన్ని మనసారా ఆరాధించారు. ఆ ప్రభావంలోనుంచి ఏడు పదుల

వయస్సులో బైటపడ్డారు. తెలుగులో సొంతగా కవితా ఖండికలను వ్రాయటం ప్రారంభించారు. అవి పుంఖానుపుంఖంగా సంపుటులుగా ఇప్పటికీ వెలువడు తున్నాయి. ఇంత కవిత్వం ఆయనలో ఇన్నాళ్ళుగా ఎలా దాగి ఉంది? ఎలా ఆగి ఉంది? అని ఆంధ్రలోకం ఆశ్చర్యాన్ని ప్రకటిస్తోంది. రెడ్డిగారిలా అంటారు దానికి సమాధానమా అన్నట్లు :

"జీవిత మాగాణంలో నాటిన అశ్రుబీజాలు
చిరునవ్వుల విత్తనాలు మొలిచేది ముదిమిలోనే!"

వయసంతా అనువాదంలోనే చెల్లిపోయింది. రవీంద్రుని ప్రభావం నుండి బయటపడే నాటికి అన్నాళ్ళుగా అంతరంగంలో దాచుకొన్న కన్నీళ్లూ, చిరు నవ్వులూ వృద్ధవృక్షానికి మొలిచిన చిగుళ్లలాగా కవితారక్తిమతో అవతరించాయి.

"నాది వృద్ధ వృక్షానికి చిగిర్చిన కిసలయాలు
హేమంతంలో పూచిన పుష్పకోరకాలు
సాహిత్యవనంలో వీనికి స్థానమున్నది
అదే నా ఓర్పు!
వానికి తగిన సౌరభాలు వాని కున్నవి!"

అని ఆత్మవిశ్వాసంతో చెప్పుకున్నారు రెడ్డిగారు.

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారి కవిత వాస్తవికతను మూలంగా బలంగా నిల్పుకొంటుంది. కథనాన్ని కాండంగా పెంచుకొంటుంది, ఉల్లేఖాన్ని కొమ్మ లుగా వ్యాపింపచేసుకొంటుంది; ఉక్తి వైభవాన్ని ఆకులుగా, చిగుళ్ళుగా అంద గించుకొంటుంది; అలంకార సౌకుమార్యాన్ని ప్రసూనాలుగా పొటమరింపచేసు కొంటుంది; 'స్వప్నీకరణ' సౌరభాన్ని నీరాజనంగా సమర్పిస్తుంది. వాస్తవికతను స్వప్నీకరించటం రెడ్డిగారి కవితలోని మార్మిక సత్యం.

"సత్యమును భావనాస్పర్శవేదితో స్పర్శించి
సువర్ణ కాంతుల చిందించుట
స్వప్నీకరణ మగునేమో!
మిథ్యను వేషభూషలతో అలంకరించుట కాదు"

అంటారు రెడ్డిగారు. వీరి మాటలు విన్నప్పుడు "Writing is nothing more than a guided dream" అన్న జార్జిలూయిస్ బోర్హెస్ జ్ఞాపకానికి వస్తాడు!

"వాస్తవాలు, స్తవాలు
వాస్తవాలు కాని కల్పనలు ఉండాలి
ఆభరణాలుగ కవితాసుందరికి.
కవితాసుందరి దిసగా ఎప్పుడూ ఉండదు
నగ్నత్వం సత్యానికే, కవితకు కాదు
అలంకారాలు, ఆభరణాలు మైపూతలు
అత్తర్లు, వేణీ వినోదాలు ఆ హేలావిలాసినికి.
కవిత సామాన్య కాదు, నెరజాణ!"

కవిత్వం గురించి రెడ్డిగారి భావా లిందులో వ్యక్తమౌతున్నాయి. కవితా సుందరికి విరుద్ధ విషయాలను అలంకారాలుగా పేర్కొనటం ఇందులోని విశేషం. వైరుద్ధ్యాల వైరుద్ధ్యాన్ని వైదొలగించటమే రెడ్డిగారి కవితావైభవం!

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు ఆధునికాంధ్ర కవితా వికాసంలో కాలోచితంగా రెండు పాత్రలను నిర్వహించారు. రవీంద్ర సాహిత్యంలోని మార్మికతా సౌందర్యాన్ని తెలుగులో పండించిన కవులలో రెడ్డిగారు ప్రముఖులు. "రవీంద్రుని భావాలు పదాల కూర్పు నన్ను ఆకర్షిస్తాయి. మాతృకకు అతి సన్నిహితమైన అనువాదాలు నావి....వంగ సాహిత్య సముద్రములో దాగి, ఆంధ్రులకు అంద కుండిన రవీంద్ర కవితా ముత్యములను కొన్నిటిని బయటకు తే ప్రయత్నించితిని. తెచ్చుటలో అవి కొన్ని దెబ్బలు తినియుండవచ్చును. గీతలు పడియుండ వచ్చును. చిల్లులు పడియుండవచ్చును" అని సవినయంగా చెప్పుకొంటూనే ''అవన్నియు నా ప్రయత్నమునకు వన్నెలు'' అని ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించారు. తెలుగులోకి వచ్చిన వంగ సాహిత్యాన్ని సమీక్షించేటప్పుడు గోపాల రెడ్డిగారికి ప్రత్యేకంగా ఒక అధ్యాయాన్ని కేటాయించక తప్పదు. అది చిన్న విషయం కూడా కాదు.

రెండవ పాత్రను వారు వచన కవిగా 1978 నుండి సృష్టించిన సాహిత్యం వ్యక్తీకరిస్తుంది. అందులోని 'ఆమె పంచకం' పారశీక కవితా మార్మిక మధుర పవనాలను తెచ్చి, తెలుగుసీమలో తొలకరి జల్లులను కురిపించింది. వారి దీర్ఘ కవితలు వారి భావాల ఆత్మకథ. గాలిబ్, ఇగ్బాల్ కవితలు వారి మెరుపు

కవితలకు మేలిమి పంక్తులు. విశేషమేమంటే - బెజవాడ గోపాలరెడ్డిగారు "నేను విశ్వభారతివాడిని; ఏ తెలుగునాటికో, నెల్లూరు సీమకో అంటిస్తే, ఇరికిస్తే ఎలా?" అంటూ, ''నాది విశ్వభారత దృష్టి, భారతీయాభిమానము" అని ప్రకటించారు. వారి ఆశయం వారి కవితలో ప్రతిఫలిస్తుంది. దేశమంతా చూస్తున్న కవి తెలుగులో పలికినట్లుంటుంది.

తెలుగులో వచనకవితా ధోరణులను సమీక్షించేటప్పుడు ఇరవయ్యోశతాబ్ది ఉత్తరార్ధంలో డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు తెచ్చిన మార్మిక ధోరణులను, కాల్పనిక ధోరణులను ప్రత్యేకించి పేర్కొనకుండా ఉండలేము.

"నేను ధనపాలుణ్ణి, రాజ్యపాలుణ్ణి
రాజ్యములేని భూపాలుణ్ణి
సాహిత్యమందిర ద్వారపాలుణ్ణి
హృదయమురళి మ్రోయించే గోపాలుణ్ణి'' అని అన్నప్పుడూ

''నా పాత్రను నేను నిర్వహించాను
చిత్తశుద్ధితోనే పీరజీవితాన్ని గడిపాను"— అని ప్రకటించినప్పుడూ

మనం ఆ మాటలను కాదనలేం. సాహిత్యమందిరానికి మురళి వాయించే గోపాలుడు ద్వారపాలుడు కావటం ఆంధ్రుల అదృష్టం ఆ అదృష్టానికి అందించిన అభినందనమే రాజాలక్ష్మి ఫౌండేషన్ అవార్డు. *

**[1989 నవంబరు 19వ తేదీన మద్రాసులో రాజాలక్ష్మి ఫౌండేషన్ అవార్డును అందుకొంటున్న గోపాలరెడ్డి గారిని అభినందిస్తూ ఆంధ్రజ్యోతిలో ప్రచురించిన వ్యాసం.]**

# బొమ్మలు కట్టే మాటల శిల్పి భుజంగరాయశర్మ

మాటలతో బొమ్మలు కట్టే మధుర సాహిత్యవిమర్శకులు ఏ సాహిత్యంలోనైనా నూటికి కోటికి ఏ ఒక్కరో ఉంటారు. సమకాలీన సాహితీ రంగంలో అటువంటి విశిష్ట వ్యక్తి డాక్టర్ ఎస్వీ. భుజంగరాయశర్మ.

దాదాపు పదిహేనేళ్ళ క్రితం అనుకుంటాను - కావలి శ్రీ సత్యసాయి సేవా సమితివారు రామాయణం మీద సప్తాహం చేశారు. సమితి అధ్యక్షులు శ్రీ ఎ. శ్రీనివాసరావుగారు నన్ను 'భరతభక్తి'మీద ఒకనాడు ఉపన్యసించుమని కోరారు. నెల్లూరి జిల్లాలోని కావలి ప్రసిద్ధ సంస్కృతాంధ్ర పండితులకు, కవులకు, రచయితలకు స్థావరం కావటంచేత ఆ సాహితీమూర్తులను స్వయంగా చూచి వారితో మాట్లాడే అదృష్టం కూడా కలుగుతుందని ఆసక్తితో వెళ్ళాను. నా ఉపన్యాస సభకు కొందరు సాహితీమూర్తులు వచ్చారు. వారందరిలో ఎత్తైనవారు, ఆకర్షణీయమైన మూర్తిగలవారూ, మల్లెపూల్లాంటి తెల్లని బట్టల్లో మానవత మందహాసంతో పలకరిస్తున్నట్లుండేవారు, సాహిత్య రసికత్వం సాకారంగా ప్రత్యక్షమైనట్లు ఒక అవ్యక్త స్నేహసూత్రంతో మన హృదయాలను ప్రసన్నం చేసేవారూ అయిన ఒక స్ఫురద్రూపి నా దృష్టిని ఆకట్టుకున్నారు. ఉపన్యాసం ముగిసిన తరువాత ఆప్యాయంగా దగ్గరికి వచ్చి భరతుని భక్తిమార్గాన్ని గురించి నేను చెప్పిన అన్వయానికి ఆమోదాన్నీ, ఆనందాన్నీ ప్రకటించి అభినందించారు. పదహారో శతాబ్దపు ఒక ప్రబంధ నాయకుడు ఇరవయ్యో శతాబ్దంలో ఆధునిక వేషంలో నాతో మాట్లాడుతున్న అనుభూతిని పొందాను. ఆ మూర్తిమత్వం డా॥ ఎస్వీ. భుజంగరాయశర్మగారిది.

అలాగే మరొకసారి మహాభారతంలో భీమపాత్ర చిత్రణంమీద శ్రీ సత్యసాయి సేవాసమితి వేదికమీదనే ఉపన్యసించాను. ఆ రోజూ వారు మిత్రులతో సహా వచ్చారు. పాండవులలో ధర్మజుడు సంస్కారరూపుడనీ,భీముడు హృదయస్థానీయుడనీ, అర్జునుడు బుద్ధిశక్తివంటివాడనీ, నకుల సహదేవులు జ్ఞాన కర్మేం

ద్రియాలవంటివారనీ, ద్రౌపది అహంకారానికి ప్రతీక అనీ అన్వయించి ఆనాడు చెప్పాను. ఆప్యాయతకు, అనురాగానికి, ఆగ్రహానికి, అనుగ్రహానికి అచ్చమైన హృదయస్పందన భీముని జీవితంలో చవి చూడవచ్చునని సోదాహరణంగా వివరించాను. ఆనాడు కూడా డా॥ ఎస్వీ. భుజంగరాయశర్మగారు నేనిచ్చిన అన్వయానికి ఎంతో ఆనందాన్ని ప్రకటించారు. ఆ తరువాత ఎందరో మిత్రులకు నన్ను గురించి ఎన్నో మంచి మాటలు చెప్పారట. డాక్టర్ సుబ్బారాయుడు గారూ, శ్రీనివాసరావుగారూ, ఆచార్య వి. రామకృష్ణగారూ నాతో సందర్భవశాన చెప్పారు-భుజంగరాయశర్మగారు నన్ను గురించి ఎలా బొమ్మకట్టేటట్లు చెప్పారో. కృతజ్ఞుణ్ణి. అది శర్మగారికి సహజగుణమేకాక సాహిత్యశిల్పగుణం కూడా!

అందంగా ఒక కథను చెబుతున్నట్లు, ఒక అనుభూతికి ఆకృతి దిద్దుతున్నట్లు; సాహిత్యంలో రసమాధుర్యాన్ని వడియగట్టి పాత్రలతో అందిస్తున్నట్లు మనకు తెలియకుండానే మనచేత వినిపిస్తున్నట్లు, తనవెంట నడిపించుకొని పోతున్నట్లు సాహిత్య విమర్శను రూపొందించగలిగిన శిల్పం డాక్టర్ భుజంగరాయశర్మ గారికి బాగా తెలుసు ఒక్కొక్క వ్యాసం ఒక్కొక్క ఖండకావ్యం, ఒక్కొక్క పదకవిత చదివిన మధురానుభూతిని కలిగిస్తుంది. విమర్శను కవిత్వంలాగా వ్యక్తీకరించే సాహిత్యశిల్పం శర్మగారి రచనకు సహజంగా సమకూరిన జీవలక్షణం!

ఈ అనుభూతిని పొందాలంటే వారి 'దీపమాలిక' (రేడియో ప్రసంగ వ్యాసాల సంపుటం) ను చదివితే చాలు. అందులో పద్దెనిమిది వ్యాసాలున్నాయి. ఒక్కొక్కటి ఒక్కొక్క రంగుల చిత్రం; ఒక్కొక్క రమణీయ రచన. మధురమైన కథనం. ఒక రచనను చదివినప్పుడు శర్మగారు చేసిన ఆలోచన, పొందిన అనుభూతి, సాగించిన భావన అనే మూడు స్రవంతులు ఒక్కొక్క సమీక్షలో. సంగమించి సమ్మోహనంగా లాస్యం చేస్తాయి. వైయక్తికంగా విమర్శకుడు పొందిన సాహిత్యానుభూతిని సార్వజనీనంగా, సార్వకాలీనంగా చేసే లక్షణాన్ని సాధారణీకరణంగా పేర్కొన్నారు శర్మగారు. అదే సాహిత్యశిల్పానికి ప్రాణంగా నిర్దేశించారు (దీపమాలిక - పు. 84). ఆలోచనలోంచి, అనుభూతిలోంచి, భావనలోంచి సాధారణీకరణం సంపన్నమౌతుంది. అలా కావటానికి మొదట రచన రమణీయంగా ఉండాలి. శర్మగారి రచన ఆలోచనామృతం ఆపాతమధురంగా అనుభవానికి అందుకున్నట్లు రస్యమాన రామణీయకత్వాన్ని ప్రదర్శిస్తుంది.

ఒక కావ్య ఘట్టం చదివితే ఎలా ఆలోచించాలి? అనే మార్గానికి మరుపు రాని ఉదాహరణలు కొన్ని ఉన్నాయి శర్మగారి వ్యాసాల్లో. అందులో 'శాకుంతల ప్రతిభాంకం' ముందుగా చెప్పుకోతగింది. లోకంలో - కావ్యేషు నాటకం రమ్యమ్, నాటకేషు శకున్తలా, తత్రాపి చతుర్థోఽంకః, తత్ర శ్లోక చతుష్టయమ్' అన్న శ్లోకం ప్రతీతి. శర్మగారి వ్యాసం చదివి, వారి ఆలోచనలతో కలిసి సాగింతరు వాత వారి కనిపించిన శ్లోకమే మనకూ అవుననిపిస్తుంది.

''కావ్యేషు నాటకం రమ్యం
నాటకేషు శకున్తలా
తత్రాపి పంచమోఽంకశ్చ
తత్రైకః శ్లోక ఉత్తమః''.

అలాగే 'నన్నయగారి నాటకీయత' నాణెమైన వ్యాసం. సాధారణంగా తిక్కన కవితలో నాటకీయ శిల్పాన్ని, నన్నయకవితలో కథాకథన శిల్పాన్నీ విమర్శకులు వివేచిస్తూ ఉంటారు శర్మగారు ''కుమారాస్త్ర విద్యాప్రదర్శన ఘట్టం చదువుతోంటే కర్ణుడు రంగమధ్యాన్న ప్రవేశించినట్లు కనబడదు నాకు; నాటకీయశిల్పం ఆంధ్రవాఙ్మయంలో అడుగుపెట్టినట్లు తోస్తుంది" అని వ్యాఖ్యానించారు. నన్నయ నాటకీయతను శిశుపాల వధ ఘట్టంలో నేను చూపితే, శర్మగారు కుమారాస్త్ర విద్యాప్రదర్శన ఘట్టంలో ప్రదర్శించారు. నాటకీయతకు తెలుగులో నన్నయయే ఆద్యప్రయోక్తగా ఇప్పుడు విస్తృతంగా పరిశోధన సాగుతోంది.

కావ్యనాటకాలలోని పాత్రపోషణను పరిశీలించటంలో ఒక అనుభూతిని ఆవిష్కరించినట్లు అనుశీలించటం శర్మగారి మరో ప్రత్యేకత. 'ఒకే ఒక్కరాధ', 'అల్లసాని వరూధిని', 'సౌందరనంద సుందరి', 'విధివంచిత ద్రౌపది','తెలుగింటి సత్యభామ', 'సాహిత్యోర్వశి' అనే వ్యాసాలు ఆ ప్రత్యేకతను ప్రత్యక్షరం చాటుతున్నాయి. "అల్లసాని పెద్దన సృజించిన వరూధిని ఒక తీయని దిగులు, ఒక చెరగని కల, ఒక సుఖమైన వేదన. వరూధిని నిజానికి ఒక పాత్ర కాదు, ఒక అనుభూతి" (పు. 75). ఇలా విలువ కడతారు శర్మగారు అనుభూతి ప్రమాణాలతో.

ఆలోచన శిల్పం ఒక క్రొత్త సత్యాన్ని మన మనోనేత్రంతో దర్శింప చేయిస్తుంది. అనుభూతిశిల్పం ఒక నవ్యవివేచనతో నవీనరుచిని హృదయజిహ్వకు

అందింపచేస్తుంది. మూడవది - భావనాశిల్పం. కావ్యంలోగానీ, ఘట్టంలోగానీ, పాత్రాదుల్లోగాని కవి గీచిన బొమ్మలను సాక్షాత్కరింప చేసుకొనటానికి సహృదయ విమర్శకుడు ప్రదర్శించే భావనాశక్తిని వాఙ్మయచిత్రంగా రూపొందించటం భావనా శిల్పం. 'తిక్కన్నగారివి సూర్యోదయాలు రెండు', 'కాళిదాస మాళవిక', 'నాకు నచ్చిన కావ్యాల్లో శ్రీకాళహస్తి మాహాత్మ్యం ఒకటి', 'భీమేశ్వరపురాణంలో శ్రీనాథుడు', 'సౌప్తికవిషాదం', 'నిత్యపథికులు కృష్ణశాస్త్రిగారు' "కవితా వాల్మీకం' మొదలైన వ్యాసాలు భావశిల్పానికి బంగారు మెరుగులు. ఇవన్నీ ఒక యెత్తు - 'యెంకితో మధురవాణిని' కలిపిన సన్నివేశం చిత్రించిన వ్యాసం ఒక్కటీ ఒక యెత్తు. తెలుగు సాహిత్యంతో కలకాలం నిలిచే కల్పనా కళాఖండం. శర్మగారి ఆలోచనలు, అనుభూతులు, భావనలు విశ్వజనీనంగా ఆస్వాదింపబడటానికి వారి రమణీయమైన అభివ్యక్తి శిల్పమర్యాదగా తోడ్పడింది.

రాళ్ళపల్లివారి లాగా శర్మగారు గూడా కవిత్వంలో వస్తువూ, భావం, రచనా అనే మూడంగాలకు ప్రాధాన్యాన్ని గుర్తించారు. విమర్శలోకూడా వాటికి తావు కల్పించారు. తెలుగులో కవితలాంటి విమర్శ రాసేవారు ముగ్గురు-రాళ్ళపల్లి, కృష్ణశాస్త్రి, భుజంగరాయశర్మ. రచనలో వస్తువునూ భావాన్నీ రంగరించి రుచి చూపించేవారు రాళ్ళపల్లివారు; రచన భావాన్ని పూయించినట్లూ, భావం వస్తువును పండించినట్లూ రచనను పరిమళింపజేసేవారు కృష్ణశాస్త్రిగారు; వస్తువును అనుభవంగా మార్చటానికి రచనను ఆల్కెమీగా వాడుకొని, అనుభవాన్ని భావ చిత్రాలుగా ప్రదర్శించేవారు భుజంగరాయశర్మ గారు. ముగ్గురూ మాటలతో బొమ్మలు కట్టేవారే. రాళ్ళపల్లివారి మాటల బొమ్మలు గడుసుగా వ్యాఖ్యానిస్తాయి; కృష్ణశాస్త్రి గారివి నిపుణంగా అభినయిస్తాయి; భుజంగరాయశర్మ గారి మాటల బొమ్మలు అనుభూతితో ద్రవిస్తాయి. మూడూ మూడురకాల వాఙ్మయచిత్రాలు!*

(ఆంధ్రభూమి, 27-8-1993)

# కన్నీటికి బంధువు కాళోజీ కవిత

కాళోజీకి 'పద్మవిభూషణ్' పురస్కారం ప్రకటించారని వినంగానే వెంటనే ఆనందంతో కళ్ళెంబడి నీళ్ళొచ్చేశాయి. రెండు మూడు నిమిషాలలో నిబ్బరించుకొన్న తరువాత ఎందు కిలా అయిపోయానా అని ఆలోచిస్తే నాకే తెలియకుండా నాలోని వాణి రెండు మూడు కారణాలు నిశ్శబ్దంగా పేర్కొంది.

'ప్రజాకవి' అని ఎందరినో పిలుస్తాంగాని ఆ పేరుకు తగ్గ కవితా చైతన్యం గల ప్రతిభామూర్తిని కాళోజీలోనే నేను సమకాలీన సాహిత్యంలో చూడ గలిగాను. అందువలన ఈ గౌరవం ఒక్క వ్యక్తికే కాకుండా ఒక అభివ్యక్తికి అందిస్తున్నట్లుగా నేను అనుభవించాను. ఇది మొదటి కారణం.

మనస్వీగా కాళోజీ చాలామంది హృదయాల్లో స్నిగ్ధంగా పొంగులు పోతుంటాడు. నా సాహిత్య జీవితంలో - సహృదయులు రసానందం పొందే లౌకిక సన్నివేశాలకు ప్రత్యక్ష ప్రమాణాలుగా నిలిచినవారిలో ముందుగా విశ్వనాథ సత్యనారాయణగారిని, తరువాత కాళోజీగారిని ఎప్పుడూ జ్ఞాపకం ఉంచుకుంటాను. గుండెను కదిలించే ఒక మంచి కవితా వాక్యం వినపడితే చాలు- విశ్వనాథా, కాళోజీ వెంటనే గుండె కరిగిన అనుభవాన్నిపొంది, కన్నీటిజాలుతో ఆర్ద్రులై, రసానుభవాన్ని జీవితానుభవంలో ప్రకటించేవారు. కాళోజీ కళ్ళు చెమ్మగిల్లాయంటే మానవతకు ఎక్కడో అన్యాయం జరిగిన వార్త వినపడి ఉండి ఉండాలి, లేదా, ప్రక్కనున్న మిత్రుని నోట ఒక మనసున్న మాట మర్మం లేకుండా వెలువడి ఉండి ఉండాలి. లేదా, ఒక మంచి కవిత వినటమో, మననం చేయటమో జరిగి ఉండి ఉండాలి. చిరుగాలికి కూడా స్పందించే శ్రుతిపెట్టిన వీణ కాళోజీ. మనస్వితకిచ్చిన మర్యాదగా పురస్కారాన్ని భావించి మనసులో మురిసిపోయాను. ఇది రెండో కారణం.

కాళోజీ అనంగానే తెలుగుసాహితీ లోకంలో వినపడేది వారి కవితకు వారు పెట్టుకొన్న పేరు- 'నా గొడవ.' ఆ పేరుతో ఎనిమిది సంపుటాల కవితను వెలువరించా రాయన.

"అన్యాయా న్నెదిరిస్తే, నా గొడవకు సంతృప్తి
అన్యాయం అంతరిస్తే, నా గొడవకు సమాప్తి"

అంటా రాయన. అన్యాయాన్ని ఇంకా ఆయన ఎదురిస్తూనే ఉన్నారు కాబట్టి 'నా గొడవ'కు కొంత సంతృప్తి కలుగుతున్నదేమోకాని సమాప్తిమాత్రం ఉండటానికి వీలులేదు, సమాప్తి లేని 'నా గొడవకు' సత్కారం ఈ పురస్కారం. ఇది మూడో కారణం.

ప్రజల వాడుకలో ఉన్న పదాల బలాలను తెలిసి వాటిని సాహిత్యంలో ప్రాణప్రతిష్ఠ చేయటం, ప్రచారానికి తేవటం కాళోజీ గళంలో ఉన్న జీవశక్తి. లేకపోతే వాడుకలో ఉన్న 'గొడవ' అనే పదానికి గోల, గోడు, లొల్లి, గలబా, కలత, కల్లోలం, తగాదా, మొర మొదలైన ఎన్నో అర్థాలు ఉన్నాయి. కాని, కాళోజీ 'గొడవ'ను ఉద్యమం అనే అర్థంలో, అసమ్మతిని వ్యక్తంచేసే అలజడి, తిరుగుబాటు ధోరణి అనే భావంలో ప్రయోగించి, దానికి ఒక గౌరవాన్ని కలిగించారు. సాహితీలోకంలో విశ్వనాథవారి 'జీవుని వేదన'కు తాత్త్వికంగా ఎంత గౌరవం ఉందో, కాళోజీగారి 'నా గొడవకు' యౌగికంగా అంత సార్థక్యం ఉంది. ఆ గొడవ ఒక్క కాళోజీది కాదు- అన్యాయాన్ని ఎదిరించే అందరిదీ. ఆ మాటకొస్తే ఈ యుగ ప్రజాప్రవృత్తిది.

చాలామంది కవులు నిజం చెపుతున్నా నిజాయితీతో చెపుతున్నట్లు వినేవాడికి అనిపించదు. కవితామయంగా చెపుతున్నా విశ్వసించి చెపుతున్నట్లనిపించదు కొందరి వాక్కు. సూటిగా, సూక్తిగా చెప్పేవారు చాలమంది ఉన్నారు కాని, మొగంమీద నిలవదీసి నిజాన్ని నిరూపిస్తున్నట్లుగా చెప్పగలిగినవాళ్ళు కొద్దిమందే. అలా అరుదుగా కనపడే కవులలో కాళోజీ మండుతున్న కాగడాలా మనమధ్య తిరుగుతూ వెలుగులు చిమ్ముతూనే ఉన్నాడు.

నాకు కాళోజీతో పరిచయం 1958 నుండి. ఆ యేడే నేను హనుమకొండ ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాలలో ఆంధ్రోపన్యాసకుడుగా నియుక్తుణ్ణయ్యాను. అప్పటికే అక్కడ మిత్రులు ఇరివెంటి కృష్ణమూర్తిగారున్నారు. ఆయన తెలుగు సాహితీమూర్తుల తలలో నాల్కలాగా మసలుతున్నారు. నన్నూ అందరితో పరిచయం చేశారు. ఇరివెంటి వారిలో అప్పటికే ఒక ప్రభావాన్ని గమనించాను నేను. ఆయన మాట్లాడుతుంటే కాళోజీ మాటల కవళికలు వినవస్తుండేవి. అధిక్షేపిస్తున్నప్పుడు, ప్రశ్నిస్తున్నప్పుడు బాగా ప్రకటితమౌతుండేవి. తరువాత

అవి క్రమంగా వారి ఉపన్యాస వైఖరిలో తరంగాలుగా మారిపోయాయి. కాళోజీ మాటలు, మాటలతీరు పంచుకొన్న మిత్రులు మరెందరో ఉన్నారు. కాళోజీ తన కవితలతో లోకాన్ని కదిలిస్తారు, కరిగిస్తారు

వరంగల్ కాలేజీలో పనిచేసిన నాలుగైదేళ్ళ కాలం (1958-62) నా జీవితంలో ఎప్పుడూ మరువలేనిది. ఆత్మీయులైన మిత్రులు ఆ కాలంలోనే చేరువయ్యారు. వరంగల్ గడ్డకు అదొక శక్తి ఉంది. అక్కడ ఉన్నన్నినాళ్ళూ పౌరుషం పోరాటం ఒక శ్వాసకోశంగా, ఆత్మీయతా స్నేహం మరో శ్వాస కోశంగా ఉన్నట్లుండేవి. ఎలాగంటే- అక్కడ ఉన్నప్పుడే తెలుగు సాహిత్యంలో వీరరస పోషణంమీద గ్రంథం రాసి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి పోటీ బహుమతిని గెలుచుకొన్నాను. మిత్రులందరూ నన్ను వీరరసం సుబ్రహ్మణ్యమని పిలుస్తూండేవారు. ఓరుగల్లు వీరగడ్డగా నాకు వరం ఇచ్చింది.

మరొకవైపు మిత్రమండలి సాహితీ సమావేశాల్లో పాల్గొనే అవకాశం దొరికింది. వారం వారం జరిగే ఆ సమావేశాలు రాత్రి ఏ తొమ్మిదింటికో మొదలై ఒక్కోసారి ముగిసేసరికి తెల్లవారుతూ ఉండేది. కాళోజీ సోదరులతో పాటు వరంగల్లు, హనుమకొండలలో ఉన్న కవులూ, రచయితలూ చాలామంది పాల్గొంటుండేవారు. ఇరివెంటి కృష్ణమూర్తిగారూ, నేనూ తప్పకుండా వెళ్ళేవాళ్ళం. అప్పుడు విద్యార్థులుగా ఉండి రచనలు చేస్తున్న వరవరరావు, రాఘవాచారి, వీరభద్రయ్య, నవీన్ మొదలైన మిత్రులు కూడా పాల్గొనేవారు. ఆ సమావేశాలను గురించి తలచుకుంటే యిప్పటికీ వొళ్ళు పులకిస్తుంది. అది రచయితల సమ్మేళనమే కాదు; ఒక శిక్షణ శిబిరం, ఒక చర్చావేదిక, సాహితీవ్యక్తిత్వాలను దిద్ది తీర్చిన ఒక శిల్ప మందిరం. ఆ సమావేశాల్లో కాళోజీ పెద్దవాళ్ళలో పెద్దవాడుగా చిన్నవాళ్ళలో చిన్నవాడుగా ఉంటూ మొగ్గదొడుగుతున్న సాహితీ వ్యక్తిత్వాలకు ఆవగాహననూ, అభివ్యక్తినీ పెంచుకొనే కవితా గోష్ఠుల నందించేవారు. మా అదృష్టం కాళోజీ సోదరుల కవిత్వం ఒకే వేదికమీద వినగలగటం. కాళోజీ రామేశ్వరరావుగారి హిందీ, ఉరుదూ కవితలు చదువుతున్నప్పుడు విరిపొట్లాలు విప్పినట్లుండేది. కాళోజీ నారాయణరావుగారు 'నా గొడవ' చదువుతున్నపుడు చురకత్తులు విసరుతున్నట్లుండేది. ఓరుగల్లు గడ్డలోని సౌజన్యాన్నీ సాహసాన్నీ సమంగా పంచుకొని సాహిత్యంలో జీవింపచేసినవారు కాళోజీలు. మిత్రమండలిలో పాల్గొన్న మిత్రులందరూ ఆనాటి సాహిత్యాగ్నితో నేటికీ ఆరిపోని అగ్నిగోళాల్లా వెలుగుతూనే ఉన్నారు.

విద్యార్థులు ఆటోగ్రాఫు అడిగేటప్పుడు ఏదో సందేశం కూడా కోరుతూ ఉంటారు సామాన్యంగా అప్పుడు కాళోజీ కవితలు చప్పున జ్ఞాపకం వస్తూ వుంటాయి. చాలామంది యువతీయువకుల హృదయాల ఆటోగ్రాఫుల్లో కాళోజీ కవితలు ఇప్పటికే నిలిచి ఉన్నాయి. వాటన్నింటిలో చిరంజీవి, చిరస్మరణీయం-

"ఉదయం కానే కాదనుకోవటం నిరాశ
ఉదయించి అట్లాగే ఉండాలనుకోవటం దురాశ."

పాటలు రాయకుండా ప్రజాకవి అనిపించుకొన్నవాడు కాళోజీ. తాళబద్ధమైన పాటకంటె, లయబద్ధమైన మాటలోనే వచన కవిత వ్రాసిన కవి. మాటలు మాత్రలు లెక్కపెట్టుకొని మసలుతున్నట్లుగా వరుసలుగా, చరణాలుగా జాలువారుతుంటాయి. కాళోజీ కవిత్వం చదువుతుంటే కావ్యగానం చేస్తున్నట్లుండదు; కవి కంఠీరవం గర్జిస్తున్నట్లుండదు; కవికోకిల ఆలపిస్తున్నట్లుండదు; కాని, ఒక చైతన్యం చిత్తశుద్ధితో స్పందిస్తున్నట్లుంటుంది.

కాళోజీ రాజకీయాలతో రాచుకొని తిరుగుతున్నట్లు కనపడ్డా రాజకీయాలాడటం రాని సాదా సీదా కవి. రాజకీయ పార్టీలు ప్రజల కష్టాలను చూపించి ఒక్కొక్కసారి రాజకీయాలు ఆడవచ్చు; లాభాలు పొందవచ్చు. కాళోజీకి ఆ కళ తెలియదు. అందువలన సాహిత్యంలో నిబద్ధ రాజకీయ కవులలాగా కాళోజీ ఎప్పుడూ రచనలు సాగించలేదు. ప్రజల బాధలకు ప్రతిస్పందించి కవితలు రాశాడు. స్పందన కొన్ని సిద్ధాంతాల కనుగుణంగానే ఉండాలన్న రాద్ధాంతం ఆయనకు పట్టదు. కాని, కవిత ఆయన దృష్టిలో సమాజ చైతన్య సాధనం.

స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నా, నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా పోరాడినా, తెలంగాణా ఉద్యమంలో పాల్గొన్నా, అభ్యుదయ రచయితలతో కలిసి తిరిగినా, తెలంగాణా రచయితల సంఘంలో ఉద్యమించినా, విప్లవ రచయితలతో చేతులు కలిపినా, మరే వేదిక మీద నిలిచి వాదించినా కాళోజీ నిబద్ధ రాజకీయ సిద్ధాంతిగా కాకుండా నిర్మల మానవతావాదిగా గోచరిస్తాడు. కాళోజీ కవితకు రంగులేదు కాని, పొంగు ఉంది; రుచికంటె శుచి ఎక్కువగా ఉంటుంది.

తెలంగాణలోని ప్రజా పోరాటాలతోపాటు, ప్రజా సంస్థలతో కాళోజీకి సన్నిహిత సంబంధాలున్నాయి. అందరూ ఆయన్ను 'అన్నా!' అనీ, 'కాళన్నా!' అనీ ఆప్యాయంగా పిలుచుకొంటారు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయం

వారు 1974 లో కాళోజీ షష్టిపూర్తి సన్మాన సంచికను వెలువరించారు (27-11-1974). దాని పేరు - "అరవై యేళ్ళ యోధుడు కాళోజీ" సమకాలీన కవులెందరో అందులో కాళోజీని ప్రశంసించారు దాశరథి మాటల్లో—

"కాళన్న మాటలో కత్తిలేదు
వేమన్న పలుకులో వెలితిలేదు
వారిది పదాడంబర పీతాంబరాలు కట్టని కవిత
వారు ఆరాధించింది నిజమైన జనత."

నేటి భారత ప్రధాని మాన్యశ్రీ పి వి. నరసింహారావుగారు నాడు కాళోజీ కిచ్చిన కవితా శుభాకాంక్షలు—

"నోటి కస్సుబుస్సులకు, కన్నీటి వింత జతకూర్చుచు
అంతరంగ నవనీతము, ననారతము పంచియిమ్ము."

నేటికీ యువతరం కాళోజీని కీర్తిస్తున్నది. మచ్చుకు డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్య రుబాయీలలో—

"అర్ధ9త కొక సింధువు నీ నిర్మలచిత్తం,
కన్నీటికి బంధువు నీ జీవనవృత్తం
విశ్వానికి వినిపించిన 'నా గొడవ'లో,
మహాకవీ! మానవత్వ మితివృత్తం."

*

(ఉదయం 9-2-1992)

# లలితసాహిత్య విమర్శకుడు సంజీవదేవ్

సాహిత్య కళావిమర్శలో లలిత కళా దర్శనాన్ని సమన్వయించి ఒక నవ్యమార్గాన్ని నిర్మించే సృజనాత్మక విమర్శకులు తెలుగులో వేళ్ళమీద లెక్క పెట్టగలిగినంతమంది మాత్రమే ఉన్నారు. ఇప్పుడున్నవారిలో డాక్టర్ సంజీవదేవ్ గారు సమున్నతులు, కనిష్ఠికాధిష్ఠితులు.

తెలుగులో కట్టమంచి, విశ్వనాథ మొదలైనవారు సాహిత్యశాస్త్ర మర్యాదలను కావ్యానుశీలనంలో ప్రపంచించి సాహిత్యవిమర్శను ఒక సాహిత్య ప్రస్థానంగా సాగించారు. రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు, పుట్టపర్తి నారాయణాచార్యుల వారు సంగీత శాస్త్ర మర్యాదలను, తులనాత్మక అధ్యయన సూత్రాలను విశిష్టంగా విమర్శలో మేళవించి క్రొత్తరుచులను సృష్టించారు. శిల్ప శాస్త్ర మర్యాదలను సౌందర్య శాస్త్ర సూత్రాలతో కలిపి విమర్శ వివేకాన్ని వికసింపచేశారు, చేస్తున్నారు కొండూరు వీరరాఘవాచార్యులుగారు. అలాగే చిత్రకళాశాస్త్ర మర్మాలను సాహిత్య కళానుశీలనంలో ప్రదర్శించే ఒక ప్రత్యేకమైన బాణీని ఏర్పాటు చేసుకొని, దానికి తామే ఆచార్యులై, మార్గ ప్రవర్తకులై డాక్టర్ సంజీవదేవ్‌గారు తమ విశిష్టతను నిలువబెట్టుకొంటున్నారు.

రచనను ఒక సమగ్ర కళాఖండంగా ఒక సమగ్ర దృక్పథంతో చూచి, వివేచించి, అనుభవించే ప్రవృత్తిని ప్రధానంగా ప్రదర్శిస్తారు డాక్టర్ సంజీవదేవ్ గారు. సాహిత్యంలోని వర్ణశబ్దార్థ సంయోజనం వారిలో వివిధ వర్ణ సంయోజనం వలన చిత్రకళలో కలిగే బింబభావనాన్ని జాగృతం చేస్తుంది. చిత్రకారుని కళా దర్శనంతో సాహితీ జగత్తును వివేచించే ఒక విమర్శ మార్గం వారిలోనుండి ఉప్పొంగి వస్తుంది. పీఠిక రాసినా, వ్యాసం రచించినా, సమీక్ష చేసినా వారి మాటల్లో వారి బాట చక్కగా కనపడుతుంది; వినపడుతుంది. ఆయన కుంచె పట్టిన కవి, కలం పట్టిన చిత్రకారుడు.

డాక్టర్ సంజీవదేవ్ వ్యాసాలు రాశారు. పీఠికలు రాశారు, లేఖా సాహిత్యం వెలువరించారు. స్వీయచరిత్రను ఆవిష్కరించుకొన్నారు. కవితాసంపు

టిని ప్రకటించారు. రసరేఖలు, రూపారూపాలు, దీప్తిధార మొదలైన వ్యాస సంపుటాలు కళాసాహిత్య విమర్శ వీచికల్లా ప్రసిద్ధి చెందాయి. 'సమీక్షారేఖలు'లో కొన్ని పీఠికలు సంపుటీకరించబడ్డాయి. 'తెగిన జ్ఞాపకాలు', 'స్మృతిబింబాలు' 'గతంలోకి' - స్వీయచరిత్ర స్మృతులను చిత్రించిన వర్ణచిత్రాలు. 'తేజోరేఖలు' తెలుగులో వెలువడిన మ్యూజింగ్స్. 'తెల్లమబ్బులు' - వచన కవితా సంపుటి. 'బయోసింఫొనీ' ఇంగ్లీషులో జాలువారిన వారి తాత్త్విక చింతన. 'గ్రే అండ్ గ్రీన్' వారి ఆంగ్ల సూక్తిమౌక్తికం. 'బ్లూ బ్లూమ్స్,' 'దస్ట్ అండ్ మిస్ట్,' 'విభావ,' 'ఊదా మొగ్గలు,' 'పీఠికలు,' 'సజీవదేవవ్ వ్యక్తిత్వం - భావాలు' మొదలైన గ్రంథాలు వెలువడనున్నాయి. కళా-సాహిత్యరంగంలో ఒక స్వయం సమగ్రమైన వ్యక్తిత్వం సంజీవదేవ్‌గారిది.

నేనీ మధ్య డాక్టర్ టి. రామదాస్‌గారి కవితా సంపుటి 'అనుభూతి'ని చదువుతున్నప్పుడు డాక్టర్ సంజీవ్‌దేవ్‌గారి 'ఆలోచన' అనే శీర్షికతో ఉన్న పీఠికను ఆసక్తితో గమనించాను. 'అనుభూతి' కవితకు 'ఆలోచన' పీఠిక అని మనసులో మురిసిపోయాను. సంజీవదేవ్‌గారికి ఆలోచన అంటే ఎంతో అభిమానం. ఆలోచనకోసమే కళనుగాని, కవితనుగాని ఆలంబనగా ఎన్నుకొనే ప్రవృత్తి వారిది. వారే అన్నారిలా - 'బింబాలు' అన్న పీఠికలో—

"ఒక విషయంలోని సత్యాసత్యాలను తేల్చే నిమిత్తమై నేను ఆలోచనను సాధనగా తీసుకోను. ఆలోచించే నిమిత్తమయ్యే ఏదో విషయాన్ని సాకుగా తీసు కుంటాను. నాకు ఆలోచన నిమిత్తమే విషయం కాని, విషయం నిమిత్తం ఆలోచన కాదు. ప్రయాణం నిమిత్తం వాహనాన్ని ఎక్కటం కాక, వాహనాన్ని ఎక్కే నిమిత్తమే ప్రయాణం చేస్తాను. అయితే, నా ఆలోచనకు ప్రధాన లక్షణం విశ్లేషణ (Analysis) కాదు, సంశ్లేషణ (Synthesis) మాత్రమే. అంటే నా ఆలోచన ఎక్కువగా సమీక్షాత్మక ఆలోచన (Critical Thought) కాక, సృజనాత్మక ఆలోచనే (Creative Thought). అంటే, నా ఆలోచనలో లాజిక్ కంటే మ్యూజిక్ అధికం అని."

ఆలోచనను కూడా లయాత్మకంగా వ్యక్తీకరించటం సజీవదేవ్‌గారి ప్రత్యేకత! వీరు దాదాపు నాలుగు దశాబ్దాలుగా ఎన్నో పీఠికలు కూడా రాస్తు న్నారు. 1958 లోనే విశ్వకవి రవీంద్రుని గీతాంజలికి చలంగారు చేసిన తెలుగు అనువాదానికి వీరు అనుబంధ పీఠిక రాశారు. నాటినుండి నేటిదాకా అటు కవితా

రంగంలో, ఇటు విమర్శ పరిశోధన రంగాల్లో, కళారంగంలో, నవలారంగంలో ప్రసిద్ధులైనవారు డాక్టరు సంజీవదేవ్‌గారి చేత తమ తమ రచనలకు ముందు మాటలు వ్రాయించుకోవటం గమనిస్తే వారి కళాసౌందర్య దర్శనం మీద సాహిత్యలోకానికున్న గౌరవభావం వ్యక్తమౌతూవుంది. వీరిచేత పీఠికలు రాయించుకొన్నవారిలో శ్రీయుతులు చలం, కొండూరి వీరరాఘవాచార్యులు, ఆచ్యార యస్వీ జోగారావు, వేగుంట మోహనప్రసాద్, సామవేదం జానకిరామ శర్మ, కె. హనుమంతరావు, రంధి సోమరాజు, శిఖామణి, డా॥ జి.వి పూర్ణచందు, కరుటూరి సత్యనారాయణ, నాగభైరవ కోటేశ్వరరావు, ఆచార్య తిరుమల, డాక్టర్ టి. రామదాస్, బీరం సుందరరావు, శ్రీమతులు రేవతీదేవి, కె. రాధాదేవి, దివ్యజ్ఞాన సరోజినీదేవి, నేలనూతల పార్వతీకృష్ణమూర్తి, సి. వేదవతి, ఎస్. ఎస్. లక్ష్మి, మొదలైనవా రున్నారు. శ్రీయుతులు కొండపర్తి శేషగిరిరావు, అన్నప రెడ్డి వెంకటేశ్వరరెడ్డి, పోచిరాజు శేషగిరిరావు, గుంటువల్లి రామారావు లాంటి విమర్శకులు, డాక్టర్ కేశవరెడ్డిలాంటి నవలాకర్తలు, రావెల సాంబశివరావు లాంటి బాల సాహిత్య రచయితలూ సంజీవదేవ్‌గారి చేత ముందు మాటలు రాయించుకొన్నారు.

సంజీవదేవ్ గారు పద్య కావ్యాలకు రాసిన పీఠికలు రేఖాచిత్రాలుగా, సమీక్షలుగా ఉన్నాయి వచనకవితా సంపుటులకు రాసిన పీఠికలు వర్ణచిత్రాల్లా నిబిడంగా విమర్శ స్పృహతో కూడి ఉన్నాయి. ఒక్కొక్క కావ్యం, ఒక్కొక్క కవిత సంజీవదేవ్ గారి భావసమాధిని స్పందింపజేస్తుంది. దానికి ఆయన అనుస్పందించినట్లు, ప్రతిస్పందించినట్లు పీఠికలు రాశారు. కావ్యాలు నిమిత్తాలుగా సంజీవదేవ్ గారు దీర్ఘ స్వగతాలు పలుకుతున్నట్లుగా ఉంటాయి వారు రాసే ముందుమాటలు.

వాటిలో పంచకోశాత్మక ప్రవృత్తిలా అయిదు అవస్థలు గోచరిస్తాయి. ఆనందమయకోశం లాంటి అనుభూతిస్థితి, విజ్ఞానమయకోశం లాంటి శాస్త్ర వ్యుత్పత్తి, ప్రాణమయకోశం లాంటి కళాస్పందన ప్రవృత్తి, మనోమయకోశం లాంటి అనుశీలన వివేకం, అన్నమయకోశం లాంటి లోకజ్ఞత సంజీవదేవ్‌గారి విమర్శలో సంపుటీకరింపబడతాయి. ఈ అయిదింటినీ వేరు చేయటం కష్టం. కాని, అనుభవించటం సులభం. డాక్టర్ సంజీవదేవ్‌గారు అన్నమయకోశంలో కంటె ఆనందమయకోశంలోనే ఎక్కువగా ఉపజీవించే కళాతపస్వి. అందుకే ఆయన మాటలు వాక్కులలాగా వినపడే బుక్కులనిపిస్తాయి.

సంజీవదేవ్ గారి సాహిత్య విమర్శలో రెండు దశలను గమనించవచ్చు. ఆయన 1980 దాకా వ్రాసిన విమర్శలో కాల్పనిక భావుకత ఎక్కువగా కనపడుతుంది. ఆ తరువాతి విమర్శలో లలితకళా దర్శనంతో సాహిత్యానుశీలనం చేసే ప్రవృత్తి బలపడుతూ వచ్చింది.

విమర్శలో కాల్పనిక భావుకత రచనకొక కవితావిస్ఫూర్తిని కలిగిస్తుంది. కావ్యాన్ని చదివినప్పుడు విమర్శకుడు పొందిన అతీంద్రియానుభూతిని భావావేశంతోకూడిన ఒక కళాభివ్యక్తిద్వారా ప్రకటించాలనే ప్రయత్నం అందులో గాఢంగా గోచరిస్తుంది. తన అనుభవానికి తానే అభినవ ప్రమాణాలను సృష్టించి వాటిని లయాత్మకంగా నిర్మించాలనే ప్రవృత్తి ద్యోతకమౌతుంది.

చలంగారి గీతాంజలి అనువాదానికి 'అనుమేళన' రాస్తూ సంజీవదేవ్‌గారు ఇలా ప్రారంభించారు—

"మౌనం అభివ్యక్తమైతే భాష
భాష అవ్యక్తమైతే మౌనం
మౌనం భావానికి చెందింది
భాష రూపానికి చెందింది."

ఇది పద్యం కాదు, వచన కవిత కాదు. తన విమర్శకు లయాత్మకంగా సంజీవదేవ్‌గారు ఆలపించుకొన్న లక్షణసూక్తం పీఠికలో టాగూర్, చలం భాషాభివ్యక్తులను గురించి సమీక్షించటానికి ఈ సూక్తాన్ని ప్రాతిపదికగా చేసుకొన్నారు. దీనిని వివేచించటంలో సంజీవదేవ్‌గారు అనుభూతి విమర్శ ధోరణిని బలంగా వ్యక్తం చేసేవారు. అనుభూతి విమర్శ అంటే - విమర్శకుడు తాను అనుభవిస్తున్న కళానుభవాన్ని వచనంలో విశిష్టమైన అభివ్యక్తి ద్వారా పఠిత కూడా అనుభూతిని అలాగే పొందేటట్లు రచించే ఒక రచనాపద్ధతి. దీనిని సాధించటానికి సంజీవదేవ్‌గారు కాల్పనికభావుకతను శక్తిమంతమైన సాధనంగా వాడుకొంటారు.

డాక్టర్ సంజీవదేవ్‌గారు ఆధునిక వచన కావ్యాలకు పీఠికలు రాసినా, తెలుగు సాహిత్య వికాసంమీదగాని, కవులమీదగాని, ప్రయోగాలమీదగాని బలమైన ఆరోపణలుగాని, తీవ్రమైన విమర్శలుగాని, అధిక్షేపాలుగాని చేయలేదు. అందువలన వారి పీఠికలు కళాత్మకమైన విలువల వివేచనకు మాత్రం చలువ పందిళ్ళలాగా ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. కాని, ఆధునికాంధ్ర సాహిత్య ప్రయోగ చైతన్యంలో, ఉద్యమాల్లో, చర్చల్లో భాగం పంచుకుంటున్నట్లుండవు.

తెలుగులో సాహిత్య విమర్శకులు ప్రామాణికంగా పాటించే విశ్లేషణ విధానాన్నిగాని, విమర్శక సూత్రాలనుగానీ సంజీవదేవ్‌గారు సామాన్యంగా పాటించరు. చిత్రకళారంగంలోని వారి ఆలోచన ధోరణులను సాహిత్యానుశీలనం లోకి చొప్పిస్తారు. అంతేకాదు, సాహిత్యాన్ని తమ చూపుతోనే చూస్తారు. దీని వలన తెలుగు సాహిత్య విమర్శకు కొన్ని నవీన కళాప్రమాణాలు దొరికాయి. అయితే, అవి సాహిత్యక్షేత్రంలో ప్రాచుర్యం చెందాయా అన్నది వేరే ప్రశ్న.

'లలిత కళలు'లాగా 'లలిత సాహిత్యం' అని వారొక పదాన్ని కల్పించారు. ''అంటే-బాహ్యప్రయోజనాలకు తక్కువ స్థానం ఇచ్చి, మానవుని రసజగత్తుకు ఎక్కువ స్థానం ఇచ్చే రచనలు" లలిత సాహిత్యం అన్నారు. వారి మాటల్లోనే చెబితే లలితసాహిత్య విమర్శకుడు డాక్టర్ సంజీవదేవ్. *

(ఉదయం 2-2-1992)

# చేరాతలకు సెలవులు

వారం రోజుల క్రితం ఆచార్య చేకూరి రామారావుగారు మా యింటికేదో సందర్భంలో వచ్చారు. కాఫీ తాగుతూ కాసేపు పిచ్చాపాటీ మాట్లాడుకున్నాం. మా యిద్దరి స్నేహం యిప్పటిది కాదు. 1953-55 లో నిజాం కళాశాలలో నేను బి.ఏ., చదువుతున్నప్పుడేర్పడింది. అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పుడు మేం కలుసుకున్నా సాహిత్య విషయాలే మాట్లాడుకున్నాం గాని, చొల్లు కబుర్లు, లోకాభిరామాయణం మా మధ్య మసలేవికావు. మొన్న మాటల సందర్భంలో 'నేను చేరాతలు రాయటం ఆపేశాను' అని అన్నారు.

ఏవైనా కదిలించే విషయాలు చెపుతున్నప్పుడు చేరా ముఖంలో ఒక వింత కవళిక తళుక్కున మెరిసి, మరుక్షణంలో మాయమైపోతుంది. సామాన్యంగా మనిషి బయటపడరు ఆయన. కాని, బయటపడుతున్నానని అనిపిస్తే వెంటనే అదుపు చేసుకోగలరు. ఎనిమిదేళ్ళుగా ఎంతో ఆత్మీయంగా పెంచుకున్న 'పర్సనల్ కాలమ్'ను ఎందుకో ఆపివేయవలసి వస్తున్నందుకు ఆయన ఆర్ద్రులయ్యారు. చేరా ఆర్ద్రుడు కావటమంటే కంటతడిపెట్టటం కాదు. మనసులోని మాటను ఆప్యాయంగా చెప్పేటప్పుడు చేరా ఒక తరంగం లాగా కంపిస్తారు; తెలినురుగు లాంటి ఒక నవ్వు గాని నవ్వు కళ్ళజోడులో కుమ్మరిస్తారు. ఆ అభివ్యక్తిని అందించే సమయంలో చేరా అమాయకుడైన చిన్నపిల్లవాడులా కనపడతారు. ఆనాడు నిజాం కళాశాలలో తెలుగుశాఖ ముందున్న చింతచెట్టు కింద కూచోని కొత్తగా వచ్చిన భారతిలోని కవితలు చదువుకున్నప్పటినించీ నాకు వారి అభిరుచులు, అభిలాషలు తెలుసు. బైటపడకుండా తనను తాను చాలా భద్రంగా దాచుకొనే చేరా కొందరు మిత్రుల దగ్గరనే ఆర్ద్రులౌతారు. ఆ సన్నివేశం ఆ సమావేశానికి ఒక పతాక స్థానంగా మారుతుంది.

నాకు తెలుసు - చేరా వచన కవితలాగా, కాదు, మినీకవిత లాగా ఒక మాట అంటారు. ఆ తరువాత మన కళ్ళల్లోకి అదోరకం స్నేహజలపాతంలాగా

చూస్తారు. ఆ చూపులే చేరాతల కాలమంత వ్యాఖ్యానం చేస్తాయి. మేమిద్దరం ఒక నిమిషం ఒకరినొకరు చూచుకుంటూ అలాగే కూచున్నాం. కొన్నేళ్ళుగా ఆత్మీయంగా, ఆత్మాశ్రయంగా, ఆత్మనాయకంగా, ఆలోచనాత్మకంగా నడిపించిన 'కాలమ్' ఆపుతున్న ఆ రచయితలో ఒక తృప్తి ఉంది; ఒక అసంతృప్తి ఉంది. ఒక వియోగబాధ ఉంది; ఒక కర్తవ్యాన్ని నిర్వహించిన గాంభీర్యం ఉంది.

'మీకెలాగుందోగాని, చేరాతలు చదవకుండా ఆదివారం ఎలా గడపాలో మాకు తోచటం లేదు' అని నెమ్మదిగా అన్నాను. ఆప్యాయంగా ఎవరైనా పలికితే చేరా కళ్ళు వింతగా చికిలిస్తాయి. 'నేను సెప్టెంబరులో రిటైరై పోతున్నాను. ఆ లోపల చేయవలసిన పనులు చాలా ఉన్నాయి. వారం వారం చేరాతలకు కొన్నాళ్ళు కాలం వెచ్చించలేను. కనీసం ఒక అయిదారు నెలలపాటు నేను చేరాతల నుంచి సెలవు తీసుకుంటున్నాను. ఆ తరువాత ఆలోచిస్తాను' - అవి అన్నారు.

చేరాకు చేరాతల మీద ఆసక్తి పోలేదు. కొంత విశ్రాంతి కోరుతున్నారు, అంతే - అని అనుకుంటూ కొంత తెప్పరిల్లాను. చేరా వేదాంతిలా 'దేనికైనా ఒక ముగింపు తప్పదు. ఎనిమిదేళ్ళకు పైగా కాలమ్ నడిపాను. కొంతమంది యువ కవులను,కవయిత్రులను పరిచయం చేశాను; నాధోరణిలో కొన్ని విమర్శపద్ధతులు కొత్తగా ప్రవేశ పెట్టాను. ఇప్పుడు అంతగా కొత్తదనం కనపడటం లేదు కూడా కవులలో, రచయితలలో. కొన్నాళ్ళు విశ్రాంతి అవసరమే' అని అన్నారు. కొన్ని వాస్తవాలు చెప్పేటప్పుడు చేరా తమ చూపులను పావురాల్లాగా గాలిలో వదలుతారు. నిర్భయంగా నిజాన్ని చెప్పేటప్పుడు చేరాగారి పేటెంట్ అభినయమది. మరో చేరాతల కాలమ్ మాటలతో ముగించినట్లు రామారావుగారు నిలువునా లేచి నించున్నారు. ఒక మంచి కాలమ్ రాసింతరువాత రచయిత పొందే రిలీఫ్ ఏదో ఆయన ముఖంలో కనపడింది. ఒక మిత్రునితో ఆప్తవాక్యం మాట్లాడినప్పటి అనుభూతినీ, కాలమ్ రాసినప్పటికి తృప్తినీ లోతుగా పరిశీలిస్తే వేరువేరుగా గుర్తించవచ్చు. కాని, ఆనాడు నవ్వుతూ టాటా చెపుతూ కారెక్కిపోతున్న చేరా ఒక అద్వైతిలా అనిపించారు.

అందరితో పాటూ నేనూ ప్రతి అదివారం చేరాతలు చదివేవాణ్ణి. నాకు నచ్చిన వారం చేరాతల మీద రామారావుగారికి ఫోనుచేసి చెప్పేవాణ్ణి. మేమిద్దరం

స్నేహితులమే కాని, మా యిద్దరి అభిప్రాయాలూ, దృక్పథాలూ వేరు వేరు మార్గాలకు సంబంధించినవి. అయినా, కొన్ని సాహిత్యపు విలువల విషయంలో ఇద్దరికీ అంగీకారం కూడా ఉన్నది. ఏమైనా నేను ఆలంకారికమైన వచనరచన చేస్తాననే ఒక అభిప్రాయం వారికుంది. ఆ సందర్భం వచ్చినప్పుడెల్లా నా పేరు చేరాతల్లో ఉటంకిస్తూ వచ్చేవారు. అది వారి వ్యూహాల్లో ఒకటేమో నాకు తెలియదు కాని, నేను వారితో అంగీకరించని అంశాలు ఎన్నో ఉన్నాయి. మచ్చుకు నా 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు'లోని 'కాదనలేని వాస్తవం నవ్యసంప్రదాయోద్యమం' అనే వ్యాసం చాలనుకుంటాను. నచ్చని విషయాలు చెప్పుకొన్న తరువాత కూడా మేమిద్దరం కలిస్తే ఆత్మీయంగా పలకరించుకొనే స్వభావాలు మావి. ఒక్కమాట చెపితే చాలు - 'చేరాతలు' (1991) ముద్రిత ప్రతిని నాకు బహూకరిస్తూ 'చేరా' తన దస్తూరితో యిలా రాశారు: 'చాలా అవాంతరాలను అతిగమించిన మన మైత్రికి గుర్తుగా' అని. ఈ మాటలు మా స్నేహానికి చెరిగిపోని గుర్తులు. విమర్శను వ్యక్తిగతంగా కాకుండా, ఎకడ మిక్‌గా తీసుకునే సహృదయ స్పృహయే మా యిద్దరి స్నేహసూత్రంలోని బలం!

నేను 'ఆంధ్రభూమి'లో 'జీవియస్ కాలమ్' రాయటం మొదలుపెట్టిన తరువాత మా యిద్దరి నేస్తం మరో మారాకు వేసింది. నా కాలమ్ నచ్చినప్పుడెల్లా చేరా నాకు ఫోనుచేసి తమ సంతోషాన్ని తెలియపరుస్తూ ఉండేవారు. 'పింగళి వారి కళాపూర్ణోదయం' (ఆంధ్రభూమి : 21.1.1994) చదివి, చేరా అర్ధరాత్రైతే ఆ రాత్రి ఫోనులో మాట్లాడిన మాటలు మరిచిపోలేను: 'చిలకొల్కయ్య సాక్షిగా శిఖామణి పెళ్ళి' (18.2.1994) మీద విశాఖపట్నంలో 'మా అందరికంటే పెళ్ళికానుక ముందు పంపించి క్రెడిట్ కొట్టేశారు' అని అప్యాయంగా పలకరించిన జాడ ఎప్పటికీ వాడిపోదు. 'ఆధునిక కావ్యకళ-బూతు, కామం, ప్రేమ' (19.11.1993) మీద 'జీవియస్ కాలమ్' చదివి ఆత్మీయంగా స్పందించి చేసిన వ్యాఖ్యలు మనసులో చెరిగిపోవు. ఇవన్నీ చేరాతల కెక్కలేదు; కాని, మాట వరసల్లో గుబాళించాయి. ''నేను మీ కాలమ్ ప్రతి శుక్రవారమూ చదువుతున్నాను. ఒకవేళ పేపరువాడు ఆనాడు 'ఆంధ్రభూమి' వేయకపోయినా, లైబ్రరీకి వెళ్ళి చదువుతున్నాను'' అని ఒక్క పది సెకండ్లు విరామం ఇచ్చి, అడొకరకంగా కనుబొమలు కదిలిస్తూ "ఇప్పుడు 'పరసనల్ కాలమ్స్' రాస్తున్నది మనిద్దరమేగా. నేను చదవకుండా ఎలా ఉంటాను?'' అని స్నేహపూరితంగా చిరునవ్వులు చిలకరిస్తారు.

1993 1994 సంవత్సరాలలో వెలువడుతున్న సాహిత్యంమీద సమీక్ష చేసినవారు మా యిద్దరి పరసనల్ కాలమ్స్‌నూ పేర్కొనటం గమనింపదగిన విషయం. ఈ కాలంలో మా 'కాలమ్స్' మాలాగా స్నేహితుల్లాగా మసలాయి. మా మిత్రులలో చాలామంది 'మీరు చేరాతో వాదం పెట్టుకొనే అంశాలు ఎందుకు రాయరు?' అని అడిగినవారూ ఉన్నారు. 'ఛందస్సుమీద నేను రాస్తున్న వ్యాసాలపై జరుగుతున్న చర్చలో మీరుకూడా ఎందుకు పాల్గొనరాదూ?' అని చేరాగారే ఒకసారి ప్రస్తావనచేశారు. నా పరసనల్ కాలమ్‌లో నా రిజర్వేషన్స్ నాకూ ఉన్నాయి నా పరిధి వేరు. చేరాగారు నవ్వుతూ అన్నట్లే 'మీది రసమార్గం కదా?' అని. అవును- 'భక్తిరసవాదం దేశీయం' (4.3.1994), 'సాహిత్యరసం-గాన రసం' (8-4-1994) అనే జీవియస్ కాలమ్స్ చదివి వాటిని గురించి ఆసక్తిని ప్రకటించారు చేరా. ఇద్దరం కలిసి ఒకే బాటలో నడిస్తే వైవిధ్యం లేదు. మా వ్యక్తిత్వాలకు మా 'కాలమ్స్' ప్రతినిధులు.

ముత్యాలసరమంటే చేరాకు చెప్పలేని అభిమానం. ముత్యాలసరాన్ని గురించి రాసిన ఆధునికుల్లో చేరాను మర్చిపోలేం; ఆయన చేసిన చర్చలను విస్మరించలేం. బహుశః ముత్యాలసరాల విచారంలో తలపండిన విమర్శకుడు అంటే అతిశయోక్తి కాదేమో! అందుకే మొన్న మేం కలిసినప్పుడు అన్నాను- 'మాస్టారూ! చేరా షష్టిపూర్తిలో సన్మానాలు ఎన్ని జరిగినా ఒక ముత్యాల సరాన్ని మాత్రం తప్పకుండా మీ మెళ్ళో అలంకరించాలి' అని. దానికి చేరా ఒక వెన్నెలనవ్వు విసిరేశారు.

చేరాతలలో కొన్ని చేదురుచులు ఉండవచ్చు కాని, తీపిగుర్తులు కూడా ఉన్నాయి. పట్టని విషయాలు ఎన్నో ఉండవచ్చు, పట్టి చదివించిన అంశాలెన్నో ఉన్నాయి. 'కాలమ్' ఒక కలం కదిలించే ఒక తరంగం! *

(ఆంధ్రభూమి 22-4-1994)

# సూరంచుల సుదర్శనం

కొత్తగా పుస్తకం రాస్తే చాలు, పత్రికలలో దాని సమీక్ష చూచుకోవాలని ప్రతి రచయితకూ ఉబలాటం ఉంటుంది. మంచి పుస్తకం మీద వచ్చే మంచి సమీక్షకోసం సాహితీప్రియులు ఎప్పుడూ వేయికళ్ళతో ఎదురుచూస్తూ ఉంటారు. అయితే, మంచి పుస్తకాలు రావచ్చు కాని మంచి సమీక్షలు రావటం అరుదు.

ఈ మధ్య తెలుగులో అన్ని పత్రికలూ గ్రంథసమీక్షకు కొంత స్థలం కేటాయిస్తున్నాయి. మరీ వారపత్రికలైతే వ్రతంగా పాటిస్తున్నాయి. పుస్తకాలను స్వీకరించినట్లు కొన్ని నమోదు చేస్తున్నాయి. కొన్ని పరిచయాలపేరుతో పది వాక్యాలు రాసి కన్నీళ్ళు తుడుస్తున్నాయి. మరికొన్ని పత్రికలు పరిమిత ప్రదేశంలో సమీక్షలు చేయిస్తున్నాయి. నిడివి ఎంత ఉన్నా, కొందరు సమీక్షచేస్తే, గ్రంథం మన మనసుకు ప్రసన్నమౌతుంది; సమీక్షకుని సూక్ష్మేక్షిక మనకొక కొత్త వెలుగును ప్రసారం చేస్తుంది.

"No two people read the same book" అని ఎడ్మండ్ విల్సన్ అన్నాడు. అది నిజం. అందుకే సమీక్ష అంటే మనకంత ఆసక్తి. ఒకే గ్రంథాన్ని ఇద్దరు చదివితే ఇద్దరూ ఒకే రకంగా స్పందించరు. సమీక్షకుని స్పందన, పఠిత స్పందన కూడా భిన్నంగా ఉండవచ్చు. అయినా, ఇద్దరూ పుస్తకంలోని అస్తిత్వాన్ని గురించే ఆలోచిస్తారు; అనుభవిస్తారు. ఒక సమీక్ష - రాసేవాడూ, వినేవాడూ ఆలోచించేటట్లూ, అనుభవించేటట్లూ ఉండటం ఆసక్తిదాయకం. సమీక్ష ఒక సమన్వయాత్మకమైన కొత్త చూపును అందిస్తే సార్థకమౌతుంది.

సమీక్ష సానుభూతితో గ్రంథాన్ని విశ్లేషిస్తూ, సత్యాలను నిర్భయంగా నిర్ద్వంద్వంగా చెప్పగలగాలి. కొన్ని సమీక్షలు ఆయా పుస్తకాలను చదివి మననం చేసుకొనే పద్ధతులను చెబుతాయి. కొన్నిచోట్ల వేటిని, ఎలా చదవకూడదో కూడా నిర్దేశిస్తాయి. కొన్ని - రచయితల దృక్పథాలను సరిచేస్తాయి. విమర్శకులకు విలువలు చూపిస్తాయి. విద్యార్థులకు, పరిశోధకులకు, రచయితలకు, ప్రయోక్తలకు కొన్ని మెళుకువలు సూచిస్తాయి. ఒక రచనపట్ల మరొక రచయిత ప్రదర్శి

స్తున్న సంవాదాత్మకమైన కళాస్పందనను, చదివిన అనుభవాన్ని సమీక్ష అంది స్తుంది. ఇటువంటి సమీక్షలు రాయగలిగిన సాహితీవిమర్శకులు తెలుగులో కొద్ది మందే ఉన్నారు. వారిలో శ్రీ ఆర్ ఎస్. సుదర్శనంగారు సమకాలీనులలో మొదట లెక్కింపదగ్గవారు.

1964 - 84 సం॥ల మధ్య - అంటే ఆ రెండు దశాబ్దాలలో - శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం గారు రచించిన నూరు గ్రంథ సమీక్షలను కూర్చి 1987 జన వరిలో ఒక గ్రంథం వారే ప్రచురించారు. భారతివంటి మాసపత్రికలలో, ఆంధ్ర పత్రిక, ఆంధ్ర ప్రభ వంటి వారపత్రికలలో రాసిన ఆ సమీక్షలు ఆ ప్రక్రియకే ఆదర్శ రూపాలుగా ఆకృతి తాల్చాయి సుదర్శనంగారి సమీక్ష విలువలకు గీటు రాయి లాంటిది.

శాస్త్రజ్ఞుల్లోలాగా సమీక్షకులలో కూడా స్పెషలిస్టులు ఎక్కువై పోయారీ రోజుల్లో. కొందరు కవితా గ్రంథాలనే సమీక్షిస్తారు. మరికొందరు నవలలనే, మరింకొందరు వారికి నచ్చిన సాహిత్యశాఖలనే ఎన్నుకొని సమీక్షింపగలుగు తారు. కొందరు మేం జానపద సాహిత్యానికి, జానపద విజ్ఞానానికి అంకితమైన వాళ్ళ మంటారు. మొత్తానికి తెలుగు సాహిత్యంలో ఏ శాఖలో గ్రంథం వెలువడినా దానిని సమీక్షింపగలిగిన సామర్థ్యం ఉన్న విమర్శకులు, సమీక్షకులు వేళ్ళమీద లెక్క పెట్టగలిగినంతమంది మాత్రమే నేడు కనపడుతున్నారు. ఉన్నవారిలో కనిష్ఠికాధిష్ఠితులు శ్రీ ఆర్ ఎస్. సుదర్శనంగారు.

వారు చేసిన నూరు సమీక్షలలో సగానికి పైగా (అంటే 52) నవలా సాహిత్యశాఖకు సంబంధించినవి. ఇరవై సమీక్షలు కథా సాహిత్యానికి, 14 సమీక్షలు కవితలకూ, మరొక 14 సమీక్షలు అనేకాంశాలకూ చెందినవి. మొత్తం మీద నవల, కథ, కవిత, నాటకం, విమర్శ, సిద్ధాంతం మొదలైన శాఖల్లో ప్రామాణిక విమర్శలు, సమీక్షలు చేయగలవారు శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు. ఇన్ని రంగాలలో నిష్ణాతులు ఇప్పుడు సాహితీక్షేత్రంలో అరుదు.

శ్రీ సుదర్శనంగారు ఇంగ్లీషు సాహిత్యాచార్యులు. అయినా, తెలుగులో కవి, విమర్శకులు, నవలారచయిత, కథానికాకర్త. ఇంగ్లీషు సాహిత్య పరిజ్ఞానం ఆధునికాంధ్ర సాహిత్య వివేచనకు ఎంతగానో వారికి తోడ్పడింది. తెలుగు నాట ఆంగ్ల సాహిత్యాన్ని బోధిస్తూ ఆంధ్ర సాహిత్యానికి దోహదం చేస్తున్న ఆచార్యులు

కొందరున్నారు. వారిలో కూడా ముఖ్యంగా మూడు రకాలవారున్నారు. ఒకరు: ప్రాచీన సాహిత్యాన్ని భారతీయ ప్రమాణాలతోనూ ఆధునిక సాహిత్యాన్ని పాశ్చాత్య ప్రమాణాలతోనూ పరిశీలించేవారు. రెండవ రకంవారు- ప్రాచీనాధునిక సాహిత్యా లేవైనా పాశ్చాత్య ప్రమాణాలతోనే సమీక్షించేవారు. ఇక మూడవ రకంవారు - ముందుగా భారతీయ దృక్పథంతో మొదలుపెట్టి, ఆ తరువాత అనువుగా ఉంటే ప్రాశ్చాత్య ప్రమాణాలను సమన్వయించుకొని సాగేవారు. ఈ మూడు రకాలలో శ్రీ ఆర్.ఎస్ సుదర్శనంగారు రెండో బాటకు చెందినవారు. అయినా, మిగిలినవారి అభిమానాన్ని కూడా పొందగలిగినవారు. ఎందుకంటే - వారి బాటను వారు వేసుకుంటూ పోయే ప్రవృత్తియే వారికి ఎక్కువ. మిగిలిన వారిని తిరస్కరించటం, తూలనాడటం తక్కువ. అంతేకాక - భారతీయమైన విలువలను కొన్నింటిని వారు పాశ్చాత్య పరిభాషలో, లేదా ఆధునిక అభివ్యక్తిలో చెప్పగలరు. అందువలన శ్రీ సుదర్శనంగారిని సమన్వయ విమర్శకులని కూడా కొందరు భావించటం పరిపాటిలో ఉంది.

సమీక్షకుడు గ్రంథం వెంట పరిగెత్తేవాడు కాగూడదు. అతడికి గ్రంథాన్ని సమీక్షించటానికి తగిన సాహిత్య దృక్పథం - సాహిత్యం మీదా, సమీక్షిస్తున్న గ్రంథం మీదా, గ్రంథకర్త వ్యక్తిత్వ వికాసం మీదా ఉండాలి. అప్పుడే సమరాశ్వంమీద స్వారిచేస్తున్న యోధునిలా గోచరిస్తాడు. కొందరు సమీక్షకులు గ్రంథాన్ని గుఱ్ఱంలా అనుకరిస్తారు; కొందరు ఆ గుఱ్ఱాన్నే మోసి మూలుగు వినిపిస్తారు. ఆర్.ఎస్. సుదర్శనంగారు ఎంతటి గ్రంథాన్నైనా తన దృక్పథంతో వ్యాఖ్యానించి, తమ వ్యక్తిత్వాన్ని నిర్దిష్టంగా నిలుపుకుంటారు.

అటు నవలల్లోనూ, ఇటు కథల్లోనూ విశ్వనాథవారి 'ఏకవీర సేనాని'ని, 'చిన్న కథలను' గురించి చేసిన సమీక్షలను మొదట ఉంచారు. అందులో వారి శిల్పపక్షపాతం స్పష్టంగా గోచరిస్తుంది. అంతేకాదు, విశ్వనాథ వ్యక్తిత్వ వికాసాన్ని గురించి సుదర్శనం గారికి అనుమానంలేని అవగాహన ఉంది. విశ్వనాథ వారి చిన్నకథల సమీక్షలో మొదటి పేరాయే అందుకు మొదటి సాక్ష్యం.

"విశ్వనాథవారి తొలి రచనల్లో కనిపించే భావ సౌకుమార్యము, స్వేచ్ఛా ప్రియత్వము, వ్యక్తి వైశిష్ట్య నిరూపణము. సౌందర్యారాధన- తర్వాతి రచనల్లో భావప్రౌఢిమగా, సంప్రదాయ ప్రియత్వంగా, వ్యవస్థా నిరూపణముగా, భగవద్భక్తిగా పరిణామం చెందడం వల్ల చాలామంది పాఠకులకు, ముఖ్యంగా యువ

కులకు, ఆయన తొలి రచనలు నచ్చినంతగా చివరి రచనలు నచ్చవు. తొలి రచనల్లో కిన్నెరసాని పాటలు, ఏకవీర ప్రసిద్ధమైనవి. ఆ కోవలోకే వస్తాయి ఆయన వ్రాసిన చిన్నకథలు కూడ" (పుట. 139).

విశ్వనాథవారి కథలను వివేచించటానికీ, విలువ కట్టటానికి ఒక చక్కని సమన్వయ సూత్రాన్ని ముందు సారించారు. ఆ చూపుతో విశ్వనాథ కథ ఒక్కొక్కటీ ఎలా శిల్పకళా స్వేచ్ఛకు చిహ్నంగా నిలిచిందో పొంకంగా, బింకంగా పేర్కొన్నారు. ముగింపు కూడా ప్రారంభ వాక్యంతో పొత్తు కలుపుతూ ఒక అవగాహన వలయాన్ని కలిగిస్తుంది.

"తొలినాటి విశ్వనాథ కవీ, భావుకుడే కాదు, కొత్త మార్గాల్లో ఆలోచించ గల మేధావి అనికూడా ఈ చిన్న కథలు ఋజువు చేస్తున్నాయి" అని ముగిసే ఈ సమీక్ష శిల్పసంబద్ధమైన ఒక సుందర వివేచనంగా వ్యక్తమౌతుంది. అభివ్యక్తి పరంగా సుదర్శనంగారి ప్రతి సమీక్షా ఒక వచన దీర్ఘకవిత.

కథాసంపుటిని సమీక్షించేటప్పుడు కథల సామాన్య స్వభావం ముందు చెప్పి, వాటిలోని వైశిష్ట్యం లోన వ్యాఖ్యానించి, మరల సమష్టి లక్షణసమీక్షతో ముగించే పద్ధతిని అనుసరించారు శ్రీ సుదర్శనంగారు. కాని, విశ్వనాథవారి 'బద్దన్న సేనా'నిని సమీక్షించే టెక్నిక్ వేరుగా ప్రదర్శించారు. ఒక రచనకు వెనుక నున్న చారిత్రిక, సామాజిక, వైయక్తిక నేపథ్యాలను పేర్కొంటూ-వాటిలోనుండి వెలువడిన నవల ఎటువంటి సహజ రచనా శిల్పాలను సంతరించుకోగలిగిందో శాస్త్రీయ పరిశీలనం చేశారు శ్రీ సుదర్శనంగారు.

మచ్చుకు రెండు మూడు వివేచనలు—

1. "బద్దన్న పంచమకులంలో ప్రభవించిన మాణిక్యమైతే, నంబయ్య రాజ వంశంలో జన్మించిన గాజు పెంకు. ఈ యిద్దరికి గల వ్యక్తిత్వ వైరుధ్య చిత్రణలో, వారు ఆయా కులాలకు చెందినవారు కావడంవల్ల, సామాజికంగా వారికి ఏర్పడిన అవకాశాలూ, అవరోధాలూ ఎలాంటివో ఎత్తిచూపి, తద్ద్వారా కులవ్యవస్థ అనేది ఈ దేశానికి పూర్వం నించే ఎంతటి గుదిబండగా అపకారం చేస్తూ వచ్చిందో ధ్వన్యాత్మకంగా, వ్యంగ్యంగా చిత్రించారు విశ్వనాథ. వ్యంగ్య చిత్రణమేతప్ప వాచ్యమైన విమర్శ చెయ్యలేదు! చరిత్ర కథనంలో వాచ్యమైన విమర్శవల్ల నేటి భావాలు రంగప్రవేశంచేసి నవలను దెబ్బతీసి ఉండేవి. (పు. 3.)

2. "విశ్వనాథ బద్దన్న వ్యక్తిత్వాన్ని రూపొందించడంలో అతణ్ణి విషాదాంత కథానాయకుడుగా చిత్రించారు. షేక్స్పియర్ సృష్టించిన మేక్‌బెత్, ఒథెల్లో, హెమ్లెట్ వంటి పాత్రల వరవడి యిక్కడ మనకు కనిపిస్తుంది" (పు. 5.).

3. "విశ్వనాథ బద్దన్న ఆత్మధర్మాన్నీ, వ్యవస్థా ధర్మాన్నీ విశ్లేషించి, ఆ రెండింటినీ తర్కించిన భాగాలు నవలకు ధార్మికమైక విశిష్టతను చేకూర్చాయి. ఇది కేవలం ఒకానొక చారిత్రక సందర్భమైన ధర్మప్రసక్తి కాదు. మానవ ప్రవృత్తిలో, వ్యక్తి హృదయంలో, ఏ కాలంలోనైనా చెలరేగే ధర్మమీమాంస." (పు. 6.)

4. "బద్దన్న స్వధర్మం మీద పట్టువదలి వ్యవస్థా ధర్మానికి లొంగి పోవడం మనకు అసంగతంగానే తోస్తుంది. కాని, అదే వాస్తవం!" (పు 7.)

5. "వ్యక్తి వికాసానికి అవసరమైన మానసిక స్వేచ్ఛా సమానత్వాలు వ్యక్తి స్వయంగా పొందవలసినవే తప్ప, యితరులు ప్రసాదించేవి కావు; ఇది బద్దన్న పాత్ర మనకిచ్చే సందేశం." (పు 8.)

సమీక్ష వ్యాసమంత పెద్దది కాదు. కాని, సమీక్షలో కూడా ఆర్. ఎస్. సుదర్శనంగారు ఆలోచనల అంచులకు పదును పెడతారు. ఒక సమీక్షను విస్తరిస్తే ఒక పరిశోధన వ్యాసమౌతుంది. అందువల్లనే ఈ నూరు సమీక్షల గ్రంథం నూరంచుల సుదర్శనంలా దర్శనమిస్తోంది. *

(ఆంధ్రభూమి 20-5-1994)

# సమీక్షా సందర్శనం

నవలా రచయితల కంటె నవలా రచయిత్రులే రచనలు ఎక్కువగా సాగిస్తున్న రోజుల్లో శ్రీ ఆర్.ఎస్. సుదర్శనంగారు సమీక్షలు రాశారు. ఆ మాట కొస్తే 'నూరు సమీక్షలు'లో రచయిత్రుల నవలలే ఎక్కువ సమీక్షింపబడ్డాయి. ఈ వాస్తవాన్ని గమనిస్తే మనం రెండు విధాల సంతోషించవచ్చు ఒకటి - స్త్రీలు రాసిన నవలలను స్త్రీలే సమీక్షించాలనే ఉద్యమం ఎప్పుడూ వచ్చినట్లు నాకు తెలియదు. పురుషులు స్త్రీలు రచించిన నవలలను సమర్థవంతంగా సమీక్షించలేరనీ ఎన్నడూ పెద్దగా గొడవలు వచ్చినట్లు లేవు. ఇప్పుడైతే 'పురుష స్వామ్య దృక్పథం వల్ల స్త్రీ సమస్యలను సరిగా అవగాహనం చేసుకోలేకపోవచ్చు మగవారు' - అనే భావం వెలువడే అవకాశం ఉంది. రెండు - శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు స్త్రీలు రాసిన నవలలను సమీక్షించినా ఎకడమిక్‌గానే విమర్శిం చారు గాని, ఎగతాళిగా, అధిక్షేపంగా ఎన్నడూ మాట తూలలేదు.

అంటే, స్త్రీలు రాసిన నవలను సమీక్షించటంతో కూడా భేదదృష్టిలేని శిల్ప దృష్టిని మాత్రమే పాటించిన ఉచితజ్ఞులు శ్రీ ఆర్.ఎస్. సుదర్శనం గారు. సమ కాలీన నవలా రచయితలు, రచయిత్రులు ఏ విలువైన మూలాల నుండి ఉత్తేజాన్ని పొంది నవీన ప్రయోగాలు చేస్తున్నారో- వాటిని స్వయంగా చదివి వ్యాఖ్యానించుకొనే శక్తిగల ఆచార్యుడూ, స్వయంగా ప్రయోక్త కావటంచేత సుదర్శనంగారికి నవలా సామ్రాజ్యం అవలీలగా హస్తగతమైపోయేది. శిల్పమర్మ విశేషాలన్నీ వారి బుద్ధి నేత్రాలకు గోచరించేవి. అందువలన అధికారికంగా సమీక్షించేవారు.

అంతా బాగుందని సమీక్షిస్తే కొందరు ఉత్తమ సమీక్ష అని భావించరు, ఏదో అయువుపట్టువంటి తప్పైనా పట్టాలి, అబ్బురపాటు కలిగించే వ్యాఖ్యైనా చెయ్యాలి, తిప్పుకోలేని ఒక తబ్బిబ్బైనా చూపాలి. అలా చేస్తే అది ఘాటైన సమీక్ష అవుతుంది.

అయితే, ఒకటి మాత్రం గమనించాలి. యోగ్యత ఉన్నవారు ఎవరైనా తప్పులు ఎత్తిచూపితే ఊరుకుంటారు కాని, నోరున్నవారి నందరినీ మన్నించరు

లోకులు. అందులోనూ రచయితలు, అంతకంటె రచయిత్రులు. శ్రీ ఆర్.ఎస్. సుదర్శనంగారు తీర్పులను నేర్పరితనంతో చేయగలరు. తీర్పును తాము కోల్పోకుండా, విన్నవాడు కూడా తీర్పు విడవాదకుండా ఒప్పుకొనేటట్లు చెప్పే సహజ పాండిత్యం ఉన్నవారు. చూపుతున్న తప్పు ఎంత నొప్పి కలిగించేదైనా చెపుతున్న నేర్పు దాన్ని కప్పిపుచ్చుతూ ఉంటుంది. మచ్చుకొకటి రెండు.

శ్రీ మహీధర రామమోహనరావుగారి 'ఈ దారి ఎక్కడికి?' అనే నవలను సమీక్షిస్తూ రచయిత స్వభావాన్ని పట్టియిచ్చే ఒక ఘట్టం పేర్కొన్నారు. ఆ నవలలో సత్యానందం 'ఒరులేయేయవి యొనరించిన........తా నొరులకు నవి సేయకునికి పరాయణము' అనే పద్యం (భారతం శాంతిపర్వంలోది) ఉదాహరించి ''కమ్యూనిస్టు జీవిత పద్ధతులలో అదొక సూత్రమని నా అభిప్రాయం'' అనగానే కామేశ్వరరావు అనే పాత్ర ఇలా వ్యాఖ్యానిస్తాడు. ''మీరు కమ్యూనిస్టు అయినా, గాంధీయిజాన్ని వదలలేదు!" అని. ఈ వ్యాఖ్య అక్షరాలా రచయితకు అన్వయిస్తుంది, ఈ నవలే దానికి తార్కాణం అంటారు సుదర్శనంగారు.

ఇది తప్పుగా కనబడే మెప్పు! భారతదేశ సమస్యలకు పరిష్కారాలు రష్యాలో దొరుకుతాయన్న అభిప్రాయాన్ని దుయ్యబట్టినప్పుడూ, 'ప్రజలా, పార్టీయా?' అని తేల్చుకోలేకపోవటమే కమ్యూనిస్టు ఉద్యమాన్ని పీడిస్తున్న జబ్బుగా రచయిత తీర్పు ఇచ్చాడని తేల్చిచెప్పేటప్పుడూ సుదర్శనంగారు ఏ రకంగానూ తొణకరు.

శ్రీ నండూరి విఠల్‌గారి 'దిగంతాలకు' సమీక్షిస్తూ-"ముఖ్యంగా కథ చెప్పటంలో, పాత్రపోషణంలో-కనీసం ఈ రెండూ చేతనైతే తప్ప నవల రాయబూనుకోవటం పొరబాటే!'' అన్నప్పుడూ, "నవల రాయడం చేతనయ్యీ మంచి నవల వ్రాయలేకపోవడమంటే ఏమిటో ఈ రచన పరిశీలిస్తే అర్థమౌతుం"దని శ్రీ ఎ రామకృష్ణారావు గారి 'జీవనసమరం' గురించి పేర్కొన్నప్పుడూ, శ్రీమతి మాదిరెడ్డి సులోచనగారి 'రత్నమందిర్'లోని భాషను సమీక్షిస్తూ 'అలవాటులేని అవుపాసనం అంటే ఇలాంటిదే' అన్నప్పుడూ, శ్రీమతి విమలారామం 'అపర్ణ'లో రాజశేఖరం పాత్రను గురించి, 'ఆగండి ఒక్క క్షణం ఆలోచించండి' అని ప్రత్యేకంగా అభ్యర్థించారు కాని, శ్రీ సుదర్శనంగారు ''ఆలోచించకపోవడమే మంచిదేమో!" అని ముగించినప్పుడూ సమీక్షకుని నిజాయితీ సభ్యంగానే వ్యక్తమౌతుంది.

ఇలా రాస్తున్నానని శ్రీ సుదర్శనంగారు సమీక్షలలో రచయితలను గురించి, రచయిత్రులను గురించి ప్రశంసించరని కాదు. ఎక్కడ గుణముంటే అక్కడ సుదర్శనంగారు దాని విలువచెప్పి మరీ ప్రశంసిస్తారు. శ్రీమతి కావలిపాటి విజయలక్ష్మిగారి 'కాలచక్రం' గురించి చెపుతూ "అలవోకగా రచించినట్లు కనిపించే ఈ నవలలో చక్కని శిల్పం దాగి ఉంది" అని కీర్తించారు. ఇలా ఎన్నో ఉదాహరణలున్నాయి.

ఒక నవలను సమీక్షిస్తూ అందులోని కథను-చెప్పినట్లు చెప్పకుండా మనకు తెలియచెప్పటం శ్రీ సుదర్శనంగారి శిల్పం. కథ ముఖ్య సమస్యతో ముడిబడి పెరిగే పద్ధతి స్పష్టమయ్యేటట్లు చెప్పటం వారి సమీక్ష స్వభావం. నవలావిమర్శలో పాటించే అంశాలు అలవోకగా వారి సమీక్షలో సాక్షాత్కరిస్తాయి. అయితే, అవి వచ్చినట్లు తెలియవు. పాత్రల గురించి, శాస్త్రాంశాల గురించి, రచయితయొక్క లేదా రచయిత్రియొక్క వ్యుత్పత్తిని గురించి సూదంటురాయిలా లాగగలిగిన అంశాలను అర్థవంతంగా చెప్పటం వారి సహజ లక్షణం. వారి సమీక్షలలో వార్తలెన్ని ఉంటాయో తీర్పులూ అన్ని ఉంటాయి.

శ్రీమతి భానుమతీ రామకృష్ణగారి కథలమీద సమీక్ష ముగిస్తూ ఒక వార్తగా ఉన్న తీర్పును చెప్పేశారు శ్రీ సుదర్శనంగారు—

" 'బారిష్టరు పార్వతీశం'లో హాస్యానికి ఆలంబనము సన్నివేశము. 'అత్తగారి కథల్లో హాస్యానికి ఆలంబనము పాత్రపోషణము. ఆంగ్లంలో పి. జి. ఓడ్‌హౌస్ సృష్టించిన బెర్టీవూస్టర్, జీవ్స్ వంటి హాస్యపాత్రలకోవకు చెందుతుంది భానుమతి 'అత్తగారు.' నేడు బ్రిటన్‌లో జీవ్స్‌వంటి బట్లర్ కనిపించడు. ఇంకో పదేళ్ళ తరువాత మన దేశంలో భానుమతి 'అత్తగారూ' కనిపిస్తుందనే నమ్మకం లేదు!"

నూరు సమీక్షలలో నవలలను, కథలను ఎక్కువగా సమీక్షించినా శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు కవిత్వాన్ని సమీక్షించి కూడా తమ ముద్ర స్పష్టంగా నిలుపుకున్నారు, తెలుగులో వెలువడిన ఆధునిక కవితా ప్రయోగాల మీద వారిది సాధికారికమైన సమీక్ష -

'ముసలమ్మ' పురాణవనితలాగా అత్తమామలతో మాట్లాడటం ఆ కావ్య కర్త కట్టమంచివారి ప్రమాణాల ప్రకారం ఆధునికం కాదని, రామలింగారెడ్డి గారికి

వారిమాటనే తిరిగి వడ్డించారు సుదర్శనంగారు." దిగంబర కవులకు ముసుగు పేర్లు ఎందుకు కావలసి వచ్చాయో!" అని అధిక్షేపించారు.

శ్రీ ఆర్.ఎస్. సుదర్శనం గారికి కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, గుంటూరు శేషేంద్ర శర్మ గారల కవితలంటే అభిమానం.వాటిలో గుణాలను వెలికితీసి చూపించేయత్నం చేశారు మూడు సమీక్షలలో. అందులోనూ 'నా దేశం నా ప్రజలు' కావ్యానికి - వెలువడిన కొత్తల్లోనే-సమీక్షకు బదులు వ్యాఖ్యానం రాసే పద్ధతినే ప్రకటించారు. దాన్ని ఆధునిక కావ్యంగా చెప్పి, అందులోని ప్రతీకాత్మక స్వభావాన్ని గురించి ప్రత్యేకించి వివరించారు. 1976 ఫిబ్రవరి భారతిలోనే ఇలా ప్రకటించారు—

"నా దేశం - నా ప్రజలు" వచన కవిత్వం కాదు. ప్రవచన కవిత్వం. ఎత్తుగడలో, శిల్పంలో, దృక్పథంలో, ఇతివృత్తంలో, నిర్మాణ సౌష్ఠవంలో విలక్షణమైన నూత్నసృష్టి ఈ కావ్యంలో తెలుగు కవిత్వం ఒక మలుపు తిరిగిందని చెప్పడం తొందరపాటు కాదనుకుంటాను. 'కృష్ణపక్షం' భావకవితకూ, 'మహాప్రస్థానం' అభ్యుదయకవితకూ వేగుజుక్కలైనట్లే 'నా దేశం - నా ప్రజలు' తెలుగు కవిత్వాన్ని కొత్తదారుల్లో నడిపిస్తుందని నాకు తోస్తుంది." ఆనాటిమాట తరువాత నిజమైంది కదా! సమీక్ష సత్యమైంది.

శ్రీ సుదర్శనంగారు వట్టి సమీక్షకుడే కాదు-సద్విమర్శకుడుకూడా. కావలసివస్తే నిజాన్ని నిష్ఠురంగా చెప్పటానికి వెనకాడరు. "ఒక ప్రక్రియయొక్క లక్షణాల్ని నిర్ణయించే పద్ధతి ఏమిటో ఈ రచయితకు బొత్తిగా అంతుపట్టలేదు" అన్నారు తెలుగు నవలా వికాసాన్ని సమీక్షిస్తూ.

'చలం శ్మశాన సాహిత్యం' మీది సుదర్శనం గారి సమీక్ష ప్రసిద్ధం. నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు గారు మార్క్సిస్ట్ దృక్పథంతో చలంగారి ఉద్యమాన్ని వ్యాఖ్యానించబోయి న్యాయం చేయలేకపోయారని సుదర్శనం గారి అభిప్రాయం. అది అంత తేలిగ్గా కాదనలేని వాదంకూడా. సుదర్శనంగారి ఏ వాదమైనా త్రిప్పికొట్టడం కష్టం!

మంచి సమీక్షలకోసం మధనపడుతున్న ఈ రోజుల్లో సుదర్శనం గారి 'నూరు సమీక్షలు' మన ఆశలకు అక్షరాకృతుల్లా కనపడుతున్నాయి. రచనలోని నిజమైన విలువను తెలుసుకొని రచయిత(త్రి) తనను తాను అంచనా వేసుకోటానికి తోడ్పడే తులామాన దండం గ్రంథ సమీక్ష. ఆ కొలమానానికి ప్రమాణం ఈ సమీక్షా సుదర్శనం! *

**(ఆంధ్రభూమి 27-5-1994)**

# నవ్య సంప్రదాయోద్యమంలో తీవ్రవాదులు : సాహిత్య రసికత

సాహిత్యంలో పరిణామానికి కారణమయ్యే ఉద్యమాలను చరిత్రలో మనం గమనించినప్పుడు ఎన్నో విశేషాలు బయటపడుతూ ఉంటాయి ఉద్యమానికి దార్శనికులు, ప్రయోగవాదులు, నవ్యతను కోరేవారూ నాయకులుగా ఉంటారు. వారి సిద్ధాంతాలూ, ప్రయోగాలూ, రచనాశైలులూ పరిణామానికి పతాక స్థానాలుగా నిలుస్తాయి. అవి చరిత్రలో కీర్తింపబడతాయి.

అయితే, ఆ పరిణామ కాలంలోనే నాయకులతోపాటు మరో నాలుగైదు రకాల రచయితలు కూడా దర్శనమిస్తూ ఉంటారు. వారిని వర్గీకరించి పేర్లుపెట్టి పిలవాలంటే యిలా పేర్కొనవచ్చు: 1. తీవ్రవాదులు, 2. మితవాదులు, 3. సమన్వయవాదులు, 4. అనుకర్తలు, 5. అసమ్మతివాదులు - లేదా - తిరుగు బాటుదారులు. ఈరకం రచయితలు ప్రతి ఉద్యమకాలంలోనూ ఉంటారు. వీరందరూ ఉన్నా నాయకులు సాగించే ఉద్యమం సాహిత్యచరిత్రలో ఒక తరంగాన్ని సృష్టిస్తుంది అయితే, ఈ అయిదు రకాల రచయితలు నాయకులు సృజించే నవీన ఉద్యమం క్రమంగా ప్రజాదరణం నుండి దూరం కావటానికీ, దానిలోని లోపాలను స్వయంగా బైట వేసుకోవటానికీ, మరొక నవీన ఉద్యమం తలయెత్తటానికీ, ఒక్కొకసారి ఉద్యమం కుప్పకూలి పోవటానికి కూడా దోహద కారులు కావచ్చు. మరొకమాటలో చెప్పాలంటే - ఈ అయిదు రకాల రచయితలు కూడా ఒక నవ్య సాహిత్యోద్యమానికి అంతర్గతబలహీనతలుగా తయారయ్యే అవకాశాలున్నాయి కాని, ఈ అయిదుగురూ ఉద్యమాన్ని బలపరచే శక్తులుగా మారటం చరిత్రలో సకృత్తు. అయితే, వారు ఉద్యమాన్ని బలపరుస్తున్నామనే భావిస్తూ ఉంటారు, కాని, తత్త్వతః ఉద్యమం బలహీనపడటానికి పరోక్షకారకులౌతూ ఉంటారు. ఒక్కొకసారి ఉద్యమనాయకులు వీరిని అదుపులో ఉంచటానికిగాని, తమ కనుకూలంగా మార్చుకోటానికిగాని వ్యూహాలు పన్నవచ్చు. అయినా, అటువంటి సందర్భాల్లో వారికి విజయం లభించటం కూడా

అరుదే. ఒక కాలంలో ఒక రచయిత నిర్వహించిన పాత్రను గురించి పరిశీలించ వలసి వచ్చినప్పుడు అతడు నాయకవర్గానికి చెందినవాడా లేక నాయకేతర వర్గానికి చెందినవాడా అన్న వివేచన ప్రధానపాత్ర నిర్వహిస్తుంది.

ప్రసిద్ధ సాహితీ విమర్శకులు, కవులు శ్రీ పొట్లపల్లి సీతారామారావు గారి 'సాహిత్యరసికత'ను నాలుగేళ్ళ క్రితమే చదివాను. విశ్వనాథవారి శిష్యులుగా, వారి సాహితీ ప్రస్థానంలో సాగిన విద్వద్విమర్శకులుగా దాదాపు నాలుగు దశాబ్దాలుగా సాహితీలోకానికి వారు సుపరిచితులు. వారు విశ్వనాథకు 'సాహిత్య రసికత'ను అంకితమిస్తూ చెప్పిన పద్యం ఒక్కటైనా రసికులు మరువలేనిది.

"ఎవని శిక్షాస్ఫూర్తి నిటు విమర్శకుడనై
యటు కవినై కొంత యదుపుగంటి''

అని సూత్రప్రాయంగా చెప్పిన అంశాన్ని శ్రీ పొట్లపల్లివారు తామే గ్రంథావతారికలో వివరించుకున్నారు- ''నేను విశ్వనాథ సత్యనారాయణగారి శిష్యుడను. క్రొత్తగా బి.ఏ, (ఆనర్స్) పూర్తిచేసుకుని విజయవాడ ఎస్.ఆర్.ఆర్. అండ్ సి.వి ఆర్. కళాశాలలో లెక్చరర్‌గా చేరిన కాలంలో నవ్యకవితా సిద్ధాంతములు- నవ్యకావ్య రచనలు నచ్చని నాకు విశ్వనాథ సత్యనాయణగారి దగ్గర చదువుకున్న ధ్వన్యాలోకం. అప్పుడప్పుడు ఉపన్యాసాలలో, చెప్పే పాఠాలలో- ఆయన చెప్పే గుణదోష వివరణల వలన కల్గిన సంస్కారము, కళాశాల తెలుగుశాఖ స్టాఫ్‌రూములో సందర్భవశాత్తూ ఆయన చేసిన ప్రసంగాలవలన లభించిన వివేకము - ఈ వ్యాసపరంపరకు ప్రేరకాలు అయినవి. విమర్శించుటలోని ఒడుపులు ధ్వన్యాలోకం చదివినప్పుడు కల్గిన సంస్కారంవలన నా కలవడినవి."

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు నిస్సంశయంగా ఒక యుగకర్త. నవ్య సంప్రదాయోద్యమ నాయకుడు. మహా మనీషి. వారి సాహచర్యంలో సాహిత్య వ్యక్తిత్వానికి పదను పెట్టుకున్న పొట్లపల్లివారు నిజంగా అదృష్టవంతులు. ధ్వన్యాలోకాన్ని విశ్వనాథవారివద్ద అధ్యయనం చేసిన కొద్దిమంది పండిత విమర్శకులలో పొట్లపల్లివా రొకరు కావటం కూడా విశేషం. అట్లని - శ్రీ పొట్లపల్లి సీతారామారావుగారు ప్రకటించిన అభిప్రాయాలన్నీ విశ్వనాథవారికి ఆమోదయోగ్యాలౌతాయని చెప్పలేము. విశ్వనాథ వారి సాహిత్య దర్శనాన్నంతా శ్రీ పొట్లపల్లివారు తమ సాహిత్యదృక్పథంలో ఇమిడ్చుకొన్నారని చెప్పలేము. శ్రీ పొట్లపల్లి వారు నవ్యకవితా సిద్ధాంతాల మీదా, నవ్యకావ్య

రచనలమీదా సానుభూతియే లేనివారు; ఇక సహానుభూతి స్వప్నంలో మాట! వారి చిత్తవృత్తికి తగిన అంశాలు కొన్ని విశ్వనాథ భాషణల్లో, ఉపన్యాసాల్లో వారికి బలంగా దొరికి ఉండవచ్చు. వాటితో శ్రీ పొట్లపల్లి వారు తమ విమర్శక, కవితా వ్యక్తిత్వాలను రూపొందించుకొని ఉండవచ్చును.

నేనూ విశ్వనాథ వారి పరోక్ష శిష్యుణ్ణే. తెనాలిలో తిరుపతి వేంకటకవుల జయంతి సందర్భంగా వారిచేత ప్రశంసాశీస్సులనూ, సన్మానాన్ని పొందినవాడినే. నాలాగా మరెందరో ఉన్నారు. పొట్లపల్లి వారిలాగా ప్రత్యక్ష శిష్యులూ ఉన్నారు విశ్వనాథకు- వందలలోనే కాదు వేలలో. వారందరిలోనూ పై ఆరు రకాలవారూ కనపడతారు. వారందరినీ పేరు పేరునా వేరుచేసి చెప్పటం సాధ్యపడదుగాని, తీరులను చెప్పి, వారిని గుర్తించే భావుకత్వాన్ని సాహిత్యరసికులకే వదలి పెడతాను.

విశ్వనాథవారు ఏ నవ్యసంప్రదాయ సాహిత్యోద్యమాన్ని సాగించారో ఆ ఉద్యమాన్ని ముందుకు తీసుకొనిపోయే సిద్ధాంతాన్నిగాని, సమన్వయాన్నిగాని, సాహితీ ప్రక్రియనుగాని క్రొత్తగా ప్రయోగించి నవ్య చైతన్యాన్ని నింపిన రచయితలు నాయకవర్గంలోని సభ్యులుగా పరిగణింపబడతారు. విశ్వనాథ వారు భారతీయమైన జీవన మూల్యాలకు గల తిరుగులేని విలువలను పాశ్చాత్య జీవన ముల్యాలకు ప్రతిగా ప్రతిపాదించే ఒక పరిణామ దశకు ప్రతిభావంతంగా నాయకత్వం వహించారు. ఆయనకు పాశ్చాత్య సాహిత్య మర్యాదలు క్షుణ్ణంగా తెలుసు, వాటిని వాటమెరిగి దేశీయంగా ఎలా సాహిత్య ప్రయోగాలలో నిపుణంగా వాడుకోవాలో తెలుసు; అపూర్వ మిశ్రప్రయోగాలు చేస్తూ భారతీయ మూల్యాలకు శిల్పపరంగా పట్టం కడుతూ ఉండేవారాయన. అందువల్లనే విశ్వనాథవారు నవ్య సంప్రదాయ ప్రయోక్త అయ్యారు. అయితే, ఆయనలో ఉన్న జాతీయతను, దేశీయతను, సంప్రదాయ మర్మజ్ఞతను మాత్రం గ్రహించి విశ్వనాథను ఛాందస సంప్రదాయవాదిగా చిత్రించేవారు తీవ్రవాదులు; విశ్వనాథవారి తెలుగుదనాన్ని, సంప్రదాయప్రీతిని ప్రశంసిస్తూ వారి కవిత్వంలోని నవ్యతను గౌరవించేవారు మితవాదులు; విశ్వనాథ రచనలలో ఉన్న పాశ్చాత్య మర్యాదలను, భారతీయ మర్యాదలను వివేకించి చూపిస్తూ ఉభయకావ్య శిల్పాచార్యత్వాన్ని ఉల్లేఖించేవారు సమన్వయవాదులు. 'నన్నయగారి ప్రసన్నకథా కలితార్థ యుక్తి' మొదలైన గ్రంథాలలో విశ్వనాథవారు తెలుగు కవులు చెప్ప

కున్న కావ్యప్రమాణాలను వ్యాఖ్యానించే ఒక ఒడుపైన దేశీయమైన తెలుగు విమర్శవిధానాన్ని వెలికి తీసుకొనివచ్చారు. దానిని ఆధారంగా చేసుకొని తెలుగు విమర్శను వెలుగుబాటల్లో నడిపించటానికి బదులు విశ్వనాథవారి వివేచననే చర్వితచర్వణంగా చెప్పేవారు అనుకర్తలు. విశ్వనాథ ప్రయోగాలను, సిద్ధాంతాలను కొన్నింటిని గణనీయంగా ప్రశంసించి, మరికొన్నింటిని తీవ్రంగా వ్యతిరేకించేవారు అసమ్మతివాదులుగా, తిరుగుబాటుదారులుగా పేర్కొనవచ్చు.

ఇది ఒక విశ్వనాథవారికే వర్తిస్తుందని అనుకోవలసిన పనిలేదు. దీనినే శ్రీశ్రీకి వర్తించి చెప్పవచ్చు, కృష్ణశాస్త్రిగారికి అన్వయించి చెప్పవచ్చు. ప్రాచీన సాహిత్యంలో ఏ యుగకర్తకైనా ఈ పరిస్థితి పరిపూర్ణంగా వర్తిస్తుంది.

శ్రీ పొట్లపల్లి సీతారామారావుగారు నవ్యకవితా రీతులలో గుణదోష పరిశీలనం చేసే పదమూడు వ్యాసాలను ఒక సంపుటిగా 1989 లో వెలువరించారు. అందులో ఒక వ్యాసం 'సాహిత్య రసికత ను గూర్చి ఉంది. దానినే సంకలనానికి పేరుగా ఉంచారు. సుమారు 1951 - 1984 సంవత్సరాల మధ్య రాసిన వ్యాసాలివి. నవ్య సంప్రదాయ యుగంలో సాహిత్య విమర్శ చైతన్యవంతంగా నూత్న ప్రయోగాలతో క్రొత్త పుంతలు త్రొక్కిన కాలమది. శ్రీ పొట్లపల్లివారు నిజంగా నాయకవర్గంలో ఒకరుగా ఉండి, ఒక వినూత్న శాఖను ముందుకు సాగించగలిగిన ప్రతిభావ్యుత్పత్తులు కలవారు. కాని, ఎందుకో తీవ్రవాదవర్గంలో తిరుగులేని వీరులుగా మిగిలిపోయారు.

"ఆనాటి ప్రభువుల నుండి మొన్నమొన్నటి జమీందారుల వరకు, ఆనాటి పండిత సదస్సుల నుండి సామాన్యజనుల వరకు అవిచ్ఛిన్నముగా పరవళ్ళు ద్రొక్కిన సాహిత్య రసికత యేమైనది? మటుమాయమైపోవుటకు కారణమేమి? ఇది ప్రతివాని హృదయమును కలవరపెట్టు ప్రశ్న. ఇప్పటి పట్టభద్రత్వము, పరిశోధనలు, భాషాశాస్త్ర అధ్యయనములు స్వార్థాభిలాషలకు - ఉన్నత పదవులకు - మాత్రమే పరిమితములగుచున్నవి. సాహిత్య పట్టభద్రులనుండి సాహిత్య రసికత తప్పిపోవుట వారికి లాభమో, నష్టమోగాని దేశమునకు మాత్రము తీరని నష్టమై యున్నది. ఈ సాహిత్య పట్టభద్రులందరు దానికి మార్గాంతరము నన్వేషించి మేలు చేకూర్చవలెనని నా మనవి." (సాహిత్య రసికత - పుట. 150)

శ్రీ పొట్లపల్లి సీతారామారావు గారి సాహిత్య విమర్శ వెనుకనున్న ప్రేరణను పై వాక్యాలు స్పష్టం చేస్తున్నాయి. అంతరించిపోతున్న సాహిత్య రసికత్వాన్ని పునరుజ్జీవింప చేయటానికి శ్రీ పొట్లపల్లివారు విమర్శ ప్రక్రియను చేపట్టారు

సాహిత్య రసికత్వం సన్నగిల్లటానికి పొట్లపల్లివారికి ప్రధానంగా కనపడు తున్న కారణాలు నాలుగు తెలుస్తున్నాయి. 1 ఇంగ్లీషు చదువులు, 2 ఉద్యోగం కోసమో జీవనభృతికోసమో డిగ్రీల నిచ్చే విశ్వ విద్యాలయాలు, విద్యావ్యవస్థలు, 3. సాహిత్య దర్శనంలేని సాహిత్య పరిశోధనలు, 4. సాహిత్య రసికత్వాన్ని పఠన పాఠనాల్లో మట్టు పెడుతున్న భాషాశాస్త్రాధ్యయన విధానం. ఇంగ్లీషు భాషా సాహిత్యాభిమానాలు మాతృభాషా సాహిత్య తత్త్వదర్శనాలను, కావ్యాస్వాదన కళా మార్గాలను విస్మరింప చేయటంవల్ల సాహిత్య రసికత్వ మూలానికే విచ్ఛిత్తి ఏర్పడే పరిస్థితులు కలిగాయి. సాహిత్యం డిగ్రీకోసమనీ, డిగ్రీ జీవనోపాధికోస మనే స్పృహ సాహితీపరుల కేర్పడటం చేత సాహిత్యం సాహితీమూర్తిమత్వాన్ని వికసింప చేయటానికి చదవాలనే సంస్కారం క్రమంగా లోపించిపోవటం జరి గింది. విశ్వవిద్యాలయ వ్యవస్థలలో సాహిత్య పరిశోధన - సామగ్రి సేకరణకు, విశ్లేషణకు ఇచ్చినంత ప్రాముఖ్యాన్ని సాహిత్య తత్త్వదర్శనానికి, కళాశిల్పాను శీలనానికి ఇవ్వకపోవటం చేత సాహిత్య రసికత్వం సహజంగా వలచబడి పోతోంది. దీనికి తోడు భాషాశాస్త్రాధ్యయనం సాహిత్య బహిరంగ విశ్లేషణాన్ని ప్రోత్సహించి అంతరంగ వివేచనాన్ని స్పృశించకపోవటం చేత సాహిత్యపఠన పాఠనాల్లో భాషాశాస్త్రాధ్యాపకులు సాహిత్య రసికత్వానికి పుట్టుగతులు లేకుండా చేస్తున్నారు. ఇటువంటి భావాలు శ్రీ పొట్లపల్లివారి సాహిత్య దృక్పథాన్ని, విమర్శ స్వభావాన్ని కూడా రూపొందించాయి. నవ్య సంప్రదాయోద్యమ ప్రవర్తకులలో ప్రథమగణ్యులైన విశ్వనాథవారికి కూడా ఇటువంటి కొన్ని భావాలుండేవి. కాని, సన్నగిల్లిపోతున్న సాహితీ రసికత్వాన్ని పునర్నిర్మాణం చేయటంలో విశ్వనాథ వారికున్న నిర్మాణాత్మకమైన వ్యూహం శ్రీ పొట్లపల్లివారి కున్నట్లు కనవడదు. వ్యూహ స్పృహ కూడా నాయక లక్షణమే!

విశ్వనాథవారు ఉపన్యసించేటప్పుడు నాలుక చురుకు నలుగురికీ బాగా తెలుస్తుండేది. ధిషణాహంకారం ఒక్కొక్కసారి ధిక్కరిస్తున్నట్లుండేది. ఆయనకు అదొక అలంకారమని కొందరు భావించేవారు కూడా. సత్యనారాయణగారు తిట్టినా అదొక ప్రశంసగా తలంచినవారూ ఉన్నారు. కాని, విశ్వనాథవారిలో

ఉన్న విశేషమేమంటే- మాట్లాడేటప్పటి తీవ్రత రాసేటప్పుడు ఉండేది కాదు. విమర్శలో విశ్వనాథ వినయ సంపన్నుడు, వివేక చూడామణి. విషయాన్ని గురించి వివేచించటం తప్ప ఇతరుల దోషాలపై దాడి చేయటం తక్కువ. నిర్మాణాత్మకంగా కావ్యానుశీలన పద్ధతిని ఆచరణయోగ్యంగా, అనుభవ స్ఫోరకంగా, ఆసక్తికరంగా, ప్రామాణికంగా ప్రపంచించే ఒక యుగకర్త లక్షణం విశ్వనాథ విమర్శక వ్యక్తిత్వంలో వ్యక్తమయ్యేది. ప్రాచ్య పాశ్చాత్య ప్రమాణాలను ప్రయోగాలనుబట్టి విమర్శలో ప్రయోగించినా వాటి సంస్కృతమూలాలను గాని, ఆంగ్ల మూలాలనుగాని ఎక్కడా పేర్కొనకుండా అచ్చమైన దేశి విమర్శను పుట్టిస్తున్న స్ఫూర్తిని కలిగించేవారు. ఆ ప్రతిభయే ఆయనను నవ్య సంప్రదాయ యుగ నాయకుణ్ణి చేసింది.

విశ్వనాథవారు ధ్వన్యాలోకం కేంద్రంగా రసధ్వని ప్రస్థానాలను సమన్వయించిన ఆధునిక సాహిత్యతత్త్వోపాసకులు. అభినవగుప్తపాదులనూ, ధ్వన్యనంతర యుగ సిద్ధాంతాలలో రసాన్ని ధ్వనిని సమర్థించే వాటిని విశ్వనాథవారు అభిమానించారు, వక్రోక్తి ప్రస్థానాన్ని వడియగట్టారు. ఔచిత్య విచార చర్చను ఆపోశనపట్టారు. వీటికి సజాతీయాలైన పాశ్చాత్య సిద్ధాంతాలను సమన్వయించుకున్నారు. విశ్వనాథవారు ప్రపంచమంతా మెచ్చుకుంటున్న రసవాదాన్ని ఆధునికంగా అవగాహన చేసుకొని తన ప్రయోగాలలో ఆవిష్కరించినవారు.

నిజం చెప్పాలంటే- విశ్వనాథ ప్రయోగాలను అనుశీలించటానికి వారి సాహిత్య దర్శనానికి సంబంధించిన సమన్వయ విమర్శక సూత్రాలను నిర్మించుకోవాలి. విశ్వనాథ సాహిత్య లక్షణ సూత్రాలు నిర్మించుకోవటమంటే ఒక యుగకర్త సాహిత్య దర్శనాన్ని సిద్ధాంతీకరించుకోవడమన్నమాట! ఈ యుగంలో నన్నయనుండి నేటివరకూ యుగకర్తలకు లక్షణ గ్రంథాలు వ్రాసే ఉద్యమం చేపట్టవలసి ఉంది.

ఇంత ఎందుకు చెప్పవలసి వస్తోందంటే - ప్రాచీన కవులకు లాగానే ఆధునిక కవులకు కూడా వారివారి ప్రయోగాలకు అనుగుణమైన సాపేక్ష లక్షణ సూత్రాలను అన్వయించి సాహిత్యానుశీలనం చేయవలసిన అవసరాన్ని ఆధునిక విమర్శకులు గుర్తిస్తున్నారు. విశ్వనాథవారు ప్రక్రియానుగుణమైన ప్రమాణాలను పాటించే పద్ధతిని గౌరవించారు. ఇటువంటివి నవ్య సంప్రదాయ నాయకవర్గ కావ్యవిమర్శ మర్యాదలు.

నవ్య సంప్రదాయోద్యమానికి సంబంధించిన తీవ్రవాదులు ప్రక్రియోచిత మైన ప్రమాణాలనూ, సాపేక్షమైన విలువలనూ అంతగా పరిగణనలోనికి తీసు కోరు. ఒక ప్రస్థానానికి చెందిన ప్రామాణిక ఆలంకారిక గ్రంథాన్నే కొల మానంగా తీసికొని, సార్వకాలీన సాహిత్య సిద్ధాంతాలుగా ఆ లక్షణ సూత్రాలను అన్ని రకాల ఉద్యమాలకు చెందిన రచనలకూ వర్తింపజేస్తారు. సాహిత్యాను శీలనంలో సాపేక్ష ప్రమాణాలకు తీవ్రవాదులు స్థానం కల్పించకపోవటం సామాన్యంగా కన్పిస్తుంది. ఈ తారతమ్యం నవ్య సంప్రదాయోద్యమ నాయకు డైన విశ్వనాథకూ, ఆ ఉద్యమ చైతన్యంలోనే తీవ్రవాద శాఖను పోషించే పొట్లపల్లివారికీ మధ్య కనపడుతుంది. ఆనందవర్ధనుని లక్షణ సూక్తం అన్ని కవితా ప్రయోగాలకూ వర్తించే సాధారణ పద్ధతి తీవ్రవాద శాఖకు చెందింది. నవ్యసంప్రదాయోద్యమం అటువంటి నిబద్ధ ప్రవృత్తిని పోషించలేదు.

నవ్యసంప్రదాయోద్యమంలోని తీవ్రవాదులు కూడా కొన్ని స్పష్టమైన సాహితీ లక్ష్యాలతో ప్రమాణాలతో విమర్శను సాగించారు. శ్రీ పొట్లపల్లివారికి సాహిత్య విమర్శకునిగా ప్రశంసలు వచ్చినా, విమర్శలు వచ్చినా వాటివల్లనే. సాహిత్యాన్ని సాహిత్యేతర ప్రమాణాలతో విలువకట్టే విధానాన్ని వ్యతిరేకించారు పొట్లపల్లివారు. "వాల్మీకిలో విశిష్టాద్వైతం వుందనిగానీ, వ్యాసుడిలో అద్వైత సిద్ధాంతం పరాకాష్ఠ పొందినదనిగానీ, నైషధంలో ఆధునిక విద్యుచ్ఛక్తి గోచరి స్తుందనిగానీ, శ్రీశ్రీలో మార్క్సు - ఏంజిల్సు ప్రభావం ఉందనిగాని వివరించటం కావ్య విమర్శ అనిపించుకోదు. జాబితాలూ, అభిప్రాయ సంపుటాలూ, కాలాను క్రమణికలూ వట్టి సాంఘిక సామాజికుల పరిస్థితుల పట్టీలు వ్రాయటంలో సమర్థు లైన శ్రామికులైన పరిశోధకులకు కొంత భోగట్టా అందించటానికి పనికి రావచ్చునేగానీ భావుకత్వాన్ని పెంచే లక్షణం ఈ బాపతు రచనలలో వుంటుందని నేననుకోను.... కావ్య విమర్శకుడు చూడవలసింది కావ్యంలో ఏం చెప్పాడు, అన్నదానికంటే ఎలా చెప్పాడు అనేదే" (పుట 154, 155) ఈ భావాలను నవ్య సంప్రదాయోద్యమ నాయకవర్గంవారు కూడా అంగీకరిస్తారు. అయితే, ఆ వర్గం వారు సాహిత్యాన్ని సాహిత్యపు విలువలతో వివేచించే కావ్య శిల్ప మార్గాన్ని ప్రపంచిస్తూ పోయేవారు. తీవ్రవాదులు కావ్యశిల్పమార్గ ప్రవర్తనంకంటె తమకు నచ్చని ప్రయోగాలను, పద్ధతులను, కావ్యాలను, భావాలను, సిద్ధాంతాలను విమర్శించటం ఎక్కువ. వీరికి విశ్వనాథాదుల రచనలు పరమ ప్రమాణాలు.

ఇతరుల దోషాలను నిరూపించటం నవ్యసంప్రదాయ నాయకుల కావ్య ప్రామాణికత్వాన్ని ప్రతిష్ఠాపించటానికే అన్నంత నిష్ఠను ప్రకటిస్తారు. ఒక్కొకసారి తీవ్రవాదులు లేకపోతే నాయకులకు నాయకత్వ ప్రతిష్ఠాపనం కాదేమో అన్నంత అనుమానాన్ని కలిగిస్తారు. ఆ విధంగా వారి పాత్ర ఉద్యమంలో మరువలేనిది.

తీవ్రవాదులు ఎప్పుడూ ప్రత్యర్థుల నుద్దేశించే ప్రబోధిస్తుంటారు! నవ్య సంప్రదాయయుగంలో విశ్వనాథాదులు సాహిత్యంలో పోషించిన విలువలు సామాన్యమైనవి కావు భావకవితాయుగ చైతన్యంనుండి కవితను నవ్యసంప్రదాయ యుగం వైపు నడిపించిన ఉద్యమంలో ఎందరో ఎన్నో శిఖరాలను కవితా రంగంలోనూ, సాహితీ ప్రక్రియలలోనూ చూపించారు; వాటిని జనం విన్నారు, చదివారు, మెచ్చుకున్నారు. భావకవితా గానంకన్నా, అభ్యుదయ కవితా గానం కన్నా, నవ్యసంప్రదాయ కావ్యగానాలకు జనం తండోపతండాలుగా వచ్చేవారు. సాహిత్యరసికత ఇంకా బ్రతికే ఉన్నదని ఆ సభలు చూచినవారు అనుకుంటూ ఉండేవారు. అయినా. నవ్యసంప్రదాయవాదంలోని తీవ్రవాదులు కవితాకళకంటె భావజాలానికి ఎక్కువ విలువనిచ్చే అభ్యుదయవాదులనూ, విప్లవవాదులనూ- వీరితోపాటు భాషాశాస్త్రవాదులనూ, బ్రతుకుతెరువు పండితులనూ దృష్టిలో పెట్టుకొని, సాహిత్యరసికత అంతర్ధానమైపోయిందని అంటూ ఉంటారు.

తెలుగులో పరిశోధన ప్రాథమిక దశలనుండి వికాసాన్ని చెందుతున్న దశలో మహాపరిశోధకులే సామగ్రి సేకరణకోసం, వాటి విశ్లేషణం కోసం జీవితాలు వెచ్చించారు. ఆంధ్రుల చరిత్ర, ఆంధ్రభాషా చరిత్ర, ఆంధ్ర సాహిత్య చరిత్ర - ఈ మూడూ సమగ్రంగా నిర్మింపబడాలన్న లక్ష్యాలతో పరిశోధన ప్రవృత్తి దేశమంతా విస్తరిల్లింది. నూతన సామగ్రి సమన్వయింపబడినప్పుడే నూతన సిద్ధాంతంగాని, తత్త్వదర్శనంగాని సాహిత్యంలో వెలువడగలుగుతుంది. చారిత్రిక స్పృహతో పరిశోధన పరిణామదశలను పరిశీలించే ప్రవృత్తి తీవ్రవాదులకు తక్కువ. ఇక భాషాశాస్త్రాచార్యులను గురించి కూడా ఒక మాట నిజం. 'క్రొత్తగా వచ్చిన కొమ్ములు వాడి' అన్నట్లు భాషాశాస్త్రి పండితులు సాహిత్య రంగంలో వ్యవహరించిన దశలు ఉన్నాయి. ఆ పోట్లకు తట్టుకొని సాహిత్య స్పృహను ద్విగుణీకృతోత్సాహంతో నిర్మించటానికి పూనుకొన్నవారే నవ్య సంప్రదాయోద్యమ నాయకవర్గంవారు.

''సాహిత్యము అంతర్ముఖముగను, బహిర్ముఖముగను లోకమునకు ప్రత్యక్షమగుచుండును. శబ్దవిన్యాసము, సమాసము, సంఘటన, రీతి, పాకము మొదలైనవి దానికి బహిర్ముఖములు. వ్యంగ్యము, రసము, అలంకారము మొదలైనవి అంతర్ముఖములు" అని శ్రీ పొట్లపల్లి వారి వివేచనం. అయితే, ''అంతర్ముఖము నాస్వాదము చేసినవాని అధిక్యమును గూర్చి కాని, బహిర్ముఖములను తెలిసికొనినవాని అల్పత్వమును గూర్చి గాని యిక్కడ చర్చించుట ప్రస్తుతము గాదు. సాహిత్యము యొక్క నిజస్వరూపమును అనుభవించుటకు శక్తి చాలని యీ కాలములో ప్రస్తుత దైన్యస్థితిని వివరించుటయే నా కర్తవ్యము!'' (పు. 137) అని తమ విమర్శ స్వభావాన్ని వ్యక్తం చేశారు.

సాహిత్యరసికత కేర్పడిన దైన్యస్థితిని వివరించి, ఉద్యమానికి ఊపుతెచ్చే వారు తీవ్రవాదులు. దైన్యస్థితిని సవరించే సాహిత్యదీరత్వాన్ని సృష్టించి ఉద్యమానికి ఉన్నతిని సాధించేవారు నాయక వర్గంవారు. పొట్లపల్లివారు పై దైన్యస్థితిని వివరించే విమర్శ సాగించారు. విశ్వనాథవారు దాన్ని సవరించే సాహిత్యోద్యమాన్ని వెలయించారు.

(ఆంధ్రభూమి 24-6-1994, 1-7-1994)

# కళాతత్త్వమార్గంలో గడుసైన మలుపు

"పురుషులందు పుణ్యపురుషులు వేరయా" అన్నట్లు విమర్శకులలో అధ్యాపక విమర్శకులు (Teacher Critics) ఉంటారు. వారి ప్రవృత్తుల మీద వృత్తి ప్రభావం బలంగా ఉండటం సహజం. ఇంగ్లీషులో ఉత్తమ అధ్యాపక విమర్శకుడుగా పరిగణింపబడే టి.యస్. ఎలియట్ తన వృత్తి ధర్మం తన ప్రవృత్తిని ఎలా మలచిందో చెప్పుకున్నాడు– "I have had some experience of extension lecturing, and I have found only two ways of leading any pupils to like anything with the right liking : to present them with a selectiton of the simple kind of facts about a work - its conditions, its setting, its genesis - or else to spring the work on them in such a way that they were not prepared to be prejudiced against it." విద్యార్థులు ఉత్తమ అభిరుచితో కవిత్వాన్ని ఆస్వాదించటానికి అనువైన రెండు మార్గాలను ఎలియట్ రూపొందించుకోటానికి ఆయన అధ్యాపక వృత్తి తోడ్పడిందని పైమాటలు స్పష్టం చేస్తున్నాయి. ఆధునిక సాహిత్యరంగాలలో సాహిత్య సిద్ధాంత వివేచనం చేసే విమర్శకులు చాలమంది అధ్యాపకులై ఉండటం గమనింపదగిన విశేషం. ఒకప్పుడు కవివిమర్శకులకుండే గౌరవం ఇప్పుడు అధ్యాపక విమర్శకులకు దక్కుతోంది.

ఈ మధ్య పుంఖానుపుంఖంగా విమర్శ వ్యాసాలూ, గ్రంథాలూ రచించి వెలువరిస్తున్న డాక్టర్ ముదిగొండ వీరభద్రయ్య మా తరువాతి యువతరంలో మొదటివరుసలో నిలుచున్న అధ్యాపక విమర్శకుడు. 'విమర్శ మౌలిక లక్షణాలు' (1990), 'కళాతత్త్వశాస్త్రం - మౌలికాంశ వివేచన' (తులనాత్మక అధ్యయనం) (1993) అనే వీరి రెండు విమర్శ గ్రంథాలూ సాహిత్య విద్యార్థుల, పండితుల దృష్టులను ఆకర్షిస్తున్నాయి. సరియైన సాహిత్యాభిరుచి కలగటానికి విమర్శలోనూ కళాతత్త్వశాస్త్రం (ఈస్థటిక్స్) లోనూ ఏయే మౌలికమైన అంశాలు ఏయే విధంగా అధ్యయనం చేయాలో అధ్యాపన ప్రవృత్తితో చెప్పటం వీరభద్రయ్యగారి

ప్రత్యేకత. కడచిన అయిదారేళ్ళుగా ఆయన విమర్శలో ఈ ప్రవృత్తి బాగా ప్రకటితమౌతోంది. క్రమంగా పరిణతి చెందుతోంది. 'కళాతత్త్వశాస్త్రి' వివేచనలో ఒక పరిపక్వస్థాయికి చేరుకుంది. మరొక విశేషమేమంటే-ఆ రెండు గ్రంథాలనూ రచయిత ఇద్దరు అధ్యాపక విమర్శకులకే అంకితమిచ్చారు. ఇరవయ్యో శతాబ్దంలో ఇంగ్లీషులో లాగానే తెలుగులో కూడా అధ్యాపక విమర్శకులు నవీనమార్గాలకు నాంది పలుకుతూ ఉండటం ఒక చారిత్రిక వాస్తవం!

కళా తత్త్వశాస్త్ర మంటే ఈస్థటిక్స్ (Aesthetics). సంగీత, నృత్య, నాటక, శిల్ప, చిత్రకళ, కావ్యాది కళా శిల్పాలను సమష్టిగా దర్శించి అనుశీలించే స్వభావంగల శాస్త్ర మర్యాద దానికి ప్రత్యేకం. లలిత కళల కన్నింటికీ ఒక సమానప్రాతిపదిక ఉంటుందనీ, సజాతీయ మౌలిక లక్షణాలు ఉంటాయనీ, తుల నాత్మక అధ్యయనం సాధ్యమనీ, సమష్టి కళా సిద్ధాంత దర్శనం ఉపాదేయమనీ కళాతత్త్వ విమర్శకులు భావిస్తారు. అయితే, ఒక్కొక్క కళకు సంబంధించిన రంగంలో విస్తృత ప్రయోగాలూ, విజ్ఞాన విస్ఫోటనం, విమర్శ సూత్రాలూ, అనుశీలన పద్ధతులూ విరివిగా విస్తరిస్తున్న కొద్దీ సమష్టి కళాతత్త్వశాస్త్ర దృక్పథం సాధించటం కూడా కష్టతరమౌతోంది. అట్లని దాన్ని సాహిత్యలోకం విస్మ రించటం లేదు. రచయితలు తమ రచనలలో ఒక లలిత కళా మర్యాదకు మరొక లలితకళా మర్యాదను జోడించి అపూర్వ మిశ్ర ప్రక్రియా స్వభావాలను కల్పించి నవ్య ప్రయోగాలను సృష్టించటం అన్ని యుగాల్లోనూ కనపడుతోంది. ఆధునికయుగంలో ఆ పద్ధతి మరీ సంశ్లిష్టమయింది. ప్రయోగాల కనుగుణంగా విమర్శ సూత్రాలను గాని, అనుశీలన పద్ధతులను గానీ రూపొందించుకోవలసి వచ్చినప్పుడు కళాతత్త్వ శాస్త్ర మర్యాదలను ఆశ్రయించక తప్పటంలేదు. అందు వల్ల, ఆధునిక స్పృహతో వెలువడే సాహిత్యంగాని, విమర్శగాని లలితకళా సూత్రాల సమన్వయ దృష్టితో ఒక పంథాను సృష్టించుకోవలసిన అగత్యం ఏర్ప డింది. దానితోపాటు కళాతత్త్వ శాస్త్రాధ్యయన, అధ్యాపనాల ఆవశ్యకత పెరి గింది. ఈనాటి తులనాత్మక అధ్యయన పద్ధతిలో విమర్శ విధానాన్ని పరోక్షంగా పాలిస్తోంది కళాతత్త్వ శాస్త్రం అందువలన అవశ్య పఠనీయాంశంగా ఆ శాస్త్రం ఆవిర్భవిస్తోంది. ఇటువంటి తరుణంలో ఆ శాస్త్ర మర్యాదలను ఒక విశ్వవిద్యాల యంలో బోధిస్తున్న అధ్యాపకుడు ఈ గ్రంథాన్ని తులనాత్మక అధ్యయన మార్గంలో రూపొందించటం అభినందనీయం!

తెలుగులో కళాతత్త్వశాస్త్ర మర్యాదలను సాహిత్య విమర్శలో ప్రవేశపెట్టి నవ్యతను కల్పించిన విమర్శకులున్నారు. వారిలో ప్రథమగణ్యులు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, దువ్వూరి రామిరెడ్డి గారలు. సంగీతం, చిత్రకళ మొదలైన లలిత కళలల్లో లాగానే సాహిత్యంలో కూడా కనపడే లక్షణాలను మూడింటిని గుర్తించి వాటిని అనుశీలనంలో పాటించారు రాళ్ళపల్లివారు. అవి - భావ, వస్తు, రచనాకళలు. దువ్వూరివారు 'రామణీయకా'న్ని కవితాప్రమాణంగా గణించారు. ఇప్పటి విమర్శకులలో డాక్టర్ సంజీవదేవ్‌గారు చిత్రకళాసూత్రాలను సాహిత్యానికి అన్వయించి వ్యాఖ్యానిస్తున్నారు. వీరందరి విమర్శలలో కళాశాస్త్ర మర్యాదలు, పారిభాషిక పదాలు సాహిత్యేతర లలితకళా సంప్రదాయాల నుండి తీసికొన్నవే. కాని, వాటి స్వరూప స్వభావాలు చర్చించినదానికంటె వారి విమర్శలలో వాటి అనువర్తనమే (application) ఎక్కువగా కనపడుతుంది. కాగా, లలితకళా విమర్శ మర్యాదలను మాత్రమే చర్చిస్తున్న వారూ ఈనాడు ఉన్నారు. వారిలో డా. బి. వేంకటేశం (అరిస్టాటిల్ కావ్యశాస్త్రము - 1992), శ్రీ కొండిపర్తి శేషగిరిరావు (సమన్వయ స్వరాలు - 1993) గారలు ముందుగా పేర్కొనదగిన వారు. తెలుగు సాహిత్య విమర్శలో కావ్యశాస్త్ర మర్యాదలకున్న ప్రాచుర్య, ప్రాతినిధ్యాలు తదితర కళా మర్యాదలకు లేవు. విమర్శకులు ప్రవేశపెట్టిన కళా మర్యాదలకు కూడా అంత గుర్తింపులేదు. దానికి కారణాలు రెండున్నాయి. 1. కళాతత్త్వశాస్త్రం గురించి తగినంత శాస్త్రీయమైన అవగాహన తెలుగులో ఏర్పడలేదు. 2. లలితకళ లన్నిటికీ ప్రాతిపదికలుగా పనికివచ్చే మౌలికాంశాలను గుర్తించి, వాటి తులనాత్మక మూల్యాలను నిర్ణయించి, సాహిత్యానికి అనువుగా వాడుకునే విమర్శ వివేకం రూపొందలేదు. ఈ లోపం తీర్చి తెలుగులో వాటికి ప్రాచుర్యాన్ని తేవలసిన అవసరం ఎంతైనా ఉంది. దానికి అనువుగా వచ్చిన గ్రంథం వీరభద్రయ్యగారి 'కళాతత్త్వశాస్త్రం - మౌలికాంశ వివేచన.'

సౌందర్యం, కళాహేతువులు, కళాభివ్యక్తి - అనే మౌలికాంశాలను మూడింటిని గుర్తించి పాశ్చాత్య భారతీయ కళాశాస్త్ర మర్యాదలతో వాటిని వివేచించి, వివరించటం ఈ గ్రంథంలో రచయిత సాధించిన లక్ష్యం. కళాతత్త్వ శాస్త్రాంశాలన్నింటికీ ఈ మూడూ మూల బీజాలను వీరభద్రయ్యగారు సమర్థవంతంగా అన్వయించారు. ఆ మూలత్రయం నుండి సర్వకళా శిల్ప జగత్తూ జన్మించే విధానాన్ని వివేచించారు. అటు బామ్‌గార్డెన్‌నుండి రెనే వెలెక్ దాకా

పాశ్చాత్య విమర్శకుల దృక్పథాలనూ, ఇటు భరతునినుండి జగన్నాథ పండిత రాయలవరకూ ఉన్న లాక్షణికుల అభిప్రాయాలనూ, రవీంద్రనాథ్‌టాగోర్, శ్రీ అరవిందులవంటి కళాతత్త్వ దార్శనికుల సమన్వయాలనూ, పాండే, నగేంద్ర, కె. కృష్ణమూర్తి, రాఘవన్, జి. శ్రీనివాసన్, జి. వి. సుబ్రహ్మణ్యం మొదలైన ఆధునిక సాహిత్య విమర్శకుల సమీక్షలనూ తమ అనుశీలనంలో నిపుణంగా అన్వయించుకొంటూ తమ బాటన తాము సాగారు డాక్టర్ వీరభద్రయ్యగారు. అందువలన ఈ గ్రంథం తెలుగులో కళాతత్త్వశాస్త్రీంశ వివేక విశ్లేషణాలకు ఒక క్రొత్త గవాక్షం తెరిచినట్లయింది

డాక్టర్ వీరభద్రయ్యగారు భావచిత్రాన్ని గురించి విస్తృత చర్చచేశారు. కళాభివ్యక్తి అనే మౌలికాంశంనుండి వికసించిన శతపత్ర పద్మం భావచిత్రం. దాని అవగాహన ఆధునికాంధ్ర సాహిత్యాన్ని తులనాత్మక దృష్టితో అనుశీలించ టానికి ఎంతో ఉపకరించవచ్చు తిక్కనగారి 'భవ్య కవితావేశా'నికి 'భవ్యకళా వేశంగా' ఈ రచయిత చేసిన వ్యాఖ్యానం ప్రాచీన సాహిత్య దృక్పథాలలో కళా శాస్త్ర మర్యాద లెలా ప్రతిఫలించాయో పరిశీలించటానికి ఒక ద్వారం తెరిచి నట్లయింది.

కళాతత్త్వశాస్త్రం సమన్వయాత్మక శాస్త్రీయ కళా విమర్శక సూత్రాలతో తెలుగులో నిర్మించుకోవాలి. ఎప్పటి మర్యాదలనో, ఎక్కడి సూత్రాలనో అరువు తెచ్చుకోకుండా స్వంతగా మన మార్గం మనం రూపొందించుకోవాలి. అటువంటి కళాతత్త్వ విమర్శ మార్గానికి గడుసైన మలుపు డాక్టర్ వీరభద్రయ్యగారి విమర్శ గ్రంథం. *

(ఆంధ్రభూమి 22-10-1993)

# మధుర పరిశోధకుడు

భక్తిని ఒక మహాభావంగా, యోగంగా, రసంగా దర్శించే మార్గాలు మూడు ప్రసిద్ధంగా మన దేశంలో ఉన్నాయి. అవ్యక్తమైన, ఆత్మీయమైన, మార్మికమైన ఒక ఆత్మానుభవాన్ని జాగృతం చేయగలిగిన చిత్తసంస్కారం జీవలక్షణంగా, భావధారగా పొంగించుకోగలిగిన స్నిగ్ధ భగవద్రతి మహాభావం. ఇది ప్రధానంగా ఏ సాహిత్యంలోనైనా మౌఖికసంప్రదాయ ప్రక్రియలలో ముగ్ధ మోహనంగా రూపొందుతుంది లౌకిక, అలౌకిక, అధ్యాత్మిక స్థితుల మూడింటిలో ఈ మహాభావం వివక్షా విరహితంగా వ్యక్తమౌతూ ఉంటుంది. అందువల్లనే ప్రజల పాటలు భక్తికి ప్రాణస్థానాలుగా పరిగణింపబడుతూ ఉంటాయి.

పండితులకు భక్తి, రసంకాకపోవచ్చు. కాని, జానపదులకు అన్ని రసాల కంటె ఆత్మీయమైనది భక్తిరసం. యోగులకు భక్తి, యోగం కావచ్చు; ముముక్షువులకు భక్తి, మోక్షసాధనం కావచ్చు. కాని, జానపదులకు భక్తి జీవన సారం, ఆత్మగీతం, అంతరంగ సంగీతం. భక్తిరసం నిస్సంశయంగా దేశీయం. ప్రజల హృదయాలలోని మహాభావమే ప్రజల పాటలలోని భక్తిరసానికి బీజం.

వేదాంతులకు భక్తి ఒక యోగం. అది వారికి పరమ ప్రేమరూపం కావచ్చు; భగవద్రతి కావచ్చు; ఆత్మరతి కావచ్చు. ఏదైనా అది ఆధ్యాత్మికం. భక్తి - శాంతం వంటి శుద్ధమైన ఆత్మరసం కాదు; భగవద్విభావానుభావ చర్వణం కలిగించే పారవశ్యం వలన కలిగే ఆధ్యాత్మికానందం. దీనినే ఆలంకారికంగా, తత్త్వసుందరంగా చెపితే - భగవద్విభావాన్ని పతిగా, దానిని ఆస్వాదిస్తూ తన్మయంగా ప్రవహించే ద్రవరూప చిత్తవృత్తిని సతిగా భావన చేయటం. అది కూడా లౌకికం కాదు, ఆధ్యాత్మికమే, వేదాంతుల భావనలో భక్తివలన కలిగేది బ్రహ్మానంద సబ్రహ్మచారి అయిన ఆధ్యాత్మికరసమే.

సాహిత్యరంగంలో భక్తి - రసమా, కాదా? అని అంతులేని చర్చలు సాగాయి. రసం కాదన్నవాదంలోనూ ఒక వాస్తవం ఉంది; అవునన్నవాదంలోనూ ఒక సత్యముంది. కావ్య నాటక కళారంగాలలో భరతాదులు ప్రతిపాదించిన అలౌకిక రసాలకే అస్తిత్వం ఉంది. శృంగారాది అష్టరసాలవలె భక్తి శుద్ధమైన

అలౌకిక రసం కాదు. ఒకవేళ అయి ఉన్నట్లయితే నాయికా నాయక భావంలో శకుంతలా దుష్యంతులకూ, రాధా కృష్ణులకూ, లేదా గోపికా కృష్ణులకూ, లేదా రుక్మిణీ కృష్ణులకూ భేదం ఉండే అవకాశంలేదు. శకుంతలా దుష్యంతులు అలౌకిక విభావాలు. వారిరువురి రతివలన శృంగార రసమే సామాజికులకు అందుతుంది. మరి రాధాకృష్ణులు శృంగార రస నాయికా నాయకులు కారు. వారిరువురి నడుమ గల రతి భావం ఆధ్యాత్మికంగా ఆస్వాదింపబడి భక్తిరసమౌతుంది.

భక్తిరసం శృంగారాదుల కంటె స్థాయిలో మిన్న; శాంతరసం కంటె ఒక స్థాయి చిన్న. భక్తి పఠితలను అలౌకికంనుండి ఆధ్యాత్మికంవైపు ప్రస్థానం చేయించి, ఒక అపూర్వానందాన్ని కలిగించే శక్తి కలిగివుంది. అది నిర్గుణతత్వ జ్ఞానంలో పర్యవసిస్తే శాంతరసమౌతుంది. అందువల్ల అలౌకికరసవాదులు భక్తిని రసంగా అంగీకరించకపోవటంలో ఒక వాస్తవం ఉన్నమాట నిజం. భక్తిని రసంగా అంగీకరించేవారూ, కావ్యాలలో పోషించేవారూ, లక్షణ గ్రంథాలలో నిరూపించేవారూ దానిని ఆధ్యాత్మిక స్పృహతో చెప్పారే కాని, శృంగారాదులతో సమాంతరంగా చెప్పలేదు. భక్తికి రసంగా ఒక ప్రత్యేక ప్రతిపత్తి ఉందని స్పష్టం.

డాక్టర్ దేవదాసు వెంకటేశ్వరరావు (ఆర్వీడి) గారు 'ప్రాచీనాంధ్ర సాహిత్యం - మధుర భక్తి' మీద పరిశోధన చేసి, తమ సిద్ధాంత వ్యాసాన్ని ప్రచురిస్తున్నారు. ఆ గ్రంథం చదివే అవకాశం కలిగింది. ఆ రచన నాకు మూడు రకాలుగా ముచ్చటగొలిపింది. ఈ రోజుల్లో ప్రాచీన సాహిత్యమంటేనే భయపడి పోతున్నారు పరిశోధన చేయటానికి యువతీయువకులు. ఇటువంటి తరుణంలో ప్రకాశం జిల్లాలోని ఉలవపాడు ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో తెలుగు లెక్చరరుగా పని చేస్తున్న డాక్టర్ ఆర్వీడిగారు ప్రాచీనాంధ్ర సాహిత్యాన్నంతా పరచుకున్న పరిశోధనాంశాన్ని ఎన్నుకొని సమర్థవంతంగా నిర్వహించటం నాకు కలిగించిన మొదటి ముచ్చట.

మధుర భక్తి వినటానికీ, అనుభవించటానికీ ఎంత తియ్యగా ఉంటుందో వివరించటానికీ, తెలియచెప్పటానికీ అంత తికమక పెడుతుంది. పెద్ద పెద్దలే మధురభక్తిని గురించి వ్యాఖ్యానించటానికి తిప్పలుపడ్డారు. మధురభక్తిని గురించి మననం చేసుకోవటమే ఒక మహా విషయం; దానిని మధురంగా చెప్పటం మరో గొప్ప విషయం. ఆ రెండింటినీ డాక్టర్ ఆర్వీడిగారు మధురంగా సాధించటం రెండో ముచ్చట.

ఏ సాహిత్యంలోనైనా ఒక్కొక్క అంశాన్ని గురించి అనుశీలించాలంటే దాని స్వరూప స్వభావాలనుబట్టి ఒక ప్రత్యేక పరిశీలన పద్ధతిని రూపొందించుకోవటం నిపుణులైన పరిశోధకుల లక్షణం. తెలుగులో మధురభక్తి రసపోషణ ప్రస్థానాన్ని దర్శించి నిరూపించాలంటే అదొక విశిష్ట ప్రయత్నమే అవుతుంది. ఎందుకంటే - అటువంటి రసానుశీలన విధానానికి అనువైన విమర్శ వివేకం తెలుగులో ఇంకా బాగా వికసించలేదు ఇటువంటి తరుణంలో డాక్టర్ ఆర్వీడిగారు ఒక సొంతబాట వేసుకొని, ఒక సొంత గొంతుతో పరిశీలన సాగించిన పద్ధతి నాకు నచ్చిన మూడో ముచ్చట.

మూడు ముచ్చటలు ఒకచోట కుదరటం చెప్పుకోదగ్గ ముచ్చట!

డాక్టర్ ఆర్వీడిగారు భక్తిరసానుశీలనానికి చక్కని బాట వేసుకున్నారు. సంస్కృత సాహిత్యంలోని శ్రీకృష్ణ భక్తి తత్వాన్ని వ్యక్తీకరించే గ్రంథాలను పరిచయం చేయటంవలన భక్తిరసానుశీలన విధానం సులభమయింది. భక్తి రసానికి ఆధ్యాత్మిక ప్రతీకలైన పాత్రలే పనికి వస్తాయని రెండవ అధ్యాయం నిరూపించింది. మొదటి అధ్యాయం లక్షణం; రెండవ అధ్యాయం లక్ష్యంగా సాగింది.

ఆరధ్యాయాల ఈ గ్రంథంలో మూడో అధ్యాయం హృదయస్థానం. ఆంధ్ర భాగవతంలోని మధురభక్తి నిరూపణం అందులోని పరమార్థం. భాగవత కథలు అలౌకిక రసకావ్యాలలోని కథలవంటివికావు వాటిలోని పాత్రల బహిస్స్వరూప స్వభావాలకంటె అంతరార్థాలు ముఖ్యం గ్రంథకర్త వాటికే ప్రాధాన్యమిచ్చి ఆధ్యాత్మికరసమైన భక్తిని వివరించారు. భాగవతంలోని మధురభక్తిని గూర్చి చేసిన సమాలోచనం సహృదయులచేత సమాదరింపదగినట్లుగా ఉంది.

1993 లో డాక్టర్ సురవరం పుష్పలతగారి సిద్ధాంత వ్యాసం 'మధురభక్తి-ముగ్ధభక్తి' వెలువడింది. అందులో భాగవతంలోని 'మధురభక్తి' అనుశీలింపబడింది. ఈ రెండు గ్రంథాలూ దాదాపు ఒక సంవత్సరంలోనే రావటం విశేషం. మన పరిశోధనలలో వస్తున్న పరిణామాన్ని సూచిస్తున్నవి. అయితే, ఈ రెండు గ్రంథాలనూ చదివితే డాక్టర్ పుష్పలతగారు మధురభక్తిని లక్ష్య లక్షణ సమన్వయ పరిశీలనం చేసినట్లు తెలుస్తుంది; డాక్టర్ ఆర్వీడిగారు మధురభక్తిని మధురంగా అనుశీలించినట్లు స్పష్టమౌతుంది. ఇద్దరిలోని ఆ వైవిధ్యం పరిశోధన కొక పరిమళం. ఇద్దరి పద్ధతులలో వైరుధ్యం లేకపోవటం ప్రామాణికత కొక ఉదాహరణం!

భక్తి సంప్రదాయాలలో రాధాకృష్ణులకు భక్తిరస ప్రతీకలుగా ప్రసిద్ధి ఉంది. శ్రీకృష్ణుడు రస స్వరూపుడనీ 'రసోవైసః' అనే సూత్రం ఆయనపట్ల అన్వర్థమౌతుందనీ భక్తిరసదర్శనం. భాగవతంలో తప్ప తెలుగు కావ్యాలలో ఈ తత్త్వం అంత గాఢంగా ప్రతిఫలించలేదు. అయినా, డాక్టర్ ఆర్వీడిగారు తెలుగులోని రాధాకృష్ణ వస్తుకాలైన కావ్యాలను కమనీయంగా సమీక్షించారు. పద సాహిత్యంలోని మధురభక్తిని చవిచూపించారు. మొత్తంమీద ప్రాచీనసాహిత్యం లోని మధురభక్తిని పఠితల మనసులకు పట్టేటట్టు మధురంగా చెప్పారు. అందుకే ఆర్వీడిని 'మధుర పరిశోధకు' డనవచ్చు.

డాక్టర్ ఆర్వీడి - అంటే డాక్టర్ దేవదాసు వెంకటేశ్వరరావు డి.వి.ఆర్. అనే పొడి అక్షరాలు ఆర్వీడిగా తిరగబడ్డాయి. ఇది మధురభక్తి ప్రాధాన్యాన్ని చెప్పే గౌడీయ సంప్రదాయాన్ని జ్ఞాపకం చేస్తుంది. జడజగత్తులో శాంత, ప్రీతి, ప్రేయో, వత్సల, మధుర భక్తులు ఆ వరుసలో ఉండి శాంత భక్తికి ప్రాధాన్యాన్నిస్తాయి. అవే చిత్ జగత్తులో ప్రతిఫలించి వ్యత్యస్తమౌతాయి. మాధుర్యం మొదట నిలుస్తుంది. అలాగే లౌకిక జగత్తులో 'డి.వి.ఆర్.' సాహిత్య జగత్తులో 'ఆర్వీడి' అయ్యాడు. మధురభక్తిమీద పరిశోధన చేసిన రచయితకు ఇలా కలం పేరు కుదరటం కూడా మధురమే! *

(ఆంధ్రభూమి 13-5-1994)

# రచనకు మూడురకాల అస్తిత్వం

శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో మా యువభారతీయుల సాహిత్య గోష్ఠులు జరుగుతూండేవి యిదివరలో. వాటిల్లో సభ్యులు వివిధాంశాల మీద వివిధ దృక్కోణాలతో చర్చలు సాగిస్తూండేవారు. ఒకసారి ఒక సాహితీ మిత్రుడు ఇలా ప్రశ్నించాడు—

'సాహిత్యాన్ని గురించి, అంతదాకా ఎందుకు? ఒక్కొకసారి ఒక్కొక కావ్యాన్ని గురించి, మరీ ఒక్కొక కవితను గురించి కూడా ఎంతోమంది ఎన్నో రకాలుగా మాట్లాడుతూంటారు, విమర్శిస్తూ ఉంటారు. మరి....మాలాంటి వాళ్ళం వాటిలో ఏది నిజమో ఏది నిజం కాదో నిర్ణయించుకోవటంలో ఇబ్బంది పడుతూంటాం. అయినా, నా అసలు అనుమానం ఏమిటంటే - ఒకే సత్యాన్ని గురించి ఇంతమంది ఇన్ని విధాలుగా చెప్పటమేమిటి? అని.' విన్నవారి కిది మంచి చర్చనీయాంశ మనిపించింది.

'ఏకం సత్ విప్రా బహుధా వదన్తి' అని వేదాంతిలా సమాధానం చెప్పవచ్చు. కాని, అలా ఎందుకు బహుధా మాట్లాడతారన్నది ప్రశ్న వెనకాల ఉన్న ప్రశ్న.

ఏ కాలంలోనైనా ఒక రచనకు విలువకట్టే విమర్శకుడు దాని అస్తిత్వాన్ని గురించి ముందుగా నిర్ణయించవలసివస్తుంది నిజాని కది సాహిత్యమౌలిక సమస్య. రచన కుండేది ఒకే ఒక అస్తిత్వం కాని, ఆ ఒక్కటీ మూడు రకాలుగా గోచరించటం లోకసహజం. ఆ మూడు రకా లివి—

1. రచయిత తన రచన కున్నదని చెప్పుకుంటున్న అస్తిత్వం.

2. పఠితగాని, విమర్శకుడుగాని ఆ రచన కున్నదని చెపుతున్న అస్తిత్వం.

3. ఆ రచనకున్న అసలైన అస్తిత్వం.

ఈ మూడూ త్రికరణాల్లాంటివి. మూడూ ఒకటిగా మనగలిగితే అంత కంటె ముచ్చటైన సత్యం మరొకటి ఉండబోదు. కానీ, అలా మూడూ ముడి

పడటం సామాన్యంగా సాధ్యపడదు. ఒకవేళ సాధ్యమైతే దానిమీద చర్చకు పెద్దగా అవకాశముండదు. ముడిపడకపోతే మిగిలేదంతా చర్చయే. సమకాలీన సాహిత్యంలో ముడిపడే సమస్యలు తక్కువ; పడనివి ఎక్కువ; మనం పడనీయనివి మరీ యెక్కువ!

ఈ మూడు రకాల వింగడింపులు ఒక రచన కెంత వర్తిస్తాయో, ఒక కావ్యానికీ, రచయితకూ, సాహిత్యానికీ కూడా అంతే అనువర్తిస్తాయి.

కవులు తమ కావ్యావతారికల్లోనూ, కావ్య ఘట్టాలల్లోనూ తమ రచన అస్తిత్వాలను గురించి సూచిస్తారు. కాని, ఆ అంశాలలో కవుల అభిరుచులు, ఆశయాలు, కవితా లక్షణాలూ, రచనా స్వభావాలూ ఎక్కువగా గోచరిస్తుంటాయి. అయితే, అవన్నీ ఆయా రచనల్లో ఎలా చోటు చేసుకున్నాయో వివేచించవలసిన విషయం విమర్శకుల బాధ్యతగానే మిగిలిపోతుంది. ఆదర్శాలకూ, ఆచరణలకూ, ప్రయోగాలకూ, ప్రమాణాలకూ ఎంతవరకు పొత్తు కుదిరిందో, రచయిత ఎంతవరకు రచనలో కృతకృత్యుడయ్యాడో ఉత్తమ విమర్శకుడు వివేచిస్తాడు. మరి కొందరు అలాకాదు. రచయిత భావ జాలంతో తన భావజాలం పడిరాకపోతే ఒక్కొక్కసారి నిర్దాక్షిణ్యంగా తమ ప్రమాణాలతో ఆ రచనను పడతిట్టవచ్చు కూడా! ఇదంతా విమర్శకుడు ఆ రచన అస్తిత్వాన్ని రచయిత దృక్పథంతో ఏకీభవించి నిర్ణయిస్తున్నాడా? లేక విభేదించి విలువ కడుతున్నాడా? అన్నదాని మీద ఆధారపడి ఉంటుంది.

ఒక్క ఉదాహరణ : నన్నయ తన కవిత్వంలో 'ప్రసన్న కథాకలితార్థ యుక్తి' ఉన్నదన్నాడు. దానిని విమర్శకులు దర్శించి వ్యాఖ్యానించారు. కథా కథన శిల్పంలో ఆ లక్షణాన్ని అందరూ అంగీకరించారు ఏకగ్రీవంగా. అందువలన అది వివాదవిషయం కాలేదు. కాని, పాల్కురికి సోమనాథుడు తన కవితాగుణంగా పేర్కొన్న 'అల్పాక్షరాలలో అనల్పార్థ రచన' ఆయన కవితకు సర్వత్రా అన్వయించటం లేదు. అందువలన దానిమీద అందరికీ ఏకాభిప్రాయం లేదు. దీనివలన తేలిందేమిటంటే - కవి చెప్పుకున్న కవితాలక్షణాలన్నీ ఆయన కావ్యాలలో ఉండాలనే నియమం లేదు. నన్నయ తన ఆశయాన్ని ఆచరణలో అక్షరాలా నిరూపించాడు. సోమన ఆ పని చేయలేకపోయాడు. అంటే - కవి తన రచనకు ఒక విశిష్టమైన అస్తిత్వాన్ని కల్పించటానికి ఆశించవచ్చు. దానికై ప్రయత్నించవచ్చు. కాని, ఆ ప్రయత్నంలో సఫలుడయ్యాడా, లేదా? అయితే

ఎంతవరకు అయ్యాడు? అనే ప్రశ్నల మీదనే అతని రచనయొక్క అసలైన అస్తిత్వపు విలువ ఆధారపడి ఉంటుంది.

రచనయొక్క అస్తిత్వం విమర్శకునియొక్క దృక్పథంమీద కూడా ఆధారపడి, ఒక్కొకసారి తీవ్ర వాదోపవాదాలకు నిలయమౌతుంది. కవిత్రయం వారు ఆంధ్ర మహా భారతాన్ని మత ప్రచారంకోసం రాశారా, సాహిత్య స్పృహతో రచించారా అనే దానిమీద నేటికి చర్చ సాగుతూనే ఉంది. రచన యొక్క సాహిత్యపు అస్తిత్వాన్ని సాహిత్యేతర ప్రమాణాలతో నిర్ణయించేవారు ఆంధ్రమహాభారత సాహిత్య వ్యక్తిత్వాన్ని గుర్తించరు.

చరిత్రలో ప్రతి ఘట్టంలోనూ సాహిత్యాన్ని ప్రచారసాధనంగా ఒక వర్గంవారో, ఒక వర్ణంవారో, ఒక రాజకీయ పక్షంవారో ఎప్పుడూ వాడుకుంటూ ఉంటారనీ, అంతకంటె సాహిత్యానికి అత్యుత్తమమైన అస్తిత్వం సమాజంలో ఉండటానికి వీలులేదనీ భావించేవారు భారతాన్నే కాదు, పలికిన ప్రతి కవితనూ భావజాల ప్రచారంకోసం పుట్టినట్లే చూస్తారు, దానికి తగిన ప్రమాణాలతోనే పరిశీలిస్తారు. ఇటువంటివారి ప్రమాణాలకు నిలబడలేకపోతే ఎంత ఉదాత్త సాహిత్యమైనా ఎందుకూ పనికిరానిదైపోవచ్చు. లేదా వారి ప్రమాణాలే ప్రజల దృష్టిలో పనికిరానివైపోవచ్చు. ఈ రెండూ ఇప్పుడు ప్రపంచంలో చూస్తున్నాం.

రచనయొక్క అసలైన అస్తిత్వం నిర్ణయించటం అంత తేలికైన పని కాదు. పదహారవ శతాబ్దంలో వెలువడిన తెలుగు కావ్యాలను ప్రబంధాలని పిలుస్తున్నాం. వాటి సమగ్ర అస్తిత్వ సందర్శనంకోసం, ఎన్ని వాదోపవాదాలు నడుస్తున్నా, మనం ఇంకా అన్వేషిస్తున్నాం. పదకవిత్వ అస్తిత్వ, వ్యక్తిత్వాలను గురించి ఇంకా లోచూపు సారిస్తూనే ఉన్నాం. కవిత్వంలో ఛందశ్శిల్పం, లయాత్మకత ఇప్పటికీ చర్చనీయాంశాలుగా సాగుతున్నాయి. భావకవితా ప్రయోగాలను గురించి, నవ్యసంప్రదాయోద్యమం గురించి, ఆధునిక మహాకావ్య స్వరూప స్వభావాలను గురించి, అనుభూతివాద కవితాతత్త్వాన్ని గురించి ఇంకా గాఢంగా పరిశోధనలు నడుస్తున్నాయి. భిన్నాభిప్రాయా లుండవచ్చు. మథనం మంచిదే.

సామాజిక చైతన్యం అన్ని రంగాల్లో సాహిత్య అస్తిత్వాన్ని నియతం చేస్తుందా? సాహిత్య అస్తిత్వం సామాజిక చైతన్య పరిధిని తనలో విలీనం చేసి కొని కళాత్మకంగా, సమున్నతంగా, విలక్షణంగా ప్రతి యుగంలో ఉండగలుగుతుందా? సాహిత్య అస్తిత్వానికి ముఖ్యమైంది సాహిత్యపరమైన అస్తిత్వమా? సాహిత్యేతరమైన అస్తిత్వమా? అనే ప్రశ్నలకు సమాధానాలు అన్వేషించే రచయితలు, పఠితలు, విమర్శకులు, కళాకారులు అనుసరించే వారివారి దృక్పథాలనుబట్టి రచనల అసలైన అస్తిత్వాలను నిర్ణయించటం జరుగుతోంది. అందుకే ఇన్ని అభిప్రాయభేదాలు, ఇంత వైవిధ్యం. అయినా, మూడు విధాల ఏకత్వం కోసం ముందుకు సాగుతున్నాం.

అసలైన అస్తిత్వాన్ని, ఏకత్వాన్ని దర్శించి నిర్ణయించటం సాహిత్యేతర దృక్పథాలతో ఎన్నటికీ సాధ్యంకాదు. కాని, సాహిత్య స్పృహతో నిర్ణయించటం మాత్రం అసాధ్యం కాదు. కాని, అపూర్వం! అందుకే సాహిత్యానికీ, రచనకూ సమాజ జీవితంలో విలువకట్టలేనంత విలువ! *

(ఉదయం, 2-12-1991)

# సాహిత్యవికాసంలో అంతర్గతిసూత్రం

వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో ఎంతమంది కవులు, రచయితలు ఏయే కాలాలలో ఏయే రచనలు చేశారు? వారి జీవితవిశేషా లేమిటి? కావ్య రచనా వైశిష్ట్యా లెటువంటివి? మొదలైన వివరాలను కాలక్రమపద్ధతిలో చెపితే 'కవుల చరిత్ర' అవుతుంది. అయితే, ఇప్పు డది పాతబడ్డ పద్ధతి.

దానికంటె మేలైనది సాహిత్య చరిత్ర. ఏయే చారిత్రిక, సాంఘిక, మత, రాజకీయ, సాంస్కృతిక, సాహిత్య పరిస్థితులలో ఏయే కవులు ఏయే రచనలు ఏయే కాలాలలో చేశారో వివేచిస్తూ, కాలక్రమపద్ధతి ననుసరించి, యుగ విభజన సూత్రాన్ని ఆలంబనంగా చేసికొని సాహిత్య సమీక్ష చేసేది సాహిత్య చరిత్ర.

తెలుగులో ఇంతవరకు వెలువడిన సాహిత్య చరిత్రలలో రచయితలు పాటించిన యుగవిభాగ పద్ధతులను పరిశీలిస్తే ఎక్కడా ఏకసూత్రత కనపడదు. కొందరు సాహిత్య చరిత్రకర్తలు యుగాలను యుగకర్తలైన కవుల పేర్లమీదా, ప్రసిద్ధ ప్రక్రియల పేర్లమీదా పిలిచారు. మరికొందరు సాహిత్య ధోరణులకూ, ప్రయోగాలకూ, ఉద్యమాలకూ ప్రాధాన్యమిచ్చి ఆ పేర్లు పెట్టారు. ఇంకొందరు రాజవంశాల ప్రాతిపదికమీదా, చారిత్రిక ఘట్టాల ప్రాబల్యంమీదా యుగాలను రూపొందించారు. అయితే, ఏ సాహిత్య చరిత్రలోనూ ఒకే పద్ధతి అమూలాగ్రం పాటించటం సాధ్యం కాలేదు. యథాసౌకర్యంగా యుగవిభాగం సాగింది.

సాహిత్య చరిత్రలలో యుగ విభజనం నియతంగా కాలక్రమ పద్ధతిలోనే సాగింది. ప్రతి యుగానికీ ఒక ప్రత్యేకత ఉండటం సహజం. ఆ ప్రత్యేకతను చాటే యుగధోరణులను విశేషంగా వ్యక్తీకరించటం యుగసమీక్ష ముఖ్యధర్మమైనా- ఆ కాలంలో వెలువడిన వాఙ్మయాన్నంతా గుదికూర్చి వివరించక తప్పదు. దానివలన సాధారణంగా సాహిత్య చరిత్రకు సమన్వయస్వభావంకంటె సంకీర్ణ స్వభావం ఏర్పడే అవకాశం ఎక్కువగా ఉంటుంది. అందువలన ఈ పద్ధతికూడా ఆదర్శవంతమైనదని చాలమంది భావించటం లేదు.

సాహిత్య చరిత్ర కంటె సార్థకమైనదీ సాహిత్య పరిణామ చరిత్ర. సాహిత్యంలో కలుగుతున్న పరిణామాలను గుర్తించటం, ఆ మార్పులకు కార్య కారణ సంబంధాలను తర్కబద్ధంగా నిరూపించటం ఈ మార్గంలోని ముఖ్య లక్షణం. అయితే, పరిణామాలకు ప్రేరకశక్తులను గుర్తించి నిర్ణయించటంలో సాహిత్య చరిత్రకారులలో ప్రధానంగా రెండు దృక్పథా లున్నాయి. ఒకటి గతి తార్కిక భౌతికవాదాన్ని అనుసరించి ఆయా కాలాలలో ఆయా క్రమాలలో జరిగే సామాజిక పరిణామాలకు అనుగుణంగా సాహిత్యంలో కూడా పరిణామాలు కలుగుతాయని విశ్లేషించే దృక్పథం. రెండు - సమాజ పరిణామాలకు సమాంత రంగా సాహిత్యంలో కూడా పరిణామాలను కలిగించే అంతర్గతి తర్కం ఒకటి ఉంటుందని, సాహిత్యంలో వచ్చే దార్శనికమైన, ప్రక్రియాపరమైన, శైలీసంబంధ మైన ప్రయోగాల కన్నింటికీ అదే ప్రేరక శక్తిగా పని చేస్తుందనీ వివేచించే దృక్పథం. ఈ రెండింటినీ అందరికీ అందుబాటులో ఉండే పరిభాషలో చెప్పా లంటే మొదటిది - సామాజికస్పృహ; రెండవది - సాహితీ స్పృహ.

సాహిత్య పరిణామ చరిత్రలు పరిణామాలను కార్యకారణబద్ధంగా వ్యాఖ్యా నిస్తున్నాయి కాని, అవి ఆయా కాలాలలో అదే క్రమంలో ఎందుకు వచ్చాయో అటు చారిత్రకంగా గానీ, ఇటు సాహితీపరంగా గాని ఇదమిత్థంగా, ఖచ్చితంగా, సమగ్రంగా, తర్కబద్ధంగా వ్యాఖ్యానించి చెప్పలేకపోతున్నాయి. ఈ లోపాన్ని తీర్చగలిగింది సాహిత్య వికాస చరిత్రగా పలువురు భావిస్తున్నారు.

ఒక కాలంలోని మత, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక వ్యవస్థలను సమర్థించటానికో, నిలవబెట్టటానికో, విమర్శించటానికో, కూలగొట్ట టానికో మాత్రమే సాహిత్యం పుడుతుందని కొందరు చేసే వాదాన్ని సిద్ధాంత పరంగా అంగీకరించినా, ఉదాత్త సాహిత్యం ఒక కాలంలో పుట్టి, సమకాలీన మతరాజకీయార్థిక పరిణామాల ప్రభావాన్ని కొంత కలిగి ఉన్నా, సాహిత్య జగత్తులో ఆ ప్రభావానికి లోనుగాని ఒక నవ్య దర్శనాన్ని ప్రతిపాదించటం ద్వారా, దాని కనుగుణమైన ప్రక్రియలను, కవితా శైలులను నిర్మించటం ద్వారా ఒక నూత్నపరిణామాన్ని తీసుకొని వచ్చే అవకాశ మున్నట్లు మన సాహిత్య చరిత్ర స్పష్టంగా చెపుతున్నది. దీనిని బట్టి సాహిత్య పరిణామానికి కారణం సాహిత్య దర్శనంలో కవులు తెచ్చే మార్పులేనని స్పష్టమౌతున్నది.

గతితార్కిక భౌతిక సూత్రాన్ననుసరించి సాగే సామాజిక పరిణామ చరిత్రలో అంతర్భాగంగా సాహిత్య చరిత్రను సమన్వయించిన దానికంటె సాహిత్యంలోని సహజ గతితార్కిక పరిణామ చైతన్యానికి ప్రేరణ కలిగించే సాహిత్య దార్శనిక సిద్ధాంతాల నాశ్రయించి రచనలు వెలువడుతాయన్న వాస్త వాన్ని గుర్తించి, ఆయా సిద్ధాంత దృక్పథాలతో వెలువడిన రచనా ప్రక్రియల వికాసవిధానాన్ని వివేచించేటట్లు సాహిత్య పరిణామ చరిత్రను రూపొందిస్తే - అది సాహిత్య వికాస చరిత్ర అవుతుంది. వికాస చరిత్ర - పరిణామాలను మార్పులు గానే కాకుండా, వాటికి తాత్త్విక భూమికలుగా పనిచేసే శక్తుల వికాసగతి సూత్రాన్ని గూడా దర్శించి వివేచిస్తుందన్న మాట.

కడచిన ఆగస్టు రెండో తేదీన వెలువడిన 'సాహితీ సంపద' (ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య షష్టిపూర్తి అభినందన గ్రంథం)లో నేను రాసిన వ్యాసం 'శ్రీనాథయుగం - మరొక్క చూపు' ఈ మార్గంలో నడిచింది నా 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు' గ్రంథంలో చెప్పిన అంశాలకంటే క్రొత్తగా చెప్పిన అంశాలు ఇందులో ఉన్నాయి.

తమ కాలంలో భారతీయ సాహిత్య దర్శనాలలో వస్తున్న అత్యంత ఆధునిక ధోరణులకు లక్ష్యాలుగా కావ్య ప్రయోగాలు చేసే కవుల ప్రవృత్తి సాహిత్య వికాసానికి దోహదం చేస్తుంది. క్రి. శ. 11వ శతాబ్ది నుండి 17వ శతాబ్ది దాకా ధ్వని పరివర్తన యుగం సాగింది. ఆ కాలంలో సాహిత్య సిద్ధాంతాలలో ముఖ్యంగా నాలుగు శాఖలు ప్రారంభమై వికసించాయి.

తెలుగు సాహిత్యంలో కలిగిన పరిణామాన్నిగాని, వికాసాన్నిగాని వివేచించేటప్పుడు ఈ సాహిత్య సిద్ధాంతాల ఆవిర్భావ వికాసాలను విస్మరించ లేము. భారతీయరంగంలో ధ్వని ప్రవర్తన యుగంలో పుట్టి పెరిగిన సాహిత్య సిద్ధాంత శాఖలే తెలుగు సాహిత్య వికాసాన్ని తీర్చిదిద్దాయి. వాటిలో మొదటి శాఖ ధ్వనిమార్గాన్ని సమర్థించేది. తెలుగులో కవిత్రయం ఈ మార్గాన్ని ఘంటా పథం చేసింది. రెండవది అలంకార ప్రస్థానశాఖ. తెలుగులో ఈ మార్గానికి మార్గ దర్శి నన్నెచోడుడు. మూడవ శాఖవారు శుద్ధ రసవాదులు. ఈ మార్గానికి తెలుగులో పోషకులుగా నిలిచేవారు పాల్కురికి సోమనాథుడు, శ్రీనాథుడు, పోతన, అన్నమాచార్యులు, మరికొందరు శ్రీనాథ యుగ కవులు. నాల్గవది కవి శిక్షా శాఖ. భాస్కర రామాయణాది కావ్యాలను రచించిన కవులు ఈ మార్గంలో

నడిచారు. వీరు కావ్య లక్షణాలను పాటించినా ఒక సాహిత్య దర్శనాన్ని అనుసరించిన శైలిని సృష్టించే వ్యక్తిత్వం ప్రకటించలేదు.

సాహిత్య దర్శనం గల కవులే నవ్యతను సృజించగలరు, యుగాలను ప్రవర్తింపజేయగలరు. తెలుగు సాహిత్యంలో నాచన సోముడు చమత్కార ప్రస్థానాన్ని, ప్రబంధ కవులు వక్రోక్తి ప్రస్థానాన్ని, శ్లేష కావ్య కవులు, ద్వ్యర్థి, త్ర్యర్థికావ్యకవులు అలంకార ప్రస్థానాన్ని, దక్షిణాంధ్ర యుగ సాహిత్యంలోని పద కర్తలు యక్షగానకర్తలు, శృంగార కావ్యకర్తలు శుద్ధ రసవాదాలలోని వివిధ శాఖలను సమర్థించి పోషించారు. సాహిత్య వికాసానికి సాహిత్య దార్శనిక సిద్ధాంతాల వికాసమే ప్రేరక శక్తిగా పనిచేస్తుందని పై వివేచన స్పష్టం చేస్తుంది.

ఆధునికాంధ్ర సాహిత్యాన్ని వివేచించేటప్పుడు కూడా ఈ వికాస దృక్పథమే పనికి వస్తుంది. సాహిత్యేతర సిద్ధాంతాలూ, పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలూ, భారతీయ సాహిత్య సిద్ధాంతాలూ, ప్రయోగ వైచిత్రులూ అనే నాలుగు శాఖల్లో ఆధునిక సాహిత్యం తెలుగులో వికసించింది. ఈ అంశాన్ని గురించి మరోసారి వివరంగా రాస్తాను. సాహిత్య వికాసంలో తప్పకుండా ఒక అంతర్గతి సూత్రం ఉంటుంది! *

**(ఆంధ్రభూమి 8-10-1993)**

# తిట్టువిమర్శ దివాలాకోరుతనానికి సూచిక

మొన్న నవంబరు 30 వ తేదీ రాజమహేంద్రవరంలోని తెలుగు విశ్వవిద్యాలయం వారి సాహిత్యపీఠానికి వెళ్ళాను. మిత్రుడు సి. యస్వీ. అచ్యుతశర్మ కలిశాడు ఒకప్పుడు శర్మ నా శిష్యుడు కూడా. నా పర్యవేక్షణలో హైదరాబాదు విశ్వవిద్యాలయంలో ఎం. ఫిల్., చేశాడు. అతన్ని చూడగానే 'తెలుగులో ప్రతివిమర్శ'ను గురించి ముచ్చటించుకున్న రోజులు గుర్తుకొచ్చాయి. అతను తన గ్రంథాన్ని ప్రచురించి, నాతో చెప్పకుండానే దాన్ని నాకు అంకితమిచ్చి, ఆప్యాయంగా నా చేతుల్లో పెట్టాడు అతని మనసులో నామీద అంత అభిమానం ఉందని నేనంతవరకూ ఊహించలేకపోయాను. అతను అన్నింటికీ మౌనంగా నవ్వుతాడు. 'ప్రతివిమర్శ' చేసే ప్రతిధ్వనులు చేయకుండా నిశ్శబ్దంగా వచ్చి మన మనసుల్లో కూర్చుంటాడు. ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే - అతని పరిశోధనాంశం 'ప్రతివిమర్శ - పరామర్శ' ను గురించి ఆలోచిస్తూ 'గౌతమి'లో బయలుదేరాను. నాలో మరో రైలు కూత కూసింది

తిట్టు కవిత్వంలాగా తిట్టు విమర్శకూడా నేడు ప్రచారంలో ఉంది కదా! 'ప్రతివిమర్శ'లో దాని స్థితి ఏమిటి?

తిట్టుకు పట్టం కట్టితే తెలివైన ప్రతివిమర్శ కాదు. అందువల్లనే కాబోలు అచ్యుతశర్మ ఆ పేరే స్మరించలేదు. ఆ పేరు రామాయణంలో మందరలాంటిది. ఆ పాత్ర చిన్నదైనా అయోధ్యను అడివిగా మారుస్తుంది. అలాంటిదే విమర్శలో తిట్టు విమర్శ. మిత్రులు ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారు 'తెలుగులో వ్యాసపరిణామాన్ని' పరిశీలించి, విస్తృతంగా వ్యాస విశ్లేషణం చేసి. తిట్టుతో ముడిబడ్డ వ్యాసాన్ని 'వివాదవ్యాసం'గా చెప్పారుగాని, విడిగా దానికో పేరు పెట్టలేదు. అందులోనూ ఒక ఔచిత్యం లేకపోలేదు.

వారే మరొక మంచి మాటన్నారు - "శ్రీ విశ్వనాథ సత్యనారాయణ శిష్యులలో ప్రాణమిచ్చేవాళ్ళు, విమర్శకులలో ప్రాణం తీసేవాళ్ళు ఉన్నారు" అని. (పుట. 424). విశ్వనాథను గురించి ఎప్పుడు వివాదం చెలరేగినా ఈ మాట ముమ్మాటికీ నిజమనిపిస్తుంది. దానివెంట మరొక వాస్తవం కూడా మరువలేం.

విశ్వనాథ సాహిత్యానికి, ఎన్నిసార్లు ప్రాణం తీస్తున్నా (మని అనుకున్నా), అది చివరకు చావకపోగా ప్రతిసారీ క్రొత్త చిగురువేస్తున్నది. 'ప్రాణంతీసే' విమర్శలను దానిమీదకు ఎన్నిసార్లు ప్రయోగించినా అవి చివరకు చంపలేకపోగా తామే చచ్చుపడిపోతున్నవి. చిచ్చుబుడ్డిలా పేలి చప్పబడిపోయేవి తిట్టు విమర్శలు.

ఈ మధ్య కొన్ని సదస్సుల్లో, పత్రికల్లో సాగిన గోష్ఠులు, చర్చలు గమనిస్తే 'వివాద వ్యాసం' అనే పేరు - వాటిపట్ల చాల పేలవంగా, బల హీనంగా, వెలవెలపోతుందేమో! 'ప్రతివిమర్శ' అనే 'పారిభాషిక'పదం వాటి ముందు నీరసంగా నిలువునా నీరుగారిపోతుందేమో! అందుకని- 'తిట్టు విమర్శ' అంటేనే గట్టిగా పట్టుగా ఉంటుంది. హెచ్చరిక!.... తెలుగులో తిట్టు కవితలాగా తిట్టు విమర్శ కూడా ఆధునిక సాహిత్య ప్రయోగాలలో ఒకటిగా పరిగణించారా సరి, లేదా, మరో తిట్టు విమర్శకు సిద్ధంగా ఉండండి.

ఈ రోజుల్లో ఎవరైనా ఏ తెలుగు విమర్శకుణ్ణి గురించి తెలుసుకోవాలన్నా ఆయన పాజిటివ్ విమర్శ చేస్తారా, లేదా, మరోరకం విమర్శ ఏదైనా చేస్తారా? అని సూటిగా అడుగుతున్నారు. అంటే పాజిటివ్, నాన్ పాజిటివ్ దృక్పథాలు గల విమర్శకులు సాహిత్యరంగంలో ఉండటం సహజమని సామాజికులు నేడు భావిస్తున్నారన్నమాట! వారడిగే సూటి ప్రశ్నకు ముందుగా సమాధానం చెప్పి ముందడుగు వేయవలసి ఉంటుంది.

తెలుగువారు వ్యవహారంలో లాగానే, విమర్శలో కూడా ఇంగ్లీషు పదాలను మంచినీళ్ళలాగా వాడుతుంటారు. అయితే, కొన్ని ఇంగ్లీషు మాటలకు తెలుగులో అర్థాలు వేరుగా ఉంటాయని గుర్తించటం అవసరం. ఈ సంగతి మరోసారి మాట్లాడుకుందాం. ఇంగ్లీషు పదాలచోట తెలుగు పదాలు కూడా వాడుకొనే అలవాటు ఆంధ్రులకు విరివిగా ఉంది. అయినా, చదువుకొన్న తెలుగువారికి మాట వరుసలో అలవోకగా కలిసివచ్చేది ఆంగ్ల పదం; ఆలోచిస్తే అనువుగా దిగి వచ్చేది తెలుగు పదం ఆశ్చర్యం కదూ? కొందరు తెలుగు మాట్లాడుతుంటే ఇంగ్లీషును లోన అనుకుంటూ సమాంతరంగా తెలుగు తర్జుమా చేస్తున్నట్లుంటుంది. మరి కొందరు మాట్లాడుతూంటే తెలుగు పదబంధాలు కొత్తగా సహజంగా రూపొందుతున్నట్లుంటుంది.

పాజిటివ్ విమర్శను 'సవ్య విమర్శ' అందాం. మరోరకం విమర్శను 'అపసవ్య విమర్శ' అని పిలుద్దాం. సవ్య విమర్శను చాలమంది కోరుకొంటారు. అపసవ్య విమర్శ సవ్య విమర్శకంటే చమత్కారవంతంగానో, వక్రతా విశిష్టం

గానో ఉంటుంది. దానిలో కూడా అనేక రకాలుగా ఉంటాయి వాటన్నింటిలో తిట్టు విమర్శకు ఒక చౌకబారు చోటు మాత్రమే మిగులుతుంది కొందరు విమర్శను తిట్టుకు పర్యాయ పదంగా భావిస్తారు. కాని, తిట్టునే విమర్శగా రాస్తే చీదరించుకుంటారు. ఎందుకంటే- విమర్శకుండే సాహితీ స్పృహను తిట్టు తగలేస్తుంది. కాబట్టి సాహిత్యంలో తిట్టు కవితకు తిట్టు విమర్శ కంటే విలువ ఎక్కువే. దానికి కారణం 'కప్పి చెప్పటం' కవిత గుణం, 'విప్పి చెప్పటం' విమర్శ స్వభావం కావటమే.

తిట్టినవాణ్ణి తిరిగి తిట్టటం లోకసామాన్యం. తిట్టనివాణ్ణి పట్టుకొని తిట్టటం విశేషం. తిట్టటంలో తిట్టినతిట్టు తిట్టకుండా తిట్టటం తిట్ల తెలివి తన లాగా మరెవ్వరూ తిట్టలేరనుకోవటం అదొక అజ్ఞానం. అయినా, తిట్టు తిట్టు కోసమే పుట్టదు. తిట్టు వెనుక ఒక గుట్టు ఉంటుంది దాన్ని పట్టుకోవాలి. తిట్టువలన తిట్టు పుట్టవచ్చును గాని తిట్టువల్లనే తిట్టు చల్లారటం కష్టం.

విమర్శలో కూడా తిట్టు తిట్టుకోసమే పుట్టదని అనుకున్నా, తిట్టువలన సాధించే ప్రయోజనానికి లోకంలో గౌరవం కలగటం కష్టం. సభ్యలోకంలో తిట్టు దివాలాకోరుతనానికి గుర్తు. తిట్టు వలన చివరకు మిగిలేది తిప్పలే.

అసలు తిట్టు విమర్శ ఎప్పుడు పుడుతుంది? 'ప్రతివిమర్శకుడు' సమతౌల్యం పోగొట్టుకొన్నప్పుడు, ఒక పక్షంవారి ప్రయోజనాలకు వైఫల్యం కలిగినప్పుడు, ఒక ఉద్యమస్థితికి భూకంపం వంటి ప్రమాదం ఏర్పడ్డప్పుడు, బలమైన ఒక క్రొత్త ఉద్యమమో, సిద్ధాంతమో పుట్టి బలపడుతూ ఉన్నప్పుడు, రచయిత స్వీయ న్యూనతాభావాన్ని కప్పిపుచ్చుకోవాలని, తన అస్తిత్వాన్ని గయ్యాళితనంతో గుర్తింపచేసుకోవాలని రాజకీయం ఆడుతున్నప్పుడు తిట్టు విమర్శ పుట్టుకొస్తుంది.

సాహిత్య విమర్శలో సిద్ధాంత ప్రతిపాదనకు ఎంత ప్రాధాన్యం ఉంటుందో సిద్ధాంత విమర్శకూ, ఖండనకూ కూడా అంత ప్రాముఖ్యం ఉంటుంది. తర్కసహజమైన విమర్శ తిట్టును సహించదు, ఉత్తమ లక్షణంగా మన్నించదు. అపసవ్య విమర్శలో కూడా యోగ్యమైన పద్ధతులు ఎన్నో ఉన్నాయి అధిక్షేపాదులు ఔచిత్యంతో కలిసి ఉంటే ఆదరణీయాలే.

ఆధునిక కవితలోనూ, విమర్శలోనూ తిట్టు కొక గౌరవం కల్పించి, దానితో తమ తమ ఉద్యమాలకు ఒక ఊపు కల్పించే ధోరణులను కొందరు

రచయితలు చేశారు, చేస్తున్నారు. కాని, 'తిట్టు విమర్శ'లో వివేచన కంటె వెక్కిరింపు, ఋజువాదం కంటె పిడివాదం, నియతికంటె నిబద్ధత, చురుకుతనం కంటె దుడుకుతనం సరసత్వం కంటె దురుసుతనం, సమత్వం కంటె దూకుడుతనం, వినయం కంటె దుర్నయం, తీర్పు కంటె తిట్టు ఎక్కువగా ఉంటాయి. ఇవన్నీ ఉత్తమ విమర్శకు ఉండదగిన లక్షణాలు కావు.

తిట్టు కవితలోనూ, తిట్టు విమర్శలోనూ భగ్న ప్రమాణాలతో నగ్న ప్రయోగాలు చేస్తూ చరిత్రను సృష్టిద్దామనుకున్న రచయితలు ఆధునికయుగంలో ఉన్నారు. కాని, కసిగా బూతులతో తిట్టి, కొరడాలతో కొట్టి, కత్తులతో దుష్టాంగాలను కోసి, తమలో ఎన్ని లోపాలున్నా, సమాజాన్ని మాత్రం నిలువునా ఆపరేషన్ చేసి ఆదర్శాలను సాధిద్దామని ఎంతమంది ప్రయత్నం చేసినా, లోకం తిరిగి వారిని తిట్టకుండానే తిప్పికొడుతుందని సాహిత్య చరిత్ర గతి స్పష్టంగా చెపున్నది ఎన్నివిధాల చూచినా, తిట్టు విమర్శ పెడధోరణే కాదు, సాహిత్యక్షేత్రంలో హత్యాధోరణి కూడా!

తిట్టు విమర్శ ఆధునిక సాహిత్య వీథిలో ఒంటరిగా తిరగదు. ఆరుగురిని వెంటబెట్టుకొని గుంపుగా, ముఠాగా సాగుతుంది. ఆ ఆరుగుర్నీ చనువుగా ఇలా పిలుచుకుంటాం :

1. దూకుడు విమర్శ
2 దుబారా విమర్శ
3. దుర్నయ విమర్శ
4. దుమారం విమర్శ
5. దురుసు విమర్శ
6. దుడుకు విమర్శ

పేర్లే చెపుతున్నాయి ఆ విమర్శల లక్షణాలను. అహంకారానికి అరిషడ్వర్గం లాగా తిట్టు విమర్శకు ఈ ఆరు రకాల విమర్శలూ అనుచరులూ, అంగరక్షకులు.

కవితలో తిట్టు కవిత నాడూ నేడూ ఉన్న ధోరణి!
విమర్శలో 'వివాద విమర్శ' ఆనాటి ధోరణి!
'తిట్టు విమర్శ' తెలుగులో ఆధునిక ధోరణి?! *

(ఉదయం 9.12.1991)

# సిద్ధాంతాలు లేని సిద్ధాంతవ్యాసాలు

ఆంధ్రోపన్యాసకులకు తెలుగు భాషా సాహిత్యాలలో యు.జి.సి. నిర్వహించే పునశ్చరణ తరగతులు ఈసారి తెలుగు విశ్వవిద్యాలయం వారి (హైదరాబాదులోని) భాషాభివృద్ధి పీఠంలో 1991 నవంబరు 4 వ తేదీ నుండి 30 వ తేదీ వరకు జరిగాయి. ఆచార్య బి. రామకృష్ణారెడ్డి, శ్రీ సి. రామచంద్ర రావుగారలు సమన్వయకర్తలుగా ఉన్న ఆ కార్యక్రమంలో పాల్గొని, దాదాపు 40 మందికి పైగా ఉన్న సాటి కళాశాల ఉపన్యాసకులతో కలిసి, ఎన్నో భాషా సాహిత్యాంశాలను గురించి పరస్పరం చర్చించుకొనే అవకాశం లభించింది. నేను వారితో ముచ్చటించిన అంశాలలో 'సాహిత్య పరిశోధన' ముందుగా పేర్కొనదగింది.

విశ్వవిద్యాలయాలలో జరుగుతున్న తెలుగు పరిశోధనలను గురించి, ఎం.ఫిల్., డిగ్రీలు, పిహెచ్.డి., పట్టాలు పుచ్చుకొన్న సిద్ధాంత గ్రంథాలను గురించి, వాటి ప్రమాణాలను గురించి ప్రజలలో వివిధాభిప్రాయాలు వ్యాపించి ఉన్నాయి. కొంతమంది మాత్రమే వాటిని గురించి గౌరవంగా మాట్లాడుతున్నారు. తెలుగు విశ్వవిద్యాలయం పుణ్యమా అని తెలుగు సిద్ధాంత వ్యాసాలకు పూర్తిగా కాకపోయినా, వేన్నీళ్ళకు చన్నీళ్ళుగా పనికివచ్చేటట్లు, ఆర్థికసహాయం అందుతోంది. పుస్తకాలు ప్రచురింపబడుతున్నాయి. కొన్ని ప్రశంసలందుకొంటున్నాయి; కొన్ని తగినంత స్థాయిలో లేవని విమర్శింపబడుతున్నాయి.

విలువలు పడిపోవటానికి కారకు లెవరనే విషయంలో కూడా వివిధాభిప్రాయాలున్నాయి. విశ్వవిద్యాలయాలలోని ప్రవేశపద్ధతి దీనికంతా మూలకారణమని కొందరంటారు. మరికొందరు - పర్యవేక్షకుల సామర్థ్యాన్ని దుయ్యపడతారు- మరికొందరు-పరిశోధకుల పరిజ్ఞాన ప్రమాణాలు తగినంత స్థాయిలో ఉండటంలేదని విమర్శిస్తున్నారు. వీటివలన ఉత్తమ పరిశోధనలు అనిపించుకొనగలిగే సిద్ధాంత వ్యాసాలు వెలువడటం లేదని విజ్ఞుల వివేచన. అలా భావించే వారిలో విశ్వవిద్యాలయాల బయటనున్న పండితులు ఉండటంలో అంత ఆశ్చర్యం లేదుకాని, ఆ వ్యవస్థలో కృషిచేస్తూన్న ఆచార్యులు కూడా అసంతృప్తిని వ్యక్తికల

ద్వారా కూడా ప్రకటించటం విశేషం. అయితే, వారెవ్వరూ ఇప్పుడున్న వ్యవస్థను మార్చలేరు; మార్చి ఏ వ్యవస్థను ప్రవేశపడితే ఉత్తమ పరిశోధన విధానం రూపొందుతుందో ప్రతిపాదించలేరు; అయితే చిరిగిపోతున్న అతుకులను కట్టబూనట్లు కొన్ని సూచనలు మాత్రం చేస్తున్నారు.

పరిశోధనం దే ప్రజలలో ఒక పవిత్రభావం ఉంది. అది ఎటువంటిదంటే- ఫలం కోరకుండా ప్రజాసేవ చేసే కర్మయోగం లాంటిది. పరిశోధన ఫలితాంశం ప్రజలకు అందినప్పుడు దాని విలువను వారు గుర్తించి పరిశోధకుని గౌరవిస్తారు, బిరుదు లిస్తారు, పారితోషికా లిస్తారు, మనసుల్లో పూజిస్తారు. పరిశోధకుడు పరిశోధనను జీవితవ్రతంగా స్వీకరించాలని సామాన్యంగా సమాజం అభిలషిస్తూ ఉంటుంది. పరిశోధకుడు ఒక వ్యక్తిగా కాక ఒక వ్యవస్థగా, ఒక దార్శనిక శక్తిగా, ఒక వినూత్న ప్రస్థానంగా జాతి స్మృతిలో మిగిలే కృషి చేయాలని సహృదయులు ఆకాంక్షిస్తూ ఉంటారు.

విశ్వవిద్యాలయాలలో జరిగేది పరిశోధన కాబట్టి ఆ వ్యవస్థలో నుండి సమాజం ఆశించే స్థాయిలో పరిశోధకులు, పరిశోధన ఫలితాంశాలు వెలువడాలని ఆశించటంలో తప్పేమీలేదు. కాని, ప్రజలాశించే ఆశయాలకూ, విశ్వవిద్యాలయాలందించే ఫలితాలకూ పొంతన కుదరటంలేదు. ఎలాగంటే - విశ్వవిద్యాలయాలలో పరిశోధన పరిశోధనకోసం కంటె డిగ్రీకోసమే అన్నది నేటి ప్రమాణం. ఏభై శాతం మార్కులతో డిగ్రీ వస్తుంది. అంటే సగం చదువు సర్టిఫికేటన్నమాట. అది పోనీ - పరిశోధన పరిశోధకునిలో నుండి పొంగివచ్చిన జిజ్ఞాసగా అందరిలోనూ, అన్ని వేళలా గోచరం కావటం లేదు. విషయం ఒకరిది, ఆలోచన మరొకరిది, దర్శకత్వం ఇంకొకరిది, ప్రణాళిక మరింకొకరిదిగా అవుతున్నది కొందరివట్ల. కృషి ఎవరిది అయినా సిద్ధాంత వ్యాస రచయితగా ఎవరి పేరు నమోదు అవుతుందో అతని పేరుమీదనే ఆ పరిశోధన చెలామణి అవుతుంది. ఇలా ఎందుకౌతున్నది? ....అందరికీ తెలిసిన సత్యమే. పరిశోధన ఒక బ్రతుకు తెరువు సాధనగా మారటంవలన. విశ్వవిద్యాలయ పరీక్షా పద్ధతిలో పబ్బం గడిపి గట్టెక్కిన పరిశోధన విజ్ఞాన పరిధులను విస్తృతం చేయటానికని పుట్టటం లేదు. ఆర్థిక ఆదాయాన్ని పెంపొందించుకోటానికి ఒక ఉపాయంగా మాత్రమే ముఖ్యంగా పరిగణింపబడుతున్నది. దీనితో పరిశోధనకు ప్రజలలో ఉన్న పూజ్యభావం పోయింది. పరిశోధకుడు పట్టభద్రుడి లాగానే పట్టా చూపించుకొని తిరుగు

తున్నాడు. డిగ్రీ పాసయిన పట్టభద్రుడికి మరో కోర్సులోకి వెళ్ళాలంటే ప్రవేశ పరీక్ష ప్రత్యేకంగా పెడుతున్నట్లు, పి హెచ్. డి , వచ్చిన పరిశోధకుణ్ణి కూడా కొంత అనుమానంగానే చూస్తూ 'మీ పరిశోధన తరువాత మరేమన్నా రాశారా?' అని మరీ మరీ అడుగుతున్నారు. పోస్ట్ డాక్టరల్ రీసెర్చి తృష్ణ ఉన్నవాడే నమ్మదగిన పరిశోధకుడుగా ఇప్పుడు విద్యారంగంలో పరిగణింపబడుతున్నాడు. డిగ్రీ ఉన్న పరిశోధకుడికంటె గుర్తింపు పొందిన పరిశోధన చేసిన పండితుడికే ఈ రోజుల్లో గౌరవమిస్తోంది సమాజం. గుర్తింపు పొందగలిగిన పరిశోధనకు డిగ్రీ వచ్చిందంటే దండిగా సంతోషించే సహృదయులు మనలో కోకొల్లలుగా ఉన్నారు. దీన్నిపట్టి పరిశోధన విలువలు ఎక్కడ పెరుగుతున్నాయో, ఎక్కడ తరుగుతున్నాయో గుర్తించటం సులభం.

నేటి సాహిత్య పరిశోధకులలో కొందరు సిద్ధాంతవ్యాస నిర్మాణంలో తగినంత పరిజ్ఞానం ప్రకటించటంలేదు. ఒక సిద్ధాంత రూపకల్పనకు సంబంధించిన శాస్త్రపద్ధతిని వ్యాసంలో వెలార్చటంలేదు. అందువలన కొన్ని పరిశోధనలు సాంకేతికంగానూ, విషయపరంగానూ, ప్రమాణాలదృష్టితోనూ అందుకోవలసిన స్థాయికి చేరుకోలేకపోతున్నాయి. ఇటువంటివి ప్రతి ఏటా సంఖ్యలో పెరిగిపోతున్నాయని అందరూ ఆందోళనపడటం నేడు గమనిస్తున్నాం. వీటికి బలమైన కారణాలు ఉన్నాయి. ఒకటి రెండు గమనిద్దాం మచ్చుకు.

సాహిత్య పరిశోధనచేసే విద్యార్థులకు మన విశ్వవిద్యాలయాలలో సాధారణంగా సోషల్ సైన్సెస్‌లో బోధించే మెథడాలజీనే ఎన్నుకొని బోధిస్తున్నాం. సాహిత్య పరిశోధనకు ప్రత్యేకమైన మెథడాలజీ అవసరమన్న సత్యాన్ని ఇంకా మనమందరం గుర్తించి బోధించటంలేదు. సాహిత్యంలో ఒక్కొక్క ప్రక్రియకు ఒక్కొక్క మెథడాలజీని ప్రపంచ దేశాలలో కొన్ని పెంపొందింపజేసుకొంటున్న ఈ కాలంలో మనకు భౌతిక, రసాయనికాది శాస్త్రాలలోనూ, సామాజిక శాస్త్రాలలోనూ చెప్పే పరిశోధన పద్ధతులనే విచక్షణారహితంగా మన సాహిత్య పరిశోధకులకు నూరిపోస్తున్నాం. ఇది మన వెనకబడినతనానికి గుర్తు.

కొందరి సంతృప్తి ఏమిటంటే ఏ శాఖలోనైనా సిద్ధాంతవ్యాస నిర్మాణం ఒకటే కదా! అందువల్ల ఏ మెథడాలజీ చదివినా సిద్ధాంతవ్యాసం వ్రాయవచ్చునని. ఇది భ్రమమూలకం.

సిద్ధాంత వ్యాసానికి బాహిర నిర్మాణమనీ, అంతర్గత నిర్మాణమనీ రెండు పొరలుంటాయి. బాహిర నిర్మాణాంశాలు, వాటి వినియోగ విధానం కొన్నింటిలో

ఉన్నా, బాహిర నిర్మాణాన్ని శాసించే శక్తి అంతర్గత నిర్మాణమే. అంటే- ఎలా రాయాలో నిర్దేశించేది అంతర్గత సిద్ధాంత వ్యక్తీకరణ విధానం.

సాహిత్య పరిశోధకులకు మెథడాలజీ పేరుతో బాహిరనిర్మాణ విధానాన్ని చెప్పి వదలిపెడుతున్నామే కాని, ఒక క్రొత్త సిద్ధాంతాన్ని ఎలా దర్శించాలి, దానిని ఎలా స్థాపించాలి, దానిని ఎలా అనుశీలనంలో అనువర్తింప చేయాలి? అనే అంతర్గత నిర్మాణ రహస్యాలను వారికి బొత్తిగా పరిచయం చేయటం లేదు. దానివలన సిద్ధాంతాలు లేని సిద్ధాంత వ్యాసాలు ఎన్నో రంగంమీద సిద్ధమౌతున్నాయి. పేరు నిలవబెట్టుకోకపోతే పరువుపోయే ప్రమాదం ఎప్పుడూ ఉంది.

సిద్ధాంత దర్శనానికి తోడ్పడేది పరిశోధకుడు రూపొందించుకొనే 'సినాప్సిస్' - రచనా ప్రణాళిక. చాలమంది పరిశోధక విద్యార్థులు పరిశోధనాంశంతో పాటు, రచనా ప్రణాళికను కూడా ఇతరుల దగ్గరి నుంచియో, పర్యవేక్షకుడి నుంచియో అరువు తెచ్చుకొంటారు. అంతటితో ఆగక అదే శిలాక్షర మనుకుంటారు. ఇది ఒక మహా ప్రమాదం. ఇప్పటి మన యువకుల సాహిత్య పరిశోధనకు గొడ్డలిపెట్టు ఈ అసమర్థచర్య; అశాస్త్రీయ విధానం.

రచనా ప్రణాళిక నియతమైనది కాదు. అది స్థూలంగా రెండు దశలలో రూపొందుతుంది. మొదటి రచనా ప్రణాళిక పరిశోధకుడు సిద్ధాంత దర్శనం చేయటానికి తోడ్పడేది. రెండవ రచనా ప్రణాళిక సిద్ధాంత ప్రతిపాదనకూ, ప్రపంచనానికీ తోడ్పడేది. సిద్ధాంతాన్ని పట్టి ప్రతిపాదన పద్ధతి ఏర్పడుతుంది. సిద్ధాంత రూపకల్పనంలో సిద్ధహస్తుడైన వాడే ప్రసిద్ధుడైన పరిశోధకుడు కాగలుతాడు. ఈనాటి ప్రసిద్ధ సాహిత్య పరిశోధకులు కూడా సిద్ధాంత దర్శకులే.

పరిశోధన అంటే శాస్త్రీయ అన్వేషణ పద్ధతి. దాని ఫలం కూడా పరిశోధనగానే పిలువబడుతుంది. ఈ సంప్రదాయం ప్రకారం క్రొత్త సామగ్రిని చూపించినా పరిశోధనే. క్రొత్తగా విశ్లేషించి వివేచించినా పరిశోధనే. నవ్య సమన్వయం సాధించినా పరిశోధనే. వినూత్న సిద్ధాంతం ప్రతిపాదించినా పరిశోధనే. వీటిని శాస్త్రీయంగా సంఘటితపరచిన పరిశ్రమ కూడా పరిశోధనే. కాబట్టి సిద్ధాంత వ్యాసాలు కూడా ఆయా పరిశోధన ప్రవృత్తులతో వెలువడుతూ ఉండటం సహజం. అన్నీ పరిశోధనలని పిలువబడినా అన్నీ ఒక స్థాయిలో ఉండవు. ఈ తారతమ్యం గుర్తించని విమర్శలకు తలా తోక లుండవు! మనం వాటిపట్ల కడు జాగ్రత్తగా ఉండాలి!! *

(ఉదయం, 19-1-1992)

# తెలుగు సాహిత్య విమర్శ : నాడు-నేడు

ఒక జాతి సృజనాత్మక శక్తిని చాటి చెప్పేది కవిత్వమైతే, దార్శనిక శక్తిని ప్రదర్శించేది విమర్శ. కవికూడా విమర్శ చేస్తాడు. అయితే, అది కవితా సృష్టికి ముందే ముగిసిపోతుంది. కవికి విమర్శ అతని అంతర్దర్శనంలోని అంతర్భాగం. కవికి కవిత్వంలాగానే విమర్శకుడికి విమర్శకూడా ఒక సృష్టి. అతనిలో విమర్శగా రూపుదాల్చే దార్శనిక చైతన్యం శాస్త్రీయమైన కళ. మహాకవుల కవిత్వం తరతరాలుగా ఎలా ప్రవహిస్తుందో ఉత్తమ విమర్శకుల వివేచనం కలకాలం అలా జీవిస్తుంది. విమర్శకులు సాహిత్యరంగంలో విలువల నిర్ణేతలు; అభిరుచుల అధినేతలు.

'తెలుగు కవిత్వం : నాడు - నేడు' - అంటే నన్నయ నుండి నేటిదాకా సమీక్షించే అవకాశం ఉంది. 'తెలుగు సాహిత్య విమర్శ : నాడు- నేడు' - అంటే వెయ్యేళ్ళ తెలుగు సాహిత్య చరిత్రలో కడచిన ఒకటిన్నర శతాబ్దంలో వెలువడిన సాహిత్య విమర్శయే పరిశీలనకు పాత్రమౌతుంది.

తెలుగులో లిఖితపూర్వకమైన సాహిత్య విమర్శ దాదాపు నూటయేభై యేళ్ళనుండి వెలువడుతున్నది. అట్లని సాహిత్య విమర్శ తెలుగులో అంతకు పూర్వం అసలే లేదని చెప్పలేం. కావ్యావతారికలలో విమర్శ ప్రతి విమర్శల జాడలు కొన్ని, విమర్శ ప్రమాణాల ప్రతిపాదనలు కొన్ని, సాపేక్ష అనుశీలన సూత్రాల ప్రసక్తులు కొన్ని, కావ్య లక్షణ వివేచనలు కొన్ని ఎడనెడ చోటుచేసుకోవటంవల్ల సాహిత్య విమర్శ వెయ్యేళ్ళుగా తెలుగులో సజీవంగా, చైతన్యవంతంగా ఉన్నదని నిస్సందేహంగా చెప్పటానికి వీలు కలుగుతోంది. అయితే, అది - ముద్రణ యంత్రాలు వచ్చేంతవరకూ మూగవోయినట్లు కనపడుతోంది. కాని, మౌఖిక సంప్రదాయంలో సజీవ స్రవంతిగా ప్రవహిస్తూ ఉన్నట్లు స్పష్టమౌతోంది.

విమర్శ శాస్త్ర కళ. విమర్శలో శాస్త్రాంశం - లక్షణ వివేకం; కళాంశం-అనుశీలన కౌశల్యం ఈ రెండూ మొదట మౌఖికంగా సాపేక్షంగా సాగి ఉంటాయి. లక్షణ వివేకం విమర్శ సూత్రంగానో, ప్రమాణంగానో సహృదయుల

మన్ననలను అందుకొంటే, అది ఆ తరువాత ఒక లక్షణ గ్రంథకర్తచేత ఛందో మయంగా వ్యక్తీకరించబడవచ్చు. అంటే - మౌఖిక సంప్రదాయంలో సాగే సాహిత్య విమర్శలో లక్షణ భాగం లిఖిత సంప్రదాయంలోకి ప్రవేశించి తన అస్తిత్వాన్ని సుస్థిరం చేసుకొంటుందన్నమాట!

లక్షణం లిఖితరూపంగా కనబడ్డా, దానిని కావ్యానుశీలనంలో సమన్వయించే కళ ఆయా కాలాల్లో ఎదుటనున్న శ్రోతలకు వినబడింది కాని, లిఖిత సంప్రదాయంలో జాలువారలేదు. లక్షణం ధారణలో నిలిచింది, అనుశీలనం శ్రవణమననాలలో స్రవించింది ఈ పద్ధతి విమర్శక వ్యక్తిత్వాన్ని మన్నించేది, సశాస్త్రీయ విమర్శ చైతన్యాన్ని సాహితీలోకంలో పరిపోషించేది.

ముద్రణయంత్రం వచ్చి లక్షణాన్ని, అనుశీలనాన్నీ కలిపి లిఖిత సంప్రదాయంలో పెట్టింది. దానితో లక్షణం ధారణలో నిలిచే ధోరణి మందగించింది. మౌఖిక సంప్రదాయంలో జీవించే ఉపన్యాసంకూడా లిఖిత సంప్రదాయంలోని వ్యాసంగా రూపొందటం ఎక్కువయింది వట్టి ఉపన్యాసానికి నేడు సాహిత్యపు విలువ తక్కువ. శాస్త్రాంశ, కళాంశాలను ఉభయపార్శ్వాలుగా మలచుకొన్న ఉపన్యాసం వ్యాసగౌరవం పొందుతోంది ప్రచురింపబడని అటువంటి ఉపన్యాసం మౌఖిక విమర్శ సంప్రదాయానికి ఆధునికంగా నిలిచిన తీపిగుర్తు. గతంలో పాక్షికంగానూ, పూర్తిగానూ మౌఖిక సంప్రదాయంలో ఉన్న సాహిత్యవిమర్శను, బలవంతంగా లిఖిత సంప్రదాయంలోకి మార్చిన యంత్రమంత్రాంగానికి చిహ్నం వ్యాసం. అందువల్లనే కొన్ని వ్యాసాలు వింటేనే బాగుంటాయి. చదివినా కొన్ని మాత్రమే జ్ఞాపకముంటాయి. శాస్త్రాంశనూ, కళాంశనూ లిఖిత సంప్రదాయానికి అనుగుణంగా సంవదించి సాహిత్య విమర్శను నిర్మించటమే ఈ శతాబ్ది మొదటి పాదంలో తెలుగు విమర్శకులు సాధించిన ఘనవిజయం.

తెలుగు సాహిత్యవిమర్శ చరిత్రలో దాదాపు తొమ్మిది శతాబ్దాలచరిత్ర అజ్ఞాతయుగం. ఈ శతాబ్ది చరిత్ర ప్రయోగయుగం. మరొక రకంగా చెప్పాలంటే మొదటిది-మౌఖిక సంప్రదాయయుగం; రెండవది - లిఖిత సంప్రదాయ యుగం. ఈ రెండు యుగాలలో వెలువడిన సాహిత్యాలలో మౌలికంగా ప్రేరక, క్రియా శక్తులలోనూ, ప్రయోజన ప్రవృత్తులలోనూ, ప్రయోగదృష్టులలోనూ, ప్రభావ పద్ధతులలోనూ భేదం బాగా కనపడుతుంది. సాహిత్యచరిత్రలో లాగానే సాహిత్య విమర్శ చరిత్రలో కూడా ఈ శక్తులపాత్ర బలంగా ఉంటుందనటంలో అను మానం లేదు.

'సాహిత్యవిమర్శ : నాడూ - నేడూ' అన్నప్పుడు నాటికి ప్రతినిధిగా మౌఖిక సంప్రదాయ యుగాన్నీ, నేటికి ప్రతినిధిగా లిఖిత సంప్రదాయ యుగాన్నీ గ్రహించటం స్థూలవిభాగం. అది ఈ వ్యాస తాత్పర్యం కాదు. అయినా, ఆ రెండు యుగాల భేదసామ్యాలు సమీక్షించటం కనీస కర్తవ్యం.

నన్నయ నుండి వీరేశలింగం పంతులుగారి వరకు సాగిన సాహిత్య చరిత్రలో మూడు రకాల శక్తుల ముక్కోణపు పోటీ కనవడుతుంది. ఆ మూడు శక్తులూ ఏవంటే -

1. సంస్కృత ప్రాకృత సాహిత్యాలను దేశభాషలలో అనువదించటం వలనగానీ, భరతవర్ష ధర్మస్ఫూర్తి నివ్వగలిగిన కథా వస్తువులతో వివిధ రచనలు చేయటం వలనగానీ, దేశభాషాసాహిత్యా లెన్నైనా భారతీయసాహిత్యం ఒకటే అనే అనుభవం సామాజికులకు కలిగించాలనే ప్రవృత్తి ఒకవైపు ఉండేది.

2. ఆయా ప్రాంతాలలో బలంగా ప్రచారంలో ఉన్న మతశాఖలనుగాని, సాహితీ ప్రక్రియలనుగాని, ప్రమాణాలను గాని ఎన్నుకొని దేశభాషాసాహిత్యాలకు ప్రత్యేక ప్రతిపత్తి కలిగేటట్లు ఉద్యమించే ప్రవృత్తి మరోవైపు మొదటిదానికి ప్రతిగా సాగుతూఉండేది.

3. ఈ రెండింటికీ నడుమ సంఘర్షణ రేగటం సహజం. దానివలన భరత వర్ష సాహిత్య సాంస్కృతిక సమైక్యత కుంటువడవచ్చు. లేదా, దేశిసాహిత్య వికాసానికి దోహదం చేసే భారతీయ భాషా సాహిత్యాల ప్రభావంపట్ల ప్రజలకు వైముఖ్యం ఏర్పడవచ్చు. అవి వాంఛనీయాలు కావు. అందువలన సాంఘిక, మత, రాజకీయాలలోని వైరుధ్యాల కతీతంగా ఒక సమన్వయ దృక్పథంతో దేశ భాషా సాహిత్యాల అస్తిత్వ వ్యక్తిత్వాలకు నవ్యరూపకల్పనం చేసే ప్రవృత్తి మరొకటి బలంగా పనిచేస్తుండేది. ఈ మూడవ ప్రవృత్తి దేశిసాహిత్యోద్యమాలలో పరిణతమైనదిగా పరిగణింపబడుతోంది.

నన్నయ ఈ పద్ధతిని తెలుగులో ఆరంభించాడు. తిక్కన దిద్ది తీర్చాడు. శివకవులు ద్వితీయ ప్రవృత్తితో ఉద్యమించారు. మొదటి ప్రవృత్తి తెలుగులో పురాణానువాద పద్ధతిలో అవతరించినా పోతన దానిని పొలిమేరలు దాటగొట్టాడు. శ్రీనాథుడు, ప్రబంధకవులు, శతక కవులు మొదలైనవారిని మొదటి ప్రవృత్తికి

ప్రతినిధులుగా కొందరు పరిగణిస్తారు. కాని, అది నిజం కాదు. వారందరూ తెలుగు సాహిత్యంలో సమన్వయశక్తులు. దేశి భాషా సాహిత్యాల అస్తిత్వ వ్యక్తిత్వాలను రూపుదిద్దిన కళామూర్తులు, ఒక్కమాటలో చెప్పాలంటే - ప్రాచీనాంధ్ర సాహిత్యమంతా భారతీయతా పరిరక్షణ (Preservation of Indianness) కు భంగం వాటిల్లకుండానే తెలుగు దేశీయత (Nativity) యొక్క అస్తిత్వ వ్యక్తిత్వాల పరిపోషణ చేసిన కవుల నిర్విరామకృషి. సాహిత్యంతోపాటు సాహిత్య విమర్శకూడా అటువంటి ప్రస్థానమే సాగించి ఉండాలి.

కందుకూరి వారి కాలంనుండి పాశ్చాత్య ప్రభావ ప్రవృత్తి అనే మరో బలమైన శక్తి మన సాహిత్యంమీద పని చేసింది. ప్రభావం అంటే ఇతరుల భావాదర్శ ప్రవాహాలలో కొట్టుకొనిపోవటం కాదు. అది అనుసరణం, అనుకరణం అవుతుంది. ఒక భాషా సాహిత్యానికి గల దేశీయమైన అస్తిత్వాన్ని వికాసదశవైపు విస్తరింపజేయగల భావాదర్శజాలాన్ని పోషకద్రవ్యంగా మాత్రమే గ్రహించటం ప్రభావం. పాశ్చాత్య భాషా సాహిత్య సంస్కృతులతో మనకు సాన్నిహిత్యం ఏర్పడినప్పుడు వాటిని అనుకరించే ప్రవృత్తులకూ, అనుసరించే చిత్తవృత్తులకూ, ప్రభావంగా గ్రహించి దేశీయతకు పోషకంగా మలచుకొనే ప్రయోగాసక్తులకూ ఆయా కాలాలలో ప్రాచుర్యం ఏర్పడవచ్చు. ఏమైనా అనుకరణ, అనుసరణ ప్రవృత్తులకు ఎప్పుడూ, ఎక్కడా అస్తిత్వ గౌరవం ఉండదు. వాటిని ప్రభావ చైతన్యంగా మార్చుకొన్నప్పుడే సాహిత్యానికి మన్నన ఏర్పడేది.

పాశ్చాత్య ప్రభావం మనకు కొన్ని ఆసక్తులను కలిగించింది; కొన్ని సమస్యలను కల్పించింది. వాటిని ఆహ్వానించటానికీ, ఎదుర్కొనటానికీ అవసరమైన దేశీయ అస్తిత్వ మూల్యాల పునఃపరిశీలనానికి అవకాశాన్ని కలిగించింది. పాశ్చాత్య భాషా సాహిత్యాల ద్వారా ఆధునిక సాహిత్యం అంతర్జాతీయమైన మానవ వికాసాన్ని దర్శింప గలిగింది. సామాజిక, రాజకీయ, సాహిత్య, సాంస్కృతిక, శాస్త్ర సిద్ధాంతాల, ఉద్యమాల ధోరణులను అవగాహన చేసుకో గలిగింది భారతీయసాహిత్య, తాత్త్విక, సామాజిక, సాంస్కృతిక మూల్యాలను, దర్శనాలను ప్రపంచానికి అందించటానికి యత్నించింది. తెలుగు సాహిత్యం తన అస్తిత్వం ఆధునికంగా వికసించటానికి ద్రవ్యాలను, గుణాలను, దృక్పథాలను, సిద్ధాంతాలను మాత్రమే గ్రహించి తనలో భాగంగా సమన్వయించు కొన్నది. ప్రపంచంలో ఉన్నవన్నీ తెలుగులోకి రాలేదు; రాలేవు కూడా. వేటిని

ఎలా తనలో విలీనం చేసుకోవాలో తెలుగు సాహిత్యం ఈ శతాబ్దిలో ప్రయోగాలు చేసి ఫలవంతమైంది. తెలుగులో లీనం కాలేనిది ఎంత అంతర్జాతీయమైనదైనా అల్లంత దూరంగానే నిలిచిపోయింది. విలీనదశ దేశీయతకు పోషక ద్రవ్యంగా మారినప్పుడు మాత్రమే సాధ్యమౌతుందన్నది ఈ యుగం ప్రదర్శించిన ఫలితాంశం.

భారతీయతతో వైరుధ్యం లేకుండా దేశీయత యొక్క అస్తిత్వవ్యక్తిత్వాలను పరిపోషించుకోవటం ప్రాచీనాంధ్ర సాహిత్య స్వభావమైతే, అంతర్జాతీయతను మన్నించే జాతీయభావంతో దేశీయత యొక్క అస్తిత్వ వ్యక్తిత్వాలను పరిరక్షించుకోవటం ఆధునికాంధ్ర సాహిత్య స్వభావంగా స్పష్టమౌతోంది. సాహిత్య విమర్శకు కూడా ఈ విశ్లేషణ వర్తిస్తుంది.

అంతర్జాతీయ అవగాహన (International outlook), జాతీయత లేదా, భారతీయత (Indianness) దేశీయత (Nativity) అనే మూడు గుణాల్లో మొదటి రెండింటినీ పోషించటంలో దాదాపు 1935 నుండి 1975 దాకా రెండు బలవత్తరమైన ప్రవృత్తులుగా అభ్యుదయ, నవ్య సంప్రదాయోద్యమాలు తెలుగులో ప్రవర్తిల్లాయి. ఆ తరువాత ఆ రెండింటి కంటె మూడవ గుణం సాహిత్యంలో ముందంజ వేస్తోంది. లిఖిత సంప్రదాయ యుగంలోని సాహిత్య విమర్శనే మనం పరిగణిస్తే వీరేశలింగం పంతులుగారి నుండి క్రి.శ. 1975 దాకా వచ్చింది నాటి సాహిత్య విమర్శగానూ, ఆ తరువాత వెలువడింది నేటి సాహిత్య విమర్శగానూ లెక్కించాలి. నాటి సాహిత్య విమర్శ ఆరు రకాల విమర్శకుల ఆసక్తిదాయకమైన ప్రయోగాలతో ప్రయోజనాత్మకమైన పాత్ర నిర్వహించింది. నేటి సాహిత్య విమర్శ నాల్గు రకాల నడకలతో నలుగురినీ ఆకట్టుకోవాలని తాపత్రయపడుతున్నది. ఈ పది రకాల ప్రవృత్తులను పరిచయం చేయటమే ఈ పరిశీలన పరమార్థం.

నాటి సాహిత్య విమర్శలో మేటి పాత్రలు నిర్వహించిన ఆరు రకాల ఆంధ్ర విమర్శకులు - వారి ధోరణులు —

1. సంస్కృత లాక్షణికులు నిర్దేశించిన ప్రమాణాలే భారతీయ భాషా సాహిత్య ప్రయోగాలకన్నింటికి మూలసూత్రాలుగా వర్తిస్తాయని భావించి, తెలుగులో సాహిత్య ప్రక్రియలనూ, విమర్శ తీరుతెన్నులనూ సమీక్షించేవారు-మొదటి వర్గంవారు. వీరు దేశీయతకంటె భారతీయత సాహిత్యంలో ప్రధానమని భావి

స్తారు. సంస్కృత లక్షణ గ్రంథాలలో ఉన్న ప్రమాణాలనూ, సూత్రాలనూ మాత్రమే గ్రహించి తెలుగు కవులు సాహిత్య రచనలు చేశారని విశ్వసిస్తారు. ఒకవేళ పాశ్చాత్య లక్షణాలేవైనా ఈ శతాబ్ది తెలుగు రచనలలో కనవడ్డా, వాటికి కూడా తప్పకుండా సంస్కృతంలో మూలాధారాలుంటాయని అన్వేషిస్తారు. ఈ ప్రవృత్తివలన సాహిత్య విమర్శకు ప్రాథమికంగా కొన్ని మేళ్ళు జరిగినా కీడు కూడా ఎక్కువ జరిగింది. ఆ కీడు రెండు రకాలు. ఒకటి-ప్రాచీనాంధ్ర సాహిత్యంలో చాలా భాగం సంస్కృత సాహిత్యానికి అనువాదమనీ, అనుసరణమనీ ఈ పంథా ప్రచారం చేసింది రెండు- దేశి ప్రక్రియలకూ, ప్రమాణాలకూ, విమర్శ పద్ధతులకూ విలువ లేకుండా వెలవెలపోయేటట్లు చేసింది. ఈ విపరీత పరిణామాలవలన నన్నయాదుల రచనలలోని క్రొత్తదనాన్నీ, ఒరిజినాలిటీని వివేచించే చూపును కోల్పోయాం. పాల్కురికి సోమన వంటి దేశికవుల ప్రయోగాల బలాన్ని పరిపూర్ణంగా దర్శించే చేవను పోగొట్టుకున్నాం. ఈ విమర్శ మార్గానికి నేడు కాలం చెల్లింది. గతానికి అవశేషంగా వర్తమానంలో అక్కడక్కడా మినుకుమినుకుమంటోంది ఈ పద్ధతి

2. పాశ్చాత్య విమర్శ సూత్రాలే సాహిత్య ప్రయోగాల విలువలనూ, విమర్శ వివేక వికాసాలనూ వివేచింపగలవని విశ్వసించి తెలుగులో సాహిత్య విమర్శను సాగించేవారు రెండవ వర్గంవారు. తెలుగు సాహిత్యాన్నంతటినీ అనుశీలించటానికి పాశ్చాత్య విమర్శ ప్రమాణాలూ, సూత్రాలూ చాలునని వీరు నమ్ముతారు. ప్రాచీనాధునిక ఆంధ్ర సాహిత్య అస్తిత్వ వికాసక్రమాలను పాశ్చాత్య సాహిత్య ప్రస్థానాలనూ, పరిణామాలనూ ప్రాతిపదికలుగా చేసికొని నిర్ణయిస్తారు. సాహిత్యానుశీలనంలో పాటించే పద్ధతులనూ, పారిభాషిక పదాలనూ, విమర్శ సూత్రాలనూ అన్నీ పాశ్చాత్య సాహిత్య క్షేత్రాలనుండి దిగుమతి చేసుకొంటారు. దీనివలన తెలుగు సాహిత్య విమర్శ అంతర్జాతీయ అవగాహనను పెంచుకొన్నదన్న కీర్తిని గడించింది కాని, ఆ అంతర్జాతీయత తెలుగు సాహిత్యానికున్న దేశీయమైన అస్తిత్వాన్నీ, వికాస వ్యక్తిత్వాన్నీ, దాని అంతర్గతి సూత్రాన్నీ గుర్తించే మార్గాన్ని మరుగుకు తోసింది. తెలుగురచయితలు వేసిన ప్రతి ముందడుగుకూ పాశ్చాత్య సాహిత్యాలలో ఎక్కడో ఒకచోట ఒక ముందుబాట ఉంటుందనే విశ్వాసం, ఉండకుండా ఉండటానికి వీలులేదనే ఒక గట్టి నమ్మకం సాహిత్య జగత్తులో ప్రబలిపోయింది. దీనివలన తెలుగు సాహిత్య విమర్శకు

అనుసరణ ప్రవృత్తి తప్ప స్వీయ అస్తిత్వ వికాస జీవితం ఉంటుందనీ, ఉండటానికి వీలుంటుందనీ దర్శించే అంతర్వీక్షణాన్ని ఈ ధోరణి అందించలేక పోయింది.

3. తెలుగు సాహిత్యాన్నీ విమర్శనూ ప్రాచ్య ప్రాశ్చాత్య విమర్శ సూత్రాల సమన్వయ దృక్పథంతో అనుశీలించేవారు మూడవ తెగవారు. మొదటి రెండు రకాల విమర్శ పద్ధతులూ ఎంత మంచివైనా మొత్తంమీద తెలుగు సాహిత్యానికీ, విమర్శకూ అవసరమైన మంచిని చేకూర్చేవి కావనే అభిప్రాయం కొంతమంది విమర్శకులకు బలంగా ఏర్పడింది. వారే మధ్యేమార్గంలో నడిచే మూడవపద్ధతి నెన్నుకొన్నారు. వీరు తమకు అందుబాటులో ఉన్న ప్రాచ్య పాశ్చాత్య ప్రమాణాలనూ, సూత్రాలనూ సందర్భోచితంగా ఎన్నుకొని తెలుగులో వెలువడిన ప్రయోగాలను విశ్లేషించి, వివేచిస్తారు. అందువల్లనే వీరిని సమన్వయవాదులని కూడా అంటారు. వీరి పద్ధతి మొదటి రెండు ధోరణులకంటె ప్రాచుర్యం చెందింది కాని, సహజంగా తెలుగు ప్రయోగాలకున్న దేశీయమైన అస్తిత్వాన్ని వెలికి తీసుకొని వచ్చే అంతస్సూత్రాన్ని అనుశీలనంలో అంచెంచలేకపోయింది. మిశ్ర ప్రయోగాలలోని సాహిత్య స్వభావాన్ని ఈ పద్ధతి విశేషంగా వ్యాఖ్యానింపగలుగుతోంది, కొన్ని సమన్వయ ఫలితాంశాలను ప్రకటింపగలుగుతోంది కాని, ఆ మిశ్రస్వభావాన్ని తనకు పోషకంగా వాడుకొన్న దేశీయతను నిరూపించలేకపోతోంది.

4. ఏదైనా ఒక సాహిత్యేతరమైన శాస్త్ర దృక్పథానికి గానీ, సిద్ధాంతానికి గానీ, ప్రయోగ సూత్రానికి గానీ కట్టుబడి సాహిత్యాన్నీ, విమర్శనూ విలువకట్టే పద్ధతిని పాటించేవారు - నాల్గవ ధోరణికి చెందినవారు. శాస్త్రవిజ్ఞానం విస్తరిస్తున్న ఈ యుగంలో సాహిత్య తత్త్వాన్ని సాహిత్య శాస్త్రేతర దృక్పథాలతో కూడా వివేచించటానికి వివిధ ప్రయత్నాలూ, ప్రయోగాలూ సాగాయి, సాగుతున్నాయి. సామాజిక శాస్త్రదృష్టితో సాహిత్యాన్ని విశ్లేషించే పద్ధతులలో మార్క్సిస్టు విమర్శ ధోరణి ప్రసిద్ధం. అందులో కూడా సైద్ధాంతిక భేదాల ననుసరించి కళాఖండాలను విలువకట్టే విధానాలు మారుతుంటాయి. మానసికశాస్త్ర పద్ధతులలో ఫ్రాయిడ్, యూంగ్, అడ్లర్ సిద్ధాంతాల నాశ్రయించిన మార్గాలు ప్రాచుర్యం చెందాయి. అలాగే తత్త్వశాస్త్రానికి చెందిన అనేక దృక్పథాలున్నాయి శాస్త్రానికి దర్శన స్థాయి, ఆదర్శావళి (Ideology) స్థాయి, నియమ నిబంధనల స్థాయి, ఆచరణ

స్థాయి అనేవి ఉంటాయి. సాహిత్య తత్త్వాన్ని సాహిత్యేతర శాస్త్రదర్శనంతో గాని, దృక్పథంతో గాని, సిద్ధాంతాలతో గాని, ఆదర్శావళితో గాని, నియమనిబంధనలతోగాని పరీక్షించి నిరూపించటం సాధ్యం కాదని ప్రపంచ సాహితీవేత్తలే భావించారు. సాహిత్యేతర శాస్త్రదృక్పథాలు ఎంత గొప్పవైనా సాహిత్య తత్వదర్శనం చేయలేవు. కాని, పాక్షిక పరిశీలనం సాధించగలవు. మార్క్సిస్టు ఆదర్శావళికి కట్టుబడ్డవారి విమర్శలో 'నిబద్ధత' అనే మాట ప్రసిద్ధంగా వినబడుతోంది. అయినా, 'నిబద్ధత'ను గురించి వాదోపవాదాలున్నాయి. కాని, 'నిబద్ధత'ను రాజకీయదృష్టితోనే గ్రహిస్తే అది సాహిత్యాన్ని నిండుగా చూడలేదు; దండిగా విలువ కట్టలేదు. శాస్త్రాలు సాహిత్యంలో ప్రతిఫలించగలవే కాని ప్రాణాలుగా నిలువలేవు. ధ్వని కావ్యానికి ఆత్మ అయినట్లు మార్క్సిజం కాలేదు; మనోవైజ్ఞానిక తత్త్వం కాలేదు; అద్వైత దర్శనం కాలేదు; ఆర్థికశాస్త్రం అసలే కాలేదు; ఈ విమర్శ పద్ధతి సాహిత్యంలోని శాస్త్ర విశేషాలను విశ్లేషించటానికి ఉపయోగపడుతుందికాని కావ్యకళా మూల్యాలను విలువకట్టటానికి తోడ్పడలేదు.

5. స్వీయాభిరుచులనే సాహిత్య ప్రమాణాలుగా, విమర్శసూత్రాలుగా వెలువరించేవారు - అయిదవ వర్గానికి చెందుతారు. అభిరుచి విమర్శ అన్ని కాలాలలోనూ, అనేక రూపాలలో సాహితీరంగంమీద ప్రత్యక్షమౌతూ ఉంటుంది. అభిరుచులు ఎప్పుడూ ఉత్తమ ప్రమాణాలు కావు. అయితే, ఒక్కొక్కసారి పరిణత విమర్శకుల అభిరుచులుగా కనపడే విమర్శ ప్రమాణాలు కొన్ని రచనల పట్ల సాపేక్ష ప్రమాణాలుగా కుదురుకొని సహృదయుల ఆమోదాన్ని సాధించవచ్చు. అప్పుడవి ఆదర్శపాత్రాలౌతాయి. కాబట్టి, అప్పుడప్పుడూ అభిరుచి విమర్శ సాహిత్య వివేచనలో సార్థకమైన పాత్ర నిర్వహించే అవకాశం ఉంది. కాని, అన్నివేళలా ఈ ధోరణి ఆదర్శమార్గం కాదు.

6. సాహిత్యంమీద ప్రభావాలు ఎన్నివున్నా, దానిదైన దేశిలక్షణం ప్రయోగాలలో జీవశక్తిగా ప్రవహిస్తూ ఉంటుందనీ, అంతర్గతి వికాససూత్రం అవిచ్ఛిన్నంగా సాగుతూ ఉంటుందనీ విశ్వసించి, తెలుగులో ఆయా కాలాలలో వెలువడుతున్న ప్రక్రియలకూ, విమర్శ విధానాలకూ కూడా వానివైన దేశి అస్తిత్వ వ్యక్తిత్వాలూ, అంతర్గతి వికాస ప్రస్థానాలూ ఉన్నట్లు దర్శించి ప్రపంచించేవారు ఆరవ వర్గంవారు. వీరు అచ్చమైన దేశికవుల్లాంటివారు. తెలుగు కవిత్వం పుట్టినప్పటినుండి దేశికవులెలా ఉన్నారో, తెలుగువిమర్శ వెలుగులోకి

వచ్చినప్పటినుండి దేశీయతను దర్శించే విమర్శకులలా ఉంటూనే వస్తున్నారు. అటు భాషావరంగా చూస్తే తెలుగు ద్రావిడ భాషాజన్యమనే వాదానికి చెందినవారు ఇలాంటివారు. ఇటు సాహిత్యశాఖలో గమనిస్తే ప్రబంధం తెలుగువారి స్వంత ప్రక్రియ అనేవారూ, కవిత్రయ భారతం అనువాదం కాదనేవారూ, బసవపురాణం తెలుగు తొలి దేశిపురాణం అనేవారూ, వాగ్గేయకారుల రచనలనూ, జానపద కళా రూపాలనూ, ద్విపదకృతులనూ, కథాకావ్యాలనూ తెలుగు దేశీయతా ప్రవృత్తులకు ప్రతినిధులుగా గుర్తించేవారూ - ఇలా ఎందరో గోచరిస్తారు; అంతేకాదు- మన భావకవులు, నవ్యసంప్రదాయకవులు, కొందరు అభ్యుదయకవులు, కొందరు ఆధునిక కావ్యేతిహాసకవులు, కొందరు అనుభూతి వాదకవులు రచించిన రచనలు కూడా దేశీయతా అస్తిత్వం కలవని విమర్శించేవా రున్నారు. వీరందరిని గురించి వివరించటం ఈ చిన్న వ్యాసంలో కష్టం. ఎన్ని విశేషాలు చెప్పినా, ఎన్ని విధాలుగా విశ్లేషించినా ఒక సాహిత్యప్రయోగం సహృదయులకు అందిస్తున్న కళాత్మకమైన దేశి అస్తిత్వాన్ని, వికాసదశను నిరూపించలేకపోతే సాహిత్య విమర్శ సార్థకం కాదని ఈ మార్గంవారు విశ్వసిస్తారు. దీనిమీద వివాదాలు లేవు.

ఆరు రకాల విమర్శకులున్నారంటే ఆరు రకాల విమర్శమార్గాలు ఆచరణలో ఉన్నాయన్నమాట! ఇది ఆ కాలం చేసుకున్న అదృష్టం కూడా. తెలుగులో సాహిత్యవిమర్శ పుట్టుపూర్వోత్తరాల చరిత్ర గమనిస్తే ఈ ఆరు మార్గాలూ ఒకేసారి పుట్టాయని చెప్పలేం. కాని, పైన పేర్కొన్న క్రమంలో ప్రాచుర్యం చెందుతూ వచ్చి ఇప్పుడు అన్నీ కలిసి ప్రవర్తిల్లుతున్నాయని పేర్కొనగలం. తెలుగులో ఒకసారి వెలిసిన ఏ పద్ధతైనా తరువాత రూపరేఖలు లేకుండా అంతరించిపోవటం అరుదు. కాని, అది కాలాంతరంలో రూపాంతరం పొందవచ్చు. తెలుగు సాహిత్యంలోనూ, విమర్శరంగంలోనూ ఇదే వాస్తవం ఈనాడు కనపడుతోంది. శతాబ్దం క్రింద తలయెత్తిన విమర్శపద్ధతి ఈనాడూ ఏదో విధంగా కొనసాగుతూనే ఉంది.

ఆరు రకాల విమర్శలు సమాంతరంగానూ, సమ్మిశ్రితంగానూ సాగిన ఈ కాలం గతంకంటె ఎంతో సాధించగలిగిన సామర్థ్యం ప్రకటించిందనటంలో అనుమానం లేదు. సాహిత్య స్వరూపస్వభావాలను బహుముఖాలుగా విశ్లేషించి వివేచించే పద్ధతులు, పరికరాలు ఎన్నో ఈ కాలంలో అందుబాటులోకి వచ్చాయి. వాటిని ఉపయోగించుకొంటూ విమర్శ తాను విస్తరిస్తూనే, పరిశోధనకు కూడా

బలాన్ని చేకూర్చింది. అయినా, గమనింపదగిన విశేషమేమంటే - తెలుగు సాహిత్య విమర్శకు మొదటినుండి ఒక సొంత గొంతుక ఉందా? ఒక స్వంత వికాససూత్రం ఉందా? తనదైన దేశీ ప్రమాణం ఉందా? దాని వికాస చరిత్రకు స్వీయ అస్తిత్వ వ్యక్తిత్వాలున్నట్లు వివేచించటానికి వీలుందా? మొదలైన ప్రశ్నలకు సూటిగా, స్పష్టంగా సమాధానం చెప్పటం సాధ్యంకావటంలేదు. వాటికి స్పష్టమైన సమాధానాలకోసం చేసే అన్వేషణ నేటి సాహిత్య విమర్శ పరమార్థం.

ఆధునికాంధ్ర సాహిత్య విమర్శ చరిత్రలో క్రీ. శ. 1975 - 1985 సంవత్సరాల నడిమికాలంలో ఉన్న దశాబ్దం ఒక పరిణామాన్ని సూచిస్తోంది. అన్నివిధాలా స్వంత అస్తిత్వాన్ని కోల్పోతున్న తెలుగు సాహిత్యవిమర్శను పునరుజ్జీవింపచేసే యత్నం ఈ కాలంలో సాగింది. సాహిత్యంలో సామాజిక స్పృహకంటె సాహిత్యస్పృహ ముఖ్యమనే వాదం ఈ కాలంలో బలంగా వెలువడింది నిర్జీవంగా నిలచిపోయే సాహిత్యవిమర్శ ఈ ఉద్యమంతో చైతన్యమంతమయింది. సాహిత్యమూల్యాలతో అనుభూతికి, అభివ్యక్తికి, ప్రతీకలకూ, భావచిత్రాలకూ విలువకట్టే విమర్శ ప్రస్థానం ఈ మార్గంలో మూడుపూవు లారుకాయలుగా విస్తరిల్లింది. ఈ ప్రస్థానానికి శంఖారావం పూరించింది 1977 లో వెలువడ్డ 'కవిసేన మేనిఫెస్టో.'

ఈ కాలంలోనే సాహిత్య చరిత్రలోని పరిణామ దశలలో ఏదైనా ఒక అంతర్గతి సూత్రం కానీ, అన్వయ సూత్రంగానీ ఉన్నదా అనే అన్వేషణ తీవ్రంగా సాగింది. ఆ చైతన్యంలోని తరంగాలు నాలుగురకాలైన ప్రయత్నాలకు దారితీశాయి. వెయ్యేళ్ళ తెలుగు సాహిత్యంలో కలిగిన పరిణామాలకు సాహిత్యరంగంలోని ఒక అంతరగతి తర్కం ఉంటుందని ప్రతిపాదించి, అఖిలిఖిత సంప్రదాయాల ప్రాతిపదిక మీద తెలుగులో కవితా విప్లవాలను వివేచించిన గ్రంథం 'తెలుగులో కవితా విప్లవాల స్వరూపం' 1971 లో వెలువడి సాహిత్య విమర్శలో కొన్ని మౌలికమైన అంశాలమీద అన్ని వర్గాల వారిచే ఆలోచింపజేయించి, అంతకంటె మరో మంచిమార్గం తప్పకుండా కనుగొనాలనే తీవ్రతని వారిలో ఇనుమడింపజేసింది. విప్లవాల సమన్వయం విఫలమైపోయినా, సాహిత్య వికాసానికి ఒక అంతర్గతిసూత్రం అవసరమన్న భావం విమర్శకులలో వేరూనింది. అంతర్గతి సూత్రాన్ని సాహిత్యదర్శన మూల్యాల ప్రాతిపదికలతో సమన్వయించటానికి యత్నించింది ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాదమి ప్రచురించిన సారస్వత

వ్యాసములు - ప్రథమ సంపుటి - ద్వితీయముద్రణ పీఠిక (1981). ఆ పీఠికలో ప్రతిపాదించిన మౌలికాంశాల నాధారంగా చేసికొని దాదాపు అరడజను సిద్ధాంత వ్యాసాలు వెలువడ్డాయి. అవి ఆతరువాత 'సాహిత్యచరిత్రలో చర్చనీయాంశాలు'లో వివరింపబడ్డాయి. సాహిత్యవికాసంలోని అంతరగతి తర్కాన్ని సాహిత్య స్పృహ, ప్రక్రియాపరంగా నిరూపించే పద్ధతి యిది.

గతి తార్కిక చారిత్రిక భౌతికవాద దృక్పథంతో సాహిత్య చరిత్రను వ్యాఖ్యానించే ప్రయత్నంలో ఆంధ్ర సారస్వత పరిషత్తు 'తెలుగు సాహిత్యంలో మరో చూపు' (1981) సారించింది ఉత్పత్తి సాధనాలలో, ఉత్పత్తి సంబంధాలలో ఆయా కాలాలలో వచ్చే పరిణామాలు సాహిత్యంలో ఎలా ప్రతిబింబిస్తాయో, వాటి కనుగుణంగా సాహితీరూపాలు ఎలా మారుతూ ఉంటాయో చెప్పే పద్ధతి ఈ ధోరణిలో ముఖ్యం కవితాభివ్యక్తిని ప్రాతిపదికగా చేసికొని వాచ్యార్థలక్షణార్థ వ్యంగ్యార్థ ప్రధాన కవిత్వాలలో వచ్చే పరిణామాన్ని అంచనా వేసే విమర్శ 1981 లో వెలువడింది. ఆరుద్ర 'సమగ్రాంధ్ర సాహిత్యం' వెలువడుతున్నా అంతకంటె విలక్షణంగా సాహిత్య చరిత్రను నిర్మించుకోవలసిన అవసరాన్ని సాహిత్యలోకం గుర్తించింది దాని కనువైన విశిష్ట దృక్పథాలకోసం అన్వేషణతో పాటు ప్రయోగాలను ఈ దశకం సారించింది. సాహిత్య పరిణామంలో అంతర్గతి సూత్రం చెప్పగలిగిన విమర్శయే నేటి సాహిత్య విమర్శ. నాటి సాహిత్యవిమర్శ కంటె నేటి సాహిత్య విమర్శ నిస్సంశయంగా శాస్త్రీయమైన సాహిత్య పరిణామ సూత్రాన్ని స్థాపించే ప్రస్థానం సాగిస్తోంది.

అంటే - నేటి సాహిత్య విమర్శ అని పిలువబడే కాలంలోని మొదటి దశకం (1975 - 85)లో రెండు రకాల ప్రవృత్తులు ఉత్తుంగ తరంగాల్లాగా వచ్చాయి, అవి - 1. సాహిత్య స్పృహ విమర్శ, 2. సాహిత్య చరిత్రలోని అంతర్గతి సూత్ర విచార విమర్శ. అలాగే 1985 - 94 దశకంలో మరొక రెండు రకాల ప్రవృత్తులు సాహిత్య విమర్శను చైతన్యవంతం చేస్తున్నాయి. అవి - 3. జర్నలిజంతో జంట కలిపిన విమర్శ, 4. స్త్రీవాద, దళితవాద విమర్శ.

1985 నుండి ఆంధ్ర సాహిత్య వికాస చరిత్రలో సమీక్షా వ్యాసయుగం సాగుతోంది. తెలుగునో సాహిత్య పత్రికలు నిర్వహింపవలసిన పాత్రను దినపత్రికలు సగానికి పైగా నిర్వహిస్తున్నాయి. దిన పత్రికలో పడ్డ వ్యాసం లక్షలాది ప్రజలను ముఖాముఖి పలకరిస్తుంది. దిన పత్రికలలో పడిన వ్యాసాలే ప్రచారంలో ఉన్నాయి ఇప్పుడు. గ్రంథాలుగా వెలువడితే చదివేవారు తక్కువ. అందువలన ఈ రోజుల్లో విమర్శ చైతన్యం దిన పత్రికల పెట్టుపోతలమీద ఆధారపడి ఉంది. దానితో సాహిత్య వ్యాసం పత్రికారచన (జర్నలిజం) స్వభావాన్ని సంతరించుకొన్నది స్పష్టత, అక్లిష్టత, సంక్షిప్తత, ఆసక్తి, అవగాహన, అనుభూతి అనేవి పత్రికారచనకు సహజంగా ఉండే షడ్గుణాలు. పత్రికా వ్యాసాలలో 'చేరాతలు' వంటి పరసనల్ కాలమ్‌లూ, 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు' వంటి సీరియల్ వ్యాసాలూ కొత్త రకం విమర్శ ధోరణులను పరిచయం చేసి, సాహిత్య విమర్శలో నవచైతన్యాన్ని కలిగించాయి.

పత్రికలవారు సరళ వ్యాసాలను సామాన్యంగా వేస్తుంటారు. సమీక్షా వ్యాసాలను కొన్ని శీర్షికల క్రింద ప్రచురిస్తూంటారు. విమర్శ వ్యాసాలను అప్పుడప్పుడూ రుచి చూపిస్తుంటారు. పరిశోధన వ్యాసాలను పర్వానికొకటిగా వేస్తూ ఉంటారు. అయితే, వీటన్నింటిలో వ్యాపారానికి లాభించేవి వివాద వ్యాసాలు. కొన్ని వ్యాసాలలోనుండి సహజంగా వివాదం రేగుతుంది. మరికొన్ని వివాదం రేపటానికే అవతరిస్తూ ఉంటాయి. వ్యాపార దృష్టికి వివాదం ఒక కన్ను; ఉద్వేగం (సెన్సేషన్) మరొక కన్ను. ఈ రెండింటికోసం విమర్శ విలువలను గంగలో కలిపేవారూ లేకపోలేదు. ఏమైనా జర్నలిజంతో జంట కలిసిన తరువాత కొన్ని జగడాలెదురైనా కొంత గౌరవంగానే బ్రతుకుతోంది సాహిత్య విమర్శ.

అత్యంతాధునిక ధోరణులు స్త్రీవాదం, దళితవాదం. ఈ రెండు వాదాలకు సంబంధించిన కవితలు, విమర్శలు చాలవరకు పత్రికలలోనే మొదట ప్రచురింపబడుతున్నాయి. కథలు, నవలలు కూడా ఈ ధోరణులలో బలంగా వెలువడుతున్నాయి. ఈ శతాబ్ది పూర్తి అయ్యేనాటికి ఈ విమర్శ ధోరణి ఒక నిర్దిష్టరూపం ధాల్చవచ్చు.

నాటికీ, నేటికీ ఎప్పుడు పోల్చి చూచుకొన్నా 'గతకాలము మేలు వచ్చు కాలము కంటెన్' అని కొందరికి అనిపిస్తుంది. వర్తమానాన్ని బలంగా సృష్టించు కొనేవారు ఈ మాటను హర్షించరు మన బలమే దాని బలం. గతం కంటె వర్త మానం అదృష్టవంతురాలు. దాని బుజాలమీద ఎక్కి కూచుంది కాబట్టి, నాటి సాహిత్య విమర్శకంటె నేటి సాహిత్య విమర్శ అదృష్టవంతురాలు! జీవిస్తున్నది; జీవింపచేస్తున్నది!

(ఆంధ్రభూమి 30-12-1994)

[1994 డిసెంబరు 28, 29, 30 తేదీలలో మదరాసులో జరిగిన ప్రపంచ తెలుగు సమాఖ్య ప్రథమ మహాసభలలో 29-12-94 నాటి సాహిత్య గోష్ఠిలో సమర్పించిన పత్రం.]

# ఉండేల సాహితీ పురస్కారం

'ఎందరో మహానుభావులు - అందరికీ వందనములు'

సత్సంకల్పంలో నుండి పుట్టి, వితరణశీలంతో పెరిగి
సమాజ శ్రేయస్సుకోసం చేతులు చాచి
కవితాకల్పకం పూసిన వాడిపోని పారిజాతాలను కూర్చి
సాహితీ సుమమాల కట్టి మొదటిసారి సగౌరవంగా
ముచ్చటపడి నాకు అందించే ఉండేల విజ్ఞాన కళాభారతికి
ముందుగా నా నమస్సులు.

కాలం పెంచిన కలాన్ని నేను, అక్షరం తీర్చిన గళాన్ని నేను
నీకు తెలుసు నేను అజన్మ విద్యార్థిని
అయినా కావాలని ఆశీర్వదిస్తున్నావు అమరణసత్యార్థిని
పురస్కార మిచ్చి పుణ్యం కట్టుకున్న తల్లీ! సరస్వతీ!
చివరిదాకా ఈ కలం నీవే నడిపించు; ఈ గళం నీవే మ్రోయించు
నా అక్షరాలు రాబోయే శతాబ్దాలలో వాలాలి
నా గళం ఉపాధ్యాయుల పఠన పాఠనాల్లో ఒలకాలి
అందుకు నీ వందిస్తున్న ఆశాకిరణం ఈ పురస్కారం
అందుకో అందుకు ముందుగా నా నమస్కారం!

అరవయ్యోయేట అడుగు పెడుతున్న బాలుణ్ణి
అర్ధశతాబ్దిగా అక్షరాన్ని ఉపాసిస్తున్న సాధకుణ్ణి
నాలుగు దశాబ్దాలుగా కలాన్ని నడుపుతున్న విమర్శకుణ్ణి
నాలుగంచెలుగా నడక సాగిస్తున్న అధ్యాపకుణ్ణి.
ఆగకుండా అడుగు ముందుకు వేస్తున్నందుకా ఈ సత్కారం?
ఒగకుండా పీరగానం సాగిస్తున్నందుకా ఈ పురస్కారం?

నలభై యేళ్ళ వెనక్కు చూస్తే ఒక్కసారి
నాలోకి ఎన్ని నదులు పాయలై ప్రవహించాయి!
నూనూగు మీసాల నూత్న యౌవనంలో
'సాగుమా ఓ నీలమేఘమా!' అని గానం చేస్తున్న సినారె
అంత్యప్రాసలు నాలో ఎన్ని చిగుళ్ళు మొలిపించాయి!

బాపురెడ్డి స్నేహధారలు నాలో ఎన్ని దీపాలు వెలిగించాయి!
'చేరా'తో చెలిమిబాసలు ఎన్ని చర్చాగోష్ఠులు సాగించాయి!

సారమతిన్ ప్రసన్న కథా కలితార్థయుక్తితో
నన్నయ నెత్తుకొని విశ్వనాథ
నా బుజాలమీద కూర్చుని చెవులో మ్రోయు తుమ్మెదలా
రామాయణం కావ్యగానం చేస్తున్నప్పుడు
కల్పవృక్షంలా విరిసిపోలేదూ-
వాయుపుత్రునిలా పొంగిపోలేదూ-

రాళ్ళపల్లి మాటల్లో రత్నాల నేరుకుంటూ
కట్టమంచి విమర్శలో కస్తూరిని పూసుకుంటూ
దివాకర్ల వాక్కులో ధారను పంచుకుంటూ
ఖండవల్లి ఊహల్లో మెరుపుల నెన్నుకుంటూ
పద్యం రాస్తే బంగారంలా ఉండాలనీ
గేయం రాస్తే సెలయేరులా సాగాలనీ
వ్యాసం రాస్తే వేగుచుక్కలా నిలవాలనీ
విమర్శచేస్తే నవ్యాలోకం నిండాలనీ
ఎన్నో తపస్సులతో నన్ను నేనే మలచుకున్నాను
అందరినీ నాలో ప్రవహింప నిచ్చాను
అలలు అలలుగా అందరూ ఆశీర్వదించారు-
చివరకు నేనే ఒక యేరుగా పొంగులెత్తాను.

ఇరవై అయిదేళ్ళ 'జీవియస్' మంచి నటుడు, వక్త,
అంతర్విశ్వవిద్యాలయాల పోటీల్లో ఉత్తమ నాటక రచయిత
నవలా రచయిత, నాటికాకర్త, ప్రయోక్త
పద్యం రాసి భద్రపరచుకోవడం తెలిసిన ఉచితజ్ఞుడు
గేయ, వచన కవితలు రాసి దాచిపెట్టుకొనే నిపుణుడు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి బహుమానం అతని జాతకం మార్చింది
కళలన్నీ కట్టుబడ్డాయి; విమర్శ రెక్కలు విప్పింది.

పురస్కారాలు నా జాతకాన్ని మార్చాయి
పురస్కారాలు నా పురోగతికి సూచిక లయ్యాయి
పురస్కారాలు నా భవిష్యత్తుకు సోపానా లయ్యాయి
అందుకే. పురస్కారాలంటే నా కెంతో గౌరవం!

వీరరస విమర్శకు నా మొదటి పురస్కారం
అఖిల భారత లాక్షణిక సార్వభౌముల వరుసలో నాకూ ఒక స్థానం
'ధర్మవీర ఏవ రసానాం రసః' అన్నది నా సిద్ధాంతం!
అచ్యుతరాయల తరువాత వీరరస వివేచనాన్ని విస్తృతపరచింది నేనే!
స్వాతంత్ర్య వీరాన్ని ప్రతిపాదించింది నేనే!
ఆలంకారికులలోని ఆంధ్రులలో ఇప్పటికి చివరి కుర్చీ నాదేనేమో!
ఆ పీఠానికి ఈ సన్మానం!

ఆనందవర్ధనుణ్ణి అనుసరించి అందరూ
ఆంధ్ర మహాభారతం శాంతరస ప్రధానమంటే
శాస్త్ర సమ్మతంగా శాంతరస విమర్శను చూపించి
ఆంధ్ర మహాభారతం ధర్మవీర ప్రధానమని నిరూపించినందుకు-
బహుశః ఆ వాదానికే నేమో ఈ పురస్కారం!

రసవిమర్శ రహస్యాలను వెలికి తీసినందుకు మెప్పుగా
రెండోసారి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి పురస్కారం!

నన్ను ఎనభై అయిదు దాకా వీరరసం సుబ్రహ్మణ్యం అనేవారు
ఆ తరువాత 'ఆంధ్ర సాహిత్య విమర్శపై ఆంగ్ల ప్రభావం'
కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం తెప్పించింది
సంప్రదాయ సాహిత్యంలో కూరుకుపోయాడనుకున్న జీవియస్
ఆధునిక సాహిత్యం మీద కూడా విలువైన తీర్పుల నిచ్చాడు
మార్క్సు దృక్పథంతో ఆంధ్ర సాహిత్య చరిత్రా, విమర్శ
కోల్పోయిన విలువైన అంశాలను దశాబ్దంగా లోకానికి
ఎలుగెత్తి చెబుతున్నాడు

ఆంధ్రప్రభ నా అవేదన విని 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు'
సీరియల్ రెండేళ్ళకు పైగా ప్రచురించింది
అనేక సంచలనం సృష్టించింది.

భారత స్వాతంత్ర్యోద్యమాన్ని సాహిత్య చరిత్రలో
ప్రత్యేకయుగంగా పరిగణించని అధర్మాన్ని,
ప్రబోధ కవితాశాఖల్లో కవిత్వం లేదని
అధిక్షేపించే అగడాన్ని
నవ్యసంప్రదాయ కవితాధారను భూమార్గంలో
పూడ్చి పెట్టాలని చేసిన రాజకీయాన్ని
నవల, నాటకం వంటి ఆధునిక ప్రక్రియలకు చరిత్రలో
అధ్యాయాలు కల్పించని అన్యాయాన్ని
విశ్వంభరవంటి కావ్యానికి చరిత్ర గతిలో
మార్గం లేకుండా మూసేసిన కుతంత్రాన్ని
ఈనాడు పద్యం బ్రతకటానికి వీల్లేదని
వీలునామా రాస్తున్న వితండవాదాన్ని
పాతికేళ్ళుగా నిలబడి ఎదురిస్తూనే ఉన్నాను
విలువలకోసం పోరాటం విడువకుండా సాగిస్తూనే ఉన్నాను

ఆనందవర్ధనుణ్ణి అపోశనపట్టిన అభినవలోచనాన్ని నేను
ఆంగ్ల విమర్శ సూత్రాలను జీర్ణించుకున్న ఆంధ్ర దేశికుణ్ణి నేను
ప్రమాదానికి గురికాని ప్రభావాన్ని నేను
తనను తాను మరచిపోని భారతాత్మను నేను
తెలుగు విమర్శ రాస్తున్న సాహిత్యాచార్యుణ్ణి నేను

విమర్శకుణ్ణి విలువల తీర్పరి (**Judge of Values**) అంటారు
తీర్పరి కాదగిన నేర్పరితనం భారతివరం
ఈ పురస్కారం భారతి నా కందించిన ఆశీస్సులని భావిస్తున్నాను
నా కృతజ్ఞతాభివందనాలు అందరికీ అందిస్తున్నాను.

(**ఆంధ్రభూమి 2-9-1994**)

[1994 ఆగస్టు 23వ తేదీన ఉండేల విజ్ఞాన కళాపీఠం ప్రప్రథమ సాహితీ పురస్కారాన్ని ప్రదానం చేసినప్పుడు మేనేజింగ్ ట్రస్ట్ డాక్టర్ ఉండేల మాలకొండారెడ్డి గారికి, సభలో పాల్గొన్న పెద్దలకూ, సహృదయులకూ కృతజ్ఞతతో 'జీవిఎస్' పలికిన మాటలు.]



